# స్వాతంత్ర్య సమరంలో కమ్యూనిస్టు దేశభక్తులు

సంపాదకుడు:

పరకాల పట్టాభిరామారావు



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్,
హైదరాబాద్-500 001.

**Communist Patriots in the Freedom Movement**
Edited By: Parakala Pattabhiramarao

ప్రచురణ నెం. : 2169

ప్రథమ ముద్రణ : జనవరి, 2000

ప్రతులు : 1000



వెల: రూ.125-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001.
విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్/సుల్తాన్ బజార్ హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.

ముద్రణ: కళాంజలి గ్రాఫిక్స్ విఠల్‌వాడి, హైదరాబాదు. ఫోను : 3229831

# వెనుక తరముల వారి వీరచరితల సిరులు

స్వాతంత్ర్యం పలువురి త్యాగఫలం. భారత జాతీయోద్యమం అనేక రాజకీయ ధోరణుల సమైక్య ప్రతిబింబం. విభిన్న ఆలోచనా సరళుల ఏకోన్ముఖ లక్ష్యం. స్వేచ్ఛ అనేది అడిగి పుచ్చుకునేదన్న భావధార నుండి, పోరాడి – ఆత్మార్పణం చేసి సాధించుకునేదన్న విప్లవ కార్యాచరణ కలిగిన గ్రూపుల సంఘటిత భావాలకు కార్యరంగం.

ప్రపంచ రాజకీయాలనేగాక, భారత రాజకీయాలను కూడా ప్రభావితం చేసిన సోషలిజం, కమ్యూనిజం భావాలు రష్యా అక్టోబరు విప్లవ కాలం నుండి తెలుగునాట కూడా మొలకెత్తాయి. నిర్మాణ రూపం సంతరించుకోడానికి మరో దశాబ్దకాలం పట్టినా ఆంధ్ర ప్రాంతంలోని మధ్యతరగతి మేధావులను బాగా ఆకర్షించాయి. సంస్కరణోద్యమం ఒక భాగంగా సాగిన జాతీయోద్యమంలో పరాయి పాలనపై స్పష్టమైన అవగాహనతో పోరాడే స్ఫూర్తిని, సోషలిజం – కమ్యూనిజం భావనలు కల్గించాయి. పోరాటానికి నిశితమైన దిశనూ – దశనూ అందించాయి. భారత స్వాతంత్ర్య పోరాటం, ప్రపంచ వ్యాప్తంగా ఆకాలంలో సాగుతున్న వివిధ దేశాల వలసవాద వ్యతిరేక, సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలో భాగమేనన్న అంతర్జాతీయ దృష్టిని కమ్యూనిజం భావాలందించాయి. పోరాడే శక్తులలో వర్గపోరాట స్పృహను కలిగించాయి. కమ్యూనిజం దార్శనికత భారతదేశ స్వాతంత్ర్యం కోసం పోరాడుతున్న శక్తుల చేతిలో పదునైన ఆయుధంగా అందింది. విప్లవ శ్రేణుల పొందికలో మార్పు వచ్చింది. శ్రామిక వర్గం కలవడంతో పోరాటానికి ఊపువచ్చింది.

అంతర్జాతీయ అవగాహనా తత్వం, శ్రామికవర్గ చైతన్యం కలిగిన కమ్యూనిస్టులు ప్రాణాలొడ్డి భారత స్వాతంత్ర్య పోరాటంలో దూకారు. మితవాద ధోరణులకు విసిగి వేసారిన పోరాట శక్తులకు విప్లవ చైతన్యం ఊపిరులూదారు. ఎర్రజెండా పట్టి ముందు పీటీన నిలిచారు.

కమ్యూనిస్టుల త్యాగనిరతి, పోరాట పటిమ – స్వాతంత్ర్య సముపార్జనలో ఎంతటి మహత్తరమైన పాత్ర నిర్వహించాయో, కాంగ్రెసు ఆలోచనా సరళిని కూడా ఎలా ప్రభావితం చేశాయో ఈ తరానికి చెప్పడం అవసరం. అప్పుడే భారత స్వాతంత్ర్యోద్యమంలో కమ్యూనిస్టు భావనల – కమ్యూనిస్టుల వీరోచిత క్రియాశీల పాత్రను వారు అర్థం చేసుకుంటారు. ఆ దిశగా సాగిన కృషి ఈ గ్రంథం.

మూడు విధాలుగా జరిగిన సమాచార సేకరణ ఈ గ్రంథ రూపకల్పనలో తోడ్పడింది. వ్యాసకర్తలు స్వయంగా రాసిన వ్యాసాలు – కొందరి జీవితాలను గురించి ఇతరులు వ్రాసినవి – ఇంకొందరి జీవితానుభవాలను గురించి ఆయా గ్రంథాలలో వున్న సమాచార క్రోడీకరణ. తమ జ్ఞాపకాల పొరలను చీల్చి సుమారు

నాలుగైదు దశాబ్దాల తరువాత రాయబోతే సంఘటనల క్రమంలో – వివరాలలో, వాటి ప్రభావాన్ని విశదీకరించే సందర్భంలో, కొన్ని పొరపాట్లు దొర్లే ప్రమాదాలుంటాయి. సహృదయ పాఠకులు వీటిని గమనించమని ప్రార్థన.

అలాగే 20వ శతాబ్దం 6 వ దశకంలో చీలిన కమ్యూనిస్ట్ పార్టీలో ప్రముఖులు కొందరిందులో లేకపోవచ్చు. 7వ దశకంలో ఏర్పడ్డ అనేక విప్లవ గ్రూపుల ముఖ్యుల విశేషాలు ఇందులో వుండకపోవచ్చు. దీనికి కారణం వారి జ్ఞాపకాల, అనుభవాల వ్యాసాలు లభించకపోవడం తప్ప మరో ఉద్దేశం ఏమీలేదు.

అదేవిధంగా, వ్యాసాలలో సిద్ధాంతాల వివరణ – సూత్రాల అన్వయం – ఆచరణల పంథా – ఎత్తుగడల విధానాలను విశదీకరిస్తున్న సందర్భంలో రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలు – వ్యాఖ్యలు – విమర్శలతో విశాలాంధ్ర ప్రచురణాలయంగాని, సంపాదక వర్గంగాని ఏకీభవిస్తున్నట్లు భావించవద్దు. అవన్నీ వ్యాస రచయితల సొంత అభిప్రాయాలుగా పరిగణించమని మా మనవి.

ఈనాటి భారతదేశంలోని రాజకీయ పార్టీలలో ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లోని వివిధ రాజకీయ పార్టీలలో అరవై సంవత్సరాల లోపు వయసున్నవారే ఎక్కువ. వీరికి; భారత స్వాతంత్ర్య పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొన్న అనుభవంగానీ, ఆ పోరాటాన్ని గమనించిన సందర్భంగానీ లేదు. అలాంటి వారికి, రానున్న తరాల వారికి, స్వాతంత్ర్య సముపార్జనలో కమ్యూనిస్టులు నిర్వహించిన గణనీయమైన పాత్రను – కొండను అద్దంలో చూపించే ప్రయత్నంగా ఈ గ్రంథం ఉపయోగపడ్తుంది. భారత స్వాతంత్ర్య సమరంలో కమ్యూనిస్టుల పాత్ర గురించి సరియైన అవగాహన లేనివారికి, దురభిప్రాయాలున్నవారికి కనువిప్పుగా కూడా తోడ్పడుతుంది. శ్రమించి సంకలనం చేసిన కామ్రేడ్ పరకాల పట్టాభిరామారావు గారికి అభినందనలు. మా అన్ని ప్రచురణలను ఆదరించినట్లుగానే ఈ గ్రంథాన్ని కూడా పాఠకులు స్వీకరిస్తారని ఆశ.

స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న ఇంకా అనేకమంది కమ్యూనిస్టు దేశభక్తుల జీవిత చరిత్రలు మాకు అందలేదు. వాటిని కాలక్రమేణా మరొక సంపుటిలో ప్రచురించగలం.

వై.వి. కృష్ణారావు<br>
(సంపాదక వర్గ కన్వీనర్)<br>
విశాలాంధ్ర ప్రచురణాలయం

★ ★ ★

# ముందుమాట

1857 సిపాయీల తిరుగుబాటుతో జరిగిన ప్రథమ భారత స్వాతంత్ర్య పోరాటం లగాయతు 1947 వరకు సుమారు తొంభై–వంద సంవత్సరాలు, బ్రిటిష్ సామ్రాజ్యవాదులతో వీరోచితంగా పోరాడి మనదేశానికి స్వాతంత్ర్యం సాధించుకొన్నాం.

భారతజాతీయోద్యమ మహాస్రవంతిలో అనేక ప్రవాహాలు కలిసి ముందుకు సాగాయి. భారత జాతీయ కాంగ్రెస్ మహోద్యమం, గదర్ పార్టీ ఉద్యమం, భగత్‌సింగ్ జాతీయ విప్లవకారుల రహస్య ఉద్యమాలు, అల్లూరి సీతారామరాజు మన్యం విప్లవం, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఉద్యమం, భారత కమ్యూనిస్టు ఉద్యమం, నావికుల తిరుగుబాటు, అజాద్ హింద్ ఫౌజు పోరాటం, తెలంగాణా సాయుధ పోరాటం, పోలీసుల సమ్మెలు. ఇలా ఎన్నెన్నో చారిత్రాత్మక పోరాటాలు జరిగాయి. చివరకు బ్రిటిష్ బానిసత్వం నుండి విముక్తిపొంది స్వాతంత్ర్యం సంపాదించుకొన్నాం.

50 సంవత్సరాల స్వాతంత్ర్య స్వర్ణోత్సవాలు ఇటీవలెనే జరుపుకొన్నాం. కాని మన స్వాతంత్ర్యోద్యమ లక్ష్యాలు నేటికీ పరిపూర్తి కాలేదు. ఇంతవరకు జరిగిన అభివృద్ధి ఫలితాలు సామాన్య ప్రజానీకానికి అందలేదు. ఈనాటికీ పేదరికం, నిరక్షరాస్యత నిరుద్యోగం తొలగలేదు. ఆర్థిక, సాంఘిక వ్యత్యాసాలు పెరుగుతున్నాయేగాని తగ్గడంలేదు సరికదా – దేశంలో అవినీతి, అక్రమ సంపదలు పెరిగాయి. భారత రాజ్యాంగం ఆశించిన సోషలిస్టు సమాజ లక్ష్యం గగనకుసుమంగానే ఉండి పోయింది. స్వాతంత్ర్యంతోపాటు సమసమాజ స్థాపన లక్ష్యాన్ని సాధించడానికి మనం ఇంకా పోరాడవలసి ఉంది.

భారత స్వాతంత్ర్య సమరంలో ఎవరికీ తీసిపోని త్యాగాలు చేసిన కమ్యూనిస్టు పార్టీ 1925లో కాన్పూర్‌లో స్థాపించబడినది లగాయతు దేశంలో యిలాంటి సమ సమాజ స్థాపనకు తన మహత్తర కృషిని కొనసాగిస్తూంది. భారత జాతీయోద్యమంలో భాగంగా ప్రారంభమైన భారత కమ్యూనిస్టు ఉద్యమం స్వాతంత్ర్య సముపార్జనతో పాటు ఆర్థిక, సాంఘిక న్యాయంతో కూడిన సమ సమాజాన్ని స్థాపించాలనీ, అప్పుడే స్వాతంత్ర్యోద్యమ ఫలితాలు అందరికీ దక్కుతాయనీ స్పష్టం చేసింది. కార్మిక, కర్షక వర్గాలను శ్రామిక ప్రజలను స్వాతంత్ర్య సమరంలోకి తీసుకొని వచ్చిన ఘనత, శాస్త్రీయ, సోషలిజం గురించిన భావజాలాన్ని దేశంలో వ్యాప్తి చేసిన ఘనత కమ్యూనిస్టు ఉద్యమానిదే. అలాగే సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని, ఫ్యూడల్ వ్యతిరేక పోరాటంగా విస్తరింపజేసి కార్మిక, కర్షక శ్రామిక ప్రజానీకాన్ని సంఘటిత పరచి అసంఖ్యాక పోరాటాలను జరిపిన ఘనత కమ్యూనిస్టు పార్టీదే.

దక్షిణ భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణానికి నాందీ ప్రస్తావన చేసిన కామ్రేడ్ అమీర్ హైదర్‌ఖాన్ సంక్షిప్త జీవిత చరిత్రతో ప్రారంభించి ఆంధ్రదేశంలో తొలి కమ్యూనిస్టులు, కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలు, కామ్రేడ్ కంభంపాటి

సత్యనారాయణ (సీనియర్), పుచ్చలపల్లి సుందరయ్యగార్ల సంక్షిప్త జీవిత చరిత్రలనూ, రాష్ట్ర కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణంలో ప్రముఖ పాత్ర వహించిన కామ్రేడ్స్ చండ్ర రాజేశ్వరరావు, రావినారాయణరెడ్డి తదితరుల సంక్షిప్త జీవితచరిత్రలనూ, యితర కమ్యూనిస్టు ఉద్యమ ప్రముఖుల జీవిత చరిత్రలనూ సేకరించి "స్వాతంత్ర్య సమరంలో కమ్యూనిస్టు దేశభక్తులు" గ్రంథంగా మీకు అందజేస్తున్నాం.

ఈ సంక్షిప్త జీవిత చరిత్రలను మనం చదువుతున్నప్పుడు, తొలి, మలి తరం కమ్యూనిస్టు నాయకులు అటు స్వాతంత్ర్యోద్యమంలోను, ఇటు కమ్యూనిస్టు ఉద్యమంలోను ఎన్నెన్ని కష్టాలు పడ్డారో, బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా ఫ్యూడల్ జమీందారీ, భూస్వామ్య వ్యవస్థలకు వ్యతిరేకంగా జరిగిన ఉద్యమాలలో ఎన్నెన్ని త్యాగాలు చేశారో, ఎన్ని అగ్ని పరీక్షలకు తట్టుకున్నారో మనకు తెలుస్తుంది. దేశభక్తులు కానివారెవ్వరూ కమ్యూనిస్టులు కాలేరని మనకు కనబడుతుంది.

ఇందులో ఎక్కువ భాగం "నేనెలా స్వాతంత్ర్యోద్యమంలోకి, కమ్యూనిస్టు ఉద్యమంలోకి వచ్చాను?" అన్న సంక్షిప్త స్వీయ కథనాలే. మరికొన్ని ఆయా కామ్రేడ్స్ మరణానంతరం యితరులు వ్రాసినవి. ఇవన్నీ ఎక్కువ భాగం 1995, 1996 కమ్యూనిజం ప్రత్యేక సంచికలలో ప్రచురించబడినవి.

ఒక్కొక్క ప్రముఖ నాయకుని జీవితం గురించి ఒక పూర్తి గ్రంథమే వెలువరించవలసినంత ప్రాధాన్యత కల్గినవి. కామ్రేడ్స్ సుందరయ్య, రావినారాయణరెడ్డి మున్నగు కొద్దిమంది స్వీయ చరిత్రలు వారు చెప్పగా టేప్ చేసి, లేదా వారు వ్రాసుకొన్న నోట్సును బట్టి వారి మరణానంతరం వ్రాయబడినవి. కామ్రేడ్స్ పోలేపెద్ది నరసింహమూర్తి, చండ్ర రాజేశ్వరరావు, మద్దుకూరి చంద్రశేఖరరావు మున్నగు స్వాతంత్ర్య సమరయోధుల, కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతల జీవిత విశేషాలు వారి అనుభవాలు గ్రంథస్థం కాలేదు. వారి గురించి కొద్ది సమాచారం మాత్రమే నేడు మనకు లభ్యమవుతూంది. అలాగే ఉప్పల లక్ష్మణరావు, మెల్లీషోలింగర్ దంపతులు, పందిరి మల్లిఖార్జునరావు, పుత్సల సత్యనారాయణ, దర్శి చెంచయ్య, ప్రతాప రామసుబ్బయ్య, పెండ్యాల లోకనాథం, తుమ్మల వెంకట్రామయ్య, కొండేపూడి లక్ష్మీనారాయణ, ఆరుట్ల రామచంద్రారెడ్డి, గారపాటి సత్యనారాయణ గార్ల సంక్షిప్త జీవితచరిత్రలను కీ.శే. కంభంపాటి సీనియర్‌గారు రచించిన ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమ చరిత్ర (మొదటి భాగం) నుండి స్వీకరించబడినాయి కె.బి. కృష్ణ (కాట్రగడ్డ బాలకృష్ణ) ఆంధ్రదేశంలో తొలి మార్క్సిస్టు మేధావి. వారి గురించి కంభంపాటి సీనియర్ గారు మేయిన్‌స్ట్రీమ్ పత్రికలో వ్రాశారు. అలాగే రాయలసీమ కమ్యూనిస్టు ప్రముఖులు వి.కె. ఆదినారాయణరెడ్డి గారు. పదేపదే వారిని తమ రాజకీయ జీవితానుభవాలను వ్రాయవలసిందని కోరినప్పటికీ వారు వ్రాయలేకపోయారు. వారి మరణానంతరం కొద్దిపాటి సమాచారం మాత్రమే లభించింది.

కామ్రేడ్స్ మోటూరి పరంధామయ్య, మహమ్మద్ రజబలీ తమ జీవిత చరిత్రలను సంక్షిప్తంగా రాసి, రాయించి పంపారు. ఈ గ్రంథం వెలువడేలోగానే వారు కనుమూశారు.

ఈ వ్యాసాలలోని భాషను కూడా ఆయా వ్యాసకర్తల భాషలో ఉంటే స్ఫూర్తిమంతంగా ఉంటుందని అలానే ఉంచడం జరిగింది.

స్వాతంత్ర్య సమరంలో, కమ్యూనిస్టు ఉద్యమంలో పాల్గొన్నవారు తొలి, మలి తరంవారు ఒక్కొక్కరే కనుమరుగవుతున్నారు.

రాష్ట్రంలో యింకా అనేకమంది వృద్ధతరం కమ్యూనిస్టు నాయకులు, స్వాతంత్ర్య సమరయోధులైనవారు, తెలంగాణా స్వాతంత్ర్య సమరయోధులు, యోధురాండ్రు తమ స్వీయ చరిత్రలను, వారి రాజకీయ జీవితానుభవాలను పంపవలసిందిగా మేము కోరినప్పటికీ వృద్ధాప్యం వలన, అనారోగ్య కారణాలవలన వారు రాసి (లేదా రాయించి) పంపలేకపోయారు స్వాతంత్ర్య సమరంలో, భారత కమ్యూనిస్టు ఉద్యమంలో వారి అమూల్య జీవితానుభవాలను గ్రంధస్తం చేయకపోతే క్రమేణా కాలగర్భంలో కనుమరుగైపోతాయి. ఈ తరంవారికి "తెలియని అనేక అనుభవాలు, జ్ఞాపకాలు కాలగర్భంలో కలిసిపోతాయి" ఇప్పుడైనా స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న వృద్ధతరం కామ్రేడ్సు తమ సంక్షిప్త జీవిత చరిత్రలను రాసి పంపితే మరొక సంపుటంగా ప్రచురించ వీలవుతుందని మనవి చేస్తున్నాం. ఈ సంక్షిప్త జీవిత స్వీయకథనాలలో కొన్ని పెద్దవిగాను, కొన్ని చిన్నవిగాను ఉన్నాయి. ఎక్కువ స్వీయకథనాలు వారు జాతీయోద్యమంలోను, కమ్యూనిస్టు ఉద్యమంలోను ప్రవేశించే వరకే ఉన్నాయి. ఇవి వారివారి పూర్తి జీవిత చరిత్రలు కావు. అలాగే వారివారి ప్రాధాన్యత వరుస క్రమం కూడా ఇందులో లేదు. అలాగే కొందరి ఫోటోలు సకాలంలో అందకపోవడం వలన ప్రచురించలేకపోయాం. ఈ పరిమితులను పాఠకులు దృష్టిలో పెట్టుకోవలసిందిగా మనవి చేస్తున్నాం. భారత స్వాతంత్ర్య స్వర్ణోత్సవాల సమయానికే ఈ గ్రంథాన్ని అందించాలని అనుకున్నాం. అనివార్య కారణాలవలన అందించలేకపోయాం. ఇప్పటికైనా ఇంతమంది "స్వాతంత్ర్య సమరంలో పాల్గొన్న కమ్యూనిస్టు దేశభక్తుల" త్యాగమయ చరిత్రలను మీకు అందించగల్గుతున్నందుకు హర్షిస్తూ... ఇంకా పలువురి చరిత్రలు తదుపరి అందజేయగలమని మనవి చేస్తూ...

విజయవాడ

5-1-2000.

భవదీయుడు

పరకాల పట్టాభిరామారావు

(స్వాతంత్ర్య సమరయోధులు,
కమ్యూనిస్టు మార్క్సిస్టు సిద్ధాంత
పత్రిక సంపాదకులు)

# విషయసూచిక

★ ★ ★

# కీ.శే. అమీర్ హైదర్ ఖాన్



అమీర్ హైదర్ ఖాన్ 1900 సంవత్సరంలో పంజాబ్ రాష్ట్రం కలియన్ వలియన్ గ్రామంలో ఒక రైతు కుటుంబంలో జన్మించారు. ఆయన చదువుకోవాలని చాలా ఉబలాట పడ్డాడు. కాని స్కూలు పదిమైళ్లు దూరం. రోజూ నడిచివెళ్ళి రావలసి వచ్చేది. ఆ దశలో ఆయన అన్న జాతీయోద్యమ ప్రభావంతో ఇల్లు వదలి వెళ్ళిపోయాడు. అతనిని వెదుక్కొంటూ హైదర్ ఖాన్ 15వ యేట బొంబాయి చేరాడు. ఇంటి దగ్గర బయలు దేరేటప్పుడు చిన్న చేతి సంచి, కొంచెం పైకమూ వున్నాయి. నిల్వ వుండేటట్లు రొట్టెలు చేయించుకొని ఆయన బయలుదేరాడు. బొంబాయి నౌకాశ్రయానికి వెళ్ళాడు. సరుకులు తీసుకొని ఇంగ్లాండ్ వెళ్లే ఓడలో కూలి కుర్రవాళ్లతో పరిచయం చేసుకున్నాడు. కూలీగా చేరి ఓడ ఎక్కాడు. ఓడ కెప్టెన్ హైదర్ ఖాన్‌ను చూసి ముచ్చటపడి ఓడలో తనతో రెండేళ్లు తిప్పుకున్నాడు.

ఆ ఓడలోనే హైదర్ ఖాన్ అమెరికా వెళ్లాడు. అక్కడ ఒక భారతీయ సిక్కు కుటుంబంతో పరిచయం ఏర్పడింది. కొన్నాళ్లు పేపర్ బోయ్‌గా, ఆ తరువాత మోటారు మెకానిక్‌గా, ఆ తరువాత విమాన పైలెట్‌గా నిపుణత సంపాదించాడు. గదర్ పార్టీ వారితో పరిచయం ఏర్పడింది. మెరైన్ ఇంజనీయరుగా తర్ఫీదు పొందాడు. జపాన్ వెళ్లి రస బిహారీ ఘోష్‌ను కలుసుకున్నాడు. బ్రిటీష్ సి.ఐ.డి.ల అరెస్టు నుండి తప్పించుకొని మళ్ళీ అమెరికా వెళ్ళాడు. అమెరికన్ వర్కర్స్ పార్టీ సభ్యుడయ్యాడు. వారి పనుపున మాస్కోలోని ప్రాచ్యదేశాల విశ్వవిద్యాలయంలో మార్కిస్టు సిద్ధాంత శిక్షణ పొందాడు. కామింటరన్‌తో సంబంధాలు ఏర్పరచుకొని వారి సహాయంతో భారత దేశంలో కమ్యూనిస్టు ఉద్యమ సంస్థాపన కోసం స్వదేశం చేరుకొన్నాడు.

బొంబాయిలో జనరల్ మోటార్స్‌లో ఉద్యోగం చేస్తూ కార్మికోద్యమంలో కార్యాలయంలో పని చేస్తుండేవాడు. 1929లో మీరట్ కమ్యూనిస్టు కుట్రకేసులో

హైదర్‌ఖాన్‌ను యిరికించడానికి బ్రిటిష్ ప్రభుత్వం ప్రయత్నించింది. కానీ పోలీసులకు చిక్కకుండా తప్పించుకొని పార్టీ ఆదేశంతో దక్షిణ భారతదేశంలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణానికి మద్రాసు వచ్చాడు. మద్రాసులో చివరకు అరెస్టయి ఎన్నోయేళ్లు జైలు జీవితం గడిపి, 1942లో విడుదలై, 1945లో తన జన్మస్థలం రావల్పిండి చేరారు. చివరిసారిగా ఆయన 1992లో భారతదేశం సందర్శించారు. అజయ్‌భవన్‌లో కొన్నాళ్లు వుండి పాకిస్తాన్ వెళ్ళి ఇటీవలనే మరణించారు. దక్షిణ భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమాన్ని నిర్మించడానికి వచ్చి మద్రాసులో మొదట కామ్రేడ్ కంభంపాటి సీనియర్‌ను పార్టీ సభ్యునిగా చేర్చుకొన్నారు. తరువాత కామ్రేడ్ సుందరయ్యను సభ్యునిగా చేర్చుకొనడమేగాక, తాను అరెస్టు చేయబడి దీర్ఘకాలం జైళ్ళలో ఉండటంతో కామ్రేడ్ సుందరయ్యను తన స్థానంలో నియమించి దక్షిణ భారతదేశంలో "కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణ బాధ్యతలను అప్పగించారు."

ఆ వివరాలు కామ్రేడ్ హైదర్‌ఖాన్ సంక్షిప్త జీవిత చరిత్ర నుండి, కామ్రేడ్ కంభంపాటి సీనియర్, కామ్రేడ్ సుందరయ్యగార్ల స్వీయ కథనాలనుండి పాఠకులకు అందజేస్తున్నాం.

## అమీర్ హైదర్‌ఖాన్ స్వీయకథనం:

నేను సోవియట్ యూనియన్‌లో ఉన్నప్పుడు (మీరట్ అరెస్టుల తరువాత హైదర్‌ఖాన్ రహస్యంగా సోవియట్ యూనియన్‌కి వెళ్ళిపోయారు) భారతదేశంలో ఉప్పు సత్యాగ్రహం జరుగుతోంది. అదొక బ్రహ్మాండమయిన ప్రజా ఉద్యమం. నాయకులు అరెస్టు చేయబడి నిర్బంధింపబడినప్పుడు ప్రజలు ఉప్పు తయారు చేయడంతో సంతృప్తి చెందక, పెద్ద పెద్ద పోరాటాలు ప్రారంభించారు. బ్రిటిష్ ప్రభుత్వంతో ప్రత్యక్ష ఘర్షణలకు తలపడ్డారు. విప్లవ చర్యలకు పూనుకున్నారు. షోలాపూర్ నగరం కొన్నాళ్ళు ప్రజల హస్తగతమయింది. అయితే, ప్రజల్ని సక్రమ మార్గంలో నడపడానికి భారతదేశంలో విప్లవ పార్టీ ఏదీలేదు. అప్పుడు భారతదేశంలో జరుగుతున్న పరిణామాలు నన్ను కలవరపెట్టాయి. కమ్యూనిస్టు పార్టీని నిర్మించడంలో సహాయపడాలని నేను నిశ్చయించుకున్నాను. అప్పుడు భారతదేశానికి ప్రాతినిధ్యం వహించగలవా రెవరూ మాస్కోలో లేరు. నేను శ్రామికుల నుంచి వచ్చి, వర్గ చైతన్యంగల విప్లవ కార్యకర్తగా మాస్కోలో పని చేస్తూండడం వల్ల నేను తగు విధంగా ప్రాతినిధ్యం వహించగలనని అక్కడి నాయకులు భావించారు. నేను ప్రాఫింటెర్న్ (రెడ్ ఇంటర్నేషనల్ ట్రేడ్ యూనియను) కార్యాలయంలో పని చేస్తూ ఉండేవాణ్ణి. ఒక రోజున నేనక్కడికి వెళ్ళి దాని ప్రధాన కార్యదర్శి లొజోవస్కీని కలుసుకున్నాను. ఆయన వద్ద 1930 డిసెంబరు 8న సెలవు తీసుకొని మాస్కో వదలిపెట్టాను. లొజోవస్కీ భారతదేశంలోని కామ్రేడ్స్‌కి యీ సందేశమిచ్చారు: "మీరు పార్టీని నిర్మించండి. కమ్యూనిస్టు పార్టీ లేనిదే మీరేమీ చేయలేరు."

నేను బొంబాయిలో దిగి, అక్కడి కామ్రేడ్స్‌కి పై సందేశ మందించి, వారి ఆదేశంపై మద్రాసు బయల్దేరి వెళ్ళాను. నాకు దక్షిణ భారతదేశం కొత్త. అక్కడి

భాషలుగాని, ఆచార వ్యవహారాలుగాని నాకు తెలియవు. మొదట్లో నేను విలువైన అపురూప వస్తువులు కొని, విదేశాలకు పంపే ఒక వ్యాపారస్తునిగా నటించాను. ఆ విధంగానే మాత్యూ అను రైల్వే ఎలక్ట్రిషియన్‌తో నాకు పరిచయమైంది. అతడు మద్రాసు ఎలక్ట్రిక్ రైల్వే లైను చివరి స్టేషన్ అయిన తాంబరంలో ఒక బ్రిటిష్ కంపెనీ క్రింద జీతగాడుగా పనిచేసేవాడు. అతని పని, ఎలక్ట్రిక్ రైళ్ళకు తగిలించవలసిన బోగీలను ఒకదానితో ఒకటి సంధాన పరచడం. అతని క్రింద కొందరు అప్రెంటీసులుగా పనిచేసేవారు. వారిలో ఆంగ్లో ఇండియన్లు కూడా ఉండేవారు. వారికి మాత్యూ కన్నా జీతం ఎక్కువ. ఈ వివక్షను గర్హిస్తూ నేనతనితో సంభాషణలు జరిపేవాణ్ణి. చివరకు విదేశీ పరిపాలనే దీనికి కారణమని అత డంగీకరించాడు. క్రమంగా మాత్యూతో నాకు చనువు ఏర్పడింది. మన దేశంలో సామ్రాజ్య వాద దోపిడీని అతడు స్పష్టంగా అర్థం చేసుకోగలిగాడు.

తరువాత, మాత్యూ క్రింద పనిచేసే తమిళ అప్రెంటీసు వెంకట్రామన్‌తో నాకు పరిచయమైంది. అతడు చురుకైనవాడు. బుద్ధికుశలుడూను. ట్రాన్సిస్టర్లంటే ఏమిటో తెలియని రోజుల్లో అతడు పాకెట్ సైజు ట్రాన్సిస్టర్ తయారీకి ఒక డిజైను రూపొందించాడు. కాని, వెంకట్రామన్ గర్భదరిద్రుడు. పెట్టుబడి పెట్టగలవా రెవరినీ అత డెరుగడు. అందుచేత, మానసికంగా వ్యధ చెందేవాడు. నే నతని బాధ అర్థం చేసుకున్నాను. మాటల సందర్భంలో రాజకీయాలు చోటు చేసుకున్నాయి. విదేశీపాలన లేకపోతే అలాంటి బుద్ధిశాలుర తెలివితేటలు దేశానికి ఎంత ఉపయోగపడేవో చెప్పేవాడిని. మాత్యూ చర్మం నల్లదైనందున అతడెంత అన్యాయానికి గురి అయాడో వివరించేవాణ్ణి. వెంకట్రామన్ నాతో ఏకీభవించాడు. అప్పటినుంచీ అతడు నాకు సన్నిహితుడయాడు.

ఒకనాడు వెంకట్రామన్ లయోలా కాలేజీలో బి.ఏ. ఆనర్స్ చదువుతున్న వి.కె. నరసింహన్‌ని నాకు పరిచయం చేశాడు. నరసింహన్ మేధావి. కమ్యూనిస్టు సిద్ధాంతాల్ని ఆకళింపు చేసుకొన్నవాడు. ఈ విధంగా చాలా మందితో నాకు పరిచయా లేర్పడ్డాయి. వారు టెక్నీషియన్లు, అప్రెంటీసులు, ఎలక్ట్రిషియన్లు, ట్రాంవే కార్మికులు, ప్రెస్ కార్మికులూను. వీరందరిలో జయరాం చాలా తెలివైనవాడు. ఉత్సాహవంతుడు. దూరాలోచన గలవాడు. ఆ రోజుల్లో కమ్యూనిస్టు పార్టీ బహిరంగంగా పని చేయడానికి అవకాశం లేదు. అందుచేత మేం యంగ్ వర్కర్స్ లీగ్ అను చట్టబద్ధ సంస్థను స్థాపించాం. ఎల్లప్పుడూ ఒకే చోటకాక, వేర్వేరు చోట్ల సమావేశాలు జరుపుకొనే వాళ్ళం. నేను మార్క్సిజం మీద, జాతీయ – అంతర్జాతీయ సమస్యల మీద క్లాసులు తీసుకొనేవాణ్ణి. నరసింహన్‌ని యంగ్ వర్కర్స్ లీగ్‌కి కార్యదర్శిగా ఎన్నుకున్నాం.

స్వాతంత్ర్యోద్యమంలో చదువు మానేసిన విద్యార్థుల్ని గురించి నేను భోగట్టా చేయసాగాను. అలాంటి వారిలో కంభంపాటి సత్యనారాయణ ఒకరు. నే నాయన్ని పిలవనంపగానే మద్రాసు వచ్చాడు. ఉభయులు మాట్లాడుకున్న తరువాత, మద్రాసులో పని చేయడాని కాయన అంగీకరించాడు. వారం రోజుల తరువాత భార్యతో కలిసి మద్రాసు వచ్చాడు. వారిని ఒక ట్రాం కండక్టరు యింట్లో ఉంచడానికి ఏర్పాటు చేశాను. సత్యనారాయణ భార్యకు మాంసం, చేప పడవు. వాటి వాసన ఆమెకు

రోతగా ఉండేది. నే నామెను కూర్చోపెట్టి, పరిస్థితి అంతా చెప్పాను. ఎలాగైనా ఓర్చుకోమని బ్రతిమాలేను. ఆమె అంగీకరించింది.

నేను "కమ్యూనిస్టు ప్రణాళిక," "రాజ్యాంగ యంత్రం, విప్లవం", "మార్క్స్ ఉపదేశాలు" ఒక్కొక్క ప్రతి సంపాదించి ఉంచుకొన్నాను. లీగ్ సభ్యుల్ని చైతన్య వంతులుగా చేయడానికి వాటి నుపయోగించేవాణ్ణి. నే నవలంబించిన బోధనా పద్ధతి యిది. ఒక్కొక్క సభ్యునితో ఒక్కొక్క పేరా చదివించేవాణ్ణి. దాని అర్థం చెప్పమని యితరుల్ని అడిగేవాణ్ణి. ఒక్కొక్కరూ చెప్పింది విని, నిత్య జీవితం నుంచి ఉదాహరణలిస్తూ ఒక్కొక్క పేరాలోని భావాన్ని పరిపుష్టం చేసేవాణ్ణి. తరువాత రెండో పేరా చదవమనేవాణ్ణి.

కార్మికవర్గం యొక్క ప్రత్యేక లక్షణాల్ని తెలుసుకొనేటట్లు చేయడానికి నేను లీగ్ సభ్యుల్ని ఫ్యాక్టరీలకు తీసుకెళ్ళేవాణ్ణి. ఒక రోజున కొందరిని బకింగ్‌హాం కర్నాటిక్ మిల్లు చూపించడానికి తీసుకెళ్లాను. ఒక్కొక్క విభాగంలో కార్మికు లెలా పని చేస్తున్నారో వారికి చూపెట్టాను. ఆ విధంగా, వారిలో ఐక్యత, క్రమశిక్షణ, చురుకుతనం ఎలా అలవడుతాయో కళ్ళకు కట్టినట్లు కనిపించేది. సాయంత్రమయ్యాక వేలాది కార్మికులు గేటులోనుంచి బయటకు రావడం చూపి, "వీరిని గురించే మార్క్స్ కార్మిక సైన్యం అని చెప్పారు" అని, మార్క్స్ ఉపదేశాల్ని జ్ఞాపకం చేసేవాణ్ణి.

యంగ్ వర్కర్స్ లీగ్ సభ్యులు నెల నెలా చందా లిచ్చేవారు. కొందరు ఎక్కువ మొత్తా లిచ్చేవారు. మరి కొందరు నా జీవిత విధానం చూచి యిచ్చేవారు. ఆ రోజుల్లో విద్యార్థులకు మధ్యాహ్నం పూట టిఫిన్ కోసం అరేసి అణా లిచ్చేవారు. కొందరు విద్యార్థులు ఆ సొమ్మును విరాళంగా యిచ్చేవారు.

ఆ రోజుల్లోనే డాక్టరు అచ్చమాంబ మాకు పరిచయమయ్యారు. ఆమెతో అప్పుడప్పుడు మాట్లాడేవాణ్ణి. కొన్నాళ్ళ తరువాత ఆమె కమ్యూనిస్టు పార్టీలో చేరారు. ఒక రోజున చర్చ సందర్భాల్లో మీనన్ అనే ఒక కాంగ్రెస్ డాక్టరు నన్ను బోల్షివిక్కు ఏజంటు అన్నాడు. ఆ సమయంలో అక్కడ మరి కొందరున్నారు. నేను మీనన్‌ని ఉద్దేశించి, "నేను బోల్షివిక్కును. అంతేగాని, ఏజంటును కాను" అన్నాను.

నేను పి. సుందరయ్యను గురించి విన్నాను. అప్పు డాయన బెంగుళూరులో తన బంధువు యింట్లో ఉండి కాలేజీలో చదువుతున్నారు. ఆ బంధువు జిల్లా సెషన్స్ జడ్జి. సుందరయ్యను కలుసుకోవడానికి నేను జయరాంని వెంటబెట్టుకొని బెంగుళూరు వెళ్ళాను. మే మిద్దరం సెషన్స్ జడ్జిగారింటి బయట సుందరయ్యకోసం వేచి యుండగా, ఆయన కాలేజీ నుండి వస్తూ మమ్మల్ని చూచారు. మేమూ ఆయనా కలిసి ఒక పార్కుకు వెళ్ళాం. అక్కడ కూర్చొని, నేను వచ్చిన పని చెప్పాను. దేశ రాజకీయాలు, పార్టీ పాలసీ చెప్పాను. మద్రాసు రాగలరా అని అడిగాను. ఆయన అంతా విన్నారు. తాను మొదట చదువు పూర్తి చేయవలసి వుందనీ, ఆ తరువాత వచ్చి కలుసుకొంటాననీ చెప్పారు. కొద్ది రోజుల తరువాత జడ్జిగారింట్లో జరిగే వివాహ సందర్భంలో యింటిమీద యూనియన్ జాక్ ఎగురవేయబడింది. సుందరయ్యకి రుచించలేదు. తానా యింట్లో ఉండదలచుకోలేదు. మరునాడు రైలెక్కి మద్రాసు

వచ్చేశారు. కొన్ని పుస్తకాలు కొని, సత్యనారాయణగారిని కలుసుకొని, స్వగ్రామం వెళ్ళడానికి రైలెక్కారు. అది నాకు తెలిసి, రైలు స్టేషను కెళ్ళాను. నేను వెళ్ళేటప్పటికి రైలు కదలబోతూ ఉంది. సుందరయ్య మరో నాలుగు మాసాలలో వచ్చి మీతో కలసి పని చేస్తానని చెప్తూతూ ఉండగానే బండి కదిలిపోయింది. సుందరయ్య నన్ను రైల్లో నుంచి చూచారు. నేనాయన్ని ప్లాట్ ఫారంనుండి చూచాను.

మద్రాసులో పోలీసులు నా జాడ తెలుసుకున్నట్లు అనుమానించి, తిరిగి మాస్కో వెళ్ళాలనుకొన్నాను. వెంకట్రామన్ తమ్మునితో ఎలాగైనా నాకొక పాస్‌పోర్టు సంపాదించి పెట్టమని అడిగాను. కొద్దిరోజుల్లో అతడు సంపాదించగలిగాడు.

★ ★ ★

# కీ.శే. కంభంపాటి సత్యనారాయణ



నేను 1909లో జన్మించాను. చిన్నప్పుడు కాకినాడలో చదువుకొంటూండగా సహాయ నిరాకరణోద్యమంవల్ల ప్రభావితుణ్ణయ్యాను. టౌన్ హాలులో పట్టణ, జిల్లా కాంగ్రెస్ నాయకు లిచ్చే ఉపన్యాసాల్ని విడవకుండా వినేవాణ్ణి. పాటలు, పద్యాలు, ఉపన్యాసాలే కాక, విదేశీ వస్త్ర దహనం కూడా ఒక కార్యక్రమంగా వుండేది. సాంబమూర్తి, ప్రకాశం, గోపాలకృష్ణయ్య లాంటి మేధావులు న్యాయవాద వృత్తిని విడిచి పెట్టి, ఖద్దరు ధరించి, బ్రిటిష్ ప్రభుత్వాన్ని నిప్పులు చెరుగుతూ ఉపన్యసిస్తూంటే, ఒళ్ళు మరచిపోయేవాణ్ణి. 1921–22లో చట్టధిక్కారణ చేసినందుకు అరెస్టు చేయబడి శిక్షలు విధింపబడ్డ నాయకుల్ని చూడ్డానికి వెళ్ళేవాణ్ణి. కొన్నాళ్ళ తర్వాత నేను కూడా ఖద్దరు ధరించడం ప్రారంభించాను. ఇంట్లో రాట్నం మీద ప్రతి సాయంత్రం నూలు వడికేవాణ్ణి. కొన్ని నెలల తరువాత ఆ నూలుతో పంచలు నేయించి కట్టుకున్నాను. 1923లో కాకినాడలో జరిగిన కాంగ్రెస్ మహాసభ దృశ్యాలు నన్ను ఉత్సాహపరిచాయి. పి.ఆర్.కాలేజీలో చదువుతూండగా, 1928లో సైమన్ కమిషన్ వ్యతిరేక ప్రదర్శనలో పాల్గొని, టౌన్‌హాల్‌లో జరిగిన బహిరంగ సభకు

హాజరయ్యాను. అక్కడ సాంబమూర్తిగారి అధ్యక్షత క్రింద జరిగిన బహిరంగసభలో స్వామి కుమారానంద్ అహింసా విధానాన్ని దుయ్యబడుతూ ఉపన్యసిస్తూంటే, ఒళ్ళు గగుర్పొడించింది. మరునాడు ఆయన్ని కలుసుకోడానికి సాంబమూర్తిగా రింటికి వెళ్ళాను. కుమారానంద్ నాతో చాలా చనువుగా మాట్లాడారు. చదవడానికొక పుస్తకం యిచ్చారు. అది రెనీఫుల్లప్ మిల్లర్ అను జర్మన్ రచయిత రచించిన "ది మైండ్ అండ్ ఫేస్ ఆఫ్ బోల్షివిజం." సోవియట్ రష్యాలో ఏర్పడ్డ సోషలిస్టు వ్యవస్థను వర్ణించే గ్రంథం అది. రెండు రోజులు కాలేజీకి సెలవు పెట్టి దాన్ని ఆమూలాగ్రం చదివాను. చదివి ఉత్తేజితుణ్ణయ్యాను. ఆ పుస్తకంలో ఉన్న లెనిన్ చిత్రాన్ని ఒక ఆర్టిస్టు మిత్రుని చేత తిరిగి గీయించుకొని, పుస్తకాన్ని తిరిగి యిచ్చేశాను. అప్పటి కాయన కమ్యూనిస్టు అయి వుండవచ్చు. రాజస్థాన్‌లో చాలాకాలం కమ్యూనిస్టు కార్యకర్తగా ఉండి, తరువాత రాష్ట్ర కమిటీ కార్యదర్శిగా పనిచేశారు.

నేను బి.ఏ. చదువుతూండగా పశ్చిమగోదావరి జిల్లా భీమవరం తాలూకాలో ఒకరిదగ్గర సావర్కార్ రచించిన "ది ఇడియన్ వార్ ఆఫ్ ఇండిపెండెన్స్" ఉన్నదని తెలుసుకొని, మరునాడు ఆయనను కలుసుకోడానికి వెళ్ళాను. అది నిషిద్ధ గ్రంథం. దగ్గరున్నట్టు పోలీసులకు తెలిస్తే జైలుశిక్ష తప్పదు. అయినా, ఆయన దగ్గరకు వెళ్ళాను. అడిగీ అడగ్గానే ఆయన ఆ పుస్తకం యిచ్చారు. దాన్ని నాలుగు రోజుల్లో పూర్తి చేసి తిరిగి యిచ్చేశాను. ఆ గ్రంథం 1857 పోరాటాన్ని ఒళ్ళు జలదరించేటట్లు వర్ణించేది. ఆ గ్రంథం చదువుతూన్నంతసేపూ నా రక్తనాళాల్లో రక్తం కుతకుత లాడింది.

1929లో నేను బి.ఏ. ప్యాసై, ఉన్నత విద్యకై మద్రాసు వెళ్ళాను. లయోలా కాలేజీలో ఎం.ఏ. చదువుతూండగా, దేశం స్వాతంత్ర్య సమరానికి సన్నద్ధ మవుతోంది. నేనూ, సుందరయ్య (ఆయన అప్పుడు ఇంటరు చదువుతూండేవారు) మరికొందరు విద్యార్థులతో సోదర సమితిగా ఏర్పడి, కాలేజీ హాస్టల్‌లో ప్రతి ఆదివారం ఖద్దరు విక్రయించేవాళ్ళం. యువకుల్లో సామ్రాజ్యవాద వ్యతిరేక భావాలను వ్యాప్తి చేసే పత్రిక "యంగ్ లిబరేటర్"కి చందాలు చేర్పించాం. అది మాస పత్రిక. బొంబాయి నుంచి వెలువడేది. దాని సంపాదకుడు హెచ్.డి. రాజా. ఆయన నాలుగురోజులు హాస్టల్‌లో మా అతిథిగా ఉన్నారు. 1929 డిసెంబర్‌లో లాహోరు కాంగ్రెస్ ఏకగ్రీవంగా ఆమోదించిన సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని పురస్కరించుకొని, 1930 జనవరి 26న మేం విద్యార్థులందరిచేత క్లాసులు బహిష్కరింపచేశాం. సాయంత్రం ట్రిప్లికేన్ బీచ్‌కి ఊరేగింపు నడిపాం. అక్కడ జరిగిన బహిరంగ సభలో ప్రజలందరితో కలిసి స్వాతంత్ర్య ప్రతిజ్ఞ తీసుకున్నాం. మొదటి సంవత్సరం పరీక్షలైపోగానే పశ్చిమ గోదావరి జిల్లా వెళ్ళి, సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నాం. కొన్ని వారాల తర్వాత సుందరయ్య 1930 జూన్‌లో చట్టధిక్కరణ చేసినందుకు అరెస్టు చేయబడి జైలుకు పంపబడ్డాను. నేను తూర్పు గోదావరి జిల్లాకు వెళ్ళి, డాక్టరు చెలికాని రామారావుగారితో కలిసి జిల్లా కాంగ్రెస్ కమిటీ ఆఫీసు(కాకినాడ)లో పనిచేశాను. ఆ కమిటీ ఇతర జిల్లా కాంగ్రెస్ కమిటీల్లాగ నిషిద్ధసంస్థకాదు. అయినా, మాలో కొందరం (నాతో సహా) పగలు బహిరంగంగాను, రాత్రి రహస్యంగాను పనిచేసేవాళ్ళం, "రణదుందుభి" అనే పేరుతో మేమొక రహస్య సైక్లోస్టయిల్ పత్రిక నడిపేవాళ్ళం. దానికి సంపాదకుణ్ణే.

ప్రాధ్యాపకుడిని నేనే. ఆ తరువాత పశ్చిమ గోదావరి జిల్లాలో "వీర భారతి" అనే మరో పత్రిక ప్రారంభించాం.

శాసనోల్లంఘనోద్యమంలో అనేక మంది జైలు శిక్షలకు, లాఠీ దెబ్బలకు, తుపాకులకు గురి అయ్యారు. నేను 1931 జనవరి 26న భీమవరం వెళ్ళి, తనికెళ్ళ చలపతితో కలిసి 144వ సెక్షన్ ధిక్కరించి జైలు శిక్షకు గురి అయ్యాను. దాదాపు ఒకటిన్నర నెలలు రాజమండ్రి జైల్లో శిక్ష అనుభవించి, గాంధీ ఇర్విన్ ఒడంబడిక ఫలితంగా, మార్చి నెలలో విడుదల చేయబడ్డాం. కాని, మాకు సంతోషం లేదు. ఉద్యమం ఉఛ్ఛస్థాయి నందుకొంటున్న తరుణంలో, గాంధీజీ తానుకోరిన 11 కోరికల్లో ఏది సిద్ధించకపోయినా, ఉద్యమాన్ని ఆయన విరమించినందుకు హతాశులమయాం. ప్రజల త్యాగాలన్నీ నిరర్థకమైనట్లు మాకు తోచింది.

విడుదలైన వెంటనే భీమవరం వచ్చి, జిల్లా కాంగ్రెసు కమిటీ అధ్యక్షుని ఆదేశం మేరకు కరాచీ కాంగ్రెసుకు నేనూ, చలపతీ ప్రతినిధులుగా వెళ్ళాం. బొంబాయిలో ఓడ ఎక్కేముందు భగత్సింగ్, సుఖదేవ్, రాజగురులు ఉరి తీయబడ్డారనే వార్త పత్రికలో చదివి శోకతప్త హృదయులమయాం. గాంధీజీ భగత్సింగ్ ప్రాణాలను కాపాడగలిగివుండీ, అందుకు కృషి జరపకపోవటం నా వంటి యువకుల్ని కలవరపెట్టింది. అహింసా మార్గం మీద నాకు విశ్వాసం పోయింది. మహాసభలో, భగత్సింగ్ ప్రభృతుల దేశభక్తినీ, ఆత్మ బలిదానాన్నీ కొనియాడుతూనే, వారు చేబట్టిన హింసాత్మక పద్ధతుల్ని ఖండిస్తూ గాంధీజీ ప్రవేశపెట్టిన తీర్మానాన్ని వ్యతిరేకించిన వందలాది ప్రతినిధుల్లో నేనొక్కణ్ణి.

కరాచీ నుంచి తిరిగి వస్తూ సావర్కార్ రచించిన "ది ఇండియన్ వార్ ఆఫ్ ఇండిపెండెన్స్" రహస్యంగా కొని తెచ్చుకున్నాను.

నే నప్పటికే కమ్యూనిస్టు సాహిత్యం చదివినవాణ్ణి. "ది ఇలస్ట్రేటెడ్ హిస్టరీ ఆఫ్ రష్యన్ రివల్యూషన్" మొదలైన పుస్తకాలు చదివియున్నాను. మీరట్ కుట్రకేసు నిందితుల స్టేట్మెంట్లు, పబ్లిక్ ప్రాసిక్యూటర్ మీద వారు విసిరే సవాళ్ళు నన్ను ఆకట్టుకున్నాయి. కాని కమ్యూనిస్టు పార్టీకి సంబంధించిన వారెవరూ నాకు తారసిల్లలేదు. అందుచేత కొన్నాళ్ళు చుక్కానిలేని పడవలా తిరిగాను. గుంటూరులో ఒక వ్యక్తిగత విప్లవవాద గ్రూపులో చేరి పని చేయసాగాను. 1932 ఏప్రిల్లో నేను కాకినాడలో ఉండగా, జిల్లా కాంగ్రెస్ కమిటీ అధ్యక్షుడు ఒకరోజు రాత్రి నాకు కబురు చేశారు. నేను వ్యక్తిగత విప్లవవాద ఉద్యమంలో ఉన్నానని ఆయనకు తెలుసు. తెలిసే కబురుచేశారు. నేను వెళ్ళాను. ఏప్రిల్ 24న ఢిల్లీలో జరగబోయే కాంగ్రెస్ మహాసభకు వెళ్ళవలసిందని న న్నాయన ప్రోత్సహించారు. అది నిషిద్ధసభ. విప్లవకారులతో సంబంధం పెట్టుకోవచ్చుననే ఉద్దేశంతో, నేను వెళతానన్నాను. రాకపోకలకు రెండువందల రూపాయ లిచ్చారు. ఢిల్లీ నాకు కొత్త, అయినా నాకున్న ఇంగిత జ్ఞానానికి బుద్ధిబలం జోడించి, ఢిల్లీ జైల్లోని విప్లవకారులతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపి, ఆంధ్రదేశంలో హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీశాఖ (ఇది భగత్సింగ్ సంస్థ) స్థాపించడానికి అనుమతి పత్రం సంపాదించాను. తిరిగి వచ్చేటప్పుడు

అకోలాలో దిగి, అక్కడి జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుని యింటికి వెళ్ళి, ఒక రివాల్వరూ, ఒక తూటా సంపాదించుకొన్నాను.

కాని ఆ ఆయుధాన్ని ఎవ్వరమూ ఉపయోగించకముందే మేము గుంటూరు "డెన్"లో వుండగా, మద్రాసు నుంచి నా కాలేజీ మిత్రుడొక ఉత్తరం వ్రాశారు, నన్ను వెంటనే బయల్దేరి రావలసిందని. నేను 1931 మధ్యలో మద్రాసు వెళ్ళాను. అక్కడ అమీర్ హైదర్ ఖాన్ అనే కమ్యూనిస్టు కార్యకర్తతో నాకు పరిచయమైంది. ఆయన మీరట్ కుట్రకేసులో ముద్దాయిగా ఉండవలసినవాడు. కాని, అరెస్టు నుంచి తప్పించుకొని, రహస్యంగా మాస్కోకు వెళ్లి, అక్కడ కొంత కాలం ఉండి, తిరిగి 1932లో ఇండియాకు వచ్చారు. అనాడు కమ్యూనిస్టు పార్టీ బహిరంగంగా పని చేయడానికి అవకాశం లేదు. అందుచేత హైదర్‌ఖాన్ యంగ్ వర్కర్స్ లీగ్ అనే చట్టబద్ధ సంస్థ నేర్పరచారు. దాని ఆధ్వర్యం క్రింద కార్మికుల్ని విప్లవ మార్గంలో సంఘటిత మొనర్చి, తాను సుశిక్షితులనుకొన్న కొందరిని మాస్కోకు పంపడం ఆయన ఉద్దేశం.

వారు మాస్కోలోని ప్రాచ్యప్రజల విశ్వవిద్యాలయంలో తర్ఫీదు పొందవలసి వుంటుంది.

హైదర్‌ఖాన్ ఇప్పటి పాకిస్తాన్‌లో భాగమైన పశ్చిమ పంజాబు నివాసి. పెద్ద చదువులు చదువుకోలేదు. బొంబాయిలో ఓడ క్లీనర్‌గా ఉంటూ అమెరికా వెళ్ళి అక్కడ అనేక కర్మాగారాల్లో పని చేశారు. నిపుణుడైన ఇంజనీరుగా, విమాన చోదకుడుగా కొన్ని సంవత్సరాలు అమెరికాలో గడిపారు. అక్కడ నుంచి సోవియట్ యూనియన్ వెళ్ళి, ప్రాచ్యప్రజల విశ్వవిద్యాలయంలో శిక్షణ పొందారు.

మద్రాసులో స్థాపింపబడ్డ యంగ్ వర్కర్స్ లీగ్‌లో నేనొక హోల్ టైమరును. అందులో దాదాపు 25 గురు సభ్యులుండేవారు. జౌళి, ట్రాంవే, రైల్వే, ప్రింటింగ్ తదితర పరిశ్రమల్లో వారు పనిచేస్తూ ఉండేవారు. నేను ట్రాంవే కార్మికుల మధ్య పని చేసేవాణ్ణి. ప్రచారం, ఆందోళన, ప్రబోధం ద్వారా కార్మికుల్లో వర్గ చైతన్యం కలిగించి, ఉమ్మడి కార్యాచరణకు వారిని సన్నద్ధం చేయడం, కాంగ్రెస్ నాయకత్వపు మితవాద ధోరణుల్ని తూర్పారబట్టడం, ట్రేడ్ యూనియన్లలో అవకాశవాద నాయకుల్ని బహిర్గత మొనర్చడం మా ప్రధాన కర్తవ్యాలు. శాసనోల్లంఘనోద్యమాన్ని రెండుసార్లు ఉపసంహరించి, ప్రజా విప్లవాన్ని నిరోధించిన గాంధీ నాయకత్వాన్ని కూడా వ్యతిరేకించడం మా కర్తవ్యం. నేనూ, నా భార్య మాణిక్యాలు ఒక ట్రాంవే కండక్టరు యింట్లో నివసించేవాళ్ళం.

తమిళంలో "మున్నేట్రం" (ప్రగతి) అను పక్ష పత్రిక యంగ్ వర్కర్స్ లీగ్ ప్రచార సాధనంగా ఉండేది. 4 పేజీలతో 500 ప్రతులు ముద్రింపబడేవి. కార్మికులను గురించిన వ్యాసాలు, వార్తలతో పాటు కొమింటర్న్ పత్రిక. "ఇంప్రికార్"లోని వ్యాసాలు అనువదింపబడి ప్రచురింపబడేవి. హైదర్‌ఖాన్ డిక్టేట్ చేసే ప్రత్యేక వ్యాసాల్ని లీగ్ కార్యదర్శి వి.కె. నరసింహన్ (లయోలా కాలేజీలో ఆనర్స్ విద్యార్థి) తమిళంలోకి అనువదించేవాడు. మొత్తంమీద అనాటి భారత కమ్యూనిస్టు పార్టీ పాలసీని అమలు జరపడంలో "మున్నేట్రం" ఎనలేని సేవ చేసింది. హైదర్‌ఖాన్‌కి

తమిళంగాని, తెలుగుగాని తెలియకపోయినా, తన అభిప్రాయాలను వ్యక్తం చేయడానికి ఇంగ్లీషులోను, తమిళంలోను మాట్లాడ్డానికి కృషి చేసేవారు.

సోవియట్ యూనియన్‌తో హైదర్‌ఖాన్‌కి సజీవ సంబంధాలుండేవి. యంగ్ వర్కర్స్ లీగ్ సభ్యుల్లో ఒకడైన జయరాంని రాజకీయ శిక్షణ కొరకు మాస్కో పంపించారు.

హైదర్‌ఖాన్ 1932 చివరిభాగంలో అరెస్టు చేయబడ్డారు. రాజద్రోహనేరం క్రింద రెండేళ్ళు కఠిన శిక్ష విధింపబడింది. విడుదలయ్యాక తిరిగి అరెస్టు చేయబడి, స్టేట్ ప్రిజనర్‌గా నిర్బంధింపబడ్డారు. తరువాత, 1938లో విడుదల అయ్యారు.

నేను మద్రాసులో కొన్ని నెలలున్న తరువాత, ఆర్థిక యిబ్బందుల వల్ల ఆంధ్రదేశానికి తిరిగి రావలసివచ్చింది. పశ్చిమ గోదావరి జిల్లా పాలకొల్లులో ఉండగా పోలీసులు నన్నొక రోజున అరెస్టు చేశారు. అదివరకు నేనా జిల్లాలో నడిపిన "వీర భారతి" ప్రతుల్ని పంచిపెడుతున్నట్లు నామీద నేరం ఆరోపించారు. కేసు విచారణ 1933 జనవరి నుంచి ఏప్రిల్ వరకు సాగింది. కోర్టు 6 నెలల కఠిన శిక్ష విధించింది. ఆరు నెలలూ బళ్లారి సెంట్రల్ జైలులో గడిపాను.

జైలు నుంచి విడుదల అయ్యాక, నేను మద్రాసులో కొన్ని వారాలు ప్రకాశం పంతులు "స్వరాజ్య" (ఇంగ్లీసు) పత్రికలో రిపోర్టరుగా పనిచేశాను. ఆ తరువాత, మద్రాసులోనే, యిదివరకటి "యంగ్ లిబరేటర్" పత్రిక సంపాదకుడైన హెచ్.డి. రాజా స్థాపించిన "న్యూ ఏజ్"లో సహాయ సంపాదకునిగా 1933 నవంబరు నుంచి 1934 నవంబరు వరకు పనిచేశాను. ఈ పత్రిక యువకుల్లోను, మేధావుల్లోను శాస్త్రీయ సోషలిస్టు (కమ్యూనిస్టు) భావాలను ప్రచారం చేయడాని కుద్దేశింపబడింది. చట్టానికి లోబడి సామ్రాజ్యవాద దోపిడీని బహిర్గతం చేస్తూ, కాంగ్రెస్ నాయకత్వపు మితవాద పాలసీలను విమర్శించేది. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమంలోని ముఖ్య ఘట్టాలను ప్రచురించేది. దానిని ఆర్థిక కారణాలవల్ల మూసివేయవలసి వచ్చింది.

నేను 1930లో లయోలా కాలేజీలో వదిలిపెట్టిన ఎం.ఏ. చదువు పూర్తి చేయదలచుకొన్నాను. నాలుగు నెలలు కష్టపడి, చదివి, 1935 ఏప్రిల్‌లో ప్రైవేటుగా పరీక్షకు కూర్చొని ప్యాసయ్యాను. తరువాత, సుందరయ్యా మరికొందరూ స్థాపించిన కూలీ రక్షణ సమితిలో సభ్యునిగా చేరి పని చేయసాగాను.

★ ★ ★

# కీ.శే. పుచ్చలపల్లి సుందరయ్య



నేను 1913లో జన్మించాను. స్వగ్రామం నెల్లూరు జిల్లా అలాగానిపాడు. చిన్నప్పుడే తండ్రి పోవడంవల్ల, బావగారింట్లో ఉండి చదువుకొనేవాణ్ణి. 1920–23 మధ్య ప్రైవేటు ట్యూషను చెబుతున్న టీచరు వెంకటరత్నంగారి వల్ల తెలుగు భాషమీద అభిమానం పెరిగింది. దానిని అభివృద్ధి చేసుకోడంతో, భోగరాజు నారాయణమూర్తి "విమలాదేవి", "రాయచూరు యుద్ధం", "తిమ్మరుసు" మొదలైన చారిత్రక నవలలు చదవడంతో స్వాతంత్ర్య యోధులమీద భక్తి శ్రద్ధలు ఏర్పడ్డాయి. వేమన పద్యాలు, సుమతీశతకం కంఠస్థం చేయడంతో సాంఘిక సమానత్వ భావా లంకురించాయి. నియమబద్ధ జీవితానికి పునాదు లేర్పడ్డాయి. రాజమండ్రిలో మా బావగారు సెషన్స్ జడ్జీగా వున్నప్పుడు 1924–25లో కీ.శే. పందిరి మల్లికార్జున రావుగారితో పరిచయం ఏర్పడింది. వారి సలహా ననుసరించి కొమర్రాజు లక్ష్మణరావుగారి భారతదేశ చరిత్ర గ్రంథాలు, చిలుకూరి వీరభద్రరావుగారి ఆంధ్రుల చరిత్ర, వీరేశలింగం, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి గ్రంథాలు చదవడంతో పై భావాలు దృఢపడ్డాయి. 1925లో

చిత్తరంజన్ దాసు మరణించారనే వార్త విని, కాంగ్రెసును గురించీ, అది నడిపే పోరాటాన్ని గురించీ తెలుసుకోవాలని కుతూహలపడ్డాను. రోజూ ఆంధ్ర దినపత్రిక చదవడం ప్రారంభించాను. 1919లో డయ్యరు సేనాని జలియన్‌వాలా బాగ్‌లో జరిపిన మారణహోమాన్ని గురించి కాంగ్రెసు విచారణ కమిటీ ప్రకటించిన రిపోర్టు తెలుగులో వెలువడింది. అది చదివి, బ్రిటిష్ పాలనను ఏవగించుకోసాగాను. 1925 డిసెంబరులో ఒక వ్యక్తిగత విప్లవవాద గ్రూపులో చేరాను. తరువాత గాంధీజీ ఆత్మకథ చదివాను. వారి సంపాదకత్వం క్రింద వెలువడుతున్న "యంగ్ ఇండియా" వారపత్రిక కూడా చదవసాగాను. అప్పటినుంచీ ఖద్దరు ధరించడం ప్రారంభించాను. సాధ్యమైన, తక్కువ అవసరాలతో జీవితాన్ని నియమబద్ధంగా గడపడానికి కృషి చేశాను. క్రమంగా యితర భావ తరంగాలు నా ఆలోచనల్ని పదును పెట్టాయి. 1926లో మద్రాసులో నాల్గవ ఫారం చదువుతూన్నప్పుడు సావర్కార్ జీవితాన్ని గురించి చదివి ఉత్తేజం పొందాను. భారతీయ సంస్కృతిపై పాశ్చాత్య దేశాల్లో అనేక ఉపన్యాసాలిచ్చిన స్వామి వివేకానంద రచనల్ని చదివి, స్వదేశాభిమానాన్నీ, స్వయం శిక్షణనూ అలవరుచుకున్నాను. తిలక్ మాండలే జైల్లో రచించిన "గీతారహస్యం" నాకు కర్తవ్య ప్రబోధం చేసింది. నేను చదువుకొంటున్న హైస్కూల్లో గీతా రహస్యం మీద నేనిచ్చిన ఉపన్యాసం విని, విద్యార్థులూ, ఉపాధ్యాయులూ మెచ్చుకున్నారు. 1927లో జవహర్లాల్ నెహ్రూ రష్యానుంచి తిరిగి వచ్చి, ఆ దేశంలోని సోషలిస్టు వ్యవస్థను గురించి ధారావాహికంగా వ్రాసిన వ్యాసాలు నాలో మొట్టమొదటిసారిగా సోషలిస్టు బీజాలు నాటాయి. సోవియట్ విప్లవం మీద ఆసక్తీ, సోవియట్ సమాజం లాంటిదే మన దేశంలో కూడా ఉంటే బాగుండుననే అభిప్రాయం కలిగాయి. 1927లో మద్రాసులో జరిగిన కాంగ్రెస్ మహాసభ సంపూర్ణ స్వాతంత్ర్యం తన ధ్యేయమని తీర్మానించడం, మరుసటి సంవత్సరం మద్రాసులో సైమన్ కమీషన్‌కి వ్యతిరేకంగా జరిగిన హర్తాళు, బహిరంగ సభ – యివన్నీ నాలో స్వాతంత్ర్యేచ్ఛను యినుమడింప జేశాయి. ఆ రోజున మా హైస్కూలులో చదువుకొంటున్న విద్యార్థులమూ హర్తాళ్‌లో పాల్గొన్నాం.

మద్రాసులో చదువుకొంటున్న రోజుల్లో ప్రతి యేడు వేసవి సెలవుల్లో స్వగ్రామం వెళ్ళేవాణ్ణి. అలా వెళ్ళినప్పుడల్లా సొంతపొలంలో కూలీలతో కలిసి వ్యవసాయ పనులు చేసేవాణ్ణి.

స్కూలు ఫైనల్ ప్యాసయాక 1929లో నేను మద్రాసు లయోలా కాలేజీలో ప్రవేశించాను. ఇంటర్మీడియట్ చదువుతూన్నప్పుడు కొంతమంది తెలుగు విద్యార్థులతో కలిసి సోదర సమితిగా ఏర్పడి, వ్యాయామం, గ్రంథ పఠనం, ఖద్దరు విక్రయం మొదలైన కార్యక్రమాల్లో పాల్గొనేవాడిని. బొంబాయి నుంచి వెలువడే "యంగ్ లిబరేటర్" పత్రికకు యితరులతో కలిసి చందాదారుల్ని చేర్పించాను. అప్పుడే "కమ్యూనిస్టు ప్రణాళిక", "కూలిపని – పెట్టుబడి" మొదలైన మార్క్సిస్టు గ్రంథాలు కూడా చదివాను. ఆనాటినుండి కమ్యూనిస్టు ఉద్యమంలో పనిచేయడానికి నిశ్చయించుకున్నాను.

మీరట్ జైల్లో ప్రారంభమైన కమ్యూనిస్టు కుట్రకేసు విచారణను గురించిన వార్తలు ప్రతిరోజూ పత్రికల్లో వెలువడుతూండేవి. ఆ కేసులో ముద్దాయిలు

ప్రాసిక్యూషన్‌మీద విసురుతున్న సవాళ్ళు, కమ్యూనిజాన్ని గురించీ, కమ్యూనిస్టుల్ని గురించీ ప్రాసిక్యూషన్ చెప్పే అబద్ధాలకు గూబ గుయ్యిమనేటట్లు జవాబులు చెప్పడం, తమ ధ్యేయాన్ని గురించీ, విధానాన్ని గురించీ నిర్మొగమాటంగా బల్లగుద్ది చెప్పడం – అవన్నీ నా ఆలోచనల్ని పదును పెట్టాయి.

ఒక రోజున ఒక విద్యార్థి గాంధీ టోపీతో క్లాసుకు వచ్చి కూర్చున్నాడు. అది చూచి ఒక కాథలిక్ ప్రొఫెసరు ఆ విద్యార్థిని బయటికి పంపివేశాడు. మరునాడు విద్యార్థులందరూ గాంధీ టోపీలతో క్లాసుకు ప్రత్యక్షం! అది చూచి ప్రొఫెసరు క్లాసును సస్పెండు చేశాడు. వాతావరణం ఉద్రిక్తంగా వుంది. సోదర సమితి సభ్యులు యితర విద్యార్థులతో చేతులు కలిపి, సమ్మెకు పిలుపు యిచ్చారు. ఇదంతా గమనిస్తున్న ప్రిన్సిపాల్ తెలివిగా, నోటీసు బోర్డులో ఎవరికి తోచిన టోపీలు వారు ధరించవచ్చునని ప్రకటించాడు. విద్యార్థులకు యిదొక ఘన విజయం.

1930 జనవరి 26 స్వాతంత్ర్య దినోత్సవంనాడు లయోలా కాలేజీ విద్యార్థులందరూ సోదర సమితి సభ్యులతో భుజం భుజం కలిపి ఊరేగింపుగా వెళ్ళి బహిరంగ సభలో పాల్గొన్నారు. ప్రజలందరితో గొంతు కలిపి స్వాతంత్ర్య ప్రతిజ్ఞ తీసుకున్నారు.

ఇంటరు మొదటి సంవత్సరం చదువుతుండగా, మా గ్రామం అలగానిపాడు వెళ్ళాను. అక్కడి వ్యవసాయ కార్మికులతో పని చేయడానికి 1930లో వేమన జయంతినాడు అవర్ణులకు, సవర్ణులకు కలిపి పంక్తి భోజనం ఏర్పాటు చేశాను. సవర్ణులు మా దగ్గర బంధువులు. దీనిని సహించలేక సవర్ణులు కొందరు హరిజనుల్ని రానియ్యకుండా ఆపుచేశారు. భూస్వాములు జరిపిన ఈ చర్యకు అసమ్మతిగా నేను రెండు రోజులు నిరాహారవ్రతం చేశాను. అది పేద ప్రజలలోను, హరిజనులలోను ప్రత్యేక అభిమానం కలిగించింది.

నిరాహారదీక్ష పూర్తికాగానే, సోదర సమితి పిలుపుమీద ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనడానికి పశ్చిమ గోదావరి జిల్లా వెళ్ళాను. భీమవరం తాలూకాలో రెండు చోట్ల చట్టధిక్కారం చేశాను. దిరుసుమర్రు వాలంటీరు శిబిరానికి వచ్చి, అక్కడ వాలంటీరు కెప్టెన్‌గా పనిచేశాను. వాలంటీర్లు గ్రామాల్లో కాంగ్రెసు ప్రచారం చేయడం, విదేశీ బట్టల దుకాణాల వద్ద, కల్లు దుకాణాలవద్ద పికెటింగు చేయడం, తాటిచెట్ల మొవ్వులు నరకడంలాంటి కార్యక్రమం తీసుకొని పని చేసేవారు. నేను కుముదపల్లిలో ఒకేరోజున 22 తాటిచెట్లెక్కి మొవ్వులు నరికివేశాను. ఆ దృశ్యాన్ని చూచిన గ్రామస్థులు అన్నిటికంటే ఎత్తైన చెట్టు ఎక్కి మొవ్వు నరకగలిగినందుకు నన్ను పెద్ద పెట్టున అభినందించారు.

చట్టధిక్కారం చేసినందుకు భీమవరం సబ్ కలెక్టరు 1930 జూన్ 16న నాకు రెండేళ్ళు కఠిన శిక్ష విధించారు. నా వయస్సప్పుడు 17 ఏళ్ళు మాత్రమే. మైనరు కావడంచేత తంజావూరులో బాలనేరస్థుల్ని నిర్బంధించే బోర్‌స్టల్ జైలుకు పంపించారు. ఆ జైల్లో పరిస్థితులు అతి నికృష్టంగా ఉండడం చూచి కొందరితో కలిసి నిరాహారవ్రతం చేశాను. అయిదో రోజున జైలు వార్డర్లు యినప పట్కారుతో నోటిని తెరచి గొంతులో గంజి పోశారు. తరువాత 24 గంటలూ ఒంటి కొట్లో నిర్బంధించారు. రెండు నెలల తరువాత తిరుచినాపల్లి జైలుకి, తిరిగి తంజావూరు బోర్‌స్టల్ జైలుకీ మార్చారు. అక్కడ మళ్ళీ నిరాహార దీక్ష ప్రారంభించడం వల్ల,

రాజమండ్రి జైలుకు మార్చారు. ఆ జైల్లోని యితర రాజకీయ ఖైదీలతో, రష్యా విప్లవాన్ని గురించీ, అలాంటి విప్లవాన్నే మన దేశంలో కూడా నడపడం గురించీ చర్చలు జరిపేవాడిని.

రాజమండ్రి జైలులో లాహోరు కుట్రకేసు ఖైదీలు శివవర్మ, విజయకుమార్ సిన్హాలతో నాకు పరిచయమైంది. వారిది హిందూస్థాన్ సోషలిస్టు రిపబ్లికన్ ఆర్మీ. సోషలిజం సాధనకై వ్యక్తిగత విప్లవాద చర్యలను చేబట్టినవారు. అయితే గాఢమైన దేశభక్తి, అపారమైన ధైర్యసాహసాలు గలవారు. అదే సమయంలో తమ ఉద్యమంలో ద్యోతకమైన బలహీనతలు, అజాగ్రత్తవల్ల కలిగిన నష్టాలు కూడా వారు వివరించారు. ఆ సమాచారం నాకు ఎంతగానో తోడ్పడింది. శివవర్మ తన విప్లవ జీవితంలో ఎలా రహస్యంగా పని చేసిందీ, జరిగిన పొరబాట్లు, విప్లవకారుల్లోని ధైర్యసాహసాలు అన్నీ వర్ణించి చెప్పినారు.

శిక్షాకాలం పూర్తికాకముందే గాంధీ–ఇర్విన్ ఒడంబడిక ప్రకారం, 1931 మార్చి 20వ తేదీన విడుదల చేయబడ్డాము. అప్పుడు మా బావగారు బెంగుళూరులో సెషన్స్ జడ్జీగా ఉండేవారు. అక్కడ సెయింట్ జోసెఫ్ కళాశాలలో ఇంటర్ రెండో సంవత్సరంలో ప్రవేశించాను. అప్పటికి సత్యాగ్రహ పద్ధతిపై నాకు నమ్మకం పూర్తిగా పోయింది. మీరట్ కుట్రకేసు ముద్దాయిల ప్రకటనలు, “కమ్యూనిస్టు ప్రణాళిక”, “కూలిపని – పెట్టుబడి”, “రష్యా విప్లవ చరిత్ర” మొదలైన గ్రంథాలు నాపై గట్టి ప్రభావం కలిగించాయి. ఫలితంగా, 1931 డిసెంబరులో చదువు మానేసి, స్వగ్రామమైన అలగానిపాడు వెళ్ళాను. అక్కడ 1932లో వ్యవసాయ కార్మిక సంఘాన్ని స్థాపించాను. వారిలో అధిక సంఖ్యాకులు హరిజనులవడం చేత ఎల్లప్పుడూ అవర్ణ–సవర్ణసమస్య ఎదురయ్యేది. మాది పలుకుపడిగల కుటుంబ మవడం వల్లా, స్వయంగా నేను చూపిన మార్గదర్శకత్వం వల్లా, వాదనా పటిమవల్లా కూలిరేట్లపై గాని, పంక్తి భోజనాలపై గాని, ఒకే నూతిలో నీళ్ళు తోడుకొనే సమస్యపై గాని ఘర్షణలేవీ జరక్కుండానే ఉద్యమం కొనసాగింది. గ్రామంలో ఒక గ్రంథాలయం, ఒక సహకార విక్రయ సంఘం, ఒక ప్రథమ చికిత్సా కేంద్రం వెలిశాయి. ఈ కార్యకలాపాల్లో కొందరు యువకులు నాకు చేదోడు వాదోడుగా ఉండేవారు.

అమీర్ హైదర్ ఖాన్ కార్యకలాపాలను గురించి విని 1931లో ఆయన్ని కలుసుకోడానికెళ్ళాను. నన్ను కమ్యూనిస్టుగా పని చేయమని సలహా యిచ్చారు. తాను బి.ఏ. పూర్తి చేస్తానని తల్లికి మాట యిచ్చాననీ, అది పూర్తికాగానే తన కాలాన్నీ కమ్యూనిస్టు ఉద్యమంలో గడుపుతాననీ ఆయన చెప్పారు. కాని, బెంగుళూరులో 1931లో ఆరు మాసాలు మాత్రమే చదివి, ఆ చదువువల్ల ప్రయోజనమేమీ ఉండదనుకొని చదువుకు స్వస్తి చెప్పి తిరిగి అలగానిపాడు వెళ్ళాను.

కొన్నాళ్ళ తరువాత అలగానిపాడు విడిచిపెట్టి, ఎక్కడెక్కడ కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణానికి అవకాశాలున్నాయో కనుగొనడానికి 1933–34 మధ్య ఆంధ్ర జిల్లాలు పర్యటించాను. నా జైలు మిత్రుల ద్వారా, సోదర సమితి సభ్యుల ద్వారా ఒక్కొక్కరినే కలుసుకొని మాట్లాడసాగాను. వారిలో కొందరు తూర్పు గోదావరి జిల్లాలో పందిరి మల్లికార్జున రావు, పెన్మెత్స సూర్యనారాయణ, పెన్మెత్స అనంతం; పశ్చిమ గోదావరిలో ఉద్దరాజు రామం, అల్లూరి సత్యనారాయణ, తనికెళ్ళ వెంకట

చలపతి, కలిదిండి సుబ్రహ్మణ్యం; కృష్ణాజిల్లాలో మద్దుకూరి చంద్రశేఖరరావు, చలసాని వాసుదేవరావు, చలసాని జగన్నాథరావు, కొసరాజు శేషయ్య, కాట్రగడ్డ నారాయణరావు, గద్దె లింగయ్య; గుంటూరు జిల్లాలో పోలేపెద్ది నరసింహమూర్తి, జొన్నలగడ్డ రామలింగయ్య, పెండ్యాల లోకనాథం, ప్రతాప రామసుబ్బయ్య, నెల్లూరు జిల్లాలో బస్వారెడ్డి శంకరయ్య మొదలైనవారు.

ఈ కార్యక్రమం కొనసాగిస్తూనే నేను అలగానిపాడుతో సంబంధం వదులుకోలేదు. అక్కడ వ్యవసాయ కార్మిక సంఘాన్ని నడుపుతూనే వచ్చాను.

1934 సెప్టెంబరులో బెజవాడలో ఒక సమావేశం ఏర్పరచాను. దానికి వివిధ జిల్లాల నుంచి ప్రతినిధులు వచ్చారు. వారందరూ "కమ్యూనిస్టు ప్రణాళిక", "ఏమి చేయాలి?", "రాజ్యాంగ యంత్రం – విప్లవం," "వామపక్ష కమ్యూనిజం", "కూలిపని–పెట్టుబడి" మొదలైన గ్రంథాలూ, మీరట్ కుట్రకేసులో కమ్యూనిస్టు నిందితులిచ్చిన సంయుక్త ప్రకటన అధ్యయనం చేసినవారు. ఇవన్నీ అచ్చులో కాక, సైక్లోస్టైల్‌లో కొన్ని, వ్రాతలో కొన్నీ ఉండేవి. వీటిలో నేను అనువదించినవి "కమ్యూనిస్టు ప్రణాళిక", "రాజ్యాంగ యంత్ర–విప్లవం", "ఏమి చేయాలి?", "వామపక్ష కమ్యూనిజం." చివరి గ్రంథాన్ని నండూరి ప్రసాదరావుగారు కూడా అనువదించారు. మద్దుకూరి చంద్రశేఖరరావుగారు "కమ్యూనిస్టు మూల సూత్రాల"ను అనువదించారు. మీరట్ ప్రకటనలోని వేర్వేరు భాగాలను వేర్వేరు వ్యక్తులు అనువదించారు.

పై సమావేశం 7 గురితో ఒక రాష్ట్ర ఆర్గనైజింగ్ కమిటీని ఎన్నుకొంది. నేను, పోలేపెద్ది నరసింహమూర్తి, కొసరాజు శేషయ్య, మద్దుకూరి చంద్రశేఖరరావు, చలసాని వాసుదేవరావు, అల్లూరి సత్యనారాయణ, తనికెళ్ళ వెంకటచలపతి అందులో వున్నాం.

బెజవాడ సమావేశం, రాష్ట్ర మంతటా కూలీరక్షణ సమితుల్ని ఏర్పరచి వాటిద్వారా కార్మికుల్లో పని చేయాలనీ, తెలుగులో ఉన్న మార్క్సిస్టు గ్రంథాల ద్వారా యువతీ యువకుల్లో కమ్యూనిస్టు చైతన్యం కలిగించాలనీ తీర్మానించింది.

1934 జులైలో అమీర్ హైదర్ ఖాన్ విడుదలయ్యారని తెలుసుకొని, మద్రాసు వెళ్ళాను. ఆయనకు మా కార్యకలాపాలను వివరించి చెప్పాను. అవి విన్న మీదట ఖాన్, తనతో బొంబాయి రావలసిందనీ, కేంద్ర కమిటీకి పరిచయం చేస్తాననీ చెప్పారు. తాను అరెస్టయితే కేంద్ర కమిటీ సమావేశానికి హాజరుకమ్మని కూడా చెప్పారు. తరువాత ఖాన్ అరెస్టయ్యారు. ఆయన చెప్పిన ప్రకారం 1934 అక్టోబరులో జరిగిన కేంద్ర కమిటీ సమావేశానికి హాజరయ్యాను.

అప్పటికి మీరట్ కుట్రకేసు ఖైదీలందరూ విడుదలై వచ్చారు. కాని దేశంలో ముఖ్య పాత్ర వహిస్తున్న బొంబాయి గ్రూపు చీలిపోయి వుంది. కేంద్ర కమిటీ సమావేశం బొంబాయి గ్రూపును ఐక్యపరచడమే కాక, ఒక సమష్టి రాజకీయ పంథాను రూపొందించింది. నేను మద్రాసు రాష్ట్ర (ఆంధ్ర, తమిళ, మలబారు) కార్యకలాపాలను పర్యవేక్షిస్తూ, ఆ రాష్ట్రానికి ప్రతినిధి (కార్యదర్శి)గా, వ్యవహరించాలని తీర్మానించబడింది.

తరువాత నేను 1934 అక్టోబరులో మద్రాసు రాష్ట్రంలో పార్టీ పరిస్థితిని గూర్చి కేంద్ర కమిటీ కొక రిపోర్టు పంపించాను.

# ఆంధ్ర కమ్యూనిస్టుపార్టీ తొలి కార్యదర్శి

# కామ్రేడ్ పోలేపెద్ది నరసింహమూర్తి

- ముత్తేవి మాధవాచారి



కామ్రేడ్ పోలేపెద్ది నరసింహమూర్తి సనాతన వైదిక కుటుంబంలో తెనాలిలో జన్మించారు. తండ్రి సుబ్బారావు, తల్లి లక్ష్మమ్మగార్లు. వీరికి 4గురు మగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు. నరసింహమూర్తి రెండవ కుమారుడు. పెద్దవాడు సూర్యనారాయణ. ఆయన మేదకుడు. వివాహం కాలేదు. మూడవవాడు కృష్ణమూర్తి. నాలుగు శివరామప్రసాదు. రాజేశ్వరి, నటేశ్వరి ఆడపిల్లలు నరసింహమూర్తికి 1930 ప్రాంతంలో కృష్ణాజిల్లా పెదవుటపల్లి గ్రామంలో శ్రీమతి లలితాంబగారితో వివాహం జరిగింది. వీరికి అన్నపూర్ణ, విజయలక్ష్మి అను ఇద్దరు ఆడపిల్లలు.

నరసింహమూర్తి 1931 శాసనోల్లంఘన ఉద్యమంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించారు. జైలులో వీరికి 'బి' క్లాసు సౌకర్యం కలిగిస్తే, దానిని నిరాకరించి 'సి' క్లాసు ఖైదీలతోనే కలిసి వుండేవారు. ఆ తరువాత ఇంకొకసారి జైలుకు వెళ్ళినట్లు వీరి పెద్దమ్మాయి అన్నపూర్ణ అంటుంది. వివరాలు లేవు.

అంతకుముందే హైస్కూలు చదువు పూర్తిచేసిన నరసింహమూర్తి జైలునుంచి వచ్చిన తరువాత పి.వి. శివయ్య, పి.వి. రాఘవయ్యగార్లతో కలిసి బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో పైచదువు కొరకు కాశీ వెళ్ళారు. అక్కడ చదువుతో కమ్యూనిస్టు గ్రూపుతో సంబంధాలు పెట్టుకొని, చండ్ర రాజేశ్వరరావు, చండ్ర రామలింగయ్య, పి.వి. రాఘవయ్యగార్లతో కలిసి, 1932-33లోనే మార్క్సిస్టు సాహిత్యాన్ని కూడా అధ్యయనం చేయటం ప్రారంభించారు.

ఒకవైపు కాంగ్రెస్ నాయకత్వం స్వాతంత్ర్యం కొరకు జరిపిన పోరాటం విఫలమై రాజీ సంప్రదింపులు జరుపుతూ వుండటంవల్ల అసంతృప్తి, రెండోవైపు మార్క్సిస్టు అవగాహనతో విప్లవ కార్యక్రమంవైపు ఉత్సాహంతో కార్మికవర్గంలో పనిచేయాలనే దృఢ నిశ్చయంతో చదువుమాని తెనాలి చేరుకున్నారు. 1934లోనే నరసింహమూర్తి గుంటూరులో జొన్నలగడ్డ రామలింగయ్య, మాడభూషి వెంకటాచారిగార్లతో కలిసి

గుంటూరు జిల్లా కమ్యూనిస్టు గ్రూపుగా ఏర్పడ్డారు. సత్యాగ్రహోద్యమంలో పాల్గొని జైళ్ళనుండి బైటకి వచ్చిన యువకులతో సంబంధాలు పెట్టుకొని కమ్యూనిస్టు పార్టీ స్థాపనకు ప్రయత్నాలు ప్రారంభించారు.

ఇదిలావుండగా పుచ్చలపల్లి సుందరయ్యగారి కృషి ఫలితంగా 1934 సెప్టెంబర్‌లో రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలకు చెందిన కామ్రేడ్స్ విజయవాడలో సమావేశమై 7గురు సభ్యులతో రాష్ట్ర కమ్యూనిస్టు ఆర్గనైజింగ్ కమిటీని ఎన్నుకున్నారు. ఈ కమిటీకి సుందరయ్య కార్యదర్శి. నరసింహమూర్తి కమిటీ సభ్యులలో ఒకరు.

1935 ఏప్రిల్ 17వ తేదీన గుంటూరు జిల్లా కమ్యూనిస్టుల మొదటి సమావేశం జరిగింది. ఆ సమావేశానికి నరసింహమూర్తి, దొన్నులగడ్డ రామలింగయ్య, మాడభూషి వెంకటాచారి, ప్రతాప రామసుబ్బయ్య, పెండ్యాల లోకనాథం, కుందేటి రామకోటి, మందా పుల్లారావు, పి.వి. శివయ్య, ముత్తేవి మాధవాచార్య, మరికొందరు మొత్తం 17 మంది పాల్గొన్నారు. 5గురితో జిల్లా కమిటీ ఎన్నుకోబడింది. దీనికి నరసింహమూర్తి కార్యదర్శిగా ఎన్నికైనారు.

1936 సెప్టెంబర్‌లో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ద్వితీయ మహాసభ రాజమండ్రిలో జరిగింది. ఈ మహాసభలో రాష్ట్ర కార్యవర్గసభ్యుడుగా ఎన్నికయ్యారు. ఈ మహాసభ సందర్భంలో రాజమండ్రి శ్రద్ధానందఘాట్‌లో జరిగిన బహిరంగసభలో సుందరయ్య చేసిన ఉపన్యాసం రాజద్రోహాన్ని, వర్గద్వేషాన్ని పురికొల్పేదిగా వుందని ఆయనను అరెస్టు చేశారు. అందువల్ల నరసింహమూర్తి రాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శి బాధ్యతలను కూడా స్వీకరించారు.

దొన్నులగడ్డ రామలింగయ్య, మాడభూషి వెంకటాచారి, ప్రతాప రామసుబ్బయ్య గార్లతో గుంటూరులో ఒక పార్టీ పెట్టి (శాఖ), కొత్తమాసు సత్యనారాయణ, ముత్తేవి మాధవాచార్య, పోలేపెద్ది కృష్ణమూర్తి, కాకుమాను నారాయణరావుగార్లతో తెనాలిలో ఒక సెల్లు ఏర్పరచారు. ఆ కామ్రేడ్స్ గుంటూరు, తెనాలి పట్టణాలలో ప్రెస్‌వర్కర్స్, మున్సిపల్, బండ్ల ముఠా కార్మికులలో సంఘాలు పెట్టి, వారి సమస్యల పరిష్కారానికి కృషి చేసేవారు.

నరసింహమూర్తి జిల్లా, రాష్ట్ర బాధ్యతలు చూస్తూనే ఈ సెల్లుల సమావేశాలు, వారి పనిపాటలు సమీక్షించి పలకరిస్తూ వుండేవాడు. దీనితోపాటు పుస్తకాలు, పత్రికలు సేకరించాడు. వాటిని అభిమానులకు అందజేసి తిరిగి వాటిని తీసుకువచ్చే బాధ్యతలు సెల్లు సభ్యులకు అప్పగించేవారు. కమ్యూనిస్టు పార్టీ నిషేధించబడి వున్నందున పుస్తకాలు, పత్రికలు తెప్పించటానికి ప్రత్యేక బాధ్యత తీసుకొనేవారు. సైక్లోస్టైల్ చేసిన కమ్యూనిస్టు తెలుగు, ఇంగ్లీషు పత్రికలు, లండన్ నుంచి వెలువడే రష్యా టుడే, ఇంటర్‌నేషనల్ ఎఫైర్స్ లాంటివి వచ్చేవి. ఆ విదేశీ పత్రికలు ఇంద్రిక సాంబయ్యగారు వారిపేర్లతో పోస్టు తెప్పించి నరసింహమూర్తికి అందజేసేవారు.

నరసింహమూర్తిగారి కుటుంబానికి తెనాలి తూర్పు పొలంలో 12 ఎకరాల మాగాణి, పట్టణ నడిబొడ్డున పెద్ద పెంకుటిల్లు, స్థలం కూడా వుండేవి. కుటుంబం పెద్దది కావటం, సంపాదనపరు లెవ్వరూ లేకపోవటంతో భూమి మీద వచ్చే ఆదాయం చాలక కౌలుదారువద్దనే అప్పుతెస్తూ, దానిక్రింద ఆయనకే కొంత పొలం అమ్ముతూ వుండేవారు. అందువల్ల నరసింహమూర్తి నాన్నగారు వుండగానే కొంతభూమి

అమ్మివేయటం జరిగింది. నరసింహమూర్తి [illegible] ఖర్చులేకాక; పార్టీ పుస్తకాలు, సమయానికి వచ్చిన కామ్రేడ్స్‌కి భోజనాలు వగైరా పార్టీ ఖర్చులు కూడా పెరిగాయి. దానితో క్రమంగా మిగతా భూమి, ఇల్లు, స్థలం కూడా అమ్మటం జరిగింది. చివరిగా ఇల్లు అమ్మిన డబ్బు పార్టీకివ్వాలని నరసింహమూర్తి అంటే, భార్యకేమీ యివ్వవా అని లలితాంబగారి సోదరులు పట్టుపట్టారు. అప్పుడు కొంత డబ్బుయిస్తే, దానితో ఒక ఎకరం పొలం లలితాంబ పేర ఆమె సోదరులు కొన్నారు. నరసింహమూర్తి కుటుంబం ఎంత కటిక దారిద్ర్యం అనుభవించారంటే – ఒక్కోసారి తినడానికి తిండి కూడా లేక పస్తులుండేవారు. ఒక్కోసారి అన్నంలోకి ఏమీలేక ఉప్పునీళ్ళు కలుపుకొని తినేవారు.

విరామం లేకుండా రాత్రింబగళ్ళు పార్టీ కార్యకలాపాలు చూస్తూ ఆరోగ్యం చూచుకోటం నిర్లక్ష్యం చేయటంవల్ల క్రమేణా ఆరోగ్యం చెడింది. ఆయనకు పళ్ళవ్యాధి కూడా వుంది. వీటి ఫలితంగా ఆరోగ్యం దెబ్బతింది. కొంతకాలం వివిధ డాక్టర్లవద్ద మందులు తిని, చివరిగా ప్రకృతి వైద్యం కొరకు తమిళనాడు వెళ్ళారు. అక్కడ అంబత్తూరు ప్రకృతి చికిత్సాలయంలో వైద్యం చేయించుకొంటూ అక్కడే 1947 డిశంబర్ 7న కన్ను మూశారు. నరసింహమూర్తి చనిపోయినపుడు వారి పెద్దమ్మాయి అన్నపూర్ణ మాత్రం దగ్గరవుంది. తరువాత ఆ అమ్మాయిని కంభంపాటి సత్యనారాయణ (సీనియర్), కాట్రగడ్డ రాజగోపాలరావుగార్లు తీసుకొనివచ్చి పెదవుటపల్లిలోని తల్లి మేనమామలకు అప్పగించారు. ఆ తరువాత మేనమామలే ఇద్దరు ఆడపిల్లలకు వివాహాలు చేశారు. ప్రస్తుతం వారి పెద్దమ్మాయి అన్నపూర్ణ వరంగల్లులో వుంది. భర్త చనిపోయాడు. ఆమెకు 5గురు మగపిల్లలు, ఇద్దరు ఆడపిల్లలు, రెండో అమ్మాయి విజయలక్ష్మి 1969లో చనిపోయింది. ఆమెకు ఒక ఆడపిల్ల. నరసింహమూర్తి భార్య లలితాంబ 1968లో చనిపోయారు.

కమ్యూనిస్టు ఉద్యమంకోసం, పీడిత ప్రజల విముక్తికోసం తన సర్వస్వం ధారపోసిన విప్లవమూర్తి నరసింహమూర్తి. ఆయన చిరస్మరణీయుడు. ఆయనకివే జోహార్లు.

★ ★ ★

# కీ.శే. చంద్ర రాజేశ్వరరావు



గుంటూరు, కృష్ణా జిల్లాలలో శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొని, గాంధీ–ఇర్విన్ ఒడంబడిక తర్వాత ఉద్యమం నీళ్ళు కారిపోవడంతో, కొందరు యువకులు కొత్తమార్గాలు వెతుక్కుంటూ, బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో విద్యార్థులుగా ప్రవేశించారు. అట్టి వారిలో ముఖ్యులు కీ.శే. పోలేపెద్ది నరసింహమూర్తి, కీ.శే. పులుపుల వెంకట శివయ్య, కాట్రగడ్డ నారాయణరావు, నండూరి ప్రసాదరావు మరికొందరున్నారు. మరికొందరు స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొనకపోయినా, అందుకు సరైన మార్గాలు బెనారస్ విశ్వవిద్యాలయంలో తెలుసుకోవచ్చు ననుకొన్నారు. అంతేకాక, ప్రపంచంలో దారిద్ర్యాన్నీ, నిరుద్యోగాన్నీ నిర్మూలించుటకు మార్గాలు సూచించగలవారు అక్కడున్నారని భావించారు. ఇట్టి వారిలో ముఖ్యులు చంద్ర రాజేశ్వరరావు, రామలింగయ్య (మంగళాపురం), పొన్నం వీర రాఘవయ్య (విజయవాడ), యాళ్ళబండి పోలిశెట్టి (భీమవరం) మొదలైనవారు. వీరిలో రాజేశ్వరరావు, వీర రాఘవయ్యగారలు ఐదారేళ్ళు బెనారస్ యూనివర్సిటీలో వున్నారు (1930–31 నుంచి).

రాజేశ్వరరావు ఒక సోవియట్ పత్రిక కిచ్చిన ఇంటర్వ్యూలో యిలా అన్నారు:

"నాలో చెలరేగే అనేక ప్రశ్నలకు భారత జాతీయ కాంగ్రెసులో సంతృప్తికరమైన సమాధానం దొరకలేదు. నేను 1931లో ఉత్తర భారతానికి వెళ్ళాను. అప్పటికే అక్కడ పెద్ద రాజకీయ సంచలనం ఏర్పడి వుంది. ఉన్నత విద్యకై బెనారస్ విశ్వవిద్యాలయంలో చేరాను. దేశంలో వున్న కమ్యూనిస్టు నాయకుల్ని బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రభుత్వం అప్పటికే అరెస్టుచేసి, వారిపై మీటర్ కుట్ర కేసు నడుపుతోంది. బాల్యదశలో వున్న కమ్యూనిస్టు ఉద్యమాన్ని పాతమార్చడమే వారి లక్ష్యం. ముద్దాయిలుగా వున్న ఈ కమ్యూనిస్టు నాయకులు బ్రిటిష్ సామ్రాజ్యవాదాన్ని తెగనాడుతూ చేసిన సుదీర్ఘ ప్రకటనలు చదవడంతో నేను కమ్యూనిస్టు ఉద్యమానికి సన్నిహితుడనయ్యాను. సంబంధా లేర్పడినాయి. వారి ప్రకటనలవల్ల మనదేశ ప్రజల జీవితాలను సుఖప్రదం చేసే మార్గమేమిటో బోధపడింది. 1931వ సంవత్సరంలో మేము యంగ్ కమ్యూనిస్టు లీగ్‌ను స్థాపించాం. వివిధ కార్యకలాపాలు సాగించాం. మార్క్స్, ఎంగెల్స్, లెనిన్‌ల రచనలను ఉత్సుకతతో చదివేం. ఆ తరువాత, 1934లో నేను కమ్యూనిస్టు పార్టీలో పూర్తి సభ్యునిగా చేరాను. ఆనాటి నుండి లెనిన్ భావాలు, ఆయన విశిష్ట వ్యక్తిత్వం, విప్లవ లక్షణాలు; అలాగే మార్క్స్, ఎంగెల్స్‌ల విప్లవ జీవితాలు నా జీవితాన్ని ఉత్తేజపరుస్తూ వచ్చాయి" ("సోషలిజం, సిద్ధాంతం, ఆచరణ" అను పత్రిక కిచ్చిన ఇంటర్వ్యూ).

బెనారస్ యూనివర్సిటీ లైబ్రరీలో వేదాలు మొదలు కమ్యూనిజం వరకు ఎన్నో గ్రంథాలుండేవి. ప్రభుత్వం నిషేధించిన పుస్తకాలు కూడా వుండేవి. ఇవి మమ్మల్ని ఎంతగానో ఉత్తేజపరచాయి. మాకు కాశీ విశ్వవిద్యాలయం ఒక స్వతంత్ర రాజ్యమా అనిపించింది. పోలీసులను విశ్వవిద్యాలయ అధికారులు తమ అనుమతి లేకుండా లోపలకు రానిచ్చేవారు కారు. విశ్వవిద్యాలయంలో అన్ని రాజకీయాభిప్రాయాలు కలవారుండేవారు.

పోలీసులు అప్పుడప్పుడు నిషిద్ధ గ్రంథాలకోసం హాస్టల్ గదులు సోదా చేయడానికి వచ్చేవారు. ఆ విషయం ముందుగా కనిపెట్టి నిషిద్ధ గ్రంథాల్ని చాకచక్యంగా దాటవేసేవారం.

మీరట్ కుట్ర కేసు ముద్దాయిలకు విధింపబడ్డ దీర్ఘకాల శిక్షలను హైకోర్టు తగ్గించడంవల్ల ఒక్కొక్కరే విడుదలై వచ్చారు. వారిలో కొందరు యూనివర్సిటీ విద్యార్థుల ఆహ్వానంపై బెనారస్ యూనివర్సిటీకి వచ్చి కమ్యూనిజాన్ని గురించి ఉపన్యాసా లిచ్చేవారు. వారిలో ముఖ్యులు ఠోగ్లేకర్, జోషి, డాంగేలు. ఠోగ్లేకర్ "గాంధీ–చర్ఖా" అనే విషయంపై యిచ్చిన ఉపన్యాసం విని పోలేపెద్ది నరసింహమూర్తి ప్రభావితుడయ్యారు. విడుదలైనవారిలో హచిన్ సన్ బ్రిటిష్ పౌరుడు. ఆయనను సన్మానించడానికి నిశ్చయింపబడింది. మాలవ్యా అనుమతి యిచ్చారు.

సోషలిస్టు స్టడీ సర్కిల్‌తో బాటు, యంగ్ కమ్యూనిస్టు లీగ్ కూడా ఉండేది. అందులో సభ్యులు 50 మంది కమ్యూనిస్టు పార్టీలో సభ్యులు.

జవహర్లాల్ నెహ్రూ 1943లో సోషలిజాన్ని గురించీ, స్వాతంత్ర్య సమరంలో కార్మిక–కర్షకుల పాత్రను గురించీ, వర్గ సంఘాలు – వర్గ పోరాటాల గురించీ

వ్రాసిన మూడు వ్యాసాలు ("భారతదేశం ఎటు పయనించాలి?") మా బెనారస్ గ్రూపును ఆకర్షించాయి. సోషలిస్టు స్టడీ సర్కిల్ తరపున కొందరు ఆయనను ఇంటర్వ్యూ చేశారు. వా రడిగిన ప్రశ్నల కాయన సమాధానా లిచ్చారు.

మేము ఆర్.ఎస్.ఎస్.కి. పోటీగా వ్యాయామం, డ్రిల్లు చేసేవారం. ఆ రోజుల్లో అన్ని యూనివర్సిటీలలో విద్యార్థులకు యు.టి.సి. (యూనివర్సిటీ ట్రెయినింగ్ కోర్) అంటూ ఒక సైనిక శిక్షణ దళం ఉండేది. అందులో చేరిన వారంతా రైఫిల్ షూటింగ్ నేర్చుకోవచ్చు. దీన్ని అవకాశంగా తీసుకొని, ఆర్.ఎస్.ఎస్ తన సభ్యులందరినీ యు.టి.సి.లో చేర్పించింది. దీనివల్ల కలిగే ప్రమాదాన్ని గుర్తించి, మా కమ్యూనిస్టు గ్రూపు కూడా యు.టి.సిలో చాలా మందిని చేర్పించింది. సభలు, సమావేశాల్లో మా మధ్య ఘర్షణలు జరిగేవి. క్రమశిక్షణను ఉల్లంఘించారనే కారణం చెప్పిన మేము వారినీ, వారు మమ్మల్నీ అవకాశం దొరికినప్పుడల్లా గార్డ్ రూంలో నిర్బంధించేవాళ్ళం.

విద్యార్థుల్లోను, అధ్యాపకుల్లోను కుల, మత, దురభిమానాల్ని రూపుమాపేటందుకు యంగ్ కమ్యూనిస్టు లీగ్ సహపంక్తి భోజనాలను ఏర్పాటు చేసేది.

బెనారస్ గ్రూపులో కొందరు ఏటా వేసవి సెలవుల్లో యిళ్ళకు వచ్చేవారం. సెలవు లయాక తిరిగి బెనారస్ వెళ్ళేవారం. ఆ విధంగా వచ్చే పోయే వారిలో కొందరిని (ఉదా. పొన్నం వీరరాఘవయ్య, కాట్రగడ్డ నారాయణరావు) సుందరయ్యగారు కలుసుకొని మాట్లాడేవారు. "1933 వేసవి సెలవుల్లో నేను మా గ్రామంలో ఉంటూండగా, సుందరయ్యగారు 10 మైళ్ళు నడిచి అక్కడికి వచ్చి నాతో రెండు రోజులుండి చర్చలు జరిపారు" అని రాఘవయ్యగారు తెలిపారు. 1934 వేసవి సెలవుల్లో రాఘవయ్యగారు యింటికి వచ్చి రయజనోవ్ వ్యాఖ్యానంతో వెలువడ్డ "కమ్యూనిస్టు ప్రణాళిక"ను టైపు చేయించారు. దానికైన ఖర్చు కాట్రగడ్డ నారాయణరావుగారు భరించారు. దాని కాపీలు ఆంధ్రలో చాలామందికి పంచబడ్డాయి. అలాగే యితర సోషలిస్టు, కమ్యూనిస్టు సాహిత్యం ఆంధ్రలో అభ్యుదయ భావాలుగల చాలామంది యువకుల కందచేయబడింది.

మెడికల్ కాలేజీలో విద్యార్థిగా వున్న నేను విశాఖపట్నంలోని విద్యార్థి గ్రూపుల్ని సంఘటితపరచి నడిపేవాణ్ణి. ఒకటి యూనివర్సిటీ గ్రూపు, రెండు మెడికల్ కాలేజీ గ్రూపు. యూనివర్సిటీ గ్రూపులో అశ్వనీకుమార దత్తు, ఉమారాజేశ్వరరావు కూడా ఉండేవారు. మెడికల్ కాలేజీ గ్రూపులో ముఖ్యులు సి. సూర్యనారాయణ, కె. వెంకట్రామశాస్త్రి, జి. రామకోటేశ్వరరావు, కీ.శే. సోమయ్య, చలపతి నాయుడు, రంగయ్య మొదలైనవారు ఉండేవారు.

★ ★ ★

# కీ.శే. మద్దుకూరి చంద్రశేఖరరావు

- పరకాల పట్టాభిరామారావు



శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు 1907లో కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా వెంట్రప్రగడలో సామాన్య రైతు కుటుంబంలో జన్మించారు. వీరి తండ్రి పేరు సుబ్బయ్య, తల్లి పేరు పూర్ణమ్మ. వీరికి ముగ్గురు సోదరులు, ఒక సోదరి. వెంట్రప్రగడలో స్కూల్ ఫైనల్ వరకు చదివారు. తర్వాత బందరులోని జాతీయ కళాశాలలో మెకానికల్ ఇంజనీరింగ్ కోర్సులో చేరారు.

## జాతీయోద్యమంలో:

1929లో గాంధీజీ ఆంధ్రప్రదేశ్ పర్యటనకు వచ్చినప్పుడు ఆయన చేసిన జాతీయోద్యమ ప్రబోధంతో ఉత్తేజితులై, 1930 ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొన్నారు. ఆ సందర్భంలో అరెస్టయి, పామర్రు మెజిస్ట్రేటు కోర్టులో 3 నెలలు కఠినశిక్ష విధించబడి, రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపబడ్డారు. జైలునుండి విడుదలైన తర్వాత విదేశ వస్త్ర బహిష్కరణ ఉద్యమంలో పాల్గొన్నారు.

1928లోనే సైమన్ కమీషన్‌కు నల్లజెండాలు చూపేందుకు యువకులను సమీకరించారు.

1932 ఏప్రిల్‌లో వ్యష్టి సత్యాగ్రహోద్యమంలో పాల్గొన్నారు.

ఆ సందర్భంలో రహస్య కరపత్రాలు ప్రచురించటం ప్రారంభించారు. దాంతో వెంట్రప్రగడలో తిష్టవేసిన ప్యూనిటివ్ స్క్వాడ్స్ గ్రామం మొత్తానికి జరిమానాలు వేస్తూ, ఆయనను పట్టివ్వమని పోరుపెట్టారు. ఎవరూ పట్టివ్వలేదు. మొత్తంమీద బుడమేరు పాయలలో ఆయనను పట్టుకొని 'వైట్ సార్జెంట్' (యూరోపియన్ కెప్టెన్) రహస్యాలు బైటపెట్టమని బాధించి, నోటివెంట నురుగు, రక్తం కక్కేదాకా చిత్రహింసలు పెట్టారు.

ఆ విషయం తెలిసిన మిసెస్ కెప్టెన్ ఆయనను తీసుకెళ్ళి చికిత్స చేయించారు. అనంతరం గుడివాడ డిప్యూటీ కలెక్టరు రెండేళ్ళ కఠినశిక్ష, జరిమానాలు విధించారు. తిరిగి రాజమండ్రి, అటు పిమ్మట బళ్ళారి జైలుకు పంపబడ్డారు.

1933 అక్టోబరులో గాంధీజీ హరిజనోద్యమ సందర్భంలో ఉపవాసం జరుపుతున్న సందర్భంలో, జైలు నుండి విడుదలయ్యారు. హరిజన సేవక్ సంఘాలలో పనిచేసి, హరిజనుల దేవాలయ ప్రవేశానికి కృషి చేశారు.

1935–36లో జిల్లా కాంగ్రెస్ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. వామపక్ష కాంగ్రెసు వాదులు – సోషలిస్టులు కమ్యూనిస్టులు కలిసి ఏర్పరచిన కాంగ్రెసు సోషలిస్టుపార్టీలో పనిచేస్తూ అనేకమంది యువకులను సమీకరించారు. 1930–32ల్లో జైలులో ఉండగానే టెర్రరిస్టు విప్లవకారులతో పరిచయాలు కల్గాయి. మార్క్సిస్టు సాహిత్యాన్ని అధ్యయనం చేశారు. విడుదలకాగానే రాష్ట్రంలో కమ్యూనిస్టు ఉద్యమ స్థాపనకు ఇతరులతో కలిసి కృషి ప్రారంభించారు. 1937లో ప్రారంభమైన పార్టీ పత్రిక నవశక్తికి సంపాదకులుగా పనిచేశారు.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో ప్రభుత్వ నిర్బంధ విధానం ప్రారంభమై పత్రికను మూసేవరకు సంపాదకులుగా వున్నారు.

పిమ్మట కమ్యూనిస్టు పార్టీ రహస్య పత్రిక 'స్వతంత్ర భారత్'కు సంపాదకత్వం వహించారు. 1939–42 మధ్య అజ్ఞాతవాసం గడిపారు.

కమ్యూనిస్టు పార్టీకి బహిరంగ అవకాశాలు వచ్చిన తర్వాత పార్టీ ప్రారంభించిన 'ప్రజాశక్తి' వారపత్రికకు 1942–45 వరకు సంపాదకత్వం వహించారు.

1946లో ప్రజాశక్తి దినపత్రికగా మారినప్పటి నుండి 1948 నిర్బంధ కాలంవరకు దాని సంపాదకులుగా వున్నారు.

1948 జూన్ 1న డి.ఎస్.పి. థామస్ ఆయనను బుద్ధవరంలో అరెస్టుచేసి, రహస్య సమాచారం చెప్పించేందుకు ఆయనను స్పెషల్ ఆర్మడ్ పోలీస్‌చేత రక్తం కక్కేలా చిత్రహింసలు పెట్టించారు. అయితే, "నువ్వు నాకు శత్రువ్వి. నీకు చెప్పేదేమీ వుండ"దంటూ స్పృహ కోల్పోయారు. థామస్ ఆయనను చిత్రహింసలు పెట్టి, విజయవాడ పోలీసు క్యాంపుకు తెచ్చి, అక్కడినుండి రాజమండ్రి జైలుకు పంపారు. ఆ జైల్లో ఎ.కె. గోపాలన్ 'సెగ్రిగేషన్' రద్దు చేసేదాకా సాగిన నిరాహార దీక్షలో శ్రీ చంద్రం పాల్గొని విజయం సాధించారు.

1948 డిశంబరులో కడలూరు జైలుకు మార్చబడ్డారు. ఆ జైలులోనే అప్పుడు రెండుసార్లు జరిగిన కాల్పులలో కొందరు కామ్రేడ్స్ చనిపోయారు. కొందరు గాయపడ్డారు. అప్పుడు అక్కడివారికి నాయకత్వం వహించారు. తండ్రి చనిపోగా, పెరోల్ మీద విడుదలయ్యారు.

1952లో విశాలాంధ్ర దినపత్రిక ప్రారంభమైంది. అప్పటినుండి 1957 వరకు ప్రధాన సంపాదకులుగా ఉన్నారు.

తిరిగి 1964 నుండి 68 వరకు విశాలాంధ్ర సంపాదకులలో ఒకరుగా ఉన్నారు.

1951లో రాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శిగా ఎన్నికై 1956 వరకు కొనసాగారు. 1948 నుండి 51 వరకు అఖిల భారత పార్టీ పొలిట్ బ్యూరో సభ్యులుగా ఉన్నారు.

1964 నుండి 70 వరకు తిరిగి రాష్ట్ర సమితి సభ్యులుగాను, రాష్ట్ర కంట్రోల్ కమిషన్ సభ్యులుగాను వున్నారు.

మార్క్సిస్టు దృక్పథంతో తెలుగు సాహిత్య విమర్శనకు చంద్రంగారు ఆద్యులు. వారు రాసిన నవ్యాంధ్ర సాహిత్య వీధులు, వీరేశలింగం సాహిత్యం – రాయిష్టలు, ఆంధ్ర సాహిత్యంలో కొత్త పోకడలు, తెలుగుతల్లి హృదయ వేదనలు మొన్నగు సాహిత్య వ్యాసాలు పేరు ఎన్నికగన్నాయి.

ప్రజా నాట్యమండలిని తీర్చిదిద్దడంలో, మా భూమి మున్నగు ప్రఖ్యాత నాటకాలకు మెరుగులు దిద్దడంలో, నాటకరంగంలో స్త్రీ పాత్రలను స్త్రీలచే ధరింప చేయడంలో చంద్రంగారు ఎంతో కృషి చేశారు. వీరేశలింగం, గురజాడ, గిడుగు, కొమర్రాజు మున్నగువారు ప్రారంభించిన ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనాన్ని ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమంలో కొనసాగించడంలో చంద్రంగారు అద్వితీయ కృషి చేశారు.

చంద్రం గారి భార్య శ్రీమతి పుణ్యావతి, కృష్ణాజిల్లా కమ్యూనిస్టు నాయకులలో ఒకరైన మైనేని లక్ష్మణస్వామిగారి సోదరి. జిల్లా మహిళా కమ్యూనిస్టు ఉద్యమాలలో పని చేశారు. 48–52 నిర్బంధ కాలంలో పోలీసుల నిర్బంధకాండను ఎదుర్కొన్నారు.

శ్రీ మద్దుకూరి దంపతులు 1968లో మంగోలియా జాతీయ దినోత్సవాలకు హాజరై, సోవియట్ యూనియన్‌లో పర్యటించారు. శ్రీమతి పుణ్యావతి 1970లో మరణించారు. చంద్రంగారు 1974 జులై 26వ తేదీన మరణించారు. వీరి ఇద్దరు కుమార్తెలలో పెద్ద కుమార్తె శ్రీమతి మంజరి విశాలాంధ్ర దినపత్రికలో సీనియర్ సబ్ ఎడిటర్‌గా పనిచేస్తున్నారు.

## తెలుగునాట కమ్యూనిస్టు జర్నలిజానికి పితామహుడు:

భారతీయ పత్రికా రచన జాతీయోద్యమంలో ఒక భాగంగా తొలి దశలో దేశభక్తియుతమైన కర్తవ్యం నిర్వర్తించింది. దేశ ప్రజలలో జాతీయ చైతన్యాన్ని రగుల్కొలిపింది. కాని, అటుపిమ్మట ఎక్కువ జాతీయ పత్రికలు పెట్టుబడిదారీ వ్యాపారంలో ఒక భాగంగా, ఆ వర్గప్రయోజనాల ప్రచారసాధనాలుగా తయారయ్యాయి. గుత్తపెట్టుబడిదారీ గొలుసు పత్రికలు అవతరించాయి. అనేక పత్రికలు విప్లవ ప్రతీఘాత శక్తులకు అలంబనగా ఉన్నాయి.

స్వాతంత్ర్యం రాకముందే ప్రారంభమైన ఈ పరిణామం స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత మరింత త్వరితగతిని జరిగింది. మరింత ప్రస్ఫుటంగా బహిర్గతమైంది.

ఈ విధంగా భారతీయ పత్రికా రచన అటు పెట్టుబడిదారీ వర్గ ప్రచార సాధనంగా మారి, అనేక పరిశ్రమలలో ఒక పరిశ్రమగా ఒక పాయ; జాతీయోద్యమ లక్ష్యాల పరిపూర్తికి దేశభక్తియుత కర్తవ్యాన్ని నెరవేర్చవలసిన ప్రగతిశీల ప్రజాతంత్ర విప్లవ ప్రచార సాధనంగా మరొకపాయగా చీలిపోయే యుగసంధిలో తెలుగుదేశ కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతలలో ఒకరైన శ్రీ మద్దుకూరి చంద్రశేఖరరావు గారు పత్రికారంగంలో ప్రవేశించారు. వామపక్ష అభివృద్ధికర పత్రికా రచనకు ఆద్యులయ్యారు. శ్రామికజన పక్షపాతంగల కమ్యూనిస్టు జర్నలిజానికి పితామహులయ్యారు. జాతీయోద్యమం తొలి అర్ధభాగంలో పత్రికలద్వారా, పత్రికా రచనల ద్వారా జాతీయ చైతన్యాన్ని, దేశభక్తిని రగిలించిన దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు, ముట్నూరి కృష్ణారావు మున్నగు

మహనీయులు నెలకొల్పిన పత్రికా సత్సంప్రదాయా లన్నింటిని పుణికి పుచ్చుకొని ప్రగతిశీల పత్రికా రచనకు వరవడిదిద్దినవారిలో, జాతీయోద్యమానికి కమ్యూనిస్టు ఉద్యమానికి వారధులుగా పేర్కొనవలసినవారిలో శ్రీ చంద్రంగారు ప్రప్రథములు.

## పత్రికలద్వారా దేశభక్తియుత కర్తవ్యం:

1928 లో సైమన్ వ్యతిరేక ప్రదర్శనలు, 1930 లో ఉప్పు సత్యాగ్రహం, 1932 లో వ్యష్టి సత్యాగ్రహం, విదేశీ వస్తు బహిష్కరణోద్యమం, 1933 లో గాంధీజీ హరిజనోద్యమం మున్నగు ఉద్యమాలలోనికి ఉరికిన చంద్రశేఖరరావుగారిని ఆనాటి స్వాతంత్ర్యోద్యమంలో సామ్రాజ్యవాద వ్యతిరేక మిలిటెంటు జాతీయవాదం ప్రాభావితం చేసినట్లు ఆయన స్వగ్రామం కృష్ణాజిల్లా వెంట్రగడలో ప్యునిటివ్ పోలీసు దళంలో వైట్ పోలీసు సార్జెంట్‌తో జరిపిన ప్రతిఘటన, తీవ్రంగా గాయపడటం, ఆ సందర్భంలో గడిపిన రహస్య జీవితం మున్నగువాటినిబట్టి విదితమౌతుంది.

ఆ రోజుల్లోనే కొన్ని రహస్య కాంగ్రెస్ పత్రికలు "జయభారత్", "రెడీ" మున్నగు వాటిలో చంద్రం గారికి ప్రధాన పాత్ర వున్నది. ఇవి సైక్లోస్టయిల్ పత్రికలు. 1930–32 రాజమండ్రి జైలులో ఉండగానే టెర్రరిస్టు విప్లవకారులతో చంద్రం గారికి సంబంధాలు ఏర్పడ్డాయి. మార్క్సిస్టు సాహిత్యాన్ని అధ్యయనం చేశారు. జైలు నుండి బైటకు రాగానే కొన్ని రహస్య కరపత్రాలు ప్రచురించడంతో వారి రచనా కృషి ప్రారంభమైందని చెప్పవచ్చు. సత్యాగ్రహ బులెటిన్లు కూడా ప్రచురించడంలో చంద్రం గారి పాత్ర వుంది.

1934లోనే ఆంధ్ర రాష్ట్రంలో కమ్యూనిస్టు పార్టీ స్థాపించబడినా, 1937 నాటికిగాని పార్టీకి ఒక పత్రిక అంటూ ఏర్పడలేదు. అప్పటికీ కమ్యూనిస్టుపార్టీ కాంగ్రెసు సోషలిస్టుపార్టీలో అంతర్గతమై వుండేది. 1937 డిశంబరు 15వ తేదీన రాజమండ్రి నుండి శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య గారి సంపాదకత్వాన "నవశక్తి" వార పత్రిక ప్రారంభమైంది. ఈ పత్రికను తన పేర డిక్లరేషన్ తీసుకున్నప్పటికీ పార్టీ ఆధ్వర్యాన నడుపుకోడానికి ఆయన అంగీకరించారు. ఈ పత్రిక కొన్నాళ్ళు రాజమండ్రిలో వున్న తరువాత విజయవాడకు మార్చబడింది.

## గ్రామీణ ప్రజల కోర్కెల సాధనకు పత్రికారచన:

"జమీందారీ రైతుల ఆందోళన" అన్న నవశక్తి పత్రిక వ్యాసం, జాతీయోద్యమాన్ని ఫ్యూడల్ వ్యతిరేక ఉద్యమంగా విస్తరింపజేసి, రైతాంగ ప్రయోజనాల కోసం జమీందారీ విధానం రద్దుకోసం పోరాడాలని చెప్పి, భూమి సమస్యపై జాతీయవాదుల దృష్టి మరల్చడానికి యత్నిస్తోంది. 1931 కరాచీ ప్రాథమిక హక్కుల తీర్మానాన్ని అవకాశంగా తీసుకొని ఆనాటి కాంగ్రెసులోని వామపక్ష ప్రజాతంత్ర అభ్యుదయ శక్తులు సామ్రాజ్యవాద వ్యతిరేక, ఫ్యూడల్ వ్యతిరేక కర్తవ్యాలను పరిపూర్తి చేయడానికి మితవాదులతో ఏవిధంగా సంఘర్షించారో, ఈనాడు మనం అనుకునే జాతీయ ప్రజాతంత్ర విప్లవ పరిపూర్తికి ఆనాడు కాంగ్రెస్‌లో అంతర్భాగంగా ఉంటూ సోషలిస్టులు, కమ్యూనిస్టులు ఏవిధంగా కృషి చేస్తూ వచ్చారో తెలుపుతుంది.

## ముట్నూరి కృష్ణారావుగారికి బహిరంగ లేఖ:

చంద్రంగారి నాల్గు దశాబ్దాల పత్రికా రచనలో, మణిపూస అనదగినది ఆయన 1945లో కృష్ణాపత్రికా సంపాదకులు, సుప్రసిద్ధ జాతీయవాదులు అయిన శ్రీ ముట్నూరి కృష్ణారావుగారికి వ్రాసిన బహిరంగ లేఖ. బహుశా తెలుగు జర్నలిజం సమగ్ర చరిత్రను భావి చరిత్రకారులు రచించినప్పుడు అందులో సువర్ణాక్షరాలతో చంద్రంగారు వ్రాసిన ఆ మహోత్కృష్ట రచనను పేర్కొనవలసి ఉంటుంది.

తమ పత్రికల ద్వారా జాతీయోద్యమ సందేశాన్ని తెలుగు ప్రజలకు అందజేసిన ముఖ్యులలో ఒకరుగా ఆంధ్ర జాతీయ వికాసానికి తోడ్పడిన పెద్దలలో ఒకరుగా, వందేమాతరం కాలంనుండి అనేక ఉద్యమాలలో భాగస్వాములుగా శ్రీ ముట్నూరి కృష్ణారావుగారి పట్ల చంద్రం గారికి ఎంత గౌరవభావం, పూజ్యభావం ఉన్నదో, ఎంత నమ్రతతో ఎంత యుక్తియుక్తంగా ఎంత హుందాగా పత్రికాముఖాన ఆ రాజకీయ పోరాటాన్ని భీష్మార్జున యుద్ధాన్ని పోలిన విధంగా చంద్రంగారు సాగించారో ఆ బహిరంగలేఖ చదివితే బోధపడుతుంది.

అంతేకాదు, ఆనాడు జాతీయోద్యమం పట్ల కమ్యూనిస్టుల వైఖరిని, అవగాహనను ఆ లేఖ స్పష్టం చేస్తుంది.

"వాస్తవిక పరిస్థితులకు అనుగుణంగా కార్యక్రమం వేసుకొని అమలు జరిపితేనే స్వాతంత్ర్యం సాధించగలమని నమ్మే ప్రజా సేవకులం మేము. అందుచేత ఏమైనా భేదాలు పొడచూపినప్పుడు ఒకరినొకరు అర్థం చేసుకోడానికి ప్రయత్నించడం మీకూ మాకూ కూడా మంచిది" అని నమస్కారబాణం వేసి, ఆ తరువాత, "తాతగారు సంపాదకీయాలలో చేసిన ఆరోపణలు నిజమో, అబద్ధమో నిర్ణయించే అధికారం ఆంధ్ర ప్రజలది" అని ప్రజలను మధ్యవర్తులుగా పెట్టి, శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు వ్రాసిన సంపాదకీయాలతోనే వారి వాదనలను చంద్రం గారు పూర్వపక్షం చేశారు. ఎంతో ప్రతిభావంతంగా తమ వాదనా పటిమను ప్రదర్శించారు.

## జాతీయోద్యమంలో ఏర్పడిన గండి:

తెలుగుదేశంలో ఆనాడు జాతీయోద్యమంలో ఒక పెద్ద గండి ఏర్పడిన మహా క్లిష్ట సమయంలో, ఆ గండిని పూడ్చి, జాతీయ విమోచనోద్యమంతో కమ్యూనిస్టు ఉద్యమాన్ని సమన్వయపరచడానికి – శ్రీ చండ్ర రాజేశ్వరరావుగారు చంద్రంగారి ప్రముఖ పాత్ర గురించి చేసిన ఒక ప్రసంగంలో చెప్పినట్లుగా – కమ్యూనిస్టుల జాతీయ, అంతర్జాతీయ కర్తవ్యాలను సమన్వయపరచుకోవడంలో వచ్చిన చిక్కులను అధిగమించడానికి, జాతీయోద్యమంనుండే వచ్చిన శ్రీ చంద్రంగారు ఎనలేని కృషి చేశారు.

కమ్యూనిస్టుల దేశభక్తిని శంకించుతూ వారిపై అనేక నీచారోపణలు చేస్తూ, కమ్యూనిస్టు పార్టీ కుటుంబాలలోని స్త్రీలను అసభ్యంగా తూలనాడుతూన్న వారికి చంద్రంగారు ఆనాడు యిచ్చిన ఘాటైన జవాబు, ఆనాడు కమ్యూనిస్టు ఉద్యమంపై అభాండాలు వేయడానికి అతి హీనస్థాయిలో ప్రబలిన జుగుప్సాకరమైన ఎల్లోజర్నలిజానికి

"రాచ్చుగుంట పత్రిక" లని నామకరణం చేసి, నిజమైన కాంగ్రెసు దేశభక్తులను, ఆగస్టు ఉద్యమ వెల్లువలో కొట్టుకొని వచ్చిన తప్పిదాలను వేరుపరచి, ఎదురు ప్రచార దాడి చేయడంలో చంద్రంగారు నిర్వహించిన ధీరోదాత్త పాత్ర, ఆనాటి కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తలకు కొండంత బలాన్ని, ఆత్మ ధైర్యాన్ని, స్థైర్యాన్ని యిచ్చిన విషయం ఈ వ్యాసరచయిత స్వీయానుభవం కూడా.

చంద్రంగారు ఆ లేఖలో చెప్పిన ఆ మాటలు కమ్యూనిస్టులకు, కమ్యూనిస్టు జర్నలిస్టులకు నిత్యం శిరోధార్యం. కమ్యూనిస్టు వ్యతిరేకులకు నిత్యం ఒక హెచ్చరిక, ఒక సవాలు.

"ప్రజలే మాకు పునాది. ప్రజాస్వామ్యానికి అనుంగు బిడ్డలమైన కమ్యూనిస్టులం. ప్రజలలో వేరూని ఉన్నంతకాలం, ప్రజల సేవే మా ప్రధాన లక్ష్యమైనంతకాలం మమ్ములను ప్రత్యర్థులు ఏమీ చేయలేరు."

చంద్రంగారు వ్రాసిన ఆ లేఖను చదివి శ్రీ ముట్నూరి కృష్ణారావుగారు "కమ్యూనిస్టు పార్టీలో ఇంత ప్రతిభావంతంగా ఇంత మహోదాత్తంగా వ్రాయగల్గినవారున్నారా?!" అని అన్నారంటే, ఆయనను ఈ లేఖ ఎంత మెప్పించిందో అర్థమవుతుంది.

## చంద్రంగారి విశిష్ట శైలి:

తేట తెనుగు మాటలతో, గ్రామీణ పలుకుబడులతో, వారి దైనందిన జీవితానుభవాలను జోడించుతూ చిన్న చిన్న వాక్యాలతో, సులభ గ్రాహ్యమైన పద్ధతిలో చంద్రంగారు తమ సంపాదకీయాలను సామాన్య విద్యావంతులకు కూడా అర్థమయ్యే విధంగా వ్రాసేవారు. భాషకుకాక భావానికి ప్రాధాన్యం యిచ్చేవారు.

లెనిన్ చెప్పిన రీతిగా పత్రికలను ప్రజా సమస్యలపై ప్రచారాందోళనల సాధనంగానేగాక, ప్రజలను సంఘటితపరచేవిగా (ఆర్గనైజరుగా), ప్రజలకు మార్గదర్శిగా (అధ్యాపకుడుగా) చంద్రంగారు తీర్చిదిద్దారు.

సంపాదకీయాలతోబాటు నేడు పత్రికలలో "సెకండ్ కాలమ్"గా పేర్కొనబడే వ్యాఖ్యలు, విమర్శల విషయంలో విశిష్టమైన శీర్షికలను రూపొందించారు. పోతన్ జోసెఫ్ "ఓవర్ ఎ కప్ ఆఫ్ టీ", ఖాసా సుబ్బారావు "సోటో వోసీ" (స్వగతం), న్యాపతి నారాయణమూర్తి "పాన్-సుపారి" మున్నగునవి ఎంత విశిష్టంగా పేరు పొందాయో, చంద్రంగారి "కంచుకాగడా", "ఉరుములు-మెరుపులు" మున్నగు శీర్షికలు నిశిత విమర్శలకు, పదునైన భాషకు, వ్యంగ్యానికి అంతగా పేరు పొందాయి. రాజకీయ ప్రత్యర్థులకు, ప్రజా శత్రువులకు "కంచుకాగడా" పేరు చెబితే హడలుగా ఉండేది.

కొద్ది మాటలలో ఎంతో అర్థాన్ని యిమిడ్చి చెప్పడంలో కూడా చంద్రంగారు అందెవేసిన చేయి. మిరాసీ భూస్వామ్య విధానాన్ని, జమీందారీ విధానాన్ని, మద్రాసులోని 'హిందు' పత్రిక వెనకవేసుకొని వస్తున్నపుడు "మౌంట్ రోడ్డు మహావిష్ణువు" అని చమత్కరించి, దానిని వాడుకలోకి తెచ్చారు.

అలాగే రహస్య కాలంలో ప్రచురించబడే పత్రికలలో ఆచి, తూచి అతి తక్కువ స్థలంలో వార్తలను, వ్యాఖ్యలను వ్రాయవలసి వచ్చినప్పుడు; సూటిగాను, పదునుగాను ఉండేటట్లు శీర్షికలను వ్రాయడంలో కూడా చంద్రంగారు వరవడి పెట్టారు. ఒక సి.ఐ.డి., సబిన్స్పెక్టర్ "స్వతంత్ర భారత్" రహస్య పత్రికను ముద్రించే స్థలాన్ని, పంపిణీదారులను పట్టుకొనబోయి గోడ దూకి ఒక మురికిగుంటలో పడ్డాడు. ఆ వార్తకు చంద్రంగారు పెట్టిన శీర్షిక "పంది బురద మెచ్చు....." అని!

కమ్యూనిస్టు పత్రికల పితామహునిగా తెలుగుదేశ పత్రికా రంగంలో ఆయన చేసిన కృషి అంతా ఒక యెత్తు, తెలుగుదేశ సాంస్కృతిక పునర్జీవనానికి ఆయన చేసిన సేవ ఒక యెత్తు.

చంద్రంగారు నాలుగు దశాబ్దాలపాటు తెలుగుదేశంలో వామపక్ష ప్రజాతంత్ర శక్తుల పురోగతికి; కమ్యూనిస్టు ఉద్యమం; కార్మిక, కర్షక, మధ్యతరగతి ప్రజల ఉద్యమాలకు; మార్క్సిస్టు సిద్ధాంతాల వ్యాప్తికి తమ పత్రికారచనద్వారా ఎనలేని సేవ చేశారు.

★ ★ ★

# కీ.శే. రావి నారాయణరెడ్డి



రావి నారాయణరెడ్డి, నల్గొండ జిల్లా బొల్లేపల్లి గ్రామానికి చెందిన వారు. 1930లో గాంధీజీ ప్రారంభించిన సత్యాగ్రహ పోరాటం వల్ల ఉత్తేజం పొందారు. హైద్రాబాద్‌లోని నిజాం కాలేజీలో చదువుతుండగా వందమందితో కలిసి డాక్టరు చెలికాని రామారావుగారి (అప్పుడు వీరు హైదరాబాద్‌లో వైద్య శాస్త్రం చదువుతూండేవారు) నాయకత్వాన తూర్పు గోదావరి జిల్లా కాకినాడలో బద్దం ఎల్లారెడ్డిగారితో కలిసి కేంద్రం స్థాపించారు. 1930లో జోగిపేటలో జరిగిన నిజాం రాష్ట్ర ప్రథమాంధ్ర మహాసభకు పదిహేను మందితో కలిసి వాలంటీరుగా వెళ్ళి, వాలంటీర్ల దళానికి కెప్టెన్‌గా పనిచేశారు. రాష్ట్రంలోని ఆంధ్రోద్యమ శాఖలన్నీ ఆ మహాసభలో కలిశాయి.

ప్రధానంగా సాంఘిక సమస్యలే అక్కడ చర్చకు వచ్చాయి. సురవరం ప్రతాపరెడ్డిగారు దానికి అధ్యక్షులు. 1931లో దేవరకొండలో జరిగిన ద్వితీయాంధ్ర మహాసభలో కూడా సాంఘిక సమస్యలే ప్రాధాన్యం వహించాయి. అయితే, నారాయణరెడ్డి గారితో కలిసి ప్రతినిధులుగా వెళ్ళిన పదిహేనుమంది విద్యార్థులు స్వయంగా చర్చలలో పాల్గొన్న ఫలితంగా ఛాందసుల వాదనలు వీగిపోయాయి. సంస్కర్తల ప్రతిపాదనలు గెలిచాయి.

1932లో గాంధీజీ నాయకత్వం క్రింద ప్రారంభమైన హరిజనోద్యమంలో నారాయణరెడ్డిగారు పాల్గొని తీవ్రంగా కృషి చేసినందున హైదరాబాద్ సంస్థాన హరిజన సేవా సంఘానికి కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. దాని కార్యక్రమం ప్రజల్లో అస్పృశ్యతా నివారణను గూర్చి ప్రచారం చేయడం, సహపంక్తికై భోజనాల ద్వారా సమాన భావాన్ని వ్యాప్తి చేయటం, హరిజనుల్లో విద్యా వ్యాప్తికై కృషి చేయడం. ఈ కార్యక్రమంలో భాగంగా సంస్థానంలో వంద హరిజన పాఠశాలలు స్థాపింపబడ్డాయి. హైదరాబాద్, బీడ్ నగరాలలో రెండు హరిజన హాస్టళ్లు నడుపబడ్డాయి. నారాయణరెడ్డి రెండేళ్లు సంస్థాపన హరిజన సేవాసంఘ కార్యదర్శిగాను, తరువాత 1938 వరకు అధ్యక్షులుగాను ఉన్నారు. 1934లో గాంధీజీతో కలిసి హైదరాబాదులో హరిజన సేవాసంఘ నిధికి విరాళాలు వసూలు చేశారు. 1934, 1935, 1936, 1937లలో జరిగిన ఆంధ్ర మహాసభలలో నారాయణరెడ్డి, వారి అనుయాయులు చురుగ్గా పాల్గొనడమే కాక, భాషా దురభిమానుల సంకుచిత ధోరణుల్ని ఎదుర్కొన్నారు. 1937లో నిజామాబాద్‌లో జరిగిన ఆరవ ఆంధ్ర మహాసభలో వీరూ, మందుముల రామచంద్రరావు కార్యదర్శులుగా ఎన్నుకోబడ్డారు. నిజాం రాష్ట్రంలో బాధ్యతాయుత ప్రభుత్వ మేర్పరచాలని కోరుతూ, ఆ మహాసభ ఒక తీర్మానం చేసింది. ఆంధ్ర మహాసభ బహిరంగంగా ఒక రాజకీయ తీర్మానం చేయడం అదే ప్రథమం.

ఆ యేడే భారతదేశంలోని అన్ని రాష్ట్రాలలో జరిగిన సాధారణ ఎన్నికల ఫలితంగా 8 రాష్ట్రాలలో కాంగ్రెసు మంత్రివర్గాలేర్పడ్డం చూచి నిజాం సంస్థానంలో తెలంగాణా, మరాట్వాడా, కర్ణాటక ప్రాంతాల నాయకులు స్టేట్ కాంగ్రెస్ స్థాపనకు సన్నాహాలు ప్రారంభించారు. కాని, నిజాం ప్రభుత్వం ఒక ప్రకటనలో దానిని నిషేధిస్తానని బెదిరించింది. తెలంగాణా, మరాట్వాడా, కర్నాటక నాయకులు యిందుకు నిరసనగా సత్యాగ్రహం చేయడానికి నిశ్చయించుకున్నారు. 1938 నవంబరులో హైదారాబాద్‌లో మొట్టమొదటి సత్యాగ్రహ దళం చట్టధిక్కారం చేసి అరెస్టు అయింది. ఆ దళంలో నారాయణరెడ్డి గారు తెలంగాణా ప్రాంతపు ఏకైక ప్రతినిధి. వారికి కోర్టు రెండు నెలలు జైలు శిక్ష విధించింది. ఆ తరువాత రాష్ట్రం నలుమూలల నుంచి వచ్చిన సత్యాగ్రహులు సుమారు 400 మంది దఫదఫాలుగా జైళ్ళకు వెళ్ళారు. హైదరాబాద్, మధిర, ఔరంగాబాద్‌లలోను, కర్నాటక ప్రాంతంలో ఒకచోట సత్యాగ్రహ శిబిరాలు నడిచాయి. బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి, రామచంద్రారెడ్డి మొదలైన వారెందరో ఆనాడు సత్యాగ్రహ దళాలకు నాయకత్వం వహించారు.

ఆ రోజుల్లో నిజాం సంస్థానంలోని విద్యార్థులు, యువకులు 4 గ్రూపులుగా ఉండేవారు. ఉస్మానియా విశ్వవిద్యాలయం, హైస్కూళ్ళు, కాలేజీలలో నిజాం నవాబు

చిరంజీవిగా వర్ధిల్లాలంటూ నిత్యం విద్యార్థులు ప్రార్థన చేయవలసియుండేది. దేశంలోని యితర ప్రాంతాల్లో ఉవ్వెత్తుగా లేచిన స్వాతంత్ర్యోద్యమంతో ప్రభావితులైన యువకులు దీనికి బదులు వందేమాతరం గేయాన్ని పాడ్డం ప్రారంభించారు. ప్రభుత్వం దీన్ని నిషేధించింది. దానికి అసమ్మతిగా ఉస్మానియా విద్యార్థులు యూనివర్సిటీని బహిష్కరించారు. వారిని నాగపూరు విశ్వవిద్యాలయ అధికారులు ఆహ్వానించి, సకల సౌకర్యాలు కలుగజేశారు. ఈ వందేమాతరం ఉద్యమంలో పాల్గొన్న యువకులలో సోషలిస్టు భావాలు కలవారు కూడా ఉండేవారు. అలాంటి వారిలో దేవులపల్లి వెంకటేశ్వరరావు, సర్వదేవభట్ల రామనాథంగారలు ముఖ్యులు.

రెండవ ప్రపంచ యుద్ధంతో యువకులలో పత్రికలు చదవాలనే ఆసక్తి హెచ్చింది. ముఖ్యంగా ఫాసిజం, కమ్యూనిజం, రష్యా విప్లవంలాంటి సమస్యలు వారి ఆలోచనల్లోకి వచ్చాయి. కొందరిలో సోషలిస్టు భావాలు అంకురించాయి. అట్టి యువకులు హైదరాబాదులో కామ్రేడ్స్ అసోసియేషన్ అనే పేరుతో ఒక చర్చా వేదిక స్థాపించారు. అందులో మఖ్దూం మొహియుద్దీన్, రాజబహద్దూర్ గౌర్, సయ్యద్ ఇబ్రహీం, అలంఖుంద్‌మీర్‌లు సభ్యులు. దానికి బూర్గుల రామకృష్ణారావు ప్రోత్సాహకులు. మఖ్దూం అప్పటికే విప్లవకవిగా ప్రసిద్ధి చెందారు.

ఆంధ్రమహాసభలో రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల సోదరులు అదివరకే జవహర్‌లాల్ నెహ్రూ రచనలతో ప్రభావితులై సోషలిస్టు భావాలకు అంకితమై యున్నారు.

మహారాష్ట్ర పరిషత్తులో ఔరంగాబాద్‌కి చెందిన చంద్రగుప్త చౌదరి, హబీబుద్దీన్, వి.డి. దేశ్‌పాండే మొదలైనవారుకూడా సోషలిస్టు భావాలచే ఉత్తేజితులయ్యారు.

ఈ నాలుగు గ్రూపులూ కలిసి 1939 చివరి రోజుల్లో నిజాం సంస్థాన కమ్యూనిస్టు కమిటీగా అవతరించాయి. ఆనాడు భారత కమ్యూనిస్టు పార్టీ శాఖల్లో కల్లా బలీయమైన దనుకొనే ఆంధ్ర కమ్యూనిస్టు కమిటీ చొరవతో నిజాం సంస్థాన కమ్యూనిస్టు కమిటీ ఏర్పడిందనీ, అదే దీనికి వెన్నెముక అనీ నారాయణరెడ్డి తన గ్రంథం ("వీర తెలంగాణా: నా అనుభవాలు – జ్ఞాపకాలు")లో తెలియజేశారు. ఇంకా యిలా వ్రాశారు : "నెహ్రూ గారి పుస్తకాలు చదవడం వల్ల కొందరు యువకుల్లో సోషలిస్టు భావాలు అలవడ్డాయి. అంతర్జాతీయంగా, సోవియట్ యూనియన్‌లో రెండు పంచవర్ష ప్రణాళికల విజయం, నూత్న సమాజ ప్రగతి అనేక మందిని సోషలిస్టు భావాలకు అనుగుణంగా మార్చాయి. అంతకుముందే పెట్టుబడిదారీ ప్రపంచంలో వచ్చిన ఆర్థిక సంక్షోభ ఛాయలు సోవియట్ యూనియన్‌కి సోకలేదు. పైగా, అక్కడ నిరుద్యోగం పూర్తిగా నిర్మూలమైంది. ఆర్థిక పరిస్థితి నానాటికి మెరుగుపడుతున్నది. పెట్టుబడిదారీ ప్రపంచానికీ, సోవియట్ యూనియన్‌కీ గల యీ మౌలిక తారతమ్యం మాలో ఉత్సాహాన్ని పురికొల్పేది. అలాంటి సమాజాన్ని నిర్మించుకొనే అవకాశాన్ని మనం కూడా ఉపయోగించుకోవాలని మేమనుకుంటూ ఉండేవారం. ఇలాగ సోషలిజంవైపు భావాలు పరుగులుపెట్టే యువకులతో ఆనాడు నిజాం రాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ ఏర్పడింది." ("వీర తెలంగాణా: నా అనుభవాలు – జ్ఞాపకాలు" 1976 డిసెంబరు.)

# కీ.శే. ఐదుకల్లు సదాశివన్



ఐదుకల్లు సదాశివన్ (అనంతపురం) 1930లో అనంతపురంలోని గింజలంగడి (ధాన్యపు కొట్టు)లో గుమాస్తాగా ఉండేవారు. ఉప్పు సత్యాగ్రహం ప్రారంభమవగానే తన నౌకరికీ స్వస్తిచెప్పారు. త్రివర్ణ పతాకంతో నాయకుల వెంబడి ఊరూరాతిరిగి, నినాదాలిచ్చుకుంటూ ప్రచారం చేశారు. అప్పటి అనంతపురం జిల్లా కలెక్టర్ గోపాలస్వామి అయ్యంగార్ (తరువాత నెహ్రూ మంత్రివర్గంలో వున్నారు) వీరినీ, వీరితో పాటు కల్లూరు సుబ్బారావు, హట్టి శంకరరావు, వెంకటనారాయణరావుగారలను పిలిపించి, "మీరు ఎంత ప్రచారం చేసినా నేను మిమ్మల్ని అరెస్టు చేయను" అని గట్టిగా చెప్పారు. దానిమీద సదాశివన్, సుబ్బారావు, వెంకటనారాయణగారలు బళ్ళారికి పోయి అక్కడ ఉద్యమంలో పాల్గొన్నారు. బళ్లారి సత్యాగ్రహ శిబిరంలో చేరి, రోజూ ప్రభాత ఫేరీలు జరుపుతూ గ్రామాలలో ప్రచారం చేశారు. ఫలితంగా, వీరినీ, మరో ఎనమండుగురినీ పోలీసులు స్పృహ తప్పేవరకు లాఠీలతో మోది

లారీలలోకి త్రోశారు. స్పృహ వచ్చేటప్పటికి వీరు జైల్లో కటకటాల వెనుక వున్నారు.

ఈ తొమ్మిది మందీ రాత్రులు చదువుకోడానికి లైట్లు అడగ్గా, పోలీసు లీయలేదు. దానితో వీరు 14 రోజులు నిరాహారదీక్ష జరిపారు. పోలీసులు తిరిగి లాఠీ చార్జీ చేశారు. ఫలితంగా సదాశివన్ మణికట్టు విరిగింది. "రోజా మజ్జిగ, రాత్రిళ్ళు దీపం, వ్రాసుకోడానికి కాగితాలు, కలం యివ్వాలనీ, యివ్వకపోతే రాత్రులు కొట్లలోకి పో"మని చెప్పి, బయట తిష్టవేసుకొని కూచున్నారు. అప్పటికి రాత్రి పదకొండు గంటలైంది. సాయంత్రం ఆరుగంటలకే లాకప్ చేయాలి. అప్పుడు 200 మంది రిజర్వు పోలీసులొచ్చి వీరందరినీ చితక బాదారు. మూడు రోజుల తర్వాత రోజా మజ్జిగ, రాత్రిళ్ళు దీపం యివ్వడానికి ప్రభుత్వం అంగీకరించింది. అప్పటినుంచే రాజకీయ ఖైదీలకు మజ్జిగ, దీపం యివ్వబడ్డాయి.

తరువాత, గాంధీ – ఇర్విన్ ఒడంబడిక ఫలితంగా సదాశివన్, యితరులు జైలు నుంచి విడుదలయ్యారు. 1931లో ధర్మవరం కాంగ్రెసు వాలంటీర్ల శిబిరంలో చేరి, దళాధిపతిగా గ్రామాల్లో ప్రచారం చేశారు. 1932లో గాంధీ, నెహ్రూల అరెస్టు తర్వాత సుమారు 4 నెలలు పోలీసులకు చిక్కకుండా ధర్మవరం, అనంతపురం, ఉరవకొండ, గుంతకల్లులలో సత్యాగ్రహ దళాలను ఏర్పరచారు. ఆ తర్వాత పోలీసులకు చిక్కి, మూడు మాసాలు సబ్ జైలులో ఉన్నారు. "దేశద్రిమ్మరి", "భిక్షాటకుడు" అని ఒక సంవత్సరం జైలు శిక్ష విధించబడింది. బళ్లారిలో జైలు శిక్ష అనుభవించారు. 1933 మార్చిలో విడుదలయ్యారు. విడుదల అనంతరం బందరు వెళ్ళి జాతీయ కళాశాల్లో రెండేళ్ళు చదివారు. నిడుబ్రోలులో ఆచార్య రంగా నడుపుతున్న వేసవి రాజకీయ పాఠశాలకు హాజరై, అతివాద భావాలు అలవరచుకొన్నారు. తరువాత, హరిజన హాస్టలు నిర్మాణానికి నానా తిప్పలుపడి చివరకు కృతకృత్యులయారు. హాస్టలు నిర్మింపబడింది. హరిజన బాలబాలికలకు చక్కని ఆహారం, వసతి సమకూర్చబడ్డాయి. ఒకసారి అఖిలభారత హరిజన సేవా సంఘ కార్యదర్శి ఠక్కరుబాబా అక్కడికి వచ్చి చూచారు. రాష్ట్రంలో అన్ని విధాల ఆదర్శ ప్రాయమైన హాస్టలుగా దాన్ని మెచ్చుకొన్నారు. తరువాత వీరు జిల్లా హరిజన సేవాసంఘ కార్యదర్శిగా నియమింపబడ్డారు. ఆ హోదాలో హరిజనోద్ధరణకై ఎనలేని సేవచేశారు. 1937 సాధారణ ఎన్నికల్లో కాంగ్రెస్ అభ్యర్థుల విజయానికి తీవ్రంగా కృషి చేశారు. జిల్లాలో కరడుగట్టిన నిరంకుశ ఫ్యూడల్ భూస్వామి పాముదుర్తి బయపరెడ్డి, యితర జస్టిస్ పార్టీ అభ్యర్థులు చిత్తుగా ఓడిపోయారు.

ఈ విజయం యువకుల్లో చాలా ఉత్సాహం కలిగించింది. వెంటనే జిల్లాలోని యువకుల్ని సమీకరించి జిల్లా యువజన సంఘాన్ని స్థాపించారు. నీలం సంజీవరెడ్డి గారిని రాజకీయోద్యమంలోకి తీసుకురావడంలో సదాశివన్ పాత్ర ప్రముఖమైంది. జిల్లా యువజన సంఘానికి సంజీవరెడ్డి అధ్యక్షులుగా ఎన్నుకోబడ్డారు. సదాశివన్ ప్రధాన కార్యదర్శి. జిల్లాలో 70 చోట్ల అధ్యయన కేంద్రాలు స్థాపించి, 15 రోజులకో, నెలకో ఒకసారి క్లాసులు పెట్టి రాజకీయాలు చెప్పేవారు. ఆగ్రా నుంచి వెలువడే సోషలిస్టు ప్రచురణలను ఆధారం చేసుకొని పాఠాలు చెప్పేవారు. 1938 వేసవిలో జిల్లాలోని యువకులకు, విద్యార్థులకు ఒక రాజకీయ పాఠశాల హిందూపురంలో నడుపబడింది.

దానికి 80 మంది విద్యార్థులు వచ్చారు. అధ్యాపకులు నీలం రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డి, సదాశివన్, విద్వాన్ విశ్వం; కొందరు కాంగ్రెస్ నాయకులు. సోవియట్ రష్యా, సోషలిజం, సామ్రాజ్యవాదం, వర్గాలు – వర్గప్రయోజనాలు మొదలైన విషయాలపై క్లాసులు జరిగాయి. "జిల్లాలోని యువకులకు, విద్యార్థులకు సోషలిస్టు రాజకీయాలు చెప్పడం యిదే ప్రథమం" అని సదాశివన్ ఒక వ్యాసంలో తెలియజేశారు.

అప్పటికే రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి బెనారస్ యూనివర్సిటీలో విద్యార్థులుగా ఉంటూ, కమ్యూనిస్టు పార్టీ సభ్యులుగా ఉండేవారు. కాంగ్రెసు బహిరంగ సభల్లో సోషలిజం గూర్చీ, సోవియట్ రష్యా గూర్చీ, ఫ్యూడలిజం, సామ్రాజ్యవాదం గూర్చీ ఉపన్యాసా లిచ్చేవారమని కూడా సదాశివన్ ఒక వ్యాసంలో వ్రాశారు. 1939 జూన్‌లో మదనపల్లిలో జరిగిన రాయలసీమ యువజన మహాసభకు అన్ని జిల్లాల నుంచి యువకులు పెద్ద సంఖ్యలో వచ్చారు. సింధు కమ్యూనిస్టు పార్టీ నాయకులలో ఒకరైన బుఖారీ ఆ మహాసభలో యిచ్చిన ఉపన్యాసం యువజనుల్లో చాల ఉత్సాహం కలిగించింది. కీ.శే. భోగరాజు పట్టాభి సీతారామయ్య రెండు రోజు లక్కడ ఉండి, ఉపన్యాసాలిచ్చి వెళ్ళారు. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయ్యాక, 1939 ఆఖరులో కల్యాణదుర్గం తాలూకా సెట్టూరు గ్రామంలో 5 రోజులు క్లాసులు జరిగాయి. నాగిరెడ్డి, సదాశివన్‌గారలు అధ్యాపకులుగా వున్నారు. సదాశివన్ 1943లో కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం తీసుకొన్నారు. ఆ సంవత్సరమే విజయవాడలో జరిగిన రాష్ట్ర పార్టీ మహాసభకు మొదటిసారిగా హాజరయ్యారు.

★ ★ ★

# కీ.శే. పి.వి. శివయ్య



1930-'31 శాసనోల్లంఘనోద్యమం తరువాత అందులో పాల్గొని జైలు శిక్ష అనుభవించిన పోలేపెద్ది నరసింహమూర్తి, నేనూ, మా సహాధ్యాయులు పి.వి. రాఘవయ్య, మరికొందరు జాతీయ విశ్వవిద్యాలయమని ప్రసిద్ధి పొందిన బెనారస్ హిందూ విశ్వవిద్యాలయానికి చదువు సాగించడానికి వెళ్ళాం. "స్వాతంత్ర్యం రావడమో, నా శవం అరేబియా సముద్రపుటలల మీద తేలిపోవడమో!" అని శపథం చేశారు గాంధీజీ. స్వాతంత్ర్యమూ రాలేదు. ఆయన శవం అరేబియా సముద్రపు టలలు మీద తేలనూ లేదు. ఉద్యమ మాపివేయబడ్డది. రౌండ్ టేబిల్ కాన్ఫరెన్సు, రాయబారాలు జరిగాయి. విఫలమైనాయి. వ్యక్తి సత్యాగ్రహం కన్నీళ్ళు తుడుపు మాత్రమే. స్వాతంత్ర్యోద్యమ వైఫల్యంతో ప్రజల్లో నిస్పృహ. ఉద్యమంలో పాల్గొన్న కాంగ్రెసు అతివాదులు నూతన మార్గాలు వెతుకుతున్నారు.

సోవియట్ యూనియన్‌లో సోషలిస్టు నిర్మాణ విజయాలు భారదేశానికి వినబడుతున్నాయి. మన పోరాటానికి సోషలిజం ఉపయోగపడుతుందా?

బెనారస్ యూనివర్సిటీలో చేరిన నరసింహమూర్తీ, రాజేశ్వరరావూ, రామ లింగయ్యా, పి.వి. రాఘవయ్యా, 32–33లోనే కమ్యూనిస్టు గ్రూపుతో సంబంధా లేర్పరచుకున్నారు. స్టడీ సర్కిల్‌కు హాజరవుతున్నారు. గ్రూపులో ప్రవేశం యేర్పడటం యెలా జరిగిందో తెలియదు. కామ్రేడ్ యస్.వి. ఘాటే అమీర్ హైదర్‌ఖాన్‌ల పేర్లు వినపడ్డై, ఏమైనా నేను మాత్రం రాఘవయ్య, నరసింహమూర్తి ప్రస్తావించగా స్పష్టమైన అభిప్రాయం వెలిబుచ్చలేదు. ఎప్పుడూ స్నేహితులతో, సారస్వత చర్చలతో కాలక్షేపం చేసేవాణ్ణి. అచంచలమైన జాతీయతా, ఉద్యమంలో విలీనతా, కారాగారవాసమూ మానసికంగా గాఢంగా అంకితమైనప్పటికీ, ఏదో కర్రా, కత్తీ, షూటింగూ, డ్రిల్లు నేర్వవచ్చుననే అభిప్రాయంతో, మోరపాక భగవాన్లు ప్రోద్బలం వల్ల రోజూ ఆర్.యస్.యస్.కు వెళ్ళేవాణ్ణి. ఎప్పుడూ పదిమంది స్నేహితులతో తిరుగుతూండే నాకుగల స్నేహలాలసత్వం గోల్వాల్కరునూ, మరుసటి సంవత్సరం రాజేశ్వరరావునూ ఆకర్షించినవి. గోల్వాల్కరు రెండు మూడుసార్లు తన యింటికి భోజనానికి ఆహ్వానించి భారతదేశ పరిస్థితులను గూర్చి, ముస్లింల జాతీయతా విదూరమైన మతతత్వాన్ని గూర్చి, హిందూ సంఘటన అవసరాన్ని గురించీ చర్చించేవారు. దేశ స్వాతంత్ర్య పోరాటంలో భారత జాతిని ఐక్యం చేసే బదులు చీలించే ఆ విధానం నచ్చదని చెప్పేవాణ్ణి. తరువాత కొంతకాలానికి డాక్టర్ మూంజీ, గణేశ్ సావర్కార్, యూనివర్సిటీలో ఇండియన్ హిస్టరీ ప్రొఫెసరు పుంతాం బేకరు గారలు ఉపన్యసించిన సంఘ సమావేశంలో మత దురహంకార పూరితమైన ప్రస్తావనతో కోపం మండిపోయి, తీవ్రమైన నిరసన ప్రకటించి, వాకౌట్ చేయడంతో ఆర్.యస్.యస్.తో తెగతెంపులైంది.

1933 ప్రారంభంలో కామ్రేడ్ రాజేశ్వరరావుతో స్నేహం దగ్గరైంది. అప్పటి నుంచీ యిద్దరం టిఫిన్, భోజనం, షికారు, సినిమా అన్నిటా కలిసి ఉండేవాళ్ళం, మా స్నేహం విడదీయనట్లు పెనవేసుకుపోయింది. రాజేశ్వరరావు నా గదిలోనే ఉండేవాడు.

## ఓ, న మాలు ప్రారంభం

ఒకరోజు శనివారం మధ్యాహ్నం "అటు వెళ్దాం" అన్నాడు రాజేశ్వరరావు. సంస్కృత కళాశాల హాస్టల్లో ఒక మూల గదికి చేరుకున్నాం. చంద్ర రామలింగయ్య, లక్ష్మారాయుడు, పి.వి. రాఘవయ్య, నరసింహమూర్తి, ఇంకా ఘాటే (ఇంజనీరింగు విద్యార్థి అనుకుంటా), విఠల్ చౌదరి, చంద్రగుప్త చౌదరి, జోషీ (బి.యస్సి. విద్యార్థి), సానే, డి.కె. బారువా, ఇంకా ఒకరిద్దరున్నారు. "మీరట్ థీసీస్" అధ్యయనం శ్రద్ధగా సాగుతున్నది. ఒకరు చదవడం; చంద్రగుప్త, ఘాటేలు అర్థం చెప్పడం. ఈ అధ్యయన తరగతికి మరో ఒకటి రెండుసార్లు వెళ్ళాను. భారత జాతీయోద్యమ నిర్వచనం, పోరాట పంథా, కార్మికవర్గ పాత్ర వివరింపబడుతున్నాయి. విషయ ప్రాశస్త్యం మనసును ఆకర్షించింది. అధ్యయన తరగతిలోనివారి శ్రద్ధాసక్తులు నన్ను ఒకవంక ఆకట్టుకున్నప్పటికీ, నాలో దాగివున్న మధ్యతరగతి మేధావి అహంకారం అధ్యయన తరగతిలో ఒకణ్ణి కాకుండా నిరోధించింది. "ఏమిటీ పురాణ కాలక్షేపం?

మనం చదువుకోలేమా?" అన్నాను. మరుసటి వారంనుంచీ మే మిద్దరం వెళ్ళడం మానేశం.

వారం రోజుల్లో "మీరట్ థీసీస్" మొదటి సంపుటం తెచ్చారు రాజేశ్వరరావు. ఇద్దరం కలిసి చదివాం. అలాగే రెండవ సంపుటం. తరువాత "బేసిక్ ప్రిన్సిపల్స్ ఆఫ్ సైంటిఫిక్ సోషలిజం" ఫాక్స్ రచన, ఆ తరువాత "ఎ.బి.సి.ఆఫ్ కమ్యూనిజం" బుఖారిన్ చదివాం. అలాగే "కమ్యూనిస్టు మానిఫెస్టో", "స్టేట్ అండ్ రివల్యూషన్" మొదలైనవి.

మాలో సానే 1933 మధ్యలోనే చదువుమాని బొంబాయి కార్మికవర్గంలో పని చేయడానికి వెళ్ళాడు. ఆయనకు ఎలవెన్సులో భాగంగా మేం కొంత చందాలు వేసుకుని రాజేశ్వరరావు ద్వారా పంపేవాళ్ళం. స్వాతంత్ర్య పోరాటానికి మార్క్సిస్టు త్రోవ గోచరించగానే మొదటినుంచీ పట్టుదలయైన కార్యవాదిగావున్న కామ్రేడ్ పోలేపెద్ది నరసింహమూర్తి బి.ఏ. పరీక్షలకు వెళ్ళకుండానే తెనాలి చేరాడు. రంగంలో దూకాడు. మద్రాసు, రాజమండ్రి మొదలయిన జైళ్ళనుంచి మీరట్ ఖైదీల పరిచయంతో కమ్యూనిస్టులుగా మారి విడుదలై వచ్చిన సుందరయ్య, కంభంపాటి సీనియర్ మొదలైన వారితో సంబంధాలు పెట్టుకున్నారు. ఆంధ్ర రాష్ట్రంలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణానికి ఒక గ్రూపు ఏర్పడ్డది. 1934లో పరీక్షలు పూర్తి చేసుకుని ఒక ట్రంకునిండా మార్క్సిస్టు సాహిత్యం తెచ్చి, నరసింహమూర్తి కందించాను.

## గుంటూరు జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ ప్రారంభం

గుంటూరులో కామ్రేడ్ నరసింహమూర్తి, జొన్నలగడ్డ రామలింగయ్య, మాడభూషి వెంకటాచారి గుంటూరు జిల్లా కమ్యూనిస్టు గ్రూపుగా ఏర్పడ్డారు. 1930–31 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని జైళ్ళకు వెళ్ళి వచ్చిన యువకులను చాల మందిని కలుసుకున్నారు. కమ్యూనిస్టు పార్టీని స్థాపించడానికి సన్నాహాలు జరిపారు. కార్మిక వర్గ పార్టీ కాబట్టి, మొట్టమొదట తెనాలిలోనూ, తరవాత గుంటూరులోనూ ప్రెస్ వర్కర్సు యూనియన్ యేర్పాటు చేశారు. మా జైలు మేట్లుగా ఉన్న కొందరు కమ్యూనిస్టు పార్టీని స్థాపించడానికి అంగీకరించినవారే. పార్టీ స్థాపనను గురించి తేలికగా అక్కడక్కడా మాట్లాడటం జరిగింది. 1934 జూలై లోనే కమ్యూనిస్టు పార్టీపై బ్రిటిషు ప్రభుత్వం నిషేధం విధించింది. పైన పేర్కొన్నట్లుగా కొందరు వెల్లడి చేయడంతో జిల్లా పార్టీ స్థాపన వాయిదా వేయవలసి వచ్చింది.

1935 మార్చిలో బి.యస్‌సి. సప్లిమెంటరీ పరీక్షలు పూర్తి చేసుకుని నే వచ్చిం తరవాత 1935 ఏప్రిల్ 17వ తేదీన గుంటూరు జిల్లా కమ్యూనిస్టు సమావేశం బ్రాడీపేట రెండవ లైన్‌లో దయ్యాల మేడపైన జరిగింది. నరసింహమూర్తి, రామలింగయ్య, వెంకటాచారి, ప్రతాప రామసుబ్బయ్య, పెండ్యాల లోకనాథం, బాచినప్ప నరసింహం, కుందేటి రామకోటి, కుందా పుల్లారావు, ముక్తేవి మాధవాచార్య, నేనూ, మరికొంతమంది, మొత్తం 17 మందిమి హాజరైనాం. కామ్రేడ్ నరసింహమూర్తి కార్యదర్శిగా 5 గురితో జిల్లా కమిటీ యెన్నుకోబడ్డది. తెనాలిలో నరసింహమూర్తి తమ్ముడు కృష్ణమూర్తి, సుబ్బారావు, నారాయణరావు, సత్యనారాయణ, మరొక

కాౖమేడ్‌తో ఒక సెల్లు, గుంటూరులో జొన్నలగడ్డ రామలింగయ్య, మాడభూషి వెంకటాచారి, ప్రతాప రామసుబ్బయ్యగార్లతో ఒక సెల్లు యేర్పడ్డవి.

ఆ రోజుల్లో పార్టీ నిర్మాణంలో "సెల్లు" పునాది. ఒక సెల్లులో సభ్యులు మరొక సెల్లువారికి తెలియకూడదు. 'సెల్లుల నుంచి ప్రతినిధులతో పైకమిటీలు తాలూకా జిల్లా రాష్ట్ర కమిటీలు పరోక్ష ఎన్నికలద్వారా యేర్పడేవి. పార్టీ నిర్మాణం మొత్తం రహస్యంగా ఉండేది. పార్టీ సభ్యుడుగా చేరడానికి మూడు మెట్లు ఎక్కాలి. మొదట సామ్రాజ్యవాద వ్యతిరేక సెల్లు. సామ్రాజ్యవాద వ్యతిరేకి, కాంగ్రెసు వ్యతిరేకి, గాంధీవాద వ్యతిరేకి ఐనవాళ్లు సామ్రాజ్యవాద వ్యతిరేక సెల్లులో చేరడానికి అర్హులు. ఈ మూడు వ్యతిరేకతలతోపాటు మత వ్యతిరేకి, దేవుడి వ్యతిరేకి కూడా అయితే — అంటే పై అయిదు వ్యతిరేకతలతోపాటు కమ్యూనిజం ధ్యేయంగా అంగీకరించితే ప్రీపార్టీ సెల్లులో లేక ఆక్జిలియరు సెల్లులో చేరడానికి అర్హులు. ఆక్జిలియరు సెల్లు సభ్యుడు పార్టీ కార్యక్రమంలో శ్రద్ధగా పాల్గొంటూంటే ఒక యేడాదికి పార్టీ సెల్లులో చేరడానికి అర్హత వస్తుంది. ఇలా యెవరైనా పార్టీలో సభ్యులుగా చేరడానికి రెండు మూడేళ్లు పట్టేది.

అయితే, ఒక్కటి గుర్తుంచుకోవాలి. మొదటి, సంస్థాపక సమావేశంలో పాల్గొన్న వారంతా 1920 సహాయ నిరాకరణోద్యమంలో పసితనంలోనే ప్రభావితులై 1930—32 సామ్రాజ్య వ్యతిరేక శాసనోల్లంఘనోద్యమాల్లో పాల్గొని, లాఠీ దెబ్బలు తిని, దీర్ఘకాలం జైలు జీవితం అనుభవించి; సంకల్ప బలమూ, పోరాట స్థిరత్వమూ అలవరచుకొని కాంగ్రెసు పోరాట పద్ధతి యెడలా, గాంధీవాదం యెడలా గల భ్రమలు సంపూర్ణంగా తొలగినవారే. తర్వాత పార్టీలోకి వచ్చినవారికి పైచెప్పిన మూడంచల పరీక్షలోనూ మరొకటి. క్రొత్తగా జాతీయ కాంగ్రెసు నాయకత్వం యెడల భ్రమలు తొలగి నూత్న సిద్ధాంత కార్యక్రమాలు తీసుకొనడంలో గల అతివాద పెడధోరణి స్పష్టంగా అవుపడుతుంది.

## కూలీ సంరక్షణ సంఘం - కాంగ్రెసు సోషలిస్టు పార్టీ

మీరట్ కుట్రకేసు అనంతరం, నిందితులకు పాశవికంగా దీర్ఘకాల శిక్షలు విధించడంతోపాటు 1934లో కమ్యూనిస్టుపార్టీ నిషేధించబడటంతో రాజకీయ ప్రచారం కోసం బహిరంగ వేదిక కావలసి వచ్చింది. ఇందుకొరకు జొన్నలగడ్డ రామలింగయ్య కార్యదర్శిగా గుంటూరులో, తెనాలిలో కూలీ సంరక్షణ సంఘం 1935లోనే స్థాపించబడ్డది. ఇందులో అప్పటికి పార్టీ సభ్యులుకాని దుర్భా కృష్ణమూర్తి, అమరవాది కృష్ణమూర్తి, చతుర్వేదుల పార్థసారథి వగైరాలు కూడా వున్నారు. కార్మిక వర్గ హక్కులను గురించి, వారి సమ్మె ఆయుధ పటిమను గురించి, సామ్రాజ్యవాద దోపిడీని గురించి, కాంగ్రెసు నాయకత్వం యొక్క మితవాద రాజీ ధోరణిని గురించి కూలీ రక్షణ సంఘం కరపత్రాలు విరివిగా పంచిపెట్టుతూ వుండేది. బహిరంగ సభలూ జరుపుతూండేది. సంపూర్ణ స్వాతంత్ర్య దినోత్సవం, మే దినోత్సవం, నవంబరు విప్లవ దినోత్సవం, ఏప్రిల్ 6 నుంచి 15 వరకు జాతీయ దినోత్సవాలు (1919 అమృతసరు జలియన్ వాలాబాగ్ హత్యలకు నిరసనగా) — ప్రతి బహిరంగ

సభలోనూ ప్రకృత విషయంమీద గాంధీవాదాన్ని ఖండించడం, కమ్యూనిస్టు సిద్ధాంత దృక్పథాన్ని ప్రతిపాదించడం జరిగేది. ఇందులో అనుభవజ్ఞానం కన్నా, పుస్తక జ్ఞానమే ఎక్కువ.

ఈ రోజుల్లోనే, కామ్రేడ్ తుమ్మల వెంకటరామయ్య "ఎగరాలి ఎగరాలి మన ఎర్రజండా" అనే మొట్టమొదటి ఎర్ర జండా పాట రాశారు. వెంకట్రామయ్య కూడా కాశీ విద్యా పీఠంలో హిందీ విశారద పరీక్షలకు చదువుతూ, మా బెనారస్ గ్రూపులో చేరినవారే. ఆయన "భారత కార్మికోద్యమ చరిత్ర" అనే పుస్తకం కూడా వ్రాశారు. అది 1936-37లో అచ్చయింది కూడా. చెప్పకోదగింది మరొకటి, కామ్రేడ్ పెండ్యాల లోకనాథం "కూలీలందరు ఏకమైతే కూటికి తరుగేమిరా" అని ఆంధ్రదేశంలోకెల్లా మొట్టమొదటి వర్గ విభేద ప్రతిపాదకమూ, వర్గ పోరాట ప్రబోధాత్మమూ అయిన సుదీర్ఘ గేయాన్ని వ్రాశారు. ఈ రెండు పాటలూ, బహుశా అబ్బూరి రామకృష్ణారావు గారు రచించిన "ఆకలిమంటలచే మలమల లాడే అనాథులంతా లేవండోయ్" అనే అంతర్జాతీయ గీతమూ ఆంధ్రదేశంలో విశాఖపట్నం మొదలు నెల్లూరు వరకూ బహుళ ప్రచారాన్ని పొందినవి. కూలీ సంరక్షణ సంఘం తరపునా, తరవాత 1936లో స్థాపించబడిన కాంగ్రెసు సోషలిస్టు పార్టీ ఊరేగింపుల్లోనూ, బహిరంగ సభల్లోనూ తప్పక పాడుతుండేవారు.

## రాయిస్టు పెడధోరణిపై పోరాటం

1935లో కూలీ సంరక్షణ సంఘం పేరిట ప్రచురించిన రెండు కరపత్రాలు "ప్రభుత్వానుమతిలేని వార్తాపత్రికల నిషేధ చట్టం" క్రింద వస్తాయని నేరం మోపి కామ్రేడ్స్ జొన్నలగడ్డ రామలింగయ్య, ప్రతాప రామసుబ్బయ్య, దుర్భా కృష్ణమూర్తి గారలకు ఒక సంవత్సరం కఠిన శిక్షవేసి రాజమండ్రి సెంట్రలు జైలుకు పంపటం జరిగింది. హైకోర్టు అప్పీలులో వారు జామీనుమీద విడుదలై వచ్చారు. వారు జైల్లో రాయిస్టుగా మారిన మీరట్ కుట్ర కేసుకు చెందిన భట్టాచార్య పరిచయంతో రాయిజమ్ అనుమానాలతో వచ్చారు. గుంటూరులోని పార్టీ సభ్యులకు, ఇతర సామాజికవాద వ్యతిరేక సెల్లు సభ్యులకూ అనుమానా లందించడం జరిగింది. ఆ సమయంలో నేను బెనారస్ నుంచి యం.యస్‌సి. చదువు మానేసి గుంటూరు రావటం జరిగింది. రాష్ట్ర పార్టీ మొదటి కాన్ఫరెన్సులో రామలింగయ్య రాష్ట్ర కమిటీకి ఎన్నికైనాడు. రాయిస్టు పెడధోరణుల కారణంగా అయన్ను పార్టీ నుంచి తొలగించారు. యం.ఎన్.రాయ్ కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ కార్యవర్గంలోనూ, చైనాలో కమ్యూనిస్టు పార్టీకి సహాయకుడుగా 1927-28లో నిర్వహించిన పాత్రను గురించీ, ఆయన డికాల నైజేషన్ సిద్ధాంతాన్ని గురించీ కాడరులో అనుమానాలు ప్రచారం చేయసాగాడు.

ఆయన జామీనుమీద ఉన్నప్పుడు గుంటూరులో మేమిద్దరమూ ఒకే యింట్లో కాపురముంటూ ఒక కుండలో తింటూ ఒక కుటుంబంగానే గడిపేవాళ్ళం. కాని ఆయన బైట రోజంతా, సానుభూతి పరుల యిండ్లకూ, విద్యార్థేతర కాడర్ల వద్దకూ వెళ్ళేవారు. ఆయన ఎక్కి దిగిన ప్రతి గడపకూ నేను పోయేవాణ్ణి. ఆయన

నాటిన రాయిస్టు అనుమాన బీజాలను పీకివేయడానికి అప్పటికి నాకున్న మార్క్సిస్టు సిద్ధాంత పరిజ్ఞానం మేరకు వివరిస్తూ ఉండేవాణ్ణి. హైకోర్టులో క్రింది బోర్డు నిర్ణయం ఖాయపడి, తగ్గింపుతో శిక్ష అనుభవించడానికి వారు మరల సెంట్రలు జైలుకు వెళ్ళే వరకూ మా యిద్దరి నిత్య వ్యవహారమూ యిలానే సాగింది. చివరకు వారు విడుదలై వచ్చింతరవాత గుంటూరు కేడరులోనూ, సానుభూతిపరులలోనూ పాదుకుపోయిన పార్టీ సిద్ధాంత విశ్వాస వాతావరణంవల్ల కుటుంబ స్థితిగతులవల్ల ఆయన గుంటూరు వదలి, కృష్ణాజిల్లా వీరులపాడు చేరి అక్కడ ట్యూషన్లు చెపూ కాలం గడిపేవారు.

కామ్రేడ్ నరసింహమూర్తి రాష్ట్ర మొదటి కాన్ఫరెన్సులో రాష్ట్ర కార్యదర్శిగా ఎన్నిక కావడంతో, గుంటూరు జిల్లా కమిటీకి నేను కార్యదర్శి నైనాను.

## కాంగ్రెసు సోషలిస్టు పార్టీ

1936 వరకూ పార్టీ కార్యకలాపాలకు కూలీ సంరక్షణ సంఘమే బహిరంగ వేదికగా ఉండేది. కార్మికవర్గంలో, ముఖ్యంగా ప్రెస్ వర్కర్సు యూనియన్ స్థాపించడం; ముఠా కార్మికుల్లోనూ, తోళ్ళ ఫ్యాక్టరీ కార్మికుల్లోను యూనియన్ నిర్మాణానికి కృషి చేయడం, కార్మిక పేటల్లో రాత్రి పాఠశాలలు నడపడం, తెనాలి తాలూకా అనంతవరంలోనూ రేపల్లె తాలూకా పల్లెకోనలోనూ వ్యవసాయ కూలీ సంఘాలు పెట్టడం కూలీ సంరక్షణ సంఘం పేరుతోనే జరిగినవి. కాంగ్రెసుకూ, గాంధీ వాదానికీ, దేవుడూ మతానికీ వ్యతిరేకంగా ప్రచారం సాగించడంతో జిల్లాలో పార్టీ సభ్యత్వము విస్తృతంగా లేదు. సాధారణ జాతీయ తత్వానికి దూరమైన అతివాద పెడధోరణివల్ల పార్టీ సభ్యత్వమూ ఇరవై ఇరవై అయిదుకు మించలేదు. కార్మికుల్లో సానుభూతి ఉన్నప్పటికీ, రైతాంగంలోనూ పట్టణ మధ్యతరగతుల్లోనూ విద్యార్థుల్లోనూ విస్తరించ లేకపోయినాం. సామాన్య కాంగ్రెసు వాదులుకూడా మా బహిరంగ విమర్శలకు ఎంత కోపగించుకున్నప్పటికీ, కాంగ్రెసు వాదులుగా ఉన్న రోజుల్లో మా యొక్క అచంచల దీక్ష, కార్యక్రమ నిర్వహణలో చూపిన పట్టుదలా, తోడు తోడుగా ప్రభుత్వ దమనకాండను అనుభవించామన్న సౌహార్ద భావమూ కలిసి, మమ్ములను ద్వేషించే వారుకాదు. నిప్పులాంటివాళ్ళు, నిజాయితీపరులనీ, విశ్వసించిన ఆశయాలకు ప్రాణాలైనా యిచ్చేవాళ్ళన్న గౌరవంతో మమ్ములను తూలనాడేవాళ్ళు కాదు.

1935లో కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ ఏడవ మహాసభ ఫాసిజానికి వ్యతిరేకంగా విస్తృత ప్రాతిపదికపై జాతీయ బూర్జువా వర్గంతో సహా, జాతీయ ఐక్య సంఘటనను నిర్మించాలని ప్రపంచ కార్మికవర్గానికీ, ఆయా దేశ కమ్యూనిస్టు పార్టీలకూ రాజకీయ కర్తవ్యాన్ని నిర్దేశించింది. ఆ మహాసభకు జార్జి డిమిట్రావ్ సమర్పించిన నివేదిక ఆధారంగా జాతీయ ఐక్య సంఘటనా విధానాన్ని భారత దేశానికి అన్వయింపజేస్తూ "దత్–బ్రాడ్లీ థీసిస్" వచ్చింది. అందులో కార్మిక, రైతు, వ్యవసాయ కూలీ, విద్యార్థి, యువజన సంఘాలను అనుబంధించుకోవడం ద్వారా, కాంగ్రెసునే జాతీయ ఐక్య సంఘటనా వేదికగా నిర్మాణం చేయడానికి కృషి చేయాలని ప్రతిపాదించబడ్డది. దీనితో కమ్యూనిస్టుపార్టీ చరిత్రలో స్వర్ణాధ్యాయం ప్రారంభమైందనవచ్చును. రైతు, వ్యవసాయ కార్మిక, విద్యార్థి సంఘాలు విస్తరించి, ఆయా వర్గాల, తరగతుల

దైనందిన కోర్కెల ప్రాతిపదికమీద అభివృద్ధి చెంది, పోరాట పంథాలో ప్రవేశించినవి.

1934లో కాంగ్రెసు ఉద్యమం విరమింపబడటంవల్ల భ్రమలు తొలగి సోషలిస్టు పంథాను స్వీకరించారు అనేకమంది అతివాద కాంగ్రెసు వాదులు. 1934లో ఆచార్య నరేంద్రదేవ్ అధ్యక్షుడుగా, జయప్రకాశ్ నారాయణ కార్యదర్శిగా అఖిల భారత కాంగ్రెసు సోషలిస్టు పార్టీ యేర్పడ్డది. ఐక్య సంఘటన కార్యక్రమం మేరకు అఖిల భారత కాంగ్రెసు సోషలిస్టుపార్టీ శాఖగా ఆంధ్ర కాంగ్రెసు సోషలిస్టుపార్టీని స్థాపించడం జరిగింది.

1935లో కాంగ్రెసు ప్రెసిడెంటుగా బాబూ రాజేంద్రప్రసాద్ ఆంధ్ర పర్యటనకు వచ్చినప్పుడు గుంటూరులో నల్లజెండాలు ప్రదర్శన చేసిన పార్టీ సభ్యులంతా, సానుభూతిపరులూ, 1936 సెప్టెంబరు మాసాంతంలో కాంగ్రెసు ప్రెసిడెంటుగా జవహర్‌లాల్ నెహ్రూ వచ్చినప్పుడు ఆహ్వానించాం. ఆయన రాకకు క్రితం రోజునే గుంటూరు జిల్లా కాంగ్రెసు సోషలిస్టుపార్టీ కాన్ఫరెన్సు జరిపాం. కామ్రేడ్ ఎస్.ఎ. డాంగే అధ్యక్షుడు. బహిరంగ సభకు ఐదారు వేలమంది ప్రజలు వచ్చారు. అప్పటికది మా ప్రాణానికి చాల పెద్ద ప్రజా సమీకరణ అని చెప్పాలి. బహిరంగ సభలో ఆయన ఉపన్యాసమూ, మరునాడు మధ్యాహ్నం ఏకా దండయ్య హాల్లో జరిగిన గుంటూరు మేధావుల సభలో "మహాభారతేతిహాసానికి భౌతికవాద నిర్వచనం" అన్న అంశంపై చేసిన ఉపన్యాసమూ చాలా మంచి అనుకూల వాతావరణాన్ని కలుగుచేసినవి.

30 వేలమంది హాజరైన బహిరంగ సభలో జవహర్‌లాల్ నెహ్రూ, భారత దేశానికి స్వతంత్ర మొచ్చిందాకా పోరాటం సాగవలసిందేననీ, పోరాటం జయప్రదం కావడానికి విశాలమైన జాతీయ ఐక్య సంఘటన నిర్మింపబడాలనీ, అట్టి ఐక్య సంఘటన నిర్మాణంలో సోషలిజం సహాయ పడుతుందనీ, నిజానికి సంపూర్ణ స్వాతంత్ర్య సాధనలో సోషలిజం సహాయ పడుతుందనీ కాంగ్రెసు అధ్యక్షుడే కాంగ్రెసు వేదికనుంచే నొక్కి చెప్పినప్పుడు మా సంతోషానికి అంతులేదు. కాని బులుసు సాంబమూర్తిగారు స్వరాజ్య మొచ్చేదాకా సోషలిజం సంగతి ఎత్తవద్దని తప్పుడు తర్జుమా చేసినప్పుడు బిగ్గరగా నిరసన తెలిపాం. మా నిరసనను నెహ్రూ అపార్థం చేసుకుని ఆయనకు సహజమైన కోపంతో మేము క్షమాపణ చెప్పకోకపోతే సభను వదలిపెట్టి పోతానని బెదరించాడు. సభంతా ఒక్కసారి లేచి మా మీద విరుచుక పడ్డది. వెంటనే నెహ్రూ మాకు ప్రమాదం జరుగుతుందని గ్రహించి ఆరడుగుల యెత్తు వేదికనుంచి అమాంతంగా దూకి, మా చుట్టూ మూగిన కోపోద్రిక్తులైన జనాన్ని సర్ది, మరల ఉపన్యాసం సాగించాడు. దీంతో మా జిల్లా కాంగ్రెసు సోషలిస్టు కాన్ఫరెన్సు జయప్రదం కావడానికి ఉదారంగా విరాళాలిచ్చి, మరి యితర విధాలుగా తోడ్పడ్డ కాంగ్రెసు ప్రముఖులందరకు మాపై ద్వేష మేర్పడ్డది. తాత్కాలికంగా నైనప్పటికీ, ఇది ఆసరా చేసుకుని, సోషలిజానికి వ్యతిరేకంగా విష ప్రచారం సాగించడానికి అవకాశ మేర్పడ్డది. గుంటూరులో జరిగిన యీ సంఘటన నెహ్రూ తాను వ్రాసిన "ఇండియాలో పద్దెనిమిది నెలలు" అన్న పుస్తకంలో ఉదాహరించాడు కూడా.

## పార్టీ హోల్ టైమర్లు - ఫ్రెండ్స్ హోమ్

1935లో బెనారస్ చదువు మానేసి గుంటూరు జిల్లా పార్టీ కార్యదర్శిగా బాధ్యతను స్వీకరించిన తరవాత, పార్టీ కార్యక్రమం సాగించడానికి హోల్ టైమ్ కార్యకర్తలను పోషించేంత పలుకుబడి పార్టీకి లేదు. ఇంతలో నండూరు ప్రసాదరావు వచ్చాడు. ఆలోచించాం. హోటలు పెట్టాలనుకున్నాం. ఆయన భార్య వడ్డాణం నుంచి రాళ్ళు పొదిగిన బంగారు బిళ్ళ తెచ్చాడు. నేను నా పెళ్ళిలో యిచ్చిన వెండి పళ్ళెమూ, వెండి మర చెంబూ తెచ్చాను. అవి అమ్మగా ఏడువందల రూపాయ లొచ్చినై. ఈ పెట్టుబడితో బ్రాడీపేట నాల్గవ లైనులో మతుకుమల్లి సుబ్బారావుగారి డాబా అద్దెకు తీసుకుని "ఫ్రెండ్స్ హోమ్" అనే హోటలు ప్రారంభించాం. ఏడు నెలలు నడిచింది. కమ్యూనిస్టు పార్టీలోకొచ్చింత తరువాత పురోహితం వృత్తి మానేసిన లోకనాథం, బాచినప్ప నరసింహం, కుందేటి రామకోటి, గిరిరాజు సత్యనారాయణ, కుందా పుల్లారావు, మరిద్దరు ముగ్గురు హోల్ టైమర్లు. ప్రసాదరావూ, నేనూ ఉదయం సాయంత్రం వడ్డనపని చూడటం, మధ్యాహ్నం, రాత్రిళ్ళు కార్మిక పేటలో యూనియన్ కార్యకలాపాలూ, రాత్రి పాఠశాలలూ సాగించడం జరిగింది. నేను హోటలు మేనేజిమెంటు, సాయంత్రం నుంచి సామ్రాజ్యవాద వ్యతిరేక సెల్లులనూ, పార్టీ ఆక్జిలియరీ సెల్లులనూ నడపడం, అధ్యయన తరగతుల్లో మార్క్సిజం పాఠాలు చెప్పడం సాగించేవాణ్ణి. కామ్రేడ్ యేటుకూరి బలరామమూర్తి, వెంపటి శ్రీనివాసమూర్తి, ఎ.వి. సుబ్బారావు, నాళం నరసింహారావు, డి.వి. అప్పారావు, ఊరె బాపారావు, అమరవాది కృష్ణమూర్తి, చతుర్వేదుల పార్థసారథి వగైరాలతో మూడు ఆక్జిలియరీ సెల్లులుండేవి. వీరంతా 1937కల్లా పార్టీ సభ్యులుగా చేర్చుకోబడ్డారు.

ఒకరోజు రాత్రి 8–30కు హోటల్ ప్రక్క కన్సర్వెన్సీ గొందిలో మా పాకీ దొడ్డి తలుపు తట్టిన చప్పుడు – మెల్లగా రెండుసార్లు వినపడ్డది. స్టోర్ రూములో వున్న నేనూ ప్రసాదరావు దొడ్డి తలుపు తెరిస్తే ఎవ్వరూ లేరు. పాకీవానికోసం ఏర్పరచిన తలుపు తెరిచాం. బయటినుంచి చప్పుడు కాకుండా ముగ్గురు వ్యక్తులు, ఫ్రెండ్సు హోమ్ ఇదేనా అన్నారు. ఏదో చీటి యిచ్చారు. రూమ్‌లోకి వచ్చారు. తలుపువేసి చూచేసరికి కామ్రేడ్స్ యస్.వి. ఘాటే, జలాలుద్దీర్ బుఖారీ – అంతకు పూర్వమే మీరట్ కామ్రేడ్స్ గ్రూపు ఫోటోచూసి ఉండబట్టి గుర్తించాం. మూడవ వ్యక్తి కామ్రేడ్ రాములు. ఆయన ఆలిండియా ప్రెస్ వర్కర్స్ ఫెడరేషన్ కార్యదర్శి. మద్రాసులో ఆలిండియా మహాసభ పూర్తిచేసుకుని వచ్చారు. గుంటూరు రైల్వే స్టేషన్ నుంచి రూట్ స్కెచ్ చూసుకుంటూ హోటలు కొచ్చారు. రాయిస్టు పెడధోరణిని గురించి కొన్ని సిద్ధాంత వివరణలు యిచ్చి, రామలింగయ్య రాయిస్టు డీవియేషన్ను ఎదుర్కోడంలో జాగ్రత్తలు చెప్పి, తిరుగు బండిలో వెళ్ళిపోయారు.

మరునాడు ఉదయం పదకొండు గంటలకు సరుకులు పట్టించుకుని, పైనుంచి వస్తూండగా లాలాపేట పోలీసు స్టేషన్‌నుండి పిలుపు. లోపలికి పోగానే సబ్ యిన్స్పెక్టరు రామరాజు వెంకటేశ్వర్లు తన కందిన పిటీషను నాచేతి కిచ్చాడు. టెర్రరిస్టు విప్లవకారులు వచ్చిపోయారని, హోటలు నడ్డంపెట్టుకుని లోపల రహస్యంగా బాంబులు తయారు చేస్తున్నారనీ – యింకా ఏవేవో ఉన్నాయి. ఒక్క నిమిషం పరకాయించా.

ఏమిటి అని ప్రశ్న. పిటీషన్ వివరాలన్నీ నిజమేనని చెప్పాను, తొణకకుండా. అది మా యింటి యజమాని వ్రాసిన పిటీషను. "వాడు వట్టి రాస్కెలూ, దగాకోరూ, లిటిగెంటూ, మా డిపార్టుమెంటుకు దొరికే ఇన్ఫార్మెంట్లందరూ అలాంటివాళ్ళే. వాడిల్లు ఖాళీ చేయండి" అని సలహాయిచ్చి పంపాడు.

తరవాత కొన్ని రోజులకు సరుకులైపోయి, డబ్బు తిరుగుదలకాక, ఆందోళనతో నా ఆరోగ్యం క్రమేణా చెడి, పార్టీ పనికి అంతరాయం కలుగుతూ రావటంతో తెల్లవారేసరికి బోర్డు తిరగేశాం. అప్పటివరకూ కూరలగుత్తి, నేతిగిన్నెతో పంక్తుల వెంట తిరుగుతూ, వాళ్ళంతట వాళ్ళే వడ్డించుకు తృప్తిగా భోంచేస్తూ, నేను గడప మీద కూచుని చేసే సోషలిస్టు సిద్ధాంత విషయాలమీద ప్రసంగాలు వింటూ కాలక్షేపం చేసిన నెలఖాతాదార్లంతా బోర్డు తిరగేసి ఉండటం చూసి ఆశ్చర్యం, బాధ వ్యక్తంచేసి వెళ్ళిపోయారు. తరువాత కొన్నాళ్ళు ప్రతాప రామసుబ్బయ్య గారింట్లోనూ, తరవాత రైలు పేటలో నాళం నరసింహారావుగారి బావ గుడివాడ నరసింహారావుగారి విశాలమైన మేడ పైభాగంలో మా హోల్ టైమర్లతో చేరాం, అద్దె లేకుండానే. పార్టీ ఫండు రూ.25/-ల కన్నా వసూలు లేదు. కరపత్రాలకూ, మీటింగులకూ సరిపోయేవి. మరి తిండికి సమస్య. ఆ పేటలోనే 1920లో జైలు కెళ్ళివచ్చిన రుక్కయ్య కాఫీ హోటల్లో ఖాతా. అందరం ఉదయం, సాయంత్రం రెండు పూటలా తిని వచ్చేవాళ్ళం. రెండునెల్లు తెల్లటి అన్నం ఎరగం. కొన్నాళ్ళకు 1938 వరకూ మిత్రుడు సభాపతి ఒక పెద్ద డబుల్ కారియర్ నిండా అన్నం, కూరలూ వగైరా పార్టీ ఫండు విరాళం క్రింద పంపేవాడు. ఆ కారియర్ పాతస్మృతిగా యిప్పటికీ నా దగ్గర వున్నది.

## టెర్రరిజంనుంచి కమ్యూనిజంలోకి

20వ శతాబ్ది ప్రథమ పాదంలో తలయెత్తి బ్రిటిషు ప్రభుత్వానికి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో కాంగ్రెసు నాయకత్వపు రాజీ పంథానుంచి దేశ ప్రజల దృష్టిని విప్లవ పంథాకు మళ్ళించడానికి వ్యక్తిగత హింసావాదాన్ని అవలంబించిన టెర్రరిస్టు గ్రూపులన్నీ, గదరు పార్టీతో సహా 1935-36 మధ్యలో సిద్ధాంత నిర్దుష్టమైన కార్మిక విప్లవ పంథాయైన మార్క్సిజం అవలంభించి కమ్యూనిస్టు పార్టీలో కొచ్చారు. ఆంధ్రలో కూడా 1920-30 మధ్య టెర్రరిస్టు విప్లవకారుల సాహసాన్ని, త్యాగనిరతిని చూచి ఆకర్షింపబడ్డవారుకూడా 35-37 మధ్య కమ్యూనిస్టు పార్టీలో కొచ్చారు. మద్దూరి అన్నపూర్ణయ్య (చిచ్చులపిడుగు ప్రశస్తి), అన్నాప్రగడ కామేశ్వరరావు, మాడభూషి వెంకటాచారి మొదలైనవా రలాంటివారే. మద్దూరి అన్నపూర్ణయ్య పార్టీలోకి రావడమేకాక ఆయన వయసూ రాజకీయానుభవాన్నిబట్టి రాష్ట్రకమిటీలో చేర్చుకొని ఆయన నడుపుతూన్న "నవశక్తి" వారపత్రికకను కూడా కమ్యూనిస్టుపార్టీ తీసుకుంది. 1936-37 నుంచీ కాంగ్రెసు సోషలిస్టుపార్టీ తరపున లీగల్ పత్రికగా కమ్యూనిస్టు పార్టీయే నడిపింది. 37 నుంచీ కామ్రేడ్ చంద్రం దానికి ప్రధాన సంపాదకుడు.

1936-37లో రాజమండ్రిలో కాంగ్రెసు సోషలిస్టు పార్టీ రాష్ట్ర మహాసభల బహిరంగ సభలో కామ్రేడ్ సుందరయ్య రాజద్రోహకర ఉపన్యాసం చేశాడన్న

నేరారోపణతో అరెస్టు చేయబడ్డారు. అప్పటికి రాష్ట్ర పార్టీ కార్యదర్శిగా ఉన్న కామ్రేడు నరసింహమూర్తికి పని వత్తిడి యెక్కువైంది. ఆదేకాలంలో సోవియట్ నుంచి వచ్చిన కామ్రేడు అన్నాప్రగడ కామేశ్వరరావు రాష్ట్ర కమిటీకి కో-ఆప్టు చేసుకోబడి, ఆర్గనైజింగు కార్యదర్శిగా నియమింపబడ్డాడు. అయనది గుంటూరే. 1920 కాంగ్రెసు ఉద్యమంలో పాల్గొన్నాడు. తరువాత టెర్రరిజం ద్వారా కమ్యూనిజంలో కొచ్చాడు.

## రాజకీయ పాఠశాలలు

రాష్ట్ర పార్టీ ఆదేశానుసారం గుంటూరు జిల్లా కమిటీ ఒంగోలు తాలూకా కొత్తపట్నంలో రాజకీయ పాఠశాలను నడిపే బాధ్యత తీసుకుంది. 1937 మే 1వ తేదీనుంచి 40 రోజులు నడపడానికి నిర్ణయించబడ్డది. కామేశ్వరరావుకు ప్రధానంగా డబ్బు ఒనరులు సమకూర్చే బాధ్యత. అయనకు జిల్లాలోని ఉన్నత మధ్య శ్రేణి కాంగ్రెసు వాదుల్లోనూ, కాంగ్రెసు వాదులైన వ్యాపార వర్గాల్లోనూ బాగా పలుకుబడి ఉండేది. డబ్బు, వస్తు సామాగ్రి పుష్కలంగా వసూలైంది. పాఠశాలకు సుమారు 200 వరకూ కాలేజీ హైస్కూలు విద్యార్థులూ, గ్రామాలనుంచి కార్యకర్తలూ విద్యార్థులుగా వచ్చారు. అర్థశాస్త్రం, తత్వశాస్త్రం, జాతీయోద్యమ చరిత్రా, ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రలపై నేనే పాఠ్యక్రమం తయారుచేశాను. విద్యార్థులను తెలుగు, ఇంగ్లీషు విభాగాలుగా చేసి, మొదటి వారం రోజులు సిలబస్ ప్రకారం రెండు సెక్షన్లకూ పాఠాలు చెప్పేవాణ్ణి. రాత్రి క్యాంపుల తనిఖీ. రోజూ 18 గంటల పని. తరవాత కామ్రేడ్ రాజేశ్వరరావు వచ్చి, మిలిటరీ డ్రిల్లు, క్యాంపు డిసిప్లిను, సర్వీసు వాలంటీరు అధిపత్యమూ తీసుకున్నాడు. ఒక వారం పదిరోజుల తరవాత కామ్రేడు కంభంపాటి సీనియర్ పాఠ్య బోధన భారం సగం పంచుకున్నారు. ఒంగోలు నుంచి ధారా గోపాలశాస్త్రి, చెరువు సుబ్రహ్మణ్యం, రామచంద్రరావు, విజయ రామరాజు మొదలైన కాంగ్రెసువాదులు చాలా సహాయపడ్డారు.

సుమారు యిరవై రోజులు గడిచినవి. 1937 జనరల్ ఎన్నికలైన తరవాత, మెజారిటీగా యెన్నికైన కాంగ్రెసు మంత్రివర్గా లేర్పరచేలోగా కూర్మా రెడ్డి నాయుడు ముఖ్యమంత్రిగా నడమంత్రపు మంత్రివర్గం నియమింపబడ్డది. మన రాజకీయ పాఠశాలలో మిలిటరీ ట్రైనింగు యిస్తున్నారనీ, బాంబులు తయారుచేయడం నేర్పుతున్నారనే సాకుతో కొత్తపట్నం వేసంగి రాజకీయ పాఠశాల నిషేధించబడ్డది. దాదాపు 100 మంది నిషేధాజ్ఞల నుల్లంఘించారు. మాజీ స్పీకరు పిడితల రంగారెడ్డి, చేగిరెడ్డి బాలిరెడ్డి, సుందరయ్య అక్కగారు శ్రీమతి గోవిందమ్మ, ఆమె భర్త ఆదిశేషయ్య, బసవారెడ్డి, శంకరయ్య, కామ్రేడ్ కంభంపాటి సీనియరు, దొడ్డవరపు కామేశ్వరరావు, కోడి నరసింహులు, శాయన్న వగైరాలు అరెస్టు చేయబడ్డారు. తీవ్రమైన లాఠీచార్జీ జరిగింది. కేసుల్లో డిఫెన్సు, గాయపడిన వారికి వైద్యమూ వగైరా గుంటూరు జిల్లా కమిటీ బాధ్యత వహించింది. శ్రీ కొండా వెంకటప్పయ్యగారూ, ప్రకాశం పంతులుగారూ మొదలైన ప్రముఖులు పాఠశాల నిషేధాన్నీ, దమనకాండనూ ఖండించారు. కేసు లెత్తివేయాలని ప్రకటనలు చేశారు.

రాజగోపాలాచారి నాయకత్వాన కాంగ్రెసు మంత్రివర్గ మేర్పడ్డ తరువాత "దౌర్జన్యాన్ని సహించేది లేదని" హెచ్చరిక చేస్తూ కేసుల నుపసంహరించుకున్నది కాంగ్రెసు ప్రభుత్వం.

## రంగా రైతువిద్యాలయంనుంచి పార్టీలోకి

కొత్తపట్నం వేసంగి రాజకీయ పాఠశాల నిషేధింపబడ్డ తరవాత నిడుబ్రోలు రంగా రైతాంగ విద్యాలయాన్ని చూచి విద్యార్థులతో పరిచయం చేసుకోవచ్చునని నేనూ, మాడభూషి వెంకటాచారి వెళ్ళాం. శ్రీ పండితారాధ్యుల నాగేశ్వరరావు పాఠం చెప్తున్నారు. అంత మనస్ఫూర్తియైన ఆతిథ్యం లభించలేదు. ఐనా మొండికేశాం. మర్నాడు ఉదయం ఫలహార సమయంలో రంగా గారితో పేచీ వేసుకున్నాం. ఆయన గాంధీజీని భారత దేశానికి లెనిన్ అని లోగడ యిచ్చిన ప్రకటనను గురించి వాదన పెట్టుకొని సాగలాగాం. ఇదేదో ముందు ఓట్ల కుపయోగపడుతుందని నాటకం. ఆయనతో మీ కెందుకని మాకినేని బసవపున్నయ్య, మమ్మల్ని విడిగా పిల్చి సర్దారు. అక్కడ మేము జరిపిన విడి చర్చల ఫలితంగా, బసవపున్నయ్య, ఆయన బావమరదులు కంఠంనేని వెంకటరత్నం, వెంకట సుబ్బయ్యా, ఆయన మేనమామలు నాగాయతిప్పకు చెందిన నారాయణగారు, అతని సోదరుడు, వెల్లటూరు నుంచి మోటూరు రాధాకృష్ణ, మోటూరు హనుమంతరావు వగైరాలు తరువాత గుంటూరులో చదువుకు వచ్చినప్పుడు నిత్యం అధ్యయన తరగతులు, విద్యార్థి సంఘ కార్యకలాపాల ద్వారా పార్టీలో కొచ్చారు. మాదల నారాయణస్వామి, వై. వి. క్రిష్ణారావు మొదలైన కొంతమంది కృష్ణా, గుంటూరు కమ్మహాస్టల్సు నుంచి పార్టీలో కొచ్చినవారే. నిజాని కారోజుల్లో గుంటూరు కమ్మ హాస్టలు విద్యార్థులు సుమారు డెబ్బయిమంది ఏ నిమిషాన కేకేసినా ఎర్రజండాలతో వీధుల్లోకొచ్చేవారు. గుంటూరు కమ్మహాస్టలు, డిప్రెసివ్ క్లాస్ హరిజన హాస్టళ్లు, యితర విద్యార్థి లాడ్జీలలో నిరంతరం జరుపుతూ వచ్చిన అధ్యయన తరగతుల మూలంగా, రాజకీయ చైతన్యం, విద్యార్థి సంఘ నిర్మాణమూ పటిష్టమై రాష్ట్రంలో మొట్టమొదటిసారి 1937–38 సంవత్సరం ఎ.సి. కాలేజీలో డిటెన్షను విధానానికి వ్యతిరేకంగా జరిగిన సమ్మె జయప్రదంగా ముగిసింది.

1935వ సంవత్సరంలో గుంటూరు ముఠా కార్మికుల్లో ప్రారంభించిన ప్రాథమిక కృషి, 1936 చివర రోజుల్లో కామ్రేడ్సు కనపర్తి నాగయ్య హోల్ టైమరుగా వచ్చి స్థిరపడటంతో ఆయన కృషి ఫలితంగా అప్పటికీ, యిప్పటికీ రాష్ట్రంలోకెల్లా బలమైన ముఠా కార్మిక సంఘమేర్పడి, దాని సహాయంతో, ప్రభావంతో తరవాత రోజుల్లో పొగాకు కార్మిక సంఘమూ, జూట్ మిల్లు కార్మిక సంఘమూ పార్టీ నాయకత్వం క్రింద ఏర్పడి బలపడ్డాయి. అలాగే కామ్రేడ్ గోపాలం కార్యదర్శిగా తాపీ మేస్త్రీల సంఘంకూడా యేర్పడ్డది.

అప్పటికి గుంటూరు బలమైన విద్యాకేంద్రమూ; దేశభక్తి పూరితమైన లాయర్లు, డాక్టర్లు, లెక్చరర్లు మొదలగువారితో విస్తృతమైన మేధావివర్గకేంద్రమూ కూడా. బలమైన విద్యార్థి ఉద్యమమూ, అందులోనుంచి ఎక్కువగా పార్టీ కార్యకర్తలు రావడమూ

కారణంగా, ఇతర జిల్లాలకు పార్టీ కార్యకర్తలుగానూ, హోల్ టైమర్లనూ సరఫరా చేసే కేంద్రమైందని చెప్తే ఆశ్చర్యం లేదు. బెజవాడకు 1936లో పిల్లమర్రి వెంకటేశ్వర్లునూ, ఆయన అరెస్టయిన తరవాత కె. యల్. నరసింహాను పంపింది గుంటూరు పార్టీయే. విశాఖపట్నంనుంచి నెల్లూరు, చిత్తూరు వరకూ దాదాపు ప్రతి జిల్లాకు కనీసం ఒక్క హోల్ టైమర్ నైనా పంపగలిగింది గుంటూరు కమిటీ. 1938లో నేనూ నెల్లూరు జిల్లా వెళ్ళి ఆరు నెలలకు పైగా ఉన్నాను. నూరు గ్రామాలు తిరిగాను. నెల్లూరు వెంకటగిరి రాజా కాలేజీ, ఎ. బి. యం. హైస్కూలు విద్యార్థుల సమ్మె నడిపాను. విచిత్ర మేమంటే – రాష్ట్రంలో యెక్కడా జరగని రోమన్ కాథలిక్ చర్చిలో కుల మత భేదానికి వ్యతిరేకంగా చర్చి సమ్మె నడిపాను.

## మంతెనవారిపాలెం రాజకీయ పాఠశాల

1938 మే నెలలో బాపట్ల తాలూకా మంతెనవారి పాలెంలో పార్టీ తరఫున రాజకీయ పాఠశాల పెట్టాం. రాష్ట్రమంతటి నుంచీ 350 మందికి పైగా విద్యార్థు లొచ్చారు. వచ్చిన వారంతా పార్టీ నిర్మాణ రంగంలోనూ, రైతు వ్యవసాయ కార్మిక, విద్యార్థి, యువజన రంగాలలోనూ హోల్ టైమ్ కార్యకర్తలుగా ఉన్నవారే. ఇంగ్లీషు, తెలుగు సీనియరు, తెలుగు జూనియరు మూడు క్లాసులుగా విభజించి, ఇంగ్లీషులోను తెలుగులోనూ ఆర్థిక, తత్వ శాస్త్రాలనూ, జాతీయోద్యమ చరిత్రనూ చెప్పేవాళ్ళు, ప్రిన్సిపాల్ గా నేనూ, కంభంపాటి జూనియర్, సి.వి.కె. రావు, అమరవాది కృష్ణమూర్తి, కంభంపాటి సీనియరు ఉపాధ్యాయులు. భారత కమ్యూనిస్టుపార్టీ చరిత్ర, విద్యార్థి యువజనోద్యమాల చరిత్ర మొదలైన వివిధ అంశాలమీద, కామ్రేడ్సు అధికారి, అజయ్‌ఘోష్, దేశ్‌పాండే, డాంగే, ఆర్. డి. భరద్వాజ ప్రత్యేకోపన్యాసా లిచ్చేవారు. వారం వారం బహిరంగ సభలు – చుట్టుపట్ల గ్రామాలనుంచి వేలాది ప్రజ లొచ్చేవారు. అజయ్‌ఘోష్, భరద్వాజ్, బుఖారి, దేశ్‌పాండె ఉపన్యాసకులు. రాజకీయ పాఠశాల నెల రోజులుగా విజయవంతంగా జరిగింది.

ఈ పాఠశాల జరిగే సందర్భంలోనే అఖిల భారత కమ్యూనిస్టు పార్టీ సెంట్రల్ కమిటీ మీటింగు ముంతెనవారి పాలెంలో జరిగింది.

## రెండవ ప్రపంచ యుద్ధం వచ్చింది

పార్టీ నాయకత్వమంతా రహస్య జీవితంలో పడ్డది. నన్ను వినుకొండలో ఇంటర్న్ చేశారు. 1940 డిసెంబరులో వినుకొండలో ఉన్న రెండు నెలలూ మా తమ్ముడు హనుమంతరావుగానూ, తురుమెళ్ళ సీతారామయ్యనూ, వారణాసి మల్లయ్యనూ కలిపి పార్టీ యూనిట్ ఏర్పాటు చేశారు. యుద్ధ వ్యతిరేక కరపత్రాలు పంచడం, చిన్న చిన్న పార్టీ ఆదేశిక కార్యకలాపాలు చేస్తుండే వారు. వినుకొండలో ఉండి పార్టీని నడపడం సాధ్యంకాదు. యుద్ధ ప్రారంభంలోనే మోటూరు హనుమంతరావు "స్టూడెంట్సు ఎంపోరియం" సోదాచేయగా "స్వతంత్ర భారత్", ఇతర నిషిద్ధ కరపత్రాలు దొరకడం జరిగింది. డప్పుల సుబ్బారాయుడు తెప్పరిల్లుకునేలోపల అతను అండర్ గ్రౌండ్. అది అంటే ఏమిటో తెలియదు. పిల్లి పిల్లను తిప్పినట్లు ఊరూరూ తిప్పి – దాచేపల్లిలో

వదలిపెట్టాను. ఆ రోజుల్లో కోలా సుబ్బారెడ్డి, తూములూరు సత్యనారాయణ, మరొకరు వెంకటేశ్వర్లని జ్ఞాపకం – ఈ ముగ్గురితో పల్నాడు తాలూకాకు మొదటి పార్టీ సెల్లు ఏర్పాటుచేశాం.

గుంటూరు జిల్లా రెండవ మహాసభ ఇంటూరు పల్లెకోన ఎడారి బాటలో మనుష్య సంచారంలేని ఒక కొష్టంలో జరిగింది. ఆ రహస్యంగా జరిగిన మహాసభకు 65 మంది పార్టీ ప్రతినిధులు హాజరైనారు. కొత్త కమిటీని ఎన్నుకున్నారు. నేను రాష్ట్ర కమిటీలో ఉన్నాను. కాబట్టి మాకినేని బసవపున్నయ్యను కార్యదర్శిగా ఎన్నుకున్నారు. నేను పోలీసు కాపలావల్ల హాజరు కాలేదు.

ఇలా రెండవ ప్రపంచ యుద్ధం వచ్చేసరికి జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ బోర్డు తిరగేశాం. అందులోని 120 లేక నూట ముప్పైమందీ కమ్యూనిస్టు పార్టీ సభ్యులైనారు. కాంగ్రెసు నాయకత్వం యుద్ధం ఆసరాగా ప్రభుత్వంతో రాయబారాల కెదురుచూస్తుంటే "సామ్రాజ్యవాద యుద్ధాన్ని అంతర్యుద్ధంగా మార్చు!" (Turn the Imperialist war into Civil war) అనే నినాదంతో భారత కమ్యూనిస్టు పార్టీ ముందుకొచ్చింది. సామ్రాజ్యవాదానికీ, బ్రిటిషు ప్రభుత్వ పాలనకూ వ్యతిరేకులైన ప్రజలూ, అతివాద కాంగ్రెసు కార్యకర్తలూ, దేశభక్త మేధావి తరగతులూ పార్టీని బలపరచారు. గుంటూరు జిల్లాలోనూ, ముఖ్యంగా గుంటూరు ప్రజల్లో విశ్వాసాన్ని చూరగొన్నది. ప్రజల నాడి పోరాట వైఖరిని సూచించింది. పార్టీ ఆ పంథాలో ఉంది. అనేకమంది అతివాదులు నాయకత్వంకన్నా ముందుగానే యుద్ధ వ్యతిరేక కార్యకలాపాలు సాగించి జైలుకొచ్చారు.

రేవేంద్రపాడు వద్ద సుందరయ్య అని భ్రమపడి నన్ను పట్టుకున్నారు. 1943 డిసెంబరు 25వ తేదీని స్పెషల్ కోర్టును పెట్టి, నాకు 21 నెలలు శిక్ష విధించాడు నరసారావుపేట ఆర్.డి.ఓ. అప్పటినుంచి మే మొదటి వారంలో జైలు నుంచి తప్పించుకుని వచ్చేవరకూ సుమారు నాల్గు నెలలు తమిళ, కేరళ, ఆంధ్ర ప్రాంతాలనుంచి యుద్ధ వ్యతిరేక కార్యకలాపాలకుగాను జైలుకు వచ్చిన వారందరికీ మార్క్సిజం క్లాసులు రోజుకు 10 గంటలు పెట్టేవాణ్ణి. వారంతా యిప్పుడు కమ్యూనిస్టు పార్టీలోనూ, మార్క్సిస్టు పార్టీలోనూ, కొందరు నక్సలైట్లుగానూ, జిల్లా, రాష్ట్ర, అఖిల భారత స్థాయిలోకూడా ప్రముఖులుగా ఉన్నారు.

★ ★ ★

# శ్రీ నండూరి ప్రసాదరావు



నా చిన్నతనంలో గాంధీజీ మా ఊరు కృష్ణాజిల్లా అరుగొలను వచ్చారు (సంవత్సరం గుర్తులేదు). అయ్యదేవర కాళేశ్వరరావుగారు నాకు వేలు విడిచిన మేనమామ. గాంధీజీని ఆయన మా ఊరికి తీసుకుని వచ్చారు. బహిరంగ సభలో గాంధీజీ స్వరాజ్య నిధికి విరాళాల కోసం విజ్ఞప్తి చేశారు. గ్రామస్తులు తోచినది విరాళాలుగా ఇచ్చారు. కాళేశ్వరరావుగారు 'నీ ఉంగరం ఇవ్వరా!' అన్నారు. ఎందుకో, ఏమిటో తెలియని వయసది. అయినా, నా వేలికున్న బంగారు బటువును తీసి ఇవ్వడం జరిగింది. నా రాజకీయ జీవితానికి అది ప్రారంభం కాకపోయినా, గాంధీజీ పేరు మాత్రం మనస్సులో హత్తుకు పోయింది.

మెట్రిక్యులేషన్ పాసయిన తరువాత కాలేజీ చదువుకై 1928లో బందరు వెళ్ళాను. హిందూ కాలేజీలో ఎఫ్.ఎ.లో చేరాను. ఆ కాలేజీలోనే పెనుమర్తి వెంకటరత్నంగారనే విద్యార్థితో స్నేహం కుదిరింది. ఆయన సోదరుడు పెనుమర్తి లక్ష్మీపతి శాస్త్రిగారు బందరులో కాంగ్రెస్ నాయకుడు. ఉద్రూతలూగించే ఉపన్యాసా లిచ్చేవాడు. ఆ విధంగా కాంగ్రెస్, కాంగ్రెస్ ఉద్యమం గురించి కొంత తెలుసుకోవడం జరిగింది.

ఆ రోజులలో బులుసు సాంబమూర్తిగారు కాంగ్రెస్‌లో అతివాది. శ్రీనివాస అయ్యంగార్‌తో కలసి ఇండిపెండెన్స్ లీగ్ అనే సంస్థను ఏర్పరచి, కాంగ్రెస్ ఆధికారికంగా డొమినియన్ స్టేటస్ కోరుతున్నపుడు సంపూర్ణ స్వాతంత్ర్యం కొరకై దేశమంతటా ప్రచారం సాగించేవాడు. ఆ సందర్భంగా ఆయనను అరెస్టు చేసి రాజద్రోహనేరం మోపి విచారణకు బందరు తీసుకుని వచ్చారు. దానికి నిరసనగా కొంతమంది విద్యార్థులం బయల్దేరి పోలీసు వాహనాలకు అడ్డంగా చెట్లకొమ్మలు నరికి పడేశాం. ఆ విధంగా రాజకీయ ఉద్యమంలో అడుగు పెట్టడం జరిగింది.

బ్రిటిష్ ప్రభుత్వం నెహ్రూ రిపోర్టును అంగీకరించనూ లేదు, డొమినియన్ స్టేటస్ ఇస్తానని వాగ్దానమూ చేయలేదు. కాబట్టి లాహోరులో జరిగిన కాంగ్రెస్‌లో సంపూర్ణ స్వాతంత్ర్య సాధనే తమ లక్ష్యమని కాంగ్రెస్ తీర్మానం చేసింది. అందుకై సత్యాగ్రహ సమరాలు సాగించాలని నిర్ణయించింది.

## బందరు సత్యాగ్రహ శిబిరంలో నేను, సి.ఆర్.

బందరు ఆనాడు కాంగ్రెస్ రాజకీయాలలో ప్రముఖ స్థానం వహిస్తూ ఉండేది. డా॥ పట్టాభి, ముట్నూరు కృష్ణారావుగార్లవంటి ప్రముఖుల కార్యస్థానమది. సత్యాగ్రహం కొరకై సన్నాహాలు ముమ్మరంగా ప్రారంభమైనవి. బ్రిటిష్ ప్రభుత్వ నిర్బంధంనుండి తప్పించుకుంటానికిగాను ముల్పూరి చుక్కమ్మగారి ఆధ్వర్యంలో పరాస్‌పేటలో సత్యాగ్రహ శిబిరం స్థాపించబడింది. సత్యాగ్రహ శిబిరంలో వలంటీర్‌గా చేరాను. చంద్ర రాజేశ్వరరావు గారు కూడా నాతోపాటు వలంటీర్‌గా నమోదైనాడు. డా॥ హార్డికర్ బందరు వచ్చి, స్వచ్ఛంద సేవకుల దళాన్ని ప్రారంభించారు. దానిలో సభ్యులుగా చేరాం. రాట్నం వడకటం, డ్రిల్లు చేయడం మా పని.

1930లో సత్యాగ్రహం ప్రారంభమైంది. సరిగ్గా పరీక్షల కాలం. ఇంగ్లీషు, తెలుగు, ఇండియన్ హిస్టరీ పేపర్లు అయిపోయాయి. కాన్స్టిట్యూషనల్ హిస్టరీ ఆఫ్ బ్రిటన్ పరీక్ష రాయడానికి మనసొప్పలేదు. పరీక్షకు వెళ్ళలేదు. ఫలితం గ్రూపులో తప్పడం.

సత్యాగ్రహం జోరుగా సాగుతున్నది. గుడివాడలో కాంగ్రెస్ బహిరంగసభను జరుపుతూ ఉండగా పోలీసులు కాల్పులు జరిపారు. సత్యాగ్రహోద్యమంలో ఇదే మొట్టమొదటి పోలీసు కాల్పులు. దింటకుర్రు(?) మునసబుకు తొడలో నుండి గుండు దూసుకుపోయింది. పడిపోయిన ఆయనను కొంతమందిమి తీసుకుని ఒక ఫ్యాన్సీ షాపులో పడుకోబెట్టి ప్రథమచికిత్స చేస్తున్నాం. పోలీసులు వచ్చి మమ్మల్ని లాక్కుపోయి లాకప్‌లో పడేశారు. రెండురోజుల తరువాత విడిచి పెట్టారు. అదే మొట్టమొదటి రాజకీయ నిర్బంధం అనుభవం.

సత్యాగ్రహోద్యమం సాగినంతకాలం చదువుకు స్వస్తిచెప్పడం జరిగింది. పూనా ఒడంబడిక, గాంధీజీ తిరిగి నిరాహారదీక్షకు పూనుకోవడం, సత్యాగ్రహోద్యమాన్ని విరమించడం గాంధీజీ విధానాలపైన, కాంగ్రెస్ విధానాలపైనా మరింత విరక్తి కలగడానికి దారి తీసింది. (గాంధీజీ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్‌కు వెళ్ళడం; భగత్‌సింగ్, రాజ్‌గురు, సుఖ్‌దేవ్‌ల ఉరి మూలకంగా 1931లోనే కాంగ్రెస్ విధానాలపై కొంత అసంతృప్తి ప్రారంభమైంది.) కాబట్టి వేరు మార్గాలు ఆలోచించడం ప్రారంభమైంది.

## బెనారస్ చదువులు

టెర్రరిస్టుల ఉద్యమం తగ్గుముఖం పట్టినా చెదురు మదురుగా సాగుతూనే ఉంది. చంద్రశేఖర్ ఆజాద్ వీరమరణం యువలోకాన్నంతటినీ కదిపింది. అటువంటి దశలోనే తిరిగి చదువుకోవాలని, టెర్రరిస్టులతో సంబంధాలు పెట్టుకోవాలనే వాంఛ బయలుదేరింది. ఆ వాంఛతోనే బెనారస్ యూనివర్సిటీలో చదవాలనీ, అక్కడ అతివాదులతో సాన్నిహిత్యం ఏర్పర్చుకోవాలనీ అనుకోవడం, ఆ విధంగా బెనారస్ వెళ్ళడం జరిగింది.

త్రోవలో అలహాబాదులో దిగి ఆల్ఫ్రెడ్ పార్కుకు వెళ్ళి ఆజాద్ వీరమణం చెందిన చోటును దర్శించడం జరిగింది. ఆయన మరణించిన చోటున ఉన్న మర్రిచెట్టును వేలాది మంది ప్రతిరోజూ దర్శిస్తూ వుండటం వలన ప్రభుత్వం, నేను వెళ్ళడానికి కొద్దిరోజులముందే ఆ చెట్టును నరికివేసింది.

నేను బెనారస్ చేరేటప్పటికే చంద్ర రాజేశ్వరరావు, వారి అన్న చంద్ర రామలింగయ్యగారు కూడా అక్కడికి చేరారు. వి. వి. గిరిగారి తమ్ముడు రామమోహన్ కూడా విద్యాభ్యాసం కొరకు అక్కడికి వచ్చారు. దాదాపు అందరిదీ ఒకే లక్ష్యం. విప్లవకారులతో సంబంధాలు పెట్టుకోవడం. అందుకై లంకలోని రామనగర్‌లో ప్రత్యేకంగా ఒక ఇల్లు తీసుకుని అక్కడ ఉంటూ ఉండేవారం. కొంతకాలం ఒక టెర్రరిస్టుకు ఆశ్రయం కూడా ఇచ్చాం.

## బెనారస్ గ్రూపు ఆవిర్భావం

అయితే అప్పటికే టెర్రరిజం దాదాపు అంతరించిపోయింది. చాలామంది కమ్యూనిస్టు పార్టీలో చేరారు. బెనారస్ యూనివర్సిటీ కూడా కమ్యూనిస్టులకు ఒక కేంద్రంగా ఉండేది. అక్కడనే సత్యాగ్రహోద్యమంలో పాల్గొని, జైలునుండి విడుదలై ఉన్నత విద్యాభ్యాసం కోసం వచ్చిన పోలేపెద్ది నరసింహామూర్తి, పులుపుల వెంకట శివయ్య మున్నగువారితో పరిచయం ఏర్పడింది. కాశీ విద్యాపీఠ్‌లో తుమ్మల వెంకటరామయ్యగారు, సోమూరి వెంకటరామయ్యగారు ఉండేవారు. తరువాత కాట్రగడ్డ నారాయణరావుగారు, పొన్నం వీరరాఘవయ్యగారు, సి.ఎల్. రాయుడు మున్నగువారు వచ్చి చేరారు.

కాశీ విద్యాపీఠ్ ప్రిన్సిపాల్ ఆచార్య నరేంద్రదేవ్, బాబూ సంపూర్ణానంద్ ప్రముఖ సోషలిస్టులు. వారు వచ్చి విద్యార్థులకు సోషలిజం గూర్చి ఉపన్యాసాలిస్తూ ఉండేవారు. కమ్యూనిస్టు రహస్యశాఖల నేర్పరచి, చిత్తళ్ళే మున్నగు వారు సమావేశాలు జరుపుతుండేవారు. దేవకాంత్ బారువా మాకు సోషలిజం గురించి పుస్తకాలు సప్లయి చేస్తుండేవాడు. శాక్స్ వ్రాసిన బేసిక్ ప్రిన్సిపాల్స్ ఆఫ్ సోషలిజం, ట్రాట్స్కీ వ్రాసిన రష్యన్ రివల్యూషన్ ఆయన సప్లయి చేసినవే. కమ్యూనిస్టుల ఆక్సిలరీ సెల్స్ ఏర్పరచబడటం, వాటిలో సభ్యులుగా చేరడం జరిగింది.

ఆ విధంగా టెర్రరిజంపై వ్యామోహంలో బెనారస్ యూనివర్సిటీకి వెళ్ళి, అక్కడ కమ్యూనిస్టుగా మారడం జరిగింది.

★ ★ ★

# శ్రీ పొన్నం వీర రాఘవయ్య



జాతీయోద్యమ ప్రభావంతో దేశభక్తియుత కార్యక్రమాలవైపు ఆకర్షితుడునైన నేను బెనారస్ విశ్వ విద్యాలయంలో చదువుతున్న కాలంలో సోషలిస్టు స్టడీ సర్కిల్ ద్వారా సోషలిస్టు ఉద్యమాలవైపు మళ్ళాను. కమ్యూనిస్టుగా నేటివరకు జీవితం గడుపుతున్నాను.

నా స్వగ్రామం నూజివీడు తాలూకా ఆగిరిపల్లి మండలంలోని నరసింగపాలెం. మా గ్రామం బ్రహ్మయ్య లింగం చెరువు లోతట్టులో వుంది. ఆగిరిపల్లికి రెండు కిలోమీటర్ల దూరం ఉంటుంది. మాది ధనిక రైతు కుటుంబం. మా మేనమామలది గన్నవరం. ఇది తాలూకా కేంద్రం. నేను పుట్టినది, పెరిగినది అక్కడే. అప్పుడు గన్నవరంలో మిడిల్ స్కూలు ఉండేది. మా మేనమామలది కూడా ధనిక రైతుకుటంబం కావడంవల్ల నన్ను మేనలో కూర్చోబెట్టి భజంత్రీలతో మాష్టారు ఇంటికి తీసుకువెళ్ళి అక్షరాభ్యాసం చేయించారు. ప్రాథమిక విద్యనుంచి థర్డ్‌ఫారమ్ వరకు అక్కడే చదివాను.

గన్నవరంలో హైస్కూలు లేని కారణంగా పునాదిపాడులో ఉన్న హైస్కూల్‌లో చేర్చారు. అక్కడ ఎస్.ఎల్.సి. వరకు చదివాను. గుంటూరు ఎ. సి. కాలేజీలో

ఇంటర్మీడియెట్ పూర్తిచేశాను. అనంతరం నేను, మరికొంతమంది కలిసి కాశీ విశ్వవిద్యాలయానికి వెళ్ళాం. బి.ఏ., లా పట్టాలు తీసుకుని 1937లో తిరిగి వచ్చాను. ఇదీ నా విద్యాభ్యాస దశ. ఈ దశలోనే నేను కమ్యూనిస్టుగా మారాను. ఆ క్రమాన్ని చూద్దాం.

1930లో స్వాతంత్ర్యోద్యమం దేశం నలుమూలలా విస్తృతంగా కొనసాగుతోంది. అసంఖ్యాక దేశభక్తులు, విప్లవీరులు మహోన్నత త్యాగాలు చేస్తూ ఆ మహాయజ్ఞంలో సమిధలవుతున్నారు. గాంధీగారు ఉప్పు సత్యాగ్రహానికి పిలుపు నిచ్చారు. ఆ పిలుపు నందుకొని విజయవాడలో శ్రీ వెలిదండ్ల హనుమంతరావుగారి నాయకత్వంలో ఒక దళం, గంపలగూడెం కుమారరాజాగారి నాయకత్వంలో ఒక దళం బందరు చేరుకొని ఉప్పుసత్యాగ్రహాన్ని జరిపాయి. ఈ మార్చ్‌లో గంపలగూడెం కుమారరాజాగారు కొన్ని దేశభక్తియుత పద్యాలు స్వయంగా వారే రాసినవి పాడారు. ఆ సంఘటనను నేను ప్రత్యక్షంగా చూశాను. వలసవాద సంకెళ్ళ నుండి భారత మాతకు విముక్తి కలిగించాలన్న ఆ ఉద్యమం, ఆ నినాదం నున్న ఎంతగానో ప్రభావితం చేశాయి.

ఇక్కడ మరో సంఘటన కూడా నన్ను ప్రభావితుణ్ణి చేసింది. మాకు మొగల్రాజపురంలో బంధువులుండటం చేత తరుచూ ఆ గ్రామం వెళుతుండేవాణ్ణి. ఆ విధంగా గ్రామంలోని కాట్రగడ్డ సోదరులతో మంచి పరిచయం ఏర్పడింది. వారు స్వాతంత్రోద్యమంలో అపారమైన త్యాగాలు చేశారు. ఉప్పు సత్యాగ్రహం మార్చ్‌లో పాల్గొన్నారు. గాంధీగారు ఆ గ్రామం వచ్చినపుడు మధుసూదనరావుగారి తల్లి తన చేతి బంగారు గాజులు గాంధీగారి కిచ్చింది. వాలంటీర్లకు భోజన సదుపాయం కల్పించింది. ఫలితంగా పోలీసులు ఆమెను అరెస్టు చేశారు. ఈ పోరాటంలో కాట్రగడ్డ సోదరులు జైలుశిక్ష అనుభవించారు. హరిజనులతో సహపంక్తి భోజనాలు నిర్వహించారు. ఇదంతా ప్రత్యక్షంగా చూసిన నేను ఉద్యమంపట్ల ఆకర్షితుడైనాను.

1930–31, 31–32 సంవత్సరాలలో నేను నరసింగపాలెం, గన్నవరంలో వున్నాను. ఆ కాలంలో గన్నవరంలో విద్యార్థులతో కలసి 'Buy Indian goods' పేరిట స్వదేశీ వస్తువులను మాత్రమే కొనమని ప్రోత్సహించే సంస్థను నెలకొల్పాం. మనదేశంలో తయారు అయ్యే వస్తువులను విజయవాడనుండి కొనితెచ్చి గన్నవరం చుట్టు ప్రక్కల గ్రామాలలో అమ్మేవాళ్ళం.

1931–32లో మా గ్రామంలో వుంటున్నప్పుడు గ్రామంలోని దేవాలయంలో పూజారిగా వున్న మాధవాచారిగారు స్వాతంత్ర్యోద్యమం వైపు మమ్మల్ని ఉత్తేజ పరిచేవారు. ఆయన యువకులను ప్రోగు చేసి దేశభక్తి కార్యక్రమాలను చేపట్టేట్టు ప్రోత్సహించేవారు.

ఈ కాలంలోనే ఆంధ్రలోని విద్యాలయాలలో పరిస్థితి విషమంగా వుండేది. విద్యార్థులు దేశభక్తియుత కార్యక్రమాలలో పాల్గొనడాన్ని తీవ్రంగా పరిగణిస్తూ, విద్యాసంస్థలనుండి బహిష్కరించేవారు. ఆంధ్ర విశ్వ విద్యాలయం లైబ్రరీ నుండి అభ్యుదయ సాహిత్యాన్ని పూర్తిగా తొలగించారు. ఎన్ని అవరోధాలు, అడ్డంకులు ఉన్నప్పటికీ విద్యార్థులు ఉప్పెనలా స్వాతంత్ర్యోద్యమ సమరంలోకి దుమికారు. చదువులకు స్వస్తి చెప్పారు. కొందరు విద్యార్థులు కాలేజీ, హైస్కూళ్ళను బాయ్‌కాట్

చేశారు. ఇలా ఒకదానివెంట మరొకటి – ఎన్నెన్నో సంఘటనలు నన్ను ఆ ఉద్యమబాటలో నడిపించాయి.

## బెనారస్ విశ్వవిద్యాలయం

ఆ రోజుల్లో కాశీ హిందూ విశ్వవిద్యాలయానికి ఒక ప్రత్యేకత, విశిష్టస్థానం వుండేది. అక్కడ చదువుకోవడం ఎంతో అదృష్టంగా భావించేవారు. విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్‌గా పండిట్ మదన్‌మోహన్ మాలవ్యా వుండేవారు. జాతీయోద్యమ కార్యక్రమాలలో ఆ విశ్వవిద్యాలయం విద్యార్థులు పాల్గొనేవారు. అందుకు వారికి పూర్తిస్వేచ్ఛ నిచ్చేవారు. ఇదంతా విన్న నాకు అక్కడ చదవాలన్న కోరిక కలిగింది. అయితే నేను ఒక్కగానొక్క కొడుకును కావటంవల్ల పంపేందుకు మా నాన్నగారు అంగీకరించలేదు. 'బెనారస్ విశ్వవిద్యాలయంలో తప్ప ఎక్కడా చదవను' అని నేను ఆ ఏడాది చదువు మానేశాను.

ఆ ఏడాదిలో నేను హిందీ నేర్చుకున్నాను. మా గ్రామానికి ఒక హిందీ మాస్టారును తీసుకొచ్చి కొంతమంది యువకులు హిందీ నేర్చుకోవడం ప్రారంభించాం. హిందీలో దక్షిణ భారత మధ్యమ పరీక్ష పాసయ్యాను. ఇదంతా కాశీ విశ్వ విద్యాలయానికి వెళ్ళాలన్న పట్టుదలతోనే చేశాను. 1932–33 లో మా నాన్నగారు కాశీ విశ్వవిద్యాలయానికి పంపేందుకు అంగీకరించారు. నేను, ఇంకా కొంతమంది విద్యార్థులం వెళ్ళాం. నేను, పోలేపెద్ది నరసింహమూర్తి, నందూరి ప్రసాదరావు బి.ఏ.లో చేరాం. నాతోపాటు తీసుకువెళ్ళిన డా॥ సి. ఎల్. రాయుడును ఇంటర్మీడియట్‌లో చేర్చాం. 1933–34లో కాట్రగడ్డ నారాయణరావు జైలునుండి విడుదలై తిరిగి వచ్చి బి.ఎ. రెండో సంవత్సరంలో మాతో కలిశారు.

హిందూ విశ్వవిద్యాలయంలో మాతోపాటు చండ్ర రాజేశ్వరరావు, శివయ్య, మిక్కిలినేని బలరామయ్య, చలసాని నాగేశ్వరరావు, చండ్ర రామలింగయ్య తదితరులు ఉండేవారు. హాస్టల్‌లో సీట్లు దొరకక నేను, పోలేపెద్ది నరసింహమూర్తి యూనివర్సిటీ ప్రక్కన వున్న ప్రైవేట్ లాడ్జిలో చేరాక గదిలో వుండేవాళ్ళం. ప్రతిరోజూ లైబ్రరీకి వెళ్ళేవాళ్ళం. ఆ లైబ్రరీలో వేదాలు దగ్గర నుంచి కమ్యూనిస్టు సాహిత్యంవరకు వుండేది. ప్రభుత్వం నిషేధించిన పుస్తకాలు కూడా అక్కడ దొరికేవి. మేం రోజూ గ్రంథాలయానికి వెళ్ళి వివిధ పుస్తకాలు చదవటం చూసిన దేశ్‌ముఖ్ అనే లా స్టూడెంట్ మాతో పరిచయం పెట్టుకున్నాడు. సావర్కార్ గురించి రాసిన పుస్తకం యిచ్చి చదవమన్నాడు. సావర్కార్ ఫ్రాన్స్‌లో ఓడలో నుంచి పారిపోవడం, బ్రిటిష్ సామ్రాజ్య వ్యతిరేక పోరాటంలో ఆయన పాత్ర గురించి దానిలో వుంది. దేశ్‌ముఖ్‌తో మేం జాతీయోద్యమం గురించి చర్చించేవాళ్ళం. గాంధీ కార్యక్రమాలే మంచివని మేం వాదించేవాళ్ళం. అయన అప్పుడు 'హిస్టారికల్ మెటీరియలిజం' ఇచ్చి చదవమన్నాడు. ఎన్ని పేజీలు చదివారు. ఎచ్చటివరకు చదివారు అంటూ ప్రతిరోజు అడిగేవాడు. మేం డైలెక్టికల్ భాగం చదివాక, భౌతికవాదం శాస్త్రీయమైనదనే అభిప్రాయానికి వచ్చాం. అప్పుడు ఆయన మమ్మల్ని 'సోషలిస్టు స్టడీ సర్కిల్'కు తీసుకువెళ్ళారు. ఆ తరువాత చండ్ర రాజేశ్వరరావు, నందూరి ప్రసాదరావు, శివయ్య,



బెనారస్ హిందూ విశ్వవిద్యాలయంలో విద్యార్థుల కమ్యూనిస్టు గ్రూపు (1934) నిలబడినవారు (ఎడమనుండి కుడికి): ఎం.ఎ.పర్మార్, ఉస్తోవ్ పరేఖ్, వై.బి. భూషణ్, పి.ఎస్.మూర్తి, సి. నాగేశ్వరరావు, వారే, చంద్ర రామలింగయ్య, సి.ఎల్. రాయుడు, బలరామయ్య, బరూబా, ఎస్.ఎల్. మెర్; కూర్చున్నవారు: ఆర్.కె. కిరాద్, ఎస్. మెర్, చంద్ర రాజేశ్వరరావు, విటల్ చైదరి, పి.వి. రాఘవయ్య, బి.పి. కొయిరాలా, ఘాటే, డి.కె. బారువా, ఎల్.కె. ఒకా; నేలమీద కూర్చున్నవారు: సి.డి. చౌదరి, టి.ఎన్. రాయ్‌చౌదరి, ఎస్. దాస్‌గుప్తా, సి.పి. సోమయాజులు, పులుపుల శివయ్య.

కాట్రగడ్డ నారాయణరావు, మిక్కిలినేని బలరామయ్య, చంద్ర రామలింగయ్య, చలసాని నాగేశ్వరరావు, డా॥ సి. ఎల్. రాయుడు, మరికొంతమంది 'సోషలిస్టు స్టడీ సర్కిల్'లో చేరారు. అప్పట్లో కాశీ విద్యాపీఠంలో సోమూరి వెంకట్రామయ్య, తుమ్మల వెంకట్రామయ్య, ఇంకొంతమంది వుండేవారు. వారికి, మాకు రాకపోకలు ఏర్పడ్డాయి. విద్యాపీఠ్ ప్రిన్సిపాల్ నరేంద్రదేవ్ నెహ్రూ అనుచరులు, సోషలిస్టు. ఈ దశలోనే థియోసాఫికల్ లాడ్జికి జిడ్డు కృష్ణమూర్తి వచ్చి ఉపన్యాసాలు ఇచ్చేవారు. ఈ ఉపన్యాసాలు వినేందుకు మేమంతా వెళ్ళేవాళ్ళం.

ఆ రోజులలో కలకత్తాకు కమ్యూనిస్టు సాహిత్యానికి సంబంధించి పుస్తకాలు వచ్చేవి. మాకు హబీబ్ అడ్రసు ఇచ్చారు. పుస్తకాల కోసం నేను ఆయనకు ఉత్తరాలు రాసేవాణ్ణి. నా ఉత్తరాలు పోలీసులకు దొరికాయి. నా గది సోదా చేయడానికి పోలీసులు వచ్చారు. అయితే, పోలీసులు విశ్వవిద్యాలయంలో ప్రవేశించడానికి విశ్వవిద్యాలయాధికారుల అనుమతి పొందాలి. పర్మిషన్ కోసం పోలీసులు అడగగానే మా వార్డెన్‌కు ఫోన్ చేసి చెప్పారు. ఆయన నాకు చెప్పారు. నా గదిలో వున్న కమ్యూనిస్టు సాహిత్యాన్ని, నిషేధించిన పత్రికను కిటికీలోంచి ప్రక్కనున్న గదిలో వుంటున్న కేరళ విద్యార్థి జార్జికి అందజేశాను. పోలీసులు సోదా చేశారు. ఫలితం లేకపోయింది. నన్ను రిజిస్ట్రార్ వద్దకు తీసుకువెళ్ళి పోలీసులు ఆయన ఎదుట ప్రశ్నించారు. ఒంటరిగా ప్రశ్నించడానికి వీలు లేదు. విశ్వవిద్యాలయం నిబంధనలు అలా వుండేవి. ఎం. ఎన్. రాయ్ తెలుసా? అని ప్రశ్నించారు. 'పత్రికల ద్వారా తెలుసుకున్నాను' అని సమాధానం చెప్పాను. వారు వెళ్ళిపోయారు.

మా స్టడీ సర్కిల్‌లో ఇతర రాష్ట్రాలకు చెందిన వారిలో ముఖ్యంగా బి.పి. కొయిరాల, దేవకాంత బారువా వుండేవారు. విఠల్ చౌదరి (బొంబాయి) స్టడీ సర్కిల్ నడిపేవారు. మేం వారానికొకసారి కలిసేవాళ్ళం. తొలుత కమ్యూనిస్టు మేనిఫెస్టో మొదటి చాప్టర్ చదివి అర్థం చెప్పేవారు. ఆ తరువాతవారం దానిపై చర్చలు జరిపేవాళ్ళం. ఇదే మాదిరిగా మిగతా క్లాసులన్నింటిలో ఒక వారం లెసన్ చెప్పడం, రెండవ వారం చర్చలు జరపడం జరిగేది. అనుమానాలను తొలగించుకోవడం చేసేవాళ్ళం. హిస్టారికల్ మెటీరియలిజం, డైలెక్టిక్స్, ఎకానమీ సంబంధించిన పుస్తకాలు పూర్తిచేశాం. శాస్త్రీయ సోషలిస్టులం అనగా కమ్యూనిస్టులమయ్యాం. దీనితోపాటు కమ్యూనిస్టు కార్యక్రమాలు, పోరాటాలు, కమ్యూనిస్టులమీద పెట్టిన కుట్ర కేసులు, భగత్‌సింగ్ పోరాటం, త్యాగం మొదలైన అంశాలమీదకూడా అధ్యయనం చేశాం. చర్చలు జరిపాం. ఫలితంగానే మానవ కళ్యాణానికి పెట్టుబడిదారీ వ్యవస్థలో మంచి అనివార్యంగా ప్రజాస్వామ్య, లౌకిక, సామ్యవాద పంథాలోకి పురోగమించవలసిన మార్గంతప్ప మరొక మార్గం లేదనే నిశ్చితాభిప్రాయానికి వచ్చాం.

నేను 1934లో బెనారస్‌లో పార్టీ సభ్యత్వం తీసుకున్నాను. 1936లో లక్నోలో జరిగిన తొలి ఎ.ఐ.ఎస్.ఎఫ్ కాన్ఫరెన్స్‌కు వెళ్ళాను.

ఇక్కడ మనం ఒక విషయం గమనించాలి. స్టడీ సర్కిల్స్ ఎంతో గణనీయమైన పాత్ర నిర్వహిస్తాయి. విద్యార్థి దశలోనే సోషలిస్టు భావాలను వారిలో ప్రోదిచేస్తే, దాని ప్రభావం అనంతంగా వుంటుంది. ధనిక కుటుంబాలలోని విద్యార్థులు కూడా

సోషలిస్టు పథంలో పయనిస్తారు. ఈ దృష్ట్యా స్టడీ సర్కిల్స్ నిర్వహించాల్సిన అవసరం ఎంతో వుంది. కమ్యూనిస్టు పార్టీకి మేధావులు ఎంతో అవసరం. మార్క్స్, ఏంగెల్స్, లెనిన్, కాస్ట్రో, హోచ్ మెన్ – వీరంతా మేధావులు. ఏంగెల్స్ పెట్టుబడిదారీ కుటుంబానికి చెందినవాడు.

హైస్కూలు, కాలేజీలో నేను క్రీడలలో కూడా పాల్గొనేవాణ్ణి. బెనారస్‌లో టెన్నిస్ కెప్టెన్‌గా ఎన్నికయ్యాను. టెన్నిస్ కెప్టెన్‌కు జరిగిన ఎన్నికలలో నేను, మరో ఆంధ్ర విద్యార్థి పోటీ చేశాం. నా హిందీ భాషా పరిజ్ఞానం నన్ను గెలిపించింది.

కృష్ణాజిల్లాకు చెందిన శంభుశాస్త్రిగా రబ్బాయి పూర్ణానందం మాతోపాటు బెనారస్‌లో చదివారు. ఆయన కమ్యూనిస్టు అయ్యారు. శంభుశాస్త్రిగారు జిల్లాలో సత్యాగ్రహం జరిపి పోలీసుల లాఠీ దెబ్బలు తిన్నారు. స్వాతంత్ర్యానంతరం ఒక సందర్భంలో పూర్ణానందం, నేను కలుసుకోగా “మా నాయనగారు ఈ దెబ్బలన్నీ మన గుత్త పెట్టుబడిదారులకోసమే తిన్నారన్నమాట” అంటూ నేటి వ్యవస్థపట్ల తీవ్ర ఆవేదన వ్యక్తం చేశారు.

విద్యార్థి దశలోనే నేను రాయడం ప్రారంభించాను. 1934లో ‘Socialism inevitable’ అనే వ్యాసం రాశాను. దాన్ని ‘New Age’లో ప్రచురించారు. ఆ సమయంలో ఘాటే సంపాదకత్వం వహిస్తున్నారు. పత్రిక మద్రాసునుంచి వెలువడేది.

ఇదీ నా జీవన ప్రస్థానం, కమ్యూనిస్టుగా మారిన క్రమం. ఇప్పటికి నాది 60 సంవత్సరాల పార్టీ జీవితం.

★ ★ ★

# శ్రీ వై.వి. కృష్ణారావు



మా స్వగ్రామం కృష్ణాజిల్లా గన్నవరం మండలంలోని పెదావటుపల్లి. సైమన్ కమీషన్ నియామకంతో భారత రాజకీయాలు వేడెక్కాయి. భారత జాతీయ కాంగ్రెసు ఈ కమిషన్ను బహిష్కరించింది. 1928లో అరెస్టులు, లాఠీచార్జీలు, పోలీసు కాల్పుల మధ్యనే సైమన్ కమీషన్ భారత గడ్డపై అడుగుపెట్టింది. సైమన్ కమీషన్ వెళ్ళిన ప్రతి పట్టణంలోనూ రక్తపాతం జరిగింది. ప్రజలు అసమాన ధైర్యసాహసాలు ప్రదర్శించారు. దేశం అట్టుడుకినట్లు ఉడికింది. ఈ వార్తలు గ్రామాలకు కూడా చేరాయి.

మా గ్రామంలో నలుగురు, ఐదుగురు భారత జాతీయ కాంగ్రెసులో చేరి, జాతీయ పోరాటాన్ని గురించి ప్రచారం చేస్తుండేవారు. అప్పటికి నాకు 13 సంవత్సరాలు. నేను వీధి బడిలో చదువు పూర్తి చేసి, మా గ్రామ ప్రాథమిక పాఠశాల ప్రధానోపాధ్యాయుని వద్ద ఆంగ్లభాష నేర్చుకుంటున్నాను. ఆయన జాతీయవాది.

1929లో మహాత్మా గాంధీ ఖద్దరు నిధికోసం దేశంలోని పలు ప్రాంతాలలో పర్యటించి, ఏప్రియల్ 7 నుండి 16 వరకు పశ్చిమ, కృష్ణా జిల్లాలలో పర్యటించారు. ఆ సందర్భంగా విజయవాడ నుండి నూజివీడు వైపు వెళ్ళే సందర్భంలో మా గ్రామంలో కాంగ్రెసు వారు, కొందరు స్త్రీలతో సహా గాంధీజీని చూడటానికి

ట్రంకు రోడ్డుపైకి వెళుతుండగా నేను కూడ వారి వెంట వెళ్ళాను. మహాత్మా గాంధీ, వారి బృందం వస్తుండటము గమనించి మేమంతా 'మహాత్మా గాంధీకి జై' 'భరత్ మాతకు జై', 'వందేమాతరం' అని ఒక్క పెట్టున నినాదాలు చేసాము. గాంధీజీ వారి బృందం ఆగింది. గాంధీగారు మా వద్దకు వచ్చి 6–7 నిముషాలు ఆంగ్లేయులు దేశాన్ని ఎలా కొల్లగొడుతున్నదీ వివరించారు. దేశ ప్రజల దారిద్ర్యాన్ని గురించి, కరువు కాటకాల గురించి చెప్పారు. విదేశీ వస్త్ర బహిష్కరణ, నూలు వడకడం, ఖద్దరు ధారణ గురించి చెప్పారు. స్వాతంత్ర్య పోరాటాన్ని గురించి, ఖద్దరు ఉద్యమాన్ని గురించి వివరించారు. ఖద్దరు నిధికోసం గాంధీజీ విజ్ఞప్తి చేశారు. అక్కడకు వచ్చిన కొందరు స్త్రీలు తమ ఆభరణాలను మహాత్మునికిచ్చారు. మరికొందరు ధనరూపంలో విరాళాలు ఇచ్చారు.

మహాత్ముని పిలుపుతో నా జీవిత పథమే మారింది. నేను దేశ స్వాతంత్ర్యోద్యమం వైపు ఆకర్షించబడ్డాను. అప్పటికి నేను ధరిస్తున్న దుస్తులను తీసివేసి ఖద్దరు దుస్తుల ధారణకు పూనుకున్నాను. మా ఇంటిలో అటకపైనున్న రాట్నాన్ని క్రిందికి దింపి, మా తల్లిసహాయంతో దానిపై నూలు వడకడం ప్రారంభించాను. ఆనాటి నుండి ఈనాటి వరకు ఖద్దరు దుస్తులను విడవలేదు. అప్పటికి నాకు 14 సంవత్సరములే. అయినా జాతీయ కాంగ్రెసు సంస్థలో సభ్యునిగా చేరి, ఖద్దరు ప్రచారోద్యమాన్ని చేపట్టాను. విదేశీ వస్త్ర బహిష్కరణ, కల్లు అంగళ్ళ ముందు పికెటింగ్‌కు మా గ్రామ కాంగ్రెసు పెద్దలతో కలసి వెళ్ళేవాడిని.

అరేబియా సముద్రతీరంలో వున్న దిండి ఉప్పు కొటార్ల వద్ద 1930 ఏప్రిల్ 6న గాంధీగారు సత్యాగ్రహం చేయడానికి నిర్ణయించారు. 78 సత్యాగ్రహులతో మార్చి 12న సబర్మతీ ఆశ్రమం నుండి యాత్ర ప్రారంభించారు. దేశ వ్యాపితంగా శాసనోల్లంఘనోద్యమం ప్రారంభమయింది. ఏప్రిల్ 6 నుండి 13 వరకు సముద్రపుటంచులలో వున్న ఉప్పు కొటార్ల వద్దకు సత్యాగ్రహులు బయలుదేరారు. కొన్ని గ్రామాలవారు సముద్రపు నీరు తెచ్చి ఉప్పు తయారుచేశారు.

అప్పుడు నేను హైస్కూలులో సెకండు ఫారమ్ చదువుతున్నాను. నేను కూడ శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొనాలని నిశ్చయించాను. మా గ్రామంలో చవిటి నేలలున్నాయి. ఆ చవిటి నేలలో పై పొర మట్టిని పోగుచేసుకువచ్చి, నీళ్ళకుండలో పోసి, మట్టిని వేరేజేసి, నీటిని కాచాను. నీరంతా ఇగిరిపోయి తరువాత కుండ క్రింద భాగంలో కొద్ది పాటి ఉప్పు తయారయింది. నా సంతోషానికి హద్దులు లేవు. పెద్ద విజయాన్ని సాధించినట్లు ఉప్పొంగిపోయాను. ఆ ఉప్పును గ్రామంలోని నలుగురికి ప్రదర్శించాను.

అటు తరువాత ఒక రోజున మలబారు పోలీసులు వచ్చి కాంగ్రెసు వాదులుగా పేరుపడ్డవారి ఇళ్ళపై దాడిచేసి ఇళ్ళలోని రాట్నాలను విరగ గొట్టారు. కనపడ్డ వారినందరిని లాఠీలతో బాదారు. ఊరంతా వీరవిహారం చేసి వెళ్ళిపోయారు.

కరాచీ కాంగ్రెసు మహాసభకు ముందుగా, 1931 మార్చి 23న, నిర్ణయించిన సమయానికి ముందుగానే యువకిశోరాలైన భగత్‌సింగ్, సుఖ్‌దేవ్, రాజగురులను ప్రభుత్వం ఉరితీసింది. ఈ వార్త దేశమంతటా దావానలంలాగా వ్యాపించింది. బ్రిటీష్ పాలకుల కసాయి చర్యకు వ్యతిరేకంగా నిరసన వెల్లువ పెల్లుబికింది. మా

గ్రామంలో కూడ నిరసన ప్రదర్శన జరిపాము. ఈ విప్లవ మూర్తుల ఫోటోలున్న చిత్రపటాన్ని పట్టుకొని ప్రదర్శన అగ్రభాగాన నడిచే అదృష్టం నాకు కలిగింది. ఆ తరువాత బహిరంగ సభ జరిపాము. దేశంలోని యువతరానికివలెనే నాకు భగత్‌సింగ్, సుఖదేవ్, రాజగురులు ఆదర్శమూర్తులయ్యారు.

కరాచీ కాంగ్రెసు తీర్మానాలను, రౌండు టేబిల్ చర్చలను శ్రద్ధగా చదివేవాడిని. బ్రిటీష్ ప్రధాని రామ్సే మేగనాల్డు ప్రకటించిన కమ్యూనల్ అవార్డుకు వ్యతిరేకంగా ఎరవాడ జైలులో మహాత్మా గాంధీ 1932 సెప్టెంబరు 20 నుండి నిరసన వ్రతం ప్రారంభించారు. ఆ సందర్భంలో భారతీయులంతా ఒక్కటేనని చాటి చెపుతూ మా గ్రామంలో హరిజనులతో సహపంక్తి భోజనాలు ఏర్పాటు చేయడం జరిగింది. ఈ కార్యక్రమంలో నేను పాల్గొన్నాను. 1934లో బీహారు భూకంప బాధితుల సహాయనిధికి గ్రామంలోని కాంగ్రెసువారితో కలిసి విరాళాలు వసూలు చేశాను.

ఇక్కడ ఒక విషయం చెప్పాలి. 1936లో జరిగిన ఆంధ్ర రాష్ట్ర ప్రథమ కమ్యూనిస్టు మహాసభలో ఏర్పడిన కమిటీకి కార్యదర్శిగా ఎన్నుకోబడ్డ కామ్రేడ్ పోలేపెద్ది నరసింహమూర్తి భార్య లలితాంబగారిది మా గ్రామమే. నరసింహమూర్తి గారి బావమరుదులిద్దరు, పినమామగారు మా గ్రామంలో ముఖ్యమైన కాంగ్రెసు నాయకులు. అందులో చిన్న బావమరిది కాంగ్రెసు కార్యక్రమాలలో చురుకుగా పాల్గొనేవారు. ఆయన నాకు బాగా సన్నిహితుడు. అందువల్ల నేను తరచు వారింటికి వెళ్ళేవాడిని. అక్కడనే నాకు నరసింహమూర్తితో పరిచయం అయింది. ఆయన బెనారస్‌లో చదివే సమయంలోనూ, అటు తరువాత మా గ్రామానికి వచ్చినప్పుడల్లా నాకు రష్యా విప్లవాన్ని గురించి, సోవియట్ విజయాలను గురించి, సోషలిస్టు రాజకీయాలు ప్రబోధించేవారు. ఆ విధంగా నాలో అతివాద సోషలిస్టు భావబీజాలు నాటింది కామ్రేడ్ నరసింహమూర్తిగారే.

ఉన్నత విద్యాభ్యాసానికై నేను 1936లో గుంటూరు వెళ్ళి ఎ.సి. కాలేజీలో చేరాను. కమ్మ హాస్టలులో వసతి దొరికింది. తుమ్మల వెంకట్రామయ్యగారి సోదరుడు వెంకట సుబ్బయ్య, నేను ఒకే గదిలో వుండేవాళ్ళం. నేను గుంటూరు వెళ్ళే నాటికి కాంగ్రెసు సంస్థలో సభ్యుడినిగా, సోషలిస్టు భావాలతో, పూర్తి ఖద్దరు దుస్తులతో వున్నాను. తన సోదరుడిని చూడటానికి వచ్చి పోతూ వుండే వెంకట్రామయ్యగారి దృష్టి నాపై పడింది. నా వివరాలు తెలుసుకున్నా డాయన. ఆ తరువాత చరిత్ర ప్రసిద్ధి చెందిన మాక్సీం గోర్కి 'అమ్మ' నవలను, సోషలిస్టు సాహిత్యాన్ని నాకు యిచ్చారు. 'అమ్మ' నవల, ముఖ్యంగా అందులోని పావెల్ పాత్ర నాపై చెరగని ముద్రవేసింది. మరోమాట: అప్పటికే కమ్యూనిస్టుగా వున్న కామ్రేడ్ మాకినేని బసవ పున్నయ్య ఎ.సి. కాలేజి విద్యార్థిగా కమ్మ హాస్టలులోనే వున్నాడు. అతి త్వరలోనే నాకు వారితో కూడా పరిచయం, సన్నిహితత్వం ఏర్పడింది. క్రమక్రమంగా నేను రహస్యంగా నడిపే కమ్యూనిస్టు మాసపత్రికను, మద్రాసునుండి హెచ్.డి. రాజా సంపాదకత్వాన వెలువడుతున్న న్యూయేజ్ పత్రికను కూడా చదవటం ప్రారంభించాను. ఈ కాలంలోనే నాకు పులుపుల శివయ్యగారితో పరిచయం ఏర్పడింది. ఆయన అప్పటికే గుంటూరు జిల్లా పార్టీ ఆర్గనైజర్ సెక్రటరీ. ఆయన

ందించిన మీరట్ కుట్ర కేసులో ముద్దాయిలైన కమ్యూనిస్టులు యిచ్చిన వాగ్మూలం మీరట్ థీసిస్) సైక్లోస్టైల్ ప్రతినికూడా చదివాను.

1936 ఏప్రిల్‌లో జాతీయ కాంగ్రెసు మహాసభ లక్నోలో జరిగింది. దీనికి పండిట్ జవహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షుడుగా ఎన్నుకోబడ్డారు. ఆయన ఎంతో ముఖ్యమైన అధ్యక్షోపన్యాసం చేశారు. సోషలిజం అవసరాన్ని గురించి వక్కాణించారు. ఆ ఉపన్యాసం అతివాదులను, ముఖ్యంగా యువకులను ఎంతో ప్రభావితం చేసింది. ఆటు తరువాత దేశ నలుమూలలా పర్యటిస్తూ నెహ్రూ యిచ్చిన ఉపన్యాసాలు ప్రజానీకంలో సోవియట్ రష్యా ఎడల, సోషలిస్టు సమాజము ఎడల సానుకూలత కలిగించాయి. అయితే, కాంగ్రెసులోని మితవాద నాయకత్వానికి ఆ ఉపన్యాసాలు ఏమాత్రం గిట్టేవికావు.

1936 లక్నో కాంగ్రెసు మహాసభ సందర్భంలోనే అఖిల భారత కిసాన్ సభ, సంస్థాపక మహాసభ కూడా జరిగింది.

1929–1933 ఆర్థిక మాంధ్యం పెట్టుబడిదారీ వ్యవస్థలోని వైరుధ్యాలన్నింటిని, దానిలోని కుళ్ళును నగ్నంగా బయటపెట్టింది. ఒకప్రక్క నిరుద్యోగం పెచ్చు పెరిగిపోయి, సామాన్య ప్రజలు తిండికి అలమటిస్తుంటే, రెండవ ప్రక్క పెట్టుబడిదారీ శక్తులు అపార సంపదను ఎలా విధ్వంసం చేసిందీ ప్రపంచ ప్రజలు కళ్ళారా చూశారు.

అదే సమయంలో సోవియట్ రష్యా విజయాలు సామాన్య ప్రజలను ఆకట్టుకున్నాయి. కార్మికులు, కర్షకులు, విద్యార్థులు, యువకులు అత్యధికంగా స్వాతంత్ర్యోద్యమం వైపు, సోషలిజం వైపు మొగ్గారు.

ఆ సంవత్సరమే 1936 అక్టోబరు 17, 18 తేదీలలో గుంటూరు జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ మహాసభకు అధ్యక్షత వహించేందుకు తన భార్య, ఇద్దరు కుమార్తెలతో ప్రముఖ కమ్యూనిస్టు శ్రీపాద అమృత డాంగే గుంటూరు వచ్చారు. ఆ సందర్భంలోనే ఆయన మేధావుల నుద్దేశిస్తూ హిందూ కాలేజీ ఏకా దండయ్య హాలులో గతిక తార్కిక, చారిత్రక, భౌతిక వాదాలపై ఉపన్యాసాలు యిచ్చారు. ఆయన తన సుదీర్ఘ ఉపన్యాసంలో ధాతువుల మార్పు, అణువుల సంఖ్య, కూర్పు, వాటి మార్పులను గురించి సవివరంగా తెలియచేశారు. ఆ సభకు హాజరైన నాకు, ఆయన ఉపన్యాసం, గతిక తార్కిక, చారిత్రక, భౌతిక వాదాలు అంటే ఏమిటో తెలుసుకునేందుకు చాలా ఉపయోగపడింది. డాంగే ఉపన్యాసంతో సభకు వచ్చిన అనేకమంది ప్రభావితులైనట్లే నేనుకూడా చాలా ప్రభావితుడనయ్యాను.

ఆ మరుసటిరోజే (అంటే 19వ తేదీన) రాబోయే ఎన్నికల ప్రచార నిమిత్తం దేశంలో విస్తృతంగా పర్యటిస్తున్న కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ జవహర్‌లాల్ నెహ్రూ గుంటూరు వచ్చారు. స్వరాజ్ మైదానంలో (ఇప్పటి గాంధీపార్కు) జరిగిన పెద్ద బహిరంగ సభలో ఆయన ఆనాటి రాజకీయ పరిస్థితులు, దేశ స్వాతంత్ర్యం, సోషలిజం గురించి ఉద్రేకంగా గంభీరోపన్యాసం ఇచ్చారు. ఆయన ఉపన్యాసం శ్రోతలందరిని ఉర్రూతలూగించింది.

ఈ విధంగా నేను రాజకీయాలలో చురుకుగా పాల్గొంటూ వుండటంతో

నాకు గుంటూరు జిల్లా కాంగ్రెసు సోషలిస్టు పార్టీ కార్యదర్శి గౌస్‌బేగ్‌తోను, కాంగ్రెసు ప్రముఖులైన నేతి చలపతి, డా. చలపతి, చావలి సూర్యనారాయణ గార్లతోను పరిచయం ఏర్పడింది. క్రమక్రమంగా ఎన్నికల కార్యక్రమాన్ని నిర్ణయం చేసేందుకు జరిగే కాంగ్రెసు సభలకు కూడా హాజరవడం ప్రారంభించాను. అప్పట్లో కమ్యూనిస్టులకు ఒక ప్రధానకేంద్రం గుంటూరు. అప్పటికే నాకు గుంటూరులో వున్న కమ్యూనిస్టులు పులుపుల శివయ్య, జొన్నలగడ్డ రామలింగయ్య, ప్రతాప రామసుబ్బయ్య, అన్నాప్రగడ కామేశ్వరరావు, దుర్గా కృష్ణమూర్తి, చతుర్వేదుల పార్థసారథి, మాడభూషి వెంకటాచారి మొదలగు నాయకులు అందరితోను పరిచయం కలిగింది. వీరి అధ్వర్యంలో జరిగే సభలు, సమావేశాలన్నింటికీ నేను హాజరవుతూ ఉండేవాడిని.

1936 చివరికి రాష్ట్రంలో అసెంబ్లీ ఎన్నికల వేడి బాగా అందుకుంది. అయితే ఈ ఎన్నికలు 1935వ రాజ్యాంగ చట్ట ప్రకారం జరిగినాయి. కేవలం 10 రూ.లు పైన శిస్తు చెల్లించేవారికి, చదువుకున్నవారికి మాత్రమే ఓటు హక్కు ఉండేది. జనరల్ నియోజక వర్గాలతోపాటు కార్మిక, ముస్లిం, ఇండియన్ క్రిస్టియన్, ఆంగ్లో ఇండియన్, మహిళా నియోజకవర్గాలు విడివిడిగా ఉండేవి.

రాష్ట్రంలోని జమీందారులు, భూస్వాములు అప్పుడు అధికారంలో వున్న జస్టిస్ పార్టీని బలపర్చారు. వీరికి వ్యతిరేకంగా సోషలిస్టులు, కమ్యూనిస్టు, విద్యార్థులు, యువజనులు కాంగ్రెసు పార్టీని బలపర్చడం జరిగింది.

వీరంతా కాంగ్రెసును బలపర్చి పెద్ద ఎత్తున కాంగ్రెసు అభ్యర్థులకు ప్రచారం చేశారు. నేను కొంతమంది విద్యార్థులతో ఒక ప్రచార దళాన్ని ఏర్పాటు చేసి, గుంటూరు పట్టణం, సత్తెనపల్లి, నర్సారావుపేట, వినుకొండ, తాలూకాలో కాంగ్రెసు అభ్యర్థుల తరపున విస్తృత ప్రచారం చేశాను. రాజమండ్రి, ఏలూరు, గుంటూరు పట్టణ కార్మిక నియోజకవర్గానికి రైల్వే కార్మిక నాయకుడైన వి. వి. నరసింహం కాంగ్రెసు అభ్యర్థిగా పోటీ చేశారు. వీరి విజయానికి గుంటూరులోని కార్మికుల్లో ప్రచారం చేశాను. ఈ ఎన్నికలలో కాంగ్రెసు అఖండ విజయాన్ని సాధించింది.

1937 ఎన్నికలలో మద్రాసు, మరికొన్ని రాష్ట్రాలలో కాంగ్రెసు విజయం సాధించింది. మంత్రివర్గాలను ఏర్పాటు చేసింది.

ఆంధ్రరాష్ట్రంలో సోషలిస్టు, కమ్యూనిస్టు భావాలతో ముందుకు వస్తున్న యువకులకు దేశ రాజకీయాలు, సోషలిస్టు మూలసూత్రాలు బోధించడానికి ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ అధ్వర్యాన (అప్పుడు కమ్యూనిస్టు పార్టీపై నిషేధం వున్నందున కమ్యూనిస్టులు అంతా కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో చేరి, దాని జండాక్రింద పనిచేసేవారు) ఒంగోలు సమీపంలోనున్న కొత్తపట్నంలో వేసవి రాజకీయ పాఠశాల మే 1 నుండి ఏర్పాటు చేయబడింది. దీనికి హాజరవడానికి నేను రైలుకు ప్రయాణమవుతున్నాను. అసలే నా కాలేజీ చదువుకు వ్యతిరేకంగా వున్న మా తండ్రిగారు నా రాజకీయ కార్యకలాపాలపట్ల ఆగ్రహించి, బాగా కోప్పడినందువల్ల నా ప్రయాణాన్ని ఎంతో బాధతో విరమించుకొన్నాను.

కాని ఈ పాఠశాలను మద్రాసు ప్రభుత్వం నిషేధించి, విద్యార్థులపై క్రూరంగా లాఠీచార్జీ జరిపి, కొందరిని అరెస్టు చేసింది. దీని వివరాలలోకి ఇక్కడ పోవడం లేదు.

అరెస్టు చేసిన వారిలో కొందరిపై కేసులు పెట్టడం, వారిలో శిక్షలు పడ్డ కొందరిని గుంటూరు నుండి రాజమండ్రి జైలుకు రైలులో తీసుకువెళ్ళే సందర్భంలో నేను, మరికొందరు విద్యార్థులు, సోషలిస్టులు, తదితరులు స్టేషనుకు వెళ్ళి, రాజమండ్రి వెళ్ళే కామ్రేడ్స్‌కు జై, జై ధ్వానాలతో ఘనంగా వీడ్కోలు చెప్పాము.

1937లో ఆంధ్రరాష్ట్ర రైతు సంఘం జూలై 3 నుండి 1938 మార్చి 27 వరకు ఇచ్ఛాపురం నుండి మద్రాసుకు చారిత్రాత్మకమైన రైతు యాత్రను నడిపింది. దీనికి రాష్ట్ర సంఘ అధ్యక్షుడు కీ.శే. కొమ్మారెడ్డి సత్యనారాయణగారు, అమరజీవి ప్రముఖ రైతు నాయకుడు చలసాని వాసుదేవరావు నాయకత్వం వహించారు. ఈ యాత్రదళం వచ్చే సమయానికి ఆయా జిల్లాలలో జిల్లా రైతుదళాలు కూడా పర్యటించి, తాము పర్యటించిన గ్రామాలలోని సమస్యలపై రైతులనుండి సేకరించిన మహజర్లు, జిల్లా కలెక్టర్లకు అందజేయటం జరిగింది. గుంటూరు జిల్లా రైతు దళం జిల్లా కలెక్టర్లకు ఆ విధంగా మహజర్లు అందజేసే రోజున నేనుకూడా ఆ దళం వెంట కలెక్టరు ఆఫీసుకు వెళ్ళాను.

1936 లాహోర్‌లో జరిగిన మహాసభలో అఖిల భారత విద్యార్థి సమాఖ్య ఏర్పడింది. అప్పటికి నాకు తెలిసినంతవరకు విశాఖ మెడికల్ కాలేజీలోను 3–4 ప్రదేశాలలో విద్యార్థి సంఘాలు ఏర్పడ్డాయి.

1933లోను, 1937 పూర్వార్థంలోనూ మరికొన్ని పట్టణాలలో విద్యార్థి సంఘాలేర్పడ్డాయి. గుంటూరు ఎ. సి. కాలేజి విద్యార్థులుగా వున్న మాకినేని బసవ పున్నయ్య, నాళం నరసింహారావు, డి. వి. అప్పారావు, మరికొందరు, హిందూ కాలేజీ విద్యార్థులు కొందరు చొరవతీసుకొని విద్యార్థి ఉద్యమ నిర్మాణానికి పూనుకున్నారు. ఈ కార్యక్రమంలో నేను కూడ భాగస్వామిని. 14వ ఆంధ్రరాష్ట్ర విద్యార్థి మహాసభ విద్యార్థి సంఘాలను సమన్వయపరుస్తూ రాష్ట్ర విద్యార్థి ఉద్యమాన్ని ముందుకు తీసుకొని పోవాలని రాష్ట్ర విద్యార్థి సంఘాన్ని ఏర్పరచి సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగాను, విద్యార్థుల హక్కుల కొరకు పోరాడాలని నిర్ణయించడం జరిగింది. ఈ మహాసభను గుంటూరులో ఏర్పాటు చేయటానికి నాళం నరసింహారావు కార్యదర్శిగా ఒక ఆహ్వాన సంఘం ఏర్పడింది. అందులో నేను కూడా ఉన్నాను. ఈ మహాసభకు అధ్యక్షుడిగా యస్. యస్. బాట్లీవాలా, (ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు) వక్తగా ఉన్నారు. శ్రీమతి హజరా బేగంగారిని ప్రారంభకులుగా ఆహ్వానించడం జరిగింది. ఈ మహాసభ 1937 ఆగస్టు 28, 29 తేదీలలో జరిగింది. ఈ సందర్భంగా బాట్లీవాలా ఆంధ్రదేశంలో విస్తృతంగా పర్యటించి అనేక విద్యార్థి సభల్లో ఉపన్యసించారు. వేరే హాలు ఎక్కడ లభ్యం కానందున ఈ విద్యార్థి మహాసభ కమ్మ హాస్టలులోనే జరిగింది. విశాఖపట్నం, కాకినాడ, బందరు, చిటిగూడూరు మొదలగు ప్రదేశాల నుండి దాదాపు 70, 80 మంది ప్రతినిధులు హాజరయ్యారని నాకు జ్ఞాపకం.

ఈ మహాసభకు విశాఖ నుంచి కుప్పా వెంకటరామశాస్త్రి గద్దె రామకోటేశ్వర రావులతో కూడిన పెద్ద ప్రతినిధి వర్గం వచ్చింది. ఆనాటి విద్యార్థి సమస్యల మీద, సామ్రాజ్య వాదుల పాలనకు వ్యతిరేకంగా, దేశ స్వాతంత్ర్యం కోసం, డిటెన్షన్ విధానానికి వ్యతిరేకంగానూ తీర్మానాలు చేయడం జరిగింది. ఇంకా ఆనాడు ఉన్న

అనేక విద్యార్థి సమస్యల మీదకూడా ఆ మహాసభలో తీర్మానాలు ఆమోదించడం జరిగింది.

ఈ మహాసభలో కార్యదర్శిగా మాకినేని బసవపున్నయ్య ఎన్నుకోబడ్డారు. నేను మరో ఇద్దరు జాయింట్ కార్యదర్శులుగా ఎన్నుకోబడ్డాము. అటు తరువాత గుంటూరు జిల్లాలోని హైస్కూళ్ళలో విద్యార్థి సంఘాలను ఏర్పాటు చేయడానికి నేను కృషి చేశాను.

పబ్లిక్ పరీక్షకు హాజరు కాకుండా కొందరు విద్యార్థులను ఎ. సి. కాలేజివారు డిబార్ చేసినందున, దానికి వ్యతిరేకంగానూ, కాలేజీకి సంబంధించిన మరికొన్ని కోర్కెలపైన ఎ. సి. కాలేజీలో, 1937లో చారిత్రాత్మక సమ్మె 10 రోజులు జరిగింది.

ఈ సమ్మెను నిర్వహించడానికి ఏర్పడిన కార్యాచరణ కమిటీలో నేను ఒక సభ్యుడను. సమ్మెలో నేను చురుకుగా పాల్గొనటమే కాక, జయప్రదం చేయడానికి నా శక్తికొలది కృషిచేశాను. అప్పటికి ఎ. సి. కాలేజీ విద్యార్థులతో కమ్యూనిస్టు పార్టీ చురుకుగా పనిచేస్తోంది. మాకినేని బసవపున్నయ్య, నాళం నరసింహారావు, డి. వి. అప్పారావు మొదలగువారు అంతకముందే పార్టీ సభ్యులు. నేను, మరికొందరు ఎ. సి. కాలేజీ విద్యార్థులు 1937లోనే కమ్యూనిస్టు పార్టీలో చేరటం జరిగింది.

నేను కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వానికి పెట్టుకొన్న దరఖాస్తు మాకినేని బసవపున్నయ్య, జిల్లా కమ్యూనిస్టు ఆర్గనైజింగ్ కార్యదర్శి పులుపుల శివయ్యగార్లు రికమెండు చేస్తూ దానిపై సంతకాలు చేశారు.

అప్పుడు కమ్యూనిస్టు పార్టీపై నిషేధం వున్నది. రహస్య పార్టీలోకి ఎవరినంటే వారిని చేర్చుకొనేవారుగాదు. ప్రతి వ్యక్తియొక్క కార్యకలాపాలు, రాజకీయ అభిప్రాయాలు బాగా పరిశీలించిన మీదట ఇద్దరు పార్టీ ప్రముఖులు బలపర్చితేనే పార్టీ సభ్యత్వం యివ్వబడేది. మొదట ఆక్సిలరీ సెల్లులలో పెట్టి, సంతృప్తి కలిగితేనే సభ్యత్వం యిచ్చేవారు. నేను, కమ్మ హాస్టలులో వుంటున్న తుమ్మల వెంకట సుబ్బయ్య, సి.యల్. నారాయణ ఒక సెల్లులో వుండేవారము.

రహస్య నిర్మాణము కాబట్టి ఆ రోజులలో ముగ్గురు సభ్యులతోనే ఒక సెల్లు ఏర్పాటు చేసేవారు.

కమ్మ హాస్టలులో దాదాపు 110 మంది వరకు విద్యార్థులుండేవారు. కమ్మ హాస్టలు ఆ రోజులలో కమ్యూనిస్టు పార్టీ రాజకీయాలకు ప్రధాన కేంద్రము. పార్టీ నాయకులు గుంటూరు ఎవరు వచ్చినా, కమ్మ హాస్టలులోనే సౌకర్యాలు ఏర్పాటు చేయబడేవి. అఖిల భారత సోషలిస్టు పార్టీ నాయకుడు జయప్రకాష్ నారాయణ్ 1937 డిసెంబరులో ఆంధ్ర రాష్ట్ర పర్యటనకు వచ్చినపుడు ఆయన, ఆయనతో పాటు వచ్చిన పుచ్చలపల్లి సుందరయ్యగార్లకు కమ్మ హాస్టలులోనే వసతి ఏర్పాటు చేశాం. సుందరయ్యగారితో నాకు పరిచయం అప్పుడే.

## ముగింపు

కమ్యూనిస్టులు స్వాతంత్ర్య పోరాటములో సంపూర్ణ స్వాతంత్ర్యము కొరకు రాజీలేని పోరాటము చేస్తున్నారు. ఏట్టి త్యాగాలకయినా కమ్యూనిస్టులు వెనుదీయుటలేదు.

సోషలిస్టు వ్యవస్థ విజయాలు, దోపిడీ, దారిద్ర్యం, నిరుద్యోగం లేని, సమతా సమాజ విశిష్టతను వేనోళ్ళ చాటింది. మనదేశంలో కూడా అట్టి సమాజ స్థాపనే మానవుని సంపూర్ణ వికాసానికి, అభివృద్ధికి తోడ్పడుతుందని నాకు పూర్తి విశ్వాసం కలిగింది. అట్టి సోషలిస్టు సమాజ స్థాపన లక్ష్యంతో, పూర్తి అంకిత భావంతో ఎన్ని కష్టాలు, త్యాగాలకయినా వెనుదీయని కమ్యూనిస్టు పార్టీలో సభ్యుడుగా చేరి, ఆ ఉన్నత లక్ష్యాల సాధనకు నా జీవితాన్ని అర్పించాలనే నిర్ణయంతోనే కమ్యూనిస్టు నయ్యాను. ఆ లక్ష్యంతోనే ఇప్పటికీ ముందుకు సాగుతున్నాను.

★ ★ ★

# శ్రీ మోటూరు హనుమంతరావు



మన దేశంలో కమ్యూనిస్టు ఉద్యమ జన్మదినోత్సవాల సందర్భంగా కమ్యూనిజం మాసపత్రిక ప్రత్యేక సంచిక వెలువడుతున్నట్లు కామ్రేడ్ పరకాల పట్టాభిరామారావుగారు తెలిపారు. అందుకు చాలా సంతోషం, ఆ సంచికలో 'నేను కమ్యూనిస్టును ఎలా అయ్యాను' అనే శీర్షిక క్రింద చిన్నా నా అనుభవం వ్రాయమని వ్రాశారు. తద్వారా మా ఆరంభం దినాలను గుర్తుచేసుకునేందుకు అవకాశం కల్పించినందుకు ఆయనకు నా ధన్యవాదాలు.

స్వాతంత్ర్యం లేనిదే సోషలిజం సంభవించదు. అలాగే దేశభక్తులు కాని వారెవ్వరూ కమ్యూనిస్టులు కాలేదు. నా అనుభవమూ అదే. నా బాల్యదశను మినహాయిస్తే హైస్కూలు విద్యార్థి దశ అంతటిలోనూ నేనూ నా తరం వాళ్ళమూ అనుక్షణం స్వాతంత్ర్య పిపాసతో ఉర్రూతలూగుతున్న కాలం అది. నా స్వగ్రామం రేపల్లె తాలూకా వెల్లటూరు, నా హైస్కూలు విద్యాభ్యాసం అంతా రేపల్లెకు పక్క గ్రామంగా వున్న పల్లెకోన నుండి జరిగింది. అది మా అక్కగారున్న గ్రామం. ఈ రెండు గ్రామాలు జాతీయోద్యమంలో ముందున్న గ్రామాలే. ఆ ప్రభావం నానాటి నాపై ఎక్కువగా పడుతూ వచ్చింది. నాకంటే కొంచెం సీనియర్ కామ్రేడ్ మాకినేని బసవపున్నయ్యగారు. ఆయనా కొంతకాలం రేపల్లె విద్యార్థి. ఆ విధంగా ఆయన నాకు రాజకీయాల్లోనూ సీనియరే.

ఆ రోజుల్లో భగత్‌సింగ్ ఉరితీత, గాంధీజీ పిలుపులు నాపై చెరగని రాజకీయ ముద్రలు వేశాయి. భగత్‌సింగ్ ఉరితీసిన రోజు మా స్కూలులో మేము సమ్మె చేశాం. నేనూ నా మిత్రుడు కంఠంనేని వెంకటరత్నం అందులో ముఖ్యమైన పాత్రను నిర్వహించాం. అదే విధంగా గాంధీజీ నేను రేపల్లెలో ఫోర్తు ఫారం చదువుతుండగానే రేపల్లె వచ్చారు. మా హెడ్‌మాస్టర్ కందాళ హనుమంతరావుగారు. గాంధీ టోపీ పెట్టుకొని క్లాసుల్లోకి రావద్దని మాపై ఆంక్ష విధించినా ధిక్కరించి నేను గాంధీ టోపీతోనే క్లాసుకు వెళ్ళేవాడిని. గాంధీజీ కల్లు సత్యాగ్రహానికి పిలుపు యిస్తే నేనూ, వెంకటరత్నం కేట్‌బాల్ సహాయంతో కల్లుకుండలు పగుల కొట్టాం. అంటరానితన నిర్మూలన కొరకు గాంధీజీ పిలుపు యిచ్చినపుడు మేము హరిజనవాడలకు వెళ్ళి

పప్పు బెల్లాల సహపంక్తి ఆరగింపులు చేసి ఉపన్యాసాలిచ్చాము. ఇంటివద్ద వీటన్నింటికీ పెద్దలనుండి ఏ ఒత్తిడి వచ్చినా లక్ష్యపెట్టకుండా ముందుకెళ్ళాం.

నాలో రాజకీయ ప్రభావం ముదిరిన కొలదీ, చదవులో చురుకుదనం సన్నగిల్లింది. ఒక్క సంవత్సరం మా వూళ్ళో ప్రైవేటు చదివి ఫస్ట్‌ఫారం నుండి ఫోర్త్‌ఫారం టెస్టు ప్యాసై రేపల్లె హైస్కూలులో 1929–30లో చేరాను. ఫిఫ్తుఫారం (10వ తరగతి) వరకూ ఫస్ట్‌క్లాసు విద్యార్థిని. ఆ తర్వాత ఎస్.ఎస్.ఎల్.సి. మొదటి సంవత్సరం తప్పి రెండవ సంవత్సరం పాసైనాను. వెంటనే కాలేజీలో చేరడానికి మా కుటుంబం ఆర్థిక పరిస్థితినిబట్టి సాధ్యం కాలేదు. ఆ సమయంలో చల్లపల్లి కోటలో 10 మాసాలు ఉద్యోగం చేశాను. వుయ్యూరు షుగర్ ఫ్యాక్టరీ మొదటి సీజన్‌లో నేనూ, నాతోపాటు నా అప్తమిత్రుడు లక్ష్మణరావు వెయ్యింగు క్లర్కులుగా పనిచేశాము. తర్వాత సంవత్సరం ఒక ఎస్టేటు ఫారం సూపర్‌వైజర్‌గా కొల్లేటి కోటలో నేను పనిచేశాను. ఇందులో దేనిలోనూ కుదురుగా నిలవకపోవడానికి నా రాజీకయ గమ్యమే కారణం అయింది. చల్లపల్లిలో వున్నప్పుడు, ఆయన అప్పటికింకా పూర్తిగా రాజకీయాల్లోకి రాకపోయినా అమరవీరుడు చల్లపల్లి నారాయణరావు గారితో పరిచయం ఏర్పడ్డది. ఆ రోజుల్లోనే ఆచార్య రంగా పోతార్లంక జామీన్ రైతు సభకు రావడం, నేనూ అక్కడికి వెళ్ళి చలసాని వాసుదేవరావుగారితో పరిచయం ఏర్పరచుకోవడం జరిగింది. తర్వాత నేను కొల్లేటి కోటలో వుండగా కొమ్మారెడ్డి సత్యనారాయణ, పిడికిటి రామకోటయ్య గారలు అక్కడికి రావడం, వారితో చర్చించడం జరిగింది. ఆ కాలంలోనే నేను తుమ్మల వెంకట్రామయ్యగారి నుండి గోర్కీ నవల అమ్మను, మరొక నవలను తీసుకెళ్ళి చదవడం, చదివి వినిపించడం ప్రారంభించాను. 1935లో బసవపున్నయ్యగారు, ఆయన మేనమామ కొడుకులైన వెంకటరత్నం, పెద అచ్యుతరామయ్య, చిన అచ్యుతరామయ్య మొదలైనవారు ఆచార్య రంగాగారు నిర్వహించిన రైతాంగ పాఠశాలకు వెళ్ళి, అక్కడి విశేషాలను నాకు చెప్పడం జరిగింది.

ఆ విధంగా నా మనసు జాతీయవాదం నుండి సోషలిజానికి ఆ సంవత్సరాల్లో మరలింది. పండిత్ నెహ్రూ కాంగ్రెస్ అధ్యక్ష పీఠం నుండే సోషలిజాన్ని ప్రబోధించుతున్న కాలం అది. ఆంధ్రలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఏర్పడింది. దాని జిల్లా పార్టీ మహాసభ 1936లో గుంటూరులో జరిగింది. అదే సమయంలో నెహ్రూ పర్యటన జరిగింది. జిల్లా కాంగ్రెస్ సోషలిస్టు మహాసభకు డాంగే వచ్చారు. సోషలిజం మంచిదన్న భావం నెహ్రూ కలిగించగా, వర్గపోరాటం ద్వారానే దోపిడీ వ్యవస్థను నిర్మూలించి నవ సమాజ నిర్మాణం సాధ్యపడుతుందని మార్క్సిజం ఎలా చాటి చెప్పిందో డాంగే విశ్లేషించి తన పర్యటనలో ప్రసంగించారు. నూతన దృక్పథం కోసం అర్రులు చాచుతున్న యువతీ యువకులను, మేధావులను ఆయన ప్రసంగాలు బాగా ఆకట్టుకున్నాయి.

నేను జిల్లా సోషలిస్టు మహాసభలో పాల్గొనేందుకు, నెహ్రూ మీటింగ్‌కు హాజరయ్యేందుకు కొల్లేటి కోటనుండి గుంటూరు వచ్చాను. సోషలిస్టు మహాసభ అయిన అనంతరం నెహ్రూ మీటింగ్‌లను గుంటూరులోనూ, విజయవాడలోనూ,

గుడివాడలోనూ చూస్తూ తిరిగి కొల్లేటి కోట చేరుకున్నాను. ఆ సంవత్సరమే ఫెయిజ్‌పూర్ కాంగ్రెస్ జరిగింది. దానికి వెళదామని విజయవాడ వచ్చి, ఆంధ్రరత్న భవనంలో అందుకయ్యే ఖర్చుల వివరాలను తెలుసుకున్నాను. అప్పుడే ఉద్దరాజు రామంగారు అందుకే వచ్చారు. మా జిల్లా నుండి పులుపుల శివయ్యగారు, తుమ్మల వెంకట్రామయ్యగారు జస్టిస్ పార్టీకి వ్యతిరేకంగా కాంగ్రెస్ పార్టీ అభ్యర్థిగా వున్న కాట్రగడ్డ నారాయణరావుగారిని బలపరిచేందుకు విజయవాడ వచ్చారు. నేను ఫెయిజ్‌పూర్ కాంగ్రెస్‌కు పోయే విషయాన్ని కట్టిపెట్టి కామ్రేడ్ శివయ్య దళంలో చేరి విజయవాడ నుండి వీరుళ్ళపాడు వరకు పాదయాత్ర ప్రచారం చేశాను. అప్పుడు జొన్నలగడ్డ రామలింగయ్యగారు ప్రైవేట్ చెబుతూ వ్యవసాయ కూలీ ఉద్యమం నిర్మించడానికి వీరుళ్ళపాడులో పనిచేస్తున్నారు. అప్పుడే వామపక్ష కాంగ్రెస్‌వాదిగా కాట్రగడ్డ నారాయణరావుగారు ఉమ్మడి మద్రాసు శాసనసభకు ఎన్నికైనారు.



ఆంధ్ర రాష్ట్ర పార్టీ నాయకత్వాన్ని రూపొందించిన రాజకీయ పాఠశాల

1937 మేలో కొత్తపట్నం రాష్ట్ర రాజకీయ పాఠశాల జరిగింది. 1938 మేలో మంతెనవారిపాలెం రాష్ట్ర రాజకీయ పాఠశాల జరిగింది. ఈ రెండింటికీ నేను హాజరైనాను. మొదటి పాఠశాలకు కొంచెం ఆలస్యంగా వెళ్ళాను. అక్కడ కామ్రేడ్ రాజేశ్వరరావు, సావిత్రమ్మ మొదలైన వారితో పరిచయం కలిగింది. అయితే యీ పాఠశాలను అర్ధాంతరంగా మద్రాసు ప్రభుత్వం నిషేధించి లాఠీఛార్జీ చేసింది. మంతెనవారి పాలెం స్కూలు నెలరోజులూ జరిగింది. కమ్యూనిస్టు పార్టీ కేంద్ర నాయకత్వం అంతా అక్కడికి వచ్చింది. ఈ పాఠశాలకు చాలా మందిమి కుటుంబ సమేతంగా హాజరైనాము. నా పెళ్ళి నాటి ఉంగరం అమ్మి ఫీజు కట్టాము. ప్రముఖ వామపక్ష కాంగ్రెస్ నాయకులు అన్నే అంజయ్యగారు సతీసుతుల సమేతంగా రాగా పిడతల రంగారెడ్డి, కందుల ఓబులరెడ్డి, బాలిరెడ్డి మొదలైనవారుకూడా వచ్చి పాల్గొన్నారు. ఈ రెండు రాష్ట్ర రాజకీయ పాఠశాలలు రాష్ట్రంలో సోషలిస్టు సంచలనం కలిగించాయి.

ఈ పరిణామాలన్నీ నేను కమ్యూనిస్టుని గావడానికి తోడ్పడ్డాయి. ఉద్యోగాన్వేషణ ప్రయత్నాన్ని విరమించుకొని, రాజకీయవేత్తగా ప్రయోజనాత్మక కృషి చేయాలంటే గుంటూరులో వుండటం, కాలేజీలో చేరడం అనివార్యం అనిపించింది. ఆర్థికంగా ఏదో సర్దుబాటు చేసుకొని ఎ.సి. కాలేజీలో చేరాను. ఆ సంవత్సరం ఎ.సి. కాలేజీలో చరిత్రాత్మక సమ్మె నిర్వహించడంలో మేము ప్రథమ శ్రేణిని వున్నాము.

నేను కమ్మ హాస్టల్ విద్యార్థిగా వుండేవాడిని. మా రాజకీయ కార్యక్రమాలన్నింటికి అదొక సమీకరణ కేంద్రంగా వుండేది. అన్ని రాజకీయ ప్రదర్శనలను అక్కడ నుండే ప్రారంభించేవాళ్ళం. పేరు కమ్మ హాస్టలు. దాని నిర్వాహకులు జస్టిస్ పార్టీ వారు. విద్యార్థులందరమూ ఎన్నికల్లో కాంగ్రెస్ ప్రచారకులం కమ్యూనిస్టు ఉద్యమ ప్రారంభకులంగా వుండేవాళ్ళం. నా రూములోనే తర్వాత శాస్త్రజ్ఞుడుగా ప్రసిద్ధికెక్కిన నాయుడమ్మ వుండేవాడు. అలాగే తుమ్మల వెంకట సుబ్బయ్య, వై. వి. కృష్ణారావు, టి. వెంకటేశ్వరరావు మొదలైనవాళ్ళము ఆ హాస్టల్‌లోనే వున్నట్లు గుర్తు. ఒకప్పుడు బాట్లీవాలా, జయప్రకాశ్ నారాయణగార్లు నా గదిలోనే అతిథులుగా వున్నారు. సుందరయ్యగారు రహస్య జీవితం గడుపుతూ ఒకరాత్రి నా రూముకు వచ్చాడు. నాకు నిద్రాభంగం కలుగుతుందన్న భావంతో నా రూము ముందున్న వరండాలో సుందరయ్యగారు కాగితాలు పరచుకుని నిద్రించడం నాకు ఆశ్చర్యాన్ని గొలిపింది.

లావు బాల గంగాధరరావు కూడా నా క్లాస్‌మేట్ అయినా ఆయన, కనగాల కుటుంబరావు వేరొక ప్రైవేట్ మెస్‌లో వుండేవారు. నేను కమ్యూనిస్టు అయ్యేందుకు అనేక పరిణామాలు ప్రభావితం చేశాయి. ఆ దశలో కామ్రేడ్ పులుపుల శివయ్య నాకు ఆప్తమిత్రుడు, సిద్ధాంత గురువు, ఆదర్శ కమ్యూనిస్టుగా వుండేవాడు. నేనే గాదు – మాలో చాలామందిమి గుంటూరు కొత్తపేటలో ఆయన ఇంట్లో ఏ ఆహార పదార్థముంటే దానినే పంచుకొని తింటూ సమావేశాలు జరుపుకునేవాళ్ళం. నేను రంగప్రవేశం చేయడానికి ముందు నండూరు ప్రసాదరావుగారు, పులుపుల శివయ్య గారూ ఒక మెస్ పెట్టి తద్వారా హోల్‌టైమర్లను మెయిన్‌టెయిన్ చేయడానికి ప్రయత్నించారు. గాంధీ పార్కులో జరిగే ప్రతి మీటింగ్‌కు తాడూ బొంగరం అన్నీ మేమే సమకూర్చుకునేవాళ్లం. ఆకలి మంటల మలమలమాడే అనాథులందరి

అంతర్జాతీయ గేయంతో ప్రారంభించి, మీటింగ్‌లో ఎందరున్నారనే దాంతో నిమిత్తం లేకుండా ప్రసంగాలు సాగించేవాళ్ళం. వారం వారం అధ్యయన తరగతులు నడిపేవాళ్ళం. బసవపున్నయ్యగారి నాయకత్వ సామర్థ్యం మమ్మ కార్యరంగంలోకి దించగా, కామ్రేడ్ చంద్ర రాజేశ్వరరావుగారి మిలటరీ డ్రిల్లు మేము వాలంటీరు దళాలుగా పనిచేయడానికి దోహదమిచ్చింది.

మేము కులాతీత వ్యక్తులం, కాస్మ పాలిటిజం మాలో కొట్టవచ్చినట్లు కనిపించేది. కామ్రేడ్స్ శివయ్య, బాచిన నరసింహారావు, లోకనాథం మొదలైనవారు శుద్ధ వైదీకులు. అలాగే వైశ్యులుగా వున్న డి. వి. అప్పారావు, నాళం నరసింహారావులనూ మార్క్సిజం ఆకర్షించింది. కమ్మ హాస్టల్ విద్యార్థులమైన మాలో ఆ కులతత్వం అదృశ్యమైంది. ప్రతాప రామసుబ్బయ్య, దుర్భా కృష్ణమూర్తి, అమరవాది, కె.ఎల్. నరసింహారావు మొదలైనవారంతా నియోగులే.

విప్లవాశయాలతోపాటు సాంఘిక సంస్కారణలకూ మేము అంకితులమే. జాతీయోద్యమ నాయకులు వాటిని విస్మరిస్తున్న సమయంలో మేము కందుకూరి, గురజాడల జాడలను పునరుద్ధరించాం.

మా కోవకు చెందిన వారందరం, ఆ దశలో సంస్కారణ వివాహాలు చేసుకున్నాం. నేనూ, కామ్రేడ్స్ రాజేశ్వరరావు, బసవపున్నయ్య మొదలైన వారందరం పూలదండల మార్పిడి పద్ధతుల్లోనే వివాహాలు చేసుకున్నాం.

నన్ను ప్రభావితం చేసిన సాహిత్యాన్ని పేర్కొనడం అవసరం. మొదటిది అమ్మ నవల. మా వూరు లైబ్రరీలో ఆంధ్రపత్రిక వార్షిక సంచికలను తిరగేస్తుంటే బోల్షివిజంపై డాక్టర్ భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు వ్రాసిన వ్యాసం ఒకటి నా కంట బడ్డది. రష్యాలో అక్టోబర్ విప్లవానంతరం బోల్షివిజం ఎలా సమానత్వాన్ని అమలు జరుపుతున్నదీ ఆయన వ్రాశారు. ఆ తర్వాత "సోషలిజం ఎందుకు?" అన్నది జయప్రకాశ్ నారాయణ ఆనాడు రచించిన గ్రంథం. 1938లో నేను కలకత్తాలో జరిగిన అలిండియా విద్యార్థి మహాసభకు హాజరైనాను. అక్కడినుండి ఎడ్గార్ స్నో రచించిన రెడ్‌స్టార్ ఓవర్ చైనాను కొనుక్కువచ్చాను. ఆ చైనా విప్లవ వీరోచిత గాథలు, డాక్టర్ కోట్నిస్ త్యాగము నాకుగల విప్లవోత్సాహ ఉద్రేకాలను ద్విగుణీకృతం చేశాయి. మన దేశానికి మొదట చేరిన బోల్షివిక్ పార్టీ చరిత్ర కాపీలు రెండు మూటిలో ఒకటి ముందు మా జిల్లా కమిటీకే చేరింది. దాని రచయిత స్టాలిన్. దానిని అధ్యయనం చేసిన కొలదీ అద్భుతమైన విజ్ఞానాన్ని వెదజల్లే గ్రంథం అని నాకు అనిపించింది. చరిత్ర నెలా వ్రాయాలి, అధ్యాయాలను ఎలా విభజించాలి, పేరాగ్రాఫ్ విభజన పద్ధతి ఎలా వుండాలి, ముగింపు ఎలా వుండాలి, గుణపాఠాలను ఎలా చిత్రించాలి అన్న అంశాలన్నింటా విజ్ఞాన దాయకంగా అది వున్నది. ఇనప గుగ్గిళ్ళ వంటి గతితార్కిక భౌతికవాద అధ్యాయాన్ని అంత సులభశైలిలో వ్రాసిన రచన మరొకటి లేదు. విప్లవావగాహనకు బోల్షివిక్ పార్టీ చరిత్ర పాఠ్యగ్రంథంగా నాకు తోచింది. నేను కమ్యూనిస్టు నయ్యేందుకు, గట్టిపడేందుకు యీ అధ్యయనాలన్నీ నాకు తోడైనాయి.

నేను పుట్టినది 1917లో. కమ్యూనిస్టును అయినది చైనా విప్లవ పురోగమనకాలంలో. అందుకే సాధారణంగా నేను అంటుంటాను – నేను అక్టోబరు విప్లవంతో పుట్టి, చైనా విప్లవంతో కమ్యూనిస్టుగా పెరిగానని.

నేను 1937లో కమ్యూనిస్టుపార్టీలో చేరాను. విప్లవాశయం ధ్యేయంగా పెట్టుకొనే నేను కాలేజీలో చేరాను. ఆర్థికంగా కాలేజీ విద్యను కొనసాగించడం సాధ్యంగాదని గుర్తించి గుంటూరులో సిటీ స్టూడెంట్స్ ఎంపోరియం పెట్టాను. అందుకు నావంతు ఆస్తిని పంచుకొని అమ్మి పెట్టుబడిగా పెట్టాను. ఆ సమయంలో బసవపున్నయ్యగారు కూడా నాకు కొంత తోడ్పాటు కలిగించారు. అయితే అది నెలకొల్పిన కొద్ది రోజులకే రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. పార్టీ 'స్వతంత్ర భారత్' అన్న రహస్య పత్రిక ద్వారా యుద్ధ వ్యతిరేక ప్రచారాన్ని సాగించింది. నా షాపులో నేను అటూ ఇటూ పోయినప్పుడు ప్రతాపరామసుబ్బయ్యగారు కూర్చుంటూ వుండేవారు. ఆ సమయంలో విజయవాడ నుండి పేట రామారావు ఒక కట్ట స్వతంత్ర భారత్ పత్రికలు నా షాపులో యిచ్చారు. ఆ కట్టను రామసుబ్బయ్యగారు తన ఇంటికి పంపారు. తర్వాత మాకు చిరపరిచితుడుగా వున్న చేకూరు మున్సిఫ్ తనకు స్వతంత్ర భారత్ కావాలని అడగడం, ప్రతాప రామసుబ్బయ్యగారు తన ఇంటి నుండి తెప్పించి ఇవ్వడం జరిగింది. ఆ సమాచారాన్ని పోలీసులు ముందుగా పసిగట్టి, ఎదురుగా వున్న హోటల్‌లో కూర్చొని ప్లాను వేశారు. దానికి నాయకుడు బహుదుర్మార్గుడుగా గబ్బు పట్టిన డప్పుల సుబ్బారావు, స్పెషల్ బ్రాంచి డిప్యూటి సూపరింటెండెంట్ పొంచి కూర్చుని పట్టుకున్నాడు. నేనెక్కడ నుండో ఆ సమయానికి రాగా నీ షాపులో స్వతంత్ర భారత్ పంచుతున్నావని ఛార్జీ చేశాడు. నీవే కుట్ర చేసి స్వతంత్ర భారత్ తెచ్చావని నేను డబాయించాను. వెంటనే పోలీసులు నన్ను అరెస్ట్ చేయకుండా ఒక గంట తర్వాత వారంటు తీసుకువచ్చారు. మా షాపు వెనుకనే ప్రథమ గృహంలో మా నివాసం వున్నది. అక్కడ శివయ్య, నేను సంప్రదించుకొని అండర్ గ్రౌండ్‌కు వెళ్ళిపోవడం జరిగింది. రాష్ట్రంలో బహుశా అదే యుద్ధ వ్యతిరేకతకు వచ్చిన మొదటి వారంటు. అది 1940 మార్చి 18వ తేదీన జరిగింది. తర్వాత నా షాపు సరిగా చూసేవారు లేక దివాళా తీసింది. యుద్ధకాలంలో అన్ని వస్తువుల ధరలూ పెరిగి లాభాలు తెచ్చిపెట్టగా నా షాపును మాత్రం కారు చౌకగా అమ్మివేయవలసి వచ్చింది.

అప్పటికి నేను జిల్లా ఆర్గనైజింగ్ కమిటీ మెంబర్‌ను. ఆ అండర్ గ్రౌండ్ జీవితంతో అనేక అగ్ని పరీక్షలు నన్నెదుర్కోనారంభించాయి. అయితే ఆ రహస్య జీవితం మా జిల్లాలో అనేక గ్రామాలకు ఉద్యమాన్ని తీసుకెళ్ళేందుకు తోడ్పడ్డది. అయితే డప్పుల సుబ్బారావు పుణ్యమా అంటూ ఈ మందబుద్ధిని వెంటనే అరెస్టు చేద్దామనిపించలేదు. ఆ పనిని అతడు చేసివుంటే పార్టీ వ్యాప్తికి ఎంతో నష్టం జరిగివుండేది. ఏమైనా దేశభక్తుణ్ణిగా వున్న నేను కమ్యూనిస్టు నయ్యాను. ఆ ఆశయం పడక కుర్చీ భావంగాదనీ, కార్యక్రమాన్ని చేపట్టి, అనేక అగ్నిపరీక్షలకు తట్టుకుని గట్టిపడాలనీ, పీడిత ప్రజలకు అంకితమై పనిచేయాలని నా అనుభవం చాటుతూన్నది.

★ ★ ★

సరిగా చూసేవారు లేక దివాళా తీసింది. యుద్ధకాలంలో అన్ని వస్తువుల ధరలూ పెరిగి లాభాలు తెచ్చిపెట్టగా నా షాపును మాత్రం కారు చౌకగా అమ్మివేయవలసి వచ్చింది.

అప్పటికి నేను జిల్లా ఆర్గనైజింగ్ కమిటీ మెంబర్‌ను. ఆ అండర్ గ్రౌండ్ జీవితంతో అనేక అగ్ని పరీక్షలు నన్నెదుర్కోనారంభించాయి. అయితే ఆ రహస్య జీవితం మా జిల్లాలో అనేక గ్రామాలకు ఉద్యమాన్ని తీసుకెళ్ళేందుకు తోడ్పడ్డది. అయితే డప్పుల సుబ్బారావు పుణ్యమా అంటూ ఈ మందబుద్ధిని వెంటనే అరెస్టు చేద్దామనిపించలేదు. ఆ పనిని అతడు చేసివుంటే పార్టీ వ్యాప్తికి ఎంతో నష్టం జరిగివుండేది. ఏమైనా దేశభక్తుణ్ణిగా వున్న నేను కమ్యూనిస్టు నయ్యాను. ఆ ఆశయం పడక కుర్చీ భావంగాదనీ, కార్యక్రమాన్ని చేపట్టి, అనేక అగ్నిపరీక్షలకు తట్టుకుని గట్టిపడాలనీ, పీడిత ప్రజలకు అంకితమై పనిచేయాలని నా అనుభవం చాటుతూన్నది.

★ ★ ★

# కీ.శే. నీలం రాజశేఖరరెడ్డి

- విద్వాన్ పి. దస్తగిరి



అనంతపురం జిల్లాలో తరతరాలుగా పాతుకొనివున్న "ప్రశాంతత"ను విచ్ఛిన్నం చేసింది కమ్యూనిస్టుపార్టీ. ఐదుకల్లు సదాశివన్, నీలం రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డి, వి.కె. ఆదినారాయణరెడ్డి – వీరే ఆ విచ్ఛిన్నకారులు. అంతవరకు కష్టజీవులు మాట్లాడే పశువులుగా, సొంతంగా నడిచే ఉత్పత్తి సాధనాలుగానే వుండేవారు. తమ యజమానుల, షావుకార్ల, ధనీల (ధనికుల), గౌంచికాళ్ళ ఆనందాల కోసం, సుఖాల కోసం బతకటమే కష్టజీవుల బతుకుగా వుండేది. అందులో ఏ మాత్రం ఏమారినా అనారోగ్యంతోనైనా సరే, స్త్రీ పురుష భేదం లేకుండా పశువులతోపాటు బందెలదొడ్లో బంధించిన గౌంచికాళ్ళు వున్నారు. ఆడకూలి పనికిరాకపోతే నిజంగా ముట్టు అయిందా లేదా అని చీర వూడదీసి కనుక్కురమ్మని చాకలిని పంపిన ధనీలున్నారు. అయినా, పేదలు సహించినారు. అంతా ప్రశాంతంగానే వున్నది.

"భారత క్షామ చరిత్రలో దక్కను ప్రాంత మొక నల్లని మచ్చ" అని బి.ఎన్. గంగూలి అనే చరిత్రకారుడు అన్నాడట. అనంతపురం జిల్లా ఆ నలుపులో కారునలుపు. కరువు కాలంలో వనచరాల మాదిరి కాయకసురు, ఆకులలుములు తిని బతికినారు. చేత్తో ముట్టుకుంటే నుసి అయ్యే ఎండిన ఆకుల్ని సైతం ముల్లుతో గుచ్చి, సేకరించి, గంజి చేసుకొని బతికినారు. మైళ్ళు మైళ్ళు నడుచుకుంటూ వలసలు పోయినారు. పసిపిల్లల ప్రాణాలు కాపాడుకోలేక వాళ్ళను అమ్మివేసిన తల్లులూ వున్నారు. తమ ఆడ సుఖాలు అమ్మి కుటుంబాలను బతికించిన మమతామూర్తులూ వున్నారు. బిడ్డలకన్నా ప్రీతిగా చూసే పశువులను కోసుకతిన్న రైతులూ వున్నారు. ఎత్తు తక్కువ వుంటే కరువు పనిలో కూలి దొరకదని మట్టిని కుప్పగా పోసి దానిపై నిలబడి అవమానం పాలైన పిల్లలూ వున్నారు. అంత హీన, దీన పరిస్థితులలో కూడా కరువు రిలీఫ్ క్యాంపును సొంత ఆదాయవనరుగా మార్చుకొన్న అధమాధములూ వున్నారు.

తమ బాధల్ని తమ కర్మఫలంగా ప్రజలు సహించి 'ప్రశాంతత'ను భగ్నం చేయలేదు. గ్రామ ధర్మాల పేరిటో, మత ధర్మాల పేరిటో, కుల ధర్మాల పేరిటో, కోటాను కోట్ల దేవతలపై నమ్మకముంచో బాధితులు భరింపరాని సహనముతో వున్నారు.

కాని కమ్యూనిస్టు భావజాలం వారిని ఆవహించి, భౌతిక శక్తిగా మారినపుడు, జలజల శరీరాన్ని విదిలించి, తల పైకెత్తి, రుమాలు చుట్టి, నడుం కట్టి బిగించి, ఉన్న సత్తువంతా పొంగించి, అంత యెత్తు నిక్కి, కళ్ళతో వాడిగా చూస్తూ, ఉక్కు పిడికిళ్ళు బిగించినపుడు 'ప్రశాంతత' భగ్నమైంది. ధనీలు బందెల దొడ్లో బందీలైనారు. అవమానం పాలై సకల దౌష్ట్యాలు భరించిన స్త్రీ, దానికి కారకుడైన గొంచికాన్ని బండికి కట్టేసి తన ఎడమచేత్తో అతని మీసాలను యిగ్గి పట్టుకొని, వాటితోనే తాడుతో బిందెను పైకిలాగినట్లు అతని తలను పైకెత్తి, అట్లనే నోరు తెరిపించి, అదేపనిగా వేసుకొచ్చిన వక్కె కెంగి ఉమిసింది. అందువల్ల విస్ఫోటనం చెందినట్లుగా ప్రశాంతత భగ్నమైంది.

## చిమ్మ చీకటిలో దీపాలు:

ఆ నలుగురూ ఉన్నత కులస్తులు. చివరి ముగ్గురూ భూస్వాముల బిడ్డలు. వీరు వారసత్వంగా లభించిన సుఖాలను, సౌకర్యాలను అసహ్యించుకొని వదలిపెట్టినారు. సదాశివన్ హరిజనులలో ఒకడుగా వుంటూ, వారి అభ్యున్నతికి గట్టి కృషి చేసినాడు. వారు శ్రామిక వర్గ నీతితో దైనందిన జీవితాలను గడిపినవారు. పేద ప్రజల పోరాటాలకు నాయకత్వం వహించినవారు. వారిని అగ్రకులస్తులుగా, భూస్వాములుగాకాక తమ ఆప్తులుగా పేదవారు చూసినారంటే వారి ప్రవర్తన ఎట్లున్నదో వేరే చెప్పపనిలేదు. తమ కులంవాడు మాత్రమే తమకు మేలు చేయగలడనే కుల, మత ఛాందస ఊబిలో కూరుకుపోయిన నేటి మనిషి; ఎవరెట్ల నాశనమైతే నాకేం అని అబగా డబ్బుల కుప్పలు నూక్కోవడమే జీవిత సిద్ధాంతంగా గల నేటి మనిషి అటువంటి మహనీయుల జీవితాలను అధ్యయనం చేయాలి. చిమ్మ చీకటిలో దీపాలై వెలుతురు విరజిమ్మిన మహనీయుల కేవలం రాజకీయ అనుభవాలేగాక మొత్తం దైనందిన జీవిత అనుభవాలను, ఏ సమస్యకు ఎట్లా స్పందించారు? ఎట్లా పరిష్కరించారు? అనే సవివరమైన జీవిత చిత్రణ చేయాలి. నేటి యువతకు అందించాలి. వాటి అధ్యయనం ద్వారానే, ఆ వెలుతురులో మాత్రమే యువకులు మార్గనిర్దేశం చేసుకోగలరు. ఆ దిక్సూచి వల్లనే సరైన దారిలో పయనించగలరు. రాజకీయ శిక్షణ తరగతులలో జిల్లా పార్టీ చరిత్ర తప్పక ఒక పాఠ్యాంశంగా వుండాలి.

ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు కామ్రేడ్ ఐదుకల్లు సదాశివన్‌గారి జీవిత చరిత్రను గ్రంథస్థం చేసే ప్రయత్నం జరుగుతున్నది. ఆ సందర్భంగా కామ్రేడ్ నీలం రాజశేఖరరెడ్డిగారిని కలవటం జరిగినది. ఆయన సదాశివన్‌గారి గురించి చెప్తూ, సందర్భవశాత్తు తన గురించి కూడా తప్పకుండా చెప్పవలసి వచ్చి కొంత చెప్పినారు. దానికితోడు పార్టీ సర్క్యులర్లు, పై సందర్భంగా మరికొంతమంది చెప్పిన అంశాలలో లభించిన విషయంతోను, కొన్ని పత్రికల ఆధారంగాను రాజశేఖరరెడ్డి గారి గురించి ఈ చిన్న వ్యాసం రాసినాను. ఇది సమగ్రముకాదు, సంక్షిప్తమూ కాదు. చిత్రం

వేయడానికి ముందు కనీకనపడకుండ గీచే రేఖాచిత్రం యిది. కొంచమైనా సరే స్ఫూర్తిదాయకంగా వుంటుందని మీ ముందుంచినాను.

## గాంధీజీ ప్రభావం:

నీలం రాజశేఖర్‌రెడ్డి తండ్రి చిన్నపరెడ్డి. ఖద్దరు ధారి, ఖద్దరు వడికేవాడు. కాంగ్రెస్ ప్రచారానికి తోడ్పడేవాడు. తరిమెల నాగిరెడ్డి తండ్రి సుబ్బారెడ్డి. సుబ్బారెడ్డికి చిన్నపరెడ్డి బావ. సుబ్బారెడ్డి స్వంత అల్లుడు నీలం సంజీవరెడ్డి. సుబ్బారెడ్డి కాంగ్రెసు వాది. చిన్నపరెడ్డి, సుబ్బారెడ్డి యిద్దరూ అనంతపురంలో కల్లుకొట్టే ఈతచెట్టును వూరేగించి, కల్లు సారాయి అంగళ్ళ నిషేధానికి కృషి చేసినారు. తమ వూర్లలో అంగళ్ళు లేకుండా చేసినారు. అట్లా ఒకటి, రెండు గుణాలు తప్ప మిగతా అంతా భూస్వామిక, పెత్తందారీ లక్షణాలన్నీ సుబ్బారెడ్డిలో వున్నాయి. రాజశేఖరరెడ్డి చెప్పినట్లు 'అన్న నీలం సంజీవరెడ్డి డైనమిక్ లీడరు.' సంజీవరెడ్డి యింటరులో వుండగా తండ్రి చనిపోయినాడు. అందువల్ల చదువు చాలించి యింటి బాధ్యతలు చేపట్టినాడు సంజీవరెడ్డి. 1934 జనవరి 3, 4 తేదీలలో గాంధీ అనంతపురంలో హరిజన టూర్ చేసినాడు. అనంతపురంలో బహిరంగ సభకు వేలాదిజనం వచ్చినారు. మైకులు లేవు. గాంధీ చెప్తే, ఆ మాటలను అనువదించి మరొకరు బిగ్గరగా అరచి చెప్పాలి. ఆ సభలో పెనుకొండ ఆర్ట్ టీచరు సి.ఎన్. వెంకటరావు తాను చిత్రించిన కొన్ని చిత్రాలను గాంధీకి బహూకరించినాడు. గాంధీ వాటిని వేలం వేసి, వచ్చిన డబ్బును జిల్లా హరిజనోద్యమానికి యిచ్చినాడు. వాటిలో కొన్ని నీలం సంజీవరెడ్డి కొన్నాడు. ఆ కాంగ్రెసు కుటుంబ వాతావరణంలో వున్నాడు రాజశేఖరరెడ్డి. జిల్లాలోని చాలామంది భూస్వామిక రెడ్లు జస్టిస్ పార్టీలోనే తమ భవిష్యత్తు వుందని నమ్మినారు. కాని, ఈ రెడ్లు మాత్రం కాంగ్రెసుకు మాత్రమే భవిష్యత్తు వుందని తేల్చినారు. అంతేకాదు, తమ పిల్లల అభివృద్ధిని కాంగ్రెసులోనే చూడగలిగినారు. అందుకే తమ పిల్లల్ని కాంగ్రెసు రాజకీయాలలో చురుకుగా పాల్గొనేటట్లు ప్రోత్సహించినారు. కాని, నీలం రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డి తమ భవిష్యత్తుకుకాక పేద ప్రజల ఉజ్జ్వల భవిష్యత్తుకై కమ్యూనిస్టులై, తమ పెత్తందారీతనాన్నే సవాల్ చేస్తారనేది వారు ఊహించని పరిణామం.

## బెనారస్ విశ్వవిద్యాలయ స్ఫూర్తి:

నీలం సంజీవరెడ్డి పెండ్లికి పప్పూరి రామాచార్యులు, కల్లూరి సుబ్బారావు మొదలైన జిల్లా కాంగ్రెసు ప్రముఖులంతా వచ్చినారు. రాజశేఖరరెడ్డిని, నాగిరెడ్డిని బెనారస్ జాతీయ కళాశాలలో చదివిస్తే బాగుంటుందని కల్లూరి సుబ్బారావు సూచించినాడు. సూచించడమేకాక పెద్దలను ఒప్పించి, బెనారస్‌లో వారిద్దరినీ చేర్పించే బాధ్యత కూడా తీసుకున్నాడు.

రాజశేఖరరెడ్డిని, నాగిరెడ్డిని వెంటబెట్టుకొని కల్లూరు సుబ్బారావు రైల్లో బయలుదేరినాడు. మధ్యలో వార్ధాలో దిగి గాంధీ ఆశ్రమానికి పోయినారు. వారు పోయినప్పటికి గాంధీ చర్కా నడుకుతూ ఏదో ఆర్టికల్ డిక్టేట్ చేస్తున్నారు. వీరిని చూడగానే గాంధీ పలకరించినాడు. కల్లూరి సుబ్బారావు వచ్చిన విషయం చెప్పినాడు.

"జె. యం. కుమారన్‌ను చూసినారా?" అన్నాడు గాంధీ. "భోం చేస్తారా?" అని అడిగినాడు. "లేదు, లేదు బైట తింటా" మన్నాడు కల్లూరి సుబ్బారావు. తమకు అక్కడే తినాలని వుంది. అదే మహద్భాగ్యమనీ భావించినారు రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి. కాని, అవకాశం చేజారింది. బయటకు వచ్చిన తరువాత "సప్పని కూడు యెవడు తినేని?" అన్నాడు కల్లూరి సుబ్బారావు.

బెనారసు జాతీయ కళాశాలకు మదనమోహన మాలవ్యా వైస్ ఛాన్సలర్. అక్కడ సుబాసుచంద్ర బోసు, యం. యన్. రాయ్, ఆర్. పి. భట్టాచార్య, బాట్లీ వాలా మొదలగు ప్రముఖుల సమావేశాలు జరిగేవి. అట్లా వామపక్ష భావాలతో పరిచయం ఏర్పడింది అన్నారు రాజశేఖరరెడ్డి.

రాజశేఖరరెడ్డి వేసవి శెలవులలో యింటికి వచ్చేటప్పుడు అనంతపురంలో పార్టీవారున్నారా? అని పి. సి. జోషిని అడిగినారు. ఎవరో యిద్దరున్నారు, వివరాల కోసం పుచ్చలపల్లి సుందరయ్యను సంప్రదించమన్నాడు ఆయన. సుందరయ్య ద్వారా ఆ యిద్దరూ ఐదుకల్లు సదాశివన్, జి. రామకృష్ణ అని తెలుసుకున్నాడు. అనంతపురం వచ్చి కేశవ విద్యానికేతన్‌లో సదాశివన్‌ను కలుసుకున్నాడు.

అప్పటికే సదాశివన్ జిల్లా కాంగ్రెసు నాయకునిగా, రాష్ట్ర కాంగ్రెసు కమిటీ సభ్యునిగా వున్నారు. ముఖ్యంగా హరిజనోద్యమ నాయకునిగా, నిజాయితీకి, పట్టుదలకు, కార్యసాధనకు మారుపేరుగా జిల్లాలో పాపులర్ అయి వున్నారు. జిల్లాలో తొలి కమ్యూనిస్టు ఆయన. గ్రామాలు తిరిగి, ధాన్యము వసూలు చేసి, కేశవ విద్యానికేతన్‌ను ఆదర్శవంతంగా, "ది బెస్ట్"గా నడుపుతున్నాడు. కాంగ్రెస్ ప్రచారం సందర్భంగానూ, హరిజనోద్యమ సందర్భంగానూ జిల్లాలో సదాశివన్ తిరిగినన్ని గ్రామాలు అప్పటికీ, యిప్పటికీ, ఏ పార్టీవారు కూడా తిరిగినవారు మరెవ్వరూ లేరు. కేశవ విద్యానికేతన్‌ను హరిజన విద్యార్థుల వసతి గృహంగానే కాక, రాజకీయ శిక్షణాశిబిరంగా, పార్టీ రహస్య కార్యకలాపాల కేంద్రంగా నడుపుతున్నారు.

శెలవులలో వచ్చినపుడు రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి టాగూర్ లాడ్జిలో శివరాం బంగ్లాలో నిర్వహించే స్టడీ క్లాసులకు హాజరయి బోధించేవారు. ఆ క్లాసులకు కడప జిల్లా పార్టీ ప్రముఖులు యన్. శివరామిరెడ్డి, జె. వెంకటరామిరెడ్డి యింకా ఎన్.సి. గంగిరెడ్డి కూడా హాజరయ్యేవారు. తరగతులు బోధించడమేకాక, మార్క్సిస్టు, లెనిను సాహిత్యాన్ని, ముఖ్యంగా ఆగ్రా నుండి వెలువడే సోషలిస్టు సాహిత్యాన్ని అమ్మేవారు, చర్చించేవారు.

1937లో ఉమ్మడి రాష్ట్ర అసెంబ్లీ ఎన్నికలు జరిగినాయి. ఆ ఎన్నికలలో జనం ఉప్పెనలా వచ్చి జస్టిస్ పార్టీని చిత్తుచేసి, కాంగ్రెసుకు బ్రహ్మాండమైన విజయం చేకూర్చినారు. ఆ ఎన్నికలు జిల్లా రాజకీయాల్లో ఒక మలుపును తెచ్చినాయి. ఆ ఎన్నికలతో యువకులలో రాజకీయ చైతన్యం బాగా పెరిగింది.

ఆ ఎన్నికలలో వచ్చిన యువకులను సంఘటితపరచి సోషలిస్టు భావాల వైపు మళ్ళించటానికి, యువజన సంఘం ఏర్పాటు చేయడానికి సదాశివన్ చొరవ తీసుకున్నాడు. యువజనోద్యమాల గురించి నాగిరెడ్డి సాధన పత్రికలో వ్యాసాలు రాసినాడు. యువజన సంఘం ఏర్పాటు చేయడానికి 1–9–1937న కేశవ విద్యాని

కేతన్‌లో ఒక సమావేశము జరిగింది. జిల్లాలోని అన్ని ప్రాంతాల నుండి 130 మంది హాజరైనారు. కామ్రేడ్ కె. వి. రామకృష్ణారెడ్డి, యం. ఎ., బి.ఎల్. (రాజశేఖరరెడ్డి సోదరి భర్త) అధ్యక్షత వహించినారు. ఆ సమావేశం నీలం సంజీవరెడ్డిని అధ్యక్షునిగాను, సదాశివన్‌ను ప్రధాన కార్యదర్శిగాను; తరిమెల నాగిరెడ్డి, విద్వాన్ విశ్వం కార్యదర్శులుగాను మొత్తం 14 మందితో కార్యవర్గాన్ని ఎన్నుకొంది. సమావేశం ఆరు తీర్మానాలు ఆమోదించింది. 'దేశ దారిద్ర్యము, నిరుద్యోగము పారద్రోలి, ప్రజలందరికీ సమాన స్వేచ్ఛ నివ్వగలిగిన స్వాతంత్ర్యం పొందుట' అనేది మొదటి తీర్మానం. యువజన సంఘం స్టడీ సర్కిల్స్ విస్తారంగా నిర్వహించింది. వామపక్ష సాహిత్య ప్రచారానికి వీలున్న అన్ని అవకాశాలూ ఉపయోగించింది. రాజశేఖరరెడ్డి స్టడీ సర్కిల్స్ కార్యకలాపాల్లో చురుకాగా పాల్గొన్నాడు.

1938 మే 24, 26, 27 తేదీలలో మదనపల్లెలో రాయలసీమ యువజన, రైతు, రాజకీయ మహాసభలు జరిగినాయి. 24న రైతు మహాసభ, 26న యువజన మహాసభ, 27న రాజకీయ మహాసభ జరిగాయి. యువజన మహాసభకు నీలం సంజీవరెడ్డి అధ్యక్షత వహించినారు. సంజీవరెడ్డిని ఆంధ్ర రాష్ట్ర సంయుక్త కార్యదర్శిగా పట్టాభి పరిచయం చేసినారు. సభలను ఆచార్య ఎన్.జి. రంగా ప్రారంభం చేసినారు. ఆ సభల గురించి రాజశేఖర్‌రెడ్డి యిట్లా అన్నారు: "ఆ సభలకు నేనూ హాజరైనాను. బహిరంగ సభలలో ఉపన్యసించడం అదే మొదలు. ఇందూలాల్ యాజ్ఞిక్, జె. బుఖారి ఉపన్యాసకులుగా వచ్చినారు. అక్కడి నుంచి యాజ్ఞిక్, బుఖారి కరువు ప్రాంతాలు చూడటానికి అనంతపురం వచ్చినారు. వారి వెంబడి నేనూ వచ్చినాను. సంజీవరెడ్డి, సదాశివన్ మహాసభల్లోనే నిల్చినారు."

1938 డిశంబరులో బెనారస్‌లో పార్టీ సభ్యత్వం లభించింది రాజశేఖరరెడ్డికి. బెనారస్ యూనివర్శిటీ శాఖ కార్యదర్శిగా కూడా వున్నా నన్నారు రాజశేఖరరెడ్డి.

## విరివిగా రాజకీయ శిక్షణా తరగతులు:

అనంతపురం జిల్లా యువజన సంఘం స్టడీ సర్కిల్స్‌తోపాటు రాజకీయ శిక్షణా తరగతులూ నిర్వహించింది. లేపాక్షి, మడకశిర ప్రాంతాలలో తక్కువ వ్యవధికల పాఠశాలలూ నిర్వహించింది. ఆ క్లాసుల తరువాత జిల్లాలోని ముఖ్య కార్యకర్తలందరికీ నెల రోజుల పాఠశాల నడపాలనే డిమాండు వచ్చింది. నీలకంఠాపురం శ్రీరాములురెడ్డి అధ్యక్షులుగానూ, సదాశివన్ కార్యదర్శిగా 5–5–39 నుండి నెలరోజులపాటు 'వేసంగి రాజకీయ పాఠశాల' హిందూపురం హైస్కూలు బిల్డింగ్‌లో జరిగింది. మాల్యవంతం వెంకటరెడ్డి, పెడబల్లి చిదంబరరెడ్డి, జె. సి. నాగిరెడ్డి పాఠశాల నిర్వహణలో బాధ్యతలు తీసుకొన్నారు. కల్లూరు సుబ్బారావు, పప్పూరి రామాచార్యులు తరచు వచ్చి పర్యవేక్షణ చేసినారు. ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ న్యాపతి నారాయణమూర్తి రాకందున నీలం సంజీవరెడ్డి పాఠశాలను ప్రారంభించినాడు. ప్రతాపగిరి రామమూర్తి ప్రిన్సిపాల్‌గా వ్యవహరించినాడు. పి.సి. జోషి, కార్డెకర్, పుచ్చలపల్లి సుందరయ్య, పి. రామమూర్తి, ఆచార్య రంగా, హరిసర్వోత్తమరావు, శనివారపు సుబ్బారావు,

బెజవాడ గోపాలరెడ్డి, కాళేశ్వరరావు, రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి, సదాశివన్‌లు తరగతులు బోధించినారు. భౌతికవాదం, సోషలిజం, సామ్రాజ్యవాదం, రష్యా విప్లవం, వివిధ వర్గాలు – వాటిమధ్య సంబంధాలు మొదలగునవి కొన్ని బోధనాంశాలు. వాటితోపాటు డ్రిల్లు, హిందూస్థాన్ సేవాదళ పద్ధతులు, గ్రామాలలో సాంఘిక సేవ (ప్రాక్టికల్ కోర్సు) సదాశివన్ బోధించినాడు. పాఠశాలకు 50 మంది విద్యార్థులు హాజరైనారు. డి. శాంతప్ప, బి. సి. నరసింహులు, కె. బి. నరసప్ప, డి. నరసింహులు అప్పటి విద్యార్థులలో కొందరు. ఆ పాఠశాల చివరిగా ఏర్పడిన నూతన కార్యనిర్వాహకవర్గం "యువజనోద్యమం" పుస్తకం రాయడానికి తరిమెల నాగిరెడ్డి, రాజశేఖరరెడ్డి, విద్వాన్ విశ్వం, కె. వి. రామకృష్ణారెడ్డితో ఒక కమిటీని ఏర్పరచింది. "సంజీవరెడ్డి అపుడు సోవియట్ వ్యతిరేకి. ఆ క్లాసుల్లో బోధించే అంశాలు, వచ్చిన టీచర్లనుబట్టి సంజీవరెడ్డికి అపుడు అర్థం అయింది – యువజన సంఘం కమ్యూనిస్టు గ్రూపులోకి పోతున్నదని. ఆయన అలిగిపోయినాడు" అన్నారు రాజశేఖరరెడ్డి.

## మధ్యప్రదేశ్ ప్రభుత్వ అరెస్టు వారెంటు:

1940 మొదట్లో రాజశేఖరరెడ్డిపై ఉత్తరప్రదేశ్ గవర్నమెంటు అరెస్టు వారెంటు జారీ చేసింది. అందువల్ల ఆయన అజ్ఞాతవాసం చేయటానికి అనంతపురం వచ్చినారు. పార్టీ ఆదేశం మేరకు టికెట్టుకొని రాజశేఖరరెడ్డిని రైలెక్కించినాడు మల్లాది రామమూర్తి. రాజశేఖరరెడ్డి అనంతపురం వచ్చి సదాశివన్‌ను కలిసినారు. ఆయన పార్టీ ఆర్గనైజేషన్ నిమిత్తం మొదట బుక్కపట్నం యేరియాకు పంపినాడు. ఆ మొదటి ప్రయాణం అట్లా సాగింది. రాజశేఖరరెడ్డికి బాగా జ్ఞాపకం. రాజశేఖరరెడ్డి అనంతపురం రైలు ఎక్కడానికి వీలులేదు. అందువల్ల పక్కనవున్న జంగాలపల్లి రైల్వేస్టేషనులో వదలి రమ్మని, హాస్టలులో చదువుకొంటున్న శిష్యుడు శివశంకర్‌కు చెప్పినాడు సదాశివన్. శివశంకర్ సైకిలుమీద రాజశేఖరరెడ్డిని తీసుకొనిపోతున్నాడు. నేరుగా జంగాలపల్లికి పోకుండ, రాప్తాడు దావగుంత చుట్టుకొనిపోతున్నాడు. రాప్తాడు నుండి జంగాలపల్లికి దోవతెలీదు శివశంకర్‌కు.

అవి పీర్లపండుగ రోజులు. చంద్రుడు మునిగిపోయినాడు. చీకటిగా వుంది. మేఘాలు వున్నందున మరింత చీకటిగా వుంది. రాప్తాడులో పీర్ల మెరవణి జరుగుతున్నది. రాజశేఖర్‌రెడ్డిని ఊరిబయటే పెట్టి తనొక్కడే ఊరిలోకి పోయి, నమ్మకస్తులైన బంధువుల దగ్గర జంగాలపల్లికి దోవ తెలుసుకొని వచ్చినాడు శివశంకర్. కొత్తదోవ, అడ్డదోవ. సైకిలు లైటు ఆధారంగా ముందుకు పోతున్నారు. ఒకచోట బురదలో సైకులు దిగబడింది. అక్కడినుండి బురద బురదగా వుంది. అందువల్ల సైకిలు తోసుకుంటూ పోతున్నారు. ఫెడల్‌ను చేత్తో తిప్పి, అపుడు వెలిగిన లైటు వెలుతురులో దోవ గుర్తుంచుకొని పోతున్నారు. ఇంకోచోట బురదలో దిగబడిపోయినారు. చెప్పులు ఇరుక్కుపోయినాయి. అట్లా తిప్పలు పడుకుంటూ స్టేషను చేరినారు. రాజశేఖరరెడ్డిని అక్కడ వదలి మామూలు దోవగుండ వెనుతిరిగినాడు శివశంకర్. బాగా అలసిపోయి వున్నందున ఆదమరచి నిద్రపోయినాడు రాజశేఖరరెడ్డి. రైలు వచ్చింది, వెళ్ళింది. ఆయనకు మెలకువరాలేదు. ఆ తరువాతి రైలుకు వెళ్ళినాడు. అట్లా 1940లో

ప్రారంభమైన పార్టీ నిర్మాణం 1946 నాటికి ఒక రూపానికి వచ్చి, ఉరవకొండలో ప్రథమ మహాసభ జరిగింది. నీలం రాజశేఖరరెడ్డి జిల్లా కార్యదర్శిగా ఎన్నికైనాడు.

## జిల్లా పార్టీ నిర్మాణం:

ఐదుకల్లు సదాశివన్ జిల్లాలో తనకు గల కాంగ్రెసు పరిచయాలను కమ్యూనిస్టు పార్టీ నిర్మాణానికి ఉపయోగించినారు. బుక్కపట్నం యేరియాలో యం. కె. దాసప్ప, రామప్ప, వెంగళమ్మచెర్వు లక్ష్మీనారాయణరెడ్డి, లోచర్ల ఆదినారాయణరెడ్డి, పెడబల్లి రఘునాథరెడ్డి, ఘనేనాయక్, చింతలయ్య మొదలగువారు; కళ్యాణదుర్గం యేరియాలో భంగి ఎర్రిస్వామి, రామప్ప; ఉరవకొండ యేరియాలో బాబాసాబ్, చెంగల్వ సంజీవప్ప; నెట్టికల్లు అనంతపురం యేరియాలో పూలకుంట సంజీవులు, నాగిరెడ్డి; తరిమెలలో శ్రీరాములురెడ్డి, రూపావతారం మొదలైనవారు పార్టీ నిర్మాణంలోకి వచ్చినారు. గుంతకల్లు రైల్వే వర్కర్స్ యూనియన్ పార్టీ నాయకత్వం కిందికి వచ్చింది. రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డి, సదాశివన్ జిల్లాలో విస్తృతంగా తరగతులు నిర్వహించినారు. ఇద్దరి నుంచి పది పద్దైదుమందిదాకా హాజరయ్యేవారు. అట్లా హాజరైనవారు మరికొంతమందికి చెప్పినారు. 'థియరీ బాగా చదువుకొన్నందున నా క్లాసులన్నీ విజయవంతమైనా'యన్నారు రాజశేఖరరెడ్డి. తోటల్లో, గుట్టల్లో, శ్మశానాల్లో, యిండ్లలో రహస్యంగా తరగతులు నిర్వహించినారు. రహస్య పత్రికలు నేషనల్ ఫ్రంటు, నవశక్తి, స్వతంత్ర భారత్, ప్రజాబంధు, వాహిని, ఢంకా పత్రికలు పంపకం చేసినారు.

## దొంగ కేసులు:

బుక్కపట్నంలో యం. కె. దాసప్ప తన రెవెన్యూ ఉద్యోగానికి రాజీనామా చేసి పార్టీలోకి వచ్చినాడు. అందుకు కృషి చేసినవాడు సదాశివన్. ఆ యేరియాలో దాసప్ప మంచి కార్యకర్త. పార్టీ అభివృద్ధికి బాగా కృషి చేసినవాడు. ప్రజా సమస్యలకు తక్షణం స్పందించి కార్యక్రమాలకు పూనుకొనేవాడు. కోమట్ల, నిరంకుశ భూస్వాముల, పెత్తందార్ల, పోలీసుల దౌర్జన్యాలను జన సమీకరణలో తగ్గించినవాడు. అందువల్ల యం. కె. దాసప్ప అంటే కినుక అందరికీ. బుక్కపట్నంలో యస్సైగా వెంకటేశ్వర్లు వుండేవాడు. ఈయన కోమట్ల బంటు. దాసప్పపై కక్ష కట్టినాడు. ఒక క్రిష్టియన్ లేడీ టీచరును రేప్ చేయబోయినట్లు దాసప్పపై కేసు బనాయించినాడు. ఆ లేడీ టీచరు భర్త ఉత్త పనికిమాలినవాడు. ఆమెకు, యస్సైకు అక్రమ సంబంధం ఉండేది. కేసు బనాయించిన తరువాత ఆమెను ఎవరికంటా పడకుండ కొన్నాళ్ళుండమని ఆదేశించినాడు. ఆమె వూరు వదిలిపోయింది. తన భార్యను సదాశివన్ వుంచుకొని యెక్కడో దాచినాడని భర్త ప్రచారం మొదలుపెట్టినాడు.

అప్పుడు జిల్లా బోర్డు అధ్యక్షులుగా పైడి లక్ష్మయ్య వున్నాడు. రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి బోర్డు అధ్యక్షులతో మాట్లాడి, ఆ టీచరు భర్తను తరిమెలకు బదిలీ చేయించినారు. రాజశేఖరరెడ్డి ఆ టీచరు చెల్లెల్ని కలిసి, వాస్తవం తెలియజేసి, సహాయపడమని కోరినారు. ఆమె విషయం అర్థం చేసుకొని అంగీకరించింది. అక్క గుంతకల్లు కొట్టాలులో వున్న విషయం తెలిసింది. గుంతకల్లు కొట్టాలకు పోయి లేడీ

టీచరుకు నచ్చచెప్పి, ఆమెను పెనుకొండ కోర్టులో హాజరుపరచి, కేసు కొట్టేయించినారు. ఆమెను తీసుకొని వచ్చేటప్పుడు రాజశేఖరరెడ్డి, రాయెంగటంపల్లి వెంకటనాయుడు ఆమెతోపాటు జట్కాలో కూర్చోవలసి వచ్చింది. "పట్టుబడతామేమో అని ఓ పక్క, ఆమె పక్కన కూర్చున్నట్లు యెవరైనా చూస్తారేమోనని సిగ్గు మరోపక్క" అన్నారు రాజశేఖరరెడ్డి.

### రహస్యపత్రిక ఆకాశవాణి:

1940లో యువజన సంఘం 'ఆకాశవాణి' అనే సైక్లోస్టైల్ పత్రిక ప్రారంభించింది. దాని ప్రధాన బాధ్యులు సదాశివన్, విద్వాన్ విశ్వం. రాజశేఖరరెడ్డి కొన్ని వ్యాసాలు రాయడంతోపాటు నిర్వహణలో, పంపకంలో సహాయపడినాడు. ప్రొక్యూర్ మెంటుకు, వార్ఫండు సేకరణకు, రిక్రూట్ మెంటుకు వ్యతిరేకంగా యువకులను చైతన్యపరిచిందా పత్రిక. పత్రికకోసం ఎపుడెపుడా అని ఎదురు చూసేవారు. మొత్తం 13 సంచికలు వచ్చాయి. అపుడు కలెక్టర్‌గా భాస్కరరావు వుండేవాడు. ఆయన తమిళియన్. ఆయన లంచగొండితనాన్ని, అక్రమ ధన సంపాదనను తీవ్రంగా వ్యంగ్యంగా విమర్శిస్తూ, 'బలెలె భాస్కరన్' అనే వ్యాసం వచ్చింది. ప్రభుత్వం సదాశివన్‌ను, వెంకటనాయుడును అరెస్టు చేసి, శిక్షలు చెప్పింది. సాధన పత్రికలోని వార్తనుబట్టి రాజశేఖరరెడ్డిని అరెస్టు చేయాలని వున్నట్లు తెలిసింది.

1941 ఆగష్టులో ఉత్తరప్రదేశ్ గవర్నమెంటు వారంటుపై రాజశేఖరరెడ్డిని అరెస్టు చేసినారు పోలీసులు. రాజస్థాన్‌లోని దేవులికి తీసుకుపోతున్నారు. ఆ సమయంలో దేవులి జైలులో నిరాహారదీక్ష జరుగుతున్నది. అందువల్ల రాజశేఖరరెడ్డిని ఆగ్రాలోనే నిలిపినారు. ఆగ్రా జైలులో కాన్పూరు లేజరు లీడ్‌కు సంతోష్ కపూర్, కమ్యూనిస్టులు అశోక్‌బోసు, ఓంప్రకాశ్ సంగల్, గోపాల్ నారాయణ శెట్టి, విజయకుమార్ సిన్హా (కకోరికేసు), అజయ్‌ఘోష్ (భగత్‌సింగ్ అనుయాయి), మాలవ్యా మొదలైనవారున్నారు. కొంతకాలం తరువాత ఆగ్రానుండి రాజమండ్రి జైలుకు మార్చినారు.

### కాలేజీలాబ్ దహనం కేసు:

మలయాలోను, బర్మాలోను బ్రిటను పొందిన పరాజయాలవల్ల బ్రిటిష్ గవర్నమెంటు క్రిప్స్‌ను 1942 మార్చిలో రాయబారిగా మన దేశం పంపింది. 1942 జులైలో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం ఎత్తివేసింది గవర్నమెంటు. 1942 ఆగస్టులో విడుదలై వచ్చినాడు రాజశేఖరరెడ్డి. అదే సమయంలో ఆకాశవాణి కేసులో సంవత్సరం మూడు నెలలు శిక్ష అనుభవించి సదాశివన్‌గారూ విడుదలై వచ్చినారు. ఆ సందర్భంగా పూలకుంటలో బహిరంగసభ యేర్పాటు చేయబడింది. ఆ సభలో రాజశేఖరరెడ్డి, సదాశివన్‌లు యిద్దరూ పాల్గొనాలని నిర్ణయం. అట్లాగే పాల్గొని 'ప్రజాయుద్ధం' అనే మాటతో ఉపన్యాసం మొదలుపెట్టినాడు రాజశేఖరరెడ్డి. యుద్ధం అనేమాట వినగానే 'అరెస్టు' అన్నాడు అక్కడున్న యస్సై. రాజశేఖరరెడ్డి, సదాశివన్ ఎంత వివరించినా యస్సై పట్టించుకోలేదు. ఇద్దరి మీద కేసు నమోదు చేసినాడు. ఆ కేసుకు తిరుగుతుండగానే 1942 సెప్టెంబరు 10న అనంతపురం కాలేజీ కెమిస్ట్రీ

ల్యాబ్‌ను ఎవరో కాల్చినారు. ఎవరు కాల్చింది యింతవరకు అంతుదొరకని రహస్యంగా వుండిపోయింది. లక్షరూపాయల నష్టం జరిగింది. ఆ ల్యాబ్ కేసులో కాలేజి విద్యార్థులతోపాటు రాజశేఖరరెడ్డి, సదాశివన్‌లను కూడా యిరికించినారు. మొత్తం పంద్రెండు మంది ముద్దాయిలు. కేసులో రాజశేఖరరెడ్డి 24 సం॥ వయసు గల రైతుగాను, సదాశివన్ హరిజన వర్కరుగాను, వి. కె. ఆదినారాయణరెడ్డి, మిగతావారిని విద్యార్థులుగాను పేర్కొన్నారు. విచారణ రోజు కోర్టు జనంతో కిటకిటలాడింది. నగరూరి నారాయణరావు, బళ్ళారి రాఘవాచార్యులు ముద్దాయిల తరపున వాదించినారు. బళ్ళారి రాఘవాచార్యులు బళ్ళారి నుంచి ఉత్సాహంగా వచ్చి వాదించినారు. వాదనలు ఆసక్తికరంగా వుండినాయి. రాఘవాచార్యులు తమ ఊతపదం 'నో' యాభైసార్లు ఉపయోగించినారని చెప్తారు. ఆ కేసు అనంతపురంలో పెద్ద సంచలనం కలిగించింది. పార్టీపై పెద్ద యిమేజి కలిగించింది. సానుభూతి పెరిగింది. ఆ రెండు కేసుల్లో తిరిగేటప్పుడు అవకాశం దొరికినప్పుడల్లా కోర్టు బయటా, తాలూకా ఆఫీసు చెట్టుకిందా తమను చూడటానికి వచ్చినవారికి ఉపన్యాసాలిచ్చేవాడు రాజశేఖరరెడ్డి. "రాజశేఖరరెడ్డి బాగా మాట్లాడినాడు" అని అనుకునేవారు.

1940 జూలై తరువాత రాయలసీమ జిల్లాలకు పార్టీ సాహిత్యాన్ని ఆయా జిల్లా ప్రతినిధులకు అందజేస్తూ సమన్వయం చేసే పనిని యేటుకూరి బలరామమూర్తికి అప్పజెప్పింది పార్టీ. ఆ పనిమీద అనంతపురం వచ్చినపుడు ఒకసారి ఆయన రాజశేఖరరెడ్డిని కలుసుకున్నారు. సదాశివన్ జ్ఞాపకాల గురించి రాసిన ఒక ఉత్తరంలో ఆ విషయాన్ని యిట్లు రాసినారు: "రైల్వేలైను పక్కన ఉన్న వారి మేడలో కలుసుకున్నాను. ఆయనను చూడటం అదే మొదలు. బెనారస్ నుండి విద్యాభ్యాసం ముగించుకొని ఆయన, నాగిరెడ్డి, విద్వాన్ విశ్వంగారు అప్పుడే వచ్చారు. వారి యింట్లో ఒక పూట భోజనం చేశాను. మధ్యాహ్నం తీయని మామిడిముక్కలు తింటుండగా, పక్కగదిలో నుండి సంజీవరెడ్డిగారు రావటం, మా యిద్దరినీ కొరకొర చూసి వెళ్ళిపోవటం బాగా గుర్తు."

## జిల్లా కార్యదర్శిగా:

1943 జనవరిలో కమలానగర్‌లోని ఎనుగొండ్ల మంగమ్మ యింట్లో పార్టీ ఆఫీసు ప్రారంభించినారు. రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి, సదాశివన్, వి. కె. ఆదినారాయణరెడ్డి, జి. రామకృష్ణలతో ఒక కమిటీ ఏర్పడింది. రాజశేఖరరెడ్డిని కార్యదర్శిగా ఎన్నుకొన్నారు.

సి. ముత్యాలప్ప తన ప్రాంతం గ్యేరిగికుంట యేరియాలో పార్టీ నిర్మాణానికి పూనుకున్నారు. 1944 మేడే జరపాలని రాజశేఖర్‌రెడ్డి, నాగిరెడ్డి, సదాశివన్‌లను ఆహ్వానించినారు. వారిని తీసుకురావడానికి కనగానపల్లికి బండి పంపినారు. బండివాడు బస్టాండు దగ్గర బండి విడుచుకొని నాయకుల కోసం ఎదురుచూస్తున్నాడు. భూస్వాముల ఒత్తిడి మేరకు పోలీసులు బండివాన్ని లోపల వేసినారు. తరిమెల నాగిరెడ్డి రాలేదు. రాజశేఖరరెడ్డి, సదాశివన్ బస్సు దిగినారు. బస్సు దిగగానే వారికి బండివాని విషయం తెలిసింది. చాలా కోపం వచ్చింది. స్టేషన్‌లోకి దూసుకుపోయి, పోలీసులపై విరుచుకపడినారు. చట్టాల గురించి నిలదీసినారు. జిల్లా అధికారులకు రిపోర్టుచేసి

పోలీసులపై చర్య తీసుకొనేటట్లు చేస్తామన్నారు. అప్పటి పోలీసులకు చట్టాల గురించి దాదాపు ఏమీ తెలీదు. ఐదవ తరగతి వారి చదువు. బొటనవేలు వప్పితం వేసేవారు కూడా వుండేవారని చెప్తారు. అందువల్ల పోలీసులకు చదువుకున్నవారంటే, టౌను వారంటే జంకు. పైగా, వాళ్ళిద్దరు జిల్లాలో ప్రసిద్ధి పొందిన కమ్యూనిస్టు నాయకులు, "గట్టివారు." సరైన సమాధానం చెప్పలేక పోలీసులు బండివాన్ని వదిలిపెట్టినారు. ఆ సంఘటనతో "బాగా జరుగుతుందనుకొన్న మేడే ఉత్సవం బ్రహ్మాండంగా జరిగింది."

1946లో ఉరవకొండలో జిల్లా కమ్యూనిస్టుపార్టీ ప్రథమ మహాసభ జరిగింది. కార్యదర్శిగా నీలం రాజశేఖర్‌రెడ్డిని ఎన్నుకొన్నారు.

## జిల్లా పార్టీ చరిత్ర రచన:

1946 ఏప్రిల్‌లో ఉమ్మడి మద్రాసు రాష్ట్రానికి ఎన్నికలు జరిగినాయి. ఆ ఎన్నికలనాటికి అపభ్రంశ నిందా ప్రచారం ఉధృతం చేసింది కాంగ్రెసుపార్టీ. అందువల్ల వాటికి సమాధానం రాయవలసిందని పార్టీ రాజశేఖర్‌రెడ్డికి బాధ్యత నప్పజెప్పింది. ఆయన "అనంతపురం జిల్లా కమ్యూనిస్టుపార్టీ ఉద్యమ చరిత్ర" అనే వ్యాసం రాసినాడు. ప్యాకెట్ సైజు పుస్తకంగా (4–3–46న పినాకిని ప్రెస్‌లో) ముద్రించి విడుదల చేసింది పార్టీ.

"ఉన్నది దాచి, లేనిది కల్పించి కమ్యూనిస్టులు అంటే కత్తులు నూరుతున్నారు. కమ్యూనిస్టులను అనని మాటలు లేవు. దేశద్రోహులన్నారు, రౌడీలన్నారు. మోసగాళ్ళన్నారు, పచ్చి పోకిరీలన్నారు. కమ్యూనిస్టుపార్టీ అత్యాచారాలవల్ల పాడైపోని ఏ పవిత్ర వస్తువు లేదన్నారు" అంటూ ప్రారంభించి 1930 నుండి 46 వరకు కాంగ్రెసులో వున్నపుడు, కాంగ్రెసు నుండి బయటికి వచ్చి కమ్యూనిస్టులు నిర్వర్తించిన బాధ్యతలను సవివరంగా వివరించినారు. కాంగ్రెసువారి వాదనలను గాంధీ, నెహ్రూల ఉటంకింపులతోనే తిప్పికొట్టినారు. సత్తా లేనివిగా నిరూపించినారు. విద్యార్థులను, రైతులను సంఘాలలోకి సమీకరించి, దేశ స్వాతంత్ర్యం కోసమేకాక జిల్లా అభివృద్ధికై సాగునీటి ప్రాజెక్టు కోసం, గిట్టుబాటు ధరలకోసం, ఘోరమైన కరువు కాలంలో రిలీఫ్ క్యాంపులలో బీదసాదలకు ఈయవలసిన వాటిని సక్రమ పంపిణీకోసం, దొంగ వ్యాపారస్తులకు, లంచగొండి ఉద్యోగులకు వ్యతిరేకంగా పార్టీ ఎట్లా పోరాడిందీ వివరించినారు. ప్రజాసేవ పునాదిగా పార్టీ ఎట్లా అభివృద్ధి అయిందీ వివరించినారు. ఈ విధంగా వచ్చిన ఆరోపణలను సునాయాసంగా సమర్థవంతంగా తిప్పికొట్టినారు. స్వతంత్ర భారత్‌లో, స్వతంత్ర రాష్ట్రాల కోసం, సుఖసంపదలతో కళకళలాడే పట్టణాల కోసం అందరూ చేతులు కలిపి పోరాటంలో పాల్గొనమని ఆహ్వానించినారు.

1946లో పరిమిత ఓటింగు పద్ధతిలో జరిగిన ఎన్నికలలో కాంగ్రెసు అభ్యర్థి అయిన సంజీవరెడ్డిపై తరిమెల నాగిరెడ్డిని పోటీ పెట్టింది పార్టీ. ప్రచారం నిమిత్తం తొమ్మిదివందలు పెట్టి ఒక కారు కొన్నారు రాజశేఖరరెడ్డి. సంజీవరెడ్డి గెలిచినాడు. పార్టీ అభ్యర్థికి డిపాజిట్టు రాలేదు.

## వెల్లూరు జైలులో:

1947 జనవరిలో పార్టీ నిషేధింపబడంది. రాజశేఖరరెడ్డి దంపతులు కాన్పు కోసం (డాక్టర్ విజయకుమార్ జన్మించినారు) మదనపల్లెలో వున్నారు. అక్కడే రాజశేఖర్‌రెడ్డిని అరెస్టుచేసి వెల్లూరు జైలులో పెట్టినారు. అక్కడ నంబూద్రిపాద్, ఎ.కె. గోపాలన్, ఎన్.కె. కృష్ణన్, తరిమెల నాగిరెడ్డి, సదాశివన్ మొదలగువారున్నారు ఆ జైలులో మూడు వందలకుపైగా ఆంధ్రులున్నారు. జైలులో 12 అణాల అలవెన్సు యిచ్చేవారు. జైలులో టెన్నీసు, హాకీ ఆడేవారు. రాజశేఖరరెడ్డి మంచి హాకీ ప్లేయరు. జైలులో నిత్యము తరగతులు జరిగేవి. రాజశేఖరరెడ్డి తెలుగులో క్లాసులు తీసుకొనేవారు. "ఎక్కడున్నా డ్రిల్లు, ఆహారం యిన్‌ఛార్జి సదాశివన్ గారిదే." 8 నెలలు వెల్లూరు జైలులో వున్నారు.

1948లో కలకత్తాలో పార్టీ కాన్ఫరెన్సు జరిగింది. పి. సి. జోషి స్థానంలో బి. టి. రణదివే పార్టీ కార్యదర్శిగా ఎన్నికైనాడు. ఇండియాకు స్వాతంత్ర్యం కావాలనే తీర్మానంతోపాటు సాయుధ పోరాట తీర్మానాన్ని ఆమోదించింది కాన్ఫరెన్సు. ఆ కాన్ఫరెన్సుకు రాజశేఖరరెడ్డి పోలేదు. తీర్మానాలనుబట్టి రాబోయే పరిణామం ఊహించి ముఖ్యులంతా అజ్ఞాతంలోకి వెళ్ళినారు. ఆ అజ్ఞాతవాస కాలంలో రాజశేఖరరెడ్డి లోచర్లలో వున్నాడు. పెదపల్లి చిదంబరరెడ్డి (కాంగ్రెసు నాయకులు) యింట్లో వున్నాడు. కళ్యాణదుర్గంలో భంగి యెర్రిస్వామి యింట్లో వున్నాడు. ఉరవకొండలో వున్నాడు. జిల్లా బయట ఆదోనిలో లింగన్నబావి వీధిలో రహస్య స్థావరం వుండేది. అక్కడ రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి, తూమాటి దొణప్ప వుండేవారు. వారి దైనందిన కార్యకలాపాల్లో తోడ్పడిన బి. పార్వతమ్మగారుండేవారు. ఆదోని నుంచి బళ్ళారి, బళ్ళారి నుంచి బెంగుళూరుకు స్థావరాలు మార్చినారు.

## అజ్ఞాతవాస జీవితంలో:

ఆ కాలంలో రాయలసీమ రీజనల్ కమిటీ కార్యదర్శిగా వై. వి. కృష్ణారావు గారున్నారు. బెంగుళూరులో రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డి, వై. వి. కృష్ణారావు, బి. పార్వతమ్మ, మచ్చకంటి ఆనందరావు, ఆయనభార్య కళావతి, లావు బాలగంగాధరరావు వున్నారు. కొరియరుగా సర్కారు కామ్రేడ్ కందికట్ల నాగభూషణం వున్నారు. కొరియర్ సాయంత్రానికి స్థావరం చేరాలి. లేదా, సమాచారమున్నా పంపాలి. రెండూ లేకపోతే కొరియర్ ప్రమాద స్థితిలో వున్నాడు లేదా, అరెస్టు అయినాడని అర్థం. ఒకసారి కొరియర్ అరెస్టు అయినాడు. స్థావరం ప్రమాదంలో పడింది. నాగిరెడ్డి తృటిలో తప్పించుకున్నాడు. కొరియర్ కుటుంబాన్ని మద్రాసులోని కంటోన్మెంటుకు పంపమని రాజశేఖరరెడ్డి ఆనందరావుకు చెప్పినాడు. ఆనందరావు గబగబ సామానులు సంచుల్లోకి సర్ది రిక్షాలో కొంతదూరం, జట్కాలో కొంత దూరం దోవలు మార్చి మార్చి స్టేషను చేరుకున్నారు. రైలు కదులుతున్నది. కదులుతున్న రైల్లోకి సిల్వర్ సామానుల సంచివేసి, ఆమెను ఎక్కించినారు ఆనందరావు. రాజశేఖరరెడ్డి, వై. వి. కృష్ణారావు స్థావరానికి పోవడానికి వీలులేదు కాబట్టి, పొద్దుపుచ్చడానికి రైల్వేస్టేషను దగ్గరకుపోయి కూర్చున్నారు. అక్కడ ఒక తెలుగువాడు

కనబడినాడు. అక్కడ వుండటం బాగుండదని కబ్బన్‌పార్క్‌లో కొంతసేపున్నారు. అక్కడా తెలుగుమాట వినపడింది. అక్కడ కూడా ఉండకూడదని ఒక హాస్పిటల్ దగ్గరకు పోయి కూర్చున్నారు. అక్కడైతే మా ఆడవాళ్ల కాన్పుకు వచ్చినారని చెప్పవచ్చని. ఆ తరువాత మద్రాసుకు స్థావరం మార్చినారు. మద్రాసులో రాజశేఖరరెడ్డి, కంభంపాటి సీనియర్ ఒకచోట పరశువాకంలో వున్నారు.

## అరెస్టు నుండి తప్పించుకున్న విధం:

ఆ విధంగా వుంటుండగా 1951 మే 18 సాయంకాలం ఏడు గంటలకు రాజశేఖరరెడ్డి తన స్థావరం నుండి చంగల్పట్టులో వున్న డెన్నుకు పోతున్నాడు. ఎస్. డబ్ల్యు. నరసయ్య, డి. రామకృష్ణ ఆ డెన్నులో వున్నారు. డెన్నుతో సంబంధం వున్న కొరియర్ ఆరోగ్యస్వామి (అతనిది గుంతకల్లు. అతనిని అచా అనీ అంటారు) ఆ దినమే పోలీసులకు చిక్కిన విషయమూ, చంగల్పట్టు డెన్ను పోలీసుల వశమైన విషయమూ రాజశేఖరరెడ్డికి తెలీదు. రాజశేఖరరెడ్డి ఆ ప్రాంతాన్ని సమీపించగానే ఆరోగ్యస్వామి అన్న మాన్యుయల్ వచ్చినాడు. చెంగల్పట్టు డెన్ను, పరశువాకం డెన్నూ పోలీసులకు తెలిసిందనీ, అందుచేత రాజశేఖరరెడ్డిని రక్షించడానికే కాచుకొని వున్నాననీ చెప్పినాడు. ఆ విషయం చెపుతూ ఇండ్లకు దూరంగా మైదాన ప్రాంతానికి తీసుకొని వచ్చినాడు. ప్లాను ప్రకారం అక్కడ కాచుకొని వున్న ఇద్దరు సి.ఐ.డి.లూ, మాన్యుయల్ అకస్మాత్తుగా మీదపడి, గప్‌చిప్‌గా ఎత్తుకొని పోవడానికి ప్రయత్నించినారు. వారితో ఎంత పెనుగులాడినా తప్పించుక పోవడానికి సాధ్యంకాక పెద్దగా కేకలు వేసినాడు.

ఆ కేకలు విని కొంతదూరంలో వున్న ఇండ్ల నుండి జనం పరిగెత్తుకొని వచ్చినారు. "నేను ఆంధ్ర కమ్యూనిస్టును. ఈ సి.ఐ.డి.లు నన్ను కాల్చివేయడానికి రహస్యంగా ఎత్తుకొని పోతున్నారు, కాపాడండి" అని అపీలు చేసినాడు. ప్రజలు సి.ఐ.డి.లను పట్టుకొని చావబాదినారు. అప్పుడు సమయం చూసుకొని రాజశేఖరరెడ్డి అక్కడి నుంచి తప్పించుకున్నాడు. ఆ పెనుగులాటలో అతని దోవతి వూడిపోయింది. చొక్కా, బనియన్‌లు పీలికలు అయినాయి. డ్రాయర్ మాత్రం మిగిలింది. ఆ స్థితిలో మరీ రోడ్డుమీదికి వెళ్ళడానికి సాధ్యంకాక కొంతదూరం నిర్జనమైన చేండ్లలో నడచినాడు. ఆ తరువాత అడ్డం వచ్చిన రోడ్డెక్కి నడుస్తున్నాడు.

ఆ సమయంలో అటుగా బస్సు వచ్చింది. బస్సులో వున్న సబ్ ఇనస్పెక్టరు యితని వేషాన్ని చూసి, అనుమానించి, బస్సు ఆపి, బస్సెక్కించినాడు. స్టేషనుకు తీసుకువెళ్ళి లాకప్‌లో వుంచినాడు. పోలీసులు ఎంత ప్రయత్నించినా సరైన సమాధానం చెప్పలేదు. ఎంక్వైరీ ద్వారా పోలీసులూ ఆయన చెప్పిన విషయాలు సరైనవి కావని తెల్సుకున్నారు. అయితే, ఒక ప్రమాదం పొంచి వున్నది. కొద్దిరోజుల లోపల కేంద్ర, రాష్ట్ర పార్టీ ప్రముఖుల సమావేశము మద్రాసులో జరుగుతున్నది. ఆ సమావేశ సంధానకర్త రాజశేఖరరెడ్డి. ఆయన అరెస్టు అయిన విషయం వారికి ఏదో రూపంలో తెలియకపోతే వారందరూ పట్టుబడే అవకాశాలున్నాయి. అందువల్ల యే విధంగానైనా బయటకు రావాల్సి వుంది. అందువల్ల తన పేరు చెప్పి సి. పి. రెడ్డి అనే తన

బంధువును విచారిస్తే తన సంగతి తెలుస్తుందని చెప్పినాడు. సి. సి. రెడ్డిని పోలీసులు పిలుచుకొని వచ్చినారు. అతని సాయంతో బెయిలు మీద బయటకు వచ్చినాడు. తక్షణం డెన్ను నుండి తన భార్యను పిలిపించుకున్నారు. అట్లా పిలిపించుకోవటం వల్ల కొందరికి అర్థమై తప్పించుకున్నారు. వారిద్వారా మరికొంతమందికి తెలిసింది. స్నేహితుల ద్వారా మరికొందరికి టెలిగ్రాములు యిప్పించినాడు. అయినా, ప్రమాదం తొలగిందనే నమ్మకం కుదరలేదు. అందువల్ల పోలీసు కమీషనరు దగ్గర లొంగిపోతున్నానని పత్రికలకు వార్తలు పంపి, రానున్నవారి నెవ్వరినీ మద్రాసుకు రాకుండ చేసినారు. ఆ వార్త 24-5-51 ఆంధ్రప్రభలో వచ్చింది.

వెంటనే జిల్లా కమిటీ సమావేశమై రాజీనామా చేయడం గొప్ప నేరంగా తీర్మానించి పార్టీ నుండి రాజశేఖరరెడ్డిని బహిష్కరిస్తూ, విషయం చిన్న కరపత్రం ద్వారా అన్ని శాఖలకు తెలియజేసింది. అయినా, తృప్తిపడక జూన్‌లో మరొక పెద్ద కరపత్రం అచ్చుకు యిచ్చింది. ఆలోగా ఏ పరిస్థితుల్లో రాజశేఖరరెడ్డి అట్లా చేయవలసి వచ్చిందో వివరిస్తూ ఎ. కె. గోపాలన్, తాపీ మోహనరావు ఒక మనిషి ద్వారా జిల్లా కమిటీకి వార్త పంపినారు. తన రాజీనామా ఉపసంహరించుకున్నట్లు ఉత్తరం రాసినాడని కూడా ఆ వార్తలో తెలియజేసినారు. అయినా, రాజశేఖరరెడ్డిని పార్టీ కార్యకలాపాల్లో పాల్గొననివ్వడం అసాధ్యమని జిల్లా పార్టీ తీర్మానించింది. నాలుగు ఆంక్షలు విధించింది: 1) తాను రాజీనామా యివ్వడం ద్వారా చేసిన ద్రోహానికి, నేరానికి, చూపించిన ఊగిసలాటకూ కరపత్రం ద్వారా, పత్రిక ప్రకటన ద్వారా క్షమాపణ చెప్పుకోవాలి, 2) శాంతి వుద్యమంలో జిల్లాలో కొందరు అభ్యుదయ యువకులు ప్రారంభిస్తున్న ప్రోగ్రెసివ్ బ్లాక్‌లో పాల్గొనాలి, 3) కమ్యూనిస్టులను విడుదల చెయ్యాలనే కార్యక్రమములో జిల్లాలోని ప్రముఖ వ్యక్తులను కలసి, వారిని దానిమీద సమీకరించాలి, 4) అత్యవసరంగా తెలుగులో రాజకీయ సమస్యలమీద చిన్న చిన్న పుస్తకాల ప్రకటనకు పూనుకోవాలి.

## పార్టీ క్రమశిక్షణా చర్య:

ఆ తీర్మానాలు బాధాకరమైనవి అయినా, మెజారిటీ అభిప్రాయాన్ని శిరసావహించి నడుచుకున్నారు రాజశేఖరరెడ్డి. సుశిక్షిత సైనికునిలా తనకు యిచ్చిన పార్టీ కార్యకలాపాలను క్రమశిక్షణతో నెరవేర్చి, తిరస్కరించిన సభ్యులచేతనే మరల ఉన్నత స్థానానికి ఎన్నుకోబడినాడు. (ఈ సంఘటన సమాచారం జిల్లా కమిటీ సర్క్యులర్ 10/51 తేది 20-6-51 నుండి తీసుకున్నాను).

1952 ప్రథమ సార్వత్రిక ఎన్నికలలో మరోమారు సంజీవరెడ్డిపై తరిమెల నాగిరెడ్డిని నిలిపింది పార్టీ. నాగిరెడ్డి అపుడు కడలూరు జైలులో వున్నాడు. బిట్రగుంట రామచంద్రరావు (తాడిపత్రి తాలూకా కార్యదర్శి)ని పంపి నాగిరెడ్డి సంతకం తెప్పించినారు. ఆరువేలకి ఒక కారు కొన్నాడు రాజశేఖరరెడ్డి. "ధరల పెరుగుదలకు, అవినీతికి, వాగ్దాన భంగానికి" వ్యతిరేకంగా ప్రజలు చైతన్యవంతులైన కమ్యూనిస్టు పార్టీవైపు మొగ్గినారు. కాంగ్రెసు తరఫున నెహ్రూ ప్రచారానికి వచ్చినారు. అయనకు కొన్ని ప్రశ్నలు వేస్తూ కరపత్రం వేసింది పార్టీ. వాటికి నెహ్రూ సరైన

సమాధానాలు చెప్పలేకపోయినారు. నాగిరెడ్డి 13 వేల మెజారిటీతో ఎన్నికయినారు. కౌంటింగు మధ్యలోనే సంజీవరెడ్డి లేచి వెళ్ళిపోయినాడు.

1953లో బళ్ళారి జిల్లాను ఆంధ్రాలో చేర్చాలనే ఉద్యమం మొదలైంది. బళ్ళారి, రూపనగుడి, మోక తాలూకాలు ఆంధ్రాలో చేర్చాలనేది కమ్యూనిస్టు పార్టీ వైఖరి. కోర్కెల సాధనకు కామిరెడ్డి అనే ఆయన ఉపవాసదీక్షకు కూర్చున్నాడు. ఇరవై రోజులు జరిగినా ప్రభుత్వంలో చలనం లేదు. ఉద్యమానికి నాయకత్వం వహిస్తున్న ఆంధ్ర సమితి ఆ తరువాత అరాచక, దుందుడుకు వైఖరి తీసుకున్నది. బళ్ళారి, రూపనగుడి, మోక తాలూకాలే కాకుండ హోస్పేట వరకు ఆంధ్రలో కలపాలని మోకలో జరిగిన ఆంధ్ర కాన్ఫరెన్స్‌లో పైడి లక్ష్మయ్య చెప్పినారు. దానికి కమ్యూనిస్టు పార్టీ ఒప్పుకోలేదు. ఈ పోకడలు చూసి, సమస్య సాధన దిశలో ఉద్యమం లేదని, ఉపవాసం విరమింపచేయాలని రాజశేఖరరెడ్డి, సదాశివన్‌లు బళ్ళారికి పోయినారు. బళ్ళారిలో ఈ సమస్యపై ఎప్పుడు జరిగినా వేలాది జనంతో బ్రహ్మాండమైన ఊరేగింపూ, సభా జరిగేవి. ఆ జనాన్ని ఆ రోజు చూసి విరమించే విషయం చెప్పలేకపోయినారు. చివరికి ఏదో ఒక విధ్వంస కార్యక్రమం ద్వారా ప్రభుత్వంపై తీవ్ర వత్తిడి తీసుకురావలెనని ఉద్యమకారులు తలంచినారు. వంతెనలు పడగొట్టాలని నిర్ణయించి, ధైర్యం చాలక చివరి దశలో విరమించుకున్నారు. తక్కువ నష్టంతో ఎక్కువ లాభం పొందటానికి ఉపవాసం కూర్చున్న కామిరెడ్డిని ఇంజక్షను ద్వారా చంపి అలజడి సృష్టించాలని నిర్ణయించినట్లు; తాను పూర్తి అపస్మారక స్థితిలో వున్నానని నమ్మి నాయకులు తనకు సమీపంలో మాట్లాడుకుంటుండగా మగతగా వున్నప్పటికీ ఆ మాటలు విన్నానని కామ్రేడ్ టి. రంగన్నకు చెప్పినాడు కామిరెడ్డి. రంగన్న అప్పుడు పార్టీ సానుభూతి పరుడుగా, విద్యార్థి నాయకుడుగా వుంటూ, ఆ ఉద్యమంలో చురుకుగా పాల్గొంటున్న కార్యకర్త. రంగన్న సమయస్ఫూర్తితో వ్యవహరించినాడు. నల్లషర్టు, నల్లనిక్కరు ధరించిన వాలంటీర్లను రాత్రంతా చుట్టూ కాపలా వుంచి, కామిరెడ్డి ప్రాణం కాపాడినారు. వెంటనే అనంతపురం వచ్చి రాజశేఖరరెడ్డి, సదాశివన్‌లను కలిసినాడు. రాజశేఖరరెడ్డి కడప కోటిరెడ్డిగారిని రప్పించి, వారిచేత దీక్ష విరమింపజేసినాడు.

## కర్నూలుకు ఆకలియాత్ర:

1954 మార్చి 24న రాజధాని కర్నూలుకు రైతుకూలి యాత్ర నిర్వహించింది పార్టీ. దాన్ని మేము 'ఆకలి యాత్ర', 'కరువు యాత్ర' అనే అంటాము. అనంతపురం జిల్లానుంచి రెండువేల మందికి పైగా పాల్గొన్నారు. కళ్యాణదుర్గం తాలూకా నుండి పెద్ద సంఖ్యలో 500 మంది పాల్గొన్నారు. జిల్లా బయటకు రెండు వందల మైళ్ళ దూరం వున్న స్థలానికి యాత్ర నడపడం జిల్లా పార్టీకి అదే మొదలు. చాలా తిప్పలు పడినారు. వందలమైళ్ళు ఎర్రటి ఎండలో నడచినారు. చెప్పులు కూడా లేనివాళ్ళు కోకొల్లలు. అయినా, ఆ బాధను తీయగా, ఉల్లాసంగా, ఉత్సాహంగా అనుభవించినారు. ప్రజల హితం కోసం కష్టాలు అనుభవించినామన్న గర్వాతిశయమూ కలిగింది.

జిల్లానుండి జనం గ్రూపులుగా బయలుదేరినారు. వాహనంలోపోతే ఒకరోజు పట్టే ప్రయాణానికి ఎనిమిది, పదిరోజులు పట్టింది. ప్రతిపక్ష నాయకుడు గనుక

తరిమెల నాగిరెడ్డి ముందుగా రాజధానికి పోయినారు. నీలం రాజశేఖరరెడ్డి, ఐదుకల్లు సదాశివన్, వి.కె. ఆదినారాయణరెడ్డి జనం వెంబడి వున్నారు. గుంతకల్లు వరకు ప్రయాణం బాగానే సాగింది. భుజంమీద సద్దిమూట వుండి చేతులు అడ్డు పెట్టినా ఎద్దులుబండి మాదిరి ఎద్దులులేని బండిని ఆపినారని చెప్పకుంటారు గొప్పగా. చేతిలో ఎర్రజండా వుంటే రైలు అవస్థ చెప్పేపనిలేదు. అధికారులు రైలును గుంతకల్లులో ఆపినారు. రైలు దిగాలని రిజర్వ్‌డ్ డి.ఒ.ఎస్.పి. చెప్పినాడు. తలుపులు వేసుకొని లోపలే వుండిపొమ్మన్నాడు రాజశేఖరరెడ్డి. పోలీసులు ఇంజను తొలగించినారు. ఆ తరువాత చర్చలు జరిగినాయి. ఆరువందల టికెట్లు తీసుకోమన్నాడు. రెండు వందలు తీసుకుంటామన్నారు రాజశేఖరరెడ్డి. ఆ డబ్బులు కూడా ప్రస్తుతం లేవని బాండు రాయించినాడు రాజశేఖరరెడ్డి. రైలు కదిలింది. కర్నూలుకు మూడు మైళ్ళ దూరంలో చింతతోపు దగ్గర దిగి అక్కడి నుంచి ప్రదర్శనగా కర్నూలు చేరినారు. కొండారెడ్డి బురుజు దగ్గర బ్రహ్మాండమైన సభ జరిగింది. ముఖ్యమంత్రి ప్రకాశం పంతులుగారికి కమ్యూనిస్టు పార్టీ మెమోరాండం సమర్పించింది. "ప్రకాశం పంతులు హామీలు యిచ్చినాడు. చాలా కష్టపడి వచ్చినారు! అని హేళన చేసినాడు సంజీవరెడ్డి" అన్నారు రాజశేఖరరెడ్డి.

తిరిగి వచ్చేటప్పుడు జనం రైల్లో కొంతదూరం, గూడ్సులో కొంతదూరం, నడచి, నడచి చాలాదూరం ప్రయాణం సాగించినారు. రైళ్ళు రద్దుచేసింది ప్రభుత్వం. జనంతోపాటే రాజశేఖరరెడ్డి, సదాశివన్, వి.కె. నడచినారు. ఒకూళ్ళో జొన్నలు కొని, అప్పటికప్పుడు విసరి ముద్దలు చేసుకొని తిన్నారు. జనంతోపాటు సదాశివనూ విసిరినాడు. కొన్నిచోట్ల ప్రజలు కొర్రన్నం, చింతొక్కు, గట్టి పెరుగుతో ఆతిథ్యం యిచ్చినారు. ఎట్లాగో అవస్థలుపడి గుంతకల్లు చేరుకున్నారు. అక్కడ రైల్వేవర్కర్ల యూనియన్ పార్టీ నాయకత్వం క్రింద వుంది. యూనియన్ సభ్యులు జనానికి ఆతిథ్యం యివ్వడానికి కాచుకొని వున్నారు. జనాన్ని కార్మికుల యిండ్లకు పంచినారు. వర్కర్లు పోటీలుపడి విందు భోజనాలు పెట్టినారు. అక్కడనుంచి నడుచుకుంటూ వూర్లకు చేరుకొన్నారు జనం. ఆ ప్రదర్శన ఫలితంగానే శివాయిజమా భూపంపక ప్రకటన చేసింది ప్రభుత్వం.

## నిరంకుశ భూస్వామ్యవర్గాలకు వ్యతిరేకంగా పోరాటం:

పాముదుర్తి, దొరిగల్లు రెడ్లు జిల్లాలోనే పెద్ద దౌర్జన్యపరులు. ప్రజానీకంపై వారు, వారి అనుచరులు చేయని దోపిడీ, పీడనా, అత్యాచారాలు, కిరాతకాలు ఏవీలేవు. జన సమీకరణలో పోరాటాలు నిర్వహించి, వారి గుప్పెట్లో నలుగుతున్న గ్రామాలకు విముక్తి కలిగించింది పార్టీ. ఆ పోరాటానికి నాయకత్వం వహించింది ఐదుకల్లు సదాశివన్. ఒకసారి దొరిగల్లు రంగారెడ్డికి వ్యతిరేకంగా ముదిగుబ్బలో బహిరంగ సభ ఏర్పాటు చేసింది తాలూకా పార్టీ. జిల్లా నాయకునిగా రాజశేఖరరెడ్డి హాజరు అయినాడు. ఆ సభ గురించి రాజశేఖర్ యిట్లా చెప్పినారు: "వేలాదిగా జనం వచ్చినారు. పార్టీ వారితో మాట్లాడటమే నేరంగా భావించే ఆ దశలో రెడ్ల ఆంక్షలు ధిక్కరించి రావటం గొప్ప విశేషం, ఉత్తేజభరితం. ఇంకో విశేషం – ఆడవాళ్ళూ పెద్దసంఖ్యలో రావటం! చుట్టుపక్కల శాఖల నుండి పార్టీ కార్యకర్తలు దాడిని

ఎదుర్కోవటానికి సిద్ధంగా బాణా కట్టెలతో వచ్చినారు. పోలీసులూ పెద్ద సంఖ్యలో వచ్చినారు. సభను భగ్నం చేయాలని వచ్చిన రెడ్డి అనుచరులు ఆ జనసమూహాన్ని చూసి వెనుకంజ వేసినారు. అయినా, ఆక్రోశం పట్టలేక చీకటిపడగానే రాళ్ళు విసరినారు." అప్పుడు రాజశేఖరరెడ్డి మాట్లాడుతున్నారు. "ఎక్కడి నుంచి రాళ్ళు పడినాయో ఈ రాత్రి సమయంలో కనిపెట్టలేము. కాని అవి వేయిస్తున్న దెవ్వరో తెలుసు. దాన్ని ఎట్లా ఆపాలో కూడా కమ్యూనిస్టు పార్టీకి తెలుసు" అన్నాడు రాజశేఖరరెడ్డి. ఆ మాట వినేటప్పటికి సద్దుమణిగింది.

ఒకసారి సంజీవరెడ్డితోపాటు రెవెన్యూమంత్రి కళా వెంకటరావు జిల్లా పర్యటనకు వచ్చినారు. రైతు సంఘం తరపున సి. ముత్యాలప్ప మెమోరాండం ఇచ్చాడు. "యిగో, రైతు నాయకులు వచ్చినారు. జొన్నలియ్యండి, పారలు యియ్యండి" అని సంజీవరెడ్డి హేళన చేసినాడు. వెంటనే రాజశేఖరరెడ్డి, నాగిరెడ్డి కలసి "వినదగు నెవ్వరు చెప్పిన" అని కరపత్రం వేసినారు.

## సదాశివన్ ఆదర్శ జీవితం - వరవడి:

రాజశేఖరరెడ్డికి సదాశివన్ అంటే చాలా గౌరవం, ఆత్మీయత, ఆప్యాయత, చనువు వున్నాయి. రాజశేఖరరెడ్డి సదాశివన్ వ్యక్తిగత విషయాలలో కూడా సహాయకారిగా, స్నేహితునిగా వున్నాడు. వ్యక్తిగత విషయాలతో ఒత్తిడి చేయగల స్వేచ్ఛ, చనువు రాజశేఖరరెడ్డికి వున్నాయి. సదాశివన్, రాజమ్మల పెండ్లి కుదిర్చింది రాజశేఖరరెడ్డే. సదాశివన్ గురించి రాజశేఖరరెడ్డి యిట్లు చెప్పినారు: "తరిమెల నాగిరెడ్డి టూర్లకు పరిమితం. గ్రౌండ్ వర్కు లేదు. గ్రౌండ్ వర్క్ అంతా సదాశివన్‌దే. అసలు మేము గ్రామాలగురించి సదాశివన్ ద్వారానే తెలుసుకున్నాము. ప్రజలలో పని చేయాలంటే మనకు ఎటువంటి నమ్రత వుండాలో, ఎటువంటి వైఖరి వుండాలో అనే విషయంలో ఆయన నాకు గురువుగా పనిచేసినారు. సదాశివన్ ప్రజా నాయకుడు. క్రమశిక్షణకు మారుపేరు. గాంధీ పద్ధతులు కలవాడు. అంకితభావం కలవాడు. పరాకాష్ఠ చెందిన త్యాగానికి మారుపేరు. తనకు ఎంతో యితర్లకూ అంతే. సదాశివన్, రాజమ్మలది ఆదర్శవంతమైన దాంపత్యం. రాజమ్మ ఎంత మైల్డ్ లేడీనో సదాశివన్ అంత రెట్టమతం. మహామొండి!"

రాజశేఖరరెడ్డి ఖచ్చితమైన సమయపాలన చేస్తాడు. నిర్ణయించిన టైంకు ఖచ్చితంగా సమావేశం ప్రారంభం కావాలి. అట్ల లేకపోతే ఆయన వాపసు పోతాడు. అట్ల రెండు అనుభవాలు జరిగినంక రాజశేఖరరెడ్డి మీటింగు అంటే ఖచ్చితంగా టైంకు ప్రారంభిస్తారు అనంతపురం కామ్రేడ్స్.

రాజశేఖరరెడ్డికి కర్ణాటక సంగీతం అంటే యిష్టం. సదాశివన్‌కూ అంతే – అనంతపురంలో త్యాగరాజు ఉత్సవాలు కానీ, యితర కర్ణాటక సంగీత కచేరీలుగానీ జరిగితే హాజరయ్యే మొదటి శ్రోతలు వారే.

## ప్రసంగాలలో ప్రెసిషన్:

అంతర్జాతీయ సమస్యగానీ, జాతీయ సమస్యగానీ, రాష్ట్ర సమస్యగానీ ఏదైనాగానీ, అది ఎంత క్లిష్టమైనదైనా సరే, చాలా సరళంగా, చదువురానివారికి కూడా అర్థం

అయ్యేవిధంగా వివరించగల గొప్ప మేధావి రాజశేఖరరెడ్డి. ఉభయ కమ్యూనిస్టు పార్టీలు తొలిసారిగా విజయవాడ పాలనాధికారానికి ఎన్నికైనారు. అదే సమయంలో విశాఖలో బిజెపి అధికారంలోకి వచ్చింది. ఆ సమయంలో జరిగిన జిల్లా సమితి సమావేశంలో రాజకీయ రిపోర్టు యిస్తూ "మార్గం స్పష్టం. మనం (ఉభయ కమ్యూనిస్టు పార్టీలు) కలిస్తే విజయవాడ, లేకుంటే విశాఖ" అన్నారు. చీలికకాలంలో రాజశేఖరరెడ్డి వాదనలు బాగా వున్నాయంటారు. సి.పి.ఐ. తరపున వాదనలు రాజశేఖరరెడ్డి వివరించినారు. ఆయన భావప్రకటనలో దాపరికం లేదు. సూటిగా, స్పష్టంగా ఉంటుంది. అందుకే రాజశేఖరరెడ్డి గురించి అడిగితే ఎవరైనా చెప్పే మొదటి వాక్యం – "ఆయన మంచి టీచర్" అని.

రాజశేఖరరెడ్డి పార్టీ కార్యదర్శిగా వున్నప్పుడు పార్టీ శైశవ దశలో వుంది. ఆ దశలో పార్టీ అనేక ఆటుపోట్లకు గురయింది. భూస్వాముల, పెత్తందార్ల దౌర్జన్యాలు, పోలీసుల జులుం, అజ్ఞాతవాసం, జైళ్ళు– వీటిని తట్టుకొని విప్లవ పార్టీగా, ఉక్కు క్రమశిక్షణ గల పార్టీగా, మంచి పునాదిగల పార్టీగా నిర్మాణం చేయవలసిన కర్తవ్యం ఆయన ముందున్నది. నలుగురు నాయకులు వారి వెనుక వున్నా ముగ్గురు సభ్యులు. లక్షల జనాభాలో వారి శాతం ఎంత? కాని, వారి ప్రభావం లక్షల ప్రజలందరిమీదా పడింది. అంత బలం సంపాదించటానికి కారణం రాజశేఖరరెడ్డి యిట్లా రాసినాడు: "కమ్యూనిస్టు పార్టీ అభివృద్ధి కావాలంటే పాలసీకి, పంథాకు, పనికీ ప్రజలే పునాదులు కావాలి. ప్రజాసేవ, ప్రజలకు చేదోడు వాదోడై పాటుపడటంతోవుంది పార్టీ బలం."

## పార్టీ నిర్మాణంలో ఖచ్చితమైన పద్ధతులు:

ప్రతి కార్యకర్తకూ అతని శక్తిసామర్థ్యాలు గుర్తించి పని యివ్వాలనీ, అత్యవసర పరిస్థితులలో తప్ప, సభ్యులు తమ వృత్తులు చేసుకుంటూ పార్టీ కార్యకలాపాల్లో పాల్గొనే విధంగా పని యివ్వాలే కానీ, జీవనాధారమైన పనులు మానుకొని పార్టీ పని చెయ్యమని పోరు పెట్టడం తప్పని చెప్పినారు. పార్టీ క్రమశిక్షణ ఉల్లంఘనను తీవ్రంగా పరిగణించినారు. ఒంటెత్తు పోకడలు, అన్యవర్గ ధోరణులు, క్రమశిక్షణా రాహిత్యమూ తొలగించడానికి సభ్యులలో విమర్శ–ఆత్మవిమర్శ ప్రోత్సహించినారు. సజీవమైన, శక్తివంతమైన పార్టీకి ఆత్మవిమర్శ ప్రాణప్రదమైనది. అరాచక ధోరణులు, ఒంటెత్తు పోకడలు ఆయనకు గిట్టవు. ఒకసారి కళ్యాణదుర్గం యేరియాలో పెత్తందార్లను తగ్గించటానికి, వారిని ఆర్థికంగా దెబ్బతీయుటకు మార్గమని వారి తోటలు ధ్వంసం చేయాలని, యింజన్లు పగలగొట్టాలని నిర్ణయించినారు. అది సరైనది కాదని అనేక కోణాల నుండి వివరిస్తూ గంటసేపు బోధించినారు రాజశేఖరరెడ్డి, సదాశివన్. కార్యకర్తలు సిద్ధాంత రాజకీయ వ్యవహారజ్ఞానం సంపాదించుకోవటానికి కేవలం నాయకులిచ్చే రాజకీయ రిపోర్టులేకాక స్వంతంగా సిద్ధాంత రాజకీయ గ్రంథాల అధ్యయనం చేసేటట్లు ప్రోత్సహించినారు. స్వీయ అధ్యయనానికి ఆయన ప్రత్యేక శ్రద్ధ కనపరచినారు. ప్రతి సర్క్యులర్‌లోను ఆ అంశం ప్రస్తావించబడింది. గ్రామాల్లో స్టడీ సెంటర్లు, గ్రంథాలయాలు ఏర్పాటు చేయడం, రాత్రి పాఠశాలలు ఏర్పాటు, చదువు వచ్చిన ప్రతి వొక్కరు మరొకరికి చదువు నేర్పాలి అనే విషయాలను ప్రతి

సర్క్యులర్‌లోనూ ప్రస్తావించినారు. సాహిత్య అధ్యయనం విషయం చూడటానికే ప్రత్యేకంగా ఒక కామ్రేడ్‌ను కేటాయించాలని కమిటీముందు ప్రతిపాదించినాడు. పాతవారి అనుభవం, కొత్తవారి ఉత్సాహం జోడించడం వల్లనే కమిటీలకు బలం చేకూరుతుంది. ఆ కమిటీలు ఒక ప్లాను ప్రకారం అంటే, ఎపుడు ఏ ప్రాంతంలో ఏసమస్యపై కేంద్రీకరించి పనిచేయాలో నిర్ణయించుకోవాలని సూచించినారు.

అటువంటి మహనీయులు తమకొచ్చిన జబ్బులకన్న ఎన్నోరెట్లుగా సమాజానికొచ్చిన జబ్బుల గురించే బాధపడతారు. గుట్టలుగా పెరిగిపోతున్న క్రమశిక్షణా రాహిత్యము, స్వార్థము, అవినీతివంటి వాటితో పాపపంకిలమైన రాజకీయం, ఏకంకాని కమ్యూనిస్టుల బలం, యిన్నాళ్ళు గడచినా కడుపునిండ తిండి అనేది పేదవానికి రుచికర స్వప్నంగానే వుండటం ఆయనకు తీవ్రమైన మానసిక ఆవేదన కలిగించినాయి. అయినా, శాంతి సుఖమయ జీవితం ధరిత్రినిండా విప్పారుతుందని, భౌతికంగానేకాక మానసికంగా కూడా జంతుదశనుండి వేరై సర్వతోముఖ వికాసం చెందిన మానవుడు రూపొందుతాడనే దృఢమైన ఆశ ఆయనలో కనపడింది.

★ ★ ★

# శ్రీ రాజబహదూర్ గౌర్



"నేనెలా కమ్యూనిస్టునయ్యాను?" అన్నది ముచ్చట గొల్పే ప్రశ్న. ఎందుకంటే, అది కుటుంబ సమస్యతో ఎంతో సన్నిహితంగా ముడిపడి వుండే ప్రశ్న. సమకాలీన సాంఘిక, రాజకీయ సంఘటనలతో కూడా ప్రమేయం కలిగిన ప్రశ్న.

నేను ఒక సామాన్య దిగువ మధ్యతరగతి కుటుంబంలో జన్మించాను. ఆస్తిపాస్తులు పెద్దగా ఏమీ లేవు. ఇంత దీర్ఘకాలం అనంతరం వెనుతిరిగి చూస్తే ప్రధానంగా కనబడే విషయం ఏమిటంటే – మా తండ్రి రాయ్ మహబూబ్ రాజ్ చౌదరి, మా తాత రాయ్ హరిప్రసాద్ గౌర్, మా పిన తాత రాయ్ జమునా ప్రసాద్ గౌర్ అందరూ ఒక జాగీరు సంస్థానంలో ఉద్యోగులుగా వుండేవారు. మా తాతగారు గాలిబ్ జంగ్ సంస్థానంలో ఉద్యోగం చేసేవారు. మా తండ్రి సాలార్‌జంగ్ ఎస్టేట్‌లో హోషియార్ ఉద్యోగం చేసేవారు. మా తాతగారి తమ్ముడు అస్మాన్ జాహి పాయగా సంస్థానంలో పనిచేసేవారు. ఆ రోజుల్లో ప్రభుత్వోద్యోగుల జీతాలే తక్కువ. జాగీరు ఉద్యోగుల జీతాలు మరీ తక్కువ. జాగీరు పరిపాలన గురించి నా తొలి అనుభవం యిది. అయితే మా పినతండ్రి శ్రీ రాయ్ మహబూబ్

నారాయణ గౌర్, మాత్రం ప్రగతిశీల యోచన. సంఘ సంస్కర్తలతో చెలిమి గలవాడు. ఈ నల్గురు కుటుంబ పెద్దల మధ్య నేను పెరిగాను. వారే నా ఆలోచనలను తీర్చిదిద్దారని చెప్పవచ్చు. ఇవి నా చిన్ననాటి స్కూలు చదువు రోజులు. అదే సమయంలో జాతీయోద్యమం ముమ్మరంగా సాగుతున్నది. ఖిలాఫత్ ఉద్యమంకూడా దాని ప్రభావం అది కల్గించింది.

1930 దశకం తొలి రోజులలో విప్లవోద్యమం ధోరణులు కూడా బాగా విజృంభించాయి. భగత్‌సింగ్, ఆయన అనుచరులు వారి విప్లవ కార్యకలాపాలు, షోలాపూర్‌లో కార్మికులు బ్రిటిష్ ప్రభుత్వ పాలనను త్రోసివేసి - కొద్దిరోజులు తమ పరిపాలన క్రిందకు తీసుకోవడం, పెషావర్‌లో గార్వాలీ చంద్రసింగ్ నాయకత్వాన తిరుగుబాటు చేసి, సోదర ముస్లిం ప్రజానీకంపై కాల్పులు జరప నిరాకరించడం, గార్వాలీ చంద్రసింగ్, భగత్‌సింగ్ చిత్రాలు సర్వత్రా వ్యాప్తి చెందడం ఆ రోజులలో మాపై ప్రభావం కల్గించిన విషయాలు.

ఇక ఆనాటి హైదరాబాద్ సంస్థానం సంగతి చెప్పకోవాలంటే అక్షరాలా ప్రజల పాలిట జైలు బందిఖానా అని చెప్పవచ్చు. ఎటువంటి రాజకీయ స్వాతంత్ర్యాలు లేవు. 53వ నెంబరు ప్రభుత్వ ఉత్తర్వు రాజ్యం చేసేది. అంటే – ఏ సాంస్కృతిక సమావేశం జరుపుకోవాలన్నా, రాజకీయాలతో ఎటువంటి సంబంధంలేని సభ జరుపుకోవాలన్నా, మూడు రోజులు ముందుగా పోలీసులకు నోటీసు యివ్వాలి. ఒకానొకవేళ ఏ రాజకీయ సభ జరుపుకోవాలన్నా, ఒక వారం రోజులు ముందు నోటీసు యివ్వాలి. ఇటువంటి సభలకు సాధారణంగా ప్రభుత్వం అనుమతి యిచ్చేది కాదు. సాంఘిక పీడనసంగతి చెప్పనక్కరలేదు. దారుణంగా వుండేది.

నైజాం ప్రభువుల చలవతోనే చెప్పబడే సూక్తి:

*"గత కాలపు చక్రవర్తులు*<br>*కాలగర్భంలో కలిసిపోయారు.*<br>*ఓ, ఉస్మాన్, మీ చల్లని*<br>*పరిపాలనలోనే ముస్లిమ్‌ల*<br>*విశిష్టత గూడుకట్టుకొని వున్నది."*

ముస్లిమ్‌ల ఆధిక్య భావం, ప్రత్యేకతలు సిద్ధాంతం ఇందులో వ్యక్తమవుతుంది. బహదూర్ యార్ జంగ్ దీనికి ఒక ప్రతిష్ఠాత్మకమైన, ప్రజాకర్షకమైన రూపం యిచ్చి, "ప్రతి ముస్లిము ఒక పాలకుడు" అని సెలవిచ్చారు.

అయితే, ఈ ముస్లిమ్ ఆధిక్య భావానికి ప్రతికూల భావాలు తలెత్తకపోలేదు. హిందువులలో దీనికి ప్రతిగా మత తత్వభావాలు రేకెత్తాయి. అయినప్పటికీ మొత్తం మీద జాతీయతా భావం బలంగా ముందుకు వచ్చింది.

నైజాం నవాబు బ్రిటిష్ వాళ్ళకు విశ్వసనీయుడైన జూహుకుందారుడు. అందుచేత సామ్రాజ్యవాద వ్యతిరేక ఉద్యమం నైజాం నవాబు మీదకు ఎక్కు పెట్టబడింది. నైజాం పరిపాలన బదులు ఒక ప్రజాస్వామిక ప్రభుత్వం అధికారంలోకి రావాలి. నైజాం నవాబు పరిపాలన ఫ్యూడల్ శక్తుల పరిపాలన. జాగీర్దార్లు, జమీందార్లు దేశ్‌ముఖ్‌లు నైజాం నవాబు మద్దతుదారులు, పచ్చి నిరంకుశత్వానికి ప్రతీకలు.

అందుచేత ప్రజానీకం భూమిపై తమ హక్కు సాధించుకోడానికి జరిపే పోరాటాన్ని, ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా ప్రజల పరిపాలనకోసం జరిపే పోరాటంతో జోడించారు. ఇది సహజమైన విషయం.

మూడవ సమర ప్రవంతి సాంస్కృతిక పోరాట ప్రవంతి.

నైజాం పరిపాలనలో విద్య చాలా పరిమితమై అడుగున పడిపోయి వుంది. వ్యక్తిగతంగా నైజాం నవాబుకు చెందిన పెద్ద జాగీరు ప్రాంతంలో ఒకే ఒక హైస్కూలు వుంది. కాని – విచిత్రమైన విషయం ఏమంటే – నైజాం నవాబుకు "జ్ఞాన సార్వభౌమ" అన్న బిరుదు యివ్వబడటం. నైజాం సంస్థానంలో ప్రజా ఉద్యమం మూడు స్రవంతులను ఏకీకృతం చేసింది.

ప్రజాస్వామ్య పరిపాలన (బాధ్యతాయుత పరిపాలన), భూమిపై హక్కు, పండించిన పంటపై హక్కు, మాతృభాషల రక్షణ అభివృద్ధి.

నైజాం సంస్థానంలో 1930 దశకం నాటి పరిస్థితి ఇది.

స్టేట్ కాంగ్రెస్ ఆధ్వర్యాన పౌర హక్కుల కోసం, బాధ్యతాయుత ప్రభుత్వం కోసం సత్యాగ్రహాన్ని ప్రారంభించింది.

నేను ఆ రోజులలో క్రియాశీల కాంగ్రెస్ కార్యకర్తగా చురుకుగా పని చేస్తుండేవాణ్ణి. సత్యాగ్రహంలో పాల్గొనడానికి కూడా సన్నద్ధమయ్యాను. స్టేట్ కాంగ్రెస్ ప్రచ్ఛన్న కార్యకర్తలు వి. డి. దేశపాండే, రత్నాధికార్‌లు మా యింట్లోనే సమావేశాలు జరిపేవారు. మా పినతండ్రికూడా ఈ ఉద్యమంలో భాగస్థులుగా పనిచేస్తూవచ్చారు.

మరొక అభివృద్ధికర జాతీయవాద ధోరణి సంస్థానంలో ఉద్భవించింది. 1935లో లక్నోలో అఖిల భారత అభ్యుదయ రచయితల తొలి మహాసభ జరిగింది. ఈ మహాసభ ప్రభావం ముఖ్యంగా ఉర్దూ మేధావి వర్గాలపై ప్రసరించింది. మఖ్దూం "ఉర్దూ అభ్యుదయ సాహిత్యాకాశపు నొసట పొడుచు అరుణారుణతార"గా భాసించాడు. బెంగాల్ అభ్యుదయ సాహిత్యరంగంలో నజ్రుల్ ఇస్లామ్ ఉద్భవించాడు. అక్తర్ హుస్సేన్ రాయ్‌పురి నజ్రుల్ కవితలను ఉర్దూలోకి అనువదించాడు. నజ్రుల్ మా కందరికీ ఎంతో అభిమాన పాత్రుడు. మఖ్దూం ఉర్దూ కవిత "బాగి" (తిరుగుబాటుదారుడు) నజ్రుల్ రచించిన "విద్రోహి" కవిత ప్రభావంతో రచించబడింది.

"ఫెయిజ్ ఫతేపురి" మాస పత్రిక. "నిగార్" అన్నది మరో పత్రిక. ఈ రెండు జాతీయ భావాల్ని లౌకిక వాదాన్ని దేశభక్తిని ఎంతగానో పెంపొందించాయి. ఈ పై పత్రిక యువతరంలో ఎంతో ఉత్తేజం కల్గించి అభిమాన పాత్రమైంది. ఈ పత్రికను నైజాం ప్రాంతంలోకి రాకుండా (కొన్ని కొన్ని రచనలకు గాను) నిషేధించారు.

ఉస్మానియా యూనివర్సిటీ హాస్టల్‌లో ఒక గది "నమాజ్" చేసుకోవడానికి, ఇంకో గది హిందూ ప్రార్థనలు జరుపుకోవడానికి కేటాయించారు. నేను అప్పుడు హాస్టల్‌లో వున్నాను. అది 1938వ సంవత్సరం. హిందువులు జరుపుకొనే ప్రార్థనలు అనేకం వున్నాయి. మేము ఒక సమావేశం జరిపి "వందేమాతరం" గేయం పాడాలని నిర్ణయించుకొన్నాం. దీనికి కొంతమంది ముస్లిమ్‌లు అభ్యంతరం చెప్పారు. యూనివర్సిటీ అధికారులు ఈ విధంగా వందేమాతరం గేయం పాడటాన్ని వెంటనే నిషేధించారు. దీనికి నిరసనగా విద్యార్థులు సమ్మె చేశారు. నే నప్పుడు

మెడికల్ కాలేజీలో చదువుతున్నాను. కాని, సమ్మెలో ప్రముఖ పాత్ర వహించాను. గాంధీజీ సలహాతో స్టేట్ కాంగ్రెస్ సత్యాగ్రహాన్ని ఉపసంహరించింది. ఈ విధంగా ఉపసంహరించడం మాకు ఎవ్వరికీ యిష్టంలేదు. మావంటి యువకులు కలిసి "కామ్రేడ్స్ ఎసోసియేషన్" అన్న సంస్థను స్థాపించాం. సయ్యద్ ఆలమ్ ఖుద్దుస్,



కామ్రేడ్స్ అసోసియేషన్ కార్యవర్గ సభ్యులు (1040-41) ఎడమ నుండి కుడికి: జనాబ్ రజ్వీ, రాజబహదూర్‌గౌర్, మునీర్ లాల్ గుప్తా, అలంబండ్ మీర్, ఓంకార్ ప్రసాద్, మీర్ యూనస్ అలీఖాన్, కుతుబ్ ఎ-ఆలం.

సయ్యద్ ఇబ్రహీమ్, గులామ్ హైదర్, అస్సాన్ అలీ మిర్జా, గర్వాద రవి, శ్రీనివాస లాహోటి, మణిక్‌లాల్ గుప్తా మొదలైనవారందరూ ఈ ఎసోసియేషన్‌లో వున్నారు.

అలహాబాద్‌లోని సోషలిస్టు బుక్ క్లబ్‌తో మేము సంబంధాలు పెట్టుకున్నాం. అప్పటికే మేము జయప్రకాష్ నారాయణ్ వ్రాసిన "సోషలిజం ఎందుకు?" అన్న పుస్తకం చదివాం.



మేము ఒకవైపున రావి నారాయణరెడ్డితోను, మరోవైపు ఔరంగాబాద్, బొంబాయిలకు చెందిన కామ్రేడ్ హాబిబుల్లా తదితర కామ్రేడ్స్‌తోను సంబంధాలు పెట్టుకొన్నాం. ఈ సంబంధాలు మా కార్యకలాపాలు తీర్చి దిద్దుకోడానికి ఎంతో తోడ్పడ్డాయి.

ఆ రోజుల్లో నా అభిమాన రచయిత ప్రేమ్‌చంద్. మా పినతండ్రి రాయ్ మహబూబ్ నారాయణ గౌర్ నేను చేసిన అధ్యయనంలో, నా కార్యాచరణలో నన్ను తీర్చిదిద్దిన మిత్రుడు, గురువు, తాత్వికుడు అని చెప్పకపోతే నేను అపరాధంచేసిన వాణ్ణి అవుతాను.

నేను 1939లో కమ్యూనిస్టు పార్టీలో చేరడానికి దారితీసిన పరిస్థితులు ఇవీ. నేను మెడికల్ కాలేజీలో, మరోవైపు కామ్రేడ్ మఖ్దూం సయ్యద్ ఆలమ్, సయ్యద్ ఇబ్రహీమ్, అమర్‌నాథ్ బర్మన్, గులామ్ హైదర్, మహేంద్ర మొదలైనవారితో కలిసి ట్రేడ్ యూనియన్ కార్యకలాపాలలో పాల్గొంటూ వుండేవాణ్ణి. (నేను చివరకు 1943లో మెడికల్ గ్రాడ్యుయేట్ పరీక్ష పాసయ్యాను.) నేను 1937–38లో ఔరంగాబాద్‌లో జరిగిన లేబర్ కాన్ఫరెన్స్‌కు హాజరయ్యాను.

నగరంలోని బట్టల మిల్లు కార్మిక సంఘాలలో ఎక్కువ పనిచేశాను. ఈ ఉద్యమాలు, ఈ ఉద్యమ వాహినులు కమ్యూనిస్టు ఉద్యమంలోకి తీసుకొనివచ్చాయి.

★ ★ ★

# శ్రీ కె.ఎల్. మహేంద్ర



నేను ఆరవ తరగతి విద్యార్థిగా వుండగా, మాకు నీతిబోధ గురించిన పిరియడ్ వుండేది. ముస్లిం విద్యార్థులు మత గ్రంథాలు చదువుతూ వుండేవారు. ఈ పిరియడ్‌లో మా ఉపాధ్యాయుడు ఉప్పు సత్యాగ్రహం గురించి, బెంగాల్‌లో టెర్రరిస్టు ఉద్యమం గురించి చెబుతూ వుండేవారు. భగత్‌సింగ్ వంటి విప్లవకారులు, బెంగాల్ విప్లవకారులు బ్రిటిష్ పాలకులను ఎలా ఖతం చేసేవారో, అందుకు ఈ విప్లవకారులను బ్రిటిష్ ప్రభుత్వం ఉరితీయడమో చేస్తూ, లేక అండమాన్ దీవులకు ప్రవాసం పంపడమో ఎలా అణచివేయడానికి ప్రయత్నించేవారో ఆయన చెబుతూండేవారు.

1936లో హైదరాబాద్‌లో ఆర్య సమాజం వారి సత్యాగ్రహం జరిగింది. అయితే నేను గాంధీజీ ప్రబోధాలతో ప్రభావితుడనై "హరిజన్" వారపత్రికకు చందాకట్టి చదువుతూండేవాణ్ణి. "ఫ్రీప్రెస్" దినపత్రిక చదువుతూ నెహ్రూ, సుభాష్ చంద్రబోస్ మొదలైన జాతీయ నాయకుల ప్రబోధాలతో ప్రభావితుడయ్యేవాణ్ణి. జాతీయ కాంగ్రెస్ అధ్యక్ష పదవికి పోటీలో భోగరాజు పట్టాభి సీతారామయ్యగారిని, సుభాస్‌చంద్ర బోస్ ఓడించినపుడు గాంధీగారు "పట్టాభి ఓటమి నా ఓటమి" అన్నారు కాని,

అభివృద్ధికర వాదులు గెల్పొందినందుకు నాకు సంతోషం వేసింది. నేను ఈ దశలో ఖద్దరు ధరించేవాణ్ణి. కాని, ఆ తరువాత సుభాస్‌చంద్ర బోస్ కాంగ్రెస్ అధ్యక్షపదవికి రాజీనామా చేయవలసి వచ్చింది. దీనికి నేను ఎంతో ఆవేదన చెంది గందరగోళంలో పడ్డాను.

1938లో నైజాం ప్రభుత్వం ఉస్మానియా యూనివర్సిటీ హాస్టల్‌లో "వందే మాతరం" గేయం పాడరాదని నిషేధించింది. దీనికి నిరసనగా విద్యార్థులు సమ్మె చేశారు. నే నప్పుడు ఇంటర్ మొదటి సంవత్సరం చదువుతూండేవాణ్ణి. నేను కూడా ఈ సమ్మెలో పాల్గొన్నాను. సమ్మె చేసిన విద్యార్థులను నాగపూర్ యూనివర్సిటీలోనూ జబల్‌పూర్‌లోనూ చేర్చుకొన్నారు.

నా బంధువులలో ఎక్కువమంది ప్రభుత్వోద్యోగాలలో వుండేవారు. అందుచేత నా రాజకీయ కార్యకలాపాలు వారికి నచ్చలేదు. అయితే, మా అన్న ఒక రాజీ సూత్రం ప్రతిపాదించారు. ఆ సంవత్సరం నేను చదువు మానివేయాలి. ఆ మరుసటి సంవత్సరం నన్ను శాంతినికేతనం పంపిస్తారు. అది రాజీ సూత్రం. మా కుటుంబం పెద్దగా వున్న కుటుంబంకాదు. పేద కుటుంబమే. కాని మా అన్నగారు ట్యూషన్‌లు చెప్పి డబ్బు సంపాదించి నా చదువులకు యిచ్చేవాడు. ఆ మరుసటి యేడు మా అన్నగారు డబ్బు యిచ్చి నన్ను శాంతినికేతనానికి పంపించారు. అక్కడ నేను నెహ్రూ ఆత్మకథ, బెర్నార్డ్‌షా వ్రాసిన "ప్రతిభావంతురాలైన స్త్రీకి సోషలిజం బోధ" (Intelligent Women's Guide to Socialism), జాన్ స్ట్రెచీ వ్రాసిన "సోషలిజం" గ్రంథం, ట్రాట్‌స్కీ వ్రాసిన "రష్యన్ విప్లవం" మొదలైన గ్రంథాలు చదవడానికి అవకాశం కలిగింది. పృథ్వీసింగ్ అజాద్, హరీంద్రనాథ్ ఛటోపాధ్యాయ, సరోజినీనాయుడు మున్నగువారు ప్రసంగాలు వినడానికి కూడా అవకాశం కలిగింది. నేను, నా సహాధ్యాయుడు కలిసి శ్రీ సోమేంద్రనాథ్ టాగూర్, సన్నాలాల్ దాస్ గుప్త గార్లతో చర్చలు జరుపుతూండే వారం. వారిచ్చిన రాజకీయ సాహిత్యం చదువుతూండే వారం. మాలో సోషలిస్టు భావాలకు అంకురార్పణ జరిగింది. కాని ట్రాట్‌స్కీ వాదులు జాతీయోద్యమం పట్ల ప్రదర్శించే వ్యతిరేకత, వారి నాయకులు ప్రదర్శించే వైఖరి మాలో అనుమానాలు– సందేహాలు రేకెత్తించాయి.

శాంతినికేతన్‌లో వుండగానే లెనిన్ రచనలు, నిషేధించబడిన ఆయన పుస్తకాలను చదవటం తటస్థించింది. అదే సమయంలో కమ్యూనిస్టు పార్టీ అధికార పత్రిక నేషనల్ ఫ్రంట్ మాకు వస్తూండేది. నేను, మరికొందరు విద్యార్థులం ఒక గ్రూపు– నేషనల్ ఫ్రంట్ వలన ప్రభావితులై, కమ్యూనిస్టు పార్టీ విధానాలకు సన్నిహితంగా వచ్చాం. అయితే, మాకు కమ్యూనిస్టు సభ్యు లెవరూ, నాయకు లెవరూ తెలియదు.

ఈలోగా రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. మొదట్లో హిట్లరు బ్రిటన్‌ను, మిత్రదేశాలను దెబ్బతీసి ఓడించడంపట్ల మాకు సంతోషంగా వుండేది. ఈ సమయంలో రజనీ పామీదత్తు వ్రాస్తూ వచ్చిన "ప్రపంచ రాజకీయాలు" చదువుతూండేవాణ్ణి. దీనివలన ఫాసిజం ప్రమాదం ఏమిటో నేను తెలుసుకోవడం జరిగింది. మా కాలేజీలో మేము జపాను సైనికులపై చైనా సాగించే గెరిల్లా పోరాటం గురించిన నాటకం వేసేవాళ్ళం. పార్టీతో ప్రత్యక్ష సంబంధం లేకపోయినా నల్గురు విద్యార్థులం

కమ్యూనిస్టులుగా తయారయ్యాం. బెంగాల్ విద్యార్థి ఫెడరేషన్ కార్యాలయానికి వ్రాసి సభ్యత్వ పుస్తకాలను తెప్పించుకున్నాం. రవీంద్రనాథ్ ఠాగూర్ మరణించిన 20 రోజులకు శాంతినికేతన్ ప్రిన్సిపాల్ ఎ. కె. చాందా మమ్మల్ని పిలిపించి, కాలేజీనుండి వెళ్ళిపొమ్మన్నాడు. అది 1941 నవంబరు. అప్పటికి నేను బి.ఎ. మూడవ సంవత్సరం చదువుతున్నాను. మమ్మల్ని కాలేజీ నుండి వెళ్ళగొట్టగానే రైలుబండి ఎక్కి మొట్టమొదటి స్టేషన్ బర్ద్వాన్ రాగానే దిగి, సరాసరి అక్కడ కాలేజీకి వెళ్ళి ప్రిన్సిపాల్‌ను కలుసుకొని, మేము ఎ.ఐ.ఎస్.ఎఫ్. కుర్రవాళ్ళం. కాలేజీలో చేరదామని వచ్చాం అన్నాం. ఆయన మమ్మల్ని కాలేజీలో చేర్చుకున్నాడు. విద్యార్థి ఫెడరేషన్ ఆఫీసులో కమ్యూనిస్టు పార్టీ సభ్యులను కలుసుకున్నాం. రెండు నెలల పిమ్మట నన్ను మొదటి కాండిడేట్ సభ్యుడుగా తీసుకున్నారు. ఆరు నెలల తర్వాత పూర్తి కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం యిచ్చారు. ఈ విద్యార్థి దశలో మేము గాంధీయిజం గురించి, సోషలిస్టులు, రాయిస్టులు గురించి, కమ్యూనిస్టు పార్టీ విధానాల గురించి తీవ్ర చర్చలు జరుపుతూండేవారం.

కొద్ది నెలలు అయిన తరువాత జిల్లా పార్టీ కార్యదర్శి కామ్రేడ్ వినయ చౌదరి, నన్ను అసన్‌సోల్ వెళ్ళి అక్కడ కార్మికులతో పని చేయవలసిందని అన్నారు. నేను హిందీ మాట్లాడతాను. అక్కడ కార్మికులు హిందీ మాట్లాడతారు. అందుచేత అక్కడకు వెళ్ళి పని చేయాలన్నారు. అప్పటికి పార్టీకి బహిరంగ అవకాశాలు వచ్చాయి. (1942 జులైలో పార్టీపై నిషేధం తొలగింది.)

అధ్యయనం చేయడానికి బోలెడంత సాహిత్యం అందుబాటులోకి వచ్చింది. నేను సిద్ధాంత గ్రంథాలన్నీ చదవడం మొదలుపెట్టాను. అసన్‌సోల్ వెళ్ళి పార్టీ పని చేయడానికి ఒప్పుకొన్నాను. అసన్‌సోల్ బొగ్గుగనులు, పరిశ్రమలు అన్నీ బ్రిటిష్ వాళ్ళవే. బ్రిటిష్ అసోసియేషన్ అక్కడ రాజ్యం చేస్తోంది. అక్కడ సబ్ డివిజనల్ ఆఫీసర్లు, పోలీసులు బ్రిటిష్ వాళ్ళు ఎలా చెబితే అలాచేసేవారు. ఇప్పుడు పశ్చిమబెంగాల్ రెవెన్యూ మంత్రిగా వున్న కామ్రేడ్ వినయచౌదరి, కామ్రేడ్ హరికృష్ణ కోనార్ నాకు ముందుగానే అసన్‌సోల్‌లో బ్రిటిష్‌వాళ్ళ సంగతి సందర్భాలు చెప్పారు. కమ్యూనిస్టు కార్యకర్తల్ని వాళ్ళు ఎంతమాత్రం సహించరనీ, కొంతమంది పార్టీ కార్యకర్తలను అసన్‌సోల్‌నుండి బహిష్కరించారనీ (ఎక్స్‌టర్న్‌మెంట్) చెప్పారు. నేను అసన్‌సోల్ వెళ్ళి అక్కడ విద్యార్థి సంఘ నాయకుడు కామ్రేడ్ మణిక్‌లాల్‌ను కలుసుకున్నాను. ఒక సీనియర్ కామ్రేడ్ వి. జయపాల్ అనే ఆయన హోమియో డాక్టరుగా బొగ్గు గనుల ప్రాంతం బారకార్‌లో చెల్మామణి అవుతూ పార్టీ పనిచేస్తున్నాడు. రెండు మూడు రోజులైన తరువాత నేను సరాసరి సబ్ డివిజనల్ ఆఫీసరు దగ్గరకు వెళ్ళి, నేను సి.పి.ఐ. ఆర్గనైజర్‌ననీ, యువజనోద్యమంలో పనిచేసే ఆసక్తితో వున్నాననీ, ఆహార కమిటీ ఏర్పరచే కార్యక్రమంలో వున్నాననీ చెప్పాను. "నువ్వు కార్మికుల వ్యవహారాలలో వేలు పెట్టకుండా వుండు. అలా చేసేవంటే సహించేది లేదు సుమా!" అని ఆయన అన్నాడు. "నాకు కార్మికులలో పని చేయాలనే ఆసక్తి ఏమీ లేదు" అని చెప్పి వచ్చేశాను.

నేను పగలు యువకులను, విద్యార్థులను కలుసుకొని, వారి కార్యక్రమాలు చూస్తుండేవాణ్ణి. చీకటి పడగానే బరన్‌పూర్ ఉక్కు ఫ్యాక్టరీ పరిసర గ్రామాలకు

వెళ్ళి, అక్కడ కార్మిక సంఘాల పనిచేసేవాణ్ణి. ఈ ప్రాంతాలు పైవాళ్ళు ఎవరూ చొరరాని నిషిద్ధ ప్రాంతాలు. అక్కడ కార్మికులలో ఇద్దరు కమ్యూనిస్టులుండేవారు. వారు గ్రూపు మీటింగులు ఏర్పాటు చేసేవారు. ఇదిలా వుండగా ఒక నెల రోజులు చదువుకొని బి.ఏ. పూర్తి చేయవలసిందని కామ్రేడ్స్ సలహా చెప్పారు. నేను అలాగే చేసి పరీక్షకు హాజరయ్యాను. నేను బి.ఏ. ప్యాసవడం నాకే ఆశ్చర్యం వేసింది.

నేను యీ అసన్‌సోల్‌లో ఏడాదిపాటు కష్టపడి పనిచేసేసరికి, బెంగాల్‌లో ముస్లిం లీగ్ ప్రభుత్వం అధికారంలోకి వచ్చింది. సభలు జరుపుకోడానికి అనుమతించింది. మొదటిసారి బహిరంగ సభ పెట్టాం. సభకు 5 వేల మంది కార్మికులు వచ్చారు. అజాద్‌హింద్ ఫౌజ్ ఖైదీల విడుదలకోసం అసన్‌సోల్‌లో ఒకరోజున హర్తాల్ కూడా జరిపాం. అటువంటి హర్తాల్ అసన్‌సోల్‌లో జరగడం అదే ప్రథమం. హర్తాల్ పూర్తి విజయం పొందింది. కాంగ్రెస్, ముస్లిం లీగ్‌లు రెండూ ఈ హర్తాల్‌లో సమైక్యంగా పాల్గొన్నాయి.

1945లో నేను మద్రాసులో జరిగిన ఐక్య ఎ.ఐ.టి.యు.సి. సభకు హాజరయ్యాను. అసన్‌సోల్‌లోని 14 వేల మంది కార్మికులలో 10వేల మంది కార్మికులకు అప్పుడు నేను ప్రాతినిధ్యం వహించాను.

1945లో రాష్ట్ర శాసనసభకు జరిగిన ఎన్నికలలో కామ్రేడ్ ఇంద్రజిత్ గుప్తా బొగ్గుగని కార్మికుల నియోజకవర్గం నుండి పోటీచేశారు. ఈ లోగా బరన్‌పూర్ ఉక్కు కార్మికులు సమ్మెచేయ సమకట్టారు. కాని, ఎన్నికలు పూర్తి అయ్యేవరకు సమ్మె చేయరాదన్న వైఖరిని జిల్లా కమిటీ తీసుకుంది. కాని, సమ్మెకు అనుకూల వైఖరి తీసుకున్న వినయ చౌదరిని నేను బలపరిచాను. అయితే, జిల్లా కమిటీ అభిప్రాయానికి కట్టుబడి వుండిపోవడం (సమ్మె కూడదన్న వైఖరి), చివరకు ఆ యూనియన్ మన చేతులలోంచి పోవడం జరిగింది.

ఈ సమయంలో కామ్రేడ్ మఖ్దూం నన్ను తిరిగి హైదరాబాద్ పంపివేయవలసిందిగా కామ్రేడ్ రణేన్‌సేన్‌కు వ్రాశారు. నైజాం నవాబుకు వ్యతిరేకంగా పోరాటం ఉధృత మవుతుందనీ, కార్యకర్తల కొరత ఏర్పడిందనీ మఖ్దూం తెలియచేశారు. అప్పుడు పార్టీ ప్రధాన కార్యదర్శి కామ్రేడ్ పి. సి. జోషి బెంగాల్ రాష్ట్ర పార్టీకి ఈ విషయమై ఉత్తరం వ్రాశారు. 1946 జులైలో నేను హైదరాబాద్ తిరిగి వచ్చాను. హైదరాబాద్ సంస్థాన ప్రజలలో గొప్ప చైతన్యం, పోరాట వెల్లువ పెల్లుబుకుతున్నాయి. ప్రతిరోజూ కొత్త కొత్త కార్మిక సంఘాలు ఏర్పడసాగాయి. కేంద్రంలో ట్రేడ్ యూనియన్‌కు కామ్రేడ్ మఖ్దూం అధ్యక్షుడుగా, కామ్రేడ్ రాజబహదూర్ గౌర్ ప్రధాన కార్యదర్శిగా వుండేవారు. 1946లో జరిగిన రాష్ట్ర ట్రేడ్ యూనియన్ మహాసభలో పైవారితోపాటు నేను కార్యదర్శులలో ఒకరుగా ఎన్నికయ్యాను.

స్వతంత్ర హైదరాబాద్‌ను నిర్మాణం చేయాలన్న తలంపుతో నైజాం ప్రభుత్వం వూగిసలాటలాడుతోంది. మజ్లిస్ సంస్థ కపటనాటకం ఆడుతూ స్వతంత్ర హైదరా బాద్‌లో ముస్లిం పాలన పోయి హిందూ పాలన వస్తుందనీ, ప్రజాస్వామ్యం అంటూ ఏర్పడుతుందనీ ప్రచారం చేస్తోంది. గ్రామ సీమలలో ఆంధ్ర మహాసభ, సి.పి.ఐల నాయకత్వం క్రింద జాగీర్దారులకు, దేశ్‌ముఖ్‌లకు, భూస్వామ్య వర్గాలకు

వ్యతిరేకంగా ప్రజా ప్రతిఘటన ఉధృత మవుతుంది. దొడ్డి కొమరయ్యను భూస్వామ్య వర్గాలు, వారి గూండాలు హత్యచేశారు. 1946లో అక్టోబరు 13న ఆంధ్రమహాసభను, ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌ను నైజాం ప్రభుత్వం నిషేధించింది. వారంట్లు జారీ చేయబడ్డాయి. కొంతమంది కామ్రేడ్స్ అరెస్టయ్యారు. అత్యధిక సంఖ్యలో కామ్రేడ్స్ అజ్ఞాతవాసంలోకి వెళ్ళిపోయారు. మాకు అంతకుముందు ఈ అజ్ఞాతవాస జీవితం గురించి అనుభవంలేదు. రహస్య యంత్రాంగం తగినంత కట్టుదిట్టంగా ఏర్పడలేదు. అందుచేత కామ్రేడ్ రాజబహదూర్ గౌర్, కామ్రేడ్ జావేద్‌లు అరెస్టు అయిపోయారు. నాల్గు నెలలు పోయిన తరువాత వారిని జైలునుండి తప్పించడానికి పథకం వేశాం. వీరిద్దరిని ఉస్మానియా ఆస్పత్రికి తీసుకు వచ్చారు. డాక్టర్ వరంజపే సహాయంతోను, విద్యార్థులు, కార్మికుల సహాయంతోను వారిని తప్పించడానికి ప్లాను అంతా సంసిద్ధమైంది. మా పథకం జయప్రదమైంది. వారిద్దరిని తప్పించాం. అప్పుడు నేను హైద్రాబాద్ సిటీ పార్టీ కార్యదర్శిగా వున్నాను. కొద్ది నెలలు తరువాత 1947 అక్టోబరు నుండీ తెలంగాణా సాయుధ పోరాటం ప్రారంభమైంది. నన్ను రాజకీయ కార్యకలాపాలనుండి, ట్రేడ్ యూనియన్ కార్యక్రమాలనుండి "టెక్" రంగానికి మార్చారు. అంటే ఆయుధాలు సేకరణ, రవాణా, వార్తా సంబంధాలు కొనసాగించడం, జైలులో వున్న కామ్రేడ్స్‌తో సంబంధాలు పెట్టుకోవడం, వారికి రహస్యంగా పార్టీ సాహిత్యం అందించడం, అవసరమైన సందర్భాలలో జైళ్ళనుండి తప్పించడం వగైరా పనులు.

నేను హైదరాబాద్ వచ్చేసరికి కామ్రేడ్ ప్రమీలా తాయి హైద్రాబాద్ సిటీ కమిటీ సభ్యురాలుగా వుండేది. మహిళా సంఘాలలో చురుకుగా పని చేస్తుండేది. ఆమెను కూడా అజ్ఞాత జీవితంలోకి వెళ్ళమన్నారు. మేము అజ్ఞాత వాస జీవితంలోనే కలుసుకోవడం, చివరకు 1947లో పెళ్ళి చేసుకోవడం జరిగింది. ఇద్దరమూ టెక్నికల్ బాధ్యతలనే నిర్వహించుతూండేవారం. రాజబహదూర్ జావేద్‌లను ఎప్పుడైతే జయప్రదంగా తప్పించగలిగామో, అప్పట్నుంచీ ఇటువంటి టెక్ బాధ్యతలకే నేను బాగా తగినవాణ్ణని పార్టీ కామ్రేడ్స్ భావించారు. అనుకున్నట్లుగానే నేను వేసే పథకాలు బాగానే నెరవేరుతూ వచ్చాయి. కామ్రేడ్ అమృతలాల్ శుక్లా, ఎస్. వి. కె. ప్రసాద్‌లను అలాగే తప్పించ గలిగాం. నల్ల నరసింహులు, శ్రీనివాసరెడ్డి గార్లకు ఉరిశిక్ష వేశారు. వారి కేసులు హైకోర్టులో వాయిదా పడుతూండేవి. వారిని తప్పించాలి. రాజమల్లయ్య అనే వడ్రంగి కామ్రేడ్, తదితరుల సహాయంతో పథకం వేశాం. నల్ల నర్సింహులను, శ్రీనివాసరెడ్డిని 18 మంది పోలీసులు రైఫిళ్ళతో కాపలా కాస్తున్నారు. అయినప్పటికీ పట్టపగలు ఉదయం 11 గంటలకు వారిని జయప్రదం తప్పించగలిగాం.. కామ్రేడ్ రంగాచారిని మాత్రం జైలునుండి బైటికి తీసుకెళ్ళి కాల్చివేశారు. ఆయుధాల సేకరణ, రవాణా కార్యక్రమంలో కామ్రేడ్స్ బిపిత్, షానూర్, నిజాముద్దీన్ తోడ్పడేవారు. అగమయ్య, నాగభూషణం, శాయన్న, రాజమల్లయ్య తదితరులు ఈ విధంగా కామ్రేడ్స్‌ను జైళ్ళ నుండి, పోలీసు కస్టడీనుండి తప్పించడంలో ప్రధానపాత్ర వహించేవారు.

నేను మొట్టమొదట అసన్‌సోల్‌లో పార్టీ హోల్‌టైమరు అయినప్పుడు నాకు నెలకు రూ.15/- ఎలవెన్సు యిచ్చేవారు. నేను అక్కడ కార్మిక సంఘాన్ని నిర్మించిన

తరువాత నా ఎలవెన్సు 100/-లకు పెరిగింది. హైదరాబాద్‌లో నాకు నెలకు రూ.30/- ఎలవెన్స్ యిచ్చేవారు. నేను జైలునుండి విడుదల అయినతర్వాత నా భార్య ప్రమీలా తాయి మళ్ళీ స్కూలు టీచరుగా ఉద్యోగంలో చేరింది. నా భార్య సంపాదన మీద ఆధారపడి నేను హోల్‌టైమరుగా పని చేయసాగాను. 1969లో పార్టీ కామ్రేడ్ ప్రమీలా తాయిని బెర్లిన్ పంపించింది. ఆమె తన ఉద్యోగానికి రాజీనామా యిచ్చింది. అప్పుడు నాకు రూ. 100/- యిస్తూండేవారు. ఆ తరువాత నేను శాసన మండలి సభ్యుణ్ణయ్యాను. అప్పటినుండి పరిస్థితులు మారాయి.

సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాట దశలో మాకు ఒక తపన, ఆవేశం, దీక్ష వుండేవి. కొన్ని విలువలు పాటించేవారం. ఒకనాడు హోల్‌టైమర్స్ కమ్యూన్‌లలో జీవించేవాళ్ళం. రహస్య కాలంలో ప్రతివారూ మరొకరికి సహాయపడుతూ వుండేవారు. ఉమ్మడిగా ఒకరి కష్టసుఖాలు మరొకరు పంచుకోవడం, ఉమ్మడిగా పోరాటాలు సాగించడం, ఉమ్మడిగా ఒకరి భావాలు మరొకరు పంచుకోవడం జరుగుతుండేది. స్వేచ్ఛ, స్వాతంత్ర్యాలకోసం, సోషలిజం కోసం ప్రజలను సంఘటితపరచడం, సమీకరించడం ఏకైక లక్ష్యంగా వుండేది. విప్లవ దీక్షతో ఉత్సాహంతో పనిచేస్తుండేవారము. నిర్బంధ కాలంగడచి జైళ్ళనుండి బైటికి వచ్చిన తరువాత పార్టీని, ప్రజా ఉద్యమాలను పునర్నిర్మించుకోవడం జరిగింది. 1946 నుండి 1952 వరకు రహస్య జీవితాలు గడపడమో లేక జైళ్ళలో వుండడమో జరిగింది. నేను, ప్రమీలా తాయికూడా నాల్గున్నర సంవత్సరాలు రహస్యజీవితం గడిపాం.

ఆమె ఒక ఏడాది నాలుగు నెలలపాటు జైలు నిర్బంధంలో వుంది. నేను ఒక ఏడాదిపైన పదినెలలు జైలు జీవితం గడిపాను. తెలంగాణాలో కమ్యూనిస్టు ఉద్యమం అత్యంత వేగంగా వ్యాపించింది. సాయుధ పోరాట దశకు చేరుకుంది. ఆనాడు సాయుధ పోరాట దశగుండా సాగాము. నేడు పార్లమెంటరీ విధానంలో, ప్రజాపోరాటల విధానంలో సాగుతున్నాం.

★ ★ ★

# శ్రీ డి. ధర్మభిక్షం



భారత కమ్యూనిస్టు పార్టీ (సి.పి.ఐ.) ఆవిర్భవించి, 26 డిశంబర్, 1995 నాటికి డెబ్బది యేండ్లు పూర్తి అగుచున్నవి. విద్యాభ్యాసం నుంచి ఆరంభమైన నా రాజకీయ జీవితంలో ఎక్కువ భాగం, అనగా అరవైయేండ్లకు పైగా కమ్యూనిస్టు పార్టీతో నా జీవితం పెనవేసుకొని వున్నది.

గీతవృత్తిని ఆధారంగా జీవిస్తున్న నా తల్లిదండ్రులు నల్లగొండ జిల్లా మునుగోడు తాలూకా "ఊకొండి" గ్రామం నుంచి సూర్యాపేట పట్టణానికి తరలివచ్చి స్థిరపడ్డారు. 15 ఫిబ్రవరి, 1922న సూర్యాపేటలోనే నేను జన్మించాను.

అవి స్వాతంత్ర్య సంగ్రామం ఉధృతంగా సాగుతున్న రోజులు. సూర్యాపేట మిడిల్ స్కూల్‌లో విద్యార్థిగా చదువుచున్నాను. విజ్ఞాన ప్రకాశిని గ్రంథాలయానికి రెగ్యులర్ పాఠకున్ని. పత్రికా పఠనం, గ్రంథ పఠనం నా విద్యలో భాగంగా అలవర్చుకొని ఉన్నాను. ఆనాటి స్వాతంత్ర్యపోరాటాలు, సత్యాగ్రహోద్యమాలు, సోవియట్ రష్యా విప్లవం, సోషలిస్టు రాజ్యాల చరిత్ర, నెహ్రూగారి సోవియట్ రష్యా పర్యటన అనుభవాలు, తదితర గ్రంథాల పఠనం, ముఖ్యంగా విఖ్యాత విప్లవ రచయిత మాక్సీం గోర్కి విరచిత నవల 'అమ్మ' పఠనం నాలో మానసిక పరివర్తన కలుగచేశాయి. నాలో దేశభక్తిని ప్రేరేపించాయి.

1938లో మెట్రిక్యులేషన్ చదువుకోసం నల్లగొండ పట్టణం వెళ్ళాను. అక్కడ రెడ్డి వసతి గృహం (మెస్)లో చేరిన నేను నా ఆలోచనలు అక్కడి విద్యార్థితో చర్చించి 'డిబేట్స్ సొసైటీ'ని ఏర్పాటు చేశాను. దానికి నన్ను అక్కడి విద్యార్థులు కార్యదర్శిగా ఎన్నుకున్నారు.. ఆ పరిమితమైన మెస్‌లోనే గ్రంథాలయాన్ని ఏర్పాటు చేయించి, నిత్యం డిబేటులు జరిపించాను. విద్యార్థులలో చైతన్యాన్ని రగిల్చే వేదికగా దానిని ఉపయోగించాను.

ఉస్మానియా యూనివర్సిటీలో వందేమాతరం ఉద్యమం ఆరంభమై, అది నైజాం సంస్థానం అంతటా వ్యాపించింది. ఆ ఉద్యమం నల్లగొండ జిల్లాకు వ్యాపించినపుడు దానిని నిరోధించుటకు నిజాం సర్కారు పోలీసు యంత్రాంగం తీవ్ర నిర్బంధాలు పెట్టింది. 144వ సెక్షన్ విధించింది. తీవ్రమైన లాఠీ ఛార్జీలు చేసింది. వీటన్నింటిని ఛేదించుకొని మా విద్యార్థులం ఉద్యమం ఉధృతి చేశాము.

నల్లగొండ పట్టణం అంతా పోలీసులు పహరా కాస్తున్నా నల్లగొండ పట్టణ విద్యార్థులం వందేమాతర ఉద్యమ కరపత్రాలు పంచుతూ పట్టణమంతా వాల్ పోస్టర్స్ అతికించాము. ఉద్యమాన్ని తీవ్రతరం చేశాము. యూనివర్సిటీలో మితవాద నాయకుల సలహాలపై వందేమాతర ఉద్యమం నిలిపివేసి విద్యార్థులు నాగపూర్, జబల్పూర్ యూనివర్సిటీలలో చేరిపోయారు. నల్లగొండ విద్యార్థులమైన మేము ఉద్యమాన్ని కొనసాగించుటకే నిర్ణయించుకొన్నాం. నెలాపదిహేనురోజులు సమ్మె నడిపించాము. వందేమాతర ఉద్యమం నిజాం నిరంకుశపాలన విచ్ఛిత్తి, పోరాటానికి వాతావరణం ఏర్పరచింది.

నిజాం నవాబులు మతోన్మాద రాజకీయాలతో పేద, మాల, మాదిగ, దళిత జాతులను 'నా ముస్లిం' అని తమ మతంలోకి మార్పిడిచేసే కార్యక్రమం సాగించారు. ఆర్యసమాజ్ ఈ సమస్యను చేపట్టి, నిజాం వ్యతిరేక పోరాటం, ముస్లిం వ్యతిరేక పోరాటం నిర్వహించుటకు వేలాది మంది ఆర్యసమాజ్ కార్యకర్తలు పంజాబ్, ఉత్తరప్రదేశ్, తదితర రాష్ట్రాలనుంచి ఆర్యసమాజ్ గురువులను సాధువులను సమీకరించి సత్యాగ్రహ ఉద్యమం చేపట్టింది. ఈ మత ఉద్యమం నల్లగొండ పట్టణానికి సైతం వ్యాపించింది. మొత్తంమీద ఆనాటి ఈ వాతావరణం నిజాం వ్యతిరేక వాతావరణంతో సంస్థానం ఒక మండుతున్న కుంపటిలా తయారైంది.

ఆర్యసమాజ్ ఉద్యమంతో ఆకర్షితుడైన నేను జీవహింస వ్యతిరేక ఉద్యమాన్ని చేపట్టే ఆలోచనలో ఉన్నాను. దానితోపాటు నిరక్షరాస్యత నిర్మూలనకు కృషి చేయాలని, తద్వారా నిరక్షరాస్యులలో చైతన్యం నింపి విద్యార్థి, యువకులతో పాటు వారినికూడా స్వాతంత్ర్య పోరాటంలో భాగస్వాములను చేయాలని నిర్ణయించుకొని అందుకు కృషి కొనసాగించాను.

ఆనాటి యువతరం కవులు రచయితలు సాహిత్యాన్ని ప్రజలకు అందించుటకు, స్వాతంత్ర్య ఉద్యమ స్ఫూర్తిని కలుగచేసే సాహిత్యాన్ని ప్రజలకు పంచుటకు గ్రంథాలయ ఉద్యమంలో భాగంగా సూర్యాపేట పట్టణంలో "అర్జున పుస్తక బండారు" పేరిట పుస్తకశాలను స్థాపించాము. దానికి విశ్వసాహితిమాల, గురజాడ సాహిత్యం, నిషిద్ధ సాహిత్యంతో యుక్తంగా ఇతర రాష్ట్రాలనుంచి కూడా సాహిత్యం తెప్పించి మా పుస్తక బండారు ద్వారా గ్రంథాలయాలకు అందించాము.

ఇదే సందర్భంలో కచ్చితమైన, నిర్మాణ యుతమైన కార్యక్రమాలకుగాను సూర్యాపేట, నల్లగొండ పట్టణాలలో విద్యార్థి వసతి గృహాలను ఆరంభించి నడిపాము. ఆ వసతి గృహాలు నిజాం వ్యతిరేక పోరాటంలో పాల్గొనే యోధులను తయారుచేసే కేంద్రాలుగా మార్చాము. అందుకు రాజకీయ శిబిరాలను, చర్చావేదికలను నిర్వహించి, విద్యార్థులలో రాజకీయ చైతన్యాన్ని తీసుకువచ్చాము. వారిలో పసునూరి వెంకటరెడ్డివంటి యువ విద్యార్థి కిశోరాలెందరో తర్వాతి కాలంలో జరిగిన తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటంలో సేనానులై పోరి అమరులైనారు. అప్పటికే దేవులపల్లి వెంకటేశ్వరరావు కమ్యూనిస్టు ఉద్యమంతో సంబంధం కల్గి ఉన్నారు. వీరు తమ స్వగ్రామమైన చందుపట్ల గ్రామంలో మకాంవేసి ఉన్నారు. నా కార్యక్రమాలలో దగ్గరగావున్న వారి సోదరుడు దేవులపల్లి రాఘవేంద్రరావు ద్వారా జిల్లా ఆర్గనైజర్‌గా ఉన్న బీబీనగర్‌లో పనిచేస్తున్న ఉపాధ్యాయుడు డి. సుబ్బారావు నన్ను కాంటాక్టు చేసినారు. దేవులపల్లి వెంకటేశ్వరరావుతో నాకు పార్టీ సంబంధాలు ఏర్పడినాయి.

విద్యార్థి వసతి గృహాల నిర్వహణ మరియు ఆర్యసమాజ్‌లో చురుకైన పాత్రను నిర్వహిస్తున్న నా కార్యక్రమాల్ని గమనించి దేవులపల్లి వెంకటేశ్వరరావుగారు నన్ను కాంటాక్టు చేశారు. వారి ద్వారా నేను కమ్యూనిస్టు పార్టీలో చేరాను. అనతి కాలంలోనే సూర్యాపేటలో కమ్యూనిస్టు పార్టీ శాఖ ఒక దానిని ఏర్పాటు చేసుకున్నాం. నల్లగొండ జిల్లాలో ఇది ప్రథమ కమ్యూనిస్టు పార్టీ శాఖ. ఆ రోజుల్లో జిల్లా కమిటీలోనే సభ్యునిగా బాధ్యతలు నిర్వహించాను.

మల్కాపురం బిల్కూరు మహాసభలో పాల్గొన్న మాకు ఆంధ్రమహాసభ నాయకులు రావి నారాయణరెడ్డి, తదితర ఆంధ్రమహాసభ నాయకులతో పరిచయాలు ఏర్పడినవి.

### యువతరానికి నా సందేశం:

ఉద్యమాలు నిర్వహించుట గతంలో ఎంతో కష్టతరమైన పని. ఆ అంధకార జనాలలోసైతం ఉద్యమాలలో పాల్గొన్న యువకులు పార్టీలో నిర్వహించిన పోరాటాలు, వారి త్యాగాల ఫలితంగా దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. నిరంకుశ నిజాం పరిపాలనను మట్టికరిపించగలిగాము.

అయితే, ఏ లక్ష్య సాధనకై కమ్యూనిస్టులు దేశభక్తులై త్యాగాలు చేశారో అట్టి వారి ఆశయాలైన సమసమాజ ఆవిర్భావం జరుగలేదు. నిరుద్యోగం, నిరక్షరాస్యత, లంచగొండితనం పోలేదు. భూసంస్కరణ అమలు కాలేదు. అందుకే మన పోరాటం ఆగిపోలేదు.

అందువలన యువకులు, విద్యార్థులు కమ్యూనిస్టు పార్టీ జెండా క్రింద చైతన్య యుతమైన పోరాటాలు చేపట్టి, ప్రజలను ఉద్యమోన్ముఖులను గావించడం ద్వారా సమసమాజ స్థాపనకు తమ వంతు కృషి చేయాలి.

బూర్జువా సమాజంలో ఉత్పన్నమైన క్షీణ సంస్కృతిలో యువకులు కొట్టుకొని పోకుండా, వారిని విప్లవ పోరాటాల వైపు మళ్లించాల్సిన బాధ్యత యువ కమ్యూనిస్టులపై ఉన్నది. అమరవీరులు, విప్లవమూర్తులు, త్యాగధనుల వారసులుగా సమ సమాజస్థాపనకై యువత పునరంకితమవ్వాలనేదే సి.పి.ఐ. 70 వ వార్షికోత్సవ సందర్భంగా వారికి నేనిచ్చే సందేశం.

# శ్రీ ఎ. గురవారెడ్డి



నేను హైదరాబాద్‌కు 1932లో వచ్చి నాల్గవ ఫారంలో సిటీ కాలేజీలో చదువు నారంభించిన నాటినుండి జాతీయ రాజకీయాలవల్ల, ముఖ్యంగా గాంధీగారివల్ల ప్రభావితుడనయ్యాను. రెడ్డి హాస్టలులో రావి నారాయణరెడ్డి గురించి వింటూండే వాడిని. 5, 6 మాసాల తర్వాత అతన్ని చూడగలిగాను. రావి నారాయణరెడ్డి ఉప్పు సత్యాగ్రహములో పాల్గొన్నాడని వింటిని. కమ్యూనిస్టు సిద్ధాంతాలుగాని, పార్టీ గురించిగాని అపుడేమి తెలువలేదు. గాంధీగారు 1932లో హరిజనుల గురించి ఉపవాసదీక్ష పట్టినరోజు నేను, ఇంకా 5,6 మందిని తకిలీలు తెచ్చుకొని ఆరోజు నూలుదారము తీసుకుంటూ దీక్ష బూనితిమి. తర్వాత నెహ్రూ గురించి, సుభాస్‌చంద్ర బోస్ గురించి వింటిమి. 1939లో హైదరాబాదులో కాంగ్రెస్ సత్యాగ్రహము జరిగినప్పుడు నేను బి.ఏ. మొదటి సంవత్సరం చదువుతున్నాను. రావి నారాయణరెడ్డి మొదటి జట్టులో సత్యాగ్రహము చేసినప్పుడు వాలంటీరుగా జేకొట్టటము, జూతానులో పాల్గొనటము, తర్వాత జరిగే ప్రతి సత్యాగ్రహములో వాలంటీరుగా పనిచేశాను. అంతకుముందు ఆంధ్రమహాసభలకు వెళ్ళటము జరిగింది. ముఖ్యంగా షాదునగర్ ఆంధ్రమహాసభలో వాలంటీరు లీడరుగా పని చేశాను.

కాం(గెస్ సత్యాగ్రహము ఆగిన తర్వాత వందేమాతరం సమ్మె జరిగింది. అందులో ముఖ్యంగా పాల్గొని యూనివర్సిటీ బాయికాటు చేశాం. అప్పుడు అందరము నాగపూరు యూనివర్సిటీకి పోయాము. కొందరు నాగపూర్, కొందరు జబ్బల్‌పూరు పోయాము. నేను జబల్‌పూరు పోయితిని. ఆ సంవత్సరము, అంటే 1939లో త్రిపురలో కాం(గెస్ మహాసభ జరిగింది. ఆ సభకు సుభాస్‌చంద్ర బోసు కాం(గెస్ అధ్యక్షునిగా, గాంధిగారు బలపర్చిన భోగరాజు పట్టాభి సీతారామయ్యను ఓడించి గెలచి అధ్యక్షుడు అయ్యాడు.

ఆ సభలో పూర్తిగా నేను పాల్గొన్నాను. అక్కడ వందేమాతరం విద్యార్థులనందరిని యూసఫ్, మెహరత్, ఇంకా దత్తూ మొజూందారు మొదలగు నాయకులు అడ్రస్ సమావేశ పరచారు. అక్కడ కమ్యూనిస్టు పార్టీగురించి కొంత సిద్ధాంత పరిచయము అయింది.

తర్వాత మేము జబ్బల్‌పూరునుండి తిరిగి హైదరాబాదు వచ్చిన తర్వాత నేను రెడ్డి మాస్టర్‌తో ఉండగా కామ్రేడ్ దేవులపల్లి వెంకటేశ్వర్రావుద్వారా చేతి వ్రాతతో రహస్య పత్రిక వచ్చేది. నా వద్దనుండే పంపిణీ అయ్యేది. తర్వాత ఇక్కడ పార్టీని స్థాపించే నిమిత్తం కామ్రేడ్ సి. ఆర్. వచ్చాడు. వారు నా రూంలోనే, రెడ్డి హాస్టల్‌లోనే మకాం. ఇక్కడ మొదట క్లాసులు ఆరంభం చేశాడు. ఆయన క్లాసులో మొత్తం సిద్ధాంతాలు చెప్పారు. అదనపు విలువ గురించి, పెట్టుబడి గ్రంథం గురించి, భౌతికవాదం గురించి వగైరా క్లాసులు తీసుకున్నప్పుడు కమ్యూనిస్టుల సిద్ధాంతం గురించి పూర్తిగా అర్థమయింది. సి. ఆర్. నా రూంలో దాదాపు 4, 5 మాసాలున్నారు. ఇక్కడుండే వారు ప్రతిదినము ఎక్కడో క్లాసులు తీసుకొని వచ్చేవారు. ఆ సమయంలోనే తీగల సత్యనారాయణ, సర్వదేవభట్ల రామనాథం మొదలగువారు పార్టీవైపు ఆకర్షితులయ్యారు. ఆ సమయంలోనే కామ్రేడ్స్ అసోసియేషన్ వాళ్ళతో పరిచయము, తర్వాత పార్టీలో వాళ్ళలో చేరటము జరిగింది.

అయితే రావి నారాయణరెడ్డి, బి. నరసింహారెడ్డి, ఆరుట్ల లక్ష్మీనర్సింహారెడ్డి, గబ్బేట గోష్పాదరెడ్డి వగైరాలు (వీళ్లంతా కాం(గెస్ సత్యాగ్రహములో పాల్గొన్నవారే) – పార్టీలో చేరి వుంటారు. అందుకే వారు, ముఖ్యంగా రావి నారాయణరెడ్డి నాకు చాలా దగ్గర కాబట్టి సి.ఆర్.ను నా వద్ద ఉంచారు.

ఇంకో విషయము ఏమంటే – అవి రెండవ ప్రపంచ యుద్ధపు రోజులు. రోజూ మేము పత్రికలు చదువుతూ, హిట్లర్ దారుణ కృత్యాలు, ఫాసిజం ప్రమాదం తెలుసుకున్నాం. అప్పుడు కమ్యూనిస్టులుగా ఉన్నవాళ్లు చాలా మంది. బ్రిటిష్ ఇండియాలో కాం(గెస్‌లోనే ఉండి పని చేసేవాళ్లు. సుందరయ్య మొదలగువారు కాం(గెస్ సోషలిస్టు పార్టీలో ఉండేవాళ్లు. కాని నిజాం ప్రాంతంలో కాం(గెస్‌పై నిషేధముండేది. అసలు కాం(గెస్ అనేది ఇక్కడ లేదు. మొట్టమొదటిసారి కాం(గెసును స్థాపించేందుకే 1939లో సత్యాగ్రహం జరిగి, మధ్యన ఆపు చేయబడ్డది. అప్పటినుండి నిజాం సంస్థానమందు ఆంధ్రమహాసభ ద్వారా చైతన్యవంతులుగా చేయుటకుగాను కాం(గెస్ సోషలిస్టు పార్టీ ఆధ్వర్యాన, తర్వాత కమ్యూనిస్టు పార్టీ స్వతంత్ర్య సంస్థానమండలి ప్రజానీకాన్ని సమీకరించే దశలో చాలామంది యువకులతోపాటు నేనుకూడా కమ్యూనిస్టు పార్టీలో చేరాను.

భారతదేశం విముక్తి ఎట్లా అన్నది మమ్ములందరిని ఆలోచింపచేసింది. నెహ్రూగారి "భారతదేశ విముక్తికి మార్గం ఏమిటి?" అన్న పుస్తకం మాపై ఎంతో ప్రభావం కలుగచేసింది. అదికాకుండా సోవియట్ యూనియన్ గురించి, అక్టోబరు విప్లవం గురించి తెలుసుకోవాలనే కుతూహలం ఉండేది. వీటన్నిటి ప్రభావమువల్ల కమ్యూనిస్టు పార్టీలో చేరి పని చేయాలని పట్టుదల ఉత్పన్నమైంది. అప్పటినుండి కమ్యూనిస్టుగా ఉన్నాను.

1942 నుండి 1948 జనవరి 12 వరకు హైదరాబాద్ నగరంలోనే వుండి, పార్టీ సభ్యునిగా పార్టీ పిలుపు మేరకు పార్టీ కార్యకలాపాలలో పాల్గొంటూ వచ్చాను. జనవరి 12, 1948 నాడు సిటీ కాలేజీలో లెక్చరర్‌గా పనిచేస్తున్న నేను పదవికి రాజీనామా చేసి, తెలంగాణా సాయుధ పోరాటములో పాల్గొనేందుకు సిటీ వదలివెళ్ళటం జరిగింది. సెప్టెంబరు 17, 1948 నాడు పోలీసు చర్య జరిగేవరకు వరంగల్లు ప్రాంతీయ కమిటీ సభ్యునిగా ఉండి, సెప్టెంబరు ఆఖరులో భారత సైన్యం చేత పట్టుబడి, జైల్లో పెట్టబడి, 1951 మేలో విడుదలయి, మళ్లీ పార్టీ కార్యక్రమాలు చేబట్టాను. పార్టీపై నిషేధ ముండేది.

1952 ఎన్నికలలో పార్టీ తరపున ఎన్నికల నిర్వాహకునిగా కామ్రేడ్ ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డిగారు, నేను కలిసి పి.డి.ఎఫ్ ఏర్పాటుకు పూనుకున్నాము. 1952 ఎన్నికలు వచ్చేవరకు పార్టీపై నిషేధముండేది. ఎ.పి.టి.యు. మరియు రైతు మహాసభలు పి.డి.ఎఫ్.లో భాగస్వాములుగా ఉండినవి. ఎన్నికల నిర్వహణలో కామ్రేడ్ ఆరుట్ల లక్ష్మీనర్సింహారెడ్డిగారు, నేను కలిసి పని చేశాము. 1952 ఎన్నికలలో పార్టీ అభ్యర్థులు ఘనంగా విజయము సాధించారు. పి.డి.ఎఫ్. తరపున తెలంగాణాలో నల్లగొండ, ఖమ్మం, వరంగల్, కరీంనగర్, ఆదిలాబాద్, మెదక్, మహబూబ్‌నగర్, హైదరాబాద్ సిటీలో అభ్యర్థులు ఘనంగా విజయము సాధించారు. శాసనసభలో పి.డి.ఎఫ్. ప్రధాన ప్రతిపక్షంగా పని చేసింది. కామ్రేడ్ డి. వి. దేశపాండే నాయకునిగా, నేను చీఫ్‌విప్‌గా పనిచేశాము. మెదక్ జిల్లాలో కమ్యూనిష్టు పార్టీని నిర్మించుటలో నిమగ్నమయ్యాను. మెదక్ జిల్లాలో పార్టీ నేను జిల్లా కార్యదర్శిగా లేనప్పుడు నామమాత్రంగానే ఉండేది.

నేటి పరిస్థితి ఏమిటి? ఇప్పుడు ఆశాజ్యోతిగా వున్న సోవియట్ లేదు. సాంకేతిక రంగంలో విప్లవకరమైన మార్పులు వచ్చాయి. ప్రపంచం అంతా ఒక గ్రామంగా మారింది. ఇవన్నీ జరిగినా కమ్యూనిస్టు మూలసిద్ధాంతాలు ఇప్పటికీ సందర్భోచితంగానే వున్నవి; ఉండగలవు. అయితే, మార్క్స్ చెప్పినట్లు మార్క్సిజం ఒక పిడివాద సిద్ధాంతం కాదు. అది కార్యాచరణకు మార్గదర్శి మాత్రమే. అయితే మార్క్స్ చెప్పినట్లు దాన్ని మనము ఎల్లప్పుడు దృష్టిలో వుంచుకోవాలి. యువకులు కార్యరంగంలో వుండి అయినా ఈ సిద్ధాంతాలు అమలు జరుపవచ్చు. గురజాడ అన్నట్లు "సొంతలాభము కొంతమానుక తోటిమానవులకు తోడు పడాల"నే ధ్యేయము ఉంటే చాలు – పార్టీ హోల్‌టైమరు అయితేనే పనిచేసినట్లు కాదు.

★ ★ ★

# కీ.శే. శ్రీ దొడ్డా నరసయ్య



హుజూర్‌నగర్ తాలూకా సరిహద్దుల అవల అనాడు సాగుతున్న సత్యాగ్రహ పోరాటాలు, విదేశీ వస్తు బహిస్కరణ సంఘటనలు, "వందేమాతరం" నినాదాలు, ఆర్యసమాజం నాయకత్వాన బెంగాల్ మొదలగు సుదూర ప్రాంతాల నుండి వాలంటీర్లు ఎలాంటి పౌరహక్కులు లేని మా నైజాం సంస్థానంలోకి సరిహద్దులు దాటి రావడం, అరెస్టులవడం, కోర్టువారు హెచ్చరించి వదిలిపెడితే మరికొంతముందుకు పోయి సత్యాగ్రహం చేసి అరెస్టవడం - యీ సంఘటనలు ఇక్కడి యువకులను ఉత్తేజపరచినవి.

ఇదే సందర్భములో స్థానికంగా సాగుతున్న రైతు ఉద్యమాలు - హుజూరునగరు తాలూకా గ్రామాలచే చుట్టబడిన దీవి గడ్డలుగా వున్న కృష్ణా జిల్లాకు చెందిన "మునగాల", "లింగగిరి" పరగణాల ప్రజలు సాగించుతున్న జమీందారి వ్యతిరేక పోరాటాలు; మా గ్రామం పొలిమేరలలోనే సాగుతున్న "బేతవోలు" మఖ్తా రైతుల పోరాటాలు (ఇది నైజాం) సాగుతున్నవి. ఇదే సందర్భములో మల్కాపురంలో

జరుగుతున్న నైజాం వ్యతిరేక 7 వ ఆంధ్రమహాసభలు మొదలగు సంచలానత్మక సంఘటనలు జరుగుతున్న రోజులవి.

హైదరాబాదు పోయే 9 వ జాతీయ రహదారి మీదవున్న మల్కాపురములో (1940 సం॥) 7 వ ఆంధ్ర మహాసభలు జరుగుతున్నవి. హైదరాబాదు పనిమీద వెళ్ళి వస్తూ నేను, ముత్తవరపు విశ్వనాథం గారు అక్కడ దిగాము. మహాసభలో రాజకీయ చర్చలు, ఉపన్యాసాలు విన్నాము. రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, దేవులపల్లి వెంకటేశ్వరరావు మొదలగువారి ఉపన్యాసాలు ఎంతో ఉత్తేజకరంగా సాగినవి. ఇవన్నీ నాకు కొత్త. సూర్యాపేట, హుజూరునగరు ప్రాంతాల మిత్రులు, స్నేహితులు కలిశారు. కామ్రేడ్ డి. సుబ్బారావు గారితో నాకు పరిచయం ఆ మహాసభలోనే జరిగింది. ఆ మహాసభ నాకొక అనుభూతిని, ఆలోచనను కలుగచేసింది.

ఆ స్మృతులు మనస్సులో మెదిలాడుతుండగానే మా స్వగ్రామమైన చిలుకూరులో "అష్టమ" ఆంధ్రమహాసభలు జరుగబోతున్నవనే వార్తతో నాకొక మార్గం దొరికినట్లయ్యింది.

అప్పుడు నేను, ముత్తవరపు వెంకటప్పయ్యగారి దగ్గర గుమాస్తాగా పనిచేస్తున్నాను. బాకీలు వసూలు చేసే పని మీద దూదియా తండ అనే ఊరుకుపోయాను. ఆ పని అయిపోగానే నా వెంట వున్న నౌకర్లకు గుర్రాన్ని అప్పగించాను. "ఇక నేను మీ దగ్గర గుమాస్తా పని మానుకుంటున్నాను" అని వ్రాసిన ఉత్తర మిచ్చి పంపాను. చిలుకూరు ఇంటికి చేరుకున్నాను ఆంధ్రమహాసభ ఏర్పాట్లలో నిమగ్నమయ్యాను.

నాకు జ్ఞాపక మొచ్చేనాటికే మాది నిరుపేద రైతుకుటుంబం. 10 ఎకరాల మెట్ట, 2 ఎకరాల (బావి అండతో) మాగాణి భూమితో, ఒక ఆడపిల్లతో కలసి 8 మంది పిల్లలను పోషించాలి. సంసారం సాగించేందుకు మా తల్లిదండ్రులు పడరాని పాట్లు పడ్డారు. పుట్టిన కాడికి అప్పులు చేశారు. గొడ్డూ, గోద, మాగాణితోపాటు నడి ఊరిలో వున్న ఇంటిని అప్పుల వారికి తెగనమ్మి, ఊరిబయట పెరడులో పాక వేసుకున్నారు. మాకు పెట్టి పెద్దవాళ్లు ఉపోషాలున్నరోజులు. అన్నంలేక గుగ్గిళ్ళు వండి మమ్ములను ఓదార్చిన సందర్భాలు నాకు బాగా జ్ఞాపకమున్నవి.

ఇంత దరిద్రములో కూడా మా నాయనగారు మొగపిల్లలందరినీ బడికి పంపించడం మానలేదు. కరణాలు, బ్రాహ్మణులు, వైశ్యులు తప్ప మా ఊరిలో ఇతరు లెవ్వరూ చదువుకున్నవారు లేరు. మా ఇల్లు తప్ప చదువు అసలు అందుబాటులో లేదు. ఊళ్ళో 2 వ తరగతి మాత్రమే ఉన్నది. మా మేనమామల వూరు మేళ్ళచెరువులో ఉర్దూ మీడియం 4 వ తరగతి వరకు చదివించారు నాన్నగారు. ముత్తవరపు వారి దగ్గర గుమాస్తా ఉద్యోగంకు ముందు చదువుకోవాలనే తపన నన్ను ఒకదగ్గర నిలకడగా వుండనివ్వలేదు. కొన్నాళ్ళు వుండూరిలోనే పోలీస్ పటేలు (గ్రామ మునసబ్) దగ్గర వ్రాతపని నేర్పమని కుదిరాను. వ్రాత పనికంటే వెట్టిపని ఎక్కువయ్యింది. ఏమిచేస్తాము! అంతకుముందు సీతాపతిగారనే బ్రాహ్మణ ఉద్యోగి దగ్గర చదువు నేర్పించమని, ఆయన వెంట ఉద్యోగరీత్యా ఎక్కడకుపోతే అక్కడకు తిరిగాను. చదువుకు బదులు అంట్లు తోమడ మొచ్చింది! చదువు తపనతో తాహతుకు మించిన ఆలోచనలు చేసి 1939 వరకు తాడూ బొంగరంలేని అరాచక జీవితం అనుభవించాను.

ఈ స్థితిలో ముత్తవరపు వెంకటప్పయ్యగారి దగ్గర యీ గుమాస్తా పని దొరికింది. వారి ఇంట్లోనే భోజనం. నెలకు రూ.50/–లు వేతనం. నాకైతే బాగానే వున్నది. కాని, ఏదో తెలియని బాధ నిరంతరం మనస్సులో పని చేస్తూవుండేది.

చేసేపని మధ్య యుగాలనాటి ఫ్యూడల్ దోపిడి పని. అప్పులు పెట్టడం, ఇచ్చిన దానికి రెండింతలు చేసి దస్తావేజులు వ్రాయడం. అప్పుతీరినా అవి ఇవ్వకూడదు; వడ్డీకి వడ్డీ కట్టడం, తిండి గింజల అప్పుకు నాగుకు నాగుకట్టి మోయలేనంత చేయడం, యీ అప్పు తీర్చుకోవడానికి ముఠాను వెంటేసుకొని పోయి, ఇంటిముందర ఏదుంటే అది ఎత్తుకరావడం, మంచి గిత్తలను, ఎడ్లు బండ్లను తోలుకరావడం, ఇంటిముందు మనుష్యులను పెట్టి పొయ్యి రాజెయ్యకుండా వత్తిడి చేసి అప్పులు వసూలు చేయడం (కాదు దోచుకోవడం) తప్పేదికాదు. అప్పుల వాళ్ళ బాధలతో మా కుటుంబం ఎలా చితకగొట్టబడుతూవుందో ఊహించుకున్నప్పుడు వళ్ళు గగుర్పొడిచేది.

ఇలాంటి దోపిడీలకు వ్యతిరేకంగా ఆంధ్రమహాసభ ఇచ్చిన పిలుపు నాలో క్రొత్త ఆలోచనలు కలుగచేసింది. అలవాటు ప్రకారం తక్షణ నిర్ణయం తీసుకున్నాను. ఆంధ్రమహాసభ కార్యకర్తగా మారడముతో జీవితానికొక మార్గం దొరికింది. సమాజం ఎడ వుండవలసిన గురుతర కర్తవ్యాన్ని కమ్యూనిస్టు పార్టీ నేర్పింది.

ఇక్కడ నా వివాహం గురించి కూడా చెప్పవలసి ఉంది. తీవ్ర నిర్బంధకాలంలోను, గెరిల్లా పోరాటాల మధ్యనే నా వివాహం పద్మతో జరిగింది. వివాహం అయిన కొద్ది రోజులకే నా భార్య, నేను సాయుధ గెరిల్లా దళాలలో పాల్గొన్నాము. అందుకు సంబంధించిన వివరాలు కొన్ని తెలియచేస్తున్నాను.

పద్మ అసలు పేరు సరస్వతి. ఈమె కన్నవారిది తిరువూరు తాలూకా ఆట్లప్రగడ గ్రామం. తండ్రి కాట్రగడ్డ రంగయ్యగారు. వీరికి ముగ్గురు కొడుకులు, ఐదుగురు ఆడసంతానం. గన్నవరం దగ్గరి బుద్ధవరం నుండి వచ్చి, కంభంపాడు ప్రక్కన స్థిరపడ్డారు. పెద్ద కుమారుడు కామ్రేడ్ పెదవెంకట రాయుడుగారు. గన్నవరం తాలూకాలో పేరున్న పాతతరం నాయకుడు శ్రీ రంగయ్యగారిది కమ్యూనిస్టు కుటుంబము.

తెలంగాణా సాయుధ పోరాటములో రహస్య నాయకులకు, దళాలకు కేంద్రముగా పని చేసిందీ గ్రామం. రంగయ్యగారి చిన్నకూతుళ్ళిద్దరు (సరస్వతి – చుక్కమ్మ) రహస్యస్థావరాలకు కొరియర్స్‌గా పనిచేశారు. కామ్రేడ్ తమ్మారెడ్డిగారు పోలీసులకు ఇక్కడే పట్టుబడ్డారు. నిర్బంధ విధానం పెరిగింది. ఎప్పుడు యే అఘాయిత్యము జరుగుతుందో!

ఈ పరిస్థితులలో (1949) కృష్ణాజిల్లా పార్టీ నాయకులు నా ఆమోదంతో నర్సరావుపేట స్థావరములో వుండగా పద్మను నా దగ్గరకు పంపారు. ముఖపరిచయాలు లేకపోయినా నాయకులు ఒకరిని గురించి మరొకరికి పరిచయం చేసి యున్నారు. మా ఇరుపక్షాల వారెవ్వరు లేకుండానే గెరిల్లా దళాల కాపలాతో సత్తెనపల్లి తాలూకా కామ్రేడ్సు బాధ్యత తీసుకొని మా పెళ్ళి నిర్వహించారు. జంటగా రంగంలోకి పోయాము.

రంగంలోకి పోగానే సరస్వతి పద్మగా పేరు మార్చుకుంది. గెరిల్లా శిక్షణ ఇవ్వబడింది. పురుష డ్రస్సుతో గన్ను ఇచ్చారు. అడవులలో విస్తృతంగా దళాలలో పాల్గొంది.

నేడు స్వాతంత్ర్యం వచ్చి అర్ధశతాబ్దం కావచ్చింది. ఈ అర్ధశతాబ్దకాలములో అనేక విజయాలు సాధించబడ్డవి. అయినా, అసలు సమస్యలు, ప్రాథమిక సమస్యలు పరిష్కరించబడకపోగా, సమాజానికి భారంగా తయారవుతున్నవి. ముందుకు చూస్తే బాధాకరమైన దృశ్యాలు కండ్లముందు కనబడుతున్నవి. యీ దృశ్యాలు యువలోకానికి నిరుత్సాహం కలిగిస్తున్నవి. అగమ్యగోచరంగావున్న యీ సామాజిక అడ్డంకులను ఛేదించవలసిన బాధ్యత యువతరమే వహించాలి. యువతరం ముందుండి త్యాగాలు చేయకపోతే స్వాతంత్ర్యము వచ్చేదా? భగత్‌సింగులాంటి యువకిశోరాలు స్వాతంత్ర్యం కోసం ఉరికంబాలెక్కారుగద? ఆనాటి యువతరమే అకుంఠిత దీక్షతో – సంఘటిత శక్తితో రక్తం దారబోశారు. వీరతెలంగాణాకు వన్నె తెచ్చారు. రాచరిక ఫ్యూడల్ వ్యవస్థను కూలగొట్టారు.

తమకోసం, తమ పిల్లల కోసం ఈనాటి యువశక్తి తన చరిత్రాత్మక పాత్ర నిర్వహించాలని కోరుతున్నాను.

★ ★ ★

# శ్రీ పిల్లలమర్రి వెంకటేశ్వర్లు



నేను 1912లో శిష్ట్లా వారి మంచాడ అగ్రహారమునందు జన్మించాను. బాపట్ల తాలూకా, గుంటూరుజిల్లా 1933–34 సంవత్సరములో ఇంటర్‌మీడియట్ తప్పిన తరువాత పరీక్షలో ఉత్తీర్ణుణ్ణి అవటానికి కృషిచేస్తూ తెనాలిలో ఎక్కువకాలము గ్రంథాలయములందు దొరికే ఆంగ్లము, తెలుగు మాగజైనులు చదువుతూ ఒక నిరుద్యోగుని పద్ధతిలో తెనాలి గ్రాంథాలయమునకు పోతూ వస్తూ ఉండేవాడిని.

మేము ముగ్గురు అన్నదమ్ములము, ఒక చెల్లెలు. మా పెద్ద అన్నయ్య ఆ రోజులలో మద్రాసు లయోలా కళాశాలయందు లా పరీక్ష చదువుతూ ఉండేవారు. అతడు ప్రత్యక్షముగా కాంగ్రెస్ కార్యకలాపాలలో పాల్గొనకపోయినా, ఆనాటి రాజకీయ పరిస్థితులమీద చాలా మక్కువ చూపించెడివాడు. మద్రాసునుంచి వచ్చినప్పుడల్లా ఆనాటి కాంగ్రెస్ నాయకులు, మేధావులు అయిన యన్. శ్రీనివాస అయ్యంగార్, అల్లాడి కుప్పుస్వామి, యస్. సత్యమూర్తి, మోతీలాల్ నెహ్రూ, సి. ఆర్. దాస్, విఠల్‌బాయి పటేల్ గార్లను గురించి, వారి ఉపన్యాసధోరణులను వివరిస్తూ కాంగ్రెస్ రాజకీయముల గురించి ఎక్కువగా చెబుతూ ఉండెడివారు. వాటితోపాటు,

నేను గ్రంథాలయములందు దొరికే మోడరన్ రివ్యూ, యంగ్ ఇండియా, ఇంకా కాంగ్రెస్‌లోని అతివాద మాగ్జైన్లు చదువుతూ స్థానిక పరిచయులు అయిన కాంగ్రెస్ నాయకులతో, కాంగ్రెస్ నినాదాలను గురించి చర్చిస్తూండేవాణ్ణి. కాంగ్రెస్ జండాలు ఎగురవేయుట, ఆనాటి ప్రభుత్వము నిషేధించినా, చేస్తూ ఉండేది. వాటిల్లో నాకు ప్రత్యక్ష సంబంధము లేకపోయినా హాజరు అవుతూ ఉండేవాడిని. పోలీసులు లాఠీఛార్జీ చేసి చెదరగొడుతూ ఉండెడివారు. సైమను కమీషన్ బాయికాట్ రోజుల్లో ప్రజా సమూహాముతోబాటు రైల్వే స్టేషన్ల దగ్గరికి వెళ్లి, నినాదాలు చేసేవారు. ఆ కాలములో టెర్రరిస్టు ఉద్యమ ప్రభావం యువతమీద ఎక్కువగా ఉండేది. దత్, భగత్‌సింగ్, గురుదేవుల నామాలు భగవన్నామములతో సరిసమానముగా ఉచ్ఛరించడము జరిగేది. దత్, భగత్ సింగ్‌లకు, ఆయన సహచరులకు మరణశిక్ష విధించినారు. ఆ మరణశిక్షను రద్దు చేయాలని దేశవ్యాప్తముగా ఉవ్వెత్తు ఆందోళనలు జరిగినవి. గాంధీగారు రౌండుటేబుల్ సమావేశములో పాల్గొనటానికి ఇంగ్లాండ్ ప్రయాణము అయ్యే తరుణము. భగత్‌సింగ్, తదితరులపై మరణశిక్షను రద్దుచేయాలని రౌండుటేబుల్ సమావేశములో పాల్గొనటానికి గాంధీగారు షరతుపెట్టాలని యావత్ యువజనులు వాంఛించినారు. కాని, మహాత్మాగాంధీగారు అలా చేయకుండా తిరిగి వచ్చేటప్పటికి యువజనులలో కాంగ్రెస్‌పై తీవ్ర అసంతృప్తి, టెర్రరిస్టు ఉద్యమంపై అభిమానము వెల్లుబికినాయి. ఇద్దరిపై మరణశిక్షను రద్దు చేయలేని నాయకులు రౌండుటేబుల్ సమావేశములో పాల్గొని భారతదేశానికి స్వాతంత్ర్యము తెస్తారు అనుకోవటం పొరపాటని, నాలో గాంధీగారి సిద్ధాంతాలపై అపనమ్మకం కలిగినది. నేను ఇంటర్‌మీడియట్ చదువుకునే రోజులలోనే ఆర్థికమాంద్యము ప్రబలముగా ఉండెడిది. పరీక్షకు ఫీజు చెల్లించుటకు కూడా డబ్బులు దొరికేవికావు. ఎలాగో అలాగ ఫీజు కట్టి ఇంటర్ పాస్ అయినాను. ఆ పరిస్థితులలో పోలేపెద్ది నరసింహమూర్తిగారు, స్థానిక కాంగ్రెస్ నాయకులతో నేను చర్చించేటప్పుడు, నన్ను గమనించి నాకు పరిచయ భాగ్యము కలుగ చేసినారు. ఆ త్యాగి నిరాడంబరజీవి. సౌమ్యముగా తన వాదనలు విపులీకరించే పద్ధతి నన్ను ఆయనవైపు ఆకర్షింపచేసినది. వారితో ఎక్కువ సంబంధము పెంచుకొంటూ, మార్క్సిజం సిద్ధాంతములవైపు ఆకర్షింపబడ్డాను. వారు అమ్మ, (గోర్కి), Youth in Soviet Russia, Lenin on Religion, State and Revolution, Paris Commune, Dialectical Materialism, Historical Materialism, మున్నగు పుస్తకాలు నాచేత ప్రత్యేకముగా చదివించినారు. వారి పరిచయ భాగ్యముతోనే కమ్యూనిస్టు సిద్ధాంతములపైన నాకు మక్కువ ఏర్పడినది. నేను పార్టీలోకి పనికి వస్తానని నరసింహమూర్తిగారికి స్థిరమైన అభిప్రాయం కలిగినది. నన్ను తనలో కలుపుకొని తెనాలిలో యున్న మున్సిపల్ వర్కర్స్, ఫాక్టరీ వర్కర్స్‌ని సంఘాలుగా నిర్మాణము చేయుటకు ప్రోత్సహించినారు. కొంతకాలము తరువాత వారు నాకు త్యాగమూర్తి, పార్టీ నిర్మాత అయిన పుచ్చలపల్లి సుందరయ్య గారితో పరిచయము కల్గించినారు. వారిని చూస్తే నాకు కొంచెము బెదురుగ ఉండేది. నరసింహమూర్తి గారితో ఉన్న అప్యాయత, సిద్ధాంత పరిజ్ఞానము కమ్యూనిస్టు పార్టీ సభ్యునిగా చేసినవి. ఆ రోజులలో పార్టీ అంటే ఒక పవిత్ర కూటమి అనెడి భావన యుండేది. ఏమాత్రము సంఘ వ్యతిరేక పనులు చేసెడివారికి పార్టీలో

స్థానము ఉండేది కాదు. గుంటూరులో అనాడు కమ్యూనిస్టు పార్టీ నాయకులు అయిన జొన్నలగడ్డ రామలింగయ్య, దుర్బా కృష్ణమూర్తి, ప్రతాప రామసుబ్బయ్యగార్లు నాయకులుగా ఉండెడివారు. కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాలలో పాల్గొనేందుకు నరసింహామూర్తిగారు గుంటూరు పంపించినారు. ఆ తరువాత కొన్ని దినములకు పార్టీ ఆధ్వర్యములో పార్టీలో పని చేయుటకు విజయవాడ పంపించారు. అక్కడ చాలా ఏండ్లవరకు స్థిరనివాసము ఏర్పరచుకొని, పార్టీ ఆఫీసులోనే తింటూ, పార్టీ కార్యకలాపములు నేను నిర్వహిస్తూ వుండేవాడిని. అప్పుడే మద్దుకూరి చంద్రం, చలసాని వాసుదేవరావు, కొసరాజు శేషయ్యగార్లతో దగ్గర సంబంధములు కలిగి, పార్టీ కమిటీలలో వాటిల్లో పనిచేస్తూ యుండేవాడిని. ఆ కాలంలోనే మద్రాసులో కమ్యూనిస్టు పార్టీ విధానాలను గురించి దత్–బ్రాడ్లీ థీసిస్‌పై చర్చ జరిగింది. అప్పుడు జరిగిన ప్లీనము సమావేశములో నేను ఒక భాగమును ప్రవేశపెట్టినాను కూడా. ఆ సమయంలోనే కమ్యూనిస్టు పార్టీ నాయకులు యస్. వి. ఘాటేగారితో పరిచయము కలిగింది. తరువాత కమ్యూనిస్టు పార్టీ రహస్య మహాసభలు జరిగాయి. అందులో కాకినాడ సమావేశము (1936) అతి ముఖ్యమైనది. దానిలోనే దత్–బ్రాడ్లీ థీసిస్ ఆధారముగా కమ్యూనిస్టు పార్టీ పంథా స్థిరపరచబడ్డది. జొన్నలగడ్డ రామలింగయ్య, ఇంకా ఒకరిద్దరు ఈ విధానాన్ని వ్యతిరేకించి, పార్టీ నుండి నిష్క్రమించినారు. తరువాత బెజవాడలో పార్టీ మహాసభలు జరిగినవి. అందులో విస్తృత కమిటీ నందు నేను ఒక సభ్యుడిని. అనాటి పార్టీ లైనును అనుసరించి, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలోను, కాంగ్రెస్‌లోను అధిక సంఖ్యలో సభ్యులను చేర్పించడము జరిగినది. అనాడు కమ్యూనిస్టు పార్టీ పట్టణ కమిటీకి కృత్తివెంటి కుటుంబరావు గారు కార్యదర్శిగా వుండేవారు. నేను, గెల్లి రాజగోపాలంగారు సభ్యులుగా వుండేవారం. ఆ సమయంలో కాంగ్రెస్ జిల్లా మహాసభలు జరుగుతూండేవి. కమ్యూనిస్టు పార్టీ విధానాల్ని తీర్మానరూపములో ప్రవేశపెట్టి, మితవాద కాంగ్రెస్‌వాదులు కాళేశ్వరరావుగారు, మరుపిళ్ళ చిట్టిగార్లు అంతా వ్యతిరేకించినను ఆమోదింప చేయించగలిగినాము.

అప్పటికే మాకు విజయవాడ పట్టణమునందు కార్మికులు, ఇతర వాణిజ్య వర్గాలలో పలుకుబడి ఏర్పడినది. వారిని ఆధారంగా చేసికొని మేము కూడా సభ్యులుగా చేరినాము. ఆ తరుణములో రాష్ట్ర కాంగ్రెస్ కమిటీకి ఎలక్షన్స్ జరిపినారు. నేను, కృత్తివెంటి కుటుంబరావు, గెల్లి రాజగోపాలు, ఇంకా ఇద్దరు ముగ్గురు అభ్యర్థులుగా చిట్టిగారు, కాళేశ్వరరావుగారు నాయకత్వమున యున్న కాంగ్రెస్‌తో పోటీచేసినాము. దాదాపు 5 స్థానములలో మేమే మెజారిటీలో వున్నాము. సుబ్బారావుగారు పోటీచేస్తున్న దానిలో చిట్టిగారు దౌర్జన్యము చేయుటవలన ఆ ఎన్నికలలో పాల్గొనమని ప్రకటించి, మాచేత ఉపసంహరింప చేసినారు. తరువాత కాంగ్రెస్‌తో సంబంధములు బెడిసి కొట్టినాయి. కృష్ణాజిల్లాలో దేశము మొత్తముమీద సుభాస్‌చంద్ర బోసు నాయకత్వము క్రింద అతివాద ఫార్‌వర్డ్ బ్లాక్‌గా ఏర్పడినది. కృష్ణాజిల్లాలో పేట బాపయ్య, అన్నె అంజయ్య, కాకాని వెంకటరత్నంగార్లతో నాకు సత్సంబంధములు ఉండెడివి.

రాజమండ్రిలో (1936) జరిగిన కాంగ్రెస్ సోషలిస్టు మహాసభలో పాల్గొన్నాను. అదే విధముగా పార్టీ మహాసభలలో పశ్చిమగోదావరి జిల్లాలో జరిగిన మహాసభల్లోనూ,

గుంటూరు, విశాఖ, ఇంకా ఇతర మహాసభలలో, దేశములలో జరిగిన ఇతర మహాసభల్లోనూ పాల్గొన్నాము.

రాష్ట్ర యువజనోద్యమములో నేను ఎక్కువగా పాల్గొనేవాడిని. కృష్ణాజిల్లా యువజన సంఘము కార్యదర్శిగా నేను, పిడికేటి మాధవరావుగారు అధ్యక్షులుగ ఎన్నుకొనబడి, యువజన సంఘానికి గట్టిపునాదులు కలుగచేశాము.

తరువాత పార్టీలో, ఆంధ్రదేశములో కార్మికోద్యమును నిర్మించడములో చాలా ప్రముఖమైన పాత్ర నిర్వహించినాము. లేబర్ ప్రొటెక్షన్ లీగ్ ఏర్పాటు చేయడం జరిగినది. ఇదే తరువాత రాష్ట్ర ట్రేడ్ యూనియన్ కౌన్సిల్‌గా అభివృద్ధి చెందినది. ఈ సంస్థ ఆధ్వర్యము క్రింద విజయవాడలో తోళ్ళ పనివారి సంఘాన్ని, స్టేట్ ప్రెస్‌వర్కర్స్ యూనియన్‌ని, మున్సిపల్ వర్కర్స్ మరియు ఎంప్లాయీస్ యూనియన్‌ని ఏర్పరచి, బలవత్తరమైన సంస్థలుగా రూపుదిద్దాము. ప్రెస్ వర్కర్స్ యూనియన్ ఆధ్వర్యంలో బెజవాడలో అనేక సమ్మెలు నడిపి, రాష్ట్ర మొత్తంమీద ప్రెస్ వర్కర్స్ యూనియన్‌ని స్థాపించి, ముఖ్యమైన పట్టణములైన గుంటూరు, తెనాలి, ఏలూరు, రాజమండ్రి, కాకినాడ మొదలైనచోట్ల బలమైన కేంద్రములుగ నిర్మించినాము. అదే మాదిరిగా వర్కర్స్ కోర్కెల సాధనకు రాష్ట్ర వ్యాప్తముగా సమ్మెను జరిపి, చాలావరకు కృతకృత్యులము అయినాము. అదే విధముగా మున్సిపల్ వర్కర్స్ యూనియన్‌ను, విజయవాడలో బలమైన సంస్థగ నిర్మించుటయేగాక అనేక సమ్మెలు కూడా దీని నాయకత్వం క్రింద నెరవేర్చినాము. తరువాత ఏలూరు, రాజమండ్రి, గుంటూరు మరియు అనేకచోట్ల మున్సిపల్ వర్కర్స్ మరియు ఎంప్లాయీస్ యూనియన్‌ని నిర్మించి, రాష్ట్ర వ్యాప్తముగా సమ్మెలు జరిపి కోర్కెలు సాధించుటయందు కృతకృత్యులము అయినాము. తరువాత మరో ముఖ్యమైన విశేషము – ఏలూరులో జూట్ వర్కర్స్ యూనియన్ నిర్మాణములోనూ, చీరాలలో టుబాకో వర్కర్స్ యూనియన్ నిర్మాణములోనూ కృషిచేసి బలమైన యూనియన్‌లను ఏర్పాటు చేయగలిగినాము. అక్కడ జరిగిన సమ్మెలలో పాల్గొన్నాను. వర్కర్స్ తమ కోర్కెలను సాధించుకొనగలిగినారు. వీటిలో నా ప్రత్యక్ష పాత్ర యుండెడిది. ఈ సమయంలోనే విశాఖ, గుంటూరు, రాజమండ్రి, కాకినాడ పట్టణములందు కమ్యూనిస్టు పార్టీ నాయకత్వము క్రింద బలమైన ట్రేడ్ యూనియన్ ఉద్యమం అభివృద్ధి చెందినది. లేబర్ ప్రొటెక్షన్ లీగ్ తరువాత రాష్ట్ర ట్రేడ్ యూనియన్‌గా అభివృద్ధి చెందినది. దీనికి కామ్రేడ్ సి.వి.కె. రావు అధ్యక్షులుగాను, నేను కార్యదర్శిగాను ఎన్నిక అయినాము. పోలేపెద్ది నరసింహమూర్తిగారు మాకు ఇన్‌చార్జి. మేము ముగ్గురం అనాడు ఆంగ్లంలో వున్న కార్మిక చట్టాలను, ఫ్యాక్టరీ అక్టు వర్కర్స్ కంపెన్‌సేషన్ అక్టును, మెటర్నిటీ బెనిఫిట్సు చట్టాలను తెలుగులో వ్రాసినాము. అవి పార్టీ ఆధ్వర్యాన ప్రకటించబడ్డాయి.

అది రెండవ ప్రపంచ యుద్ధము జరుగుతున్న రోజులు. యుద్ధ వ్యతిరేక ప్రచారము క్రింద ప్రభుత్వ వ్యతిరేక ఉపన్యాసములు ఇచ్చినాను. దీనితో ప్రభుత్వం నన్ను అరెస్టు చేసి తిరుచినాపల్లి జైలుకి పంపినారు. బందరులో సెషన్స్ కోర్టువారు ఏ క్లాస్ ఖైదీగా శిక్షించినది. కాని, జైలుకి పోయిన కొన్నాళ్ళకు ప్రభుత్వము సీక్లాస్ ఖైదీగా మార్చినది. తరువాత పార్టీ నిషేధ కార్యక్రమము సాగుతూ వచ్చినది.

అప్పుడు రాష్ట్ర పార్టీవారు నన్ను వైజాగ్‌లో పార్టీ నిర్మించడానికి అక్కడకు పంపారు. అక్కడ పలుచోట్ల కాంగ్రెస్ సోషలిస్టు నాయకులను కలసికొని పరిచయములు ఏర్పరచుకొన్నాను. చీపురుపల్లిలో అప్పలనాయుడు పార్టీ లీడర్‌గా కొనసాగుతూ వచ్చారు. శ్రీకాకుళం, దానివద్ద ఆముదాలవలస కొత్తవలస మొదలగు చోట్లకూడా పార్టీ శాఖలు ఏర్పరచడము జరిగినది. బారువా దగ్గర పార్టీకి సానుభూతిపరులను, పార్టీ సెల్స్ ఏర్పాటుచేయటము జరిగినది. తరువాత వైజాగ్‌లోని విశాఖపట్టణమునందు నన్ను అరెస్టు చేసి డిటెన్యూగా పంపినారు. మద్రాసు, కడలూరు, వైజాగ్, రాజమండ్రి, తిరుచి మొ॥ జైళ్లలో కూడా ఉన్నాను.

పిదప 1951లో ఎన్నికలు ప్రకటించినారు. ఆ ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీ అఖండ విజయం సాధించినది. నన్ను జగ్గయ్యపేట సీటులో నిలబెడితే నేను చాలా ఎక్కువ మెజారిటీతో లోక్‌దళ్, కాంగ్రెస్ అభ్యర్థులను ఓడించినాను. లోక్‌దళ్ అభ్యర్థి డిపాజిట్ కోల్పోయారు. కాంగ్రెస్ అభ్యర్థి కొద్దిలో డిపాజిట్ నెలబెట్టుకోగలిగినారు. మద్రాసులో ఆ రోజున కాంగ్రెస్ చీలి, లోక్‌పార్టీ, ప్రజాపార్టీ, స్వతంత్ర పార్టీ – ఈ రకంగా ముక్కలు అయినది. తరువాత ఆంధ్రాలో అసెంబ్లీ స్థానములందు, కాంగ్రెస్‌కు వచ్చిన స్థానాలకంటే మన పార్టీకి ఒక స్థానము ఎక్కువ సంపాదించినది. ప్రజాపార్టీ నాయకుడైన శ్రీ తెన్నేటి విశ్వనాథం కమ్యూనిస్టు పార్టీతో కలిసి ఫ్రంట్‌గా ఏర్పడినాము. ఈ ఫ్రంట్‌లో కమ్యూనిస్టు పార్టీదే పైచేయిగా ఉండెడిది. విశ్వనాథం ఫ్రంటకు నాయకుడిగా ఉండేవారు. తరిమెల నాగిరెడ్డిని కమ్యూనిస్టు గ్రూప్ నాయకుడిగా ఎన్నుకొనినాము. నేను కార్యదర్శిగా పని చేసేవాడిని. లోక్‌దళ్ మాత్రము కాంగ్రెస్‌తో చేతులు కలిపి, మంత్రి పదవులు ఆక్రమించినది.

నా 50 సంవత్సరముల పార్టీ జీవితములో 20 సంవత్సరములు పైన శాసనసభలో గడిచింది. నా క్రియాశీల పార్టీ జీవితం శాసనసభలకు పరిమితమయింది. తరువాత కార్మికోద్యమంలో గడిపాను.

1946 నుండి 1967 వరకు శాసనసభలో సభ్యునిగా వున్నాను. 1946, 1951–52, 1955, 1962 ఎన్నికలలో పార్టీ తరపున పోటీచేసి పార్టీ అభ్యర్థిగా గెలవగలిగాను. 1946, 1955 ఎన్నికలు యుద్ధ ప్రాతిపదికపైన జరిగినాయి. పార్టీ అతి తక్కువ స్థానాలు – 13 స్థానాలు మాత్రమే గెలవగల్గింది.

దాదాపు నా 50 ఏండ్ల పార్టీ జీవితములో పార్టీ విధానాలకు కట్టుబడి పార్టీలోను, అసెంబ్లీలోను కృషి చేశాను. ముఖ్యముగా పార్టీ రహస్యముగా ఉన్న కాలములో, పార్టీ విధానాలు శిరోధార్యముగా భావించి తు–చ తప్పకుండా అమలుపరిచినాము. అసెంబ్లీలలో పని చేసేటప్పుడు కూడా ప్రజా ఉద్యమాల్లో పాల్గొంటూ, ఆ ఉద్యమాలను అసెంబ్లీలో ప్రతిబింబించడానికి కృషి సల్పినాము. పార్టీలో పని చేసేటప్పుడు సభ్యులుగా కమిట్‌మెంట్ ఉండెడిది. మనం బాగా అధ్యయనం చేయాలి. ఈ విషయంలో మనం లోటు చేశాము. వీటిని మన సభ్యులు బాగా అవగాహన చేసుకోవాలి. పార్టీలో పని చేస్తూ ఉండగా, చాలా ఆశాజనకముగ – భారతదేశంలో సోషలిజం స్థాపించగలము అనే ఆశాభావముతో – కార్యక్రమములు చేపట్టి, అందుకు కృషి చేసేవారము. నేను మాత్రము అంతంత మాత్రమే

చదువుకున్నాను. ఉన్నత విద్య నాకు అబ్బలేదు. అంత గొప్ప మేధావినిగాను, అతి సామాన్య పార్టీ సభ్యుడిని. కాని నాకు అప్పగించిన బాధ్యతలను మాత్రము నెరవేర్చుటకు చాలా కృషిచేసేవాడిని. దానికి సంబంధించిన వాఙ్మయమును సేకరించి అధ్యయనము చేసి, అసెంబ్లీలో నాకు మించిన స్థాయిలో రాణించగలిగాను. పార్టీ కార్యకలాపాలలో కూడా ఎక్కువగానే పాల్గొనేవాడిని. పార్టీ సభ్యత్వము పొందినవారు క్రమశిక్షణతోపాటు, పార్టీకి సంబంధించిన వాఙ్మయము, ఇతర పార్టీలను గురించి కూడా అధ్యయనము చేయవలసిన అవసరము ఉంటుంది. పార్టీ క్రమశిక్షణ, పార్టీ కమిట్‌మెంట్ పార్టీ సభ్యులకు గీటురాయిగా ఉండాలి. పార్టీలో అభిప్రాయ భేదములు వచ్చినంతమాత్రమున చీలిక పోకడలకు దారితీయరాదు. చీలిక పోకడలకు పాల్పడితే తమ భావములను సాధించలేకపోగా, పార్టీని చాలా బలహీనపరచటము జరుగుతుంది. మార్క్సిస్టుపార్టీ ఈ రోజున పశ్చిమ బెంగాలులో అధికారములో కొనసాగినా, దేశంలో ఉభయ కమ్యూనిస్టు పార్టీలు బలహీనపడినవి అనే చెప్పాలి. తమ తమ ధ్యేయములకు కొన్ని వేల మైళ్ళ దూరములోనే ఉండిపోయాను అని అనిపిస్తుంది. మన దేశ చరిత్ర, సంస్కృతి, తత్వశాస్త్రాలను బాగా అధ్యయనం చేయాలి. భారతీయ మనస్తత్వాన్ని మనం అవగాహన చేసుకోవాలి. చివరివరకు నా రాజకీయ జీవితంలో కార్మికవర్గ ప్రయోజనాలను నెరవేర్చడంలో శక్తివంచనలేకుండా కృషి చేశాననే సంతృప్తి నాకుంది.

★ ★ ★

# శ్రీ వై. విజయకుమార్



నా జన్మస్థలం గుంటూరు జిల్లా తెనాలి తాలూకాలోని తురిమెళ్ల గ్రామం. 1929వ సంవత్సరంలో మా గ్రామంలో కాంగ్రెస్ నాయకులు కల్లూరు చంద్రమౌళి, నేతి చలపతి, వెలివోలు సీతారామయ్యగారలు సైమన్ కమిషన్‌ను నిరసిస్తూ బహిరంగసభ నిర్వహించారు. నేను ఆ సభకు హాజరయ్యాను. నా వయస్సు అప్పుడు 11 సంవత్సరాలు. వారి ఉపన్యాసాలు విన్నాక అస్పష్టంగా అలవోకగా బ్రిటిష్ సామ్రాజ్య వ్యతిరేక భావాలు నాలో చోటు చేసుకున్నాయి.

భగత్‌సింగ్, రాజగురు, సుఖ్‌దేవ్‌ల ఉరితీత మా గ్రామంలో నాతో సహా కొంతమంది యువకుల లేత మనసులను కలవరపరిచింది. 1933వ సంవత్సరంలో మా వూరిలోని 20 మంది యువకులతో ఒక టెర్రరిస్టు గ్రూపు నిర్మించాము. ముసుగు బట్టలు కుట్టించాము. బెంగాల్‌లోని టెర్రరిస్టులతో సంబంధం పెట్టుకోవాలని ప్రయత్నించి విఫలమయ్యాను. ఏమి చేయాలో తోచలేదు. చివరకు మేము గ్రూపు

నాయకత్వాన యువజన సంఘ నిర్మాణానికి పూనుకొని, దాని ఆధ్వర్యంలో కొన్ని కార్యకలాపాలు నిర్వహిస్తూ వచ్చాము.

నేను 1934లో స్కూల్ ఫైనల్ పరీక్ష పాసయ్యాను. 1929–36 ఆర్థిక సంక్షోభం ఫలితంగా మాకున్న 20 ఎకరాల మాగాణిభూమిలో 14 ఎకరాలు మా నాన్నగారు అప్పులు తీర్చడానికి అమ్మేశారు. కాలేజీ చదువు చెప్పించలేనని ఆయన చెప్పారు. ఒక సంవత్సరకాలం గ్రామంలో ఖాళీగా వుండిపోయాను.

ఈ కాలంలో మా తండ్రిగారు నా చేత వీరేశలింగంగారి రచనలు, స్వామి వివేకానందుని ఉపన్యాసాలు చదివించారు. ఇంగ్లండులో చదువుకొని తిరిగి వచ్చిన మా దాయాది మేనమామ నరహరిగారు, కల్లూరి చంద్రమౌళిగారు, నాకు "ABCD of Communism", పామీదత్తు రచించిన "Doctrine of Communism", జె.టి. సండర్‌లాండ్ రచించిన "India in Bondage" తెచ్చారు. వాటిని వారి దగ్గర తీసుకొని చదివాను. అలాగే నార్ల వారు రచించిన "తురుష్క ప్రజాస్వామ్యం", మరెవరో రచించిన "ఐర్లెండ్ స్వాతంత్ర్య సమరయోధుడు డివెలరా జీవిత చరిత్ర" చదివాను. పై గ్రంథాల అధ్యయనం వలన నాలో హేతువాద దృక్పథం, సామాజిక సంస్కరణలు అవసరమనీ, భారత స్వాతంత్ర్య పోరాటంలో భాగస్వామిని కావాలనే ఆకాంక్ష, కమ్యూనిస్టు సిద్ధాంతంపట్ల ఆకర్షణ ఏర్పడ్డాయి.

అదే సమయంలో నేను యువజన సంఘ కార్యకలాపాల్లో చురుకుగా పాల్గొం టున్నందున కమ్యూనిస్టుగా తీర్చిదిద్దాలనే భావంతో తెనాలిలో కమ్యూనిస్టుపార్టీ నాయకుడైన కామ్రేడ్ మాధవాచారిగారు నాతో కలుపుకుని కామ్రేడ్స్ కట్టయ్య, యలమంచిలి లక్ష్మీనారాయణ, పి. వి. సుబ్బారావులతో ఒక పార్టీ సెల్ ఏర్పాటు చేశారు. దీనితో తరువాత మా వూరు వచ్చిన కామ్రేడ్ మోటూరి హనుమంతరావు కలిశాడు. మా చేత ముంగండవారి "గతితార్కిక భౌతికవాదం", "విలువ – ఖరీదు – లాభం", "మీరట్ కుట్ర కేసు డాక్యుమెంట్లు" వగైరా చదివించారు. తద్వారా నేను పూర్తి కమ్యూనిస్టుగా పరిణతి చెందాను.

అదే కాలంలో మోపర్రు, యింటూరు, కావూరులలో మహాత్మా గాంధీగారు మాట్లాడిన బహిరంగ సభలకు హాజరయ్యాను.

1936 మొదటి అర్ధభాగంలో నేను చిత్తూరు జిల్లాలో స్టెనో టైపిస్ట్‌గా ఉద్యోగం చేస్తూ చిత్తూరులోనూ, చంద్రగిరిలోనూ విద్యార్థి సంఘాలు నిర్మించి సమ్మెలు చేయించాను. దానితో బ్రిటిష్ జిల్లా కలెక్టర్ నన్ను ఉద్యోగంనుండి డిస్మిస్ చేశాడు.

1936 రెండవ అర్ధభాగంలో తెనాలిలో ఒకే రోజు వేరు వేరుగా జరిగిన పండిట్ నెహ్రూ, కామ్రేడ్ డాంగేల మీటింగులకు హాజరయ్యాను. కామ్రేడ్ డాంగే ఉపన్యాసం నాకు బాగా నచ్చింది. భారతదేశంలో నూటికి 80 మందికి పైగా వున్న కార్మికుల, వ్యవసాయ కార్మికుల, శ్రమజీవుల, తదితర అశేష ప్రజానీకం యొక్క స్వరాజ్యంకోసం, ప్రజలందరూ సుఖ సంతోషాలతో మనుగడ సాగించగలిగిన సోషలిస్టు వ్యవస్థ కోసం పోరాడేది భారత కమ్యూనిస్టు పార్టీయేననే భావం నాలో ధ్రువపడింది.

1937లో విజయనగరం కాలేజీలో చేరి, ఇంటర్మీడియెట్, బి.యస్సి.లు పూర్తి చేశాను. విద్యార్థిగా వుంటూనే ఉమ్మడి విశాఖ జిల్లాలో విద్యార్థి యువజన సంఘాల నిర్మాణానికి, పార్టీ నిర్మాణానికి కృషి చేశాను. 1937లో నాకు పూర్తి పార్టీ సభ్యత్వం లభించింది.

1941లో బి.యస్సి. పరీక్షలో రాష్ట్రంలోనే మొదటి రాంక్ పాసయ్యాక, యం.యస్సి.లో సీటు వచ్చిన సందర్భంలో కామ్రేడ్ చండ్ర రాజేశ్వరరావుగారి సలహాను పాటించి చదువుకు స్వస్తి చెప్పి, కమ్యూనిస్టు పార్టీ హోల్ టైమర్‌గా పని చేయడం ప్రారంభించాను.

★ ★ ★

# శ్రీ వేములపల్లి శ్రీకృష్ణ



"నేను ఎలా కమ్యూనిస్టు నయ్యాను?" అనే ప్రశ్నకు ఆరు దశాబ్దాల తర్వాత సమాధానం చెప్పా లంటే అంత తేలిక కాదు. సమాజంలో వర్గ దోపిడీకి గురి కాబడి, దానికి ప్రతిఘటనగా పుట్టిన ఉద్యమ భాగ స్వామిగా కమ్యూనిస్టు గావచ్చు లేదా ఒక అసాధారణ ఘటన ఒక్కొక్కరి జీవితంలో కమ్యూనిస్టుగా మారేందుకు కారణం కావచ్చు. నా విషయంలో ఆ రెండూ లేవు. అందుకే నా మనోభావాలు రూపుదిద్దుకున్న తీరు తెన్నుల వివరణ అవసరమయింది.

ఒక మధ్యతరగతి రైతు కుటుం బంలో పుట్టి, ఏడు కుటుంబాల మధ్య ఒకే ఒక సంతానం కావటం వల్ల అల్లారు ముద్దుగా పెంచారు. కాస్త వయసొచ్చింది మొదలు మోసమంటే సహించలేక పోయేవాణ్ణి. అన్యాయం జరుగుతోందంటే ఆందోళన చెందేతత్వం. ఇలాంటి ఘటనలు జరిగినప్పుడు ప్రతీకారానికి పూనుకున్న ఘటనలు యిప్పటికీ నాకు గుర్తున్నాయి. గ్రామ కక్షలు నా మనసుకు నచ్చేవిగాదు. వాటికి అతీతంగానూ, దూరంగానూ వుండేవాడిని. అందుకేనేమో మా గ్రామంలో అన్ని ముఠాలకు చెందినవాళ్ళూ నన్ను వాత్సల్యంతో చూసేవాళ్ళు. ఇది నా చిన్ననాటి జీవితం.

భగత్ సింగ్, రాజగురు, సుఖ్ దేవ్, భాతుకేశ్వరదత్, ఆజాద్‌లను పోరాటాలలో చూడడం, వారిని గురించి తెలుసుకోవటం తరువాత జరిగింది.

నేను రేపల్లె హైస్కూలులో చేరిన తర్వాత బసవ పున్నయ్య, మోటూరి హనుమంతరావు, పరంధామయ్య, పమిడిముక్కల లక్ష్మణరావు, కంఠంనేని వెంకట సుబ్బయ్య, వెంకటరత్నం వగైరాలతో పరిచయం ఏర్పడింది. ఈ అందరిలోనూ హనుమంతరావుతో సాన్నిహిత్యం జాస్తి. వీళ్ళంతా నాకు సీనియర్లు కావటం వల్ల నాకన్నా ముందుగానే హైస్కూలు వదిలివెళ్ళారు.

నేను హైస్కూలు చదువు పూర్తయి 1935లో గుంటూరు ఎ.సి. కాలేజీలో చేరాను. ఇంటర్మీడియెట్ చదివిన రెండేళ్ళూ పైచెప్పిన వాళ్ళకూ నాకూ సంబంధం తెగిపోయింది. మా గ్రామం నుండి కాలేజీలో చేరిన నలుగురం కమ్మ హాస్టలు ప్రక్కన ఒక ఇంట్లో అద్దెకుండే వాళ్ళం. బి.ఎ.లో పోయిన సబ్జెక్టులు పూర్తి చేసుకునేందుకు వచ్చిన అన్నే సంజీవయ్య, కొత్త రాజబాబయ్య, ఇడపలపాటి గోవిందరావు, మోరెంపూడి సుబ్బారావులు మాతో వుండేవాళ్లు. అంతా కులాభిమానంతో సంబంధాలు అయన్ను పెద్దమనిషిలాగా చూసేవాళ్ళం. హాస్టల్ మేనేజిమెంటు జస్టిస్ పార్టీ నాయకుల అధీనంలో వుంది. కాలేజీలో అప్పటికి విద్యార్థి ఉద్యమ ప్రభావం లేదు. నాకు రాజకీయ వాసన తగలలేదు. సోవియట్ విప్లవం గురించి అసలే తెలియదు. జిల్లా బోర్డు ఎన్నికలలో మాత్రం కాంగ్రెస్ తరఫున గోవిందరావు పోటీ చేస్తే మా బ్యాచి వెళ్లి ఆయనకు పని చేసింది. కొసరాజు రామయ్య, ఆచార్య రంగా కేంద్ర కౌన్సిల్‌కు పోటీ చేస్తే "లాఠీ దెబ్బల రామయ్యో లాభం లేదూ పోవయ్యో" అన్న పాటలు విని మాత్రం కాంగ్రెస్‌దే న్యాయమనుకునేవాణ్ణి. కల్లూరి చంద్రమౌళి, చదలవాడ ఉమామహేశ్వరరావులు రాష్ట్ర శాసనసభకు పోటీ చేస్తే, చుట్టరికం వల్ల మా గ్రామంలో రెండు ముఠాల నాయకులు జస్టిస్ పార్టీకి పనిచేశారు. ఈ నాయకుల స్వార్థానికి స్పందించి నేను మా గ్రామం వెళ్ళి కాంగ్రెస్‌కు ఓట్లు సమీకరించటంలో సహాయపడ్డాను. గ్రామ ముఠా నాయకుల పాత్రను బహిర్గతం చేశాం. మా గ్రామంలో జస్టిస్ పార్టీకి పనిచేసిన వ్యక్తి రాష్ట్ర కాంగ్రెస్ సభ్యుడుగా పోటీచేసి గెలిచాడు. ఆయన మీద ఫిర్యాదు చేస్తే నేను ఆయనకు వ్యతిరేకంగా విచారణ కమిటీ ముందు సాక్ష్యం చెప్పాను.

ఈ చెదురుమదురు ఘటనలు తప్ప రాజకీయాల లోతు తెలిసిగాదు. చదువుమీద, స్పోర్ట్స్ మీదా శ్రద్ధ వుండేది. బ్యాడ్మింటన్, కబాడీలలో నేను కాలేజీ క్యాప్టెన్‌ను గూడా.

నేన బి.ఏ.కు వచ్చేసరికి హనుమంతరావు ఇంటర్మీడియట్‌లో చేరాడు. బసవ పున్నయ్య బి.ఏ.కి వచ్చాడు. నాకు హైస్కూల్‌లో సీనియర్ ఐన హనుమంతరావు మధ్యలో ఉద్యోగానికి వెళ్లటం వల్ల అలా జరిగింది. కమ్మ హాస్టల్‌లో మేమిద్దరం ఒక రూంలో వుండేవాళ్ళం. వై. వి. కృష్ణారావు, టి. వెంకటేశ్వరరావు, సి. యల్. నారాయణ, యల్. బి. గంగాధరరావు, మాదాల నారాయణస్వామి హాస్టల్‌లో వుండేవాళ్లు. మొదటి ముగ్గురు బి.ఏ.లోనూ, మిగతా ఇద్దరు ఇంటర్మీడియట్‌లోనూ వున్నారు. బసవపున్నయ్య, కనగాల కుటుంబరావులు క్రామేడ్స్ లాడ్జిలో వుండేవాళ్లు.

ఎ.సి. కాలేజీలో వరుసగా రెండేళ్ళూ రెండు సమ్మెలు జరిగాయి. విద్యార్థులంతా సమైక్యంగా పాల్గొన్నారు. విద్యార్థులంతా ఒకే సంఘం నాయకత్వం క్రింద సమీకరించబడ్డారు. నాయకత్వ పాత్ర కమ్యూనిస్టులదైనా కాంగ్రెస్ అభిమానులూ, ఏ పార్టీకి చెందనివారూ అంతా ఒకే జెండా క్రింద పనిచేశారు. వందమంది విద్యార్థులకు పైగా వుండే కమ్మ హాస్టల్ చాలా చురుకుగా పాత్ర వహించింది. అప్పట్లో హాస్టల్‌లో వున్న అనేకమంది తదుపరి ఏ వృత్తిలో వున్నా దాని ప్రభావం వారిపైన వుంది. యలవర్తి నాయుడమ్మ (సైంటిస్ట్), డాక్టర్ బి.వి.యల్. నారాయణ,

పండా పున్నయ్య, (పారిశ్రామిక వేత్త) లాంటివాళ్ళు హాస్టల్ విద్యార్థులే. ఈ సమ్మేలు చారిత్రాత్మకమైనవే. విద్యార్థుల్లో అభ్యుదయ భావాలకు బీజాలు వేశాయి.

హాస్టల్ వార్షికోత్సవం జరిగితే కమ్యూనిస్టు ఇంటర్నేషనల్ గేయం ప్రార్థనా గేయంగానూ, ఫాసిస్టు కోర్టు అన్న దేశభక్తిని ప్రబోధించే నాటిక, ప్రొఫెసర్స్ పెరాక్సిజం (ఏకపాత్రాభినయం), కన్యాశుల్కం సాంస్కృతిక ప్రదర్శన లివ్వటం జరిగింది. రెడ్‌గార్డ్సు వలంటీర్లుగా పనిచేశారు. ఆ సమయంలో నేను హాస్టల్ కార్యదర్శిని.

కామ్రేడ్స్ పులుపుల శివయ్య, ప్రభల కృష్ణమూర్తి, ఏటుకూరి బలరామమూర్తి, అమరవాది కృష్ణమూర్తి, ప్రతాప రామసుబ్బయ్య (అప్పట్లో కమ్యూనిస్టు కార్యకర్తలు) మాతో సంబంధాలు పెట్టుకున్నారు. బలరామమూర్తి, అమరవాది మాకు మార్క్సిస్టు మూల సూత్రాల బోధనా తరగతులు నడిపారు. “Basic Principles of Socialism” చిన్న పుస్తకం ఆధారం. ఇటీవలి వరకు దానిని దాచి వుంచాను.

కలకత్తాలో జరిగిన అఖిల భారత విద్యార్థి మహాసభకు బసవపున్నయ్య, హనుమంతరావు, కంఠంనేని వెంకటరత్నం, నేను హాజరయ్యాం. కామ్రేడ్ అష్రాఫ్ అధ్యక్షత వహించాడు. సభను ప్రారంభించేందుకు రావలసిన సుభాష్‌చంద్ర బోస్ కారణాంతరాల వలన రాలేకపోతే శరత్‌చంద్ర బోస్ ప్రారంభించటం జరిగింది.

ఆ రోజుల్లోనే చీరాల ఐ.ఎల్.టి.డి. కార్మికుల పోరాటం, కాల్పులూ జరిగాయి. వాళ్ళ సహాయార్థం కన్యాశుల్కం నాటకం ప్రదర్శించి, దాని రాబడి వాళ్ళకు పంపటం జరిగింది.

ఈ దశలోనే నన్ను పార్టీ అగ్జిలియరీ సెల్లులోకి తీసుకున్నారు. కాని, సెల్లు జీవితం కొద్ది రోజుల్లోనే ముగిసింది. బి.ఏ. పూర్తి కావటంతోనే బందరులో హిందూస్తాన్ మ్యూచ్యువల్ ఇన్సూరెన్స్ కంపెనీలో ఉద్యోగంలో చేరాను. శ్రీ గొట్టిపాటి బ్రహ్మయ్య (మేనేజింగ్ డైరెక్టర్) బంధువు కావటం వల్ల అంత త్వరలో ఉద్యోగం వచ్చింది. తెలుగుదేశం ప్రభుత్వంలో మంత్రిగా వున్న కీ॥శే॥ వడ్డే రంగారావు కంపెనీ ఏజంటుగా వుండి తరచు కలుస్తుండేవాడు. ఆనాడు గుంటూరు జిల్లాకు చెందిన మునిపల్లె రామారావు బందరులో ఆర్గనైజరు. బసవపున్నయ్య బి.ఏ.లో మిగిలిపోయిన సబ్జెక్టు పూర్తి చేసేందుకు వచ్చాడు. బసవపున్నయ్య గదిలో మేము కలుస్తుండేవాళ్ళం. మూడు మాసాలు తిరగకముందే కామ్రేడ్ శివయ్య నుండి టెలిగ్రాం రావటంతో ఉద్యోగం వదిలిపెట్టి గుంటూరు వెళ్ళాను. గుంటూరులో సిటీ స్టూడెంట్స్ ఎంపోరియమ్ సోదా జరిగి “స్వతంత్ర భారత్” పట్టుబడటంతో హనుమంతరావు రహస్య జీవితం గడపవలసిన అవసరం గలిగింది. అప్పటికీ నేను కమ్యూనిస్టుగా కొద్దిమందికి తప్ప తెలియదు. రహస్య యంత్రాంగం నిర్వహణలో బాధ్యత యిచ్చారు. జిల్లా కమిటీ రహస్య కేంద్రంలో వుండేవాడిని. బసవపున్నయ్య, నాళం నరసింహారావు, హనుమంతరావు డెన్‌లో వుండేవాళ్లు. బయటి కాంటాక్టు డి.వి. అప్పారావు.

ఇప్పటికింకా నాకు ప్రజా ఉద్యమాలతో సంబంధం లేదు (విద్యార్థి ఉద్యమంతప్ప). రహస్య జీవితంలో సి.పి.యస్.యు. చరిత్ర ఒక్క కాపీ మాత్రమే సర్క్యులేట్

అవుతోంది. పామీదత్తు "నేటి భారతదేశం" అప్పుడే వచ్చింది. ఆ కాపీలు తిరిగి పంపాలి. కనుక, హనుమంతరావు నేనూ వాటిని మొత్తం కాపీ వ్రాసుకున్నాం. సిద్ధాంత అధ్యయనం మీద నాటి శ్రద్ధను తెలిపేందుకే ఇది ఉదాహరిస్తున్నాను. రహస్య యంత్రాంగ నిర్వహణ బాధ్యతకుముందు రైల్వే కార్మికరంగంలో పనిచేసేందుకు శిక్షణ కోసం బెజవాడ పంపారు. అప్పటికే టి.వి. ఆ రంగంలో పని చేస్తున్నాడు. నూతక్కి రంగారావు అక్కడే వున్నాడు. గ్యాంగ్‌మన్ కాంటాక్టు కోసం రంగారావు నన్ను వెంటబెట్టుకొని సత్తెనపల్లిలో రైలు దిగి బెల్లంపల్లిదాకా పట్టాల వెంటబడి తీసుకెళ్ళాడు. స్టేషన్లలో అమ్మే పప్పుచెక్క మాకు ఆహారం. రుక్కయ్య హోటల్‌లో యిచ్చే పెసరట్టు, కాఫీలతో రోజంతా గడిపి పనిచేసే నాటి కమ్యూనిస్టులు మాకు ఆదర్శ మూర్తులయ్యారు.

నాటి అనుభవాలవల్ల నా మనసుకు తట్టిన అభిప్రాయాలు చెప్పటం మంచి దనుకుంటున్నాను. కోటాలను పూర్తి చేసేందుకు సభ్యత్వాన్ని చేర్పించే ప్రయత్నానికి స్వస్తి చెప్పటం మంచిది. కార్యదక్షత గల పార్టీకి కొన్ని ప్రత్యేక లక్షణాలుండాలి.

పార్టీ సభ్యులు నీటిలో చేపల్లాగా అనునిత్యం ప్రజల్లో కలసి మెలసి మెలగాలి. సంచి బుజానవేసుకొని కేంద్రం నుండి బయలుదేరితే వారం రెండు వారాలపాటు గ్రామం తర్వాత గ్రామం వెళ్ళి, శాఖ సమావేశాలు, జనరల్‌బాడీలు జరుపుతూ తాజా సమాచారం అందిస్తూ ప్రజల దైనందిన సమస్యలపై స్పందించి పనిచేసే లక్షణం అన్ని స్థాయిల్లో అలవర్చుకోవాలి. ఏదైనా అన్యాయం జరిగితే దానికి స్పందించి ప్రతిఘటనకు పూనుకునే దక్షత వుండాలి. తప్పుకు పోవటం కమ్యూనిస్టుల లక్షణం కాదు.

సెలయేటినీళ్ళు మురిగిపోవు. కదలిక లేని గుంటలో నీళ్ళు మురిగిపోతాయి. చలనం గల పార్టీలో అవలక్షణాలు పేరుకుపోవు. స్తబ్దతలోనే దానికి అవకాశముంటుంది.

పార్టీలో నిర్మొహమాటంగా మాట్లాడుకునే లక్షణం వుండాలి. ముఖస్తుతి హాని చేకూరుస్తుంది. మనసులో వున్న మాట బయట చెప్పగల ధైర్యం అలవర్చుకోవాలి. అలాగైతే పార్టీ తక్కువ తప్పులు చేస్తుంది. సకాలంలో సరిదిద్దుకో గలుగుతుంది.

నీతి నియమాల్లో నిప్పుల్లాంటివాళ్ళని కమ్యూనిస్టులకు ప్రతీతి వుంది. ఇప్పుడెంత వరకుందని ఆత్మపరిశీలన అవసరం.

విభేదించిన వాళ్ళకు ముద్రలు వేసే అలవాటు మానుకుని భిన్నాభిప్రాయాలను గూడా ఓపికగా పరిశీలించటం అవసరం. ప్రపంచ కమ్యూనిస్టు ఉద్యమం ఇలాంటి పొరపాట్లు చేసి దిద్దుకోవటం మొదలుపెట్టింది. కొందరికి మరణానంతర పునరావాసాలు గూడా జరిగాయి.

అధ్యయనం చాలా అవసరం. అధ్యయనం అంటే ప్రామాణిక గ్రంథాల పఠనమే గాదు – వాస్తవ పరిస్థితుల అధ్యయనం. ఈ పని చేయకుండా ధ్యేయానికి చేరుకోవాలంటే కళ్ళు మూసుకుని పిచ్చుకను పట్టే ప్రయత్నం లాగా వుంటుంది. పార్టీ పరువును స్వప్రయోజనాల కోసం పణంగా పెట్టరాదు.

ప్రతి విషయాన్ని విమర్శనా దృష్టితో పరిశీలించటం కమ్యూనిస్టు లలవర్చుకోవటం అవసరం. గురువులు చెప్పిందే సూత్రమనుకునే భక్తుల మనస్తత్వం కమ్యూనిస్టులకు

పనికిరాదు. చెప్పే మాటకూ - చేసే పనులకూ దూరం పెరిగిన కొద్దీ ప్రజలకూ - పార్టీకి అగాధం పెరుగుతుంది. ప్రజలకు పార్టీ మీద నమ్మకం సన్నిగిల్లుతుంది. తప్పులు ఎవరు చేసినా తప్పే. తనకు యిష్టులు చేసినంత మాత్రాన తప్పు తప్పుకాకుండా పోదు. ప్రతి విషయాన్నీ నిజాయితీతో అంచనా కట్టటం అవసరం. లక్ష్యశుద్ధి వున్నచోట ఈర్ష్య, అసూయలకు తావులేదు.

వేళ్ళు భూమిలో లోతుగా నాటుకోకుండా పైన వేసే వున్న చెట్టు ఎంత పెరిగితే అంత తలపడే ప్రమాదం వుంది. అందుకే ప్రజా పునాదిని పెంచుకోవలసిన అవసరం వుంది.

పార్టీ విస్తరించిన కొద్దీ సమాజం యొక్క ప్రభావం పడుతుందని సమర్థించుకోవటం సరిగాదు. నాటికీ, నేటికీ పార్టీ ఎంత పెరిగిందనే ప్రశ్న ముందు వేసుకోవాలి. ప్రజల ఆదరణనుబట్టి మన పెరుగుదలను కొలుచుకోవలసి వుంది. పైన చెప్పినవి సూక్తులు గాదు - అనుభవం మనకు చూపెడుతున్న మార్గదర్శక సూత్రాలని భావిస్తున్నాను. దీర్ఘరోగి సగం వైద్యుడు, పార్టీ సుదీర్ఘ చరిత్రలో తప్పుల్లో ఒప్పుల్లో పాలు పంచుకున్నాం. వాటి లాభనష్టాలు అనుభవించాం. ఆ దృష్టితో చెప్పిన విషయాలుగా భావించండి.

నా అనుభవంలో యువతరానికిచ్చే సలహా యిదే: మనసులోని అభిప్రాయాన్ని నిర్మొహమాటంగా చెప్పటం అలవర్చుకోండి. ప్రజల దైనందిన సమస్యలు తీసుకొని వారితో సాన్నిహిత్యం పెంచుకోండి. చెప్పే మాటలకూ, చేసే పనులకూ దూరం పెరిగేకొద్దీ నీకు ప్రజలు దూరమవుతారు. సిద్ధాంతం పరిజ్ఞానంతోపాటు వాస్తవ పరిస్థితుల అధ్యయనం అవసరం. నీతి నిజాయితీల్లో నికార్సయిన వాళ్లని కమ్యూనిస్టులకున్న ప్రతిష్టను నిలబెట్టండి.

★ ★ ★

# శ్రీ ఎన్. శివరామిరెడ్డి



నన్ను అప్పుడప్పుడు కొందరు అడుగుతూ వుంటారు – 'నీవు కాంగ్రెసులో వుండి వుంటే, లేదా మరో పార్టీలో వుండి వుంటే మంచి అధికార పదవులు దక్కివుండేవి కదా, కమ్యూనిస్టు పార్టీలో యాభై ఏండ్లు కష్టపడినా ఫలితం ఏముంది?' అని. ఈ ప్రశ్నలు నాలో గిలిగింతలు పెట్టలేదు గానీ, కొంత బాధ, కొంత తృప్తి కలిగించేవి. బాధకు కారణం ఆ ప్రశ్న వేసేవారు విలువలకు ఇచ్చే ప్రాధాన్యత అలాంటిది కావటం వల్ల. తృప్తి ఎందుకంటున్నానంటే, అటువంటి అవకాశాలు ఒకవేళవుంటే వాటిని వదులుకొని మంచి బాటను ఎంచుకున్నందుకు.

నిజంగానే నాతో పాటు ఆనాడు చదివిన వారు ఎంతోమంది మంచి పదవులు, ఉద్యోగాలు సంపాదించుకున్నారు. సుఖ జీవితాలు గడుపుతున్నారు. నాతోపాటు చదివిన అయ్యపురెడ్డిగారు మంత్రి పదవి చేశారు. పెద్ద లాయరుగా దండిగా సంపాదించారు. మరొక క్లాస్‌మేట్ పి. సి. రెడ్డిగారు హైకోర్టు చీఫ్ జస్టిస్‌గా రిటైర్డ్ అయ్యారు. మరొక మిత్రుడు సి. వి. కొండారెడ్డిగారు ఫారెస్టు డిపార్టుమెంటు

చీఫ్ కన్సర్వేటర్‌గా పని చేశారు. యస్. వి. యూనివర్సిటీ వైస్ ఛాన్సెలర్‌గా పని చేసిన శాంతప్పగారు నా క్లాస్‌మేటే గాకుండా నా బెంచిమేట్ కూడా. ఇంకెంతోమంది చిన్నవి, పెద్దవి ఉద్యోగాలు, పదవులు అలంకరించారు. ఎక్కడైనా తారసిల్లినపుడు వారు నా మీద సానుభూతితో, గౌరవ భావంతో పలకరిస్తారు – సౌఖ్యాలు వదులుకొని ముళ్ళబాట ఎంచుకున్నందుకు. అయినా, వారందరిలో లేని మానసిక ఆనందం, తృప్తి నాలో ఎప్పుడూ వుంటోంది. సంపాదనకంటే సంఘానికి చేస్తున్న సేవే ఆ ఆనందానికి కారణం. ఆ బాటలో నన్ను స్థిరంగా నడిపించింది. కమ్యూనిస్టు సిద్ధాంతమే. అందుకు నేను గర్విస్తున్నాను. అదృష్టం అని చెప్పడానికి కారణం ఇంత మహోన్నతమైందని మొదట తెలిసి ఎంచుకోలేదు గనుక.

ఆ బాటలో ఎలా పడ్డాను? నే నెలా కమ్యూనిస్టు అయ్యాను? స్థిరంగా ఎలా నిలబడ్డాను? సి.పి.ఐ.లోనే ఎందుకొనసాగుతున్నాను? ఈ ప్రశ్నలు సమాధానం నా యాభై ఏండ్ల కమ్యూనిస్టు రాజకీయ జీవితాన్ని రేఖామాత్రంగానైనా తడివితే సరిపోతుందనుకుంటాను.

1930, 1940 దశకాలు భారత స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో ముఖ్యమైన దశలుగా పేర్కొనవచ్చును. ఎందుకంటే, ఆ ఉద్యమం ప్రజల్లోకి ప్రాకింది. ఆ కాలంలోనే గాంధీగారి ఉప్పు సత్యాగ్రహం కంటే కూడా జిల్లా బోర్డు ఎన్నికలు, 1937 శాసనసభా ఎన్నికలు తప్పనిసరిగా ప్రజలందర్నీ, ముఖ్యంగా రైతాంగాన్ని ప్రభావితం చేశాయి. అప్పుడు వయోజన ఓటింగ్ లేదు. గ్రామాల్లో భూమి పన్ను చెల్లించేవారికే ఓటు హక్కు వుండేది. కాంగ్రెస్, జస్టిస్ పార్టీలకు మధ్య పోటీగా ఆ ఎన్నికలు జరిగాయి. కాంగ్రెస్ స్వతంత్రం కొరకు పోరాడే పార్టీగా, జస్టిస్ పార్టీ బ్రిటీషు ప్రభుత్వం ప్రాపుతో కాంగ్రెసును అడ్డుకుంటున్న పార్టీగా ప్రజలు చూశారు. జస్టిస్ పార్టీ ఓడిపోయింది. జస్టిస్ పార్టీది ఎర్ర రంగుపెట్టె, కాంగ్రెసుది పసుపు రంగు పెట్టె. "ఎర్రపెట్టె వద్దకు వెళ్ళొద్దు బాబు, పచ్చపెట్టెలో ఓటు పడవేయి బాబు" 'అన్న పాట ప్రశస్తిలో వుండేది. 'ఓటు విలువ తెలుసుకోరన్నా, ఒక పూట తిండికి ఓటు వేయుట సిగ్గుచేటన్నా" అన్నపాట కూడా ప్రచారంలో వుండేది. ఈ పాటల్లో గొప్ప సాహిత్యం లేదనుకున్నా ఉత్తేజం కలిగించే ఉద్బోధ అందులో తొణికిస లాడింది. మా కుటుంబం బండి కట్టుకొని మూడు మైళ్ళ దూరంలో నున్న పోలింగ్‌కు వెళ్ళి కాంగ్రెసుకు ఓటు వేసింది. అప్పుడు నా వయస్సు 13–15 సంవత్సరాలు.

మా నాయనగారు రాయించిన జాతకాన్నిబట్టి నా పుట్టిన సంవత్సరం 1922. ఆ రోజుల్లో ఇంగ్లీషు చదువులు అరుదు. పెద్దవాళ్ళకే అబ్బేవి. మా తాలూకాలో నేనే ప్రథమ 'లా' కాట్ ననుకుంటా. మా నాన్న నా కొరకు ఒక ప్రైవేటు ఇంగ్లీషు బడి పెట్టించి మంచి ఇంగ్లీషు టీచర్‌కు అప్పగించారు. నేను పెద్ద డాక్టరునో, ఇంజనీర్నో లేదా పెద్ద అధికారినో కావాలని ఆశించారు. నా చదువుకు సంకోచించకుండా డబ్బు పంపేవారు. కానీ ఇందుకు విరుద్ధంగా కమ్యూనిస్టు రాజకీయాలలో ప్రవేశిస్తానని కలలో కూడా ఊహించలేదు. అది నిజంగానే ఊహాకందని విషయం.

నేను పులివెందుల హైస్కూలు నుండి 1939లో స్కూలు ఫైనల్ పూర్తిచేసి, అనంతపురం కాలేజీలో చేరి, 1943లో డిగ్రీ పుచ్చుకొని, మద్రాసు 'లా' కాలేజీలో చదివి, 1945లో "లా" డిగ్రీ ప్యాసయ్యాను. 1946లో బార్‌కౌన్సిల్ టెస్టు ప్యాసయ్యాను. లాయర్‌గా సన్నద్ తీసుకోవాల్సిన సమయంలో దానికి స్వస్తి చెప్పి కమ్యూనిస్టు ఉద్యమంలో చేరాను. లాయర్‌గా సన్నద్ పొందడానికి ఆ రోజుల్లో ఒక సంవత్సరం అప్రెంటీస్ షిప్ పూర్తి చేయాలి. దానిని కూడా పూర్తి చేశాను. కానీ దానితో పాటు కమ్యూనిస్టు ఉద్యమంలో ఒక సంవత్సరం ప్రొబెషన్ పూర్తి చేసి, 1947లో పూర్తి స్థాయి పార్టీ సభ్యుడ నయ్యాను.

నా 48 సంవత్సరాల పార్టీ జీవితంలో 27 ఏండ్లు జిల్లా కమిటీ కార్యదర్శిగా పని చేశాను. ఇది ఒక విశేషమే. ఈనాటి ఆలోచనలకు పూర్తి విరుద్ధం. వై. ఈశ్వరరెడ్డి, పంజం నరసింహారెడ్డి, గజ్జల మల్లారెడ్డి, జె. వెంకట్రామరెడ్డి, పొన్నతోట వెంకటరెడ్డిలాంటి ప్రముఖులు సహచరులుగా ఇంత సుదీర్ఘకాలం నేనీ బాధ్యత నిర్వహించడం నాకే ఒకసారి ఆశ్చర్యం కలిగిస్తుంది. భేదాభిప్రాయాలు,, చర్చలు, విమర్శలు, ఆత్మవిమర్శలు ఐక్యతకు అడ్డువచ్చేవికావు. ఐక్యతకు ఉపకరించాయి కూడా. ఈ కీలక స్థానంలో కొనసాగడానికి నేను అకడమిక్‌గా బి.ఎ., బి.యల్ చదివినందువల్లకాదు. లేదా, పలుకుబడి కలిగిన కుటుంబం నుండి వచ్చిన కారణం కూడా కాదు. తరిమెల నాగిరెడ్డి, నీలం రాజశేఖరరెడ్డి గారిలాగా మాది రాజకీయ కుటుంబంకాదు. మాకు అనాటికి సుమారు 150 ఎకరాల మెట్ట భూమి వుండేది. మా చిన్నాయనగార్లు కాడి కట్టుకొని సేద్యానికి పోయేవారు. వ్యవసాయంలో మిగిలిన డబ్బుతో మా నాయన నిర్వహిస్తూ వచ్చిన దస్త్రం క్రమం పెరుగుతూ, ఒక భూస్వామి కుటుంబంగా తయారైంది.

జిల్లా కార్యదర్శిగా తోడి మిత్రుల మన్ననలు పొందడానికి వున్న కారణం ఒక్కటే. కమ్యూనిస్టు ఆశయం రగిలించిన స్ఫూర్తితో 1948-51 మధ్య నడిపిన భీకర పోరాటాలు, చేసిన త్యాగాలు, కదిలిన జన సమూహం నన్నా బాధ్యతలోకి నెట్టాయి.

ఇంతకు నా మొదటి ప్రశ్నకు సమాధానం రాలేదు – 'నేనెలా కమ్యూనిస్టు నయ్యా'నని! 1939-45 కాలం మన స్వాతంత్ర్యోద్యమ చరిత్రలో తుది దశగా పేర్కొనవచ్చును. 1939లో ప్రారంభమైన రెండవ ప్రపంచ యుద్ధం 1945తో ముగిసింది. భారత్‌తో నిమిత్తం లేకుండా మన దేశాన్ని బ్రిటీష్ ప్రభుత్వం రెండవ ప్రపంచ యుద్ధంలోకి లాగినందుకు నిరసనగా 1937లో రాష్ట్రాల్లో ఏర్పడిన కాంగ్రెసు మంత్రివర్గాలు 1939లో రాజీనామా చేశాయి. 1941లో యుద్ధానికి వ్యతిరేకంగా గాంధీగారు యిచ్చిన వ్యక్తి సత్యాగ్రహం పిలుపు, 1942లో క్విట్ ఇండియా విజృంభణ, 1946లో ఆజాద్ హింద్ ఫౌజ్ నాయకుల ఎర్రకోట ట్రయల్స్ భారతదేశాన్ని ఆమూలాగ్రంగా కదిలించాయి. ఆ రోజుల్లో నేను అనంతపురం, మద్రాసుల్లో చదివాను. ఆ చదువుతున్న కాలంలోనే నేను కమ్యూనిస్టు సిద్ధాంతంవైపు మొగ్గాను. అనంతపురం కాలేజీలోనూ, బయట నెలకొన్న సంచలనాత్మక వాతావరణం – నన్ను బలంగా ఆవైపు ఆకర్షించింది. ఆరోజుల్లో సదాశివన్, తరిమెల నాగిరెడ్డి, నీలం

రాజశేఖరరెడ్డి గార్లు విద్యార్థులకు స్టడీ క్లాసులు పెట్టేవారు. శివరావు బంగ్లాలో జరిగిన స్టడీక్లాసులకు నేను హాజరయ్యేవాడిని. కాలేజీ ప్రిన్సిపాల్‌కు, కాశ్మీర్ వి.కె.కు మధ్య జరిగిన ఘర్షణ వి.కె. గార్ని హీరోగా మార్చింది. అది విద్యార్థుల్లో మంచి ప్రభావం కల్గించింది. 1942 ఘటనల్లో భాగంగా అనంతపురం కాలేజి లాబరేటరీని తగులబెట్టారు. ఆ కేసులో కమ్యూనిస్టు నాయకులమీద ఛార్జీ షీటుపెట్టి కోర్టులో ట్రయల్ జరిగినప్పుడు అది సంచలనం సృష్టించింది. బళ్ళారి రాఘవ డిఫెన్సు లాయరుగా వాదించి కేసు కొట్టివేయించారు.

నేను అనంతపురం కాలేజీలో చదివేటప్పుడు ఒక సంఘటన జరిగింది. లండన్‌లో చదివి ప్రిన్సిపాల్‌గా వచ్చిన కె. పి. జి. మీనన్ బ్రిటీషు ప్రభుత్వ సభలో నమ్మినబంటు, బ్యూరోక్రాట్. ఒకరోజు విద్యార్థులు వరండాలో అటు, ఇటు తిరుగుతుండటం సహించలేకపోయారు. దోమల్లాగా ఎందుకు తిరుగుతున్నారని విద్యార్థులను నీచంగా మాట్లాడినాడు. ఇది విద్యార్థుల్లో పెద్ద చర్చనీయాంశం అయింది. విద్యార్థులు సమావేశమై ప్రిన్సిపాల్ అపాలజీ యివ్వాలని పట్టుపట్టారు. ఆ రోజుల్లో డిటెన్షన్ విధానం అమల్లో వున్నందున మంచి మెరిట్ విద్యార్థులను ప్రిన్సిపాల్ వద్దకు అపాలజీ అడగడానికి రాయబారం పంపారు. అందులో నేను ఒకణ్ణి కావటమే గాక ప్రిన్సిపాల్‌తో గట్టిగా వాదించాను కూడా. ప్రిన్సిపాల్ అపాలజీ యిచ్చాడు. నేను డిగ్రీ పాసయి కాండక్టు సర్టిఫికెట్టుకు అప్లయి చేసినపుడు, కాలేజీ పరిపాలనలో చిక్కులు కల్గిస్తానని ఒక పనికిరాని సర్టిఫికెట్ నాకు పంపాడు. దీనివల్ల నేను అలహాబాదుకు యం.ఏ., యల్.యల్.బి.కి వెళ్ళటం విరమించి, ఆటంకాలను అధిగమమించి మద్రాసు 'లా' కాలేజీలో చేరవలసి వచ్చింది. నా భావాలు గట్టిపడినాయి. మద్రాసులో యస్.యఫ్ వారు నడుపుతున్న యం.యస్.ఓ. హాస్టల్‌లో చేరాను.

కమ్యూనిజాన్ని గురించి తెలుసుకోవాలన్న తపన నాలో ఎక్కువైంది. 1930 దశకంలో వెబ్బు దంపతులు రష్యాలో పర్యటించి రాసిన ఉద్గ్రంథం 'కమ్యూనిజం ఒక కొత్త నాగరికత' నన్ను ప్రభావితం చేసింది. ఈ గ్రంథాన్ని నెహ్రూగారు కూడా చాలా మెచ్చుకున్నారు. రష్యాలో ఆనాడు కమ్యూనిస్టులు మిషనరీల్లాగా పని చేయటం వెబ్బుకు ఆశ్చర్యాన్ని కలిగించింది. బ్రిటీషు కార్మిక నాయకులైన వెబ్బు దంపతులు రాసిన ఈ గ్రంథం మేధావులను కమ్యూనిజమ్‌వైపుకు ఆకర్షించింది.

1948-51 మధ్య జరిగిన ఘటనలు నా జీవితంపై చెరగరాని ముద్ర వేశాయి. ఉత్తేజం, విశ్వాసం పొందిన పేద ప్రజలు ఎంతటి త్యాగాలు చేస్తారో, వారి ప్రేమ ఎలాంటిదో క్లోజప్‌లో చూశాను. జీవితాంతం ప్రక్కదారి మళ్ళకుండా నన్ను స్థిరంగా ఒకే బాటమీద నడిపించాయి.

మార్క్సు, ఏంగిల్స్, లెనిన్ జీవిత చరిత్రలు మరీ మరీ చదివాను. కమ్యూనిస్టు సంస్కృతికి వారు ఉత్తమ ప్రతీకలు. వారి జీవితాలు నా నమ్మకాలను ధ్రువపరిచాయి. వారి జీవితాల్లో విశ్వాసాలకు, ఆచరణకు మధ్య వ్యత్యాసం, వైరుధ్యం కనపడదు. వారిది విప్లవ సిద్ధాంతం; విప్లవ జీవితం. అలాగే నేను మన జాతీయ నాయకుల జీవిత చరిత్రలు కూడా చదివాను. స్వతంత్ర పోరాటంలో వారు చేసిన త్యాగాలను

మనం విస్మరించరాదు. కమ్యూనిస్టులు ప్రపంచ సంస్కృతికి వారసులు కావాలని లెనిన్ చెప్పిన మాటలు మన స్మృతిపథంలో వుండాలి.

1964లో పార్టీ చీలినప్పుడు నేను మాతృసంస్థలోనే వుండిపోయాను. అది నాకు సహజమని అనిపించింది. స్వేచ్ఛ, ప్రజాస్వామ్యం, అంతర్జాతీయత నాకు సి.పి.ఐ.లోనే మిగతా వామపక్షాలకంటే ఎక్కువగా కనిపిస్తాయి. పిడివాదం, ఒంటెత్తు విధానం, దుందుడుకు విధానం సి.పి.ఐ.లో తక్కువ. అందుకే నేను సి.పి.ఐ.లో కొనసాగుతున్నాను.

నేనూ, కామ్రేడ్ జె.వి. 1947లో పార్టీలో చేరినప్పుడు మా నుండి కామ్రేడ్స్ ఎంతో ఆశించారు. వారి ఆశలను వమ్ము చేయలేదు. వారి నమ్మకాలకు అనుగుణ్యంగానే నేటికీ ఎత్తిన జెండా దించకుండా నిలబడ్డానని గర్విస్తున్నాను.

★ ★ ★

# కీ.శే. జోశ్యభట్ల సత్యనారాయణ



మాది బ్రాహ్మణులలో సనాతన ఛాందస కుటుంబం. బ్రాహ్మణులలో వైదికశాఖ, దానిలో తెలగాణ్యుల ఉపశాఖ. మా తాత, తండ్రులు వేదాధ్యయనపరులు. అయితే, మా తండ్రి అన్నదమ్ములలో, మా తండ్రి సుబ్బయ్యగారు, పాతగాడితప్పి, ఆ రోజులలో 7వ తరగతి చదివి, రెండు గోదావరి జిల్లాలు (తూర్పు, పడమర) ఒకటిగా వున్న దశలో అనేక గ్రామాల్లో, స్కూళ్లలో టీచరు పని చేసి, చివరకు; రాజమండ్రిలో, స్వర్గీయ చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి యాజమాన్యాన నిర్వహింపబడుతున్న రామమోహన మిడిల్ స్కూలు (లక్ష్మీవారపు పేట)లో టీచరుగా చేరారు. చాలా కాలం. చిలకమర్తివారి మిత్రుడుగా వుంటూ, చివరకు 1921 వేసవి సెలవులలో, మా స్వగ్రామమగు యేనుగుల మహల్ (మందపల్లి) గ్రామంలో జబ్బు చేసి మరణించారు. దానితో మా కుటుంబానికి తిప్పలు ప్రారంభమయినాయి. అప్పటికి నాకు 9 సం॥ల వయస్సు.

అప్పటికి మా అన్నకు చదువు 9 వ తరగతి మాత్రం పూర్తయింది. స్కూలు ఫైనల్ ప్యాసయి సంపాదనలో పడి, కుటుంబాన్ని పోషించవలసియున్నది. సహాయపడే బంధువులు లేరు.

అయితే, మా పినతల్లి, మాకొక సలహా చెప్పింది. మా బ్రతుకుతెరువుకు, అన్న చదువుకు, మా అక్కగార్ని 50 సంవత్సరాల వృద్ధ వరునకు అమ్మమని సలహా చెప్పింది. ఆయనకిది 3వ పెళ్ళి. పిల్లలు లేరు. మొదటి యిద్దరు భార్యలు చనిపోయారు. మా తల్లి, అన్న ముందు అంగీకరించలేదు. చివరకు గత్యంతరం లేక, ఒత్తిడికి లొంగి అంగీకరించారు. ఆ రోజుల్లో కన్యాశుల్కం నడుస్తోంది. వరుడు 1200/– యివ్వడానికి అంగీకరించాడు. అయితే, మా పినతల్లి దానిని రూ. 1400/– లకు పెంచి సహాయపడింది.

పెళ్ళయింది. పిమ్మట అల్లుడుగారికి వండి పెట్టడానికి మా అమ్మ పిల్లతో సహా వెళ్ళివుంటే, రజస్వలకాకుండానే, శోభనం చెయ్యమని పట్టుబట్టి చేయించుకున్నాడు. మొదటి రాత్రే పిల్ల భయపడిపోయి, బైటకు పరుగెత్తివచ్చి, "అమ్మో, నన్ను చంపెయ్యండే. లేకపోతే అతడే చంపుతాడే" అని యేడిస్తే, చివరకు భూతం పట్టిందని, భూతవైద్యంలో కొట్టి హింసిస్తూంటే, నేను, మా అక్కతో బాటే ప్రక్కన కూర్చొని యేడ్చేవాడిని. ఇదొక ఘట్టం.

ఇక, మా అన్నగారి పెళ్ళికొరకు, మా చెల్లెల్ని ఫిరాయింపుగా, రెండవ పెళ్లివానికిచ్చి చేయాల్సి వచ్చింది. అయితే రజస్వలయిన మర్నాడే, శోభనం చేసేసరికి, దాని పరిస్థితి పైస్థితిగానే దిగజారింది.

ఈ ఘటనలు నా మనస్సుపై చెరగని ముద్రలు వేశాయి. అప్పటికి నా స్కూలు ఫైనలు 1934 ఏప్రిల్‌కు పూర్తయి, పైచదువు మానేయవలసివచ్చింది.

ఇవి యిలా వుండగా నేను 2వ ఫారం నుండి మా వాళ్ళు వద్దన్నా రాజమండ్రిలో వారాలు చేసుకుని తింటూ చదువుతుండగా, ఉప్పు సత్యాగ్రహం రావడం, కాంగ్రెస్ నాయకుల శ్రద్ధానంద ఘాటు ఉపన్యాసాలు ఉద్రేకపరిస్తే, చదువు మాని, ఉప్పు సత్యాగ్రహ వాలంటీర్లు దళాల్లో చేరిపోయి పని చేయడం, సత్యాగ్రహం అనంతరం, తిరిగి చదువు కొనసాగించడం జరిగింది.

అయితే, దీనికి పూర్వమే 1922లోనే సహాయ నిరాకరణ ఉద్యమం రోజుల్లో రాజమండ్రిలో చదువుతున్న మా అన్న ఉద్రేకి అయి, కోరా ఖద్దరు గుడ్డతో నాకు పైజామా, లాల్చీ, టోపీ కుట్టించుకువచ్చి నాకు తొడిగి, కాంగ్రెస్‌పై భక్తిని దేశభక్తిని రగిల్చేడు.

ఈ పరిస్థితుల్లో 1935లో అనుకుంటాను. గుంటూరులో ఒక మీటింగులో సోషలిజం గురించి సుందరయ్యగారి ఉపన్యాసం, సోషలిజాన్ని గురించిన తీర్మానాలు ఆంధ్రపత్రికలో చదివాను. అవి నాకు బ్రహ్మానందాన్ని కలిగించాయి. అవి అమలు జరిగితే, దేశంలో, యీ అసమానతలు నశించి, అందరూ సుఖశాంతులతో జీవిస్తారు గదా అనే భావనలు మనస్సులో నాటుకుపోయాయి.

ఇక ఉద్యోగ అన్వేషణలో వుండగా, కాకినాడ కాలేజి లెక్చరరు ఒకరు, ఆయన స్నేహితురాలుకు కాంగ్రెస్ పార్టీ అన్యాయం చేసినందున, 1937 ఎన్నికల్లో ఏలూరులో, ఆమెకు తోడ్పడమని పంపితే, ఆ పని చేశాను. అనంతరం ఆమె నన్ను తన యింటికి

బందరు తీసుకు వెళ్ళింది. ఆ దశలో, నేషనల్ కాలేజి ప్రిన్సిపాల్‌గా వున్న అడివి బాపిరాజు గారి స్నేహం లభించింది. అక్కడ నుండి, వారి మిత్రుడు గుడివాడలో ఉద్యోగం యిప్పిస్తాను, తనకు ఇన్సూరెన్స్ వ్యాపారంలో తోడ్పడితే అని గుడివాడ తీసుకువెళ్ళాడు.

అక్కడ, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఆఫీస్ బోర్డు కనపడింది. రోజు అచటికి వెళ్ళి పత్రికలన్నీ చదువుతుంటే, అచట యిన్‌ఛార్జీగా వున్న శెట్టిపల్లి వెంకటరత్నం నాపై కన్నువేశాడు. అచటికి వచ్చి వెళ్ళే కొసరాజు శేషయ్య, వెల్లంకి విశ్వేశరరావుల దృష్టికి నన్ను తీసుకువెళ్ళారు. ఇంతలో 1938 మేలో మంతెనవారి పాలెం రాజకీయ పాఠశాల వచ్చింది. దానికి నన్ను ప్రోత్సహించి పంపారు. పాఠశాల ఆఖరి రోజున, చండ్ర రాజేశ్వరరావు, "మీకు కొత్త మతం యిచ్చాం. మీరు యిక కమ్యూనిస్టు పార్టీ సభ్యులు" అన్నారు. గుడివాడ యిన్‌ఛార్జీగా పని చేయమన్నారు అంతే. అయితే ఆ పాఠశాలలో నేర్చుకున్నది. నేటి మన సమాజాన్ని సోషలిస్టు సమాజంగా మార్చడానికి, కమ్యూనిస్టులు ఎట్టి త్యాగానికైనా సిద్ధంగా వుండాలని, స్వార్థం విడనాడి, క్రమ శిక్షణ పాటించాలి అని మాత్రమే.

అందువల్లనే పాత కమ్యూనిస్టులు ఆ పద్ధతులలో వ్యవహరించి, తమ ఆస్తిపాస్తులను సైతం త్యాగాలు చేశారు.

కాని, ఇప్పుడు ఆ పద్ధతులకు విలువ లేకుండా పోవడం, చాలా బాధాకరమైన విషయంగా, పాతవారికి కనబడుతోంది. అందువల్లనే ఆ దశలో సభ్యత్వం తక్కువ వున్నా ప్రజల్లో పార్టీ ప్రతిష్ట తారాస్థాయిలో వుండేది. కాని, నేడు చూస్తూనే ఉన్నారు కదా?

అందువల్లనే ప్రజలు, మీకూ యితర అవకాశవాద పార్టీలకూ తేడా ఏమిటని ప్రశ్నిస్తుంటే తలదించుకోవలసి వస్తుంది.

అందువల్ల నేటితరంవారు అవకాశవాదాన్ని విడిచిపెట్టి, ఆదర్శప్రాయుల క్రమమును అలవర్చుకోవాలని కోరుతున్నాను. పార్టీ ప్రతిష్టను పెంచాలని నా మనవి.

★ ★ ★

# శ్రీ మహీధర రామమోహనరావు



నేనెలా కమ్యూనిస్టునయ్యాను? ఎందుకయ్యాను? – అని కాదూ ప్రశ్న? చెప్పాలి. ఏమిటంటే – ఈ ప్రశ్న ఈనాడు రాలేదు. 50–60 ఏళ్ళ క్రితం 1938 ప్రాంతాలలోనే వచ్చింది. భీమా డిండిమ శ్రీ చెరుకువాడ నరసింహంగారు దారిన వెడుతూ ముంగండలో దిగి మా యింటికి వచ్చేరు. ఆయన వచ్చేసరికి నేనేదో పుస్తకం అనువాదం చేస్తున్నాను. అప్పుడాయన వేశారు ఇదే ప్రశ్న. "సంస్కృత పండితుడివి నువ్వు కమ్యూనిస్టువి ఎలా అయేవయ్యా?" అన్నారు. సంస్కృతానికి కమ్యూనిజానికి వున్న వైరుధ్యం ఏమిటో నాకు తెలియదప్పుడు. చెప్పలేదు. ఈ 50–60 ఏళ్ల జీవితానుభవాలు నన్ను ఆలోచింపచేశాయి.

మొట్టమొదట చెప్పవలసింది. నేను బ్రహ్మసమాజకుని ఇంట పుట్టి పెరిగేను. తరువాత నేను పది పన్నెండేళ్ళ వయస్సులోనే జాతీయోద్యమంలో చేరేను. దానికీ, పరాయి ప్రభుత్వం మీద తీవ్రమయిన ద్వేషం ఏర్పడడానికీ కారణం అమూర్తమైన దేశభక్తి ఏదో కారణంకాదు. జలియన్‌వాలాబాగ్ హత్యలు, పంజాబు దురంతాలు గూర్చిన కథలు వినడం, చదవడం–దానితో ప్రజలను హింసపెడుతున్నారనే ఆవేశంతో

ఆ రోజుల్లో ఉడికి పోయేవాళ్ళం. ఆ క్రూర కర్మలని సమూలచ్ఛేదం చేయడానికై అస్త్ర, శస్త్రాలను సంపాదించడానికి చేసిన కృషిని – చిన్న పిల్ల చేష్టను – 'నేనెందుకు రాశాను?'లో వర్ణించాను. ఆరోజుల్లో మాకు దొరికిన పుస్తకాలు కూడా అటువంటివే. రమేశ్‌చంద్ర దత్తు రచనకు అనువాదం అయిన ఇందుమతీ చరిత్రం అస్సాం తేయాకు తోటలలో కూలిజనం గురి అవుతుండిన అన్యాయాలను, బాధలను చెప్పింది. బీహారు, యు.పి.లలో నీలిమందు తోటల రైతుల బాధలుగురించి చదివేం. ఇల్లాంటి వెన్నో ఆ రోజులలో పత్రికలలో వచ్చేవి. పుస్తకాలుగానూ వచ్చేవి. ఫలితం ఏమిటంటే – జాతీయోద్యమం అవభక్తమైన దేశభక్తినిగాక, మూర్తిమంతమైన ప్రజల క్షేమ సాధనగానే మాకు అర్థమయింది. గాంధీజీ ప్రవేశపెట్టిన ఖద్దరు ఉద్యమం, హరిజనోద్యమాలు, విదేశీ వస్తు బహిష్కరణ, మద్య నిషేధాలకన్నా మా మనస్సులను బాగా ఆకట్టుకున్నాయి. 1930 ప్రాంతాలలో మాకు అందుబాటులోకి వచ్చిన టాల్‌స్టాయి రచనలు మాలో ప్రజాస్వామ్యం గురించిన ఆసక్తిని బాగా పెంచేయి.

దీనికి సమాంతరంగా 1918లో వచ్చిన సోషలిస్టు విప్లవం గురించిన అరకొర సమాచారం. సోవియట్ ప్రభుత్వ విధానాల గురించిన తెలిసీ తెలియని ఊహాగానాలు మా అభిమానాలకూ, ఆదర్శాలకూ ఒక రూపాన్ని ఇచ్చేయి.

1930 ప్రాంతాలలో నెహ్రూ, ఠాగోర్ మొదలైనవారి రచనలు, వెబ్ దంపతులు సోవియట్ ఎక్స్పెరిమెంటును ప్రశంసిస్తూ వ్రాసిన బృహద్గ్రంథమూ దేశభక్తికి ఒక క్రియారూపాన్నిచ్చేయి, లక్ష్యాన్నీ చూపించేయి.

అయితే, ఆ విప్లవాన్ని నడిపిన నాయకుల్ని గురించీ, వారు నిర్మించిన ఉద్యమం గురించీ విదేశీ ప్రభుత్వపు నెగెటివ్ ప్రచారాన్ని పట్టివ్యూహించుకోగలిగిన పాజిటివ్ సమాచారం తప్ప మాబోటివాళ్లకు ఇదమిత్థంగా ఏమీ తెలీదనడం తప్పుకాదు.

ఈ పరిస్థితుల్లో బెనారస్ యూనివర్సిటీ నుంచి వచ్చిన పోలేపెద్ది నరసింహమూర్తి మాకు (మహీధర బ్రదర్సుకు) లెనిన్ రచనలు కొన్ని ఇచ్చేరు. అవి ముఖ్యంగా రష్యాదేశంలోని రాజకీయ పార్టీలతో లెనిన్ నడిపిన పోలెమిక్సు తప్ప వేరుకాదు. అయితే, చిత్రంగా అలహాబాదు నుంచి సోషలిస్టు ప్రచురణలంటూ కృష్ణస్వామి అనే ఆయన కరపత్రాల రూపంలో మార్క్సు మొదలైనవారి రచనలు తీసుకువచ్చేడు. లెనిన్ రేఖాచిత్రం గుర్తుగా ఎర్రని అట్టతో ఇవి అందుబాటులో వుండేవి. కమ్యూనిస్టు మానిఫెస్టో, విలువ – ఖరీదు, లాభం, కూలిపని – పెట్టుబడి, కమ్యూనిస్టులతో (ఈ చివరి మూడు నేను అనువదించి, విశ్వసాహిత్యమాలలో ప్రచురించా) మాకు చేరేయి.

అదే కాలంలో బొంబాయిలో ప్రచురించబడ్డాయంటూ వయా హైద్రాబాద్ మాకు రష్యా అంతర్యుద్ధచరిత్ర – మొదటి భాగం, మోర్గనురాసిన ఏన్సెంట్ సొసైటీ, ఏంగెల్సు రాసినవీ, మార్క్సువీ కొన్ని చరిత్ర గ్రంథాలు మాకు అందేయి.

నాకు అప్పటికీ ఇంగ్లీషు రాదు. మా తమ్ముడు జగన్మోహనుని సహాయంతో ఒక ప్రక్క వీలైనన్ని పుస్తకాలు చదివేను – రెండో పక్క ఇంగ్లీషును ఒక ట్యూటరు మిత్రుని వద్ద (ముక్కామల కామేశ్వరరావు) మంచి పట్టుదలగా చదివి, ఒక ఏడాదిలో పుస్తకాలు చదివి స్థూలంగా అర్థం చేసుకోగల స్థాయికి చేరుకున్నాను.

ఈ పరిణామ క్రమంలో కమ్యూనిజం అనేది ఒక జీవిత పద్ధతి అని మేము అర్థం చేసుకున్నాము. కొంచెం ఇంచుమించుగా అటువంటి జీవిత పద్ధతి నమలు చేయమనే హిందూ సనాతన ధర్మం బోధిస్తుందనీ, అయితే హిందూత్వం ప్రబోధించేది వ్యక్తి మూలకంగా ఆదర్శ ప్రబోధకమనీ, కమ్యూనిజం సమాజాశ్రితమై జీవన పద్ధతిగా వుంటుందనే అంతరం అనాటికి అర్థం కాకపోయినా, ఆ జీవిత పద్ధతికి 1934 నాటికే మేము అన్నదమ్ములం నోటు వేసుకున్నాము. దానిని ప్రచారంలోకి పెట్టే లక్ష్యంతో 1935 జూన్‌లో విశ్వసాహిత్యమాల ప్రచురణ సంస్థను ప్రారంభించేం.

1935 అక్టోబరులో మిత్రుడు నందూరి ప్రసాదరావు కాకినాడలో పార్కుగా వదిలిన ఖాళీ ప్రదేశంలో నాకు కమ్యూనిస్టు పార్టీ దీక్ష ఇచ్చేడు.

కాని, 1936–37లతో సుప్రసిద్ధ కోనసీమ కాంగ్రెసు నాయకుడు కళా వెంకట్రావుగారు నాకు మార్క్స్ రాసిన క్యాపిటల్ (మొదటి సంపుటం), ట్రాట్‌స్కీ రాసిన రష్యన్ రివాల్యుషన్, క్రిస్‌స్కయా వ్రాసిన లెనిన్ జీవితము ఇచ్చేరు. కోనసీమ కో అపరేటివ్స్ బ్యాంకు కార్యదర్శిగా ఆయన బ్యాంక్ లైబ్రరీకి అమెరికాలో ప్రచురించబడిన కమ్యూనిస్టు సాహిత్యం సంపాదించాం.

క్యాపిటల్ మొదటి సంపుటంలోని మొదటి ప్రకరణం కమ్మోడిటీస్ నన్ను చాలా సమ్మోహితుణ్ణి చేసింది. సమాజగతి సూత్రాల్ని, ముఖ్యంగా మొట్టమొదటిదైన ఫ్రం క్వాంటిటీ ఇన్‌టూ క్వాలిటీ అండ్ వైస్‌వెర్సాను పలు ముఖాలుగా వివరిస్తూ అయన ఒక గురుస్థానం నుంచి బోధించా డనిపించింది. నన్ను ప్రబోధితుడిని చేసిన రెండో పుస్తకం ఏంగిల్స్ రాసిన ఆరిజన్ ఆఫ్ ఫామిలీ ప్రైవేటు ప్రాపర్టీ అండ్ స్టేట్. వీటిని ప్రాతిపదికగా చేసుకొని, సమాజ శాస్త్ర గ్రంథాన్నీ, ఆ రచయితల వివిధ రచనల్నే చాలా చదివేను. ఫలితంగా మానవ సమాజం తప్పనిసరిగా కమ్యూనిజం దశను చేరుకోక తప్పదనీ, ఎద్దు పచ్చులాగే (పచ్చగడ్డి ఇంకా ముందు భాగంలో బాగా పచ్చగా వున్నట్లు కనబడి ఎద్దును ముందుకు నడిపించేది) ఆ దశ ఎక్కడికక్కడే కంటి ఎదుట కనిపిస్తూ ముందుకు లాక్కుపోతూంటుందనే నమ్మకం ఏర్పడింది. అందుచేత ఇటీవల తూర్పు యూరపు, ఆసియాటిక్ దేశాలలో ఏర్పడిన కమ్యూనిస్టు పార్టీ పాలనాధికారులు వివిధ స్థాయిలో కూలిపోవడం చూస్తుండినా కమ్యూనిస్టు సిద్ధాంతం విఫలమయినట్లుగా నేను భావించడం లేదు. మార్క్స్, లెనిన్‌లు మానవమాత్రులేనని, చరిత్ర గతిక్రమంలో కాలీన పరిణామాలకు పరిమితులై చేసిన పొరపాట్లను సర్వకాల ధర్మాలనుగా వారే భావించలేదనీ, ఒకవేళ భావించి, చరిత్రను వక్రగతి పట్టిస్తే సర్దుకునేందుకు సిద్ధపడేవుండాలనీ నా అభిప్రాయం. కమ్యూనిస్టుగా నా విశ్వాసం.

★ ★ ★

# శ్రీ చిర్రావూరి లక్ష్మీనరసయ్య



ప్రస్తుతం 81వ సంవత్సరంలో అడుగిడిన నేను మార్చి 20వ తేదీ 1915వ సంవత్సరంలో జన్మించాను. ప్రస్తుతం నేను నివసిస్తున్న గృహము మా నాన్నగారు నిర్మించినదే. వారు నా వివాహం జరిగిన రెండు సంవత్సరములకు, అనగా 1929 సం॥లో పక్షవాతం వచ్చి దివంగతులైనారు. నాకు బాల్యములోనే వివాహము జరిగినది. ఖమ్మంలో 3 వ ఫారమ్ పూర్తి చేసుకొని బెజవాడలో హిందూ హైస్కూలులో చేరినపుడు అయ్యంకి వెంకట రమణయ్య గారింట్లో గది అద్దెకు తీసుకున్నాను. ఆ రోజులలో ఆయన మీద వారంటు వుండేది. అందువలన రహస్యంగా తిరుగుతూ వుండేవారు. వారి యింట్లో అందరూ ఖద్దరూ కట్టేవారు. మేమందరము కలిసి వారం వారం ఖద్దరును యింటి యింటికి తిరిగి అమ్మేవాళ్ళము. అప్పుడప్పుడు సారా దుకాణాలు, విదేశీ బట్టల అమ్మకం నిరోధించటానికి కూడా వెళుతుండేవారము. ఆ రోజులలో గాంధీ నిర్మాణ కార్యక్రమంలో ముఖ్యమైన కార్యక్రమము. వీటిని కూడా ప్రభుత్వము సహించలేకపోయేది. పోలీసులు లాఠీల దెబ్బలు జళిపించుట జరుగుతుండేది.

అప్పుడప్పుడు గాంధీ పార్కులో జరిగే కాంగ్రెస్ మీటింగుల మీద పోలీసు లాఠీఛార్జీ జరుగుతుండేది. వీటికి మేము కూడా హాజరయ్యేవారము. పోలీసులు రాగానే జనం తప్పుకునేవారు. కదలకపోతే నాయకులపై లాఠీ ఛార్జీ చేసి అరెస్టు చేసేవారు. పరుగెత్తలేని ప్రజలు దొరికితే లాఠీలతో కొట్టి వారిని హింసించేవారు.

అది 1931 సం॥ మార్చి అని జ్ఞాపకం. భగత్‌సింగ్‌ను ఉరితీసిన కారణంగా హిందూ హైస్కూలు నుంచి మున్సిపల్ హైస్కూలు వద్దకు వచ్చి స్కూలు బందు చేయమని పికెటింగ్ ప్రారంభించాము. హెడ్‌మాస్టర్ స్కూల్ మూసివేయడానికి నిరాకరిస్తూ, పోలీసులకు తెలియపరిచారు. పోలీసు స్టేషన్ స్కూలుకు ఎదురుగానే వుండేది. పోలీసులు సమ్మె చేస్తున్న విద్యార్థులను విపరీతంగా కొట్టగా ఒకరిద్దరికి కాళ్ళు విరిగినవి. మిగతా వారికి దెబ్బలు తగిలినవి. అందరిని కనకదుర్గ ఘాట్ వద్ద వరకు తరిమారు. ఆనాడు దెబ్బలు తిన్నవాండ్లలో నేనూ ఒకడిని. ఆ తరువాత మా పరీక్షలు పూర్తి అవడం, పాస్ అయి ఖమ్మం చేరడం జరిగింది. తదుపరి కాంగ్రెస్ అభిమానిగా మారి, ఖద్దరు వస్త్రధారణ, భగవద్గీత పఠనం రెగ్యులర్‌గా చేస్తూ ఒక పద్ధతి గల జీవితానికి అలవాటుపడినాను.

ఆ తరువాత నేను ఖమ్మం హైస్కూలులో చేరినపుడు మూడు వందలకంటే ఎక్కువ విద్యార్థులు వుండేవారు కాదు. ప్రయిమరీ సెక్షన్ నుండి థర్డ్‌ఫారమ్ వరకు ఎక్కువ మంది, హెయ్యర్ సెక్షన్‌లో చాలా తక్కువమంది వుండేవారు. పరిచయమున్న విద్యార్థులకు ఖద్దరును గురించి ప్రచారంచేసి కొందరితో కట్టించ కలిగేవాడిని. అప్పట్లో హిందూ ముస్లిం భేదాలు చాలా ఎక్కువగా వుండేవి. ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ, కృష్ణాపత్రిక, గోలుకొండ పత్రికలకు ప్రాచుర్యం వుండేది. ఈ పత్రికలన్నీ అప్పటి విద్యార్థులలో జాతీయ భావాలు పెరగడానికి దోహదపడ్డాయి.

ఆంధ్ర మహాసభ 1929 సం॥లో ప్రారంభమయింది. మొదటి సమావేశము 70 మందితో జరిగింది. అప్పటి మితవాద నాయకులైన మేము లైబ్రరీ స్థాపించటం, వెట్టిచాకిరికి వ్యతిరేకంగా ప్రచారం, వితంతు వివాహములపై ప్రచారం ప్రారంభించాము. పెరుగుతున్న జాతీయ చైతన్యము యువకులను విపరీతంగా ఆకర్షించటం మొదలు పెట్టింది. ముస్లింలు కూడా బహదూరయార్ జంగ్ నాయకత్వాన ముస్లిం ఐక్యత అనే ప్రచారం మొదలయింది. ఈ ప్రభావం విద్యార్థులమీద కూడా పడింది. ముస్లిం ఉపాధ్యాయులు యీ ఉద్యమం రహస్యంగా నడిపేవారు.

ఈ పరిస్థితులలో ఒక "విద్యార్థి యూనియన్" పెట్టాలని సంకల్పించి, రెండొందల మంది విద్యార్థులను పోగుచేసి ఒక యూనియన్ పెట్టాము. దానికి నన్నే సెక్రటరీగా వుండమన్నారు. హిందూ టీచర్సు ముందుండి యూనియన్‌ను విచ్ఛిన్నం చేయటానికి పూనుకున్నారు. మద్రాసు నుండి వచ్చిన హెడ్ మాస్టర్ అయ్యర్ తగని నిర్బంధము ప్రయోగించారు. ముస్లిం విద్యార్థుల మీద కూడా స్కూలు నిబంధనలు అమలు జరపటానికి ప్రయత్నం చేశారు కాని, ఆ వాతావరణమును చూచి హెడ్‌మాస్టర్ భయపడ్డారు. ఆ సమయమున నన్ను స్కూలునుండి డిబారుచేసి ఆ సంవత్సరము పరీక్షలకు హాజరు కానీకుండా చేశారు. మరుసటి సంవత్సరముకాని తిరిగి చేర్చుకోలేదు.

1934లో ఆంధ్రమహాసభ ఖమ్మంలో జరపటానికి ఖమ్మం ఆంధ్రమహాసభ వారు ప్రభుత్వం అనుమతి తీసుకున్నారు. ఖమ్మంలో వున్న సనాతనులు మహాసభకు వ్యతిరేక

ప్రచారం చేశారు. ప్రభుత్వం పర్మిషన్ రద్దు చేయించటానికి ప్రయత్నము చేసి విఫలమైనారు. సనాతన ప్రతిఘటనావాండ్లు అంతర్గత తగాదాల వల్ల బలహీనపడ్డారు. తరువాత జాతీయ ఉద్యమ ప్రభావం పెరిగింది. తద్వారా ఆంధ్రమహాసభ జాతీయ వేదికగా పెరిగింది.

ఆంధ్రమహాసభ పేరుతో ఆఫీసులు పెట్టి వెట్టిచాకిరికి వ్యతిరేకంగా ప్రచారము చేశాము. ఖమ్మంలో ఒక జీర్ణ గ్రంథాలయాన్ని తిరిగి పునరుద్ధరించాము. వర్తకులు విజ్ఞాన నికేతనము అను పేరుతో ఒక కొత్త గ్రంథాలయం స్థాపించారు. హరిజనోద్ధరణ పేరుతో రాత్రి పాఠశాలలు, హరిజన సేవా సంస్థలు నడిపాము. గ్రామాలలో ఆంధ్ర సంఘ సభ్యత్వం చేర్పించడం ప్రారంభించాము. నేను గ్రంథాలయాన్ని స్వయంగా నడిపాను. జాగీరు రైతు ఉద్యమాలను నిర్మించాము. జాగీరు రైతు ఆందోళన ప్రారంభించాము. దీనితో ప్రజలలో కదలికలు ప్రారంభమయినవి.

1938లో హైదరాబాదు స్టేట్ కాంగ్రెస్ పేరుతో స్టేటు కాంగ్రెస్‌పై నిషేధం ఎత్తివేయాలి అనే నినాదంతో సత్యాగ్రహం ప్రారంభించారు. సత్యాగ్రహ దళాలు అన్ని జిల్లాలలో రిక్రూట్‌మెంట్‌ను ప్రారంభించాయి. ఖమ్మం జిల్లాలో వున్న పెద్ద తరం, నాయకత్వం రిక్రూటుచేసి నాయకులను హైదరాబాదులో సత్యాగ్రహాలకు పంపటానికి ప్రారంభించగా హైదరాబాదు పంపటానికి యువతరం వ్యతిరేకించి, మా జిల్లాలో సత్యాగ్రహం చేయాలని నిర్ణయించుకున్నది. మధిరలో కేశవరావు గారి నాయకత్వాన రెండు దళాలు సత్యాగ్రహం ప్రారంభించాలని నిర్ణయం తీసుకున్నారు. తేదీలు కూడా నిర్ణయించుకున్నారు. కాని, మితవాదులు సత్యాగ్రహ సమయానికి రాలేదు.

గాంధీగారి ఆధ్వర్యమున నడుపబడిన సత్యాగ్రహం నిలిపివేసినట్లు ప్రకటించారు. ఈ నిర్ణయంపై యువకులు విపరీతమైన అసంతృప్తికి గురి అయి, నూతన ఆలోచనలు ప్రారంభించారు.

అదే రోజులలో హిందూ మహాసభవారు, ఆర్యసమాజంవారు సత్యాగ్రహం ప్రారంభించారు. జైళ్ళు అన్ని అప్పటికే నిండిపోయినవి. ఆర్యసమాజం, హిందూ మహాసభవారి సత్యాగ్రహ ప్రభావం హైదరాబాదు, వరంగల్ పట్టణాలలో ఎక్కువగా వుండేది.

అప్పుడు స్టేటు ముఖ్యమంత్రి మిర్జా యిస్మాయిల్ గాంధీగారికి నమ్మిన బంటు. ఆయన వ్రాసిన ఉత్తరం మీదనే గాంధీగారు సత్యాగ్రహం ఆపుచేశారన్న ప్రచారం జరిగింది.

నేను చిన్నతనములో ఒక భూస్వామ్య గ్రామంలో పెరిగినాను. నేను చదవటానికి ఖమ్మం కుటుంబ సభ్యులు తీసుకొచ్చారు. ప్రైవేటు స్కూలులో చదువు ప్రారంభమయింది. మూడవ తరగతిలో చేరి ఉర్దూ చదవటం ప్రారంభించాను. ఆ రోజులలో రాజభాష ఉర్దూ అవటంతో పిల్ల లందరిని ఉర్దూలోనే చదివించేవారు. దాన్ని గౌరవంగా భావించేవారు.

ఈ పరిస్థితుల ప్రభావానికి అప్పటి అందరి పిల్లలలాగానే నేను కూడా గురి అయ్యాను. విప్లవవాదుల చరిత్రలు గల చిన్న చిన్న పుస్తకాలు చదువుతూ వుండేవాణ్ణి. లైబ్రేరియన్‌గా రెండు సంవత్సరాలు పని చేయటం, పత్రికలు

(తెలుగు) మరియు జాతీయ నాయకుల చరిత్రలు ఎక్కువ చదవటానికి అలవాటు పడ్డాను. ఈ వ్యాసంగంవల్ల నేను ఆంధ్రమహాసభ సభ్యునిగా చేరి, ఆ ఉద్యమంలో పని చేయటం ప్రారంభించాను. అప్పటి మితవాద నాయకత్వం కూడా బాగానే సన్నిహితం చేసుకుంది. సత్యాగ్రహంతో వచ్చిన అభిప్రాయ భేదంవల్ల నన్ను అతివాదిగా అనుమానపడటం ప్రారంభించారు. అదే సమయంలో అతివాద సాహిత్యం బాగా చదవటం ప్రారంభించాను. అదే సమయంలో వందేమాతరం స్ట్రయిక్‌లో నాగపూర్‌లో చదువుతున్న సర్వదేవభట్ల రామనాథంగారు, పారుపల్లి వెంకటరమణయ్య ఎస్.ఐ. ఉద్యోగంచేస్తూ చిన్ననాటి స్నేహితులవటం వల్ల నన్ను కలవటానికి ఖమ్మం వచ్చారు. మా ముగ్గురి మధ్య రాజకీయ చర్చలు జరిగినవి. మనమే నాయకత్వం వహించి సత్యాగ్రహం ఎందుకు చేయకూడదని అనుకున్నాము. మొదటి డిక్టేటర్‌గా రామనాథంగారు, రెండవ డిక్టేటర్‌గా పారుపల్లి వెంకటరమణయ్య, మూడో దళంలో నేను కలవాలని నిర్ణయించుకున్నాము. ఈ విషయం మాట్లాడటానికి బెజవాడలో పని చేస్తున్న ఆఫీసు సెక్రటరీతో మాట్లాడుదామని బెజవాడ వెళ్ళాను. అదే డిసెంబరు 30న గాంధీగారు సత్యాగ్రహం నిలుపు చేసినట్లు ప్రకటించారు. దానితో మా ప్రయత్నం ఆగిపోయింది.

అదే రోజులలో ఒకనాడు కామ్రేడ్స్ చండ్ర రాజేశ్వరరావు, నండూరి ప్రసాదరావు గార్లు కూడా మునగాల పోరాటానికి సహాయం యివ్వటానికి ఈ ప్రాంతం మీదగానే బెజవాడ వెళ్ళేవారు. ఆరోజు 31 డిసెంబరు, రమణయ్య గారు ఎస్.ఐ. పోస్టుకు మరియు రామనాథం ఎల్.ఎల్.బి. చదువుకు స్వస్తి చెప్పటం జరిగినది. తరువాత చరిత్ర అంతా పార్టీకి తెలిసిన చరిత్రే. ఆ తరువాత క్లాసుల ద్వారా సైద్ధాంతిక పరిజ్ఞానం పెంచటానికి ముగ్గురం కలిసి క్లాసులు నడిపేవారం. రెండో ప్రపంచ యుద్ధం మొదలుకాగానే అందరి మీద పోలీసుల నిఘా పెరిగినది. వారంటు వుందని తెలియగానే కొండపల్లి మీద నుండి బెజవాడ పంపాము. ఆనాటి నుండి ఈ రోజు వరకు పార్టీ సభ్యునిగానే పని చేయుచున్నాను. యువకులు సమ సమాజ స్థాపనకు కృషి చేయవలసిందిగా, అలా చేస్తే ప్రభుత్వంలో ఎక్కడ అరాచకం ఏర్పడకుండా వుంటుందని, అందుకే ప్రతివ్యక్తి సభ్య సమాజానికి తన వంతు కృషి చేయాలని కోరుకుంటున్నాను.

★ ★ ★

# కీ.శే. ఏటుకూరి బలరామమూర్తి



మాది ఏటుకూరు. గుంటూరు ప్రక్కనే రెండుమైళ్ళు. మా తండ్రి అక్కడ గ్రామ కరణం. మా ఊరులో మా ఇల్లు ఒక్కటే కాస్త చదువుకున్న కుటుంబము. సహజంగానే మా ఇంటికి కృష్ణాపత్రిక, ఆంధ్రపత్రిక వస్తూ ఉండేవి. కృష్ణాపత్రిక, ఆంధ్ర పత్రిక అంటే మీకు తెలుసు. ఆ రోజుల్లో జాతీయ ఉద్యమ భావాలను అన్నిటినీ కూడా ప్రచారం చేస్తుండే పత్రికలు అవే. మా వూరిలో చిన్న గ్రంథాలయం ఉండేది. ఆ గ్రంథాలయంలో వీరేశలింగంగారి పుస్తకాలు, గాంధీగారి పుస్తకాలు, నెహ్రూగారి పుస్తకాలు, ఇంకా ఏవో చాలా పుస్తకాలు – అవి అన్నీ చదువుతూ ఉండేవాడిని. కనుక సహజంగానే ఆ సిద్ధాంతాలపట్ల, జాతీయ ఉద్యమంపట్ల, వీరేశలింగం గారి సంఘ సంస్కరణల భావాలపట్ల నేను ఎంతో ఆకర్షితుడ నయ్యేవాడిని. మా తండ్రిగారు కూడా అదే విధంగా ఆకర్షితులయ్యేవారు. మాకు మంచి వాతావరణం ఉండేది.

తరువాత ఫోర్తుఫారం చదువుకునే రోజులలో – 1930లో నాకు బాగా జ్ఞాపకం, నడింపల్లి నరసింహారావుగారు అప్పుడు మున్సిపల్ ఛైర్మన్‌గా ఉండేవారు.

వారు ఆ రోజులలో గాంధీ టోపీ పెట్టుకుని మొట్టమొదటి సారిగా ఛైర్మన్ హాలులో ప్రవేశించేవారు. పెద్ద సంచలనం కలిగించింది. మా విద్యార్థులంతా కూడా ఆ సంఘటన చూసి చాలా ఉత్తేజం అయిపోయి 'వారు అంతా కూడా చాలా గొప్పవారు. వారి ఆదర్శాలు మేము పాటించాలి. మేము అనుసరించాలి' అని అనుకుంటూ వుండేవారం. ఆ 30, 32, 34 సంవత్సరాలు అన్నీ కూడా మంచి జాతీయ ఉద్యమ సంవత్సరాలు కదా! మేము అంతా హైస్కూలు కుర్రాళ్ళం. కాని, మా హైస్కూలు కుర్రాళ్ళు అంతా చాలా ఉత్సాహపూరితంగా ఉండేవారు. తరువాత క్రమంగా ఈ గాంధీగారి పుస్తకాలు, నెహ్రూగారి పుస్తకాలు విని, చదువుకున్న తరువాత కాలేజీలో ప్రవేశించాను.

కాలేజీలో ప్రవేశించిన తరువాత మరికొంత ముందుకు వెళ్ళాను. అప్పుడు అక్కడ ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు పులుపుల శివయ్యగారు ఉండేవారు. చాలా మందికి తెలుసు. వారు జాతీయ ఉద్యమ భావాలు కలిగిన విద్యార్థులందరినీ కలుసుకుంటూ గ్రాడ్యువల్‌గా వారికి మార్క్సిస్టు సిద్ధాంత పుస్తకాలు అన్నీ ఇస్తూ ఉండేవారు. నేను వాటిని చదువుతూ ఉండేవాడిని. ఆ విధంగా ఇంటర్‌మీడియెట్ చదువుతున్న రెండు సంవత్సరాలు కూడా వారు ఇచ్చిన పుస్తకాలు చదువుతూ ఉండేవాడిని. నెహ్రూగారి పుస్తకాలు చదివాను. వెదర్ ఇండియా అనే పుస్తకం చదివాను. వాట్ సోషలిజం? అనే సోషలిజం పుస్తకం చదివాను. ఆ తరువాత క్రమంగా రష్యన్ రివల్యూషన్ గురించి చాలా పుస్తకాలు చదివాను. ఇవి అన్నీ చదువుతూ వుండేకొద్దీ నెహ్రూగారి సోషలిస్టు భావాలు కంటే ఇంకా ఎక్కువగా దానికి మూలం అయినటువంటి మార్క్సిస్టు సిద్ధాంతము వలన చాలా ఆకర్షింపబడుతూ వచ్చాను. అలాగే నాలుగేళ్ళూ కూడా నేను ఈ రకంగా ఇంటర్, బి.ఏ. చదివాను. అంతకాలం కూడా ఈ మార్క్సిస్టు సిద్ధాంతాలు క్షుణ్ణంగా చదివేవాడిని. ఆ రోజులలో నాకు కేవలం పుస్తకాల పురుగు అనే పేరు ఉండేది. ఎప్పుడూ చదువుతూ ఉండేవాడిని. ఆ రకంగా మార్క్సిజం వైపు వచ్చానన్నమాట. నేను ఫిజిక్స్ విద్యార్థిని అయినప్పటికీ నాకు తత్త్వశాస్త్రము, చరిత్ర అంటే ఆసక్తి కలగటానికి ఒక చిన్న కారణం కూడా ఉంది.

మేము బి.ఏ. చదువుతూ ఉండే సమయంలో డా॥ రామకృష్ణగారు అప్పుడు వైస్ ఛాన్సలర్‌గా ఉన్నారు. డా॥ రాధాకృష్ణగారు హిందూ కాలేజీ ఓపెన్ చేయడానికి వచ్చారు. మేము అందరం విద్యార్థులం వారి ఉపన్యాసము వినటానికి వెళ్ళాము. ఆయన హడావిడిగా వెళ్ళిపోతుంటే 'ఏమండీ, కాసేపు అయినా భారతీయ తత్త్వశాస్త్రము గురించి మాట్లాడాలి' అని అందరూ కూడా గట్టిగా ఒత్తిడిచేస్తే, మేడమెట్ల మీద నిల్చునే ఒక అరగంటసేపు అత్యద్భుతంగా ఇండియన్ ఫిలాసఫీలో ఉపనిషత్తుల గురించి అత్యద్భుతంగా మాట్లాడారు. ఆనాటి నుండి నాకు అనిపించింది. 'భారతీయ తత్త్వశాస్త్రం చదవాలి. ఉపనిషత్తులు చదవాలి. ముఖ్యంగా ఉపనిషత్తులు చదివితే తప్ప మనకు భారతీయ తత్త్వశాస్త్రం యొక్క లోతుపాతులు అర్థంకావు' అనే అభిప్రాయం కలిగింది.

మరొక చిన్న ఘటన కూడా జరిగింది. మాది క్రిస్టియన్ కాలేజీ. ఆ ఎ.సి. కాలేజీలో చదువుకుంటూ ఉండేవాడిని. బైబిలు క్లాసులు అని ఉంటూ ఉండేవి. ఆ రోజులలో టి.ఎన్. పొలసుగారు అని మాకు ఫిలాసఫీ ప్రొఫెసర్ ఒక ఆయన

ఉండేవారు. ఆయన బైబిలు చెప్పడంతోపాటు ఫిలాసఫీ ది క్యాంట్ హెగీలియన్ ఫిలాసఫీ అంతా చెబుతూ ఉండేవారు. అవి నాకు చాలా ఆసక్తి కలిగించుతూ వుండేవన్నమాట. ఆ విధంగా పాశ్చాత్య ఫిలాసఫీ మీద, ఇండియన్ ఫిలాసఫీ మీద రెండింటిమీద నాకు చాలా ఆసక్తి కలిగి – నేను ఫిజిక్స్ విద్యార్థి నయినప్పటికీ ఈ పుస్తకాలమీద ఆ విధంగా ఆసక్తి కలిగింది. సరి, మార్క్సిస్టు సిద్ధాంతం మీద నాకు మొదటి నుంచి ఉంది. ఈ మూడు సిద్ధాంతాల భావ ప్రభావం కూడా నాకు ఆ రకంగా కలిగిందన్నమాట.

నేను ఈ మార్క్సిస్టు, సిద్ధాంత గ్రంథాలు చదువుతూ ఉన్న కాలంలోనే ఒక పుస్తకం చదివాను. పీపుల్స్ హిస్టరీ ఆఫ్ గ్రేట్ బ్రిటన్ ఆ పుస్తకం పేరు. దానిని ఎ. ఎల్. మోర్టన్ అనే ఒకాయన వ్రాశారు. ఇప్పుడు ఆ పుస్తకం ఉందో లేదో కూడా నాకు తెలియదు. ఆ పుస్తకం చదివిన తరువాత ప్రజా దృష్టి నుండి అలా మన ఆంధ్రుల చరిత్ర కూడా ఆ రకంగా రాయాలి అనే ఆసక్తి కలిగింది. అప్పటికే చాలా మంది చరిత్రకారులున్నారు. సోమశేఖరశర్మ మొదలైన చరిత్రకారులు వ్రాసినవన్నీ నేను చదివేను కానీ, మరీ ఇంత లోతుగా ప్రజల దృష్టినుంచి ఆంధ్రుల చరిత్ర వ్రాయాలి అనే ఆసక్తి కలగటానికి ఎ. ఎల్. మోర్టన్ వ్రాసిన పుస్తకమే నాకు చాలా ప్రోత్సాహాన్ని కలిగించింది. ఆ తరువాత అలా చేస్తూ వస్తున్నాను. ఇలా అధ్యయనం చేస్తున్న సందర్భంలో బి.ఎ. పాస్ అయిన తరువాత కుటుంబ పేదరికం వలన తప్పనిసరిగా రెండేళ్ళపాటు ఉద్యోగం చేయవలసి వచ్చింది. ఆర్.ఎం.ఎస్.లో ఉద్యోగంలో చేరాను. పోస్టల్‌ను ఆర్.ఎం.ఎస్. అంటారు. రోజూ విజయవాడ నుంచి విశాఖపట్నం వరకు, విశాఖపట్నం నుండి ఖుర్దారోడ్డు వరకు తిరుగుతూ ఉండేవాళ్ళము. నాలుగు రోజులకు ఒకసారి ఇలా తిరుగుతూ ఉండే వాళ్ళము. అప్పుడే నాకు జాతీయ ఉద్యమంతో సంబంధం ఏర్పడ్డది. కమ్యూనిస్టు ఉద్యమంతో సంబంధం ఏర్పడ్డది. వారి అందరితో సంబంధం ఏర్పడ్డది. ఆ రోజులలో కమ్యూనిస్టు ఉద్యమం, జాతీయ ఉద్యమం రెండూ ప్రక్క ప్రక్కనే నడుస్తుండేవి. అందరూ యుద్ధ వ్యతిరేకత ప్రధానమైన కార్యక్రమంగా చేపడుతూ వుండేవారు. కాంగ్రెసువాదుల, కమ్యూనిస్టుల యుద్ధ వ్యతిరేకత రెండూ ఒకటే కదా!

బెజవాడలో "స్వతంత్ర భారత్" అనే పత్రిక అచ్చు అవుతూ వుండేది. ఈ స్వతంత్ర భారత్ పత్రిక కట్టలను మా ఆర్. ఎం. ఎస్. వ్యానులో తీసుకెళ్ళి మోసుకెళ్ళి అక్కడ నించి విశాఖపట్నందాకా వెళుతుండేవాడిని. దారిలో అనేకమంది కనపడుతూ వుండేవారికి అందచేస్తుండేవాడిని. నాతోటి ఉద్యోగులకు, 'ఏమిటి ఎప్పుడు ఏవో కాగితాలు, పుస్తకాలు పట్టుకువస్తాడు. అవి వాళ్ళకు వీళ్ళకు ఇస్తుంటాడు' అని కొంచెం ఆశ్చర్యంగా ఉండేది. అయినా, వారు ఎవరు పట్టించుకొనేవారు కాదు. అలా గడిచిపోయింది. ఇలా ఈ పుస్తకాలు ఈ పత్రికల ఆఫీసుకెళ్ళి ఖుర్దారోడ్డు వరకు పలాస వరకు దాదాపు 15 రోజులకు ఒకసారి ఎప్పుడూ తిరుగుతూ యిస్తూ ఉండేవాడిని. రెండేళ్ళపాటు ఈ కార్యక్రమం సాగింది.

ఇలా నా దగ్గర నుంచి స్వతంత్ర భారత్ పుస్తకాలు కట్టలు తీసుకున్న వారిలో ప్రముఖుల పేర్లు చెప్పదలచుకుంటే గౌతు లచ్చన్న గారు, ఇపుడు కాంగ్రెస్ నాయకుడు

– వారు అప్పుడు పలాసా స్టేషన్‌కి వచ్చి ఒకరోజు ఇట్లాగే నేను ఇచ్చిన పుస్తకాలు తీసుకెళ్ళారు. 'అరేరే ఏమిటి గౌతులచ్చన్నగారు వచ్చారు. వారికి మీకు సంబంధం ఏమిటండి, వారికి మీకు స్నేహమా?' అని మా పక్క ఉద్యోగులు అంతా అన్నారు. 'అబ్బే ఏమి లేదండి. పరిచయమేనండి. పెద్దగా ఏమి లేదు' అని సర్దిచెప్పేవాణ్ణి. రెండు ఏళ్ళు ఇలా గడిచిపోయింది. ఇంతలోకి 1939 సెప్టెంబర్‌లో యుద్ధం వచ్చింది. రెండవ ప్రపంచ యుద్ధం వచ్చేసింది. అప్పుడు మేము పోస్టలు డిపార్టుమెంట్‌లో పని చేస్తుండేవాళ్ళం కదా. మా మీద కొంచెం నిఘా ఎక్కువైపోయింది. ఎవరీ కుర్రాడు, ఇతను ఏమిటి అటు ఇటు తిరుగుతూ ఉంటాడు. ఏవో పుస్తకాలు ఇస్తూ ఉంటాడు. కాగితాలు ఇస్తూ ఉంటాడు. అని కొందరు (సి.ఐ.డి.లు) అనుమానించారు. అనుమానించి వారు ఏమి చేశారు అంటే, మొత్తం మీద అతనికి ఏదో జాతీయ ఉద్యమ భావాలు, కమ్యూనిస్టు భావాలు ఏవో ఉన్నాయి అని చెప్పి, నన్ను అక్కడి నుండి తీసుకెళ్ళి మద్రాసు ట్రాన్స్‌ఫర్ చేశారు.

మద్రాసులో ఈ ఉద్యోగం కాదు. పోస్టలు ఉద్యోగంలోనే జనరల్ పోస్టాఫీసులోని ఒక చిన్నపోస్టులో పడేశారు అన్నమాట. ఆ పోస్టులో పడేసి కూడా అక్కడ ఏమి చేశారు అంటే, ఇతనికి కొంచెం కమ్యూనిస్టు భావాలు ఉన్నట్లుగా అనుమానంగా ఉంది. ఎందుకైనా మంచిది. ఇతనికి క్యాష్‌కు సంబంధించిన పని ఏమీ ఇవ్వద్దు అని ఆంక్షలు పెట్టారు. నాకు ఆ సంగతి తెలియదు. తీరా వెళ్ళి చూస్తే మీకు ఏమి క్యాష్ ఇవ్వద్దు అన్నారని అన్నారు. పోస్టాఫీసుకు సంచులు వస్తూ ఉండేవి. ఆ సంచులు అన్నీ లెక్కపెట్టడం అనేది ఒక పని. అవి అన్ని లెక్కపెట్టడం, లెక్క రాసుకోవడం అది ఒక పని. అన్నీ లెక్క పెడుతూవుండు అని నాకు ఒకపని ఇచ్చారు. దానిని బ్యాగ్‌ట్రక్ అని అంటారు. అంటే, అది సంచులు లెక్కపెట్టే పని. సో ఏదో ఒక పని. అలా మూడు నెలలు చేశానన్నమాట.

కొంతకాలం చేసిన తరువాత లాభంలేదు, ఇక ఈ అనుమాన వాతావరణంలో ఎంతకాలం పని చేస్తాను అని చెప్పి, ఒక మూడు నాలుగు నెలలు అయిపోయిన తరువాత నేను ఉద్యోగం మానేశాను. అప్పుడు ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమానికి సుందరయ్యగారు ఏకైక నాయకుడు. వారు చెప్పిన ప్రకారం అందరు నడుచుకుంటూ వుండేవారం. అయ్యా, నేను ఉద్యోగం చేయలేనండి. నేను పార్టీ పని చేస్తాను అన్నాను. సరే అన్నారు. ఆ తరువాత రెండేళ్ళు రాయలసీమ జిల్లాల్లో నేను ఒక కమ్యూనిస్టు పార్టీ కార్యకర్తగా పనిచేశాను. అప్పుడూ ఇదే పని, స్వతంత్ర భారత్ పుస్తకాలు తీసుకెళ్ళడం, వారికి వీరికి ఇవ్వటం, అప్పచెప్పటం. అక్కడ జాతీయ ఉద్యమభావాలు కలవారి నందరినీ తీసుకురావటం – ఇదే నా కార్యక్రమం అన్నమాట. మీకు తెలుసు, కడప జిల్లాలో ఈశ్వరరెడ్డిగారు అని ఎం.పి.గా చాలాకాలం పని చేశాడు. ఆ ఈశ్వరరెడ్డిగారి ఇంటికి స్వయంగా నేను వెళ్ళి వారికి కమ్యూనిస్టు సిద్ధాంతాలు చెప్పి వారిలో పరివర్తన తెచ్చాను. వారు తొలి రోజులలో రామకృష్ణ సిద్ధాంతాల మీద బాగా అభిమానం కలవారు. వివేకానంద సిద్ధాంతాలు చదువుతూ వుండేవారు. వారితో కొన్ని రోజులపాటు చర్చించి, ఆ రామకృష్ణ, వివేకానంద సిద్ధాంతాలనుంచి కొద్దిగా కమ్యూనిస్టు సిద్ధాంతాలకు మళ్ళించడంలో నా పాత్రకూడా చాలా వుంది అని నేను ఎప్పుడూ సంతోషంగా, గర్వంగా చెప్పుకుంటాను. ఈశ్వరరెడ్డిగారు

కూడా ఎప్పుడూ చెబుతూ వుండేవారు. అవునండి, మీరే నన్ను కమ్యూనిస్టుగా చేశారు అని. ఈశ్వరరెడ్డి ఎం.పి.గా మూడుసార్లు చేశారు. ఇలా కడప జిల్లాలో ఎక్కువగా చాలాకాలం తరువాత 42 వరకు ఇదే కార్యక్రమాలు సాగిస్తూ వచ్చాను. అప్పుడు నామీద అరెస్టు వారెంటు వుండేది. గుంటూరులో మా ఇంటిపైనా, మా మామగారి ఇంటిమీదా నిఘా వుండేది. అయినా నేను అరెస్టు కాలేదు. మొత్తంమీద జాతీయ ఉద్యమ కాలంలో నా చరిత్ర ఆ రకంగా సాగింది అన్నమాట.

జాతీయోద్యమానికి, కమ్యూనిస్టు ఉద్యమానికి వ్యత్యాసం ఎప్పుడు ప్రారంభమైనది అంటే – 1942లో ప్రారంభమైనది. అప్పటివరకు ఏ వ్యత్యాసం రాలేదు. పక్క పక్కనే నడిచాయి. 1942 క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభమైనది. క్విట్ ఇండియా ఉద్యమం వచ్చిన తరువాత కాంగ్రెసువాదులు క్విట్ ఇండియా ఉద్యమంలో యాక్టివ్‌గా పాల్గొన్నారు. ఆ సమయానికి క్విట్ ఇండియా ఉద్యమం పనికి రాదని, మంచిదికాదని, ఇంకోరకమైన ఉద్యమం సాగించాలి అని కమ్యూనిస్టు పార్టీ మరో వైఖరి తీసుకొచ్చింది. దానితో ఉభయులకు కొంచెం తేడా వచ్చింది. సరే, మంచికో చెడుకో మొత్తంమీద మూడేళ్ళు 42 నుంచి 45 వరకు కాంగ్రెస్ జాతీయ ఉద్యమంలోనుంచి వేరై, కమ్యూనిస్టు ఉద్యమం ప్రత్యేకంగా వుంటూ వచ్చింది. ఇప్పుడు నేను స్వాతంత్ర్య సమరయోధుల పెన్షన్ పొందుతున్నాను అంటే 1942కు పూర్వం బ్రిటిష్ ప్రభుత్వ నిర్బంధకాలంలో అజ్ఞాతవాస జీవితం గడిపిన ప్రాతిపదికమీదనే పొందాను.

42, 45 సంవత్సరాల తరువాత కమ్యూనిస్టు ఉద్యమంలో చాలా ఆటుపోట్లు వచ్చాయి. ముఖ్యంగా 48వ సంవత్సరంలో రణదీవే పార్టీ కార్యదర్శిగా వచ్చిన తరువాత కొంత దుస్సాహస విధానం అవలబించి, ఒకేసారి ప్రభుత్వాన్ని పడగొట్టి రాజ్యం హస్తగతం చేసుకోవాలి అనే పద్ధతిగా ఒక ఆలోచన చేశారు. సరే, అప్పుడు పార్టీ నాయకులు ఏది చెబితే అది చేయటం అందరి పనిగా వుండేది. అప్పుడు 48వ సంవత్సరంలో నేను విశాఖపట్నంలో వుండేవాడిని. పార్టీ కార్యకర్తగా విద్యార్థులలోను, కార్మికులలోను పని చేస్తూ వుండేవాడిని. విద్యార్థులలో, ముఖ్యంగా యూనివర్సిటీ విద్యార్థులలో ఆనాడు సుమారు 40, 50 మంది విద్యార్థులు చాలా ప్రముఖమైన కార్యకర్తలుగా వుండేవారు. వారి అందరికీ ఆ మార్క్సిస్టు సిద్ధాంతాలు బోధించడం, చెప్పటం ఇవే నా కార్యక్రమాలు. అందులో చాలా ప్రముఖులైన వారంతా వున్నారు. 48లో నన్ను అరెస్టు చేశారు. అరెస్టుచేసి మూడేళ్ళ పాటు జైలులో వుంచారు. కడలూరు సెంట్రల్ జైలులో మేము చాలామంది వున్నాము. ఆ జైలులో వుండటం ఒకరకంగా మంచిది అయింది. మంచిది అంటే అర్థం ఏమిటి అంటే, మేము దానిని సద్వినియోగంచేశాం.

డిటెన్యూలుగా వున్న సందర్భంలో మాకు రోజుకు 10/– అలవెన్సు ఇచ్చేవారు. మాకు పది రూపాయలు తినటానికి అవసరం లేదుకదా! అందుకని అందులో డబ్బులు మిగిల్చుకుని పెద్ద లైబ్రరీని ఏర్పాటు చేశాము. దాదాపు పెద్ద లైబ్రరీ అయింది. దాదాపు కొన్ని వేల పుస్తకాలు మేము సంపాదించాము అన్నమాట. నేను ఆ పుస్తకాలు బాగా చదివేస్తే. కంభంపాటి సత్యనారాయణగారు అని మీరు వినేవుంటారు. వారు నాకంటే చాలా పెద్దవారు. మద్దుకూరు చంద్రశేఖరరావుగారు

రాష్ట్ర కమ్యూనిస్టు నాయకులు. మేమంతా జైలులో వుండేవారం. ఈ లైబ్రరీ ఏర్పరచడంలో ప్రధాన పాత్ర కంభంపాటి సత్యనారాయణగారిది. ఆ లైబ్రరీలో History, Philosophy పుస్తకాలు చదవటం నా పని. నేను దాదాపు మూడేళ్ళు ఏకాగ్రతతో ఈ పని చేశాను అన్నమాట. అప్పుడు నాకు ఆంధ్రుల చరిత్ర మీద గొప్ప ఆసక్తి కలగటమే కాకుండా ఆంధ్రుల చరిత్రకు సంబంధించిన మెటీరియల్ అంతా నాకు లభించింది. బయట వుంటే మాత్రం నాకు లభించేదో లేదో చెప్పలేను. అప్పుడే అంతా నోట్సుగా తయారు చేశాను.

ఆంధ్రుల చరిత్ర మొదటినుంచి చివరిదాకా నోట్సుగా తయారు చేసుకోవటమే కాకుండా మరి ఒక విశేషం ఏమిటి అంటే – మేము జైలులో 300 మంది డిటెన్యూలు వుండేవారం. కాలక్షేపం వుండాలి కదా! అందువల్ల రోజు రెండుగంటల పాటు నేను చదివింది అంతా వారికి చెబుతూ వుండేవాడిని కాబట్టి చదవటం, చెప్పటం అనేది అప్పటి నుంచి నాకు అలవాటు అయిపోయింది. రెండుగంటలు పాఠాలు చెపుతుండేవాణ్ణి. ఆంధ్రుల చరిత్ర అలా చెపుతున్నపుడు మా తోడి సహచరులందరూ కూడా ఎంతో ఆసక్తిగా వింటూ వుండేవారు. వారికి ఆసక్తితోపాటు నాకు చెప్పే అలవాటు కూడా సరదాగా వచ్చింది. ఆంధ్రుల చరిత్ర, భారతీయ తత్త్వశాస్త్రం ఈ రెండింటికి సంబంధించిన నోట్సు అంతా కూడా నేను అప్పుడే తయారు చేసుకున్నాను.

తత్త్వశాస్త్రానికి కమ్యూనిజానికి పొంతన ఏమిటి? అని కొందరు అనుకుంటారు. కొంతమందిలో సాధారణంగా అట్టి అభిప్రాయం వుంది. కాని వాస్తవం అదికాదు. ఎందుకంటే, కారల్ మార్క్స్ మొట్టమొదట హెగెల్ తత్త్వశాస్త్రము, యురోపియన్ తత్త్వశాస్త్రము, గ్రీకు తత్త్వశాస్త్రములో మొట్టమొదట పిహెచ్.డి. సంపాదించారు. వారు తత్త్వవేత్తగానే జీవితం ప్రారంభించారు. అసలు మార్క్స్ సిద్ధాంతానికి ఇన్స్పిరేషన్ అంతా కూడ గ్రీకు తత్త్వశాస్త్రంలో నుంచి వారు తీసుకున్నారు. తత్త్వశాస్త్రానికి – కమ్యూనిజానికి సరిపడదని అనడం వాస్తవంకాదు. లోతుగా వెళ్ళి చూస్తే మార్క్స్ యొక్క ఉన్నతి అంతా కూడా తత్త్వవేత్తగానే పొందారు. ఆ తరువాతే ఆర్థికవేత్తగా వచ్చారు. తరువాతనే రాజకీయవేత్తగా వచ్చారు. పైగా ఇంకొక విశేషం కూడా చెబుతాను. అది ఏమిటి అంటే, భారతీయ తత్త్వశాస్త్రం మీద నాలో ఇంతగా ఆసక్తి కలగటానికి మరొక కారణం ఏమిటి అంటే మార్క్స్, ఏంగిల్స్ చాలా అపారమైన మేధావులు. ఏంగిల్స్ ఎన్నో విషయాలు శాస్త్ర విజ్ఞానానికి సంబంధించినవి అనేకం రాశారు. Dialectics of Nature అనే ఒక గొప్ప పుస్తకం వ్రాశారు. అందులో అలా అలా వ్రాసుకుంటూ పోతూ ఒకచోట ఏమన్నారంటే, ప్రాచీనమైన బౌద్ధులలో గతితార్కిక భావాలు వుండేవి అని వ్రాశారు. గ్రీకులలోను ఇలాంటి గతితార్కిక భావాలు ఉండేవి అని వారు వ్రాశారు. ఆ మాట విన్నప్పటినుంచి కూడా మన బౌద్ధతత్త్వశాస్త్రం చదవాలి అని, ఈ బౌద్ధతత్త్వశాస్త్రంలో ఏవో కొన్ని విశేషాలు వున్నవి అని, ఏంగిల్స్ ఏమి చెప్పాడు. మనకు తెలియని విషయాలు ఆయన చెపుతున్నాడు ఏమిటా అని చెప్పి అప్పటినుండి బౌద్ధ తత్త్వశాస్త్రం మీద విశేషమైన ఆసక్తి కలిగి, అప్పటి నుంచి ఇప్పటిదాకా కేంద్రీకరించి అధ్యయనం చేయడం జరిగింది.

1952లో మన విశాలాంధ్ర దినపత్రిక ప్రారంభమైనది. ఆ దినపత్రిక ప్రారంభం అయిన తొలిరోజుల నుంచి వున్న వారిలో నేను ఒకడిని. నాతోపాటు మరొకరు పరకాల పట్టాభిరామారావుగారు వున్నారు. ఇద్దరమే అప్పటి నుంచి ఇప్పటిదాకా కంటిన్యూ అవుతున్నాము. తరువాత నేను విశాలాంధ్ర సంస్థలోనే గల ప్రచురణాలయ బాధ్యతలు నిర్వహించాను. 20 ఏళ్ళు నేను జర్నలిస్టుగానే పనిచేశాను. నిజానికి జర్నలిజం అంటే అప్పటికి నాకు తెలియదు. కాని, చదువుకున్నవారం కనక, బి.ఏ. చదివాను. చరిత్ర, తత్త్వశాస్త్రం ఈ అన్నీ చదువుకున్నాను. వ్రాయటం అలవాటు వుంది. కాబట్టి, ఒక ఆరునెలలు అయిపోయిన తరువాత ఆ జర్నలిస్టు టెక్నిక్ అంటే ఏమిటో కాస్త కాస్త మేము నేర్చుకొని స్వానుభవంద్వారా నేర్చుకొని 20 ఏళ్ళు ఆ జర్నలిజంలో పని చేశాం. సరే, ఆ రోజులలో రాజకీయ జర్నలిజం ఎక్కువ. ఆ రోజులలో విశాలాంధ్ర దినపత్రిక ఒక్కటే ఈ ఊళ్ళో (విజయవాడ) వున్న ప్రధాన దినపత్రిక. ఆ తరువాత క్రమంగా ఆంధ్రజ్యోతి వచ్చింది. ఆ తరువాత ఆంధ్రప్రభ వచ్చింది. ఈ వేళ చాలా పత్రికలు వచ్చాయి. మొదటిలో మాత్రం అదే ఏకైక పత్రిక కనుక, ఆ రోజులలో విశాలాంధ్ర దినపత్రికలో అనేక మంది ప్రముఖ జర్నలిస్టులు ఉండేవారు. మాలో తాపీ మోహనరావుగారు అని ఒకరు, తాపీ ధర్మారావుగారి అబ్బాయి, చాలాకాలం మా దగ్గర పని చేశారు. అలాగే తుమ్మల వెంకటరామయ్యగారు చాలా కాలం మా సంస్థలో పని చేశారు. ఇలా అనేక మంది ప్రముఖులంతా కూడా ఇందులో పనిచేశారు. ఆ రకంగా కేవలం స్వానుభవం ద్వారానే నేను జర్నలిజం నేర్చుకుని క్రమక్రమంగా ఎడిటర్‌గా స్టార్టు అయి చివరి రోజులలో ప్రధాన సంపాదకుడుగా కూడా బాధ్యతలు అంతా నిర్వర్తిస్తూ వచ్చాను.

1972 తరువాత జర్నలిస్టు ఫీల్డులో వున్నప్పటికి నా దృష్టి ఎంతసేపటికి చరిత్ర, తత్త్వశాస్త్రం మీదకు మళ్ళుతుండేది. అది గమనించి మా బాధ్యులైనవారు అయ్యా, మీకు రచనా వ్యాసంగం మీద ఎక్కువ కుతూహలం వుంది. రచనా వ్యాసంగం చూసుకోండి. జర్నలిజం వదిలేయండి. పబ్లిషింగ్‌హౌస్ పని బాధ్యత వహిస్తే మీరు పుస్తకాలు వ్రాయగలరు. పుస్తకాలు వచ్చిన వాటిని సెలక్టు చేయటం ఇట్లాంటి పనులకు మీరు బాగా పనికి వస్తారు. ఆ రకంగా నన్ను ప్రచురణాలయానికి పెట్టేరు. అది చాలా మంచి నిర్ణయం అని నాకు అనిపించింది. ఆ తరువాత 20 ఏళ్ళలో నేను సుమారు పది పుస్తకాలు వ్రాశాను. అన్నీ ఒరిజినల్ వర్క్స్. ఆ పది పుస్తకాలు ముఖ్యంగా చరిత్రకు సంబంధించినవి. ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర దాదాపు 10 ఎడిషన్స్ వెళ్ళిపోయాయి. అంటే, పది ఎడిషన్‌లలో 20 వేల కాపీలు అమ్ముడయిపోయాయి. నేను అనకూడదుకాని, నేను ఎక్కడికి వెళ్ళినా మీరు ఎవరండి అంటే, నేను ఫలానా అంటే, ఓహో ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర వ్రాసిన వారు మీరేనా అని నన్ను ప్రతివారు పలకరించటం సర్వసాధారణమైనమాట. అంతగా ఆ పుస్తకం పాపులర్ అయిపోయింది. తరువాత మన చరిత్ర అనేది ఇండియన్ హిస్టరీ. ఈ రెండూ కూడా చరిత్రకు సంబంధించినవి. తరువాత భారతీయ తత్త్వశాస్త్రము. భారతీయ సంస్కృతి ఈ రెండు కూడా ఫిలాసఫీకి సంబంధించినవి. ఒకటి ఫిలాసఫీ, రెండవది కల్చరు, మూడవది గాంధేయవాదం – తాత్త్వికత అనే పుస్తకం. బౌద్ధం – మార్క్సిజం అనే రెండు పుస్తకాలు నేను రాశాను. అలాగే

మార్క్సిజం – భగవద్గీత అనే పుస్తకం, ఉపనిషత్ చింతన అనే రెండు పుస్తకాలు నేను రాశాను. ఇందులో ఉపనిషత్ చింతన అనే పుస్తకానికి, భారతీయ సంస్కృతి అనే పుస్తకానికి తెలుగు యూనివర్సిటీవారు ఉత్తమ పురస్కారం యిచ్చారు. ఇవికాక ఇటీవల నేను రాసిన రెండు పుస్తకాలు గూర్చి చెప్పాలి. ఒకటి విశిష్ట విశ్లేషణ. ఆంధ్రలో సామాజిక చలనం – ఇవి తాజాగా రాసిన చరిత్ర పుస్తకాలు. బి.ఎస్.ఎల్. హనుమంతరావుగారు అని మీరు వినే వుంటారు. గుంటూరు హిందూ కాలేజీలోను ఆ తరువాత నాగార్జున యూనివర్సిటీ బౌద్ధపీఠంలోనూ దాదాపు 30 ఏళ్ళు చరిత్ర అధ్యాపకులుగా పనిచేశారు. చాలా సుప్రసిద్ధుడైన చరిత్రకారుడు ఇందులో విశిష్ట విశ్లేషణ అని ఎందుకు చెపుతున్నాను అంటే, ఇతర చరిత్రకారులు అందరూ కూడా చేయలేని పని బి.ఎస్.ఎల్. హనుమంతరావుగారు చేశారు. ఏమి చేశారు అంటే ప్రాచీన చరిత్ర కారులు కూడా చేయలేని పనిని Social Mobility of Andhras. Social Mobility Vertical, Horizontal, up ward & down ward శాతవాహనుల కాలంనుంచి ఇప్పటివరకుకూడా సామాజిక చరిత్రను విశ్లేషించారు.

మొదటినుంచి, నాకు భారతీయ తత్త్వశాస్త్రం అధ్యయనం చేసినప్పటినుంచి కూడా బౌద్ధం మీద ప్రత్యేక అభిమానం కలిగింది. నాకు ఇప్పుడు ఏకైక రంధి ఒక్కటే – ఆ బౌద్ధాన్ని గురించి చదవడం ఆలోచించటం వ్రాయటం తప్ప మరొక ధ్యాస దాదాపు లేనేలేదు. ఏకైక ధ్యాసగా తయారు అయిపోయింది. ఎందుకు మీకు బౌద్ధం మీద ఆకర్షణ కలిగింది అని అడిగితే దానికి సమాధానం ఏమిటి అంటే – ప్రాచీన కాలంలో దాదాపు క్రీస్తు పూర్వం 5వ శతాబ్దం దగ్గర నుంచి 500 సంవత్సరాలపాటు బౌద్ధయుగం భారతదేశంలో బ్రహ్మాండమైనటువంటి సామాజిక పునరుజ్జీవనం, సాంస్కృతిక పునరుజ్జీవనానికి తోడ్పడింది. చార్వాకం వుందా అంటే వుంది కాని, చార్వాకం కంటే బౌద్ధంలో వున్న విశేషం ఏమిటి అంటే – బౌద్ధం ఎన్నడూ కూడా ఇతరులను దూషించలేదు. ఎవరిని పల్లెత్తుమాట బుద్ధుడు ప్రత్యర్థుల గురించి అనేవాడు కాడు. ఎంతసేపటికి తన సిద్ధాంతాలు చెప్పకుంటూ పోతూ ప్రశాంత విప్లవం వుండాలి అనేవాడు. బౌద్ధం అనేది ప్రశాంత విప్లవం అనేది భారత దేశంలో జరిగింది. కళలు, సాహిత్యం – ఒకటి ఏమిటి, అన్ని విధాల జరిగింది. బౌద్ధ యుగం ఒకరకంగా స్వర్ణయుగం అని చెప్పవచ్చును. రెండవది ఏమిటి? ఈనాటి ఆధునిక యుగంలో వున్నటువంటి గాంధేయవాదంలో అహింసా సిద్ధాంతం. ప్రపంచం అంతా కూడా ఈనాడు అహింసా సిద్ధాంతంవైపు ఆకర్షించబడుతూంది. ఈ అహింసా సిద్ధాంతాన్ని గాంధీగారు బౌద్ధంలో నుంచే స్వీకరించారు. కాబట్టి, ఆనాటి బౌద్ధం ఈనాటి గాంధీవాదం భవిష్యత్తులో వుండేటటువంటి అహింసా సిద్ధాంతం. ఎప్పటికి అయినా ప్రపంచ సమస్యలకు పరిష్కారం అంతా ఏమిటి అంటే అహింస ద్వారానే జరుగుతుంది అనే నాకు ప్రగాఢ విశ్వాసం ఇటీవల కలుగుతూంది. ఆ భావాలపట్ల ఎక్కువ ఆకర్షితుణ్ణి అవడానికి అదే ప్రధాన కారణం.

ఈ రోజు క్రమక్రమంగా మార్క్సిస్టు సిద్ధాంతంలో రకరకాల మార్పులు వస్తున్నాయి. నేను వ్యక్తిగతంగా ఆ రోజులలో అందరిలాగానే స్టాలినిస్టు సిద్ధాంతం మీద విశ్వాసం కలిగినవాడినే కాని, క్రమక్రమంగా స్టాలినిస్టు సిద్ధాంతం అనే దానిని దాదాపు విసర్జించాను. నేనే కాదు, చాలామంది దానిని విసర్జించారు. అందువల్ల ఇప్పుడు

నేను మీరు మార్క్సిస్టు అవునా కాదా అంటే అవును నేను మార్క్సిస్టునే అయితే క్రియేటివ్ మార్క్సిస్టుని, అని చెప్పుకుంటూ వుంటాను. నేను సృజనశీలమైన మార్క్సిస్టుని. సృజనశీల మార్క్సిజం అంటే ఏమిటి? అంటే, సొంతమైన ఆలోచనలు, సొంతమైన భావాలుంటాయి. మార్క్సిజం సిద్ధాంతం అది ఒక్కటే సర్వసమగ్రత కాదు కనుక ఆ సిద్ధాంతంతోపాటు ఇతర అనేకానేక సిద్ధాంతాలు వస్తున్నాయి; వచ్చినాయి. వాటినన్నింటిని కూడా మేళవించుకొని సర్వసిద్ధాంతాల సమన్వయం ద్వారా భవిష్యత్తులో సత్యాన్వేషణ జరగాలి తప్ప, ఏకైక సిద్ధాంతం ఒక్కటే పరిష్కారం అనేదికాదు అనేటటువంటి నిర్ణయానికి వచ్చాను. మాలో చాలామంది అలా నిర్ణయానికి వచ్చారు. ఆ రకంగా దీనిని క్రియేటివ్ మార్క్సిజం అని చెప్పుకుంటూ వుంటారు. ఇది స్టాలినిజానికి వ్యతిరేకమైనది అని చెప్పుకుంటూ వచ్చాను.

★ ★ ★

# శ్రీ పరకాల పట్టాభిరామారావు



పశ్చిమ గోదావరి జిల్లా కవిటం గ్రామంలో 1920 నవంబరులో ఒక సంపన్న సనాతనాచార బ్రాహ్మణ కుటుంబంలో నేను పుట్టాను. 1929లో గాంధీజీ మా వూరు వచ్చారు. హరిజన నిధికి విరాళాలు అడిగారు. మా ప్రక్క గ్రామం జాతీయోద్యమంలో అందెవేసిన పోడూరు గ్రామం. ఘోషా వదలి చాలామంది క్షత్రియ కుటుంబాల స్త్రీలు సభకు వచ్చారు. గాంధీజీకి వంటి మీద బంగారు ఆభరణాలు నలిచి యిచ్చారు. బాలవితంతువు అయిన మా పెద తండ్రిగారి కుమార్తె పరకాల అన్నపూర్ణ తన మంగళసూత్రాలు, యితర బంగారు నగలు యిచ్చింది (ఆ తరువాత ఆమెకు రాజమండ్రి వీరేశలింగం విడో హోమ్‌లో గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు పునర్వివాహం చేశారు. అందుకు ఆ కుటుంబాన్ని కొంతకాలం వెలివేశారు). అది నేను పాల్గొన్న మొదటి రాజకీయ సభ. అప్పటికి నాకు 9వ యేడు. గాంధీగారిని అదే చూడటం. గాంధీ కాంగ్రెస్, స్వాతంత్ర్య పోరాటం అన్న మాటలు అప్పుడే మనసున పడ్డాయి. మా తండ్రిగారు పరకాల సూర్యనారాయణ జాతీయాభిమాని. ఆంధ్రపత్రిక చదివేవారు. ఉగాది సంచికలు మా యింట వుండేవి. అవన్నీ చదివేవాణ్ణి.

1930–32 ఉప్పు సత్యాగ్రహం సందర్భంలో కాంగ్రెస్ వాలంటీరు దళం కాలినడకను మా గ్రామం మీదుగా మట్టపర్రు వెళ్ళింది. వారందరికి మా ఇంట్లో

మజ్జిగ అవి యిచ్చి సేదదీర్చి పంపడం నాకు బాగా గుర్తువుంది. నేను నా 11వ ఏటనే మా ప్రక్క గ్రామం మార్టేరులోని హైస్కూలులో 5వ తరగతిలో చేరాను. ఒకరోజున యధాప్రకారం టిఫిన్ కారియర్, పుస్తకాలు పట్టుకొని స్కూలుకు వెళ్ళాను. స్కూలులో అడుగు పెట్టేసరికి నిర్మానుష్యంగా వుంది. మా హిస్టరీ మాస్టారు పెదసీతారామస్వామి గారు "అందరూ వూరేగింపు చేస్తుంటే నువ్వు ఎందుకు వచ్చావురా?" అని తిట్టారు. "నాకు ఏమీ తెలియదు. ఏమిటి ఊరేగింపు" అన్నాను. "భగత్‌సింగ్‌ను వురితీశార్రా, విద్యార్థులందరూ సమ్మె చేసి వూరేగింపు చేస్తున్నార్రా. వెళ్ళు నువ్వు కూడా కలువు" అన్నారు. నేను వెంటనే పరుగుపరుగున వెళ్లి వూరేగింపులో కలిశాను. అది 1931 మార్చి 23వ తేదీ, నేను పాల్గొన్న మొదటి దేశభక్తియుత రాజకీయ ప్రదర్శన. (47 ఏళ్ళ తరువాత 1978లో భటిండాలో పార్టీ మహాసభ జరిగినపుడు ఫిరోజ్‌పూర్ దగ్గర లోన్‌వాలాలో సట్లెజ్ నది ఒడ్డున భగత్‌సింగ్, రాజగురు, సుఖ్‌దేవ్‌ల సమాధి స్థలం సందర్శించడం నా జీవితంలో మరపురానిరోజులలో ఒకటి.)

అది ఉప్పు సత్యాగ్రహ సమయం అనుకుంటాను. ఉప్పల లక్ష్మణరావు, మెల్లీ షోలింగర్ దంపతులు తాము తయారుచేసిన సూట్‌కేస్ రాట్నం (బాల్‌బేరింగ్స్ అమర్చినది) ప్రదర్శించడానికి మా వూరు వచ్చారు. ఆ సందర్భంలోనే మెల్లీ షోలింగర్ రాజోలు నుండి నర్సాపురం సుమారు 14 మైళ్లు గోదావరిలో యీదుకుంటూ వచ్చి ఉభయ గోదావరి ప్రజలను సంభ్రమాశ్చర్యాలలో ముంచారు. ఆ రోజుల్లో విద్యార్థులం దీనిని కథలు గాథలుగా చెప్పుకున్నాం. 1935-1936లో ఇవటూరి శరభరాజు అనే కాంగ్రెస్ యువకుడు (ఆయన ఉప్పు సత్యాగ్రహంలోనే 15-16 యేట జైలుకు వెళ్ళి వచ్చాడు) మా హైస్కూలు వార్షికోత్సవంలో పాల్గొని అనర్గళంగా మాట్లాడి మమ్మల్నందర్నీ ఆకర్షించాడు. జవహర్‌లాల్ నెహ్రూ లక్నో కాంగ్రెస్ ఉపన్యాసం "విదర్ ఇండియా" (భారతదేశమా? నీ గమ్యం ఏమిటి?) అన్న చిన్న కరపత్రం యిచ్చి చదివించారు. స్వాతంత్ర్యంతోపాటు సోషలిజం కావాలి అన్నది వాటిలోని సారాంశం. అలాగే వినాయక సావర్కార్ జీవితం, భగత్‌సింగ్ జీవితం, రమేష్‌చంద్ర దత్తు వ్రాసిన, భారతదేశంలో బ్రిటిష్ పాలన, మొదలైన గ్రంథాలు యిచ్చి శ్రీ శరభరాజు మాచే చదివింపజేశారు. ఆయన అప్పటికే కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలోను, కమ్యూనిస్టు పార్టీలోను చేరారు. అందుచేత మాకు సోషలిజం, కమ్యూనిజం అంటే ఏమిటో చెప్పేవారు. నేను ఫిఫ్తుఫారం చదువుతుండగానే శరభరాజుగారి ప్రోత్సాహంతో మార్టేరు విద్యార్థి సంఘం నిర్మాణం చేశాను. డిబేటింగ్ సొసైటీ చర్చలు, డిఫెన్షన్ వ్యతిరేక ఆందోళన, తదితర కార్యక్రమాలు చేపట్టాం.

"అండమాన్స్ - ది ఇండియన్ బాస్టిలీ" అన్న శ్రీ విజయకుమార్ సిన్హా (ఆయన భగత్‌సింగ్ సహచరుడు) గ్రంథాన్ని మా వూళ్లో కాంగ్రెస్‌వాది (ఆ తరువాత పార్లమెంటు మెంబరు) అయిన శ్రీ దాట్ల బలరామరాజుగారు నాకు యిచ్చి చదివింపజేశారు.

1937 నవంబరులో పాలకొల్లులో రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ మూడవ మహాసభ జరిగింది. ఆ సభలోను, వూరేగింపులోను విద్యార్థులం పాల్గొన్నాం. వలంటీర్లుగా పనిచేశాం. అండమాన్ జైలు నుండి విడుదలై వచ్చిన కాకినాడ

బాంబు కేసు వీరుడు భయంకరాచారి (ప్రతివాది భయంకర వెంకటాచారి) ఆ సభకు వచ్చారు. ఆయనను అల్లూరి సత్యనారాయణగారు పరిచయం చేశారు. ఈ సభకు శ్రీ జయప్రకాశ్‌నారాయణ వచ్చారు. ఆయనను నిడదవోలులో రైలు నుండి దింపుకొని శ్రీ ఘంటదరయ్య, శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగార్లు నిడదవోలు, పెరవలి, పెనుగొండలలో వరుసగా సభలు జరుపుకుంటూ మార్టేరు వచ్చారు. అక్కడ విద్యార్థుల సభ జరిపాం. ఉదయంపూట స్కూలు ఎగగొట్టాం. విద్యార్థి సంఘం పెట్టుకొంటే మమ్మల్ని హెడ్మాష్టరుగారు నానా నిర్బంధాలు పెడుతున్నాడని చీటి వ్రాసి జయప్రకాశ్ నారాయణకు పంపాం. "విద్యార్థులు తమ సంస్థల ద్వారా స్వాతంత్ర్య పోరాటంలోకి వస్తుంటే యిలా నిర్బంధం చేసేవాడు 16వ శతాబ్దంలో వుండదగినవాడు" అని బ్రిటిష్ లాయలిస్టు అయిన ఆ హెడ్మాస్టరు శ్రీ బి. వి. నారాయణను జయప్రకాశ్ గట్టిగా విమర్శించాడు. ఆ విషయం ఆయనకు ఎవరో మోశారు. మధ్యాహ్నం మూడు పిరియడ్లు (స్కూలు ఫైనల్‌లో వున్న) మమ్మల్నందరిని నుంచోబెట్టి, మీ ఎస్.ఎస్.ఎల్.సి సర్టిఫికేట్‌లను రస్టికేట్ చేయిస్తానని విరుచుకుపడ్డారు. మా మీద మరిన్ని వత్తిడులు వచ్చాయి. (1942 మేలో అరెస్టయిన ఎండగండి బ్యాచి విద్యార్థులకు వ్యతిరేకంగా యీ మహానుభావుడు కోర్టులో సాక్ష్యం కూడా యిచ్చాడు.) 1938లో జిన్నూరులో శ్రీ ఎస్. ఎ. డాంగే సభలో పాల్గొన్నాం. 1938 మే నెలలో మంతెనవారి పాలెం రాజకీయ పాఠశాలకు వెడదామని ఎంతో ప్రయత్నం చేశాను. కాని, డబ్బులేక ఆ అవకాశం కోల్పోయాను.

అవి ఆర్థిక మాంద్యం రోజులు. బస్తా ధాన్యం రెండున్నర – మూడు వుండేది. నేను కాలేజీలో చదువుకుంటానని అంటే "నీ కాలేజీ చదువుకు యేడాదికి వంద బస్తాల ధాన్యం అమ్మాలి. ఈ పెద్ద కుటుంబం ఎలా నడుస్తుంది?" అని మా తండ్రి పిన తండ్రులు వీల్లేదు పొమ్మన్నారు. మాకు 20 ఎకరాల మాగాణి భూమి వుండేది. యేడాదికి 200 బస్తాల ధాన్యం మగతా వచ్చేది. నాకు చిన్నప్పటి నుండి చిత్రలేఖనం, సంగీతం అంటే యిష్టం. బాగా బొమ్మలు వేసేవాణ్ణి. పాటలు పాడేవాణ్ణి. బందరులో జాతీయ కళాశాలకు అడివి బాపిరాజుగారు ప్రిన్సిపాల్‌గా వుండేవారు. వారు వ్రాసిన నారాయణరావు నవల, విశ్వనాథ సత్యనారాయణగారు వ్రాసిన వేయి పడగలు నవల ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రికలో ధారావాహికంగా వచ్చేవి. అవి చదివాను. బాపిరాజు గారంటే అభిమానం ఏర్పడింది. వారికి ఉత్తరం వ్రాశాను. "జాతీయ కళాశాలలో చేర్చుకుంటాం. నెలకు రూ.8 స్టైపెండ్, నీవు రాదలిస్తేరా" అని వారు ఉత్తరం వ్రాశారు. ఈ లోగా కామ్రేడ్ శరభరాజుగారి ప్రోత్సాహంతో కాకినాడ పిఠాపురం మహారాజా కళాశాలకు వెళ్ళాలని నిశ్చయించి ఇంట్లో డబ్బు అడిగితే యివ్వం పొమ్మన్నారు. మా తండ్రి వెంటపడి పొలందాకా వెడితే "కిరాణాకొట్టు మీద రూ.5/– తీసుకో పో. నీ యిష్టం" అన్నారు (అప్పటికి స్వంత వ్యవసాయం పెట్టారు మా వాళ్ళు). ఆ అయిదు రూపాయలు, ఒక జత బట్టలు, ఎస్.ఎస్.ఎల్.సి సర్టిఫికేట్‌తో (కాకినాడ బాంబుకేసు నిందితుడు కాకరాల కామేశ్వరరావుగారికి శరభరాజుగారు పరిచయ ఉత్తరం యిచ్చారు) కాకినాడ బంధువుల ఇంటికి చేరాను. సత్రవులో ఉచిత భోజనం కోసం నేను, మా బంధువు ఊరంతా తిరిగాం. ఎక్కడా దొరకలేదు. 20 ఎకరాలున్న సంపన్న కుటుంబంలో

పుట్టి పేద విద్యార్థిగా వ్యవహరించవలసి వచ్చింది. సరాసరి కాలేజీ ప్రిన్సిపాల్ దగ్గరకు వెళ్లి నా మార్కులు (అన్ని అరవైలు వచ్చాయి) చూపి, నన్ను ఎలాగైనా కాలేజీలో చేర్చుకోవాలని విన్నవించాను. ఒక టరమ్‌ఫీజు (రూ. 70/-) కట్టుకుంటే స్కాలర్‌షిప్పు, హాస్టల్‌లో సగం కన్సెషన్ యిస్తామని ప్రిన్సిపాల్ శ్రీ పెద్దాడ రామస్వామి అన్నారు. ఆయన బ్రహ్మసామాజికుడు. ఔదార్యం చూపారు. "మీరు రూ.70 డబ్బు పంపకపోతే నేను యిక మీకు కనపడను" అని ఇంటికి బెదరింపు ఉత్తరం వ్రాశాను. (అప్పటికే నాకు 17వ యేట, 1937లో అతి బాల్యవివాహం కాకపోయినా బాల్యవివాహమే జరిగింది. వధువు 11 ఏళ్ళ అహల్యాదేవి, వేలువిడిచిన మేనత్తకుమార్తె.) నా ఉత్తరంతో మా కుటుంబం గందరగోళం పడిపోయి మా వూరు నుండి వచ్చే ఇద్దరు విద్యార్థుల ద్వారా డబ్బు, బట్టలు పంపారు. సంపన్నకుటుంబంలో పుట్టి కాలేజీలో చదువుకోడానికి యిన్ని పాట్లు పడవలసి వచ్చినందుకు కుటుంబ పెద్దల మీద, సమాజం మీద అప్పటికే నాకు తిరుగుబాటుతత్వం ఏర్పడింది. విద్య కోసం పేద విద్యార్థులు పడే అవస్థలు నాలో మరింత ఆలోచన, చైతన్యం రేకెత్తించాయి. నా క్లాస్‌మేట్ గుంటూరు బాపనయ్య పిఠాపురం మహారాజా వారి ఔదార్యంతో హరిజన వసతి గృహంలో వుండేవాడు. అప్పటికే దేశ స్వాతంత్ర్య కాంక్ష, సోషలిస్టు భావాలు నాకు మనస్సులో గాఢంగా నాటుకున్నాయి. కమ్యూనిస్టు పార్టీ నిషిద్ధంలోనే వుంది. ఉప్పుటేరు ఒడ్డునున్న పీచుకార్మిక సంఘం, స్టీవ్‌డోర్ కార్మికసంఘం ఆఫీసుకు వెళ్ళడం, కార్మిక సమావేశాల్లో జాతీయగీతాలు, విప్లవగీతాలు పాడటం, బోర్డులు వ్రాయడం, వూరేగింపుల్లో పాల్గొనడం, పట్టణ విద్యార్థి సంఘంలో చురుకుగా పాల్గొనడం జరిగింది. కొరపాటి పట్టాభిరామయ్య, సి.వి.కె.రావు, కాలేజీలో ఇంటర్ సీనియర్ చదువుతూన్న పి. ఎస్. శర్మ, ఇంటర్ చదివి మానివేసి పార్టీలో కార్మిక సంఘాల్లో పనిచేస్తున్న పర్వతనేని వెంకటేశ్వరరావు (పెదనందిపాడు పన్నుల నిరాకరణ ఉద్యమ నాయకుడు పర్వతనేని వీరయ్యచౌదరి గారి కుమారుడు), డాక్టర్ వీరయ్య, మహీధర రామమోహన్, జగన్మోహన్ (వీరు ఇరువురు మాకు మార్క్సిస్టు మూలసూత్రాల గురించి స్టడీ సర్కిల్స్ నడిపేవారు) వీరితో పరిచయాలు కమ్యూనిస్టు ఉద్యమానికి మరింత సన్నిహితమొనర్చాయి.

మాకు దేవులపల్లి కృష్ణశాస్త్రి గారు తెలుగు ట్యూటర్, పాలగుమ్మి పద్మరాజు కెమిస్ట్రీ డిమాన్‌స్ట్రేటర్, సూరి భగవంతంగారు ఫిజిక్స్ శాఖాధిపతి (వారు అనారోగ్యం వలన నేను కాలేజీకి వచ్చేసరికి సెలవుపై వెళ్ళారు). గోపరాజు రామచంద్రారావుగారు అంతకుముందు కొద్ది యేళ్ళ వరకు కాలేజీలో వుండేవారు. కాలేజీలో బెంగాలీ లెక్చరర్లు ఎక్కువ వుండేవారు. బ్రహ్మ సమాజం మందిరంలో ప్రార్థనా సమావేశాలు, కృష్ణశాస్త్రి గారి ఇంట సాహిత్య గోష్ఠులు, ఏటేటా కాలేజీలో ఆంధ్రాభ్యుదయోత్సవాలు, కృష్ణశాస్త్రిగారి మేనకోడళ్ళు సీత, అనసూయల భావగీతాలు, జాతీయ గీతాలు, బి.వి. నరసింహారావుగారి నృత్యాలు, జాతీయోద్యమ ప్రముఖులు వేదాంతం వెంకటకృష్ణయ్య, వేదాంతం కమలాదేవి, డాక్టర్ చెలికాని రామారావు మొదలైన వారి సాన్నిహిత్యం, కాకినాడలో జాతీయోద్యమం, సాంఘిక, సాంస్కృతిక ఉద్యమాల ప్రభావం మా మీద ఎంతో వుండేది. కృష్ణశాస్త్రిగారు

"స్వాతంత్ర్యం, శాంతి, అభ్యుదయం" అన్న విద్యార్థి జెండా మూడు ఆశయాలు వచ్చేటట్లు "ఆకాశము నొసట పొడుచు అరుణారుణ తార, ఏకాకి నిశీధి నడచు తరుణకాంతిధార" అని వ్రాసిన గేయం పాడేవారం.

నైజాం సంస్థానంలో "వందేమాతరం" గేయం పాడరాదని నిషేధించితే విద్యార్థులు నాగపూర్ తదితర చోట్లకు వెళ్ళిపోయారు. వారికి సంఘీభావంగా కాకినాడలో సభ జరిపాం. సర్ అక్బర్ హైదర్‌ని ఆంధ్ర యూనివర్సిటీ స్నాతకోత్సవానికి పిలిచిన వైస్‌ఛాన్సలర్ సర్ సి.ఆర్. రెడ్డి కాకినాడ వస్తే నిరసన ప్రదర్శనలు చేశాం. "స్టూడెంట్స్ కాల్" పత్రిక, నేషనల్ ఫ్రంట్, నవశక్తి పత్రికలు చదివేవాళ్ళం. పాలస్తీనా విమోచన పోరాట సహాయ నిధి కూడా వసూలు చేసినట్లు జ్ఞాపకం. 1939 సెప్టెంబరు 1,2 తేదీలలో కాకినాడలో 16వ ఆంధ్రరాష్ట్ర విద్యార్థి మహాసభ జరిపాం. నేను కాకినాడ పట్టణ విద్యార్థి సంఘ కార్యదర్శిగా, ఆహ్వాన సంఘ కార్యదర్శిగా ప్రధాన బాధ్యతలు నిర్వహించాను. సభా ప్రారంభకులు శ్రీ సుభాష్‌చంద్ర బోసు, జొన్నలగడ్డ రామలింగయ్య అధ్యక్షులు, డాక్టర్ జి. రామకోటేశ్వరరావు, కె. సోమయ్య, కుప్పా వెంకట్రామశాస్త్రి గుంటూరు విద్యార్థి నాయకులు, తదితర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ నాయకత్వం అంతా వచ్చింది. సెప్టెంబర్ 1వ తేదీన రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. ఆ మరునాడు మహాసభ. వేదిక నుండి అధ్యక్షులు శ్రీ రామలింగయ్య యీ విషయం ప్రకటించారు. సభలో పెద్ద సంచలనం బయలుదేరింది. ఈ సభలో పాల్గొన్న కొద్దికాలానికే సుభాష్‌చంద్ర బోస్ దేశం నుండి అంతర్హితుడయ్యాడు. సెప్టెంబరు 7వ తేదీన రాష్ట్రంలోనే కాదు, దేశంలోనే మొదటి యుద్ధ వ్యతిరేక విద్యార్థి సమ్మె చేశాం. ఆ మరునాడు ఆలిండియా రేడియో కాకినాడ విద్యార్థులు యుద్ధ వ్యతిరేక సమ్మె గురించి ప్రముఖంగా వార్తాప్రసారం చేసింది. మద్రాసు కాంగ్రెస్ మంత్రివర్గం రాజీనామా యిచ్చింది. కాంగ్రెస్ ఆఫీసులోని సైక్లోస్టయిల్ మీద రహస్య కరపత్రాలు, గోడలనిండా రాతలు మొ॥ వాటితో సామ్రాజ్య వాద యుద్ధ వ్యతిరేక ప్రచారం ముమ్మరం చేశాం. మాపై సి.ఐ.డి.ల నిఘా, అరెస్టులు ప్రారంభమయ్యాయి. కామ్రేడ్స్ పి.ఎస్. శర్మ, సి.వి.కె. రావు ప్రభృతులను అరెస్టు చేసి, కేసులు పెట్టి శిక్షలు విధించారు. కామ్రేడ్ కంభంపాటి సీనియర్‌గారిని ఇంటర్న్ చేశారు. తరువాత అరెస్టు చేశారు.

నేను, పర్వతనేని వెంకటేశ్వరరావు, మహీధర రామమోహన్, కొరపాటి, పెన్మెత్స అనంతరం తదితర జిల్లా నాయకులందరం అజ్ఞాతవాసంలోకి వెళ్ళిపోయాం. నా చదువుకు స్వస్తి చెప్పాను.

నేను రహస్యంగా వుంటూనే జిల్లా విద్యార్థి సంఘ ఆర్గనైజర్‌గా తుని నుండి రాజోలు వరకు జిల్లాలో ఆ మూల నుండి యీ మూలవరకు పర్యటించుతూ విద్యార్థి ఉద్యమ నిర్మాణం చూస్తూ వుండేవాణ్ణి. ఆరునెలలపాటు జిల్లా పార్టీ రహస్య కేంద్రంలో నేను, పర్వతనేని వెంకటేశ్వరరావు కార్యదర్శులుగా పనిచేశాము. రాష్ట్ర విద్యార్థి మహాసభ జయప్రదంగా జరిగిన తర్వాత కామ్రేడ్ పి. ఎస్. శర్మ నాకు కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం యిస్తున్నాం అని చెప్పి సభ్యుడుగా తీసుకొన్నారు. అది 1939 అక్టోబరు – నవంబరు అనుకుంటాను.

1941 జూన్ 22వ తేదీ సోవియట్‌పై నాజీ దండయాత్ర జరిగినరోజు.

అంతకుముందు రాత్రే నేను మా జిల్లా పశ్చిమ గోదావరికి నా పార్టీ సభ్యత్వాన్ని బదిలీ చేసుకొని రహస్యంగానే వెళ్ళిపోయాను. నా ప్రియమిత్రుడు కామ్రేడ్ పర్వతనేని వెంకటేశ్వరరావు సి.ఐ.డి.ల నుండి తప్పించుకొని వెళుతూ ప్రమాదవశాత్తు పొలం బావిలోపడి మరణించడం నా జీవితంలో పెద్ద విషాదం. 1942 జులైలో పార్టీపై నిషేధం తొలగేవరకు నేను అజ్ఞాతవాసంలో వుంటూనే పశ్చిమ గోదావరి జిల్లాలో విద్యార్థి సంఘం ఆర్గనైజరుగా పని చేశాను. అప్పటికి మా జిల్లాలో కాలేజీ లేదు. 11 హైస్కూళ్ళలో విద్యార్థి సంఘాలను నిర్మించి, జిల్లాలో బలమైన విద్యార్థి ఉద్యమాన్ని నిర్మించడం జరిగింది. డిఫెన్స్ ఆఫ్ ఇండియా రూల్స్ క్రింద నాపై అరెస్టు వారంటు జారీ చేసి, కవిటంలో మా ఇంటిపై (గుడివాడలో మా అత్తవారి ఇంటిపై) పోలీసులు ఒకేసారి దాడి జరిపారు. ఆ సమయంలోనే 1942 మే నెలలో పశ్చిమ గోదావరి జిల్లా ఎండగండిలో విద్యార్థి ప్రచారదళాన్ని బ్రిటిష్ ప్రభుత్వం అరెస్టు చేసింది. స్వయానా నా తమ్ముడు పరకాల రమణరావు, పరకాల శేషావతరం (పినతండ్రి కుమారుడు), వంక సత్యనారాయణ, భూపతిరాజు సుబ్బరాజు, పి. సంజీవరావు (ఎస్. పి.), నండూరి రామారావు, నల్ల సోమరాజులను అరెస్టుచేసి 6 నెలలు స్పెషల్ మేజిస్ట్రేట్ కోర్టులో విచారణ (అండర్ ట్రయిల్స్) జరిపి ఆరు నెలలు కఠిన శిక్షలు వేసి బళ్ళారి సెంట్రల్ జైలుకు పంపారు. మా జిల్లా విద్యార్థి ఫెడరేషన్‌ను ప్రభుత్వం నిషేధించింది. వారందరినీ నేను పార్టీ సభ్యులుగా రికమెండ్‌చేసి చేర్చుకోవడం జరిగింది. జైలు నుండి విడుదలైన తరువాత ఎండగండి బ్యాచ్ అందరూ పార్టీ హోల్ టైమర్సు అయ్యారు. (పరకాల శేషావతారం ఆ తరువాత అల్లూరి సత్యం వలెనే 1952లో కాంగ్రెస్‌లోకి పోయి మంత్రి అయ్యాడు, కీర్తిశేషుడయ్యాడు.)

మా కుటుంబంలో సనాతన సంప్రదాయాలకు వ్యతిరేకంగా సాంఘిక సంస్కరణల కోసం జరిగిన పోరాటం గురించి కూడా కొంచెం చెప్పాలి. నా తమ్ముడు రమణరావు ప్రేమించిన యువతికి బలవంతంగా పెళ్లిచేశారు. ఈ నిర్బంధపూర్వక వివాహాన్ని ఆమె ఎదిరించలేకపోయింది. కాపురం చేయడానికి నిరాకరించి ఆత్మహత్యకు ప్రయత్నించింది. ఈ విషయం తెలిసి ఆమెకు ధైర్యం చెప్పి టీచరు ట్రైనింగ్‌కు పంపాం. ఈలోగా మా తమ్ముడు రమణరావు జైలు నుండి విడుదలై రాగానే పాలకొల్లు కమ్యూనిస్టు పార్టీ ఆఫీసులో కామ్రేడ్స్ ఉద్దంరాజు రామం, మృత్యుంజయుడు తదితరులందరం కలిసి పూలదండల పెళ్ళిచేశాం. ఒక గోత్రంలోకి వెళ్ళిన పిల్లను తెచ్చి మళ్ళీ పెళ్ళి చేస్తారా? కులభ్రష్టులారా! అని మా పెద్దలు ఒక యేడాది మమ్మల్ని యింటికి రానివ్వకుండా బహిష్కరించారు. అది కుటుంబంలోకి తీవ్ర సంచలనం, వ్యతిరేకత తెచ్చింది. ఆమె టీచరుగా పనిచేయడం పెద్ద అవమానంగా, అప్రతిష్టగా మా వాళ్ళు ఎంచారు. ఆ తరువాత యింటికి రానిచ్చినా ఆమెను చాలాకాలం వంట ఇంట్లో అడుగుపెట్టనివ్వలేదు.

అలాగే మా వేలు విడిచిన పినతండ్రి కుమారుడు పరకాల శేషావతారం నర్సాపురంలో కాంగ్రెస్ వాదులైన శ్రీ కామన సత్యంగారి కుమార్తె కాళికాంబను కులాంతర వివాహం చేసుకొనడం మా కుటుంబాల్లో మరింత గాలి దుమారం లేపింది. కాళికాంబ కుటుంబం సెట్టిబలిజ కులస్తులు. పార్టీ ఆధ్వర్యాన ఆ రోజుల్లో

నిర్బంధంగా జరిగిన వివాహాలను రద్దుచేసి పునర్వివాహాలు, వర్ణాంతర వివాహాలు చాలాచేశాం. కామ్రేడ్ మారెళ్ల కులాంతర వివాహం నేనే జరిపించాను. శేషావతరం తండ్రి యీ కులాంతర వివాహానికి భరించలేక దిగులుతో చనిపోయారు. శేషావతరానికి చాలాకాలం ఇంట్లో విస్తరివేసి అన్నం పెట్టలేదు. వీధి వసారాలో పెట్టేవారు. ఇన్ని అవమానాలను, బహిష్కరణలను ధైర్యంతో ఎదుర్కొన్నాం.

ఇదిలా వుండగా మా ఇంట్లో మా అక్కగారు (ఆమె 24వ యేట భర్త చనిపోయారు) గోపరాజు సీతాదేవి, నా భార్య అహల్యాదేవి, మా తమ్ముని భార్య సుశీలాదేవి అందరినీ మహిళా ఉద్యమంలోకి, తరువాత పార్టీలోకి తీసుకురాగల్గాము. బెజవాడలో 1943 తొలి మహిళా రాజకీయ పాఠశాలకు వీరిని పంపాము. సంపన్న బ్రాహ్మణ కుటుంబంలో స్త్రీలు గడపదాటి బైటికి రావడమే ఆ రోజుల్లో తప్పు. గ్రామాలంట మహిళా సంఘాల నిర్మాణానికి తిరగడం, అన్నికులాల వారి ఇళ్లలో భోజనం చేయడం – దీనితో మా ఇంట్లో నిజంగానే పెద్ద విప్లవం వచ్చింది. కొన్ని సంవత్సరాలు మేము గృహత్యాగం చేయవలసి వచ్చింది. ఆ రోజుల్లో బ్రాహ్మణ కుటుంబాల నుంచి వచ్చి ఎవరైనా కమ్యూనిస్టు పార్టీలో సభ్యు లవ్వాలంటే యింటా – బైటా అడుగడునా తీవ్ర పోరాటం చేయనిదే కమ్యూనిస్టులు కాలేదు.

మా కుటుంబంలో యింతమంది స్వాతంత్ర్య సమరంలో పాల్గొనడం, కమ్యూనిస్టు ఉద్యమంలోకి తీసుకొని రావడం, సంఘ సంస్కరణలను తీసుకురావడం – అందుకు "తా చెడ్డ కోతి వనమల్లా చెరిచిందన్న" బిరుదును నేను పొందడం నిజంగానే నాకు గర్వకారణంగా భావిస్తున్నాను. తమ బిడ్డలు ఉద్యోగాలు సంపాదించి పైకి రావాలని తల్లిదండ్రులు ఆశించడం సహజమే. మేము స్వాతంత్ర్యోద్యమంలో కష్టజీవుల విముక్తి పోరాటంలోకి దూకి జైళ్ళు, అజ్ఞాతవాసాలు, నిర్బంధాలు, చివరకు కాల్పులకు కూడా వెరవకుండా త్యాగాలకు, అగ్నిపరీక్షలకు గురికావడానికి ఎంతో చైతన్యం వుంటే తప్ప సహజంగానే తల్లిదండ్రులు బాధపడతారు. ఆచారవ్యవహారాలు, సంప్రదాయాల విషయంలో ఎన్ని పట్టింపులు విధి నిషేధాలు పెట్టినా మాపై వారికి ప్రేమాభిమానాలు లేకపోలేదు. మా తండ్రిగారికి తన 38వ యేటనే మా అమ్మ చనిపోయింది. మా క్షేమం కోరి ఆయన మళ్ళీ పెళ్ళిచేసుకోకుండా త్యాగంతో వుండిపోయారు. మా తండ్రి సూర్యనారాయణగారు, మా పినతండ్రి అప్పారావుగారు, ఎన్ని ఒడిదుడుకులు వచ్చినా జాయింట్ కుటుంబ ఆస్తిని పాడుచేయకుండా, కాపాడుకుంటూ మాకిచ్చి పోయారు. మూడవతరం విద్యా, విజ్ఞానాలకు ఆ ఆస్తి ఉపయోగపడింది.

నేడు కమ్యూనిస్టు ఉద్యమం చీలిపోవడం, సాంఘిక, సాంస్కృతిక వివాహ రంగాలలో మన ప్రభావం తగ్గిపోవడం, మళ్లీ తిరిగి వరకట్నాల వంటి సాంఘిక దురా చారాలు, వాస్తు పిచ్చి వంటి మూఢనమ్మకాలు, కుల, మత, ఛాందసభావాలు పెచ్చు పెరగడం, సాంఘిక రాజకీయ విలువలు దిగజారడం – యీ తిరోగమన లక్షణాలు సహ జంగానే విచారం కల్గిస్తున్నాయి. బాధాకరంగా వున్నాయి. తిరిగి కమ్యూనిస్టు ఉద్యమం, వామపక్ష ఉద్యమం సమైక్యమై పూర్వవైభవాన్ని ఎప్పుడు సంతరించుకుంటుందా? అని ఎదురుచూడటం, అందుకు చేతనైన కృషి చేయడం, జీవితాంతం దేశభక్తితో కమ్యూనిస్టుగా శక్తివంచన లేకుండా పాటుపడడం జీవిత పరమావధిగా భావిస్తున్నాను.

# కీ.శే. మోదుమూడి శ్రీహరిరావు



నేను కృష్ణాజిల్లా పాత దివి తాలూకా అవనిగడ్డ దగ్గర మోదుమూడి శివారు రామచంద్రపురంలో 1917 సంవత్సరంలో మోదుమూడి వెంకట సూర్యప్రకాశరావు, మహాలక్ష్మమ్మగార్లకు జన్మించాను. నాకు ముగ్గురు అన్నలు, ఇద్దరు అక్కలు, ఇద్దరు తమ్ముళ్ళు వున్నారు. మూడో అన్న పూజ్యులు రామారావుగారు కాంగ్రెస్ వాది. 1941 వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించి విడుదల అయి వ్యాధిగ్రస్తులై కొద్ది కాలానికే మృతిచెందారు. మా ప్రాంతం చాలా వెనుకబడిన ప్రాంతం. అంటరానితనం మహారాక్షసిగా వున్నది. అక్షరాస్యత చాలా తక్కువ. భూస్వాముల దోపిడీ, వెట్టిచాకిరీ, వ్యవసాయ కార్మికులకు ధాన్యం పిచ్చి ముంతలతో (తక్కువ) యివ్వటం, బస్తా ధాన్యం యిచ్చి రెండు, రెండున్నర బస్తాలు వసూలు చేయటం వంటి దోపిడీ విధానం యధేచ్ఛగా సాగుతోంది. వ్యవసాయ కార్మికుల కూలిరేట్లు చాలా తక్కువ. స్వాతంత్ర్యోద్యమ ప్రభావం నాపై బడింది. బ్రిటిషు పాలన పోతేగాని మోక్షం లేదని, పీడిత ప్రజల కొరకు పోరాడాలనే కాంక్ష వృద్ధి చెందింది.

గురజాడ అప్పారావు, వీరేశలింగం పంతులుగార్ల సంఘ సంస్కరణల ప్రభావంతో మా సమీపంలో హంసల దీవి దగ్గర సముద్ర స్నానాలకు హరిజనులను తీసుకొని వెళ్ళి స్నానాలు చేయించి గుళ్ళో ప్రవేశింపచేశాం. హరిజనులు సముద్ర స్నానం చేయకూడదనే ఆంక్ష వుండేది. అవనిగడ్డ బోర్డు హైస్కూలులో 1936 సం.లో ఎస్.ఎస్.ఎల్.సి. చదువుతున్న రోజుల్లో డిటెన్షన్‌కు వ్యతిరేకంగా స్కూలు ముందు పికెటింగు చేస్తుంటే హెడ్ మాస్టరు చెంపపై కొట్టి లాగివేశారు. కాంగ్రెస్‌వాది. ఆ సంవత్సరం డిటెన్షన్ రద్దు చేశారు. 1930లో – బందరు సమీపంలోని చిన్నాపురంలో ఉప్పు సత్యాగ్రహ శిబిరం నిర్వహించబడింది. ఫ్రెంచి పేటలో సత్యాగ్రహానికి వాలంటీర్లను తయారు చేయుటకు శిబిరం నిర్వహించబడింది. అందులో అమరజీవి చండ్ర రాజేశ్వరరావుగారు వాలంటీరుగా నిర్వహించిన పాత్ర, హిందూ కాలేజీ హాస్టల్‌లో రౌడీలకు వ్యతిరేకంగా నిర్వహించిన వీరోచిత పాత్ర తెలుసుకున్న నాకు ఉత్తేజాన్నిచ్చాయి. 1936 శాసనసభకు జరిగిన ఎన్నికల్లో జస్టిస్ పార్టీ జమీందార్లకు వ్యతిరేకంగా కాంగ్రెస్ అభ్యర్థుల గెలుపుకు "దారి డొంకలు లేని వూళ్ళున్నా" "ఎగరాలి, ఎగరాలి ఎర్రజెండా" అని పాడుకుంటూ ప్రచారం చేశాం. 1937లో కొత్తపట్నం, 1938లో వంతెనపాలెం రాజకీయ పాఠశాలల సమాచారం నా ఉత్తేజాన్ని యినుమడింపచేశాయి. 1938లో శ్రీకాకుళం జిల్లా ఇచ్ఛాపురం నుండి మద్రాసు వరకు జరిగిన రైతు రక్షణ యాత్ర – అమరజీవి చలసాని వాసుదేవరావు గారు అందులో పాల్గొన్న వైనం నాలో చైతన్యాన్ని కలిగించాయి.

1917 అక్టోబరు సోషలిస్టు విప్లవం ప్రపంచం మొత్తంమీద మానవాళి మొత్తంపై చెరగని ముద్రవేసింది. మానవుని మానవుడు దోచుకునే విధానం పోవాలని, అందరూ సమానులని, సర్వజనులు సుఖంగా అభివృద్ధి చెందాలనే కాంక్ష ఆచరణలో అమలు జరిపిన విధానం నన్ను ప్రభావితం చేసింది. గదర్ వీరులు, భగత్‌సింగ్ మొదలైన విప్లవవీరుల ప్రాణత్యాగాలు, మీరట్ కుట్రకేసు, స్వాతంత్ర్యం కోసం సాగిన పోరాటాలు, అందులో కమ్యూనిస్టులు నిర్వహించిన వీరోచిత పాత్ర, కమ్యూనిస్టులు మొట్టమొదట సంపూర్ణ స్వాతంత్రం కావాలని దానికొరకు సాగించిన పోరాటం మరువరానివి. ఊగిసలాటలు ప్రదర్శించి నాలుగైదు సంవత్సరాల అనంతరంగాని కాంగ్రెస్ దీనిని అంగీకరించలేదు. వీటన్నింటి ప్రభావం వల్ల నేను 1938లో కమ్యూనిస్టు పార్టీలో సభ్యునిగా చేరాను. దివి తాలూకా కోడూరు సమీపంలో కృష్ణాపురంలో అమరజీవి తుమ్మల వెంకటరామయ్యగారి ఇంటిలో నేను, సనకా బుచ్చికోటయ్య, భాగాది మస్తాన్, చల్లపల్లి సూర్యకోటి, సూర్యప్రకాశరావు, గద్దే రాధ సమావేశమయ్యాం. దివి తాలూకా ఆర్గనైజరు కోనేరు రాజగోపాలరావు, తుమ్మల వెంకట రామయ్యగార్లు కమ్యూనిస్టు పార్టీ సభ్యుల విధుల గురించి వివరించారు.

1939లో రెండో ప్రపంచ యుద్ధం ప్రారంభమయింది. సైన్యంలోకి బ్రిటిష్ వాళ్ళు రిక్రూట్ చేస్తున్నారు. నాకు పూనాలో ఎకౌంటు ఆఫీసులో ఉద్యోగం వచ్చింది. సామ్రాజ్య వాద యుద్ధానికి వ్యతిరేకంగా ప్రచారం చెయ్యాలని, యుద్ధానికి డబ్బుకాని, మనుష్య సహాయం కాని చెయ్యరాదని, యుద్ధంలో ఎవ్వరూ చేరరాదని పార్టీ నిర్ణయించింది. పూనా ఉద్యోగానికి వెళ్ళలేదు. పార్టీ దివిసీమ ఆర్గనైజరుగా

నియమితుడనయ్యాను. యుద్ధ వ్యతిరేక ప్రచారం చేస్తున్నందులకు కరపత్రాలు పంచుతున్నాననే నెపంపై నూజివీడులో పోలీసులు అరెస్టు చేసి, 1940 లో బందరు సబ్ జైలులో నెలరోజులు బంధించారు.

దివి తాలూకా కమిటీ సభ్యునిగా, దివి సీమ ఆర్గనైజరుగా పని చేస్తున్న సమయంలో నన్ను కృష్ణాజిల్లా ఆర్గనైజరుగా తీసుకొన్నారు. నిర్మాణం అప్పుడు కమిటీ సభ్యులు కాకుండా ఓటింగ్ లేకుండా ఆర్గనైజర్లుగా జిల్లా కమిటీ నియమించేది. ఆర్గనైజర్లు వారికి నిర్దేశించిన తాలూకాలకు, తాలూకాలో ముఖ్యమైన సెంటర్లకు గ్రామాలకు వెళ్ళి, పార్టీ సభ్యుల, సానుభూతిపరుల సమావేశాలు జరిపి, రాజకీయ నిర్మాణ పరిస్థితులను వివరించుట, చైతన్యవంతులను చేయుట, కార్యరంగంలో దించుట బాధ్యత. బందరు ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీ (ఇప్పుడు బెల్) కార్మికులు ధరల పెరుగుదలకు అనుగుణ్యంగా కరువుభత్యం యివ్వాలని సమ్మె చేస్తున్నారు. పార్టీ కార్యకర్తలు ఎక్కడ ఉద్యమానికి అవసరం అయితే అక్కడకు వెళ్ళాలని పార్టీ నిర్ణయించేది. ఆ నిర్ణయాన్ని కార్యకర్తలు శిరసావహించేవారు.

దివి తాలూకా నుండి నన్ను బందరు, కోనేరు రాజగోపాలరావును కర్నూలు, సనకా బుచ్చికోటయ్యను కైకలూరు, పర్చూరు రామకోటయ్యను నెల్లూరు, కేమి శెట్టి కోటయ్యను వినన్నపేట – యింకా కొందరిని వివిధ ప్రాంతాలకు పంపుట జరిగింది. దివి తాలూకా కమిటీ ఉద్యమ వ్యాప్తికి కార్యకర్తలను పంపి ఎంతో తోడ్పడింది.

నేను 1943 సం॥లో బందరు కుటుంబంతో సహా వచ్చాను. నా కుటుంబం యావత్తు ఉద్యమాల్లో పాల్గొన్నారు. నా సతి శ్రీమతి లలితాదేవి నాకు అన్ని విధాలా సహాయపడుతూ వున్నది. పార్టీ సభ్యురాలు. బందరు కమ్యూనిస్టు పార్టీ ఆఫీసుకు కరంటు లేక అవస్థ పడుతూవుంటే చివరకు మిగిలిన బంగారు మంగళ సూత్రం తాడు విరాళంగా సమర్పించింది. నా జీవితంలో మూడున్నర సంవత్సరాలు అజ్ఞాతవాసం, రెండున్నర సంవత్సరాలు (1949–51) కడలూరు సెంట్రల్ జైలులో నిర్బంధించబడ్డాను. తర్వాత అనేక ఉద్యమాలలో పాల్గొని, పలు సందర్భాలలో అరెస్టు కాబడి రెండునుండి నెల రోజులవరకు సబ్ జైలులో వున్నాను.

నేడు దేశం సంక్షోభంలో వున్నది. సామ్రాజ్య వాదులకు వ్యతిరేకంగా స్వాతంత్ర్య పోరాటం చేశాం. త్యాగాలు చేశాం. ప్రాణాలు అర్పించాం. కాని, సాధించుకున్న స్వాతంత్ర్యం పోగొట్టుకొనే ప్రమాదం ఏర్పడింది. మతతత్వశక్తులు విజృంభించి భారతదేశపు ప్రజాస్వామ్య లౌకిక విలువలను మంట గలిపి మత మౌఢ్యాన్ని పెంపొందింపజేసి అధికారానికి రావాలని భారతీయ జనతాపార్టీ కలలుకంటోంది. అధికారంలో వున్న కాంగ్రెస్ ప్రభుత్వం దేశాన్ని బహుళ జాతి సంస్థలకు తాకట్టుపెట్టి ప్రభుత్వ రంగ సంస్థలను ప్రయివేటు పరంచేసి ఆర్థిక సంస్కరణల పేరుతో వినాశకరంగా తయారయింది. అధిక ధరలు, పరిశ్రమల మూత, నిరుద్యోగం పెరుగుతున్నాయి. ఈ నేపథ్యంలో దేశంలోని వామపక్ష లౌకిక ప్రజాతంత్రశక్తులు సమైక్యమై ప్రత్యామ్నాయాన్ని నిర్మించాల్సిన చారిత్రక బాధ్యత కమ్యూనిస్టులపై వున్నది. సమానత్వం కావాలని దోపిడీ విధానం పోవాలని, సాంఘిక న్యాయం

కావాలని, సోషలిజం కావాలని కోరేవారు లక్షలాదిమంది వున్నారు. వారందరినీ సమీకరించి సంఘటిత పరచాల్సిన బాధ్యత, ముఖ్యంగా యువతరం కమ్యూనిస్టులపై వున్నది.

చరిత్ర మనపై వుంచిన కర్తవ్య నిర్వహణలో భారత కమ్యూనిస్టు పార్టీ తన స్వంత ప్రజా పునాదిని బలపర్చుకుని సంఘటిత పర్చి విస్తృతపర్చాల్సి వుంది. పార్టీ కార్యకర్తలు సామాన్య జీవితం గడపాలి. శీలం, క్రమశిక్షణ, అంకితభావం, పట్టుదలలతో ప్రజలను అంటిపెట్టుకొని నీటిలో చేపలా మెలగాలి. ప్రజా సమస్యలపై త్యాగాలతో కూడిన పోరాటాలు నడపాలి. కమ్యూనిస్టు ఉద్యమంలో మొదటి తరం, దాదాపు రెండోతరం కూడా వృద్ధాప్యంలో పడింది. యువతరం, ముఖ్యంగా యువ కమ్యూనిస్టులు కమ్యూనిస్టు ఉద్యమం నుండి గుణపాఠాలు తీసుకోవాలి. నా కమ్యూనిస్టు జీవితం మొదటి దశలో పార్టీ మీటింగులలో పూజ్యులు, అమరజీవులు చంద్ర రాజేశ్వరరావు, సుందరయ్య గార్లు పార్టీ మీటింగులలో సభ్యుల చేత నా కుటుంబ సభ్యులను, నా సతీమణిని రాజకీయ చైతన్యం కలిగించి పార్టీలోకి తీసుకు వస్తానని ప్రతిజ్ఞ చేయించేవారు. చాలా మంది పార్టీలోకి వచ్చారు. ఆదేశాలు, నిర్ణయాలు చేయటం మాత్రమే కాదు. వాటిని అమలు పర్చుటలో వారు కూడా స్వయంగా పాల్గొని ఉత్సాహాన్నిచ్చేవారు. ప్రజలలో పార్టీ కార్యకర్తలతో కలసి వుండేవారు.

వివిధ స్థాయిలలోని నాయకులు పార్టీ మీటింగులకు హాజరై హడావిడిగా వెళ్ళుటకాక పార్టీ సభ్యులతో ప్రజలతో కలసి ప్రత్యక్ష సంబంధాలు కలిగి వారితో జీవించుట వారి అభిప్రాయాలను తెలుసుకొనుట తదనుగుణంగా వ్యవహరించుట జరగాలి. పని విధానంలో మార్పు, గ్రామీణ, పట్టణ ప్రాంత పరిస్థితులలో చాలా మార్పులు వచ్చాయి. వీటిని అధ్యయనం చెయ్యాలి. మార్క్సిజం పిడివాదం కాదు. పరిస్థితులకు అన్వయించాలి. భారతదేశ పరిస్థితులు త్వరితగతిని మార్పు చెందుతున్నాయి. దేశ సామాజిక పరిస్థితుల్లో మార్క్సిస్టు సిద్ధాంతాన్ని అన్వయించాలి. భారత కమ్యూనిస్టు పార్టీ 70వ వార్షికోత్సవ సందర్భంగా పార్టీ స్వతంత్ర పునాదిని బలపర్చుకుంటూ విస్తృత పరుస్తూ ప్రజా సంఘాలను ప్రజా సమస్యలపై సమీకరిస్తూ నిజమైన ప్రజాసంఘాలుగా రూపుదిద్దుతూ సూత్రబద్ధ ప్రాతిపదికపై కమ్యూనిస్టు ఉద్యమ సమైక్యతకు కృషి చేస్తూ, వామపక్ష ప్రజాతంత్ర శక్తులు చోదకశక్తిగా తృతీయ ప్రత్యామ్నాయం కొరకు కృషి చెయ్యాలి. 70వ వార్షికోత్సవ సందర్భంగా ఉద్యమాల్లో ప్రాణాలు అర్పించిన అమరవీరులకు జోహారు లర్పిద్దాం. వారి ఆశయ సాధనకు సోషలిజం సాధించుటకు పూనుకుందామని శపథం చేద్దాం.

★ ★ ★

# శ్రీ ఇందుకూరి సుబ్బరాజు



నేను సంపన్న రైతు కుటుంబంలో జన్మించాను. క్షత్రియ భూస్వామ్య కుటుంబంలో వుండే రాచమర్యాదలు, గుర్రపు స్వారీలు, పటాటోపాలు, ఆడంబరాల మధ్య బాల్యం గడిచింది. మా కుటుంబాలలో భార్యలు కూడా పగలు కంటపడరాదు. అంత ఘోషా వుండేది. తణుకు హైస్కూలులో 1930–34 మధ్య చదువుకొంటుండగా జాతీయోద్యమ ప్రభావం నాపైన పడింది. 1930లో మహాత్మా గాంధీ ఆంధ్ర దేశ పర్యటన సందర్భంలో తణుకు వచ్చారు. హైస్కూలు ఆవరణలోనే బ్రహ్మాండమైన బహిరంగ సభ జరిగింది. హరిజన నిధికి గాంధీజీ చేసిన విజ్ఞప్తి పురస్కరించుకొని స్త్రీలు తమ ఒంటిమీద బంగారు ఆభరణాలు యిచ్చారు. గాంధీజీ ప్రబోధం విద్యార్థులలో దేశభక్తిని జాతీయాభిమానాన్ని రేకెత్తించాయి. మాకొద్దీ తెల్లదొరతనము వంటి పాటలు ఎంతో ఉత్తేజాన్ని కల్గించాయి. 1931 మార్చిలో భగత్‌సింగ్‌ను ఆయన సహచరులను ఉరితీసిన వార్త తెలియడంతోనే హైస్కూలు విద్యార్థులందరమూ క్లాసులనుండి బయటికి వచ్చి నిరసన సమ్మె చేశాము. బ్రిటీష్ వాళ్ళను పారద్రోలడానికి సాయుధ

పోరాటం చేయాలనే భావాలు నాలో కలిగాయి. వినాయక సావర్కార్ జీవిత చరిత్ర, భగత్‌సింగ్ ఉరిశిక్ష, అల్లూరి సీతారామరాజు మన్యం తిరుగుబాటు నాలో విప్లవ భావాలు రేకెత్తించాయి. సత్యాగ్రహ పోరాట విధానం సరిపోదనీ అంతకంటే తీవ్ర పోరాట మార్గం అవసరమనీ నాలో ఆలోచనలు ప్రారంభమయ్యాయి. అయితే మార్గం ఏమిటో తెలియలేదు. సైన్యంలో చేరి సాయుధ శిక్షణ పొంది తరువాత విప్లవ పోరాటాలలో పాల్గొనవచ్చుననే భావాలు కూడా కలిగాయి.

1934లో చదువుకు స్వస్తిచెప్పాను. 1936లో కాంగ్రెస్ సభ్యుడుగా చేరాను. 1937 మద్రాసు శాసనసభ ఎన్నికలలో కాంగ్రెస్ పక్షాన ప్రచారానికి గ్రామ గ్రామాన తిరిగాను.

కాంగ్రెస్ సత్యాగ్రహాల్లో జైలుకెళ్లిన యువకులు, జైళ్లలో విప్లవకారులతో సన్నిహితత్వం ఏర్పడి బైటకు వచ్చి సోషలిజం ద్వారానే నూతన సమాజం ఏర్పడుతుందని భావించారు. కాంగ్రెస్‌లో వుంటూనే సోషలిస్టులుగా, కమ్యూనిస్టులుగా మారి కాంగ్రెస్ సోషలిస్టు పార్టీని స్థాపించారు. విప్లవ పోరాట మార్గం గురించి ఆలోచిస్తున్న నాకు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో చేరాలని తోచి సభ్యునిగా చేరాను. 1939 నిడదవోలులో జరిగిన కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ సమావేశానికి ఉద్దరాజు రామం, అల్లూరి సత్యనారాయణ మొదలగువారితోపాటు కాకినాడ బాంబుకేసులో శిక్షించబడి అండమాన్ జైలు జీవితం గడిపిన భయంకరాచారి కూడా వచ్చారు. వారందరి పరిచయంతో మరింత ఉత్సాహం, కార్యదీక్ష కలిగాయి. 1939 సెప్టెంబరులో రెండో ప్రపంచ యుద్ధం వచ్చింది. బ్రిటిష్ ప్రభుత్వం కాంగ్రెస్ మంత్రివర్గాలతో సంప్రదించకుండానే భారతదేశాన్ని యుద్ధంలో భాగస్వామిగా చేర్చింది. కాంగ్రెస్ మంత్రివర్గాలు రాజీనామా యిచ్చాయి. ఈ యుద్ధానికి తోడ్పడరాదని కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ, రహస్య కమ్యూనిస్టు పార్టీ నిర్ణయించాయి. కామ్రేడ్ సంస్థకు అప్పారావు నాయకత్వాన తాడేపల్లిగూడెం తాలూకాలో యుద్ధ వ్యతిరేక ప్రచారం ప్రారంభించాము.

1939లోనే నన్ను కమ్యూనిస్టుపార్టీలో సభ్యునిగా చేర్చుకున్నారు. కేశవరం పార్టీ సెల్‌లో సభ్యునిగా ప్రతీవారం జరిగే సమావేశాలకు రామాగ్రామం మారంపల్లి నుండి రానుపోను 30 మైళ్ళు నడిచి వెళ్ళేవాణ్ణి. అప్పటికి నేను తాలూకా కాంగ్రెస్ సహాయ కార్యదర్శిగా కూడా వున్నాను. యుద్ధ వ్యతిరేక ప్రచారం ముమ్మరంగా సాగించబడుతున్న మా అందరిమీదా బ్రిటిష్ ప్రభుత్వ నిర్బంధ విధానం ప్రారంభమౌతుంది. అందుచేత మేమందరము అజ్ఞాతవాస జీవితంలోకి వెళ్ళాం. యుద్ధ వ్యతిరేక కార్యక్రమాలతోబాటు గ్రామ గ్రామాన వ్యవసాయ కూలీ సంఘాల స్థాపన, జమీందారి, ఈనాందారీ రైతాంగాన్ని సమీకరించడం మా ప్రధాన కార్యక్రమాలు. 1940 యుద్ధకాలంలో ఆహారధాన్యాలు, వస్త్రాలు, ఇనుప పనిముట్లకు తీవ్రమైన కొరత ఏర్పడింది. వ్యవసాయ కార్మికులకు పనులు లేవు. ఆకలియాత్రలకు పార్టీ పిలుపు యిచ్చింది. వేలాదిమంది వ్యవసాయ కార్మికులు "పేద ప్రజానీకానికి తిండి పెట్టండి, లేదా పనులు చూపండి" మొదలైన నినాదాలతో జిల్లాలో బ్రహ్మాండమైన ఆకలి యాత్రలు జరిగాయి. అందులో భాగంగానే తాడేపల్లి గూడెం ప్రభుత్వ కార్యాలయం వద్దకు 38 గ్రామాలన్నుండి 4000 మందితో పెద్దయెత్తున ఆకలి యాత్ర జరిపాము.

కరుగోరుపల్లిలో జరిగిన జిల్లా వ్యవసాయ కార్మిక సభలో నేను కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాను. సభ జరుగుతుండగానే పోలీసు దాడి జరిగింది. నేను, మృత్యుంజయుడు తప్పుకున్నాం. తరువాత చించినాడలో ఒకరోజు రాత్రి మమ్మల్ని అరెస్టు చేసి, ఆకలి యాత్రలు నడిపి కూలీలను ప్రభుత్వానికి వ్యతిరేకంగా రెచ్చగొడుతున్నామని మాపై కేసులు పెట్టారు. కేసు వాయిదాకు వెళ్ళి, మళ్ళీ నేను రహస్య జీవితంలోకి వెళ్లిపోయాను.

అనాడు కమ్యూనిస్టు పార్టీలో క్రమశిక్షణ, నైతిక విలువలు, చెప్పినవి ఆచరణలో చేయడం కట్టుదిట్టంగా అమలు జరుపబడేవి. దేశభక్తికి, త్యాగనిరతికి మారుపేరుగా కమ్యూనిస్టుపార్టీ గురించి ప్రజలు చెప్పుకొనేవారు. రాజకీయ భిన్నాభిప్రాయాలున్నప్పటికీ కాంగ్రెస్‌వారు, దేశభక్తులందరూ కమ్యూనిస్టు పార్టీ సభ్యుల త్యాగదీక్షలను ఎంతో ప్రశంసించేవారు. అజ్ఞాతవాస కాలంలో కమ్యూనిస్టులకు కాంగ్రెస్‌వారు ఆశ్రయం యిచ్చేవారు. కమ్యూనిస్టులను ఆదర్శ ప్రజా సేవకులుగా చూసేవారు. నేడు దేశ పరిస్థితులు మారాయి. కుల, మత తత్వాలు పెచ్చుమీరుతూ, క్రమశిక్షణ, ఆదర్శ ప్రజా జీవిత విధానాలు, సంప్రదాయాలు క్షీణించుతున్నాయి. జాతీయోద్యమం, కమ్యూనిస్టు ఉద్యమం నెలకొల్పిన విలువలను తిరిగి పునరుద్ధరించడం నేడు ఎంతో అవసరం. కమ్యూనిస్టు పార్టీ పురోగమించాలంటే, ప్రజల అండదండలు సంపాదించాలంటే ఈ విలువలను కాపాడుకోవాలి. కమ్యూనిస్టు పార్టీ 70వ వార్షికోత్సవ సందర్భంలో ప్రతి కమ్యూనిస్టు తీసుకోవలసిన ప్రతిజ్ఞ అదే.

★ ★ ★

# శ్రీ అల్లూరి వెంకట్రామరాజు



తూర్పు గోదావరి జిల్లా, రాజోలు తాలూకా గ్రామంలో నేను 1918లో జన్మించాను. తండ్రి బాల్యంలోనే కాలం చేశారు. తల్లి ఆదరణలో పెరిగాను. పెద్దన్న శీతారామరాజు గారు 1929–30 ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొని జైలుకి వెళ్ళారు. ఆ విధంగా నాకు చిన్నతనంలోనే మా కుటుంబంలో దేశభక్తి సంప్రదాయం, జాతీయోద్యమ వాతావరణం, కాకినాడ సత్యాగ్రహ శిబిరంకు రాకపోకలు, కాంగ్రెస్ వాలంటీర్లతో పరిచయాలు ఏర్పడ్డాయి. కాకినాడ బాంబుకేసు ప్రముఖులు భయంకరాచారి (ప్రతివాద భయంకర వెంకటాచారి), కాలనాధ భట్ల కామేశ్వరరావు కాంగ్రెస్ వాదులు శైవం పెద్ది పార్వతీశం మొదలైనవారితో నా 14వ యేటనే పరిచయాలు ఏర్పడ్డాయి. 1932–33 ఆ ప్రాంతాల్లో ఖాదీ ఉద్యమంతో నాకు సంబంధం ఏర్పడింది. 1934లో గాంధీజీ తూర్పు గోదావరి జిల్లాలో పర్యటించారు. గాంధీజీ ప్రబోధాలు సహజంగానే నావంటి యువకులలో మరింత దేశభక్తి జాతీయ భావాలను కల్గించాయి.

1935 ఆ ప్రాంతంలో కాంగ్రెస్‌లో అతివాద భావాలు, సోషలిస్టు భావాలు కల్గినవారు, కమ్యూనిస్టు సిద్ధాంతాల వైపు ఆకర్షించబడినవారు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ ఏర్పరచి అందరూ కలిసి పని చేస్తూండేవారు. నేను 1935–36లో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో చేరాను.

ఆనాటి హరిజన వ్యవసాయ కార్మికుల దుర్భర జీవిత పరిస్థితులు, వారిపై జరుగుతున్న అమానుష దౌర్జన్యాలు నాలో ఎంతో ఆవేదన కల్గించుతూండేవి. ఇక్కడ బ్రతుకు తెరువు లేక 20 సంవత్సరాలు వచ్చిన ప్రతి హరిజన వ్యవసాయ కూలీ యువకుడు బర్మాలో కూలి నాలి పనులకోసం వెళ్ళిపోయేవాడు. భూస్వామ్య

వర్గాలు గ్రామ మున్సబులు హరిజన వ్యవసాయ కార్మికుల పట్ల అమానుషంగా ప్రవర్తించేవారు. ఆ రోజుల్లో మగవారికి రోజు కూలీ రెండు అణాలు, ఆడవారికి ఒకటిన్నర అణాలు (అణా అంటే ఆరు పైసలు). సంవత్సరంలో ఆరు నెలలు పనులుండేవి. ఆరు నెలలు పస్తులుండేవారు.

మరోవైపు సామాన్య రైతాంగ పరిస్థితి కూడా అధ్వాన్నంగా వుండేది. ధరల మాంద్యం. బస్తా ధాన్యం రెండున్నర –మూడు రూపాయలుండేది. రైతాంగం అప్పులపాలై భూములను అమ్ముకొనేవారు. రుణాలపాలైన రైతులు దివాళా (ఇన్‌సాల్వెన్సీ పిటీషన్‌లు) తీసేవారు. ఆత్మహత్యలు చేసుకొనేవారు ఎక్కువయ్యారు.

ఈ రైతు కూలీల జీవిత పరిస్థితులను చక్కజేయడానికి కార్మిక, కర్షక సంఘాలను ఏర్పరచాలన్న కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, కమ్యూనిస్టు పార్టీ విధానాలు నన్ను ఆకర్షించాయి.

1937లో ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభ ఎన్నికలు వచ్చాయి. ఈ ఎన్నికలలో జమీందారీ వర్గాల పార్టీలు జస్టిస్ పార్టీ, పీపుల్స్ పార్టీలు ఒకవైపున – జాతీయతా కాంగ్రెసు మరో ఒకవైపున – తీవ్రమైన రాజకీయ పోరాటం జరిగింది. ఈ పోరాటంలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, కమ్యూనిస్టు పార్టీలు కాంగ్రెస్ పక్షాన నిలబడి జమీందారీ వర్గాలను ఓడించడానికి తీవ్ర ప్రచారం చేశాయి. ఈ ఎన్నికల పోరాటంలో నేను చురుకుగా పాల్గొన్నాను. జమీందార్లు ఓడిపోయారు. కాంగ్రెస్ అభ్యర్థులు గెలుపొందారు. 1937లో మద్రాసులో కాంగ్రెస్ ప్రభుత్వం ఏర్పడింది. రాజాజీ మంత్రివర్గం రైతాంగం ఆందోళనను దృష్టిలో పెట్టుకొని రుణ నివారణ చట్టం చేసింది. ఆంధ్రరాష్ట్ర రైతుసంఘం ఆధ్వర్యాన ఇచ్ఛాపురం నుండి మద్రాసు వరకు కాలినడకన రైతు రక్షణ యాత్ర జరిగింది. జమీందారీ రైతాంగాన్ని మేల్కొల్పింది. జమీందారీ ఎంక్వయిరీ కమిటీ రెవెన్యూ మంత్రి టంగుటూరి ప్రకాశం గారి నాయకత్వాన రాష్ట్ర మంతటా పర్యటించింది. ఈ సందర్భంలో రాజమండ్రిలో పదివేల మంది రైతాంగాన్ని సమీకరించి వందలాది మహజర్లు ప్రకాశం కమిటీకి సమర్పించడం జరిగింది. జమీందారీ విధానాన్ని రద్దుచేయాలని యాత్రలు, ఆందోళనలు జరపడమే గాక, అనేక జమీందారి వ్యతిరేక పోరాటాలు రాష్ట్రంలోని జిల్లాల్లో జరిగాయి.

వ్యవసాయ కార్మికుల దుర్భర పరిస్థితులను దృష్టిలో పెట్టుకొని, వారి కోర్కెలకై ఆందోళన ప్రారంభించాము. వ్యవసాయ కూలీ సంఘాలను ఎక్కడికక్కడ ఏర్పరచాము. కూలీ రేట్లు పెంచాలనీ, వారిపై దౌర్జన్యాలు ఆపాలనీ ఆందోళన ప్రారంభించాము.

1938 డిసెంబరులో అంతర్వేది పాలెంలో జిల్లా వ్యవసాయ కూలీ మహాసభ జరిపాము. కమ్యూనిస్టు పార్టీ అగ్ర నాయకులలో ఒకరైన కామ్రేడ్ బి. టి. రణదివే మహాసభను ప్రారంభించడానికి వచ్చారు. ఆయన ప్రసంగాన్ని సోషలిస్టు పార్టీ నాయకులు శ్రీ జొన్నలగడ్డ రామలింగయ్య తెలుగులోకి గొప్పగా అనువదించారు. వర్గ దోపిడీ ఎలా సాగించుతున్నారో. దీనిని ఎలా అరికట్టాలో, సోషలిస్టు సమాజ నిర్మాణానికి ఎలా కృషి చేయాలో రణదివే చెప్పారు. ఈ ప్రసంగం నన్ను ఎంతో ఉత్తేజపరిచింది. 1939 మే నెలలో రాజకీయ వేసవి పాఠశాల

మా పొలంలో పశువుల చావడిలో జరిగింది. ఈ స్కూలు నిర్వహణ బాధ్యతను సమర్ధవంతంగా నిర్వహించాము. స్కూలు ముగింపు రోజున నాకు కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం యివ్వబడింది. కార్మిక, కర్షక పోరాటాలలో పాల్గొనడం ద్వారానే నేను కమ్యూనిస్టు ఉద్యమంలోకి వచ్చాను. అనేక వ్యవసాయ కార్మిక పోరాటలలో ప్రత్యక్షంగా పాల్గొన్నాను.

1939లో రెండవ ప్రపంచ యుద్ధం వచ్చింది. 1941లో మన దేశంపై జపాను దండయాత్ర ప్రమాదం ఏర్పడింది. బర్మా మొదలైన ప్రాంతాలు జపాను వశమయ్యాయి. ఈ పరిస్థితుల్లో మా రాజోలు తాలూకానుండి, తూర్పు గోదావరి జిల్లా నుండి వ్యవసాయ కార్మిక యువకులు పెద్ద యెత్తున వచ్చి పడ్డారు. బర్మా శరణార్థుల సమస్య తీవ్ర సమస్యగా పరిణమించింది. పైగా యుద్ధ సమయం, ఆహార ధాన్యాలకు, ఇతర నిత్య జీవితావసర వస్తువులకు కొరత ఏర్పడింది. కంట్రోళ్ళు, రేషనింగ్ వచ్చి పడ్డాయి. తిండికి, బట్టకు; కిర్సనాయిలు, కాగితం, వ్యవసాయ పనిముట్లకు కటకటలాడవలసివచ్చేది. గ్రామీణ పరిస్థితులు అస్తవ్యస్తమయ్యాయి.

ఇదిలా వుండగా గ్రామీణ భూస్వామ్య పెత్తందారీ వర్గాలు తమ మధ్య కక్షలు సాధించుకోవడానికి బర్మానుండి తిరిగి వచ్చిన మిలిటెంటు వ్యవసాయ కూలీ యువకులను వినియోగించి తమ ప్రత్యర్థులపై దాడులు, ఖూనీలు జరిపించడం మొదలుపెట్టారు. రెండు వైపులా వ్యవసాయ కూలీ యువకులే బలికావడం జరిగింది. వీరిని కేసులలో యిరికించడం జరిగింది. రెండు సంవత్సరాలకాలం ఇలా రాజోలు తాలూకా అల్లకల్లోల పరిస్థితుల్లో కొనసాగింది.

ఈ పరిస్థితులు నాలో తీవ్రమైన ఆవేదన కల్గించాయి. భూస్వామ్య వర్గాలు బర్మా శరణార్థులను తమ పాచికలుగా వినియోగించుకోకుండా చేయాలి. దీనికి ఒకటే మార్గం. వర్గ కోర్కెల ప్రాతిపదికపై వారిని సంఘటితపరచడమే. కూలీ రేట్లను పెంచాలన్న నినాదంతో వ్యవసాయ కూలీ సంఘాన్ని పోరాట సంస్థగా రూపొందించాము. దీనితో బర్మానుండి వచ్చిన మిలిటెంటు యువకులు కూడా ఉద్యమంలోకి వచ్చారు. ఆ విధంగా వారు భూస్వాములకు పాచికలుగా వుండే స్థితినుండి తప్పించ గల్గాము. సంఘటిత వ్యవసాయ కార్మికోద్యమం రాజోలు తాలూకా గ్రామీణ ప్రాంతంలో కష్టజీవులకు ఆశాజ్యోతిగా వెలుగొందింది. అరాచక విధానాల నుండి మళ్ళించి వారిలో వర్గ చైతన్యానికి పునాదులు వేసింది. ఇది జిల్లా కమ్యూనిస్టు ఉద్యమానికి బలమైన కేంద్రంగా మారింది.

కమ్యూనిస్టు ఉద్యమంలోకి నన్ను తీసుకొని వచ్చింది ఈ పీడిత ప్రజల విముక్తి పోరాటమేనని సగర్వంగా చెప్పగలను.

1943లో విజయవాడలో జరిగిన రాష్ట్ర పార్టీ మహాసభలో పాల్గొన్నాను. 1944 నుండి 1992 వరకు జిల్లా కమ్యూనిస్టు పార్టీలో వివిధ బాధ్యతాయుత స్థానాలు నిర్వహించాను. 1947లో, 1949లో రెండు సార్లు అరెస్టయి జైలు జీవితం గడిపాను. 1952లో, 1954లో శాసనసభకు పోటీచేసి గెల్పొందాను. 1940 దశకంలో వ్యవసాయ కార్మిక కామ్రేడ్స్, పార్టీ కామ్రేడ్స్ అనేక కేసులలో యిరికించబడినపుడు, పార్టీ ఆర్థిక పరిస్థితులు అస్తవ్యస్తంగా తయారైనపుడు వారిని కేసులనుండి తప్పించడానికి నా ఆస్తిని అమ్మి పార్టీ నిధికి యిచ్చాను.

# శ్రీ ముళ్ళపూడి సూర్యనారాయణ



1929-30 సం॥రాలలో వచ్చిన ఆర్థిక సంక్షోభంవల్ల ధరలు విపరీతంగా పడి అనేక కుటుంబాలు ఆర్థికంగా చితికిపోయాయి. వెయ్యి కొబ్బరికాయలు 13 రూపాయల నుండి 15 రూ.ల వరకు, ధాన్యం బస్తా 167 సౌనులు (75 కేజీలు) రూ.2-75 లేక రూ.3 నెలకు మాత్రమే అమ్మేవి.

కుటుంబాలు గడవటం, పిల్లల చదువులు సాగటం దుర్భరమైపోయింది. ఆ పరిస్థితులలో మా కుటుంబ ఆస్తి అప్పులకు తెగనమ్మవలసి వచ్చింది. 1937 సం॥లో మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వం రైతు ఋణ విమోచన చట్టం తెచ్చేవరకు కూడా అప్పుల బాధ తీరే అవకాశం లేకపోయింది. అప్పటికే మా తల్లితండ్రులకు తొమ్మిది మంది సంతానం. తర్వాత మరో చెల్లెలు కలిగింది. మొత్తం 10 మందిమి. ఆస్తి పోయాక, మా నాన్నగారు కాలంచేశాక గ్రామం చేరాము.

ఆ టైములో హైస్కూలు చదువుకు వెళ్లే వయస్సులో వున్న నా చదువుకు శాశ్వతంగా అంతరాయం ఏర్పడింది. 1939 జనవరి ఆరంభంలో మా తండ్రిగారు కాలం చేశారు. నిరాశాజనక నిస్పృహ వాతావరణంలో మార్గాన్వేషణ ప్రారంభమైంది. ఈ అన్వేషణలో గతం కొంత నెమరువేయాలి.

మా తండ్రిగారు తాలూకా కాంగ్రెస్ కమిటీ మెంబరు. కోఆపరేటివ్ ఉద్యోగంలో కూడా చురుగ్గా వుండేవారు. 1931 సంllరంలో అమలాపురం గాంధీజీ వచ్చినపుడు మా నాన్నగారు, మా పెద్దక్క, కొందరు అన్నలు వెళ్లారు. నేను వస్తానని మారం చేసినా చిన్నవయసువల్ల నన్ను వదిలి వెళ్లారు. అదే టైములో సర్దార్ భగత్‌సింగ్‌ని ఉరితీయటం, వాడవాడలా ఆయన త్యాగాన్ని గురించి గొప్పగా చెప్పుకోటం జరిగింది. మిడిల్ స్కూలు విద్య పూర్తిచేస్తున్న మా పెద్దన్న ఎం. వి. భద్రం (విశాఖజిల్లా కమ్యూనిస్టు ఉద్యమంలో అకళంక త్యాగమయ జీవితం గడిపినవారిలో ఒకరు) ఇంట్లో రాజకీయ విశేషాలు వివరించడం, పోలీస్‌స్టేషన్ ఎదుట ఖద్దరు టోపీ ధరించి వెళ్లినట్లు గర్వంగా చెప్పటం... మా నాన్నగారు సానుకూలంగా స్పందించేవారు. కాంగ్రెస్ కార్యకర్తలు ఎవరైనా వస్తే వారికి భోజనాలు పెట్టి ఆదరించటం జరిగేది.

అయినా రాజకీయ భావాలకి, సాంఘిక భావాలకి పొంతన కుదరలేదు. పొలంలో దళిత పాలేరు మంచినీళ్ళు యిస్తే మా పెద్దన్న త్రాగటం చూచిన మా నాన్నగారు ఆవేశం ఆపుకోలేకపోయారు. చెయ్యిచేసుకోటానికి మా పెద్దన్నమీద వున్న ప్రేమ అడ్డం వచ్చింది. కాని, ఈ పాప పరిహారానికి ప్రాయశ్చిత్తంగా 1600 సార్లు రావిచెట్టుకి ప్రదక్షిణ చేయమని ఆ హుకుం జారీచేసి, హుకుం అమలుజరపటానికి మరో బ్రాహ్మణ బంధువుని అజమాయిషీ చెయ్యమన్నారు.

1937 జనరల్ ఎన్నికలలో మా అన్న కళా వెంకటరావుకి విశ్వాసపాత్రుడు. తర్వాత అమలాపురం తాలూకా కాంగ్రెస్ ఆఫీసు నిర్వహణ బాధ్యత చూచాడు. ఆ కాలంలో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకుడు జయప్రకాశ్ నారాయణ్ కోనసీమలో పర్యటించారు. ఆయనతో కూడా మా అన్న భద్రం వున్నాడు. అప్పటికే జయప్రకాశ్ 'సోషలిజం ఎందుకు?' అన్న గ్రంథం వ్రాశారు. స్థూలంగా సోషలిజం అంటే సమానత్వం, అందరికి అవకాశాలుంటాయని, పార్టీలో పరస్పరం సహకరించుకుంటారని, పేదవారిని ఆదరిస్తారనే అస్పష్టభావాలు మొరటు రూపంలో నా మనస్సులో నాటుకున్నాయి. బ్రిటీష్ సామ్రాజ్య వ్యతిరేక భావాలూ నా మనస్సులో నాటుకున్నాయి. 1937 సంllరం జనరల్ ఎన్నికలలో పసుపు టోపీ ధరించి పుసుపుపెట్టెలో వోటు వేయమని ప్రచారం చేసిన స్కూలు పిల్లకాయ దళంకి నేను బాధ్యుణ్ణి.

ఆస్తులు పోయి హైస్కూలు చదువుకు కూడా నోచుకోని నాకు చదువుకొనే అవకాశాలు లేకపోయాయనే బాధ చాలా పీడించింది. ఒక రకమైన మొరటు రూపంలో తాత్త్విక చర్చ నాలో జరుగుతూండేది. మేధస్సులో నాకంటె నాసిరకంవారికి చదువుకునే అవకాశాలుండగా నాకెందుకు లేకుండా పోవాలి? ఎవరు, దీనికి కారకులు ఎవరు? అనే ప్రశ్న పదేపదే మనస్సుని దొలిచేది. దీనికి జవాబు అస్పష్టంగా పై భావాలలో నాకు కనిపించి వూరట కలిగించేది.

బ్రిటిషువాడుపోతే స్వాతంత్ర్యం వస్తుందనే భావం, సోషలిజంలో అందరికీ అవకాశాలుంటాయనే భావం క్రమేపీ బలపడటం ప్రారంభమైంది. రాజోలులో మా బావ బైండింగ్‌షాపులో మాక్సింగోర్కీ 'అమ్మ' నా కంటపడింది. గోర్కీ ఎవరో నాకు తెలియదు. అది సోషలిస్టు ఉద్యమానికి సంబంధించిన నవల అని నాకు

తెలియదు. 15 గంటలు వరుసగా చదివి పూర్తిచేశాను. పేజీ తరువాత పేజీ చదవాలనే ఉత్సుకత ఆ నవల రేకెత్తించింది. ఈ నవల నా భావాలకు పరిపుష్టి చేకూర్చింది. అప్పటికే మా వూరు ప్రక్కనే ముంగండ గ్రామంలో విశ్వసాహిత్యమాలద్వారా సోషలిస్టు పుస్తకాల ప్రచురణ, మహీధర బ్రదర్సుతో పరిచయం, వీరికి మంచి బంధువు, కమ్యూనిస్టు సరస్వతుల సోమేశ్వరరావుతో పరిచయం, అన్నింటికి మించి మా నాన్నగారు కాలం చేశాక కుటుంబ పేదరికాన్ని కూడా ఖాతరుచేయక, మా పెద్దన్న భద్రం విశాఖపట్నంజిల్లాలో పార్టీ ఫుల్ టైమ్ కార్యకర్తగా పని ప్రారంభించటం నా భావాలకు మరింత పరిపుష్టం చేకూర్చాయి. కుటుంబంలో పెద్దవాడుగా కుటుంబ పేదరికాన్ని గమనించకుండా పార్టీ కార్యకర్తగా వెళ్లటం విషయంలో భద్రంగారి వైఖరిపై నాలో తర్జనభర్జన జరిగేది.

సామ్రాజ్య వ్యతిరేక జాతీయోద్యమాన్ని, కమ్యూనిస్టు ఉద్యమాన్ని సమన్వయంగా ఆలోచించేకంటే ఆ రెండింటిని వేరువేరుగా ఆలోచించే తప్పుడు వైఖరి, జాతీయోద్యమం కంటె కమ్యూనిస్టు ఉద్యమం గొప్పదనే ఆధిక్యతా భావం నాలో శక్తేరియన్ భావాలకు బీజాలు నాటింది. ఈ ధోరణి తర్వాత చాలా నష్టం కలిగించింది.

ఆ కాలంలోనే రాజోలులో మా బావగారు అద్దెకు పుచ్చుకున్న బైండింగ్ ప్రెస్‌లో 'స్వతంత్ర భారత్' అచ్చయ్యేది. ఈ పత్రిక అర్జంటుగా ప్రింటు చెయ్యాలనే తపన నాలో వుండేది. ప్రెస్ స్వంతదారు అనుమానిస్తున్నాడు, జాగ్రత్త అని మా బావగారి హెచ్చరికను పెడచెవిన పెట్టి పేపరు తయారుచేస్తుండగా పోలీసులతో సహా ప్రెస్ యజమాని దాడి చేయటం జరిగింది. మా బావగారు, సరస్వతుల సోమేశ్వరరావు ముద్దాయిలు. నన్ను పోలీసులు నా వయసునుబట్టి సాక్షిగా వేసుకున్నారు. నాకు 16 సం॥రాలు. నా మీద సోమేశ్వరరావు చాలా వత్తిడి తెచ్చేవాడు. మా అమ్మగారు సహజంగానే అల్లుడికోసం తాపత్రయపడేది. పోలీసులు బెదిరించేవారు. నా సాక్ష్యం పోరాటాలకు విరుద్ధంగా జరిగింది. అయినా వారిద్దరికి సం॥రం కఠినశిక్ష విధించారు.

1941 సం॥రంలో హిందీ మాస్టారు (రామిశెట్టి పార్థసారథి అప్పారావు) నాతో రెగ్యులర్ కాంటాక్టులో వుండి సాహిత్యం యిచ్చేవాడు. 1941 సం॥రంలో మా గ్రామంలో పార్టీ సెల్లు ఏర్పరచాము. మహీధర జగన్‌మోహనరావు వచ్చాడు. సామ్రాజ్యవాద యుద్ధాలు, పార్టీ ప్రజా యుద్ధ నినాదాలు, అని వారు చెబితే నాకేం అర్థం కాలేదు. అంతా గందరగోళంగా వుండేది. హిందీ మాస్టారు అంత గందరగోళంగా వుండేవాడు. బ్రిటిషు సామ్రాజ్య వ్యతిరేక భావమే ప్రధాన చోదకశక్తిగాని, ప్రజా యుద్ధ నినాదం క్రిందిస్థాయిలోనే లేదు. 1942 చివర మాత్రమే నాకు పూర్తి పార్టీ సభ్యత్వం యిచ్చారు.

తర్వాత నేను ఉదరపోషణకి విశాఖ వెళ్లాను. అక్కడ పార్టీ కమ్యూన్‌తో వుండేవాణ్ణి. జొన్నలగడ్డ రామలింగయ్య అంటే అందరికి గురుభావం వుండేది. అందుచే ఎవ్వరూ లోపాలు గురించి మాట్లాడేవారు కాదు. ఆయన చెప్పినట్లు చేయటం లేదనేది లేదు. 'పార్టీ వాల్ పేపరు మీద వ్రాశాను – నేను చాలా క్రిటికల్‌గా వుంటా'నని రామలింగయ్య అన్నారు – నేను స్వయంగా ఆలోచించుకుంటేనేగాని ఎవరిమాట అనుసరించే అలవాటు లేదు.

భద్రం చిట్టివలసలో 1943లో అరెస్టు అయ్యాక అక్కడ నాయకత్వ సమస్య ఏర్పడింది. చిట్టివలసవారు కోరినట్లు ఎవ్వరూ పోలేదు. నన్ను హోల్ టైమర్‌గా రమ్మన్నారు. చిట్టివలస వెళ్లమన్నారు. నేను రెడీగా అంగీకరించాను. తర్వాత కె. వెంకటేశ్వర్లు (ఒంగోలులో నేడు ప్రముఖ లాయరు) కాలేజీ చదువుకు స్వస్తి చెప్పి చిట్టివలస వచ్చాడు. జైలులో వున్న భద్రంకి నేను హోల్ టైమర్‌గా వచ్చానని వై. విజయకుమార్ వ్రాయగా, నన్ను విశాఖపట్నం తీసుకువచ్చిన పని పూర్తియిందని భద్రం జవాబు వ్రాశాడు.

కాని, మా అమ్మగారు ఒక లేఖ వ్రాయించారు. నా తర్వాత యింకా 5గురు చిన్నవాళ్లు ఉన్నారు. చదువులు పూర్తికావాలి. ఆడపిల్లలకు పెండ్లిండ్లు కావాలి. కుటుంబం పస్తులు అనుభవిస్తూంది. పెద్దాయన (భద్రం), నువ్వు (నేను) దేశం కోసం పార్టీ పని చేస్తే, కుటుంబాన్ని ఆదుకొనేవారెవరు? పస్తులు పడుతూంటే ఆదుకునేవారెవరు? అని ప్రశ్నించి, మా నిర్ణయాన్ని మరింతగా యీసడించారు. ఈ జాబు చాలా హృదయావేదన కలిగించింది. దేశం కోసం మనం సమష్టిగా పోరాడినా, ఎవరి కుటుంబ సమస్య వారుకుంటుంది కదా? ఈ పోరాటంలో యీ బాధలనుండి పారిపోలేం.

చిట్టివలసలో నన్ను, వెంకటేశ్వర్లుని అరెస్టుచేసి డిటెన్యూలుగా తంజావూరు పంపారు. విడుదలయ్యాక విశాఖజిల్లా సరిహద్దులలో అడుగుపెట్టవద్దని నిషేధాజ్ఞలు జారీచేశారు.

రాష్ట్ర పార్టీని కలిస్తే నన్ను మా జిల్లాకి, ఆయన్ను ఆయన జిల్లాకు వెళ్లమన్నారు. జిల్లా కార్యదర్శి జగన్ మోహనరావుని కలిస్తే, ఉద్యోగానికి వెళ్లటం మంచిదన్నాడు. కాని, ఇనుగంటి నారాయణరావు ఎట్టి పరిస్థితులలోను నన్ను ఉద్యమంలో వుంచాలని తాపత్రయ పడ్డాడు.

ఆ విధంగా తూ.గో.జిల్లాలో 1944 సం.చివర నుండి పార్టీ ఫుల్ టైమ్ కార్యకర్తగా పనిచేస్తున్నాను. ఆ రోజున దేశ స్వాతంత్ర్యం కోసం, పరపీడన విముక్తి కోసం యువత ఎనలేని త్యాగాలు చేయటమే కాదు, ఉరికంబాలు ఎక్కింది ఎవరి కోసం? స్వార్థంకోసం కాదు, బానిస భారత సమాజ విముక్తి కోసం.

స్వాతంత్ర్యం సాధించాక దేశం ఎంతో పురోభివృద్ధి సాధించింది. కాని నాయకుల కలలు కల్లగానే మిగిలిపోయాయి.

అవినీతితో, దౌర్జన్యంతో, నేరస్థ, హంతక రాజకీయాలతో, పెద్దలు కోట్లు కాజేసే కుంభకోణాలతో, మూఢవిశ్వాసాలతో, మతోద్రేకాలతో, కులతత్వ ప్రకోపాలతో, పార్లమెంటరీ రాజకీయ పదవుల అన్వేషణతో, నైతిక విలువలు కోల్పోయి మన సమాజం దుర్గంధం వెదజల్లుతూంది. ఈ రుగ్మతలకు వ్యతిరేకంగా, నాటి యువతరం బ్రిటిషు సామ్రాజ్య వ్యతిరేక పోరాటంలో చేసిన త్యాగాల స్ఫూర్తితో, యీనాటి యువతరం నవ్యసమాజ స్థాపనకు, శాస్త్రీయ దృక్పథంతో ప్రభావితమైన నవ్యసమాజ స్థాపనకు నడుములు బిగించాలి. ముందుకురకాలి. ఇదే దేశం వారినుండి ఆశిస్తున్నది.

★ ★ ★

# శ్రీ సి.వి.కె. రావు



నేను 1912లో కాకినాడలో ఒక మధ్యతరగతి కుటుంబంలో పుట్టాను. నాకు ఏడుగురు తమ్ముళ్లు, 5గురు తోబుట్టువులు. పెద్దకుటుంబం. నా తండ్రి సి. రాజు కాకినాడలో ఒక ఇంగ్లీషు వ్యాపార సంస్థలో ఎక్కౌంటెంటుగా పనిచేసేవారు. తరువాత విదేశాలకు ఎగుమతి దిగుమతుల వ్యాపారం ప్రారంభించారు. నేను మూడవ తరగతిలో వుండగానే కబీరు మొదలుకొని జయదేవుని వరకు భక్త కవుల చరిత్ర నా చేతిలో పడింది. వారి ఆధ్యాత్మిక చింతన నాలో చాలా ప్రభావం కల్గించింది. నేను నాల్గవ తరగతి నుండి పిఠాపురం రాజా హైస్కూలులో కాకినాడలో చదివాను. గాంధీజీ సహాయ నిరాకరణోద్యమం గురించి మా తండ్రి స్నేహితుడు బెల్లంకొండ సీతాపతిగారు నాకు చెప్పేవారు. స్వరాజ్య సంపాదన అనే భావం నా మనస్సులో అప్పుడే నాటుకుంది. త్రివిధ బహిష్కరణ గురించి విద్యార్థులు నినాదాలు చేస్తూ ఊరేగింపు చేస్తుంటే అందులో పాల్గొన్నాను. ఆ పూట క్లాసులు మానివేశాము. మధ్యాహ్నం క్లాసుకు వెడితే క్లాసు టీచరు

మమ్మల్ని నిలబెట్టి స్కూలు నుండి వెళ్లగొట్టారు. ఇది నా రాజకీయ జీవితంలో ప్రథమ పాఠము. నా తండ్రి దేశభక్తి గలవాడు. అందుచేత నేను స్కూలునుండి వెళ్లగొట్టబడినందుకు నన్ను నిరుత్సాహపరచలేదు. కాకినాడలో ప్రముఖ న్యాయవాది బులుసు సాంబమూర్తిగారు గాంధీజీ పిలుపునందుకొని తన న్యాయవాద వృత్తికి రాజీనామా యిచ్చి స్వాతంత్ర్యోద్యమంలో దూకి ప్రఖ్యాతి వహించారు. ఆ తరువాత కాకినాడలో ప్రారంభించబడిన జాతీయ పాఠశాలలో చేరాను. విదేశీ వస్త్ర దహనంలో నా దుస్తులు కూడా పడవేసి దహనం చేశాను. రాట్నం వడకుతూ ఖద్దరు బట్టలు ధరించాను. జాతీయ. నాయకుల అరెస్టులు, చౌరాచౌరీ సంఘటనలు, ప్రభుత్వ నిర్బంధ విధానం మధ్య మా జాతీయ పాఠశాల మూతబడింది. ప్రైవేటు మాష్టారు వద్ద చదువు సాగించాను.

1923లో కాకినాడలో జరిగిన జాతీయ కాంగ్రెస్ మహాసభకు 11యేళ్ల బాలునిగా వెళ్లి జాతీయ నాయకుల ఉపన్యాసాలు విన్నాను. సామర్లకోట హైస్కూలులో చదువుతూండగా బుద్ధుని పాఠం నన్ను ఎంతో ప్రభావితం చేసింది. నేను శాకాహారిగా మారాను. స్కూలు పుస్తకాలేకాక నవలలు, జీవిత చరిత్రలు, భారత భాగవతాలు, వెంకట పార్వతీశ్వరకవుల గ్రంథాలు బాగా చదివేవాణ్ణి. శరీర వ్యాయామం కూడా చేసేవాణ్ణి. ఇది ఇలా వుండగా మా తండ్రికి ఐరిష్ లాటరీలో 1 లక్ష 30 వేల రూపాయలు వచ్చాయి. దానితో మా తండ్రి ఉద్యోగం మాని రైస్‌మిల్లు, బోనుమిల్లు పెట్టి, ఎగుమతి వ్యాపారంలో బాగా అభివృద్ధి చెందారు. అయితే, నాకు ఈ అకాల సంపద ఒక రకమైన నిరాపేక్షతాభావం కల్గించింది. అయితే, ఈ సంపదయే ఆ తరువాత నా ఇంగ్లాండు చదువుకు ప్రాతిపదిక వేసింది.

కాకినాడ పి.ఆర్.కాలేజీలో 1932లో నేను బి.ఎస్‌సి. ప్యాసయ్యాను. గోపరాజు రామచంద్రరావు, ఉప్పల లక్ష్మణరావుగార్లు అప్పుడు మా కాలేజీలో అధ్యాపకులుగా ఉండేవారు. వారి హేతువాద దృష్టి, శాస్త్రీయ దృక్పథం నాపై ఎంతో ప్రభావం కల్గించాయి. నాకు 18వ ఏట, 1930లో పెండ్లి జరిగింది. నా భార్య మాణిక్యాంబకు అప్పుడు 11 సంవత్సరాలు. ఉన్నత విద్యకోసం, జీవశాస్త్రంలో పరిశోధన కోసం ఇంగ్లాండు వెళ్లాలని మా తండ్రిగారితో చెప్పగా ఆయన అంగీకరించారు. మా కుటుంబ ఆర్థిక పరిస్థితి అందుకు తోడైంది. ఏడాదికి లక్షరూపాయలు మా తండ్రి వ్యాపారంలో సంపాదించేవారు.

1932 డిసెంబరు 10 న ఇంగ్లాండ్‌కు ఓడమీద బయలుదేరాను. పారిస్, లండన్‌లలో మా తండ్రిగారికి వ్యాపార రీత్యా పరిచయస్థులున్నారు. వారు భారతీయ విద్యార్థుల హాస్టల్‌లో నాకు తగు ఏర్పాట్లు చేశారు. వేల్సు ప్రాంతంలో ఎమ్.ఎస్‌సి. చదువుతూ మా తండ్రిగారికి యిచ్చిన మాట ప్రకారం ఐ.సి.యస్ పరీక్షకు కూడా తయారవ్వాలని అనుకొన్నాను. కాని మనస్కరించలేదు. కొంత ఫీజు కట్టికూడా మానివేశాను. పండిట్ నెహ్రూ లండన్ వచ్చినప్పుడు వారి సభలకు వెళ్లాను. వారి గ్రంథాలు కూడా చదివాను. మీరట్ కమ్యూనిస్టు కుట్ర కేసు గురించి కూడా చదివాను. రజనీ పామీదత్తు, సకలత్‌వాలాలతో నాకు పరిచయాలు కలిగాయి. వారు బ్రిటిష్ కమ్యూనిస్టు పార్టీలో ప్రముఖులు. భారతీయ విద్యార్థుల సమావేశాలలో పాల్గొంటూ వచ్చిన వి.కె. కృష్ణమీనన్, సజ్జాద్ జహీర్ మున్నగు

వారితో కూడా పరిచయాలు ఏర్పడ్డాయి. భారత జాతీయ కాంగ్రెస్‌లో ఉంటూనే సోషలిస్టు భావాలుగల అతివాద కాంగ్రెస్ వాదులు నెహ్రూ అండతో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీని ఏర్పరిచారు. ఈ పార్టీ పత్రిక "కాంగ్రెస్ సోషలిస్టు"కు లండన్ నుండి నేను వ్యాసాలు వ్రాసేవాణ్ణి. బ్రిటిష్ మ్యూజియం లైబ్రరీలో చార్లెస్ డార్విన్ జీవపరిణామ సిద్ధాంత గ్రంథాలు, కారల్ మార్క్స్ సమాజ పరిణామ సిద్ధాంతాలు తదితర గ్రంథాలను చదివాను. ఈ రెండూ సోషలిస్టు సిద్ధాంత అవగాహనకు నాకు తోడ్పడ్డాయి. మార్క్స్ ఏ బ్రిటిష్ మ్యూజియమ్ లైబ్రరీలో కూచుని అధ్యయనం చేసి తన కమ్యూనిస్టు మ్యానిఫెస్టో, కాపిటల్ గ్రంథాల్ని, శాస్త్రీయ సోషలిజం మూల సూత్రాలను రూపొందించారో ఆ బ్రిటిష్ మ్యూజియమ్ లైబ్రరీలోనే నేను మార్క్స్ గ్రంథాలను చదవడం నాకు గొప్ప అదృష్టమని చెప్పాలి. అప్పటి నుండే నేను మార్క్స్ సిద్ధాంతాలకు, కమ్యూనిస్టు ఉద్యమానికి పూర్తిగా అంకితమయ్యాను. భారతీయ విద్యార్థులం కలిసి లండన్‌లో సోషలిస్టు స్టడీ సర్కిల్ ఏర్పాటుచేసి ప్రతినెల చారిత్రక, రాజకీయ, ఆర్థిక సమస్యలు చర్చించేవారం. నేను బ్రిటిష్ ట్రేడ్‌యూనియన్ సమావేశాలకు కూడా హాజరయి, బ్రిటీష్ కార్మికుల స్థితిగతులను కూడా పరిశీలించేవాణ్ణి. రష్యా గురించి వెబ్ దంపతులు రచించిన గ్రంథాన్ని అక్కడే చదివాను. నేను 1937లో తిరిగి భారతదేశం చేరాను. 1938లో హరిపుర కాంగ్రెస్ మహాసభకు వెళ్ళాను. 1938లో వేసవిలో మంతెనవారి పాలెంలో జరిగిన నెలరోజుల రాజకీయ పాఠశాలలో మార్క్సిస్టు తత్త్వశాస్త్రాన్ని, ఆర్థిక శాస్త్రాన్ని బోధించాను. 1939 సెప్టెంబరు, 1,2 తేదీలలో కాకినాడలో ఆంధ్రరాష్ట్ర విద్యార్థిఫెడరేషన్ సభకు సుభాష్‌చంద్ర బోస్‌ను ఆహ్వానించాం. సెప్టెంబరు 1వ తేదీన రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. సుభాష్‌చంద్ర బోస్ ఆ తరువాత దేశం నుండి అంతర్హితుడయ్యాడు. యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసినందుకుగాను నన్ను, యితర కామ్రేడ్స్‌ను 1939లో బ్రిటిష్ పాలకులు అరెస్టు చేసి జైలులో నిర్బంధించారు. కాకినాడ కార్మిక పోరాటాలలో అటుపిమ్మట అనేకసార్లు నా అరెస్టులకు ఇది నాందీవాచకం.

★ ★ ★

# కీ.శే. కొల్లా వెంకయ్య



నేను 1936వ సంవత్సరమునుండి కమ్యూనిస్టుని. అంతకుముందు కాంగ్రెస్‌వాదిని. నా కుటుంబము, మా గ్రామము పరిస్థితుల ప్రభావము నాపై వుంది; వుంటుంది.

మా గ్రామం పెదనందిపాడు. ఈ ప్రాంతములో 1921–1922 సంవత్సరములలో సాగిన పన్నుల నిరాకరణోద్యమానికి మా గ్రామము కేంద్రం. పర్వతనేని వీరయ్య చౌదరి గారి నాయకత్వాన మా గ్రామ రైతులు శాంతి సైన్యంగా రూపొందారు. "స్వరాజ్యం మన జన్మహక్కు", "మహాత్మాగాంధీకి జై", "హిందూ, ముస్లింలు ఏకం కావాలి," "అంటరానితనం అంతం గావాలి", "పన్నులు నిరాకరించండి" మొదలగు నినాదాలతో చుట్టుపట్ల గ్రామాలలో పాదయాత్రలు చేశారు. పుసలూరు గ్రామములో 1921 డిసెంబరులో జరిగిన బహిరంగ సభలో ఆ ప్రాంత గ్రామకరణాలు తమ ఉద్యోగాలకు రాజీనామా చేశారు. రాజీనామా చేసిన మా గ్రామకరణం సంకా సీతారామయ్యగారిని గ్రామస్తులు పల్లకీ ఎక్కించి వూరేగించి గౌరవించారు. మా గ్రామములో వున్న రెవిన్యూ ఇన్‌స్పెక్టరుకు చెర్వులో నీరు ముంచుకోకుండా సాంఘిక బహిష్కరణను విధించారు. మా గ్రామములో మాలలూ, మాదిగలు అప్పటివరకు

వూరు చెర్వులో దిగి నీరు ముంచుకునేవారు గాదు. రైతులే వారిని చెర్వులో దిగి నీరు ముంచుకోమని ప్రోత్సహించారు. మా గ్రామములో వున్న ఒకే ఒక సారా దుకాణాన్ని రైతులు మూయించారు. పన్నులు నిరాకరించిన రైతుల ఆస్తులు జప్తు చేయుటకు వచ్చిన అధికారులకు గ్రామములో ఆశ్రయము ఇచ్చేవారు లేక వూరి చెర్వు కట్టమీద రావి చెట్టుక్రింద విశ్రాంతి తీసుకునేవారు. అప్పటికి నా వయస్సు 10–11 సంవత్సరాలు.

నేను యీ ఉద్యమములో భాగస్వామిని కాను. కాని, ఆ సంఘటనలు నాకు మరపురావు.

మాది ధనిక రైతుకుటుంబం. మాకు యిద్దరు పాలేర్లు వుండేవారు. మా అమ్మ వారిని "శేషయ్య అన్న", "అబ్బాయి రాఘవులు" అని మర్యాదగా పిలిచేది. మా నాన్నగారు వారియెడ కఠినంగా వ్యవహరించేవాడు. ఇది నాకు నచ్చేది కాదు. మా గ్రామములో 1926వ సంవత్సరములో మాధ్యమిక పాఠశాలను ప్రారంభించారు. దానిలో చేరాలని నాకు బుద్ధి పుట్టింది. వీధి బడికి పంపుతూ వచ్చిన మా నాన్న యిందుకు తిరస్కరించాడు. గ్రామపెద్దలచేత ఆయనకు నచ్చజెప్పించి నేను ఆ పాఠశాలలో చేరాను.

మా గ్రామములో లావు అంకమ్మగారు ప్రముఖ కాంగ్రెస్ వాది. ఆయన నన్ను దగ్గరకు దీసి కాంగ్రెస్ పనిలో కలుపుకెళ్ళేవారు. 1928లో గాంధీగారు మా గ్రామము వచ్చినపుడు అంకమ్మగారే విరాళాలు వసూలు చేసి సభ ఏర్పాటు చేశారు. నేను అందులో వారికి తోడుగా వున్నాను. 1929 చివర తూర్పు గోదావరి జిల్లా సీతానగరంలో జరిగిన వాలెంటీరు శిబిరానికి వెళ్లమని ఆయన నన్ను ప్రోత్సహించారు. నేను వెళ్లాను. వారంరోజుల తరువాత ప్రభుత్వం ఆ శిబిరాన్ని నిషేధించి పాకలు పడగొట్టింది. నేను 1931లో బాపట్ల వెళ్లి హైస్కూలులో చేరాను. అక్కడ ఖాదీ భండారును నిర్వహిస్తున్న బొడ్డుపల్లి సుబ్బయ్యగారి కోరిక ప్రకారము నేను కావూరు గ్రామము వెళ్లి యిద్దరు మహిళలను వ్యక్తిగత సత్యాగ్రహానికై తీసుకు వచ్చాను. నేను మా గ్రామము నుండి బాపట్ల వెళ్లేటప్పుడు తోవలో వున్న కొండపాటూరు, ఉప్పరపాలెం మొదలగు గ్రామాలలో గాంధీగారి సిద్ధాంతాలను ప్రచారం చేసేవాడిని. 1934లో నేను గుంటూరులో ఎ.సి.కాలేజీలో చేరాను. బొడ్డుపల్లి సుబ్బయ్యగారు, లావు అంకమ్మగారు నన్ను పిలిపించి బొంబాయి కాంగ్రెస్‌కు ప్రతినిధిగా వెళ్లమని నిర్ణయించి నన్ను ప్రతినిధుల జాబితాలో చేర్చారు. 1934 అక్టోబరులో రాజేంద్రప్రసాద్ అధ్యక్షతన జరిగిన బొంబాయి కాంగ్రెస్‌లో నేను పాల్గొన్నాను. గాంధీగారి అహింసా సిద్ధాంతము ఆ కాంగ్రెస్‌లో చర్చకు వచ్చింది. మదన్‌మోహన్ మాలవ్యా, యం.యస్. ఆనే గార్లు ఆ సిద్ధాంతాన్ని వ్యతిరేకించారు. నేను ఆ సిద్ధాంతానికి అనుకూలంగా చెయ్యి ఎత్తాను. అత్యధిక సంఖ్యాకులు ఆ తీర్మానాన్ని ఆమోదించారు.

శ్రీయుతల నండూరి ప్రసాదరావు, పులుపుల శివయ్య, పోలేపెద్ది నరసింహ మూర్తిగారలు గుంటూరు పట్టణం బ్రాడీపేటలో ఫ్రెండ్స్‌హోం అనే భోజనశాలను పెట్టి పార్టీ కేంద్రాన్ని ప్రారంభించారు. ఆ సమీపములో వున్న నా గదికి పార్టీ కార్యకర్తలు వచ్చి తమ సాహిత్యాన్ని దాచి, సిద్ధాంత వివాదాలను సాగించేవారు.

రాజేంద్రప్రసాదు, నెహ్రూ గారలు గుంటూరు వచ్చినప్పుడు జరిగిన సభలలో వీరి ప్రవర్తన నాకు గిట్టలేదు. మా గ్రామములో హైస్కూలులో తెలుగు పండితులుగా వున్న వెంకటకృష్ణయ్యగారు అభివృద్ధి కాముకులు. శాంతియుత పోరాటము ద్వారా స్వతంత్రం సాధ్యమయ్యేది గాదని వాదిస్తూ వుండేవారు. ఈ వాదనలతో నా వైఖరిలో మార్పు వచ్చి, 1936లో కమ్యూనిస్టు పార్టీలో ప్రాథమిక సభ్యునిగా చేరాను. కాలేజీలో చదివే సమయములో గ్రామాలు తిరిగి రైతు, కూలీల సమస్యలు తీసుకొని పనిచేసేవాడిని. 1937లో కొత్తపట్నంలో పార్టీ జరిపిన రాజకీయ పాఠశాలకు హాజరైనాను. ప్రభుత్వం చివర ఆ పాఠశాలను నిషేధించి లాఠీచార్జీ జరిపింది. ఆ లాఠీ చార్జీకి తట్టుకోలేక నేను సమావేశం నుండి బయటకు వచ్చాను. ఇది తప్పు అనీ, సర్వత్యాగాలకు సిద్ధముగావలసిన కమ్యూనిస్టులకు యిది తగదనీ, తప్పు చేశాననీ, పార్టీకీ, నేను పనిచేసే రైతులకు స్పష్టం చేశాను. ఇది నా జీవితానికొక పాఠమైంది.

కమ్యూనిస్టు పార్టీ కార్మికవర్గ పార్టీ; మార్క్సిజం – లెనినిజం కార్మికవర్గ సిద్ధాంతం. ఈ సిద్ధాంతము వూహించి రూపొందించింది గాదు. సమాజము ఆదిమ కమ్యూనిస్టు దశ, ఫ్యూడల్ భూస్వామ్య దశ, పెట్టుబడిదారీ దశ, సోషలిస్టు దశ – ఒక దశనుండి మరియొక దశకు పరిణామము చెంది కమ్యూనిజంకు పయనిస్తుంది. కార్మికవర్గము, కమ్యూనిస్టు పార్టీ యీ పరిణామమునకు దోహదము చెయ్యటమేగాక, సోషలిస్టు విప్లవానికీ, సోషలిస్టు నిర్మాణానికీ నాయకత్వం వహించి కమ్యూనిజంవైపు పురోగమించాలి. మార్క్స్, ఎంగెల్స్ మహాశయులు ఆయా దశలలో సాగిన పరిణామమును అధ్యయనము చేసి, ఆయా దశలయొక్క స్వభావాన్ని, ఆయా దశలలో కార్మికవర్గము చేబట్టవలసిన వ్యూహము, ఎత్తుగడలను వివరించారు. పెట్టుబడిదారీ విధానము మొదటి దశలో శాంతియుత విప్లవానికి అవకాశం యిచ్చినా 1850నుండి అది దమనకాండకు పూనుకొన్నదనీ, కార్మికవర్గము హింసాయుత విప్లవము ద్వారానే పురోగమించగలదనీ వారు స్పష్టం చేశారు. వారి కాలములో పెట్టుబడిదారీ విధానము సామ్రాజ్యవాద దశకు ఎదగలేదు. లెనిన్ మహాశయుడు పెట్టుబడిదారీ విధానము ఉన్నత దశకు, అంటే సామ్రాజ్యవాద దశకు ఎదిగిందనీ కమ్యూనిస్టు పార్టీ జాతీయ పెట్టుబడిదార్లను కలుపుకొని సామ్రాజ్యవాద వ్యతిరేక సంఘటనను నిర్మించి బూర్జువా ప్రజాతంత్ర విప్లవం వైపు, కార్మికవర్గ నాయకత్వాన, సోషలిజం వైపు పురోగమించాలనీ ప్రబోధించారు.

కమ్యూనిస్టు పార్టీ సభ్యులమైనంత మాత్రాన సరిపోదు. ఈ విప్లవ సిద్ధాంతము అందించే కార్మిక వర్గం దృక్పథముతో ఎప్పటికప్పుడు ఆత్మవిమర్శ చేసుకుంటూ మనలో వ్యక్తమయ్యే అన్యవర్గ ధోరణులను అధిగమిస్తూ ఆ సిద్ధాంతమును ఆయా దేశ పరిస్థితులకు అన్వయించుకొని విప్లవ పంథాను కార్యక్రమాన్ని రూపొందించుకొని పురోగమించాలి. విప్లవ సిద్ధాంత అవగాహన లోపమే అనేక తప్పులకు దోవతీస్తుంది. భారతదేశంలో కులవ్యత్యాసాలు, సాంఘిక అసమానతల సమస్య ఒక మౌలికమైన సమస్య కూడా. భూమికోసం, సాంఘిక అసమానతల తొలగింపుకు పోరాడే ప్రజాస్వామిక శక్తులను – ఎన్ని లోపాలున్నా వాటిని ఎత్తిచూపిస్తూనే సమైక్యం చెయ్యటం మౌలిక అవసరం.

## కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత

ఎన్నటికంటే నేడు కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత ప్రపంచములోనూ, దేశంలోనూ ప్రధానమైంది. ఈ సంవత్సరములో (1995) జరిగిన సి.పి.ఐ., సి.పి.ఐ.(ఎం.) పార్టీ మహాసభలు సూత్రబద్ధమైన ఐక్యత అవసరమని వ్యక్తం చేశాయి. వివిధ సి.పి.ఐ. (యం.ఎల్) పార్టీలూ సి.పి.ఐ., సి.పి.ఐ.(యం.)లు మార్క్సిజం- లెనినిజం తమ సిద్ధాంతమని ఆమోదిస్తున్నాయి. మార్క్సిస్టు - లెనినిస్టు మహోపాధ్యాయుల ప్రబోధాలను గమనంలో తీసుకొంటూ తాము చేబట్టిన విధానాలపై విమర్శ - ఆత్మవిమర్శలను సాగించి విప్లవ రాజకీయాలు, విప్లవ పంథాపై ఐక్యంగావటం, యిందుకు యువతరము పట్టుదలతో కృషి చేయుటము నేటి అవసరము.

★ ★ ★

# శ్రీ కోడుగంటి గోవిందరావు



చిన్నప్పటినుండి నాకు సంగీతమన్నా, నాటకాలన్నా ఆసక్తి ఎక్కువ. నేను 4,5,6 ఫారములు చదువుతుండగా (ఇప్పటి 8,9,10వ తరగతులు) జిల్లాలో ఏటా జరిగే 'గ్రిగ్' స్పోర్ట్స్‌లో, షేక్‌స్పియర్ వగైరా నాటకాలలోని భావయుక్తమైన విభాగాలలో నటించడం (రెసిటేషన్)లో వరుసగా 3 సార్లు మొదటి బహుమతి గెల్చుకున్నాను.

విశాఖపట్నంలో ఇంటర్‌లోనికి వచ్చిననాటికి ఆంధ్రాయూనివర్సిటీలోనూ, మెడికల్ కాలేజీలోనూ విద్యార్థి ఉద్యమం జోరుగా నడిచేది. కామ్రేడ్స్ వల్లభరావు, సీతారామయ్య వగైరాలు యూనివర్సిటీ నుండీ; డాక్టర్సు లక్ష్మి, రామదాసు, సూర్యనారాయణ, వెంకటరామ శాస్త్రి వగైరాలు మెడికల్ కాలేజీ నుండి ఉద్యమ నాయకత్వం వహించేవారు. విద్యార్థి ఉద్యమం ఉవ్వెత్తుగా సాగుతున్న రోజులవి.

1939లో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమవడంలో విద్యార్థి ఉద్యమం యుద్ధ వ్యతిరేక ఆందోళన కొనసాగించింది. ఆ రోజులలో విశాఖపట్నం టౌన్‌హాలులో ప్రఖ్యాత ఇంగ్లీష్ నాటక రచయిత జార్జి బెర్నార్డ్‌షా రచించిన యుద్ధ వ్యతిరేక నాటిక ఒకటి విద్యార్థి ఉద్యమ నాయకులు ప్రదర్శించడం జరిగింది. కాలేజీలో నాకేదో కొంత ఆసక్తి ఉందని తెలుసుకొని, వారు దానిలో నాకొక చిన్న పాత్ర యిచ్చారు.

అంతవరకు నాకు విద్యార్థి ఉద్యమం గురించిగాని, కమ్యూనిస్టు పార్టీ గురించి గానీ ఏమీ తెలియదు. నాటకం మాత్రం రక్తి కట్టింది. విద్యార్థి నాయకులతో నాకు కొంత పరిచయం మాత్రం ఏర్పడింది.

సుమారుగా అదే రోజుల్లో టౌన్‌హాలు బీచ్‌లో ఉన్న శ్రీ బెజవాడ గోపాలరెడ్డి ఆ సభకు విచ్చేశారు. అధ్యక్షులు శ్రీ తెన్నేటి విశ్వనాథం. అదే సమయానికి కొద్ది రోజుల ముందు చిట్టివలస కార్మికులపై జరిగిన పోలీసు కాల్పులపై విచారణ జరిపించమని కోరుతూ పిటీషన్ మంత్రిగారికి యిచ్చుటకు శ్రీ జొన్నలగడ్డ రామలింగయ్య నాయకత్వాన రెండు, మూడు వేల కార్మికులు కాలినడకన చిట్టివలస నుండి విశాఖపట్నం వచ్చారు. సభా ప్రారంభంలో తీవ్ర ఉద్రిక్తత నెలకొన్నది. ఈ సభకు నాతోసహా వందలాది విద్యార్థులు, ఇతరులు హాజరయ్యారు.

సభ ప్రారంభమవుతూనే వేలాది మంది కార్మికుల సంతకాలతో తయారైన పిటిషన్‌ను మంత్రిగారికి అందించుటకు లేవగానే విశ్వనాథంగారు పరిస్థితిని గమనించి టౌనుహాల్‌లో టీ పార్టీకి మంత్రిగారు వెళ్లవలసి ఉన్నదనే సాకుతో వెళ్లిపోవుటకు ఉద్యుక్తులయ్యారు.

ఇది చాలా అన్యాయమని, కార్మికుల ప్రాణాలకన్నా టీ పార్టీ ముఖ్యమనడం ఎంత మాత్రం సమంజసంగాదని శ్రీ రామలింగయ్య పట్టుపట్టినా మంత్రిగారు వినలేదు. ఆ వెంటనే రామలింగయ్యగారు అమాంతంగా సాష్టాంగపడి మంత్రిగారి రెండు కాళ్లు పట్టుకొని విడవలేదు. అయినా వారు తోసుకొని టీ పార్టీకి వెళ్లిపోయారు.

ఆ వెంటనే శ్రీ రామలింగయ్య లేచి ఒక గంటసేపు యిచ్చిన మహోద్రేకమైన ప్రసంగంలో కార్మికులపట్ల కాంగ్రెస్ నాయకుల వైఖరిని బట్టబయలుచేశారు. ప్రేక్షకులంతా ఉద్రేకంతో ఊగిపోయారు. నాలాటి యువకులందరిపై ఈ సంఘటన చెరిగిపోని ముద్రవేసింది. కాంగ్రెస్ నాయకులకు కార్మికులపట్ల ఎలాంటి వ్యతిరేకత ఉన్నదీ స్పష్టమైనది. కమ్యూనిస్టు అన్నమాట నాకు అప్పుడే తెలిసింది. వీరంతా పేదల తరఫున పనిచేస్తారని అర్థమయినది. కమ్యూనిస్టులపట్ల అభిమానం ఏర్పడ్డది.

ఇంటర్ విశాఖపట్నంలో పూర్తిచేసి బి.ఏ. చదువుకు విజయనగరం వెళ్ళాను. అక్కడ ప్రభాత్ లాడ్జిలో ఉండగా ఆ ప్రక్క గదిలో బి.ఎస్‌సి. 2 వ సంవత్సరం చదువుతున్న కామ్రేడ్ విజయకుమార్‌తో స్నేహం ఏర్పడింది. ఆయన అప్పటికే అజ్ఞాతవాసంలో ఉంటున్న జొన్నలగడ్డ రామలింగయ్యవద్దకు నన్ను తీసుకువెళ్ళి పరిచయం చేశాడు.

ఆయన నాకు 'గోర్కీ' వ్రాసిన 'అమ్మ' నవల యిచ్చి చదవమన్నారు. అంతేగాక ఆయన, నాకు నేర్పిన మొదటి పాఠం ఏమంటే – రాత్రి పాఠశాల నడపమని. ఇతర సోషనిస్టు భావాలు కలిగిన శ్రీ కె. ఎస్. తిలక్ మొదలగు విద్యార్థులతో కలిసి విజయనగరంలో 'జన్నగుడ్డి' అనే హరిజనపేటలో రాత్రి పాఠశాల ప్రారంభించి 5,6 మాసాలు నడిపాము. ఆ రోజులలోనే హరిజనులు – వారి కుటుంబాలతో సన్నిహిత సంబంధం ఏర్పడింది. వారి సమస్యలపట్ల అవగాహన ఏర్పడ్డది.

రామలింగయ్యగారి డెన్‌లో ఒకరోజు చీకటిలో ఒక నిక్కరుతో వున్న బాగా పొడవాటి ఫ్రెంచికట్ యువకుడిని చూశాను. ఆయన నాతో ఒక్కమాట కూడా

మాట్లాడలేదు. ఎవరీయన? ఆయన కామ్రేడ్ రాజేశ్వరరావు అన్నసంగతి కొన్నాళ్ల తరువాతగాని తెలియలేదు.

ఆ తర్వాత కామ్రేడ్స్ సుందరయ్య, రాజేశ్వరరావుగార్ల జీవిత విశేషాలు, వారి త్యాగనిరతి, క్రమశిక్షణ, నిరాడంబరత్వం – అంతటిగూర్చి తెలిసిన తర్వాత, దోపిడీ సమాజానికి మారుగా, కార్మిక, కర్షక రాజ్యం కోసం పోరాడడమే కమ్యూనిస్టు లక్ష్యం అని తెలుసుకున్నాక పార్టీలో సభ్యునిగా చేరాలనిపించింది. పార్టీరహస్య పత్రిక పంచిపెట్టే పని అప్పజెప్పారు నాకు.

ఇంతలోనే 1942 ప్రారంభంలో అనుకుంటాను – విజయనగరం దగ్గరగా వున్న 'అలమండ' గ్రామంలో భూస్వాములు భూముల నుండి కౌలుదార్లను బలవంతంగా వెళ్లగొట్టేందుకు కాల్పులు సాగించారనీ, ముగ్గురు రైతుకూలీలు అక్కడికక్కడే చనిపోయారనే వార్త దావానంలా వ్యాపించింది. ఇంతక్రితం ఎన్నడూ యింతటి ఘోరం జరగలేదు – విశాఖజిల్లాలో.

కామ్రేడ్ రామలింగయ్య నన్ను అక్కడకు వెళ్లమని ఆదేశించారు. నేను ఒకవైపు నుండి ఆ ఊరు వెళ్లగా మరొక వైపు నుండి కొందరు సోషలిస్టు యువకులుకూడా వచ్చియున్నారు. మేమంతా ఆ గ్రామానికి వెళ్లేసరికి చుట్టుప్రక్కల గ్రామాలనుండి వచ్చి చెల్లాచెదురుగా భయంతో వున్న రైతుకూలీలంతా సుమారు 2,3 వేల మంది మా చుట్టూతా చేరారు. ఏ ఇతర రాజకీయ నాయకులు కూడా ఆ గ్రామానికి అప్పటికి రాలేదు – జంకుతో.

సరే, మాకూ ఏమీ అనుభవం లేదు – యిలాంటి సందర్భాలలో ఏం చేయాలో. మొత్తం మీద మేమంతా కూడబలుక్కొని 50, 60 మంది రిజర్వు పోలీసులతో సహా మకాం చేస్తున్న డి.ఎస్.పి. వద్దకు ఊరేగింపు లేవదీసి ఒక మెమోరాండం యిచ్చాము. కాల్పులు జరిగి 24 గంటల తర్వాత గూడ, హత్యగావించినవారి పేర్లు తెలిసికూడ ఎందుకు అరెస్టు చేయలేదనీ, వారి తుపాకు లెందుకు స్వాధీనం చేసుకోలేదనీ దబాయించి అడిగాం. అక్కడ నెలకొనివున్న ఉద్రిక్తతను గమనించి డి.ఎస్.పి. మా కోరిక నంగీకరించి క్షత్రియ భూస్వాములవద్దనున్న తుపాకులన్నింటిని స్వాధీనపరుచుకొని, ముద్దాయిలనందరిని అరెస్టు చేసి విశాఖపట్నం సెంట్రల్ జైలుకు పంపివేశారు. విశాఖజిల్లా రైతు పోరాటాలలో యిదొక ముఖ్యమైన పోరాటంగా నిలిచిపోయింది. ఆ దెబ్బతో ఒక్క ఎకరం భూమిని కూడా రైతులు విడిచిపెట్టకుండా ధైర్యంతో నిలబడగల్గారు.

ఈ విధంగా ప్రజా ఉద్యమాలలో, రైతు పోరాటాలలో నాకు ఎప్రెంటిస్ చేసే అవకాశం లభించింది.

ఇంతలో 1942 ఆగస్టులో క్విట్ ఇండియా ఉద్యమం ప్రారంభమైంది. బొంబాయిలో క్విట్ ఇండియా తీర్మానం పాసయిన వెంటనే దేశ నాయకు లనేకులను అరెస్ట్ చేసి నిర్బంధించడంతో దేశ వ్యాపితంగా ప్రజలలో ఆగ్రహావేశాలు పెల్లుబికింది. విజయనగరంలో విద్యార్థులంతా ఈ ఉద్యమంలో ముందుభాగాన నిలిచారు. బ్రిటిష్ ప్రభుత్వాన్ని పడగొట్టడానికి ఏ పద్ధతులు అనుసరించాలని మార్గాలు

వెతకసాగారు. విద్యార్థులంతా బ్రహ్మాండమైన ప్రదర్శనలు ప్రతిరోజూ చేసి పార్కుల్లో ఉపన్యాసాలు సాగించారు. దానికి నాయకత్వం వహించినవారిలో నేనుకూడా ఒకడిని. కోర్టులు, మార్కెట్లు, స్కూళ్లు మొత్తం బంద్ అయినవి.

విద్యార్థుల సమ్మె విచ్ఛిన్నం చేయడానికి పోలీసులు విశ్వప్రయత్నం సాగించినా ఫలితం దక్కలేదు. చివరకు నాతో సహా మొత్తం 12 మంది యువకులను అరెస్ట్ చేసి, 4 మాసాల కఠిన శిక్ష విధించి బళ్లారి జైలుకు పంపివేశారు. నాతోబాటు సోషలిస్టు యువకులు (వారే తర్వాత పి.వి.జి.గ్రూపు అయ్యారు) శ్రీ కె. ఎస్. తిలక్, సత్యనారాయణ శాస్త్రి, పద్మనాభరాజు వగైరాలు కూడా అరెస్టయ్యారు.

అలీపూర్ కాంపు జైలులో (బళ్ళారి) పెద్ద నాయకులంతా 'బి' క్లాసు ఖైదీలుగా వేరేచోట వుంచబడగా సామాన్య కార్యకర్తలంతా 'సి' క్లాసు ఖైదీలుగా కఠిన శిక్షకు గురయ్యారు.

జైలు నుండి విడుదలైన వెంటనే సోంపేటలో టీచరుగా పనిచేస్తున్న మా నాన్నగారినీ, మిగతా కుటుంబ సభ్యులను కలపటానికి వెళ్ళాను.

ఇక్కడే మా కుటుంబ పరిస్థితి గూర్చి కొద్దిగా చెప్పాలి. ఇనాందార్లుగా మా కుటుంబానికి వచ్చిన యావదాస్తిని విజయనగరం ఎస్టేట్‌లో భాగంగా ప్రభుత్వం వశపరచుకున్నది.

మా పెద్ద కుటుంబం అంతటిని మా తండ్రిగారు చిన్న టీచరు ఉద్యోగంతో మోయవలసి వచ్చింది. జీతం నెల 1కి 60 రూ.లు మాత్రమే. విజయనగరంలో మా యింటిని అమ్మివేసి అప్పులు తీర్చివేశారు. ఇద్దరు మగపిల్లలు – నలుగురు ఆడపిల్లలు వీరికి చదువులు, పెళ్ళిళ్ళు, రోగాలు, మందులు – వీటితో చితికిపోయిన మధ్యతరగతి కుటుంబం మాది. మా చదువులకు విశాఖపట్నంలోని మా తాతగారు చాలా ఆదుకున్నారు.

మా నాన్నగారు పట్టభద్రులైనా చాలా భగవత్ భక్తులు – ఇంట్లో ఆయన మాటకు ఎదురులేదు. ఆచార వ్యవహారాలలో పరమ శ్రోత్రియమైన కుటుంబం అని చెప్పాలి. చాలా ఎగ్రసివ్ టైప్. ఒక చిన్న ఉదాహరణ.

మా అన్నయ్య విశాఖపట్నంలో ఇంటర్ చదువుతున్న కాలంలో ఒకరోజు విశాఖపట్నం మా తాతగారింట్లో ఏదో పెళ్ళిలో అంతా కలిసి ఉన్నప్పుడు భగవంతుని ఉనికిని గూర్చి మా అన్నయ్య సందేహం వెలిబుచ్చుతూ, నిజంగా భగవంతుడే ఉంటే సమాజంలోని ఏ కొద్దిమందో దుర్మార్గులు బాగుపడటమేమి, కోటానుకోట్ల జనం కష్టపడుతూ కూడా బ్రతకలేకపోవడ మెందుకని వాదన లేవదీశాడు. అంతే, మా నాన్నగారు మా అన్నయ్యను కొట్టినంత పనిచేయడం సరిగదా – మళ్ళీ చాలా సంవత్సరాలపాటు అతనితో మా కుటుంబానికి ఎట్టి సంబంధం లేకుండా పోయింది. ఇక నేనైనా చదువుకొని కుటుంబానికి సహాయపడతానన్న ఆశతో మా నాన్నగారు చాలా ప్రేమతో చదువు చెప్పించారు. కాని, నేను జైలుకి వెళ్లి వచ్చేసరికి ఆయన భరించలేకపోయారు. ఇకనైనా రాజకీయాలు విడిచిపెట్టి తిన్నగా ఉండమని గట్టిగా చెప్పారు. అంతగట్టిగానే నేను కూడా నా మార్గం ఎంచుకున్నానీ, నేను కమ్యూనిస్టు పార్టీలో పని చేయదలచుకున్నాననే తెగేసి చెప్పాను అంతే. ఇంటికి

వెళ్లిన 15 నిముషాలలోనే తిరిగి వచ్చేశాను. విశాఖపట్నంలో టాన్యా కమ్యూన్‌లో వుండిపోవడానికి చిన్న సంచీ పట్టుకొని వచ్చేశాను. వెంటనే రాష్ట్ర పార్టీ సర్కిలుకు హాజరై వచ్చాను.

ఇంతలో విశాఖపట్నంలో నాపైన చిన్నప్పటినుంచి ఎంతో అభిమానంతో వున్న మా మేనమామ శ్రీ టేకుమళ్ళ రామారావు (ఎ.వి.ఎన్. కాలేజీ వైస్ ప్రిన్సిపాల్) గారు నాకు కబురు చేశారు. నన్ను తన యింట్లో వుంచుకుని ఇంటర్ చదివించి పైకి తేవాలనుకున్న వ్యక్తి కావడంవల్ల ఆయనపట్ల నాకుకూడా చాలా గౌరవభావం ఉండేది. ఎలాగన్నా నా మనసు మార్చడానికి ఆయన ఆఖరి ప్రయత్నం చేశారు. నాకు తెలియకుండా ఒక దరఖాస్తు వ్రాసి పూనా అబ్జెర్వేటరీలో తన స్నేహితుడెవరో వుంటే – వారి సహాయంతో ఉద్యోగానికి ఆర్డరు వేయించి, వెంటనే పూనా వెళ్లిపొమ్మని చాలా వత్తిడి చేశారు. నాకు ఆయనపై ఎంత గౌరవం, అభిమానం వున్నప్పటికిని ఆయనతో నా నిర్ణయం మార్చుకోమని కోరడం అనవసరం – లాభం లేదని ఖండితంగ చెప్పివేశాను.

ఆయన చాలా సంస్కారవంతులు. పిహెచ్‌డి. కోసం ఇంగ్లాండు వెళ్ళి వచ్చినవారు. చాలా మృదుభాషి, నా సంగతి ఆయనకు అర్థమైపోయింది. చివరకు ఆయన నాకు రెండు సలహా లిచ్చారు: నీకంత పట్టుదల ఉంటే పశ్చాత్తాపంతో ఇంటికి తిరిగి వచ్చిన తిరుగుబోతులాగా మళ్ళీ వెనక్కు రాకు. అంతేగాదు, చివరిదాకా నమ్మిన విశ్వాసానికి కట్టుబడి ఉండు అన్నారాయన. ఇంగ్లీషులో ఒక కథను ఉదహరించి, 'Don't get back home like a prodigal son and be truthful to the cause you have chosen till the very last' అన్నారు.

ఆయన యిచ్చిన సలహాలు నా చెవులలో యిప్పటికీ మార్మోగుతూనే ఉంటాయి.

ఆ తర్వాత జిల్లా కమిటీ నన్ను హోల్‌టైమ్‌వర్కర్‌గా తీసుకుని అనకాపల్లి పంపివేసింది. అది జరిగి యిప్పటికి 52 ఏండ్లు గడిచినవి. యువ కామ్రేడ్సుకు నా సందేశమేమిటి?

"మీరంతా రాజకీయాల్లోకి వచ్చిన పరిస్థితులు వేరు. కాబట్టి ఆనాటి క్రమశిక్షణ, నైతిక విలువలు – యిప్పుడు కొనసాగాలనడం పొరబాటు" అనే వాదన చాలా చోట్ల వింటున్నాం.

నిజమే. పరిస్థితులలో కొన్ని మార్పులు వచ్చిన మాట వాస్తవం. ఉదాహరణకు హోల్‌టైమ్ వర్కర్ల వేతనం తప్పనిసరిగా పెంచాలి, ధరల పెరుగుదల కారణంగా.

తగినంత వేతనం యివ్వలేకపోతే వేరే ఉద్యోగం మరొకటన్నా చూసుకుపోవాలి. లేదా ఏదో ఒక క్రమమార్గంలోకన్నా దిగాలి.

కాని పరిస్థితుల్లో వచ్చిన మార్పును సాకుగా తీసుకొని కమ్యూనిస్టు నైతిక సూత్రాలకు పూర్తిగా తిలోదకా లివ్వడం సమంజసమవుతుందా? కమ్యూనిస్టు పార్టీకి మిగిలిన బూర్జువా పార్టీలకు తేడా ఏమిటి? గుర్తించండి.

నా ఉద్దేశ్యంలో కమ్యూనిస్టు పార్టీలో వుండి అవినీతి, లంచగొండితనం కొనసాగించడానికి ఏ పరిస్థితుల్లోను, ఏ స్థాయిలోనూ, ఏ ఒక్కరు చేసినా అది తప్పే అవుతుంది.

# కీ.శే. కారుమూడి సత్యనారాయణరెడ్డి



పశ్చిమ గోదావరి జిల్లా చింతలపూడి తాలూకాలోని యఱ్ఱగుంటపల్లి గ్రామంలో 1921 సంవత్సరం 20వ తేదీన జన్మించిన నేను ఆనాడు గ్రామంలో వున్న ప్రాథమిక పాఠశాలలో 5వ తరగతి వరకు మాత్రమే చదువుకున్నాను. నా బాల్యం తీరకముందే తల్లిదండ్రులిరువురూ గతించటం, పెద్దమ్మలు శీతమ్మ – రామమ్మగారలు గారాబంతో పెంచుటవలన, ఉన్నత విద్యను అభ్యసించటం సాధ్యపడలేదు. ఐనప్పటికీ 16 సం.రాల వయసులోనే, ప్రాథమిక విద్య మాత్రమే చదివినా, గ్రామంలోని కొంతమంది స్నేహితుల సహకారంతో ఒక చిన్న గ్రంథాలయాన్ని ఏర్పాటు చేసి, దానికి దేవాలయం ప్రక్కనే ఒక గదిని కట్టించడం, ఆ గ్రంథాలయాన్ని నడుపుతూ, ఆంధ్ర వారపత్రికను తెప్పించి చదవటం ప్రారంభించాను. ఆనాడు ప్రతి ఆంధ్ర వార పత్రికలోనూ జాతీయ ఉద్యమాన్ని గురించి, అస్పృశ్యతను గురించి మహాత్మా గాంధీజీ వ్యాసావళి వస్తూ వుండేది. దానిని విడువకుండా చదువటవల్ల గాంధీజీ మీదా,

కాం(గెస్ మీద అభిమానం ఏర్పడి 1936–40 సం.రాల మధ్య నూలువడకటం, ఖద్దరు మాత్రమే కట్టాలనే నియమం పాటించటం చేస్తూ కాం(గెసు రాజకీయాలవైపు ఆకర్షితుడనై ధర్మాజిగూడెంలో మాగంటి బాపినీడు, వడ్లపట్ల గంగరాజు మొ॥న వారు ఏర్పాటు చేసిన కాం(గెస్ మీటింగులో పాల్గొన్నాను.

కాం(గెస్‌వాదులుగానే కొనసాగుతున్న కొంతమంది అప్పటికి నిషేధంలో వుండి రహస్య కార్యకలాపాలు కొనసాగిస్తున్న కమ్యూనిస్టు పార్టీతో సంబంధాలున్న కా(మేడ్స్ మాదాసు వీరవెంకయ్య, మాదాసు శేషగిరిరావు, కంచన కాశీ విశ్వనాథ రావులతో నాకు పరిచయం ఏర్పడి, వారికి రహస్యంగా వస్తున్న "స్వతం(త్రభారత్" పక్షప(త్రికను తీసుకువెళ్ళి చదవటం (పారంభించాను. అందులో సోవియట్ రష్యాలో విప్లవం జయ(పదమై కార్మిక – కర్షక రాజ్యం ఏర్పడటం, అలాగే (పపంచ వ్యాప్తంగా కమ్యూనిస్టు ఉద్యమ పురోగమన వార్తలు చదువుతూ అంతకు ముందు కాం(గెసు అభిమానిగా వున్న నేను (కమంగా కమ్యూనిస్టు ఉద్యమం పట్ల ఆకర్షితుడనయ్యాను. దానికితోడు కమ్యూనిస్టు పార్టీ సిద్ధాంతాలకు చెందిన సాహిత్యం చదివాను. ఆనాడు పార్టీ ఆర్గనైజర్సు తరుచు ఏలూరు నుండి చింతలపూడి వచ్చి, అక్కడ ఒక సెల్లును ఏర్పాటు చేసి సమావేశాలు జరుపుతూ వుండేవారు. ఆ సమావేశాలకు కా(మేడ్స్ అన్నే వెంకటేశ్వరరావు, ఈడ్పుగంటి పూర్ణచం(దరావు, దూసనపూడి విరా(టాజు మొదలైనవారు వచ్చి పార్టీ కార్యకలాపాల గురించి, నిర్మాణాన్ని గురించి, (కమశిక్షణ గురించి, (పతి పార్టీ సభ్యుడు ఎలా పని చేయాలో, నీతి నియమాల్ని ఎలా పాటించాలో మొదలైన విషయాలను సవివరంగా చెప్పేవారు. ఆనాడు య(ర్రగుంటపల్లి నుండి చింతలపూడి 6 మైళ్ళు దూరం వుండి, మట్టి రోడ్డుకూడా లేకపోయినా కాలినడకనగాని, సైకిలుమీదగాని, సమావేశానికి అనుకున్న (పకారం టైముకు చేరి అంతర్జాతీయ గీతంతో (పారంభించే సమావేశంలో పాల్గొనటం ఆనాటి (కమశిక్షణకు నిదర్శనం. అంతేగాకుండా, ఆనాటి నాయకత్వం (కమశిక్షణ నేర్పటంలోనూ, పాటించటంలోనూ ఎంతో ఆదర్శంగా వుండేది. ఆ కారణంగానే ఆనాటి కా(మేడ్స్, అంటే 1942 (పాంతంలో కమ్యూనిస్టు పార్టీలో చేరిన వారు యీనాటికి (కమశిక్షణలో ముందు భాగాన నిలబడటం, ఆదర్శ కమ్యూనిస్టులుగా కొనసాగటం మనం యీనాటికి చూస్తున్నాం. అంతేగాకుండా, ఆనాడు పార్టీలోకి ఎలా కొత్తవారిని తీసుకురావాలి, వారిని ఉత్తమమైన ఉన్నతమైన కమ్యూనిస్టులుగా తీర్చిదిద్దాలి అనే ఆలోచన, తపన ఎంతో వుండేవి. ఆటువంటి కృషి ఆనాడు, యీనాడు, ఏనాటికైనా అత్యంత అవశ్యం. పైన వివరించిన కృషి ఫలితంగా 1942వ సం.రంలో కమ్యూనిస్టు పార్టీలో క్యాండిడేటు సభ్యుడిగా చేరి, ఆ తర్వాత పూర్తి సభ్యుడి నయ్యాను. 1944వ సం.రంలో బెజవాడ పట్టణంలో జరిగిన చారి(త్రాత్మక ఆలిండియా రైతు మహాసభకు రా(ష్ట్రం నలుమూలలనుండి వేలాది రైతులు రెండెడ్ల బండ్లపై కుటుంబాలతో తరలిరావటం జరిగింది. బెజవాడకు 70 మైళ్ళ దూరంలో వున్న య(ర్రగుంటపల్లినుండి రెండెడ్ల బండిపై 6 మాసాల వయసు కలిగిన మా రెండవ అమ్మాయితో సహా కుటుంబ సభ్యులం వచ్చి పాల్గొన్నాం.

ఇంతకు ముందు మా యింటికి ఆర్గనైజరుగా వున్న కామ్రేడ్ ఈడ్పుగంటి పూర్ణచంద్రరావు వస్తుండేవారు. తమ పెంపుడు కొడుకు యీ రాజకీయాల్లో చేరి, వ్యవసాయం చేయక, ఎక్కడ పాడైపోతాడేమోననే బెంగతో ఒకరోజు భోజనం పెట్టకుండా మానివేస్తే ఆయనకు నేనే స్వయంగా భోజనం పెట్టి, మా పెద్దమ్మల వైఖరికి నిరసనగా ఒక పూట భోజనం తినకుండా మాని, వారి వైఖరిలో మార్పు తీసుకువచ్చాను.

ఈ విధంగా చింతలపూడి తాలూకాలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాణాత్మక వైఖరివల్ల పార్టీ 15–20 గ్రామాలలో మాత్రమే వున్నా తాలూకాలో వున్న 100 గ్రామాలలో కమ్యూనిస్టు పార్టీపట్ల ప్రజలకు మంచి స్పందన, సానుభూతి ఏర్పడ్డాయి.

20 సం.రాల వయసులో కమ్యూనిస్టు పార్టీలో చేరిన నేను తాలూకా కమ్యూనిస్టు పార్టీ కార్యదర్శిగానూ, జిల్లా కమ్యూనిస్టు పార్టీ కార్యవర్గ సభ్యుడిగానూ, రాష్ట్ర కమ్యూనిస్టు సమితి సభ్యుడుగానూ, అలాగే రైతు సంఘంలో కూడా తాలూకా, జిల్లా, రాష్ట్ర స్థాయి కమిటీలలో సభ్యుడిగానూ వుండి, క్రియాశీల కార్యకర్తగా పని చేస్తూ ఎన్ని కష్టాలెదురైనా, పార్టీ ఎన్ని ఆటు పోట్లకు గురైనా, ఎత్తు పల్లాలలో ప్రయాణించవలసి వచ్చినా అచంచల విశ్వాసంతో 74 సం.రాల వయసు వచ్చేవరకు మాత్రమే కాకుండా, అంతిమ శ్వాస వరకు పార్టీ పతాకచ్ఛాయల్లో అమరవీరుల ఆశయ సాధన కొరకు కృషి చేయదలచుకున్నాను. యీ వయస్సులో గతంలో లాగా పని చేయలేకపోతున్నందున 3 సం.రాల క్రిందటి నుంచే 4 ఎకరాలలోని జీడిమామిడి తోటలోని పంటను దాదాపు 10 వేల రూ.ల విలువ కలిగిన దానిని ప్రతి సంవత్సరం పని చేసే కామ్రేడ్స్‌కు అలవెన్సు రూపంగా సహాయ మందిస్తున్నాను.

## యువతరం కామ్రేడ్స్‌కు నా విజ్ఞప్తి

గతించిన కాలంలో కమ్యూనిస్టు ఉద్యమం అనేక ఆటుపోట్లకు గురై గుణపాఠాలు నేర్చుకొని, ప్రపంచ వ్యాపితంగానూ, దేశ వ్యాపితంగానూ మంచి మార్పులతో పురోగమిస్తూంది. కమ్యూనిస్టు పార్టీలన్నీ ఏకంకావాలని ప్రగతి శీలురు ముక్తకంఠంతో కోరుతున్నా, యింకా సమయమాసన్నం కాలేదని కొందరు కాలయాపన చేస్తున్నా, కలసి పని చేయటానికి ముందుకు వస్తున్నందుకైనా, సంతోషిద్దాం. అదువల్ల కామ్రేడ్స్ నిరాశా, నిస్పృహలకు లోనుకాకుండా, నీటిలో చేపలాగా, నిత్యం ప్రజలతో వుండి, ప్రస్తుత పరిస్థితుల కనుగుణంగా కార్యక్రమాలను రూపొందించుకొని, ప్రజల సమస్యలపైనా ప్రభుత్వం అమలు జరుపబూనుకున్న కోట్లాది రూపాయల అమలు పథకాలు, దళారీల వశంకాకుండా, లంచగొండుల పాలుకాకుండా, శ్రద్ధ తీసుకొని, ప్రజలకు చేరేలా చేయటంలోనూ, ప్రజల్లో చైతన్యం కల్పించటంలోనూ, ఇతరులు కల్పించే భ్రమలను తొలగించుటలోనూ, నేర్పుతోనూ, ఓర్పుతోనూ, ప్రజాశ్రేణుల్లోకి వెళితే, మనతో ప్రజలు, ప్రజలతో మనం వుంటాం. వారిని చైతన్యవంతులను చేయటం మాత్రమే గాకుండా వారి నుండి వాస్తవాలేమిటో మనం అర్థం చేసుకోవటానికి చక్కని అవకాశాలు ఏర్పడతాయి.

వామపక్ష ఉద్యమం అనైక్యత వల్ల దేశంలో ఒక బూర్జువా పార్టీపట్ల ప్రజలకు విముఖ కలిగితే మరో బూర్జువా పార్టీ తప్ప, వామపక్ష ప్రజాస్వామ్య లౌకిక ప్రత్యమ్నాయం లేని కారణంగా ప్రజలు ఘోరంగా మోసగించబడుతూ, అనేక రకాల దోపిడీకి గురౌతున్నారు.

దేశం నేడెదుర్కొంటున్న అనేక రుగ్మతలను తొలగించి అభివృద్ధి పథంలో నడిపించి, అట్టడుగు వర్గాల అభ్యున్నతి కోసం సకల వామపక్ష – ప్రజాతంత్ర లౌకిక వాదులను ఐక్యం చేయుటకు నేటి కమ్యూనిస్టులు, ముఖ్యంగా యువ కమ్యూనిస్టులు కర్తవ్యంగా భావించి పని చేయాలని ఆశిస్తూ, కోరుతూ ముగిస్తున్నాను.

★ ★ ★

# కీ.శే. మోటూరు పరంధామయ్య



మా గ్రామం గుంటూరు జిల్లా వెల్లటూరు. పాఠశాలలో 8 వ తరగతి చదువుకొంటున్నాను. జాతీయోద్యమ జెండాలతో ప్రచారదళం మా వూరికి వచ్చింది. పాటలు పాడుకొంటూ నినాదాలిస్తున్నారు. అల్లూరి సీతారామరాజు మీద పాట పాడుతున్నారు. అది చూసి దళంతోపాటు ఆరోజు తిరిగాను. ఆ దళం ప్రక్క గ్రామాలకు వెళ్ళిపోయింది.

విదేశీ వస్తు బహిష్కరణోద్యమానికి చీరాలలో సత్యాగ్రహ శిబిరం ప్రారంభించినట్లు బజారులో చెప్పుకొంటున్నారు. అది విని చీరాలకు పోవాలనిపించింది. మా యింట్లో ఎవ్వరికీ ఏమీ చెప్పకుండా ఎవరికీ తెలియకుండా చీరాలకు పోయాను. సత్యాగ్రహ శిబిరానికి చేరాను. శిబిర నాయకులను కలుసుకొన్నాను.

## విదేశీ వస్త్ర దహనం:

బజారులో సత్యాగ్రహం పికెటింగు నడుపుతున్న దళంలో కలిశాను. బట్టలషాపుల వద్ద విదేశీ వస్త్రాలు కొనడానికి వస్తున్న జనాన్ని అడ్డగించి - విదేశీ గుడ్డలు కొనవద్దని, ఖద్దరు ధరించమని వారిని ప్రార్థిస్తున్నాను. కాదని తోసుకొని వస్తున్నవారిని అమాంతంగా వారి రెండు కాళ్ళను పట్టుకొని పెనవేసుకొన్నాను. వారు కదలలేకపోయారు. నన్ను బలవంతంగా నెట్టివేయడానికి గుంజారు కాని, నేను పట్టు విడవలేదు. అంతటితో ఆ వచ్చిన ఆయన గుడ్డలు కొనకుండా షాపువదలి తిరిగిపోయారు.

ఈ దృశ్యాన్ని చూసిన శిబిర నాయకులు ఒకరు, శిబిరం వద్ద నన్ను దగ్గరకు తీసుకొని ముద్దుపెట్టుకొన్నారు. అది నన్ను ఉత్తేజపర్చింది.

మా వూళ్ళో నాకోసం మా తల్లిదండ్రులు ఆదుర్దాగా అంతటా వెదికారు. తుదకు ఎలాగో జాడ తెలుసుకొని మా నాయన చీరాలకు వచ్చాడు. సత్యాగ్రహ శిబిర నాయకులను కలుసుకొని, నన్ను తన వెంట పంపించివేయమని బతిమాలుతూ చెప్పుకొన్నాడు.

తుదకు మా తండ్రి విజ్ఞప్తిని శిబిర నాయకులు అంగీకరించి, నన్ను మా నాయన వెంట పొమ్మన్నారు. గత్యంతరంలేక మా నాయన వెంట తిరిగి ఇంటికి వచ్చాను.

## బర్మాలో కమ్యూనిస్టు నయ్యాను:

తర్వాత రేపల్లె హైస్కూలులో చేరి 1933లో ఎస్.ఎస్.ఎల్.సి. పాస్ అయ్యాను. అనంతరం మచిలీపట్నంలో ట్రైనింగ్ కాలేజీలో చేరాను. కొన్నాళ్ళకు సముద్రప్రయాణం ఆకర్షణలో 1935లో రంగూన్ (బర్మా)కు వెళ్ళాను. అక్కడ మొదట ఒక ప్రైవేట్ పాఠశాలలో టీచరుగా పనిచేశాను. క్రమేపి పరిచయాలు పెరిగాయి. కార్మికులతో కూడా సంబంధాలు కలిగాయి. అక్కడ తెలుగు యువజన సంఘం వారు 'ఐరావతి' అనే తెలుగు వార పత్రిక నడుపుతున్నారు. ఆ పత్రికలో సహాయ సంపాదకునిగా నన్ను చేర్చుకొన్నారు. పత్రికలో పనిచేస్తుండగా కార్మిక సంబంధాలు మరింత ముమ్మరంగా పెరిగాయి. కమ్యూనిస్టు కరపత్రాలు కూడా అందుకొన్నాను.

స్పెయిన్‌లో తిరుగుబాటు-అధికారం ప్రజల చేతుల్లోకి రావడం వగైరా స్పానిష్ విప్లవ పోరాట గాధలు పత్రికల్లో చదివాను. మాడ్రిడ్ రాజధానిమీద సామ్రాజ్యవాదులు దాడులు చేసి, విప్లవ ప్రభుత్వమును పడగొట్టి, తిరిగి జనరల్ ఫ్రాంకోను నిలబెట్టారు. ఈ ఘటనలను ఖండిస్తూ జవహర్‌లాల్ నెహ్రూ చేసిన ప్రకటనలను కూడా చదివాను.

ఫ్యాక్టరీలు, మిల్లులలో తెలుగు కార్మికులు కూడా గణనీయంగానే వున్నారు. వీళ్ళు కాంట్రాక్టర్ల ద్వారా మిల్లులలో పనిచేస్తూ వుంటారు. వారికి వేతనాలు ప్రతివారం ఒకరోజు కంట్రాక్టర్ల ద్వారా బట్వాడా చేస్తారు. ఒక ఫ్యాక్టరీలో పనిచేయిస్తున్న ఒక కాంట్రాక్టర్ ఆ కూలీలను బట్వాడా కోసం ఫలానాచోటుకు వచ్చి కూర్చోమని చెప్పాడు. కార్మికులంతా అలాగే అదే సమయానికి వచ్చి కూర్చున్నారు. టైము గడచిపోతోంది. పొద్దుగూకింది. ఎదురు చూశారు కాని, కాంట్రాక్టరు అంతులేడు.

మర్నాడు కార్మికులు నన్ను కలుసుకొని ఈ విషయం చెప్పారు. ఫ్యాక్టరీ వారినుండి మొత్తం డబ్బు కాంట్రాక్టరు వసూలు చేసుకొని, అదేరోజు ఉదయమే పోయిన ఓడలో ఎక్కి ఆంధ్రకు వెళ్ళిపోయాడు. అందుమీదట కార్మికులు పడిన ఇబ్బందులు అనేకం.

## "ఐరావతి" పత్రిక సంపాదకత్వం:

ఈ సమస్యపై కాంట్రాక్టరు మోసాన్ని వివరిస్తూ పత్రికలో ప్రకటించాను. ఆ సమయంలో పత్రిక సంపాదకుడు వేరే పనిమీద వెళ్ళినందున యాజమాన్యం సంబంధీకులు ఆఫీసులో లేరు. పత్రికలో వచ్చిన ప్రకటనను చూచి కాంట్రాక్టర్లు మండిపడ్డారు. తర్వాత 'ఐరావతి' పత్రిక సంపాదకుడు ఓడరేవు సమీపంలోకి వేరే పనిమీద వెళ్ళగా కాంట్రాక్టర్లు ముట్టడించారు. ఆయనకు పత్రికలో ప్రకటనను చూపించి, 'ఇందుకేనా నీకు చందా రూపంలో డబ్బు ఇచ్చింది?' అంటూ ఎడిటర్‌ను నిలదీసి కాంట్రాక్టర్లు నిందించారు.

ఎడిటర్ పత్రికా కార్యాలయానికి వచ్చాడు. కాంట్రాక్టర్ల సమస్య మీద నాతో గొడవపెట్టాడు. వాదోపవాదాలు ఘర్షణరూపంలో జరిగాయి. ఈ గొడవలు వారం రోజులు పైగానే జరిగాయి. పత్రిక కర్తవ్యాన్ని సరిగానే నిర్వహించానని, అలాగే వ్రాసి ప్రకటిస్తానని నేను ఎదురు తిరిగాను. అలా అయితే నా అవసరం తమకు లేదని, నన్ను రాజీనామా చెయ్యమన్నారు. దానిపై కమ్యూనిస్టుగా నా కర్తవ్యాన్ని వివరించాను. రాజీనామా చేసి కమ్యూనిస్టుగా బైటకు వచ్చాను. ఆనాడే ఆ జీవితాన్ని కమ్యూనిస్టు ఆశయానికి అంకితం చేశాను. ఓడ ఎక్కి తిరిగి ఆంధ్రకు వచ్చాను (1937).

తూర్పుగోదావరి జిల్లాలో రాజమండ్రి కేంద్రంగా కొంతకాలం కొరపాటి పట్టాభిరామయ్యతో కలిసి పనిచేశాను. కంభంపాటి సీనియర్, మద్దూరి అన్నపూర్ణయ్య, ప్రసాదరావు తదితర కామ్రేడ్స్‌తో పరిచయాలు ఏర్పడ్డాయి. కమ్యూనిస్టు పార్టీపై నిషేధం వున్నందున కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ (సి.ఎస్.పి) పేరుతో పనిచేశాం. 1938లో పాలకొల్లు మహాసభలో ఆంధ్రా కమ్యూనిస్టు బృందంలో కలిశాను. రాజమండ్రిలో వుండగా మద్రాసునుండి వెలువడే 'జనవాణి' పత్రికలోను, వాహినీ పత్రికలోను వ్యాసాలు వ్రాశాను.

## మునగాల జమీందారీ వ్యతిరేక పోరాటంలో:

తర్వాత మునగాల, లింగగిరి పరగణాల జమీందారీ వ్యతిరేక పోరాటాలు సాగించాం. 1939 నుండి యుద్ధకాలం. నన్ను మునగాలలో అరెస్టు చేసి ఏడాదిపాటు రాజమండ్రి జైలుకు పంపారు. నాతోపాటు నండూరి ప్రసాదరావు, జోస్యభట్ల సత్యనారాయణగార్లను కూడా పెట్టారు. 1942లో కమ్యూనిస్టు పార్టీపై నిషేధం ఎత్తివేయబడింది. గుంటూరు జిల్లాలో పనిచేస్తుండగా 1942లో అరెస్టు చేసి ఆరునెలలపాటు బళ్ళారి క్యాంపు జైలులో నన్ను పెట్టారు. విడుదల తర్వాత గుంటూరు జిల్లాలోని చీరాల కార్మికులలో – ఒంగోలు ప్రాంతాలలో పనిచేస్తూ

వచ్చాను. 1947, 48 రోజులలో కమ్యూనిస్టుపార్టీ పత్రిక (ప్రజాశక్తి)లో పనిచేశాను.

1948 జనవరి 30న గాంధీజీని ఘాడ్సే కాల్చి చంపాడు. దానిపై ఎంతగానో ఆందోళన జరిగింది. అదే పరిస్థితులలో ఆనాటి రాష్ట్ర ప్రభుత్వం కమ్యూనిస్టు ఉద్యమంపై కూడా నిర్బంధాస్త్రాన్ని ప్రయోగించింది. కమ్యూనిస్టు పత్రిక కార్యాలయం మీద దాడి చేసింది. ఆ దాడినుండి తప్పించుకొనిపోయి రహస్య జీవితంలో చేరాను.

## తెలంగాణా సాయుధ పోరాటంలో:

అదే రోజుల్లో తెలంగాణా సాయుధ పోరాటం ప్రారంభమైంది. వెంటనే నల్లగొండ జిల్లా పోరాట ప్రాంతం చేరుకొని సాయుధ పోరాటంలో కలిసిపోయాను. తెలంగాణా సాయుధ పోరాటం అమూల్యమైన గుణపాఠాలెన్నిటినో మనందరికీ నేర్పింది. 1954 మే 22 నుండి 29 వరకు జరిగిన నల్లగొండ జిల్లా పానగల్లు పార్టీ మహాసభ సమీక్ష చూడగోర్తాను.

ఎన్ని అవాంతరాలు ఎదురైనా – ఎన్ని ఎదురు దెబ్బలు తగిలినప్పటికీ నా కమ్యూనిస్టు జీవితంలో వెనుకడుగు ఎరగను. అంతిమ విజయం కమ్యూనిజందేననే ఆత్మ విశ్వాసంతో ముందుకు – ముమ్ముందుకే ఉరికాను.

## కమ్యూనిస్టు ఉద్యమం వెన్నువిరిచిన చీలిక:

కాని, 1962–63లో కుతంత్రాలతో చెలరేగిన చీలికవాదం కమ్యూనిస్టు ఉద్యమం వెన్నుముకనే విరిచింది. దాని ప్రత్యక్ష ఫలితమే సోవియట్ విచ్ఛిన్నం కూడా. కమ్యూనిస్టు పార్టీని 101 గ్రూపులుగా చీల్చి పారేసి కమ్యూనిస్టు ఉద్యమాన్ని నట్టేట ముంచారు. కమ్యూనిస్టు ఉద్యమాన్ని కసితీరా చీల్చింది లీడర్లేగాని క్యాడర్లుకాదు. కమ్యూనిస్టుపార్టీని ముక్కలు చేశారు. మూడు దశాబ్దాలు దాటినప్పటికీ చీలిక వ్యాధి కుదరలేదు. కమ్యూనిస్టు ఐక్యత అనేదాన్ని ధ్వంసం చేశారు. కమ్యూనిస్టులు ఏకం కాకపోతే కమ్యూనిస్టు ఉద్యమానికి భవిష్యత్ ఏమిటని పీడితవర్గం ప్రశ్నిస్తోంది.

నేటికైనా కమ్యూనిస్టు గ్రూపులన్నీ ఏకమై, కమ్యూనిస్టు పార్టీని, కమ్యూనిస్టు ఉద్యమాన్ని ఏకైక కమ్యూనిస్టు పార్టీగా, ఏకైక కమ్యూనిస్టు ఉద్యమంగా పునర్నిర్మించి కమ్యూనిస్టు ఆశయానికి తమతమ జీవితాలను పునరంకితం గావించాలని అన్ని గ్రూపుల కమ్యూనిస్టులందరికీ మరోసారి విజ్ఞప్తి చేస్తున్నాను.

## కమ్యూనిస్టు ఉద్యమ ఐక్యత చూసి కన్ను మూయాలని...

నవతరం యువతీ యువకుల్లారా! ముందడుగు వేయండి. మార్క్సిస్టు లెనినిస్టు మార్గదర్శకత్వ బాటలో, ఏకైక కమ్యూనిస్టు ఉద్యమ పంథాలో, మనిషిని మనిషే దోచుకొనే ఈ వ్యవస్థను రూపుమాపి, మనిషిని మనిషి ఆదుకొనే సోషలిస్టు వ్యవస్థను, కమ్యూనిస్టు వ్యవస్థను నిర్మించే బాటలో పయనించాలని మీకు విజ్ఞప్తి చేస్తున్నాను. వస్తుంది ఒక రోజు – ఆ రోజు, వస్తుంది. వస్తుంది తప్పక, ఆ రోజు వస్తుంది. దోపిడీ వ్యవస్థను రూపుమాపి, కమ్యూనిస్టు వ్యవస్థను నిర్మించే ఆ రోజు అనివార్యంగా వస్తుంది.

కమ్యూనిస్టులారా! ఏకంకండి. మీకు పోయేది ఏమీలేదు, జంతుప్రేరణ విచ్ఛిన్నం తప్ప.

కమ్యూనిస్టు వాసనున్న కామ్రేడ్స్ అందరూ
కలదిరిగి నలుదెసల కలిసి దెబ్బెయ్యాలి
తోడి ప్రయాణీకులను తోడుగా చేసుకొని
విడి–విడిగా నడవాలి కలిసి దెబ్బెయ్యాలి!

నా వయస్సు (1914–96) 80 దాటింది. కమ్యూనిస్టు పార్టీ, కమ్యూనిస్టు ఉద్యమం చీలికలు గావించబడి మూడు దశాబ్దాలు గడిచిపోయింది. కనీసం మన దేశంలోని మనరాష్ట్రంలోని కమ్యూనిస్టు గ్రూపులన్నీ – పీపుల్స్‌వార్ గ్రూపుతో సహా – అందరూ, అన్ని కమ్యూనిస్టు గ్రూపులూ – మొత్తం కమ్యూనిస్టులు అందరూ, ఏకమై కమ్యూనిస్టు ఐక్యతను పునరుజ్జీవింపచేశారనే వార్త వినేవరకైనా జీవించాలనే వాంఛతో వున్నాను.

(కాని, 1996 మే 12 వ తేదీన నాగార్జున సాగర్‌లో శ్రీ పరంధామయ్య కన్నుమూశారు – సం.)

★ ★ ★

# కీ.శే. మహ్మద్ రజబలీ



పాత ఖమ్మం తాలూకా ప్రస్తుత ఖమ్మం అర్బన్ మండలంలోని పాపటపల్లి గ్రామంలో 1920 జనవరి ఒకటవతేదీన వతందారీ మధ్యతరగతి రైతుకుటుంబంలో జన్మించాను. నా తల్లిదండ్రులు శ్రీమతి అమీనా, శ్రీ మహబూబ్ అలీ.

ప్రాథమిక విద్యను స్వగ్రామంలో అభ్యసించాను. తర్వాత 9 వ తరగతి వరకు ఖమ్మం, మహబూబాబాద్, వరంగల్‌లలో చదివాను. అంతటితో చదువు చాలించి, ప్రభుత్వ ఉపాధ్యాయునిగా ఊట్కూరు గ్రామంలో ఒక సంవత్సరంపాటు పని చేశాను. తర్వాత ఆ వృత్తిని వదిలి హైదరాబాద్‌లోని ప్రభుత్వ ప్రెస్‌లో తెలుగు, ఉర్దూ అనువాదకునిగా సంవత్సరం పని చేశాను. ఆ తర్వాత కొంతకాలానికి స్వగ్రామం చేరుకుని, గ్రామ కరణంగా వృత్తిని ప్రారంభించాను. ఏ ఉద్యోగంలోను స్థిరపడలేకపోయాను. గ్రామకరణంగా వుంటుండగానే జీవితం ఒక మలుపు తిరిగింది. కరణం పనిచేస్తూనే ఆంధ్ర మహాసభ కార్యక్రమాలకు తోడ్పాటునందిస్తూ వుండేవాడిని. ఆంధ్ర మహాసభకు సహకరిస్తున్నాననే నెపంతో ప్రభుత్వం నన్ను మూడున్నర సంవత్సరాలపాటు 'డిటెన్యూ'గా నిర్బంధించింది. పటేల్, పట్వారీల దస్త్రాలను

ఆంధ్రమహాసభ ఆధ్వర్యంలో కాల్చివేస్తున్న తరుణంలో నాడు పట్వారీగా పనిచేస్తున్న ఖమ్మం తాలూకాలోని గోకినేపల్లి గ్రామానికి చెందిన శ్రీ మచ్చా వీరయ్య ఆంధ్ర మహాసభలో చేరారు. నా రాజకీయ జీవిత స్ఫూర్తికి నిజాం నిరంకుశ విధానాలను ఎదిరించి పోరాడిన శ్రీ మచ్చా వీరయ్య కారకులు. ఆయన బాటలోనే నేను ఆంధ్రమహాసభలో చేరాను. ఖమ్మం తాలూకా అధ్యక్షులుగా శ్రీ పర్సా శ్రీనివాసరావు పనిచేస్తున్న కాలమైన 1944లో ఖమ్మంలో ఆంధ్రమహాసభ సమావేశం జరిగినపుడు నా 24వ ఏట ఆంధ్రమహాసభలో ప్రవేశించాను. తర్వాత ఆంధ్రమహాసభ నిర్వహించిన అనేక భూమి-భుక్తి పోరాటాల్లో ప్రత్యక్ష నాయకత్వం వహించాను. ఖమ్మం తాలూకా ప్రాంతంలో వేలాది మంది ప్రజలను ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీలవైపు ఆకర్షించేందుకు పాటుపడ్డాను.

### నైజాం వ్యతిరేక పోరాటం - జైలు శిక్షలు:

తెలంగాణా సాయుధ పోరాటం సాగిన సమయంలో భూమి విముక్తి పోరాటంలో పాల్గొని చురుకైన పాత్ర నిర్వహించాను. 1946లో నైజాం సేనలు నన్ను అరెస్టు చేసి మూడు మాసాలు వరంగల్‌లో నిర్బంధించాయి. 1947లో కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం స్వీకరించాను. అదే సంవత్సరం నన్ను అరెస్టు చేసి మూడు సంవత్సరాల మూడు మాసాలు వరంగల్, చంచల్‌గూడ, ముషీరాబాద్ జైళ్ళలో బంధించారు. జైలు గోడల మధ్య నికృష్టంగా గడిపి క్షయవ్యాధి సోకి అనేక ఇబ్బందులకు లోనయ్యాను. తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం అనంతరం యూనియన్ మిలిటరీ నన్ను, నాతోపాటు నా సహచరులైన పాపటపల్లి గ్రామానికి చెందిన రైల్వే ఉద్యోగి కుమారుడైన సోమ్లానాయక్, నల్లగొండ జిల్లా భువనగిరి ప్రాంతానికి చెందిన రాంరెడ్డి అనేవారిని అరెస్టు చేసి మానుకోట కాన్‌సెంట్రేషన్ క్యాంప్‌లో వుంచి, ఆ ఇద్దరిని కాల్చి చంపింది. ఈ సమాచారం తెలిసి నా ప్రాణాలపై ఆశ వదులుకున్నాను. నావద్దకు పోలీసులు వచ్చి “నిన్ను జైలుకు పంపుతున్నా”మని చెప్పిన సంఘటన మరపురానిదే.

1952లో దేశంలో మొదటిసారి జరిగిన సార్వత్రిక ఎన్నికల్లో ఖమ్మం ప్రచార బాధ్యతను భుజాలపై వేసుకుని నిర్వహించాను. మా ప్రచారదళంలో శ్రీయుతులు రావెళ్ళ సత్యం, జోజెడ్ల వెంకటనారాయణ, కొండబోలు వెంకయ్య లాంటివారు వున్నారు.

కమ్యూనిస్టు పార్టీ నిర్వహించిన నందికొండ ప్రాజెక్టు సాధన ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నాను. జిల్లా వ్యాప్తంగా ఉద్యమ వ్యాప్తికోసం గోడరాతలు, విస్తృత ప్రచారం జరిపి, పాదయాత్ర ఉద్యమాలకు నాయకత్వం వహించి, గ్రామ గ్రామాన ప్రజల్ని కదిలించి, వేలాదిమందిని ఉద్యమ భాగస్వాములను గావించడంలో కృషి చేయడం జరిగింది. ప్రాజెక్టు సాధనకు తొలుత ఖమ్మం తాలూకా గోళ్ళపాడులో జరిగిన రైతు సదస్సులో పాల్గొన్నాను. కమ్యూనిస్టు పార్టీ 1955లో జగ్గయ్యపేటలో నిర్వహించిన బ్రహ్మాండమైన ‘రైతుయాత్ర’కు ఖమ్మం జిల్లా నుంచి వేలాదిమందిని సమీకరించడంలో పాత్ర నిర్వహించాను. శ్రీయుతులు తెన్నేటి విశ్వనాథం, వావిలాల

గోపాలకృష్ణయ్య, చలసాని వాసుదేవరావు, కళా వెంకట్రావు తదితర ప్రముఖులు ఈ ప్రాజెక్టు సాధన యాత్రలో పాల్గొన్నారు.

"నందికొండ-పందికొండ" అని కాంగ్రెస్ వారు అవహేళన చేసి దుష్ప్రచారం సాగించినా మొక్కవోని దీక్షతో "ప్రాణాలైనా అర్పిస్తాం-నందికొండను సాధిస్తాం" అని నినదిస్తూ పాటలు పాడుతూ ఊరూరా మహోద్యమానికి నాయకత్వం వహించడం జరిగింది.

## కౌలుదార్ల హక్కుల పోరాటం:

శ్రీ బూర్గుల రామకృష్ణారావు ఆంధ్రరాష్ట్ర తొలిముఖ్యమంత్రిగా వున్నపుడు భూసంస్కరణల చట్టంలో వచ్చిన మార్పు కనుగుణంగా 38-ఇ క్రింద ఖమ్మం తాలూకాలోని సుమారు ఒక లక్షా 80 వేల ఎకరాలు భూమిపై దాదాపు 60 వేల కుటుంబాలకు చెందిన కౌలుదార్లకు యాజమాన్య హక్కులు కల్పించడంలో ప్రధాన పాత్ర నిర్వహించాను.

చైనా దురాక్రమణ సందర్భంగా దేశంలో ఏర్పడిన అత్యవసర పరిస్థితి సమయంలో 1964 సెప్టెంబర్ 31 భారత ప్రభుత్వం మరోసారి అరెస్టు చేసి 18 మాసాలు వరంగల్ జైలులో నిర్బంధించింది.

1964లో కమ్యూనిస్టు ఉద్యమ చీలిక సందర్భంగా నేను సి.పి.ఎం.లోకి వెళ్ళాను. 1967లో ఖమ్మం అసెంబ్లీ నియోజకవర్గం నుంచి శాసనసభ్యునిగా విజయం సాధించాను. 1967, 69లో రాష్ట్రంలో ఏర్పడిన ప్రత్యేక ఆంధ్ర, ప్రత్యేక తెలంగాణా వేర్పాటువాద ఉద్యమాలకు వ్యతిరేకంగా సమైక్య ఆంధ్రావనికోసం విశాలాంధ్రలో ప్రజారాజ్యం కావాలంటూ జరిగిన ఉద్యమాలలో పాల్గొన్నాను.

1971లో నేను నా అనుచర మిత్రులు వందలాది మంది సి.పి.ఎం. అనుసరిస్తున్న విధానాలపై ధ్వజమెత్తి అమ్మపాలెంలో సమావేశం జరిపి, ఖమ్మం తాలూకా కమిటీగా ఏర్పడ్డాం. నన్ను కార్యదర్శిగా ఎన్నుకున్నారు. ఈ కమిటీ ఆధ్వర్యంలో ఖమ్మం పట్టణంలో వేలాదిమందితో బ్రహ్మాండమైన "ఆకలి యాత్ర" నిర్వహించి, ప్రజా సమస్యలపై కలెక్టర్‌కు వినతిపత్రం సమర్పించాం. 1972లో జరిగిన శాసనసభ ఎన్నికల్లో కంకి - కొడవలి గుర్తుపై పోటీ చేసి విజయం సాధించడం జరిగింది. తర్వాత విజయవాడలో కామ్రేడ్ తమ్మిన పోతరాజు నాయకత్వాన విజయవాడ పట్టణ కమిటీ, ఖమ్మం జిల్లాలో నా నాయకత్వాన వున్న "ఖమ్మం తాలూకా కమిటీ" ఒకేసారి మాతృసంస్థ అయిన సి.పి.ఐ.లో విలీనం కావడం జరిగింది.

1970, 1980వ దశకాలలో ఖమ్మం తాలూకాలో వేలాది ఎకరాల ప్రభుత్వ బంజరు భూములకై కమ్యూనిస్టు పార్టీ ఆధ్వర్యంలో జరిపిన పేద ప్రజల పోరాటానికి నాయకత్వం వహించి వందలాది కుటుంబాలకు ఆ భూములు దక్కేలా కృషి చేయడం జరిగింది.

1978లో ఒకసారి ఖమ్మం నియోజకవర్గం నుంచి పోటీ చేసి ఓటమి చవిచూశాను. 1983, 1985, 1989, 1994లలో జరిగిన అసెంబ్లీ ఎన్నికల్లో సుజాత నగర్ నియోజకవర్గం నుంచి పోటీ చేసి వరుసగా ఎన్నికై, 11 మండలాలతో ఖమ్మం

నుంచి కొత్తగూడెం వరకు విస్తరించిన నియోజకవర్గ అభివృద్ధికి, ప్రజా సమస్యల పరిష్కారానికి శాయశక్తులా కృషి సల్పాను. జిల్లా పార్టీ నిర్వహించిన అనేక పోరాటాలకు నాయకత్వం వహించాను.

కమ్యూనిస్టు పార్టీ జిల్లా కార్యదర్శివర్గ సభ్యునిగా, రాష్ట్ర సమితి సభ్యునిగా, రాష్ట్ర వ్యవసాయ కార్మిక సంఘ ఉపాధ్యక్షునిగా, జిల్లా సంఘ అధ్యక్షులుగా, శాసనసభా సి.పి.ఐ. పక్ష నాయకునిగా, ఉపనాయకునిగా, విప్‌గా, రాష్ట్ర సి.పి.ఐ. కంట్రోల్ కమీషన్ ఛైర్మన్‌గా బాధ్యతలను నిర్వర్తించాను. అట్టడుగున పడివుండి నిరక్షరాస్యులుగా అనాగరికంగా మ్రగ్గిన గిరిజన లంబాడి ప్రజల మధ్య మెలిగి, వారి జీవన పరిస్థితుల మెరుగుకోసం ఎనలేని కృషి చేశాను. వారి హృదయాలలో నాకు స్థానం కల్పించి "లంబాడి నాయకుడి"గా నన్ను ఆప్యాయతతో పిలుచుకుని అక్కున చేర్చుకోవడం నా రాజకీయ ప్రస్థానంలో ఒక మధురానుభూతిగా భావిస్తాను. ఖమ్మం జిల్లాలో వ్యవసాయ కార్మికుల, గిరిజనుల అభ్యున్నతికోసం నాలుగు దశాబ్దాలుగా చేస్తున్న సేవలకు గుర్తింపుగా అఖిల భారత ఉర్దూ సొసైటీ, ఆంధ్రప్రదేశ్ ఉర్దూ అకాడమీ ఆంధ్రప్రదేశ్ ఎలక్ట్రానిక్స్ సంస్థ సంయుక్తంగా 1992 జులై 19న హైదరాబాద్‌లో జరిగిన ఒక కార్యక్రమంలో కేంద్ర పార్లమెంట్ వ్యవహారాల శాఖమంత్రి శ్రీ గులాంనబీ అజాద్ చేత గౌరవ పురస్కారం అందజేసి సత్కరించారు.

భారత కమ్యూనిస్టు పార్టీ 70వ వార్షికోత్సవాల సందర్భంగా 1995లో, పార్టీ పుట్టిన రోజైన డిశంబర్ 26న హైదరాబాద్‌లో రాష్ట్ర పార్టీ ఆధ్వర్యంలో, 1996 జనవరి 1న ఖమ్మంలో జిల్లా పార్టీ ఆధ్వర్యంలో సత్కరించడం జరిగింది.

★ ★ ★

# శ్రీమతి కంభంపాటి మాణిక్యాంబ



నేను 1913లో జన్మించాను. మాది తూర్పుగోదావరి జిల్లా అమలాపురం తాలూకా తొండవరం. మేము నల్గురం తోబుట్టువులం. ఒకామె చనిపోయింది. మేము ముగ్గురం మిగిలాం. నేను మా గ్రామంలోనే నాల్గవ తరగతి వరకు చదువుకున్నాను.

మా జిల్లాకే చెందిన తొండవరం గ్రామస్తులు కంభంపాటి సత్యనారాయణ (సీనియర్)గారితో 1926 మేలో నా వివాహం జరిగింది. అప్పటికి నా వయస్సు 13 సంవత్సరాలు. సీనియర్‌గారి వయస్సు 18 సంవత్సరాలు. కాకినాడలో ఇంటర్మీడియట్ చదువుతున్నారు. ఆ రోజుల్లో సంపన్న బ్రాహ్మణ కుటుంబాలలో 5 రోజుల వివాహాలు జరిగేవి. మా వివాహం అలాగే జరిగింది. మా కుటుంబానికి 30 ఎకరాల భూమి ఉండేది. సీనియర్‌గారి కుటుంబానికి 10 ఎకరాల ఆస్తి ఉండేది. ఆయన తండ్రి సోమనాథంగారు తుని ఎస్టేట్‌లో దివానుగా ఉండేవారు.

సీనియర్‌గారు కాకినాడలో బి.ఏ. చదివి, మద్రాసు లయోలా కాలేజీలో ఎం.ఏ. చదవడానికి వెళ్ళారు. అది 1930 ఉప్పు సత్యాగ్రహం జరుగుతున్న రోజులు. ఎం.ఏ. పరీక్ష వ్రాయకుండానే సత్యాగ్రహంలో పాల్గొనడానికిగాను సీనియర్‌గారు నిర్ణయించుకుని తండ్రికి ఉత్తరం వ్రాశారు. ఆయన మద్రాసు పరుగెత్తి, పరీక్ష వ్రాస్తానని సీనియర్‌గారి చేత వాగ్దానం చేయించుకుని తుని వెళ్ళిపోయారు. సీనియర్‌గారు పరీక్ష ఎలాగో వ్రాసి, అదే కాలేజీలో అప్పుడు ఇంటర్ చదువుతున్న పుచ్చలపల్లి సుందరయ్యగారితో కలిసి పశ్చిమగోదావరి జిల్లా ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనడానికి వెళ్ళిపోయారు. ఈ విషయం తెలిసి తండ్రిగారు నర్సాపురం తాలూకా తూర్పుతాళ్ళు సత్యాగ్రహ శిబిరంలో ఉన్న సీనియర్‌గారి వద్దకు వెళ్ళి "మీ తల్లి నీకోసం ఏడుస్తున్న"దని చెప్పి ఎలాగో తుని తీసుకువెళ్ళారు. అయితే సీనియర్‌గారు రాత్రికి రాత్రే చెప్పకుండా తిరిగి నర్సాపురం వెళ్ళిపోయారు. ఈ సమయంలో "రణదుందుభి", "వీరభారతి" అనే రహస్య పత్రికలను నడిపారు. అప్పుడే తొలిసారి అరెస్టయి జైలులో ఉన్నారు.

వివాహం అయిన దగ్గరనుండి నన్ను రాజకీయంగా అభివృద్ధి చేయడానికి గ్రంథపఠన అలవాటు చేశారు. గృహలక్ష్మి, అబలాసచ్చరిత్రమాల (బండారు అచ్చమాంబగారు–కొమర్రాజు లక్ష్మణరావుగారి సోదరి రచించిన గ్రంథం) మున్నగు పుస్తకాలు యిచ్చి చదివించారు. ఉత్తరాల ద్వారా స్వాతంత్ర్య పోరాటం గురించి వ్రాసేవారు.

1931లో గాంధీ ఇర్విన్ ఒడంబడిక తరువాత సీనియర్‌గారు జైలునుండి విడుదలై కరాచీ కాంగ్రెస్ మహాసభకు వెళ్ళారు. తిరిగి వచ్చి నన్ను తీసుకుని వెళ్ళి పాలకొల్లులో కాపురం పెట్టారు. మేము ఖద్దరు ప్రచారం చేస్తుండేవారం.

## అమీర్ హైదర్‌ఖాన్ రాజకీయ శిక్షణ:

ఆ సమయంలోనే దక్షిణ భారతదేశంలో కమ్యూనిస్టు ఉద్యమాన్ని నిర్మించడానికి మీరట్ కుట్రకేసు నిందితులలో ఒకరు అయిన అమీర్ హైదర్‌ఖాన్ అరెస్టు తప్పించుకుని రహస్యంగా మద్రాసు వచ్చారు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్న కాంగ్రెస్ యువకులతో సంబంధాలు పెట్టుకుంటూ, సీనియర్ గారి గురించి సుందరయ్య గురించి వాకబు చేసి కబురంపారు. సీనియర్‌గారు మద్రాసు వెళ్ళారు. కాంగ్రెస్ వాలంటీరు తల్లాప్రగడ ప్రసాదరావు నన్ను పాలకొల్లు నుండి బెజవాడ తీసుకుని వచ్చి మద్రాసు రైలు ఎక్కించారు. నాకు అదే మొదటిసారి మద్రాసు ప్రయాణం. సీనియర్‌గారు స్టేషన్‌కు వచ్చి నన్ను తీసుకువెళ్ళారు. మేము చింతాద్రిపేటలో ఒక ట్రామ్‌వే వర్కరు యింట్లో కాపురం పెట్టాం. మొదటి రోజు హోటల్ నుండి భోజనం తెప్పించారు. రెండవరోజు నుంచి వంట పాత్రలు కొనుక్కొని వంట చేసుకునేవారం. అప్పుడప్పుడు హైదర్‌ఖాన్ వస్తుండేవారు. బ్రాహ్మణేతరులైన ట్రామ్‌వే వర్కరు యింట్లో చేపలు, మాంసం వండుకొనేవాళ్ళు. సనాతన బ్రాహ్మణ కుటుంబం ఆహారపు అలవాట్లనుండి వచ్చిన నేను ఆ మసాలా కూరల ఘాటువాసన భరించలేకపోయేదాన్ని. హైదర్‌ఖాన్ రష్యాలో జరిగిన విప్లవం గురించి చెప్పేవారు. స్వాతంత్ర్య పోరాటంలో ఎన్నో కష్టాలు పడాలని చెప్పేవారు. మన దేశంలోని వివిధ కులాల ఆహారపు అలవాట్లు గురించి

చెప్పి, సర్దుకుపోవాలని నచ్చచెప్పేవారు. తాను బ్రహ్మచారి అయినా మాకు ఎన్నో గృహ సందర్భాలు చెప్పేవారు. సుందరయ్యగారు కూడా అక్కడకు వచ్చేవారు. మాతో కలిసి వచ్చేవారు అన్నం - నిరాడంబర భోజనం చేసేవారు. హైదర్‌ఖాన్ నాకు చెప్పే విషయాలన్నీ సీనియర్‌గారు తెలుగులో అనువదించి చెప్పేవారు. ఆయన అరవవాళ్ళవలెనే గూడ కట్టు కట్టుకుని, బ్రాహ్మణుని వలే యజ్ఞోపవీతం వేసుకుని ఉండేవారు. రాజావడివేలు, ఎ.ఎస్.కె. అయ్యంగారు, వి.కె. నరసింహం మొదలైన వారికి హైదర్‌ఖాన్ క్లాసులు తీసుకునేవారు.

కొన్నాళ్ళ తరువాత మేము తాంబరంలో వి.కె. నరసింహం యింటికి మారాము. (వి.కె. నరసింహం ఓ.ఎ. ఆనర్స్ చదువుతుండేవారు. అటుపిమ్మట అరెస్టు అయి జైలు నుంచి వారి బంధువులచే విడిపించబడి హిందూ పత్రికలో చాలా సంవత్సరాలు పనిచేశారు.)

ఆ తరువాత మేము త్యాగరాయనగర్‌లోని హిందీప్రచార సభ డాబాపైన పాకలో కొన్నాళ్ళు వున్నాం.

తరువాత తిరిగి మేము భీమవరం వచ్చాము. సీనియర్ గారితో సత్యాగ్రహ శిబిరంలో ద్రోణరాజు లక్ష్మీబాయమ్మ, ఎల్లాప్రగడ ప్రకాశరాయుడు, తల్లాప్రగడ నారాయణమూర్తి, కాళీపట్నం కొండయ్య, కాళీపట్నం శేషశాయి, ఉద్దరాజు రామం మొదలైనవారు ఉండేవారు. పుచ్చలపల్లి సుందరయ్యగారు కూడా వచ్చి ఈ సత్యాగ్రహ శిబిరంలోనే వలంటీర్లకు డ్రిల్లు అదీ నేర్పేవారు. అక్కడే అరెస్టు అయ్యారు.

## స్వాతంత్ర్య సమరంలో క్రియాశీలపాత్ర:

ఈ సమయంలోనే (1932 జూన్‌లో) భీమవరంలో జిల్లా రాజకీయ మహాసభ జరిగింది. కాంగ్రెస్ సభలు జరుపరాదని బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించింది. నిషేధాజ్ఞలను ధిక్కరించి సభ జరపాలి. ముందుగానే సభ గురించి ప్రభుత్వానికి నోటీసు యివ్వాలి. ఆ విధంగానే జిల్లా కలెక్టర్‌కు నోటీసు యిచ్చారు. పోలీసులు అదనపు బలగాలను సమీకరించి భీమవరం నలువైపులా కాపలాలు పెట్టారు. సత్యాగ్రహులం రెండు రోజులు ముందుగానే అడ్డదారులంట భీమవరం పరిసరాలలో చేరి తెల్లవారేసరికి భీమవరం చేరాము. ఒక్కుమ్మడిగా కొత్తగా కట్టిన డిప్యూటీ కలెక్టర్ ఆఫీసుకు చేరాం. కాళీపట్నం కొండయ్యగారు బ్రిటిష్ యూనియన్ జాక్ జెండా లాగివేసి దానిస్థానంలో కాంగ్రెస్ జెండా ఎగురవేశారు. అంతకుముందే అచ్చువేసుకుని ఉంచిన పసల కృష్ణమూర్తిగారి అధ్యక్షోపన్యాసం కాగితాలు వెదజల్లి, సుమారు 150 మందిమి వూరేగింపుగా బయలుదేరాం. తాలూకా ఆఫీసు వద్ద మమ్మల్ని అరెస్టు చేశారు. అరెస్టయిన వాళ్ళలో నేను, ఉద్దరాజు మాణిక్యాంబ, గుజ్జు నాగరత్నం, తదితరులం ఉన్నాం. ఇంకో దళం అరెస్టు కాకుండా గునుపుడివరకు వెళ్ళి, రథం ఎక్కి జాతీయ జెండా కట్టి శంఖం వూదుతూ కరపత్రాలు వెదజల్లారు. ఇందులో ఇవటూరి శరభరాజు కూడా వున్నారు. చాలామందికి ఏడాది శిక్షవేసి ముందు రాజమండ్రి జైలుకు తరువాత బళ్ళారి జైలుకు పంపారు. మమ్మల్ని (మహిళలను) కొవ్వూరు సబ్ జైలులో 15 రోజులు ఉంచి తరువాత విడుదల చేశారు.

అంతకుముందే ఏలూరులో విదేశీ బట్టల దుకాణాల వద్ద పికెటింగ్ జరిగినపుడు నన్ను అరెస్టు చేసి ఏలూరు సబ్ జైలులో ఉంచారు. విడుదలైన తరువాత జిల్లాలోని జాతీయోద్యమ కేంద్రంలో ఒకటైన ఉంగుటూరు వెళ్ళాను. తల్లాప్రగడ నరసింహంగారు, వారి భార్య విశ్వసుందరమ్మగారు ఉండేవారు. విశ్వసుందరమ్మ కవయిత్రి. డాక్టర్ మల్లవరపు వెంకటకృష్ణారావు (తరువాత కాంగ్రెస్ మంత్రి అయ్యారు), మల్లవరపు విశ్వేశ్వరరావు (ప్రముఖ కవి) సోదరి. వారితో కొన్నాళ్ళు వున్నాను.

సీనియర్‌గారు అప్పుడు రహస్యంగా పనిచేస్తూ కాళీపట్నం కొండయ్య, ఉద్దరాజు రామం మున్నగువారితో కలసి వీరభారతి అనే రహస్య పత్రికను తీసుకుని వస్తుండేవారు. నేను తెనాలి రాజకీయ మహాసభకు అధ్యక్షత వహించాను. నిషేధాజ్ఞలను ధిక్కరించి సభ జరిపినందుకు నన్ను అరెస్టు చేశారు. తెనాలి సబ్ జైలులో ఉంచి మెజిస్ట్రేట్ కోర్టులో విచారించి 6 నెలలు శిక్ష వేసి రాయవెల్లూరు సెంట్రల్ జైలుకు పంపారు. నేను విడుదలై వచ్చేసరికి సీనియర్ గారిని "వీరభారతి" కేసులో పాలకొల్లులో అరెస్టు చేసి ఏలూరులో విచారణ చేస్తున్నారు. విచారణ అనంతరం శిక్షవేసి బళ్ళారి జైలుకు పంపారు. వారు విడుదలై వచ్చే వరకు నేను తునిలో ఉన్నాను. సీనియర్‌గారు విడుదలై వచ్చి తునిలో ఉంటూ, మద్రాసు వెళ్ళి ఎమ్.ఎ. పూర్తిచేశారు. ఆ సమయంలోనే మద్రాసులో యంగ్ వర్కర్స్ లీగ్, లేబర్ ప్రొటెక్షన్ లీగ్ నిర్మాణంలో పాల్గొన్నారు. "ధనప్రభావం" అనే వ్యాసం వ్రాసినందుకు సీనియర్‌గారిని అరెస్టు చేసి ఆరునెలలు శిక్షవేశారు. విడుదలైన తరువాత 1936లో తునినుండి కాకినాడ వచ్చి అక్కడ మకాం పెట్టాం. కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ.లో పనిచేయడం జరిగింది. 1936లో ఎన్నికలు వచ్చాయి. బులుసు సాంబమూర్తిగారు అర్బన్, మల్లిపూడి పల్లం రాజుగారు రూరల్ నియోజకవర్గాల నుండి మద్రాసు శాసనసభకు ఎన్నికయ్యారు. నేను గుమ్మిడిదల దుర్గాబాయమ్మ గారితల్లి కలిసి, మొసలికంటి తిరుమలరావుగారి భార్య, వేముగంట పాపాయమ్మ, వేదాంతం కమలాదేవి మున్నగువారితో ఎన్నికల ప్రచారం గ్రామాలలో చేశాం.

బాలాంత్రపు సత్యనారాయణగారింట్లో మకాం. భోజనం కూడా అక్కడే. రావు జగ్గారావు, బాలాంత్రపు సత్యనారాయణ, పుత్సల సత్యనారాయణ తలో అయిదు రూపాయలు యిస్తే కారియర్ తెప్పించుకొని తినేవాళ్లం.

1937లో కొత్తపట్నం రాజకీయ పాఠశాలకు సీనియర్ గారు అధ్యాపకులుగా నేను విద్యార్థినిగా వెళ్లాం. ఈ రాజకీయ పాఠశాలను మద్రాసు రెడ్డినాయుడు మంత్రివర్గం నిషేధించారు. ముఖ్యులందరిని అరెస్టు చేశారు.

అరెస్టయిన వారిలో నేను కూడా ఉన్నాను. మమ్మల్ని బాపట్ల సబ్ జైలులో పదిరోజులు ఉంచి, మహిళల వరకు విడుదల చేశారు.

1938లో రాజమండ్రిలో ప్రారంభించబడిన రాష్ట్ర కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ వారపత్రిక "నవశక్తి" 1939లో బెజవాడకి మార్చబడింది. సీనియర్‌గారు సంపాదకవర్గంలో చేరారు. మేము ప్రజాశక్తి నగర్‌లో కాపురం పెట్టాము. పార్టీ పత్రికలను గవర్నరుపేటలో అమ్మేవారం. కమ్యూనిస్టు వ్యతిరేకుల వల్ల అనేక అవమానాలు ఎదుర్కొనేవాళ్ళం.

1939 సెప్టెంబరులో రెండవ ప్రపంచ యుద్ధం వచ్చింది. సంపాదకులందరూ సెమిలీగల్‌గా ఉంటూ యుద్ధ వ్యతిరేక ప్రచారం చేసేవారు. సీనియర్‌గారిని తుని సమీపంలోని అల్లిపూడిలో ఇంటర్న్ చేశారు. ఇంటర్న్ చేశారుకనుక ఎలవెన్సుకోసం పిటీషన్ పెట్టాం. ఎలవెన్సు యివ్వకుండా ఎగగొట్టడానికి సీనియర్‌గారిని తునిలో తండ్రియింటివద్ద ఉండమని చెప్పి, తుని బదిలీ చేశారు. తునిలో ఉండగానే సీనియర్‌గారిని డిటెయిన్‌చేసి రాయవెల్లూరు జైలుకు పంపారు.

1939–42 నిర్బంధ కాలంలోను, ఆ తరువాత 1948–52 నిర్బంధ కాలంలోను నేను తుని, రాజమండ్రి, నిడదవోలులలో తలదాచుకుంటూ, కుట్టుమిషన్ నేర్చుకొని జీవించాను.

★ ★ ★

# కీ.శే. చంద్ర సావిత్రీదేవి



నేను కైకలూరు తాలూకా చెవ్వ్వారు గ్రామంలో పుట్టాను. నా తండ్రి శ్రీ యలమంచిలి నాగభూషణంగారు; తల్లి మాణిక్యమ్మ గారు. నేను మా తల్లిదండ్రులకు 6 వ సంతానాన్ని. నా ముందు 5 గురు పుట్టి మరణించారు. వారి తరువాత నేను జన్మించాను. పిల్లలు బ్రతకలేదని మా తల్లిదండ్రులు పూజలు, పునస్కారాలు, సాధు సంతర్పణలు చేసిన అనంతరం నేను బ్రతికాను. నన్ను సాధువులకు దానం ఇచ్చి, మరలా వారి నుండి ప్రతిదానం పొందారు. ఆ సందర్భంగా నాకు సాధుమణి అని నామకరణం చేశారు. మా నాన్నగార్కి ఆ పేరు నచ్చక "సా" అనే అక్షరాన్ని కలిపి, సావిత్రీదేవిగా పేరుపెట్టారు.

నన్ను చిన్నతనం నుండి అతి గారాబంగా, అతి సుకుమారంగా పెంచారు. ఆ రోజుల్లోనే మోడరన్ డ్రస్సులు (మగ, ఆడపిల్లలకు వేసే డ్రస్సులన్నీ) వేసేవారు. అడిగీ అడగగానే ఏది కోరితే అది ఇచ్చి నా కోరిక తీర్చేవారు. నన్ను ఊళ్ళో వున్న

ఎలిమెంట్రీ పాఠశాలలో చదువుకు పంపిస్తే బాగోదని మాస్టారును పిలిచి యింట్లోనే పాఠాలు నేర్పించేవారు.

మా నాన్నగారు చనిపోయిన తరువాత మా అమ్మగారు నన్ను తీసుకొని వెంట్రప్రగడకు తీసుకొని వచ్చారు. నా బాల్యం అక్కడ ప్రారంభమైంది.

నా చిన్నతనంలో గాంధీగారు మా గ్రామం వెంట్రప్రగడకు వచ్చిన సందర్భంగా, గాంధీగారి పిలుపు ననుసరించి గ్రామంలోని పెద్దలు అందరూ నగలు, బంగారం యిస్తుంటే నేను స్పందించి నా చేతిన వున్న రెండు జతల గాజులు, ఉంగరాలు యిచ్చాను. నేను చేసిన ఈ పనికి మా బంధువులు అందరూ అభినందించారు. ఆ విధంగా నాలో దేశభక్తి భావాలు ప్రారంభమైనాయి.

మా మేనమామ శేషయ్యగారు, మద్దుకూరి చంద్రశేఖరరావుగారు గాంధీజీ సహాయ నిరాకరణోద్యమంలో పాల్గొన్నారు. ప్యూనిటివ్ పన్ను వేసేవారు. అది కట్టకపోతే ఇళ్ళ తలుపులు ద్వార బంధాలు పీక్కుపోయేవారు. ఆ విధంగా సహాయ నిరాకరణోద్యమందు ఆకర్షితురాలినై, ఉద్యమం ఎడల ఆసక్తి చూపించాను.

ఆ రోజులలో వయస్సు వచ్చిన ఆడపిల్లల్ని పాఠుగూరు పంపించి చదివించేవారు కాదు. అందువల్ల, ఇంట్లోనే వుండి ప్రైవేటుగా, హిందీ పరీక్ష విశారద చదివాను. ఇంగ్లీషు, హిందీ వ్రాయడం, మాట్లాడటం నేర్చుకున్నాను. సంగీతంలో కూడా హార్మోనియం, వైలన్ వాయిద్యాలు వాయించడం నేర్చుకున్నాను. తరువాత వాటిని ప్రజానాట్యమండలికి ఇచ్చేశాను.

నా తమ్ముడు సూర్యచంద్రప్రసాదరావు చనిపోయినప్పుడు మరణించిన సమయంలో తిథివారాలు నక్షత్రాలు బాగోని కారణంగా ఇల్లు వదిలివేశారు. ఆ ఇంట్లో "స్వతంత్ర భారత్" అనే రహస్య పార్టీ పత్రికను ముద్రించేవారు. ఈ ముద్రణ కార్యక్రమంలో మా మేనమామ శేషయ్యగారు, చంద్రంగారు, ఇతరులు పనిచేసేవారు. వారికి నేను టీలు కాచి అందించేదానిని. వారు చేస్తున్న పనిని చూసి, మనవాళ్ళు దేశం కోసం ఏదో మంచి పని చేస్తున్నారు అనే భావన నాలో బయలుదేరింది.

నా చిన్నప్పుడు నేను చూసిన పురుషాధిక్య సమాజంలో స్త్రీల అస్వతంత్రం, పరాధీనతగా బ్రతకడం చూసి, నేను చదువుకొని స్వతంత్రంగా బ్రతకాలన్న కోరిక నాలో ఉదయించింది. మా బంధువులు, మిత్రులు అయిన గద్దె లింగయ్యగారు వారి ప్రెస్ (ఆదర్శ గ్రంథమండలి)లో 'అమ్మ' నవల ముద్రించారు. ఆ నవల నాకు ఇచ్చి, దీనిని చదవమన్నారు. నేను దానిని తదేక దీక్షగా నిద్రహారాలు మాని రెండు రోజులు చదివాను. అందులో అమ్మ పాత్ర ఫిలోగినిలోనా, లూడ్మిలనటాషాల మాదిరిగా నేను కూడా దేశ సౌభాగ్యం కొరకు పనిచేయాలన్న బలీయమైన కోరిక నాలో ఉద్భవించడానికి ఆ నవల ప్రభావం నామీద ఎంతో వుందని చెప్పవచ్చు.

ముఖ్యంగా చెప్పాలంటే, నన్ను రాజకీయాలలోకి ప్రోత్సహించినది మా మేనమామ శ్రీ శేషయ్యగారు.

1937 ప్రారంభ దశలో శాంతినికేతన్ వెళ్ళి చదువుకోవాలని అనుకున్నాను. ఇంతలో మే లో కొత్తపట్నంలో జరిగిన వేసంగి రాజకీయ పాఠశాలకు మా మేనమామ శేషయ్యగారి ప్రోద్బలంతో వెళ్ళాను. నేను రాజకీయ పాఠశాలకు

వెళుతున్నట్లు ఇంట్లో ఎవ్వరికీ తెలియదు, ఒక్క మా మేనమామగారికి తప్ప. ఇంట్లో స్కూలుకి వెడుతున్నానని చెప్పేదాన్ని. శేషయ్యగారు నన్ను బెజవాడ తీసుకొని వెళ్ళి, సోషలిస్టు పార్టీ నాయకులు శ్రీ అల్లూరి సత్యనారాయణరాజుగారు, ఆయన భార్య అన్నపూర్ణమ్మ, వాసిరెడ్డి శివలింగప్రసాద్, వారి భార్య హనుమాయమ్మ గార్లకు అప్పగించి తిరిగి వెళ్ళిపోయారు. అప్పుడు సర్ కుర్మా వెంకటరెడ్డి నాయుడు ప్రధానమంత్రిగా ప్రభుత్వం వుంది. రాజకీయ పాఠశాలకు శ్రీ అన్నాప్రగడ కామేశ్వరరావుగారు ప్రిన్సిపాల్‌గాను, చండ్ర రాజేశ్వరరావుగారు డ్రిల్లు, షూటింగ్ టీచర్లుగా వ్యవహరించారు. అప్పటికి రాజేశ్వరరావుగారు విశాఖపట్నంలో రెండవ సంవత్సరం మెడికల్ విద్యార్ధిగా వున్నారు. అప్పటికి నాకు 16 సంllలు. ప్రప్రథమంగా నాకు శ్రీ రాజేశ్వరరావుగారితో తొలి పరిచయం ఈ పాఠశాలలోనే జరిగింది. ప్రభుత్వం మా రాజకీయ పాఠశాలను నిషేధించి, 144వ సెక్షన్ విధించింది. దానిని వ్యతిరేకించాలని నిర్ణయించాము. ప్రిన్సిపాల్, ఇతర పెద్దలు, అందరూ కలిసి గొడవలు, లారీఛార్జీలు జరుగుతాయన్న ఉద్దేశ్యంతో ఆడవాళ్ళందర్నీ వెనుకకు పంపివేశారు. నన్ను కూడా వెనక్కు పంపాలని నిర్ణయించారు. నేను వారితో పోట్లాడాను. నాతోపాటు పుచ్చలపల్లి సుందరయ్యగారి చెల్లెలు (కజిన్ సిస్టర్) పుచ్చలపల్లి గోవిందమ్మగారు మరికొందరు వున్నారు. అప్పుడు ఓటింగ్ పెట్టారు. మొదటిసారిగా నేను అనుకూలంగా చెయ్యి ఎత్తి ఓటుచేశాను. నాతోపాటు గోవిందమ్మ మరో ఇద్దరు మహిళలు వున్నారు. ఆ రోజు లాఠీఛార్జి జరుగుతుందని వూహించి అందరం ఖద్దరు చీరలు ధరించాము.

ఆ రోజు రాజేశ్వరరావుగారు నా దగ్గరకు వచ్చి, మీరు ఎందుకు పెళ్ళి చేసుకోలేదని అడిగారు. పెళ్ళి చేసుకుంటే ఆడవాళ్ళకు స్వేచ్ఛ, స్వాతంత్ర్యం వుండవు, మగవాళ్ళకు అణగి మణగి వుండాలనే ఉద్దేశ్యంతో పెళ్ళి చేసుకోలేదని, బాగా చదువుకొని, దేశానికి సేవలు చేయాలన్న ఉద్దేశ్యంతో పెళ్ళి చేసుకోలేదని చెప్పాను. దానికి రాజేశ్వరరావుగారు సమాధానం చెపుతూ, "సోషలిస్టు సమాజంలో ఒకరి స్వేచ్ఛ, మరొకరు అరికట్టేదికాదు. ఎవరి స్వేచ్ఛ వారిది. అలాంటి సమసమాజ స్థాపనకోసం కలసి పనిచేద్దాం. మీకు అభ్యంతరం లేకపోతే వివాహం చేసుకుందాం"మని నన్ను అడిగారు. నాకు కొద్దిపాటి వ్యవధి కావాలని, తరువాత మీ ప్రశ్నకు జవాబు చెబుతానని చెప్పాను. ఆ మరుసటి రోజే స్కూలుపై పోలీసు దాడి చేసి మగవాళ్ళపై బాగా లాఠీఛార్జి చేశారు. ఆడవాళ్ళను ఎర్రటి మండుటెండలో కాలే ఇసుకలో కాలినడకన కొత్త పట్నం నుంచి ఒంగోలు సబ్ జైలు వరకూ తీసుకువెళ్ళి జైల్లో పెట్టారు. మా మీద కేసులు పెట్టారు. ఈ వార్తలు పేపర్లో ఇంటి దగ్గర వాళ్ళు చూసి, భోజనాలు చేయక నానా గొడవలు చేస్తే శేషయ్యగారు, బంధువులు ఒంగోలు సబ్ జైలుకు వచ్చి, నాకు జామీను ఇచ్చి ఇంటికి తీసుకువచ్చారు. అదే సమయంలో శేషయ్యగారు రాజేశ్వరరావుగారిని జైల్లో పరామర్శించారు. తొలిసారిగా వారిద్దరూ కలుసుకున్నది కూడా అప్పుడే.

తరువాత కొద్ది రోజులకు కాట్రగడ్డ నారాయణరావుగారు, శేషయ్యగారు, తుమ్మల వెంకట్రామయ్యగారు, పులుపుల శివయ్యగారు ఇతర బంధుమిత్రులు కలిసి

రాజేశ్వరరావుగారితో నా వివాహం చేస్తే బాగుంటుందని అభిప్రాయపడి నన్ను అడిగారు, ప్రోత్సహించారు కూడా.

1937 జులైలో మా వూరు వెంట్రప్రగడలో పెళ్ళి చూపులకు రాజేశ్వరరావుగారు వచ్చారు. ఆగస్టు 11వ తేదీన బంధువులు, పెద్దల సమక్షంలో మా వివాహానికి నిశ్చితార్థం జరిగింది. అదే సమయంలో రాజేశ్వరరావుగారు సంస్కరణ వివాహం కావాలని పట్టుపట్టడంతో మావాళ్ళు అంగీకరించడం జరిగింది. మా వివాహానికి శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారు ఆచార్యత్వం వహించారు. మా వివాహానికి రాజకీయ పాఠశాల ప్రిన్సిపాల్ శ్రీ కామేశ్వరరావుగారు కూడా వచ్చారు. మాది మొట్టమొదటి సంస్కరణ వివాహం కనుక చూడటానికి చుట్టుప్రక్కల ప్రాంతాలనుండి లెక్కకు మించిన జనం మా వివాహానికి హాజరయ్యారు.

మా వివాహానికి ముందు నేను శాంతినికేతన్‌లో విద్య పూర్తి చేయాలని, రాజేశ్వరరావుగారు మెడిసిన్ విద్య పూర్తి చేయాలని అనుకున్నాం. కాని, చదువులకు స్వస్తి చెప్పి పార్టీకి హోల్‌టైమర్లుగా పనిచేయాలని పార్టీ నిర్ణయించడంతో చదువులకు స్వస్తి చెప్పాము. పార్టీ నిర్ణయానికి కట్టుబడి, వెంట్రప్రగడలో నాకు సొంత ఇల్లు వుంది - దానిని జిల్లా పార్టీ కార్యాలయంగా చేసుకొని, కామ్రేడ్ సి.ఆర్. పార్టీ బాధ్యతలు, నేను యువజన సంఘం, మహిళా సంఘాల బాధ్యతలు వహించాం. ఆ రోజులలో పొలం ఎకరం 200 రూపాయలకు యావదాస్తి అమ్మి పార్టీ నిర్మాణ కార్యక్రమాలకు వెచ్చించాము.

మా వివాహం అయిన కొత్తలో గుంటూరులో యూత్ గార్డ్ నిర్వహించారు. దానికి నేను, సి.ఆర్. వెళ్ళి, పులుపుల శివయ్యగారింట్లో దిగాము. ఆర్థికంగా ఒక మనిషికి ఒకరు భారం కాకూడదు కనుక వారికి కొంత ధనం, భోజనానికి కావలసిన వస్తువులు నేను నా వెంట తీసుకెళ్ళాను. నాలుగైదు రోజులు వారు ఆతిథ్యం యిచ్చారు. ఆరవరోజు వారు అకస్మాత్తుగా వేరే ప్రాంతానికి బదిలీ అయి వున్నఫళంగా బయలుదేరి వెళ్ళిపోవడంతో నా అవస్థలు మొదలయ్యాయి. నాకు పొయిలో నిప్పు ముట్టించడంగాని, వంటగాని, కూరగాయలు తరగడంగాని ఏ పనీ చేతకానందువల్ల ఏమిచేయాలో తోచక పక్కవాళ్ళ సహాయంతో పొయ్యి వెలిగించి వంట ప్రారంభించాను. కాని, వండిన వంట పశువులు కూడా తినలేని పరిస్థితిలో వుండగా వాసిరెడ్డి హనుమాయమ్మగారు వచ్చి, వారింటికి తీసుకొని వెళ్ళి, మాకు భోజన సదుపాయాలు చేశారు. దాని తరువాత కష్టపడి నాలో మార్పు తెచ్చుకొని, ఇంటిపని, వంటపని, పొలంపని సమస్తం నేర్చుకొని, వందమందికి రుచిగా భోజనం తయారుచేయగల శక్తిని సంపాదించి, అందర్నీ ఆశ్చర్యపరచాను.

తరువాత మరణించిన మా తమ్ముడు పేరుతో మా గ్రామంలో ఇద్దరు కుర్రాళ్ళకు ధనసాయం చేసి చదివించాము. వారు ప్రజానాట్యమండలిలో చేరి, పార్టీకి ఎంతో సేవ చేశారు.

బొంబాయిలో జరిగిన పార్టీ ప్రథమ మహాసభకు నేను, సి.ఆర్. వెళ్ళాము. కామ్రేడ్ సి.ఆర్. నా దగ్గర 400/- తీసుకొని బ్యాండ్ కొన్నారు. ఆ బ్యాండుని మా వూరుకి తీసుకొని వచ్చి ట్రూపును తయారుచేసి ఆ బ్యాండ్ వాయిస్తూ పెరెడ్ చేయించేవారు. 1943లో అఖిల భారత రైతు మహాసభలో తొలిసారిగా



1943 లో విజయవాడలో జరిగిన ప్రథమ రాష్ట్ర మహిళా రాజకీయ శిక్షణా తరగతులు నిలచినవారిలో రెండవ వరుస ఎడమనుంచి కుడికి మోటూరి ఉదయం, జొన్నభట్ల సుబ్బమ్మ, వరకాల అహల్యాదేవి, అన్నే (ఇనుగంటి) రామతులశమ్మ (ఇద్దరి పేర్లు తెలియవు). కాట్రగడ్డ హనుమాయమ్మ, మానికొండ సూర్యావతి. నిలబడినవారిలో మొదటి వరుస : వెల్లంకి సక్కుబాయ్, కడియాల రాజరత్నం, నూకినేని జగదాంబ, చంద్ర సావిత్రి, టి సావిత్రి, గోపరాజు సీతాదేవి, వెల్లంకి అన్నపూర్ణ, ..., కుర్చీలపై కూర్చున్నవారు: కామ్రాజు పద్మ, కోటమ్మ, (ముక్తేవి), చలసాని వాసుదేవరావు, మద్దుకూరి చంద్రశేఖరరావు, పుచ్చలపల్లి సుందరయ్య, చండ్ర రాజేశ్వరరావు, గోపరాజు సీతాదేవి, కుమార్తె మణిమాల. నేలపై కూర్చున్నవారు : పందిరి జగదాంబ, మహీధర సీతాదేవి, దుర్గా హనుమాయమ్మ.

ఆ బ్యాండ్ వాయించారు. ఈ మహాసభలో మగవాళ్ళకు కాప్టన్‌గా సి.ఆర్., ఆడవాళ్ళకు కాప్టన్‌గా నేను బాధ్యతలు స్వీకరించాము.

కృష్ణాజిల్లా మహిళా సంఘం కార్యదర్శిగా బాధ్యతలు స్వీకరించాను.

ఆ రోజులలో జిల్లాలో పార్టీ ప్రచారానికి వెళ్ళడానికి కాలినడకన, ఎడ్లబండ్లమీద వెళ్ళేవారం. పిల్లల్ని ఇంటివద్ద పెద్దవాళ్ళకు అప్పచెప్పి మేము ప్రచార కార్యక్రమాలకు వెళ్ళేవాళ్ళం. మామూలుగా పార్టీ ప్రచారానికి వెళ్ళేటప్పుడు ఉదయం వెళ్ళి సాయంత్రానికి తిరిగి ఇంటికి చేరుకునేవాళ్ళం. అట్లాకాకుండా ఎన్నికల టైములో గ్రామాలకు వెళ్ళినప్పుడు అక్కడ బంధువులు, మిత్రులు మాకు భోజన సదుపాయాలు ఏర్పాటు చేసేవారు.

ఒక్కొక్కప్పుడు పార్టీ కార్యక్రమాలకు వెళ్ళినపుడు భోజనం దొరకక చాలా ఇబ్బందులు ఎదుర్కొనేవారం. ఎన్ని యిబ్బందులు ఎదురైనప్పటికికూడా పార్టీ నిర్మాణంకోసం, దీర్ఘపటిష్టతకోసం పార్టీ కోసం ఎంతో దీక్ష పట్టుదలతో పనిచేసేవాళ్ళం. పార్టీ ప్రచార కార్యక్రమాలకు గ్రామాలకు వెడితే, అక్కడి స్థానికులు మాకు సహకరించేవారు.

నేను 1937లో కొత్తపట్నం రాజకీయ పాఠశాలకు హాజరైన తరువాత పాలకొల్లులో జరిగిన మూడవ రాష్ట్ర సోషలిస్టు మహాసభ, ఆ తరువాత మంతెనవారిపాలెంలో జరిగిన వేసంగి రాజకీయ పాఠశాలకు కూడా హాజరయ్యాను.

1938లో ముప్పాలో జరిగిన యూత్ మహాసభకు కామ్రేడ్ హాజరాబేగం, కామ్రేడ్ బాట్లివాల హాజరయ్యారు. ఆ సభకు నేను కూడా వెళ్ళాను. హాజరాబేగం, బాట్లివాలాకు నేను ట్రాన్స్‌లేటర్‌గా ఉండేదాన్ని. వారు హిందీలో మాట్లాడితే నేను తెలుగులో అనువదించేదాన్ని. అదేవిధంగా వారి ఆంధ్ర పర్యటనలో వారికి హిందీ ట్రాన్స్‌లేటర్‌గా పనిచేశాను.

పార్టీలో క్రమశిక్షణ ఎలా వుండేదంటే –

దుస్తుల విషయంలో మగవారు చొక్కా, నిక్కరు; ఆడవారు కోటాచీర (రు.1.25) ధరించాలి. ఒకరు, ఇద్దరు మించి పిల్లలు వుండకూడదు. మాకు అప్పచెప్పిన బాధ్యతను ఎటువంటి వారైనప్పటికి పట్టుదలతో నిర్వహించేవాళ్ళం.

బెజవాడలో ఆ రోజులలో రౌడీల దౌర్జన్యం, అగడాలు ఎక్కువగా ఉండేవి. రౌడీలను ఎదిరించడంలో మన పార్టీ మంచి పాత్ర నిర్వహించింది. నేను, నాతోపాటు ఇతర మహిళా కామ్రేడ్స్ కూడా రౌడీలను ఎదిరించి పోరాడాము. రౌడీలు, ఏ టైములో దాడులు చేస్తారో అని రాళ్ళు, కర్రలు, రోకళ్ళు, కారం ముద్దలు దగ్గరవుంచుకొనేవారం.

ఒకరోజు కొసరాజు శ్రీరాములు హోటల్‌లో గొడవ పడ్డారు రౌడీలతో సి.ఆర్. తమ్మారెడ్డి, బొంబాయి ప్రసాద్. గొడవ అయి వెళ్ళిపోయారు. సి.ఆర్. వాళ్ళ రాష్ట్ర కమిటీ మీటింగులలో వున్నారు. రౌడీలకు రాష్ట్ర కార్యాలయం తెలియక జిల్లా పార్టీ ఆఫీసు మీద దాడిచేశారు. ఆ సమయంలో నేను వార్తాపత్రిక చదువుకోవడానికి పార్టీ ఆఫీసుకి వచ్చాను. రౌడీలు నన్ను ముట్టడించారు. నేను రౌడీల మీద తిరగబడి కొట్టాను. అప్పుడు చలసాని జగన్నాథరావు, సెర్విసెట్టి సుబ్బారావు ఆఫీసులో

వున్నారు. ఈ దాడివార్త రాష్ట్ర కమిటీ సమావేశంలో వున్నవారికి అందింది. వెంటనే కర్రలు తీసుకొని జిల్లా పార్టీ ఆఫీసుకి వచ్చేసరికి రౌడీలు పరారయ్యారు. పోలీసులకు మనవారు కర్రలతో కనిపించడంతో కేసులు పెట్టారు. అప్పుడు కామ్రేడ్ సి.ఆర్.తో నన్ను కూడా సాక్ష్యంకోసం పెట్టారు.

## సాంస్కృతిక స్థాయి, సంస్కారం:

నేడు మనకు కావలసినంత సాహిత్యం చదువుకోవటానికి అందుబాటులో వుంది. దానిని వినియోగించుకోవాలి నేటి యువతరం.

నేటి యువతరంలో సాంస్కృతిక స్థాయి, సంస్కారం స్థాయి పెరగాలి. ఆడంబరాలు, అతిశయోక్తులకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తున్నారు. ఇవన్నీ తగ్గించుకొని ఉద్యమాల ద్వారా ప్రజా సమస్యలను పరిష్కరించి, పార్టీని బలోపేతమైన శక్తిగా మార్చడానికి నేటి యువత కంకణం కట్టాలి. కమ్యూనిస్టులు శారీరక శ్రమను గౌరవించాలి. వృద్ధతరం వారిని ప్రేమాభిమానాలతో చూడడం ఎంతో అవసరం. ఇవన్నీ దృష్టిలో పెట్టుకొని, పూర్వులు చేసిన త్యాగాలను మననం చేసుకుంటూ పార్టీయందు అంకిత భావంతో పనిచేయాలని నా అభిప్రాయం.

ఇక మహిళా సంఘాల విషయానికొస్తే – ఆ రోజులలో పార్టీ నాయకులతోపాటు నాయకుల భార్యలు కూడా ప్రతి పార్టీ కార్యక్రమాలలో పాల్గొనాలన్న కట్టుబాటు, సంప్రదాయం వుంది. అందరూ విధిగా పాల్గొనేవారు కూడా. చాలామంది వయస్సు మళ్ళిన మహిళలు కూడా శిబిరానికి వచ్చి కర్రసాము చేర్చుకునేవారు. ప్రస్తుత పార్టీ కార్యక్రమాలలో మహిళలు తక్కువ సంఖ్యలో పాల్గొనడం కనిపిస్తోంది.

మహిళా ఉద్యమాలు బలోపేతంగా తయారు చేయాలంటే మహిళా సమస్యలపై కేంద్రీకరించి వాటిని ఉద్యమాలద్వారా పరిష్కరించాలి. వరకట్నాలు, ఆడంబర వివాహాలు మనవరకైనా సాధ్యమైనంతగా తగ్గించాలి. సమస్య పరిష్కారం కోసం పట్టుదల, దృఢ సంకల్పం ఎంతో అవసరం. వాటిని దృష్టిలో పెట్టుకొని మహిళా సంఘాలు పనిచేయాలని నా అభిప్రాయం.

రాజేశ్వరరావుగారి విప్లవ ప్రస్థానంలో ప్రముఖ ఘట్టాలు ఎన్నో వున్నాయి. ఆ ఘట్టాలు మాసిపోకుండా వాటిని వెలుగులోకి తీసుకురావడానికి ఇక ప్రయత్నించాలని కోరుకుంటున్నాను. 56 సం॥లు సహజీవితంలో కొన్నింటిలో పాలుపంచుకున్నాను. సాధ్యమైనంత సహాయసహకారం పార్టీకి అందించడానికి జీవితమంతా అర్పించాను. వైవాహిక జీవితంలో ఏనాడు 10 రోజులు ప్రశాంతంగా జీవించలేదు. సి.ఆర్. స్మృతులతో జీవిస్తున్నాను.

★ ★ ★

# శ్రీమతి ఆరుట్ల కమలాదేవి



నేను పుట్టింది – నల్లగొండ జిల్లా ఆలేరు మండలంలోని మంతపురి గ్రామంలో – 1920లో. మా నాన్న ఎల్లా వెంకట్రామరెడ్డి, తల్లి లక్ష్మీనర్సమ్మ. మధ్యతరగతి రైతు కుటుంబం. నాకు రుక్మిణి అని పేరు పెట్టారు. ఆ రోజుల్లో గ్రామాల్లో పాఠశాలలు లేవు. ఆడపిల్లలు చదువుకునే ఆలోచనే లేదు. అందువల్ల ఇంటిపనులు చూస్తూ– అందరి ఆడపిల్లల్లా ఇంట్లోనే వుండేదాన్ని. నాకు 11 సంవత్సరాల వయస్సులో, మా మేనమామ కొడుకు ఆరుట్ల రామచంద్రారెడ్డి గారితో వివాహం జరిగింది. వాళ్ళది కొలనుపాక గ్రామం. అప్పటికే రామచంద్రారెడ్డిగారు, హైదరాబాదు–రెడ్డి హాస్టల్లో వుంటూ చదువుతున్నారు. ఆనాడు దేశమంతటా స్వాతంత్ర్య ఉద్యమం ముమ్మరంగా సాగుతున్నది. గాంధీగారి నాయకత్వాన శాసనోల్లంఘనోద్యమం – మరోప్రక్క భగత్‌సింగ్ – రాజగురు–సుఖదేవుల ఉరిశిక్ష – మీరట్ కుట్రకేసు – దేశమంతటా సంచలనం కలిగిస్తున్న రోజులు. హైదరాబాదు సంస్థానంలో

మాత్రం నిరంకుశత్వం – దొరలు, దేశముఖ్‌లు, పెత్తందార్ల దోపిడీ సాగుతున్నది. మాతృభాషకు విలువ లేదు. ఉర్దూ భాషలోనే చదువు – అది కూడా అందరికీ అందుబాటులో లేదు.

జాతీయోద్యమం ఎడల నా భర్త రామచంద్రారెడ్డిగారు ఆకర్షితులై, దేశభక్తి, ఆదర్శభావాలు అలవరచుకున్నందున నా పెళ్ళిలోనే నా పేరు కమలాదేవిగా మార్పు చేశారు. ఆ రోజుల్లో జాతీయ మహిళా నాయకులుగా కమలాదేవి ఛటోపాధ్యాయ, సరోజినీ నాయుడుగార్ల పేర్లు బహుళ ప్రచారంలో వుండేవి. అందుకే నా పేరు కూడా ఆ విధంగా మార్పు చేశారు. ఆనాటి నుండి కమలాదేవి నయ్యాను. నా పెళ్ళికి రామచంద్రారెడ్డి గారు కొన్ని ముందు షరతులు విధించారు. ఒకటి: వైదిక మంత్రతంత్రాలతో గాక ఆర్యసమాజ పద్ధతి వివాహం; రెండు: నన్ను చదివించడం. మావాళ్ళు అంగీకరించారు.

నా పెళ్ళయిన తర్వాత నాకు చదువు చెప్పించాలని – రామచంద్రారెడ్డి గారనుకున్నారు. హైదరాబాదులో ఆంధ్ర గరల్స్ హైస్కూలు ఒక్కటే వుండేది. తెలుగు భాషలో బోధన – మహిళలకు ప్రత్యేకంగా వున్న స్కూలు. దాన్ని మాడపాటి హనుమంతరావుగారు స్థాపించి నడుపుతున్నారు. నిజాం ప్రభుత్వం ఆ పాఠశాలను గుర్తించనందున మహారాష్ట్రలోని కార్వే యూనివర్శిటీకి అనుబంధంగా నడుస్తుండేది. నన్ను ఆ స్కూల్లో చేర్పించారు. కానీ – వుండటమెక్కడా? అన్న ప్రశ్న ఎదురయ్యింది. బాలికల హాస్టల్ వుంటే బాగుంటుందని, నా భర్త రామచంద్రారెడ్డిగారు వెంకట్రామరెడ్డిగారిని సంప్రదించారు. వెంకట్రామరెడ్డిగారు రెడ్డి హాస్టల్ నిర్మించి, నడుపుతున్నారు. రామచంద్రారెడ్డిగారు – వారిని వొప్పించి – రెడ్డి హాస్టల్‌కు అనుబంధంగా బాలికల హాస్టల్ ఏర్పాటు చేయించారు. అందులో నేను మొదటి విద్యార్థినయ్యాను. నాతోపాటు మరో 15 మంది వుండేవాళ్ళం. వాళ్ళు కూడా – రాజకీయ చైతన్యం పొందినవారి కుటుంబాల నుండి – ప్రయత్నించి చేర్పించినవాళ్ళే.

నేను హైస్కూల్లో చదువుకున్ననాటికే రామచంద్రారెడ్డిగారు ఆంధ్ర మహాసభలో ముఖ్యమైన కార్యకర్తయ్యారు. ఆంధ్ర మహాసభ మహాసభల్లో పాల్గొంటున్నారు. రాజకీయాల్లో ఎక్కువగా పనిచేస్తున్నారు. అందువల్ల–1934 నుండి ఆంధ్ర మహాసభ మహాసభలకు నన్ను వెంట తీసుకుని పోతుండేవారు. నేను వలంటీరుగా పనిచేస్తుండేదాన్ని, రామచంద్రారెడ్డిగారికి నన్ను జీవిత భాగస్వామినే గాకుండా, రాజకీయాల్లో కూడా భాగస్వామిని చేయాలనే కోరిక వుండేది. ఆంధ్ర మహాసభ మహాసభల సందర్భంలోనే రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి మొదలైనవారితో పరిచయం కలిగింది. ఆరుట్ల లక్ష్మీనర్సింహారెడ్డిగారు బంధుత్వరీత్యా, రామచంద్రారెడ్డిగారి సోదరుడుగా – రాజకీయ సహచరుడుగా అంతకుముందే తెలుసు.

స్కూల్ ఫైనల్–హెచ్.ఎస్.సి. పాసయిన తర్వాత కొలనుపాక వెళ్ళాను. అప్పటికి మా వూళ్ళో బడిలేదు. అది జాగీరు గ్రామం. బడి పెట్టాలన్నా–గ్రంథాలయం స్థాపించాలన్నా నిషేధం. అందువల్ల రహస్యంగా ఆరుట్ల సోదరుల చొరవతో రహస్య గ్రంథాలయం స్థాపించారు. దానికి గ్రంథాలయమంటే నిషేధం కాబట్టి 'వంటశాల' అని

పేరు పెట్టారు. దానికి తలుపులు, దర్వాజాలు లేని స్థలం. అక్కడ నేను విద్యార్థులను పోగుచేసి పాఠాలు చెపుతూ, గ్రంథాలయం నడుపుతుండేదాన్ని. కొంతకాలానికి అది వంటశాల కాదు, గ్రంథాలయమని జాగీర్దారు కనిపెట్టాడు. ప్రభుత్వం దాన్ని మూసివేసింది. కొలనుపాకలో పెద్ద జైన దేవాలయముంది. జాగీర్దారు చేసిన పనిని జైన్‌మందిరం నిర్వాహకులు తెలుసుకొని – ఆ దేవాలయంలో స్థలమిచ్చి పాఠశాల నిర్వహించడానికి అనుమతించారు. అక్కడ ఒక సంవత్సరంపాటు స్కూలు నడిపాను.

ఆంధ్ర మహాసభ చిలుకూరు మహాసభలో పాల్గొన్నాను. అప్పుడు ప్రపంచ యుద్ధం, హిట్లర్ ఫాసిజం కొనసాగుతున్నాయి. నిజాం సంస్థానం, ముఖ్యంగా తెలంగాణా ప్రాంతంలో – అందులో నల్లగొండ జిల్లాలో, ఆంధ్ర మహాసభ ఒక ఉద్యమంగా మారింది. స్త్రీలకు ఆత్మరక్షణ అవసరమని – 1943లో విజయవాడలో కమ్యూనిస్టు పార్టీ నాయకత్వాన "మహిళా ఆత్మరక్షణ శిక్షణా శిబిరం" నిర్వహించారు. దానికి హాజరై, శిక్షణ పొందాను. తిరిగొచ్చిన తర్వాత – భువనగిరిలో ఆంధ్ర మహాసభ 11 వ మహాసభ జరిగింది. దాని నిర్వహణలో రామచంద్రారెడ్డిగారు ప్రముఖపాత్ర వహించారు. వారితోపాటు నేనూ గ్రామాల్లో ప్రచారం చేశాను. భువనగిరి మహాసభ–రాజకీయ పోరాట వేదికగా మారింది. వెట్టిచాకిరి; దొరల, దేశముఖుల దౌర్జన్యాలు; నిర్బంధపు వసూళ్ళకు వ్యతిరేకంగా ఉద్యమం నడపటానికి పిలుపునిచ్చింది.

నేను ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీలో సభ్యురాలిగా, నా భర్త రామచంద్రారెడ్డి గారితోపాటు ఉద్యమంలోకి వచ్చాను. దేవులపల్లి వెంకటేశ్వరరావుగారు రాజకీయ తరగతులు నిర్వహించేవారు.

1944లో మాకు సంతానం కలిగింది. విప్లవ్ పుట్టాడు. 1945లో రామచంద్రారె డ్డిగారు అరెస్టయ్యారు. 1946లో నల్లగొండ జిల్లాలో మార్షల్‌లా, నిర్బంధం పెరిగింది. విడుదల కాగానే రామచంద్రారెడ్డిగారు రహస్య జీవితంలోకి వెళ్ళారు. మా పిల్లవాణ్ణి కొంతకాలం కృష్ణాజిల్లాలో వున్న మా అన్నవద్ద – మరికొంతకాలం మధిరలో ఉద్యోగిగా వున్న మా మేనల్లుడివద్ద వదిలిపెట్టి – ఉద్యమంలో పనిచేశాను. నేనూ రహస్యంగా వుండక తప్పలేదు. కొంతకాలం కృష్ణాజిల్లా పల్లెటూరిలో (వెల్లటూరు?) వున్నాను. ఎ.ఆర్. గారికి తుపాకి దెబ్బ తగిలిందని తెలిసి, హైదరాబాదు వచ్చాను. 1947లో తెలంగాణా ప్రాంతాలలో – భువనగిరి – ఆలేరు ప్రాంతాల్లో ఎ.ఆర్. గారితోపాటు దళాల్లో పనిచేశాను. తుపాకి శిక్షణ పొందాను. యూనియన్ సైన్యాలు వచ్చిన తర్వాత – కమ్యూనిస్టు పార్టీ మీద దాడులు పెరిగాయి. దళ నిర్మాణం దెబ్బతిన్నది. ప్రజల సహకారం ప్రభుత్వ నిర్బంధం – దౌర్జన్యాల కారణంగా – అందకుండా దూరం అయ్యింది. కొంతమంది చనిపోయారు. కొంతమంది ఆత్మరక్షణ కోసం అడవుల్లోకి పోయారు. ఎ.ఆర్.గారు, నేను భువనగిరి ప్రాంతంలోనే వున్నాం. ఒకరోజు చల్లూరు గుట్టల్లో మేమిద్దరమే వున్నాం. మా కొరియర్ కూడా పారిపోయాడు. మిలిటరీ చుట్టేసింది. ఎ.ఆర్.గారు పట్టుబడితే ప్రాణాపాయమనుకున్నాను. వారిని పారిపొమ్మన్నాను. కానీ – నన్ను ఒంటరిగా విడిచి వెళ్ళడానికి అంగీకరించలేదు. ఎలాగో వాళ్ళ కంటబడకుండా తప్పించుకున్నాం.

కొన్ని రోజుల తర్వాత – నేను జ్వరంతో బాధపడుతున్నాను. నన్ను మా అమ్మగారింట – మంతపురిలో వదిలి వెళ్ళడానికి రామచంద్రారెడ్డిగారు నిర్ణయించుకొని నన్ను తీసుకునిపోతున్నారు. ఆలేరు వద్ద పోలీసులకు చిక్కాము.

ఎ.ఆర్.గారిని ఖమ్మం క్యాంపుకు – నన్ను వరంగల్ జైలుకు పంపారు. కేసుబెట్టారు. వరంగల్ జైల్లో సంవత్సరం వున్నాను. అక్కడ నుండి ఔరంగాబాదు జైలుకు మార్చారు. అక్కడ దాదాపు సంవత్సరం పైన వున్నాను. తిరిగి సికింద్రాబాదు జైలుకు తీసుకొచ్చారు. మా యిద్దరి మీద – ఆయుధాలు కలిగి వున్న నేరం మోపి స్పెషల్ కోర్టులో కేసు నడిపారు. అది రుజువు కాలేదు.

1951 చివరిలో నేను విడుదలయ్యాను. విడుదల కాగానే ఎన్నికల రంగంలో పాల్గొన్నాను.

1952 మొదటి ఎన్నికల్లో భువనగిరి నుండి శాసనసభకు ఎన్నికయ్యాను. ఆ తర్వాత వరుసగా మూడుసార్లు శాసనసభ్యురాలిగా ఆలేరు నుండే ఎన్నికయ్యాను. 1967 వరకు ఎం.ఎల్.ఎ.గా వున్నాను. 1962లో ప్రధాన, బలమైన ప్రతిపక్షంగా పార్టీ విజయం సాధించింది. సుందరయ్యగారు ప్రతిపక్ష నాయకులుగా – నేను డిప్యూటీ నాయకురాలిగా పనిచేశాను. సుందరయ్యగారు మాస్కోకు చికిత్సకు వెళ్ళినపుడు ప్రతిపక్ష నాయకురాలిగా పనిచేశాను. పార్టీ చీలిన తర్వాత డిప్యూటీ లీడరుగా వున్నాను. నల్లగొండ జిల్లా సమితి, రాష్ట్ర సమితి సభ్యురాలిగా చాలాకాలం పనిచేశాను. 1966 తర్వాత రాష్ట్ర మహిళా సంఘం ప్రధాన కార్యదర్శిగా కొంతకాలం పనిచేశాను. 1955లో బల్గేరియా, చెకొస్లవేకియా, జి.డి.ఆర్, ఆస్ట్రియా దేశాలు పర్యటించాను. తిరిగి 1983 నా భర్త ఎ.ఆర్.గారితోపాటు సోవియట్ యూనియన్ వెళ్లాను. ఓపిక వున్నంతకాలం పార్టీలో నా శక్తి కొలది పనిచేశాను. ఎ.ఆర్.గారు చనిపోయారు. నాకు వృద్ధాప్యమొచ్చింది. అనారోగ్యం కూడా. అందువల్ల అప్పుడప్పుడు – ఎక్కడికైనా పిలిస్తే – ఆరోగ్యం అనుమతిస్తే వెళుతున్నాను.

మేము చేసిన పోరాటం ద్వారా ఎంతో కొంత మేలు ప్రజలకు చేశామన్న సంతృప్తి వుంది. అయితే, మేము ఆశించిన ఫలితాలన్నీ రాలేదు. అన్నిటికంటే నాకు బాధాకరమైన విషయం – తెలంగాణా విముక్తి పోరాటాన్ని భారత స్వాతంత్ర్య సమరంలో భాగంగా గుర్తించకపోవడం!

నిజాం నిరంకుశత్వానికి వ్యతిరేకంగా – వెట్టిచాకిరికి వ్యతిరేకంగా – నైజాం ప్రాంతాన్ని విముక్తి చేసి – స్వాతంత్ర్య భారతంలో విలీనం చెయ్యాలని, విశాలాంధ్ర స్థాపించాలని సాగించిన పోరాటంలో నాలుగు వేలమందికి పైగా చనిపోయారు. వేలాదిమంది ఎన్నో త్యాగాలు చేశారు. చివరికి సాధించుకున్నాం. కానీ – స్వాతంత్ర్యం వచ్చి యిన్ని సంవత్సరాలైనా తెలంగాణా పోరాటాన్ని స్వాతంత్ర్య పోరాటంలో భాగంగా ప్రభుత్వం గుర్తించకపోవడం విచారకరం. ఇన్నాళ్ళు కాంగ్రెసు పాలకులు కాదన్నారు. కనీసం యిప్పటి ప్రభుత్వాలైనా – తెలంగాణా పోరాటాన్ని – స్వాతంత్ర్య పోరాటంగా గుర్తిస్తారని – వారి త్యాగాలని గౌరవిస్తారని ఆశిస్తున్నాను.

★ ★ ★

# కీ.శే. మానికొండ సూర్యావతి



కృష్ణాజిల్లా కమ్యూనిస్టు పార్టీ ప్రముఖులు, రైతు సంఘనాయకుడు శ్రీ కడియాల గోపాలరావుగారు మా పెదతల్లి భర్త. నేను అక్కడే వుండేదాన్ని. గుంటూరుజిల్లా మంతెనవారిపాలెంలో అన్నాప్రగడ కామేశ్వరరావుగారు ఆదర్శవంతమైన గురుకుల పాఠశాల ఒకటి నడిపేవారు. ఆ స్కూలు నిర్వాహణలో కొంతకాలం మా పెదతండ్రి పనిచేశారు.

అదే కొత్తపట్నంలో 1937లో రాజకీయ పాఠశాల జరిగింది. ఆ మరుసటి ఏడు మంతెనవారి పాలెంలో కూడా రాజకీయ పాఠశాల జరిగింది. ఈ రెండు పాఠశాలలకు కడియాల గోపాలరావుగారు హాజరయ్యారు. చండ్ర రాజేశ్వరరావు మొదలైన నాయకులందరూ అప్పుడు కాంగ్రెస్ సోషలిస్టు పార్టీగా వ్యవహరించేవారు.

1936-37 సంవత్సరాలలో కాటూరులో స్త్రీలకు రాజకీయ శిక్షణా తరగతులు నడిపారు. ఆ రోజుల్లో స్త్రీలు యింటిగడపదాటి బైటకి రావడమే ఆక్షేపణగా

ఉండేది. అట్టి పరిస్థితుల్లో స్త్రీలలో విజ్ఞానం తీసుకురావడానికి ఈ శిక్షణా తరగతిని పెట్టారు. చండ్ర రాజేశ్వరరావు గారు, అన్నే అంజయ్యగారు, కడియాల గోపాలరావుగారు పాఠాలు చెప్పారు. అసలు దేశం అంటే ఏమిటి? స్త్రీ, పరిస్థితులు ఏమిటి? మున్నగు విషయాలు చెప్పారు. సోవియట్ రష్యాలో స్త్రీలు పొందిన అభివృద్ధి గురించి చెప్పేవారు. సోషలిజం వచ్చినప్పుడే స్త్రీలకు నిజమైన విముక్తి వస్తుంది అని చెప్పేవారు. రెండు మూడు రోజులు జరిగిన ఈ క్లాసులో పేపరు చదవడం, గోడ వార్తాపత్రిక నడవడం మున్నగువాటిద్వారా స్త్రీలలో విజ్ఞాన వికాసం కల్గించారు. వివిధ విషయాలపై చర్చలు నడిపేవారు. నేను ఈ పాఠశాలలో ఎన్నో విషయాలు నేర్చుకున్నాను.

## రాష్ట్రస్థాయి మహిళా పాఠశాల:

తరువాత 1943లో బెజవాడలో రాష్ట్రస్థాయి మహిళా రాజకీయ పాఠశాల జరిగింది. అక్కడ రాజకీయ భూగోళం, చరిత్ర, జాతీయోద్యమం, సోషలిజం మున్నగు విషయాలపై పాఠాలు చెప్పేవారు. శరీర శాస్త్రం మున్నగు విషయాలు కూడా డాక్టర్ అచ్చమాంబ మున్నగువారు చెప్పేవారు. ఫాసిస్టు ప్రమాదం, జపాన్ దండయాత్ర ప్రమాదం దృష్ట్యా కర్రసాము, ఆత్మరక్షణోపాయాలు, విమానదాడి రక్షణలు, ప్రథమ చికిత్స మున్నగునవి నేర్పేవారు. క్లాసుకు వచ్చిన మహిళలందరూ కాకి నిక్కరు, కాకి షర్టులు ధరించి గవర్నరుపేటలో ప్రదర్శనకూడా చేశారు. చండ్ర రాజేశ్వరరావు, మద్దుకూరి చంద్రశేఖరరావు, చలసాని వాసుదేవరావు, కంభంపాటి సీనియర్, కంభంపాటి జూనియర్ మొదలైనవారు పాఠాలు చెప్పారు.

నాకు 1937లో కొత్తపట్నం రాజకీయ పాఠశాలలోనే వివాహం అయింది. వరుడు కామ్రేడ్ మానికొండ సుబ్బారావు గారు. అప్పటికే ఆయన కమ్యూనిస్టు ఉద్యమంలో పనిచేస్తున్నారు. మంతెనవారి పాలెం గురుకుల పాఠశాలలో కూడా టీచరుగా పనిచేసేవారు. ఆయన మా పినతాత కుమారుడు. దగ్గర బంధుత్వం. ఆయన మేనమామా వాళ్ళు కాంగ్రెస్ ఉద్యమంలో పాల్గొని జైలుకు వెళ్లారు. మా అత్తగారు మానికొండ బుల్లెమ్మ గారు కూడా జాతీయాభిమాని. నల్గురిని కూచోబెట్టి రాట్నాలు వడకడం వగైరా కార్యక్రమాలు చేసేవారు. తరువాత మా అత్తగారు కమ్యూనిస్టు ఉద్యమంలోకి వచ్చారు. ఆమెను గోర్కీ "అమ్మ" నవలలోని అమ్మతో పోల్చేవారు.

ఆ రోజుల్లో మా అందరిచేత చదివించే పుస్తకాలలో గోర్కీనవల "అమ్మ" తప్పనిసరిగా ఉండేది. రష్యాలో విప్లవ పోరాటంలో గోర్కీ నవలలో "అమ్మ" ఎటువంటి పాత్ర నిర్వహించిందో అది ఆదర్శవంతంగా తీసుకొనేవారం. ఆ విధంగా నేను కమ్యూనిస్టు పార్టీవైపు ఆకర్షించబడ్డాను.

## గ్రామసీమలకు మహిళా ఉద్యమ వ్యాప్తి:

అప్పటికి గ్రామ సీమలలో స్త్రీలకు మహిళా సంఘాలంటూ ఉండేవికావు. కాంగ్రెస్ ఆధ్వర్యాన పట్టణ స్త్రీలకు, విద్యావంతురాళ్ళైన స్త్రీలకు మాత్రం మహిళా

సంఘాలు ఉండేవి. ఉద్యోగస్తుల భార్యలు, ధనిక వర్గాల స్త్రీలు స్త్రీల క్లబ్బులని పెట్టేవారు. సామాన్య స్త్రీలకు వాటిలో ప్రవేశం ఉండేదికాదు. మహిళా ఉద్యమాన్ని గ్రామసీమలకు, పేదవర్గాల మహిళలకు, రైతాంగ మహిళలు – వ్యవసాయ కార్మిక మహిళల వరకు – వ్యాపింపజేయాలనే ఆలోచన కమ్యూనిస్టుపార్టీకి వచ్చింది. 1936లో కృష్ణాజిల్లా మహిళా సంఘం ఏర్పడింది. చండ్ర సావిత్రి, కాట్రగడ్డ హనుమాయమ్మ, వెల్లంకి అన్నపూర్ణ మున్నగువారు కార్యకర్తలుగా ఉండేవారు. అప్పటికి నాకు మహిళా సంఘాల గురించి తెలియదు. నాగళ్ళ రాజేశ్వరమ్మ ద్వారా నాకు మొదటిసారి మహిళా సంఘాల నిర్మాణం, వాటి ఆవశ్యకత తెలిసింది. కాటూరులో పార్టీ జరిపిన రాజకీయ క్లాసుకు హాజరై, ఆ తరువాత నేనుకూడా కార్యకర్తగా పనిచేయడం మొదలుపెట్టాను.

1939లో నాకు కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం యిచ్చారు. మా స్వగ్రామం నందమూరు. ఈ గ్రామం మీద పోలీసుల దృష్టి ఎక్కువ ఉండేదికాదు. అందుచేత రహస్య జిల్లా పార్టీ ఆఫీసు మా వూళ్ళో, మా యింట్లో ఉండేది. నా భర్త మానికొండ సుబ్బారావుగారు రహస్యంగా ఉంటూ, ఒక ముఖ్య కమ్యూనిస్టు కార్యకర్తగా పనిచేసేవారు. కొంతకాలానికి మా యింటిపై పోలీసు నిఘా వచ్చింది. దానితో రహస్యజిల్లా కేంద్రాన్ని అక్కడ నుండి మార్చివేశారు.

## కమ్యూనిస్టు పార్టీ నేర్పిన నిరాడంబరత:

1941లో నన్ను జిల్లా మహిళా సంఘ కార్యదర్శిగా ఎన్నుకొన్నారు. అనేక గ్రామాలలో పర్యటించి మహిళా సంఘాలను నిర్మించేవారం. మహిళా సంఘాలు ఎలా నిర్మించాలో, ఏయే సమస్యలను ముందు తీసుకోవాలో చండ్ర రాజేశ్వరరావు గారు, కడియాల గోపాలరావుగారు మాకు చెప్పి మార్గదర్శకులుగా ఉండేవారు. మహిళా కార్యకర్తలు ఆడంబరంగా ఉండకూడదని, నగలు అవీ ధరించి ఆర్భాటంగా ఉండరాదని, నిరాడంబరంగా ఉంటేనేగాని సామాన్య స్త్రీలు మనలను విశ్వసించరనీ నాయకులు ఎంతో క్రమశిక్షణను, నిరాడంబరతను నేర్పేవారు. సామాన్య ప్రజలతో కలిసిపోయే విధంగా మన వేషభాషలు ఉండాలిగాని, నగలు, నాణ్యాలు ధరించి పటాటోపంగాను ఫ్యాషన్‌గాను ఉండరాదని చెప్పేవారు. ఆ రోజుల్లో ఆరుచీరల కంటే మించి, బాధ్యత స్థానాల్లో ఉన్నవారికి, ముఖ్య కార్యకర్తలెవరికీ ఉండరాదన్న నియమం పార్టీ పెట్టింది. నా పెళ్ళికి పెట్టిన పట్టుచీరలు అమ్మివేసి మామూలు చీరలు కొనుక్కొన్నాను. నాటి నుండి నేటి వరకు నేను పట్టుచీరలు కట్టలేదు. పదిహేను, పద్దెనిమిదేళ్ళ వయస్సులో ఉన్న యువతులం అయినప్పటికీ మేము అలంకారాలు చేసుకోవడంగాని, పూలు కూడా పెట్టుకోవడంగాని చేసేవాళ్ళం కాదు.

పూలు, నగలు పెట్టుకొని షోకు చేసుకొని మీటింగులకు వెడితే 'భోగం సానుల్లా తయారై వచ్చారు' అన్నమాట వస్తుందేమోనని మేము అటువంటి జాగ్రత్తలు తీసుకొనేవాళ్ళం. పార్టీ కూడా ఈ విషయంలో మాకు హెచ్చరికలు చేసేది. ఒకసారి ఏమి జరిగిందంటే – నేను, కాట్రగడ్డ హనుమాయమ్మ మిగిలిన అన్ని బంగారు నగలు తీసివేసి, మాకు చాలా యిష్టంగా ఉండే లోలకులు పెట్టుకొని ఒక వూరు వెళ్ళాం.

ఆ లోలకులు చూసి చాలా బాగున్నాయని అక్కడి స్త్రీలు ఒక కమసాలిని ఆ మోడలు చూసిరమ్మని పంపారట. ఆ వూళ్ళో జిల్లా పార్టీ నాయకులు రహస్యంగా ఉన్నారు. ఈ విషయం వాళ్ళకు తెలిసింది. ఆ తరువాత జిల్లా పార్టీ కార్యదర్శి నుండి మాకు యింత పొడుగు ఉత్తరం వచ్చింది. మీరు ఫ్యాషన్లు ప్రచారం చేయడానికి వెడుతున్నారా? లేక మహిళల సమస్యలను ప్రచారం చేయడానికి వెడుతున్నారా? అని మమ్మల్ని సాగదీశారు. ఆ ఉత్తరం హనుమాయమ్మకు చూపించాను. ఆ మరుసటి రోజునుండి మేము లోలకులు ధరించడం మానివేశాం. ఆ రోజు నుండి ఈ రోజు వరకు మళ్ళీ లోలకులు పెట్టుకోలేదనుకోండి! ఇటువంటి చిన్న చిన్న వ్యక్తిగత విషయాలు దగ్గరనుండి కూడా పార్టీ చాలా కఠినంగా ఉండేది. వ్యక్తిగత నడవడిక (క్యారెక్టర్) దగ్గరనుండి, వేషభాషల దగ్గరనుండి జాగ్రత్తలు తీసుకునేవారు. అన్ని విషయాలలోను ప్రజలకు ఆదర్శంగా ఉండాలని నిర్దేశించేవారు. ముఖ్య కార్యకర్తలు, బాధ్యత స్థానాలలో ఉన్నవారు ఇటువంటి విషయాలను ఖచ్చితంగా పాటించేవారు. చెప్పడమే కాదు – ఆచరణ ముఖ్యంగా చూసేవారం.

## అధ్యయనం తప్పనిసరి:

మీటింగులలో ఎవరెవరు ఏమి మాట్లాడాలి? అని ముందుగానే చర్చించుకోవడం, మాట్లాడిన తరువాత సరిగా చెప్పామా? లేదా? అని విమర్శించుకొనేవాళ్ళం. మా ఉపన్యాసాల గురించి ప్రజలు ఏమనుకుంటున్నారు? మగవారు ఏమనుకుంటున్నారు? మున్నగునవి తెలుసుకొని గుణపాఠాలు తీసుకొనేవాళ్ళం. ఆ రోజుల్లో బస్సులు ఉండేవికాదు. కాలినడకన వెళ్ళేవాళ్ళం. రిపోర్టులు విధిగా వ్రాసి పార్టీకి యిచ్చేవాళ్ళం. రాజకీయ, సిద్ధాంత విషయాలపై ప్రతినెల విధిగా ఒక పుస్తకం చదవాలని నియమం ఉండేది. నెలసరి పార్టీ శాఖ సమావేశాలలో ఎవరు ఏమి చదివారు? రాజకీయ సిద్ధాంత పరిజ్ఞానం పెంపొందించుకోడానికి చదివారా? లేదా? రిపోర్టులో తప్పక చెప్పాలి. అధ్యయనం కూడా విధిగా చేయాలి అన్న నియమం ఉండేది.

ఆ రోజుల్లో ఘోషా ఎక్కువగా ఉండేది. ఆడవాళ్ళు ప్రయాణాలు చేయవలసి వస్తే బండి రెండువైపులా తెరలు కట్టుకోవాలి. గ్రామాల్లో, వీధుల్లో నడిచి వెళ్ళడం కూడా తప్పుగా ఎంచేవారు. అరుగుల మీద పెద్దలు కూచుంటే ఆ వీధిలో అసలు వెళ్ళకూడదు. ఎగతాళి, వెక్కిరింపులు ఎదురయ్యేవి. ఆడవాళ్ళు కూడా మమ్మల్ని తిట్టేవారు. చెడిపోయిన వాళ్ళక్రింద చూసేవారు. 'మీరు చెడిపోయింది కాక మా యింట్లో వాళ్ళని కూడా చెడగొట్టడానికా ఈ సంఘాలు?' అని దూషించేవారు. అలా ఒకసారి మమ్మల్ని నానా మాటలు అంటుంటే నాకు ఏడుపు వచ్చి అక్కడే ఏడ్చేశాను. ఆ తరువాత చండ్ర రాజేశ్వరరావుగారు అజ్ఞాత వాసంలో ఉండగా కలుసుకొని 'ఆ అవమానాలు భరించలేము. ఇక మేము మహిళా సంఘ ప్రచారానికి వెళ్ళను' అని ఏడ్చి మొరపెట్టాను. 'మన స్త్రీలు, మన పురుషులు, మన సమాజం యింకా ఎంతో వెనుకబడి ఉంది. అందుచే మనం యింకా పట్టుదల పట్టి పనిచేయాలి. వాళ్ళలో మార్పు తీసుకురావాలి. లేకపోతే మన సంఘాల అవసరం ఏముంది?' అని రాజేశ్వరరావు గారు మమ్మల్ని బుజ్జగించి, ధైర్యం చెప్పి, మాకు ఆత్మవిశ్వాసం కల్గించారు.

## సాంఘిక సంస్కరణల ఉద్యమం:

గ్రామాల్లోకి వెళ్ళేటప్పుడు మేము "వితంతు స్త్రీలు వివాహాలు చేసుకోవాలనీ, విడాకుల చట్టం అవసరమనీ, స్త్రీలకు ఆస్తి హక్కు ఉండాలనీ" చెప్పేవాళ్ళం. ప్రసూతి సౌకర్యాలు ఉండాలనీ చెప్పేవాళ్ళం. మహాసభలు జరిపినప్పుడు ఆరోగ్యవంతమైన పిల్లల ప్రదర్శనలు ఏర్పాటు చేసి, బహుమతులు యిచ్చేవాళ్ళం. ఆరోగ్యకరమైన బలవర్ధక ఆహారం గురించి వివరించి, ఉప్పు, పులుపు తగ్గించి తినాలని చెప్పేవాళ్ళం. వంటావార్పు, బిడ్డల పెంపకం మొ॥ వాటిలో శాస్త్రీయ పద్ధతులు, ఆహార విజ్ఞానం, ప్రసూతి శిశుపోషణ మున్నగునవి చెప్పేవారం. వీటిని మన పార్టీ కుటుంబాలలో అమలుపరచేవాళ్ళు. వాళ్ళను చూసి యితరులు చేసేవారు.

కాని, సాంఘిక సంస్కరణల విషయం వచ్చేసరికి చాలా వ్యతిరేకత వచ్చేది. "ఇంతకీ మీరు చెప్పొచ్చేదేంటి? ఆడాళ్ళు మగాళ్ళకు వండి పెట్టకుండా బజార్లమ్మట తిరగండనీ, వెధవ ముండలకి పెళ్ళిళ్ళు చేయాలనేకదా!" అనేవారు. అప్పుడు రాజా రామమోహానరాయ్ సహగమనం మాన్పించడం దగ్గరనుండి, వీరేశలింగం వరకు సంఘ సంస్కరణ ఉద్యమం గురించి చెప్పేవాళ్ళం. అలాగే స్త్రీలకు ఆస్తి హక్కు లేకపోవడం వలన కుటుంబంలో, సమాజంలో వారి హైన్య పరిస్థితి గురించి చెప్పేవాళ్ళం.

బి.ఎన్. రావు కమిటీ విజయవాడ వచ్చినప్పుడు హిందూ వివాహం – వారసత్వం, దత్తత మున్నగు విషయాలపై స్త్రీల హక్కులు పార్లమెంటు బిల్లులో చేర్చాలని మెమొరాండం సమర్పించాం. హిందూకోడ్ బిల్లు గురించి ఒక పుస్తకం కూడా ప్రచురించాం. భర్త చనిపోతే భార్యకు ఆస్తిపై ఏమీ హక్కు ఉండేదికాదు. బి.ఎన్. రావు కమిటీ బిల్లు వలన మొదటిసారిగా భర్త ఆస్తిపై భార్యకు హక్కు వచ్చింది.

ప్రతీ గ్రామంలో శిక్షణ పొందిన నర్సు ఉండాలనీ, స్త్రీలకు మరుగుదొడ్డి ఉండాలనీ, ప్రతీ నాలుగు గ్రామాలకు ఆస్పత్రి ఉండాలనీ ఆందోళన చేసేవారం. తీర్మానాలు చేసి పంచాయితీకి, ప్రభుత్వానికి పంపడం, కొన్ని కొన్నిచోట్ల చందాలు వసూలుచేసి మరుగుదొడ్లు కట్టించడం కూడా జరిగేది.

## రౌడీల దాడులు - మన ప్రతిఘటన:

1942 ఏప్రిల్‌లో ఒకసారి జిల్లా మహిళా సభ జరుగుతుంటే వితంతు పునర్వివాహం చేసుకుంటామని ఒక జంట వచ్చారు. ఒక ఆశ్రమం ఉంటే అందులో పెళ్ళి జరిపించాం. ఆశ్రమం మైలపడిందని చెప్పి సనాతనులు, ఛాందసులు రౌడీలను తీసుకొచ్చి దాడి చేయించారు. ఆ వివాహం చూడటానికి ఆడమగ, పిల్లాజెల్లా 1200 మంది వరకు వచ్చారు. రౌడీల దాడిలో అందరూ చెల్లాచెదురయ్యారు. తరువాత మన పార్టీ యువకులు వచ్చి, రౌడీలను ప్రతిఘటించి పారద్రోలి, ఎల్లాగైతేనేమి వివాహం జరిపించి, ఆ మరుసటి రోజు సభ పూర్తిచేశాం.

కమ్యూనిస్టు పార్టీకి స్వంత ఆస్తులు అమ్మి యిచ్చేయడం ఒక ఉద్యమంగా పార్టీ చేపట్టినప్పుడు నేను, నా భర్త సుబ్బారావుగారు కలిసి మా యిద్దరి వాటాలు అమ్మి పార్టీకి యిచ్చేశాం. అప్పట్లో మా యిద్దరికి కలిపి నెలకు 20 రూ॥ అలవెన్సు

యిచ్చేవారు. పార్టీ ఆఫీసులోనే ఉండేవాళ్లం. పది రూపాయలు అద్దె, చెరి అయిదు రూపాయలు యిచ్చేవారం. కమ్యూన్‌లో భోజనం పూటకు అర్ధరూపాయి, నెలకు 13 రూపాయలు భోజనానికి అయ్యేది. నేను ఎక్కువ గ్రామాల ప్రచారానికి వెళ్లేదానిని గనుక 13 రూపాయలయ్యేదికాదు. అద్దె, భోజనం ఖర్చులు పోను నెలకు రెండో, మూడో రూపాయలు ఉంచుకొని, బట్టలు కొనుక్కొనేవాళ్ళం. ఏమైనా మిగిలితే పార్టీకే యిచ్చేవాళ్ళం.

పూలదండల పెళ్ళిళ్ళు జరిపేవారం. ఆ రోజుల్లో వాటిని ప్రజలు గాంధీ పెళ్ళిళ్ళు అనేవారు. మంగళ సూత్రాలు లేవు. దండలు మార్చుకోవడం జరిగేది. స్త్రీల మధ్యకు వెళ్ళాలిగనక ఆ తరువాత సూత్రాలు కట్టుకొనేవారు. కమ్యూనిస్టులు భార్యలను తిట్టరు, కొట్టరు, గౌరవంగా చూస్తారు; తాగినా, సెక్స్ తప్పులు చేసినా పార్టీలోంచి తీసివేస్తారు అని ప్రజలలో బాగా వినికిడి అవడం వలన కాంగ్రెస్ కుటుంబాలలోనివారు కూడా కమ్యూనిస్టులకు తమ పిల్లలను యిచ్చివేయాలని ఉవ్విళ్ళూరేవారు. ఎవరైనా భార్యను కొడితే, పార్టీకి రిపోర్టు చేస్తే, వెంటనే ఎంక్వయిరీ పెట్టి క్రమశిక్షణాచర్య తీసుకోవడం జరిగేది.

## మహిళా ఉద్యమ వ్యాప్తి:

మహిళా ఉద్యమాన్ని అన్ని జిల్లాలకు వ్యాపింప చేయాలిగనుక కృష్ణాజిల్లా నుండి బయలుదేరి గుంటూరు, పశ్చిమ గోదావరి, తూర్పు గోదావరి, విశాఖపట్నం, నెల్లూరు, చిత్తూరు, కడప, కర్నూలు జిల్లాలకు ఉద్యమాన్ని వ్యాప్తి చేశాం. గోదావరి జిల్లాల్లో క్షత్రియ కుటుంబాలలో స్త్రీలకు మరీ ఘోషా ఉండేది. పగలు భర్తకు కూడా కనపడకూడదు. భార్యా-భర్త కలిసి సినిమాకు కూడా వెళ్ళకూడదు. అట్టి స్థితిలో సమావేశాలకు అసలే వచ్చేవారు కాదు. అట్టి స్థితిలో భార్యల్ని వెంట బెట్టుకొని సినిమాలకు తీసుకువెళ్ళమని, పుట్టింటికి తీసుకు వెళ్ళేటప్పుడు భర్తలు వెంటబెట్టుకొని తీసుకువెళ్ళవలసిందనీ, సమావేశాలకు తీసుకు రావలసిందనీ పార్టీ సర్క్యులర్లు జారీ చేసేది.

కందుకూరి వీరేశలింగం గారి వర్ధంతులు జరిపి, ఆయన నడిపిన సంఘ సంస్కరణ ఉద్యమాన్ని గురించి చెప్పి, స్త్రీలలో చైతన్యం తీసుకురావడానికి ఎంతో కృషి చేశాం. మూఢ విశ్వాసాలు, అభివృద్ధి నిరోధక సాంఘిక కట్టుబాట్లు తొలగించడానికి ఎంతో ఓపికతో, ఓర్మితో కృషి చేసేవాళ్ళం. కులపట్టింపులు ఎక్కువగా ఉండేవి. వివిధ కులాలకు చెందిన మహిళా కార్యకర్తలకు అందరికీ కలిపి ఒకే చోట భోజనం పెట్టేవారు కాదు. సహపంక్తి భోజనం పెట్టాలని పట్టుబట్టి మరీ అన్ని కులాలతోను భోజనం చేసేవాళ్ళం.

## 25 వేలమంది స్త్రీల సమీకరణ:

1944 అఖిల భారత రైతు మహాసభ విజయవాడలో జరిగినపుడు వేలాది స్త్రీలను సభకు తీసుకు రావడం రాష్ట్ర మహిళా ఉద్యమ చరిత్రలోనే ఒక గొప్ప విషయం. నేను స్త్రీ వాలంటీరు దళ కమాండర్‌గా పనిచేశాను. గ్రామ గ్రామాల

నుండి బళ్ళు కట్టుకొని, మహాసభకు బియ్యం బస్తాలు, బానల కొద్దీ పచ్చళ్ళు పెట్టి పట్టుకొని కుటుంబాలకు కుటుంబాలు మహాసభకు తరలివచ్చారు. మహిళా ఉద్యమం, కమ్యూనిస్టు ఉద్యమం ఆంధ్ర మహిళల్లో – ముఖ్యంగా గ్రామీణ స్త్రీలలో, కార్మిక కర్షక మహిళల్లో తీసుకొని వచ్చిన సాంఘిక రాజకీయ చైతన్యానికి అది ప్రతిబింబం అని చెప్పాలి. తెలుగుజాతి చరిత్రలో 25 వేల మంది స్త్రీలు ఒక సభకు రావడం అంతకుముందు ఎన్నడూ జరగలేదు. వివిధ జిల్లాలకు మహిళా ఉద్యమం విస్తరించిన తరువాత రాష్ట్ర మహిళా సంఘ నిర్మాణం చేయవలసిన అవసరం, సమయం కూడా వచ్చింది. ఈ సందర్భంలో అంతవరకు కాంగ్రెస్ ఆధ్వర్యాన నడుస్తున్న రాష్ట్ర మహిళా సంఘానికీ మన మహిళా సంఘానికీ ఉన్న సంబంధ బాంధవ్యాలు గురించి చెప్పాలి.

శ్రీమతి ఉన్నవ లక్ష్మీబాయమ్మ, శ్రీమతి కొండా పార్వతీదేవి, తదితర కాంగ్రెస్ ప్రముఖ నాయకురాండ్ర ఆధ్వర్యాన ఉన్న రాష్ట్ర మహిళా సంఘం, అఖిల భారత మహిళా సభను కాకినాడలో జరిపింది. జిల్లా రాష్ట్ర మహిళా సంఘంలోనే మన సంఘాల్ని అనుబంధ సంఘాలుగా మార్చుకోవలసిందని కోరాం. వారిది పావలా సభ్యత్వం. మన జిల్లా సంఘాలది అణా సభ్యత్వం. సామాన్య స్త్రీలందరూ (కార్మిక కర్షక మహిళలు) సభ్యులుగా చేరడానికి వీలుగా అణా సభ్యత్వం పెట్టాం. సుమారు ఇరవై రెండువేల సభ్యత్వం మన జిల్లా మహిళా సంఘాలకు ఉంది. 2 వేలమందిని పావలా సభ్యత్వంలో చేర్పించాం. కాకినాడ అఖిల భారత మహిళా మహాసభకు నెహ్రూ సోదరి విజయలక్ష్మి పండిట్ మున్నగు ప్రముఖులందరూ వచ్చారు.

కాని, మన సభ్యత్వాన్ని తీసుకోడానికి గాని, మన సంఘాలను అనుబంధ సంఘాలుగా చేర్చుకోడానికిగాని వారు అంగీకరించలేదు. కనీసం 2వేల మంది పావలా సభ్యత్వాన్నైనా చేర్చుకొని వారి తరఫున ప్రతినిధులకు ప్రవేశం కల్పించాలని కోరాం. దానికీ అంగీకరించలేదు. శ్రీమతి కొండా పార్వతి గారు మన తరఫున కొంత ప్రయత్నం చేశారుగాని అదీ నెరవేరలేదు. డాక్టర్ అచ్చమాంబగారు మన సంఘంలో ప్రధాన బాధ్యత స్థానంలో ఉన్నారు. ఆమె ద్వారా చేసిన ప్రయత్నం కూడా ఫలించలేదు. ఆ విధంగా కాంగ్రెస్, కమ్యూనిస్టు భావాలుగల మహిళా సంఘాలను సమైక్యంగా నడిపించడానికి మనం చేసిన ప్రయత్నం విఫలమైంది. 'ఇది పేద వాళ్ళకు సంబంధించిన సంఘం. వీళ్ళను అనుబంధ సంఘంగా చేర్చుకొన్న కొలదీ కూలినాలి వాళ్ళందర్నీ తీసుకొచ్చి కూర్చోబెడతారు' అన్నది వాళ్ళ భయం. చివరికి సమైక్య మహిళా ఉద్యమ నిర్మాణానికి చేసిన యత్నం విఫలమైంది.

## రాష్ట్ర మహిళాసంఘ స్థాపన:

ఆ తరువాత గుంటూరు జిల్లా చిలువూరులో మన జిల్లా మహిళా సంఘాన్ని స్థాపించాం. డాక్టర్ అచ్చమాంబగారు అధ్యక్షురాలిగా, నేను ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాం. ఇంచుమించు అన్ని జిల్లాల్లోను బలమైన మహిళా సంఘాలను ఏర్పరిచాం. గ్రామ స్థాయి వరకు మన మహిళా సంఘ శాఖల్ని పటిష్టంగా నిర్మాణం చేయడం జరిగింది.

1947లో స్వాతంత్ర్యం వచ్చింది. స్వాతంత్ర్య దినోత్సవాలను జరుపుకున్నాం. తెలంగాణా సాయుధ పోరాటాన్ని, నైజాం నిరంకుశ ప్రభుత్వానికి వ్యతిరేకంగా కమ్యూనిస్టు పార్టీ నిర్వహిస్తుంది. ఆ పోరాటాన్ని ఆంధ్రా ప్రాంతానికి విస్తరింప చేయాలని, నెహ్రూ ప్రభుత్వానికి వ్యతిరేకంగా సాయుధ పోరాటాన్ని సాగించాలని కమ్యూనిస్టు పార్టీ నిర్ణయం తీసుకుంది. దీనితో తీవ్ర నిర్బంధ విధానం ప్రారంభమైంది. మద్రాసు ప్రకాశం మంత్రివర్గం ఆర్డినెన్సు జారీ చేసింది. కమ్యూనిస్టు పార్టీ నిషేధానికి గురైంది. ప్రజాశక్తి దినపత్రిక ఆఫీసు మీద దాడి, అరెస్టులు తీవ్రం అయ్యాయి.

### అరెస్టులు, డిటెన్షన్‌లు:

రాష్ట్ర మహిళా సంఘం తరఫున ప్రచురించుతున్న "ఆంధ్ర వనిత" పత్రిక ప్రజాశక్తి ప్రెస్‌లో అచ్చవుతుంది. ఆ పత్రికను కూడా ఆపివేశారు. 'పత్రికను ఆపడానికి వీల్లేదు' అని వూరేగింపుగా బయలుదేరాం. 144వ సెక్షన్ విధించారు. 144వ సెక్షన్ ధిక్కరించి, 1000 మంది స్త్రీలతో వూరేగింపు జరిపాం. మా మీద బాష్పవాయువు ప్రయోగించారు. మమ్మల్ని 80 మందిని అరెస్టు చేసి నందిగామ, ఏలూరు సబ్‌జైళ్ళలో పెట్టారు. చివరకు నన్ను, అచ్చమాంబగారిని డిటెయిన్ చేసి రాయవెల్లూరు జైలులో నిర్బంధించారు. జైలులో కనీస సౌకర్యాల కోసం అనేక పోరాటాలు చేశాం. ఒకసారి 15 రోజులు, మరోసారి ఇరవై రోజులు నిరాహారదీక్షలు చేశాం. మా అత్తగారు బుల్లెమ్మ గారికి జబ్బు చేసినందున, 1949లో పెరోల్‌పై విడుదల చేసి, మద్రాసులో నన్ను ఇంటర్న్ చేశారు. బెజవాడలో ప్రజాశక్తి కార్యాలయం, రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ కార్యాలయంలో పనిచేసే కామ్రేడ్స్‌కు రాష్ట్ర కేంద్రానికి వచ్చిపోయేవారికి కమ్యూన్ ఉండేది. ఆ కమ్యూన్ బాధ్యత అంతా బుల్లెమ్మగారు నిర్వహించేవారు. ఆ రోజుల్లో అది ఆదర్శవంతంగా నడుపబడుతూండేదని పేరు పొందింది. అందర్ని ఆమెగారు స్వంత బిడ్డల్లాగా చూసుకొనేది. గోర్కీ నవలలో "అమ్మ" అని ఆమెను పిలిచేవారు.

★ ★ ★

# శ్రీమతి బ్రిజిరాణి గౌడ్



హైదరాబాద్‌లో చాలా వెనుకబడిన కుటుంబం మాది. చిన్నతనంలోనే నాకు పెళ్ళి చేశారు. అత్తవారింట నన్ను చాలా బాధలు పెట్టారు. అత్తగారు, భర్త నన్ను కొట్టడం, తిట్టడం, హింసించడం చాలా చేశారు. ఈ బాధలు తట్టుకోలేక చివరకు నేను యింట్లోంచి వెళ్ళిపోయాను. అప్పటికే నాకు యిద్దరు పిల్లలు పుట్టారు. వాళ్ళను మా చిన్నమ్మ కుమారుడు శివప్రసాద్ దగ్గర వదలిపెట్టాను. కాని నాకు ఎక్కడకు పోవాలో తెలియలేదు. రుక్మిణి అనే స్నేహితురాలు వుండేది. ఆమె తల్లి మహిళామండలిలో చీపురు పనిచేసేది. ఆమె ద్వారా మహిళా మండలివారు నాకు చాలా సహాయం చేశారు. ఒక సోషల్ వర్కర్‌గా నేను అభివృద్ధి చెందాను. కొంత చదువు కూడా నేర్చారు. మహిళా మండలిలో ప్రమీలా బెన్, యశోదా బెన్ మొదలైనవారు పనిచేస్తుండేవారు. వారు నాకు పరిచయం అయ్యారు. చాలా సహాయం చేశారు. సాంఘిక సేవా కార్యక్రమాల్లో తర్ఫీదు యిచ్చారు. గ్రామాలలో కూడా నేను పనిచేస్తుండేదాన్ని. అప్పుడు నాకు కమ్యూనిస్టు పార్టీతో సంబంధం ఏర్పడింది. వీరందరికి మొదటి నుండి కమ్యూనిస్టు పార్టీతో సంబంధాలు వుండేవి. కమ్యూనిస్టు పార్టీ మహిళా యూనిట్‌లో మహిళా నవజీవన మండలి, ఆంధ్ర యువతీ మండలి మొదలైనవి పనిచేస్తుండేవి. తెలుగు భాష మాట్లాడటం అలవరచుకొనేవాళ్లం. ఆరుట్ల కమలాదేవి, నిమ్మగడ్డ సత్యవతి మున్నగువారితో నాకు పరిచయాలు ఏర్పడ్డాయి.

నేను ఒక స్కూల్లో హిందీ టీచరుగా ఉద్యోగం చేస్తూ పార్టీలో కూడా పనిచేస్తుండేదాన్ని. తెలంగాణా పోరాటం ప్రారంభమైంది. పోరాటంలో కామ్రేడ్స్ గాయపడి వస్తుంటే వారికి చికిత్స చేయడం ఆరోగ్యం కాపాడటం మున్నగు కార్యక్రమాలు నిర్వహించేవాళ్ళం. కమ్యూనిస్టు పార్టీ పత్రికలను అమ్మేవారం. స్టేట్ కాంగ్రెస్ మహాసభలో పాల్గొన్నాను. నైజాం నవాబు పరిపాలనను కూలద్రోసి హైదరాబాద్ సంస్థానాన్ని విడగొట్టి, తెలుగు ప్రజలనందరిని ఏకం చేయాలనే ఉద్యమం ప్రారంభం అయింది. వెట్టి చాకిరీకి వ్యతిరేకంగా, జాగీర్దారీ విధానానికి వ్యతిరేకంగా ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీల నాయకత్వాన చివరకు సాయుధ పోరాటం ప్రారంభం అయింది.

రజాకార్ దురంతాలు మితిమీరిపోయాయి. ఈ దుండగాలకు వ్యతిరేకంగా ఆయుధాలు చేపట్టడం జరిగింది. ధూబేపేటలో నివసిస్తున్న మా తల్లిగారి దగ్గర వుంటున్నాను. నేను పనిచేసే స్కూలులో యువతీ యువకులను రజాకార్ దుండగాలను ఎదుర్కొనడానికి దళాలుగా తయారుచేశాను. రాత్రింబవళ్ళు ఈ దళాలు కాపలాలు కాచేవాళ్ళు. ఈలోగా అగస్టు 15న భారత స్వాతంత్ర్యదినం వచ్చింది. ఎలాగైనా జాతీయ జండా ఎగురవేయాలి. ఘోషా స్కూలులో జాతీయ జండా ఎగురవేయాలని నిశ్చయం చేసుకున్నాం. ఎక్కడవాళ్ళు అక్కడ జాతీయజండా ఎగురవేయాలని పార్టీ నిర్ణయించింది. బస్తీకి బస్తీకి ఆగస్టు 15న స్వాతంత్ర్యం గురించి ముగ్గులు వేయించాం. పూలు చల్లించాం. జైజై ధ్వానాలతో ఆగస్టు 15న స్వాతంత్ర్య దినం జరిపాం. నేను ఘోషాపేట హైస్కూలులో జాతీయ జండా ఆవిష్కరించాను. దీనితో రజాకార్ దాడులు, పోలీసు దాడులు వచ్చాయి. ధూబేపేటలో ఉద్రిక్త వాతావరణం ఏర్పడింది. శ్రీ రామానందతీర్థ, మేల్కోటే, యశోదాబెన్ మొదలైనవారు సుల్తాన్ బజారులో జాతీయ జండా ఎగురవేశారు. స్వామీజీని అరెస్టు చేశారు. మమ్మల్ని బన్సీలాల్ స్కూల్లో సోషలిస్టు గ్రూపువాళ్ళు తీసుకెళ్ళి ఆశ్రయమిచ్చారు. తరువాత బేగంబజారులో జాతీయ జండా ఎగురవేయడానికి వెళ్ళినప్పుడు పోలీసులు ప్రజలపై లాఠీదెబ్బలు కొడుతుంటే వారిని ఎదుర్కొని నేను పోలీసులను కొట్టాను. ఇది పేపర్లో కూడా వచ్చింది. ఈ పెనుగులాటలో లాఠీ దెబ్బలకు స్పృహతప్పి పడిపోయాను. తరువాత పోలీసుస్టేషన్‌లో నానా దుర్భాషలాడారు. నన్ను కూడా అరెస్టు చేశారు. ఆరు నెలలు జైలులో వున్నాను. జైలులో చాలా బాధలు అనుభవించాను. విడుదల అయిన తరువాత అజ్ఞాతవాసంలోకి వెళ్ళిపోయాను. రహస్య జీవిత కాలంలోనే రాజబహదూర్‌గౌడ్ గారితో పరిచయం అయింది. చివరకు 1947లో మేమిద్దరం పెండ్లి చేసుకున్నాం. నాకే కాదు – ప్రేమలతకు మా చెల్లెలు అందరికీ కమ్యూనిస్టు పార్టీయే వివాహాలు చేసింది. నాకు మొదటి వివాహం జరిగిన సంగతి, పిల్లలున్న సంగతి గౌడ్‌గారికి తెలుసును. అయినప్పటికి ఆయన నన్ను చేసుకున్నారు. గౌడ్‌గారి కుటుంబం కూడా నన్ను ఎంతో మర్యాదగా చూస్తారు. ఈ రహస్య కాలంలోనే నేను గర్భవతినయ్యాను. మామరా పుట్టింది. ముస్లిమ్ కామ్రేడ్స్ ఎంతో సహాయం చేశారు – కైఫీ అజ్మీ, శబ్నా అజ్మీ, వారి కుటుంబం, అమీనాథ్‌గే కుటుంబం మొదలైనవారు.

తెలంగాణా సాయుధ పోరాటం విరమించిన తరువాత నేను మహిళా సంఘాల కార్యక్రమంలో పనిచేశాను. బస్తీలలో వుండే పేద మహిళలను సంఘటితపరచి వారికి కుట్టుమిషను పని మొదలైన వృత్తులు నేర్పి, ఇతర స్త్రీ సంక్షేమ కార్యక్రమాలు తీసుకుని పనిచేశాం. రమీజాబీను పోలీసుస్టేషన్‌లో ఆగం చేసినప్పుడు ఆ సమస్యపై మహిళా సంఘాల ద్వారా తీవ్ర ఆందోళన చేశాం.

★ ★ ★

# కీ.శే. ప్రమీలా తాయ్ మహేంద్ర



మా తండ్రిగారు వైద్యనిపుణులు. అయితే నా బాల్యంలో ఆయన సన్యాసాశ్రమం స్వీకరించి ఇల్లు విడిచి వెళ్ళిపోయారు. మా అమ్మగారు నన్ను, నాకన్నా చిన్నవాడైన తమ్ముణ్ణి అనాధాశ్రమంలో విడిచిపెట్టారు. నేను సంపాదనకోసం నర్సుగా శిక్షణ పొందాను. అనాధాశ్రమంలో గడిపిన జీవితం నాపై మానసికంగా తీవ్ర ప్రభావాన్ని చూపింది. అక్కడ ఎంతో దురవస్థను చవి చూశాను.

నా విద్యాభ్యాసం బొంబాయిలో గడిచింది. ఇరవైవ దశకం చివరిలో బొంబాయిలో మత ఘర్షణలు సంభవించాయి. ఆ సందర్భంగా జతిన్‌దాస్ నిరవధిక నిరాహారదీక్ష చేపట్టి మరణించారు. అప్పుడు నేను ఎనిమిదో తరగతి విద్యార్థిని. విద్యార్థులందర్నీ తరగతులనుంచి బయటకు తీసుకొచ్చి, పాఠశాలలో ప్రదర్శన జరపడంలో నేను చొరవ తీసుకున్నాను. పూర్తి సమ్మె చేశాం. ఇది నాలో బ్రిటిష్ వ్యతిరేక భావనలు చోటు చేసుకోవడానికి, స్వాతంత్ర్య కాంక్ష పాదుకొల్పడానికి మూలమైంది.

మేం బొంబాయి నుండి సంఘీకి మకాం మార్చాం. ఒకరోజున కృష్ణానది బ్రిడ్జిపై ఒక బ్రిటిష్ అధికారిని కాల్చి చంపారు. అవును, ఇది బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా పోరాడాలన్న మరింత స్థిరమైన కాంక్షను ఉద్భవింపచేసింది.

మెట్రిక్యులేషన్ విద్యపూర్తి చేసిన తరువాత ఉపాధి కోసం ఉద్యోగంలోకి ప్రవేశించాను. నిజాం రాష్ట్రంలోని ఔరంగాబాద్ జిల్లాలో ఒక పాఠశాల ఉపాధ్యాయినిగా నియమించబడ్డాను. అక్కడే నేను గోవిందదాస్ ష్రాఫ్, ఎ.డి. దేశ్

పాండే, చంద్రగుప్త చౌదరీ, వైశంపాయణలతో కూడిన రాజకీయ గ్రూప్‌లో చేరాను. సోషలిజం భావనలను పెంపొందించుకున్నాను.

కొర్ది మాసాల తరువాత హైదరాబాద్‌లోని బన్సీలాల్ బాలికా విద్యాలయ ప్రధానోపాధ్యాయినిగా నియమించారు. అది మొట్టమొదటి హిందూ బాలికల ఉన్నత పాఠశాల. స్వాతంత్ర్యం కోసం పోరాటం జరిపేవారి చిహ్నంగా నిలిచిన ఖద్దరునే నేను ఎప్పుడూ ధరించాను. మరాట్వాడా జిల్లాలోని ఒక పాఠశాలలో బహుమతి ప్రదానోత్సవానికి నన్ను ఆహ్వానించారు. నేను అక్కడకు వెళుతున్నప్పుడు నాతోపాటు సిరాజు హుస్సేన్ తిర్‌మిజా అనే కాంగ్రెస్ నాయకుడు కూడా ప్రయాణం చేశాడు. ఆ సమావేశంలో ఆయనపై చెప్పులు పడ్డాయి.

1942లో కాంగ్రెస్ నాయకులు అరెస్టు అయ్యారు. అప్పుడు పాఠశాలలో నిరసన సమావేశం నిర్వహించాను. తరగతులు రద్దుచేసి పాఠశాల మూసివేశాను. అలా చేసినందుకు పాఠశాల యజమాని, వ్యాపారవేత్త అయిన పామాలాల్ పితి నన్ను ప్రశ్నించారు. "ఏ చర్యకైనా నేను పూర్తి బాధ్యత వహిస్తాను మీరు కంగారు చెందాల్సిన పనిలేదు" అని సమాధానమిచ్చాను.

1939లో గాంధీజీ వ్యష్టి సత్యాగ్రహం ప్రారంభించారు. ఈ సందర్భంగా డా॥ అధికారి ఒక వ్యాసం రాశాడు. సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఒక జాతీయ ఫ్రంట్‌ను రూపొందించాలి; కార్మికులు, రైతులు, విద్యార్థులు, మహిళలతో ప్రజా పోరాటాన్ని నిర్వహించాలని సూచించారు. అణచివేతకు గురైనవారి కోసమూ, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగానూ నిలబడే పార్టీ ఇదేనని నేను అభిప్రాయపడ్డాను. కమ్యూనిస్టు పార్టీ మాత్రమే రక్షణ కల్పించగలదని విశ్వసించాను.

నగరంలోని మహారాష్ట్ర పరిషత్‌లో చేరాను. హైదరాబాద్ నగర కమిటీ కార్యదర్శి ఝక్రీతోనూ, ఆర్. డి. దేశ్ పాండేతోనూ సన్నిహిత సంబంధాలను నెలకొల్పుకొన్నాను. పార్టీతో సభ్యత్వం స్వీకరించాను.

పార్టీలో చేరిన తరువాత, ప్రావిన్షియల్ కమిటీ ఆర్గనైజర్ కామ్రేడ్ ఎస్.వి.కె. ప్రసాద్ మా ఇంటిలో ఉన్నారు. ఆయన వద్ద పార్టీ సాహిత్యం ఉండేది. వాటిని ఇతరులకు ఇవ్వనని చెప్పారు. దాన్ని నేను చదివేదాన్ని. నా అవగాహనను పెంపొందించుకొన్నాను. పార్టీ హైదరాబాద్ నగర కమిటీలో సభ్యత్వం పొందాను. కామ్రేడ్ ముఖ్దూం, కామ్రేడ్ రాజ్ తదితరులతో పరిచయం పెంచుకొన్నాను.

యుద్ధకాలంలో రేషన్ విధానాన్ని ప్రవేశపెట్టారు. ఆ కమిటీకి యువరాజు దుర్రేశ్వర్ ఛైర్మన్‌గా వ్యవహరించారు. ప్రజలతో సంబంధాలు పెంచుకోవటానికి దాన్ని నేను బాగా ఉపయోగించుకున్నాను. మా పాఠశాలలోని ఉపాధ్యాయులను, విద్యార్థులను సమీకరించి, రెండు రోజులలో రేషన్ కార్డులను పంపిణీ చేశాను. ఆహార కమిటీ కార్యదర్శిగా నియమించబడ్డాను.

విమాన దాడుల ముందు జాగ్రత్తల శిక్షణ (ఎయిర్ రైడ్ ప్రికాషన్)లో చేరాను. దళాలను ఏర్పాటు చేశాను. యువరాజులతో పరిచయం పెంచుకున్నాను. అప్పుడు

వారు వీటిపట్ల చాలా ఆసక్తి కనపరిచేవారు. స్థానిక ప్రజలతో నిత్య సంబంధాలు పెట్టుకొనే అవకాశం కలిగింది. దీనివల్ల ఇది నాకెంతో దోహదం చేసింది. ఎందుకంటే నేను బయటనుంచి వచ్చినదానిని కదా!

వివేక వర్ధని కాలేజి, నిజాం కాలేజి, ఇతర విద్యా సంస్థలలో విద్యార్థినుల సంఘాలను ఏర్పాటు చేశాను. ఐ.ఎన్.ఎ. తిరుగుబాటు సందర్భంగా వివేకవర్ధని విద్యార్థులు సమ్మె చేశారు.

ఈ సందర్భంగా జరిగిన ఊరేగింపులో బాలికలు పాల్గొనకుండా చేసేందుకు యాజమాన్యం గేట్లు మూసివేసింది. నా సలహా మేరకు బాలికలు గోడలు దూకి ఊరేగింపులో చేరారు.

ఈ సమయంలోనే మహిళా నవజీవన్ మండలిలో పనిచేయడం ప్రారంభించాను. ఇది ఒక మహిళా సంఘం. ఇందులో హిందీ, మరాఠీ, గుజరాతీ భాషలు మాట్లాడేవారు సభ్యులు. మేం మహిళా సమస్యలను చేపట్టాం. నిత్యదరిద్రంతో వున్న మహిళల పునరావాసానికి ఎంతో సహాయం చేశాం. ఈ వేదిక నుంచి మేం పార్టీ విధానాన్ని ప్రచారం చేయలేదు. ఐతే, జాతీయ సమస్యలను లేవనెత్తాం. ఈ మండలి వ్యవహారాలకు సంబంధించి నేను బయటికి వెళ్ళేటప్పుడు పార్టీ సాహిత్యాన్ని కూడా తీసుకువెళుతూ వుండేదాన్ని. సాధ్యమైనచోట అమ్మేదాన్ని. యశోదాబెన్, సర్జూబెన్, నేను ఆనాడు మండలిలో పనిచేస్తూ వుండేవారం. కామ్రేడ్స్ ఆరుట్ల కమలాదేవి, నిమ్మగడ్డ సత్యవతి ఆంధ్ర మహిళా సభలో పనిచేస్తూ వుండేవారు. మేం ఈ సంఘాల పనిని సమన్వయం చేసేవాళ్ళం. అలాగే ఇండియన్ వుమెన్స్ కాన్ఫరెన్స్ (భారత్ మహిళా సభ) పనిని కూడా సమన్వయం చేసేవాళ్ళం. ఉమ్మడి సమస్యలపై ఇది జరిగేది. ఆకునూరు, మాచిరెడ్డిపల్లె మహిళలపై జరిగిన పోలీసు అత్యాచారాలకు వ్యతిరేకంగా మేం ఒక కమిటీని ఏర్పాటు చేశాం. ఈ సమస్యపై అఖిల భారత ఆందోళన నిర్వహించాం. ఆ విధంగా పార్టీ పనిని ప్రజా సంఘాల పనితో మేళవించాం. వివిధ రకాల అభిప్రాయాలు గల మహిళలు ఈ ప్రజా సంఘాలలో వుండేవారు. ప్రజా సంఘాల ఐక్యత ఏమాత్రం చెడకుండా మా కార్యకలాపాలను నిర్వహించాం.

1946 అక్టోబరులో పార్టీని నిషేధించారు. వారెంట్లు జారీ చేశారు. హైదరాబాద్ సిటీ కమిటి సలహా మేరకు నేను అజ్ఞాతంలోకి వెళ్ళిపోయాను. కామ్రేడ్ రాజ్, కామ్రేడ్ జావెద్‌ల అరెస్టులు తరువాత కామ్రేడ్ మహేంద్ర కార్యదర్శి అయ్యారు. ఆయనకు చాలా మంది తెలియదు. నేను డెన్‌లు ఏర్పాటు చేశాను. మేం అక్కడే వుండేవాళ్లం. ఉస్మానియా ఆసుపత్రికి కామ్రేడ్ రాజ్‌ను, కామ్రేడ్ జావెద్‌ను ఖైదీలుగా తీసుకువచ్చినప్పుడు వారు తప్పించుకున్నారు. వారిద్దర్ని వేరేచోటుకు పంపించడంలో నేను సహాయం చేశాను. ఆరోజు బాగా అమలులో వున్న పరదా పద్ధతిని మేం పూర్తిగా వినియోగించుకున్నాం. నేను కారులో ఉండి పరదా కట్టించేదాన్ని. దాని ద్వారా అజ్ఞాతంలో వున్న కామ్రేడ్స్‌ను, ఆయుధాలను రవాణా చేసేవాళ్ళం. వేరేచోటుకు పంపించేంత వరకు నాకు తెలిసిన వారి ఇంట్లో ఆయుధాలు, మందుగుండు సామగ్రి దాచేదాన్ని. మా డెన్‌లో కామ్రేడ్ పి. సుందరయ్య నాల్గుమాసాలు

వున్నారు. జైలు నుంచి తప్పించుకున్న కామ్రేడ్ అమృత్‌లాల్‌షాతో సహా పలువురు కామ్రేడ్స్ కొంతకాలం మా డెన్‌లో వున్నారు. ఒక ప్రమాదంలో కామ్రేడ్ ఆరుట్ల రామచంద్రారెడ్డికి బుల్లెట్ గాయాలు తగిలాయి. ఆయన నాలుగు మాసాలు మా డెన్‌లో వున్నారు. నేనే సేవ చేశాను. మరో కామ్రేడ్ రామచంద్రారెడ్డిని ఎలుగుబంటి గాయపరిచింది. ఆయన మూడు మాసాలపాటు మాతో వున్నారు. నేను సేవ చేస్తుండేదాన్ని. కామ్రేడ్ మహేంద్రకు హైదరాబాద్ సిటీ పరిచయం లేదు. నేను వెంట వెళ్ళి, స్వామి రామానందతీర్థ, గోవిందదాస్ ష్రాఫ్, దిగంబరరావు బిందూ ఇతర కాంగ్రెస్ నాయకులను కలిపించాను. వారంతా అప్పుడు అజ్ఞాతంలో ఉండేవారు. అజ్ఞాత కాలంలో నాకు అప్పగించిన బాధ్యతలను నెరవేర్చాను. 1947లో కామ్రేడ్ మహేంద్రను వివాహం చేసుకున్నాను.

★ ★ ★

# శ్రీమతి మల్లు స్వరాజ్యం



మాది భూస్వామ్య కుటుంబం. పెద్ద జాగీర్దార్లను, భూస్వాములను అనుకరించి, వారివలెనే ధనం, అధికారం పెంచుకోవాలనే పోటీ వుండేది. ఇలా వుండగా ఆంధ్ర మహాసభ ఉద్యమం వచ్చింది. మా అన్నగారు బి.ఎన్. (భీమిరెడ్డి నరసింహారెడ్డి) నల్లగొండలో పదవ తరగతి చదువుతూ భారత జాతీయోద్యమంతో ప్రభావితులైనారు. నైజాం నవాబుకు, జాగీర్దార్లకు వ్యతిరేకంగా మనం పోరాడాలని చెబుతూ వుండేవారు. మా తండ్రిగారు మా చిన్నతనంలోనే మరణించారు. నాకు అప్పటికి పదకొండేళ్ళు. మా కుటుంబాల్లో విపరీత ఘోషా వుండేది. గాజులు వేయించుకోవాలంటే తెరచాటున వుండి చేయిచ్చి మా అమ్మ గాజులు వేయించుకొనేదట. అలాగే బట్టలు ఉతికే చాకలికి కూడా కనబడకూడదు. మా తండ్రిగారు బ్రతికి వుండగా మా అన్నయ్యకు, నాకు కూడా గుర్రపుస్వారీ, కత్తి యుద్ధం, ఈత యీదడం నేర్పేవారు. మా అక్కకు, నాకు కూడా నాల్గయిదు తరగతులవరకు చదువు చెప్పించారు.

మా అన్నగారికి ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీలతో సంబంధం ఏర్పడింది. 1943లో నన్ను రాజకీయ క్లాసులకు బెజవాడ పంపించారు. రెండవ ప్రపంచ యుద్ధపు రోజులు. జపాను దండయాత్ర ప్రమాదం ఏర్పడిన దృష్ట్యా రాజకీయ క్లాసుల్లో ఆత్మరక్షణ ఉపాయాలు, ప్రథమ చికిత్స మున్నగునవి నేర్పారు. ఆ రోజుల్లోనే గోర్కీ అమ్మ నవల చదివాను. మా అమ్మగారికి చదివి వినిపించేదాన్ని. ఘోషా పద్ధతి నిర్మూలన; స్త్రీ, పురుష సమానత్వం మున్నగు సంఘ సంస్కరణ భావాలు మాకు అలవడినాయి.

మా బంధువుల్లో ఒకమ్మాయిని వృద్ధునికిచ్చి వివాహం జరుపదలిస్తే ఆ వివాహాన్ని మాన్పించడానికి ఆమెను తీసుకుపోయి మరోచోట దాచిపెట్టి, ఎలాగో అలాగా ఆ పెళ్ళి అడ్డం కొట్టడానికి ప్రయత్నించాం. కాని, మా ప్రయత్నాలు ఫలించలేదు. ఆ అమ్మాయిని బలవంతంగా తీసుకుపోయి ఆ వృద్ధునికే యిచ్చి పెళ్ళి చేశారు. గురజాడ అప్పారావుగారి పూర్ణమ్మ పాట బాగా ప్రచారం చేసేవాళ్ళం. భీమునిగూడెం అనే గ్రామంలో ఇటువంటి ఘటనే ఒకటి జరిగింది. ఒక బ్రాహ్మణ బాలికను వృద్ధునికిచ్చి చేస్తుంటే - ఆ అమ్మాయిని బెజవాడ పంపించి, ఆ పెళ్ళి జరగకుండా చేశాం. ఆ తరువాత ఆ అమ్మాయి మన ఉద్యమంలోకి వచ్చింది. ఆంధ్రలో వ్యాప్తిలోకి వచ్చిన మహిళా ఉద్యమ ప్రభావం మామీద ఎక్కువగా వుండేది. బాల్యవివాహాలకు వ్యతిరేకంగా, వితంతు పునర్వివాహాలకు అనుకూలంగా ప్రచారం చేసేవాళ్ళం.

తెలంగాణా ప్రాంతంలో ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీల ఆధ్వర్యాన వెట్టి చాకిరికీ వ్యతిరేకంగా పోరాటం ప్రారంభమైంది. మా గ్రామంలో కూడా ఉద్యమం బాగా వ్యాపించింది. పోలీసుదాడులు మొదలయ్యాయి. కూలీరేట్ల పెంపుదలకు వ్యవసాయ కూలీల సమ్మె చేయించాం. ఇదే సమయంలో జరిగిన చాకలి ఐలమ్మ భూమిపోరాటం చరిత్రాత్మకమైనది. విసునూరు దేశముఖుల దౌర్జన్యాలు, క్రూర పరిపాలనకు వ్యతిరేకంగా పాటలు బాగా పాడి ప్రచారం చేసేవాళ్లం. పోరాటం ఉధృతమైంది. ఈ సమయంలో చాలామంది స్త్రీలను బెజవాడ పంపించి, ప్రథమ చికిత్స, ప్రసూతి, శిశుపోషణ నేర్పించాం.

నేను ఆంధ్రా ప్రాంతంలో చాలా సభలలో తెలంగాణా పోరాటం గురించి విస్తృతంగా ప్రచారం చేశాను. విరాళాలు పెద్దయెత్తున పోగుచేశాం. అప్పుడు నాకు 14 యేళ్ళు మాత్రమే. నా ఉపన్యాసాలు విని నేను బి.ఎ. వరకు చదివాను అని అనుకునేవారట. నన్ను ఆంధ్రా ప్రజలు "ముద్దుబిడ్డ" అని పిలిచేవారు. నా ఉపన్యాసంలో తెలంగాణాలో జరుగుతున్న ఘోర దురంతాలు; అకునూరు. మాచిరెడ్డిపల్లి ఘోర దురంతాలు చెబుతుంటే సభలోని ప్రజలు ఉద్రేకంతో ఊగిపోయేవారు.

తెలంగాణా సాయుధ పోరాటం ఉధృతస్థాయినందుకొని, లక్షల ఎకరాల భూమిని పంచి, గ్రామ రాజ్యాలు ఏర్పరచే దశ వచ్చింది. ఈ గ్రామ రాజ్యాల నిర్వహణ, సాంఘిక సమస్యల పరిష్కారం, వైద్య సౌకర్యాలు కల్గించడం, లెవీధాన్యం గ్రామం నుండి పోకుండా చేయడం మున్నగు కార్యక్రమాలు నిర్వహించేవాళ్ళం. స్త్రీలు కూడా సాయుధ దళాల్లోకి వచ్చి, ఎంతో ధైర్య సాహసాలతో పోరాడారు. రాములమ్మ వారిలో చెప్పుకోదగింది. రాములమ్మ దళం చాలా ప్రఖ్యాతి పొందింది. భర్త ముందు

పోరాటంలోకి వచ్చాడు. తరువాత వెనక్కి పోయాడు. రాములమ్మ భర్తకు విడాకులు యిచ్చి పోరాటంలో ముందంజ వేసింది. స్త్రీలను గెరిల్లా దళాల్లోకి తీసుకోవాలా? వద్దా? అన్న చర్చ కొన్నాళ్ళు సాగించి, చివరకు పార్టీ అంగీకరించింది. చాలామందిమి దళాల్లో పాల్గొన్నాం. పోలీసు నిర్బంధాలు, రజాకార్ల దాడులను ఎదుర్కొంటూ అనేక గ్రామాల్లో మేము సభలు, సమావేశాలు జరిపాం. స్త్రీలలో ఎంతో చైతన్యం తీసుకురాగల్గాం. సంఘ సంస్కరణ ఉద్యమం కూడా సాగించాం. పోరాట విరమణ అనంతరం పోరాటంలో పాల్గొన్న స్త్రీలకు అనేక ఆర్థిక, సాంఘిక సమస్యలు వచ్చాయి. పురుషులకంటే స్త్రీలకే ఎక్కువ సమస్యలు వచ్చాయి. వివాహ సమస్యలు, వారసత్వ సమస్యలు, బిడ్డల పెంపకం, చదువులు, ఉద్యోగాలు, పురుషాధిక్యం మొదలైన అనేక సమస్యలు వచ్చాయి. వరకట్నం, సాంఘిక దురాచారాల సమస్యలు తీవ్రం అయ్యాయి. నేడు స్త్రీలపై అత్యాచారాలు ఎక్కువయ్యాయి. దారిద్ర్య సమస్యలు సరేసరి. సామాజిక పరిస్థితులు మారాలి. అప్పుడుగాని స్త్రీ విముక్తి సాధ్యం కాదు.

★ ★ ★

# శ్రీమతి కమలమ్మ



నేను వరంగల్ జిల్లా మానుకోట తాలూకా మైనాల గ్రామంలో పుట్టాను. మా అత్తగారిది రాంపురం. మాది ఒక బానిస కుటుంబం. నా జీవితం గురించి చెప్పాలంటే చాలా బాధ వేస్తుంది. మా తల్లి కట్టు బానిసగా దొరల యిళ్ళల్లో బ్రతికేది. మా తల్లి, ఆమె తల్లి, ఆమె తల్లి – మూడు తరాలు ఇటువంటి బానిస జీవితం గడిపారు. వాళ్ళకు పెళ్ళిళ్ళు వుండవు. మా తల్లి వాళ్ళది తెలగాలకులం. వెనుక ఎప్పుడో తిండికి కరువు వచ్చి మా అమ్మమ్మ మా తల్లిని ఒక సోలెడు బియ్యం, ఒక రూపాయికి ఒక బ్రాహ్మణ కుటుంబానికి అమ్ముకొని పోయింది. ఆ బ్రాహ్మణ కుటుంబం దొరల కుటుంబం. (పట్వారీ కుటుంబం.) పట్వారీ కుటుంబంలో దొరలే మా అమ్మమ్మను, ఆమె తల్లిని వుంచుకొనేవారు. అలాగే మా తల్లికి వయసు రాగానే ఈ బ్రాహ్మణ కుటుంబంలో ఒక దొర మా అమ్మకు కన్నెరికం చేసి వుంచుకొన్నారు. ఆయనకు నేను జన్మించాను. మా అమ్మ 14 మందిని కన్నది. అయితే, మేము అయిదుగురం మాత్రం బ్రతికాము. కట్టుబానిసలైనా ఇటువంటి

ఆడపాపలను రజస్వల అయితే ఎవరూ వుంచుకొనే వారుకాదు. రజస్వల అయితే ఇది ఎంతమందితో "తప్పు" చేసిందో అని ఎవరూ చేరదీసేవారు కాదు. నాకు ఒక అక్క వుండేది. మా పెదనాయనగారి మేనల్లుడు ఆమె కన్నెరికాన్ని చెడగొట్టాడు. గర్భవతి అయింది. ఆమెను తాను వుంచుకోలేదు. ఎవరూ చేరదీయలేదు. ఆమె చివరకు చనిపోయింది. ఆనాటి పరిస్థితులు అలా వుండేవి. అసలే ఆడ బానిసత్వం. ఆడ బానిసత్వంలో కూడా పవిత్రత చూసేవారన్నమాట! కన్నెరికం చేసినవాడే తప్ప యితరులు వుంచుకొనేవారు కాదు. అందుచే నాకు ఎనిమిదవ ఏటనే, రజస్వల కాకముందే పెండ్లి చేసేశారు. నా భర్త బ్రాహ్మణ కులం కాదు – దొరల దగ్గర బానిసగా పనిచేసేవాడే.

మా నాయన బ్రాహ్మణ పుట్టుకయినా మాతోనే కలిసి వుండేవాడు. వేరే పెళ్ళి చేసుకోలేదు. ఆయన అభ్యుదయ భావాలు కల్గినవాడు. అందుచేత నాకు, మా చెల్లెలికి, మా చిన్న అన్నకు, పెద్దన్నకు అందరకి చదువులు చెప్పించారు.

నేను, నా భర్త ఒక రెడ్డిదొర యింట్లో కట్టు బానిసలుగా పనిచేశాం. నా మగడు వయసువాడైనా ఆ రెడ్డి దొరసాని కొట్టేది, అన్ని పనులు చేయించేది. నా మగడు రౌడీగా కూడా పనిచేసేవాడు.

## కట్టుబానిసలుగా...

ఈ పరిస్థితుల్లో తెలంగాణా పోరాటం, వెట్టిచాకిరీకి వ్యతిరేకంగా ప్రారంభమైంది. కట్టు బానిసలుగా వున్న మేమందరము ఈ పోరాటంచే ఆకర్షించబడినాము. మా పెద్దన్న 20 మంది సభ్యులుగల దళానికి కమాండరు. నేను నా భర్త కూడా పోరాట దళాల్లో చేరాం. నేను కమ్యూనిస్టు పార్టీ సభ్యురాలుగా చేరాను. వైజ్ఞానిక దళంలో పనిచేసేదాన్ని. నా కంఠం బాగుంటుందని బుర్రకథలు, హరికథలు చెప్పేదాన్ని. నేను కొంతవరకు చదువుకున్నాను గదా, అందుచేత ఏరియా కమిటీ, ప్రాంతీయ కమిటీ ఆఫీసుల్లో వ్రాతపని కూడా చేసేదాన్ని. గాయాలు తగిలిన కామ్రేడ్స్‌కు ప్రథమచికిత్సతోబాటు ఇంజక్షన్‌లు కూడా యిచ్చేదాన్ని. క్లాసులలో ప్రాథమిక చికిత్స నేర్చుకున్నాను. మానుకోట, గార్ల, ఖమ్మం ప్రాంతాల్లో కూడా పనిచేశాను. నాకు మగపిల్లవాడు పుట్టాడు. దళాల్లో పనిచేస్తుండటంవల్ల నా బిడ్డను నా దగ్గర వుంచుకోవడం సాధ్యమయ్యేదికాదు. నా బిడ్డని మా ఆడబిడ్డవద్దకు పంపివేశాను. ఆమెకు బిడ్డ పుట్టి పోయింది. అందుచేత నా బిడ్డకు ఆమె పాలిచ్చి పెంచింది.

## బిడ్డను త్యాగం చేయవలసిన పరిస్థితి:

యూనియన్ సైన్యాలు వచ్చిన తరువాత నిర్బంధ విధానం ఎక్కువైంది. గెరిల్లా దళాలను అడవులలోకి రిట్రీట్ అయిపోవలసిందని పార్టీ నిర్ణయించింది. నేను, నా భర్త కూడా అడవిలోకి వెళ్ళిపోయాం. ఆరునెలలపాటు అక్కడే దళాల్లో వున్నాను. అప్పుడు మళ్ళీ రెండవసారి నాకు గర్భం వచ్చింది. అడవిలో వుంటే ప్రసవం అయ్యేది ఎలాగ? ఒక గ్రామం నుండి మంత్రసానిని తీసుకువచ్చారు. అడవిలోనే ఒక పొదక్రింద మగబిడ్డను కన్నాను. ఇక అప్పుడు ఆ పసిబిడ్డను పట్టుకొని

అడవిలో దళాలతో నేను ఎలా వుండగలను? కాని, అలాగే ఆరునెలలు వున్నాను. ఆ తరువాత దళాల్లో వున్నప్పుడు బిడ్డను దగ్గర వుంచుకోవడం ప్రమాదకరం. బిడ్డ ఏడిస్తే, ఆ ఏడుపు పోలీసులకు వినబడితే ఇంకేముంది? ఏరియా కమిటీ నాయకులు "కమలమ్మా, నీ బిడ్డను ఎవరికైనా యివ్వాలి. లేదా, నీవు దళాలనుండి వెళ్ళిపోయి ఎక్కడైనా పసిబిడ్డను పెంచుకోవాలి" అని చెప్పారు. కోయ కుటుంబాలకు నా బిడ్డను యిచ్చివేద్దామని చూశాను. బిడ్డ తెల్లగా, అందంగా వుంటాడు. కోయ కుటుంబాలలో యిస్తే ఈ బిడ్డ ఎవరి బిడ్డ అన్న ప్రశ్న తప్పక వస్తుంది. ఎవరూ తీసుకోడానికి అంగీకరించలేదు. "ఈ తెల్లని అందమైన పిల్లగాడు మాలో ఎక్కడ కమ్ముతాడమ్మా?" (యిముడుతాడు) అని వాళ్ళు ఒప్పుకోలేదు. పోలీసులు ఈ పిల్లగాణ్ణే, మమ్మల్ని కూడా చంపివేస్తారు అని వాళ్ళు అన్నారు.

చివరకు పార్టీ ఒక నిర్ణయం చేసింది. "బిడ్డను సాకలేక వదలిపోతున్నాము" అని బిడ్డమెడలో ఒక చీటీవ్రాసి, "బొగ్గుట్ట" అనే గ్రామంలో వదిలిపెట్టి రమ్మన్నారు. నేను ఏడ్చాను. మనసొప్పలేదు. అయినప్పటికి పార్టీ నిర్ణయాన్ని అమలు జరపదలచాను. ఒక కామ్రేడ్‌కు యిచ్చి పంపాను. గార్లజాగీరుకు వచ్చాము. అక్కడ పార్టీ ఆర్గనైజరు మాకు ఒక సలహా యిచ్చాడు. బిడ్డను అలా పారవేయవద్దు, ఎవరికైనా యిచ్చేస్తే పెంచుకుంటారు అని చెప్పాడు. ఒక బొగ్గుగని కార్మికుడు బిడ్డను పెంచుకుంటానని అంగీకరించాడు. పిల్లవాణ్ణి ఆయన చేతిల్లో పెట్టి నేను వెళ్ళిపోయాను. నా శరీరం వెళ్ళిందికాని, నా మనసు అక్కడనే వుంది. పిల్లవాణ్ణి వదిలిపోతూ కంటికి మంటికి ఒకటే ధారగా ఏడ్చాను. చివరకు మళ్ళీ దళాల దగ్గరకు పోడానికి రెండు రోజులు పట్టింది. ఆ పిల్లగాడు ఏమయ్యాడో యిప్పటికీ నాకు తెలియదు. 36 సంవత్సరాలైంది. (1986 సంవత్సరంలో ఈ ఇంటర్వ్యూ జరిగింది – సం.) ఒకసారి విప్లవ కమ్యూనిస్టులు వచ్చి, నా జీవిత చరిత్ర అడిగితే నా దుఃఖానికి అంతులేకపోయింది.

ఒకసారి కామ్రేడ్ తీగల సత్యనారాయణగారు అన్నారు: "కమలమ్మా, దేశదేశాల చరిత్రలు చదువుతున్నాం. ఇప్పుడు నీవు మనదేశంలో మన తెలంగాణా పోరాటం సందర్భంలో చేసిన త్యాగం ఒక గొప్ప చరిత్రగా మిగిలిపోతుంది, దుఃఖించవద్దు" అని. కాని, కడుపుతీపి ఎక్కడకు పోతుంది? ఆ బిడ్డకోసం ఇప్పటికీ నా మనసు వేదనపడుతూనే వుంటుంది. ఆ బిడ్డను కడుపుతో వున్నప్పుడు, నేను వేవిళ్ళు పడినప్పుడు, దళంలో పనిచేస్తూ పడిన బాధలు చెప్పుకుంటే అదే పెద్ద చరిత్ర అవుతుంది. పోలీసులు తరుముకొని వస్తుంటే తప్పించుకోడానికి ఎన్నెన్నిపాట్లు పడ్డానో నేను చెప్పలేను.

అడవిలో దళాల్లో వుండగానే మళ్ళీ మరోసారి గర్భవతి నయ్యాను. 1951–52 రోజుల్లో పోరాటం ఇక కొద్ది రోజులకు ఆగిపోయే దశ. ఆ తరువాత పోరాటం ఆగిపోయింది. ఎన్నికలు జరిగాయి. నా భర్త తిరిగి నాగిరెడ్డి నక్సలైటు గ్రూపులో చేరి, అరెస్టయి జైలులో వున్నాడు. బైటకి వచ్చిన తరువాత ఎంతో దారిద్ర్యావస్థ అనుభవించి పిల్లలను పెంచాను. అయినా, నేను కమ్యూనిస్టు పార్టీని వదలలేదు. వైజ్ఞానిక దళంలో పనిచేస్తూనే వున్నాను.

# శ్రీమతి కొండపల్లి కోటేశ్వరమ్మ



నేను కృష్ణాజిల్లా పామర్రు గ్రామంలో ఒక రైతు కుటుంబంలో పుట్టాను. తల్లిదండ్రులు ఆరుమళ్ళ అంజమ్మ, సుబ్బారెడ్డిగార్లు. నాకు చిన్నతనంలోనే మేనమామతో అతి బాల్య వివాహం జరిగింది. నాకు ఊహరాకముందే క్షయవ్యాధితో అతడు మరణించాడు. నేను బాలవితంతువు నయ్యాను. మా తల్లిదండ్రులు కొంత సంస్కారభావంతో నన్ను బడికి పంపించి చదివించారు.

బ్రిటిష్ ప్రభుత్వ జార్జి చక్రవర్తిని కీర్తిస్తూ ఆ రోజుల్లో పాటలు పాడించి వూరేగింపులు జరిపించేవారు. నేను పాటలు బాగా పాడేదాన్ని. ఒకసారి వూరేగింపులో పిల్లలం ఈ పాట పాడుతుంటే కొంతమంది యువకులు వచ్చి, "తెల్లవాళ్ళు మనదేశాన్ని వశపరచుకొని మన సంపదను కొల్లగొడుతుంటే – గాంధీజీ నాయకత్వాన స్వరాజ్యంకోసం పోరాడుతూంటే ఈ బ్రిటిష్ చక్రవర్తిని కీర్తిస్తారా?"

అని అడిగారు. ఇలాంటి పాటలు పాడకూడదన్నారు. ఆ సమయంలో మా గ్రామంలో తమ్మా నాగిరెడ్డి, గడియారం సాంబయ్య అనేవారు "వందేమాతరం" వూరేగింపులు చేస్తుంటే పోలీసులు వారిని నడివీధిలో లాఠీలతో కొట్టి జైళ్ళలో పెట్టారు. ఇవి నాలో దేశభక్తిని కలిగించాయి. గడియారం సాంబయ్యగారు ఉన్నత విద్యావంతులు. ఖద్దరు కట్టుకొని, విదేశీ వస్త్రదహనం చేశారు. నాగిరెడ్డిగారు కాలేజీ చదువులు మాని సత్యాగ్రహం చేసినవారు. మా తమ్ముడు సాంబయ్యగారి వద్ద ప్రైవేటు చదివేవాడు. సత్యాగ్రహులు "కల్లు మానండోయ్ బాబు, కళ్ళు తెరవండోయ్" అనీ, "కాళ్లాయిగట్టితేనేమీ మా గాంధీ మాలడై తిరిగితేనేమీ!" అన్న పాటలు పాడేవారు. వాటిని నేను కూడా పాడటం మొదలుపెట్టాను.

## గాంధీజీకి నా నగలు:

గాంధీగారు కృష్ణాజిల్లాలో పర్యటిస్తూ బందరు వెడుతూ మా పామర్రులో పదినిముషాలు ఆగి, స్వరాజ్య సాధనకు రండి అని ప్రబోధించారు. ఆ సభకు నేను వెళ్ళాను. స్త్రీలందరూ ఆయనకు తమవంటిమీద నగలు వలిచి యిస్తుంటే నేను కూడా నా చెవి కమ్మలు, కాళ్ళ వెండి పట్టాలు తీసి ఆయన చేతిలో పోశాను. వారు చిరునవ్వుతో నా ఆభరణాలను స్వీకరించారు. అది నా జీవితంలో మరపురాని విషయం. బోసి చెవులతో, బోసి కాళ్ళతో యింటికి వచ్చిన నన్ను చూసి మా అమ్మ "చిన్నతనంలోనే నీకు ఎంత స్వతంత్ర్యం వచ్చిందే! పెద్దవాళ్ళేమంటారో అని లేదే నీకు?" అని అడిగితే, మా తండ్రిగారు "పోనీలేవే, మనకు లేని ధైర్యం మన బిడ్డకు వచ్చినందుకు సంతోషిద్దాం" అని సర్దిచెప్పారు.

## బాల వితంతువుగా వైరాగ్యం:

ఎలిమెంటరీ స్కూలు నుండి హైస్కూలుకు వచ్చాను. కాని, మొదటిరోజునే స్కూలు పిల్లలు నన్ను "నైటింగేల్ వచ్చిందిరో!" అని ఆటపట్టిస్తే – నేను బిడియపడి, స్కూలు మానివేసి యింటి దగ్గరే చదువుకుంటానని అన్నాను. మా తల్లిదండ్రులు అలాగే అన్నారు. నాచేత భారత రామాయణాలు, స్త్రీలపాటలు, ఆధ్యాత్మిక రామాయణం మున్నగునవి చదివించేవారు. నేను పెద్దమనిషినైన తరువాత నేను బొట్టు, గాజులు, పూవులు పెట్టుకోకూడదన్నారు. వితంతువైన మా అమ్మగారి మేనత్త "మనం పూర్వజన్మంలో పాపంచేయబట్టి విధవలమైనామని, నుదుట అలా రాసి వుందని, ఈ జన్మలో పారమార్థిక చింతతో వుంటే వచ్చే జన్మలోనైనా పునిస్త్రీలుగా పుడతామనీ" నాకు వైరాగ్యం బోధించి, భక్తసమాజంలో భజనకు తీసుకువెళ్ళేది. రామకోటి వ్రాయడానికి మా తండ్రి దస్తాలకొద్ది తెల్లకాగితాలు తెచ్చి యింట్లో పడవేశారు.

## జాతీయోద్యమ ప్రభావం:

ఇలా వుండగా మా గ్రామానికి ఖద్దరు అమ్మడానికి కాంగ్రెస్ మహిళలు వల్లభనేని సీతామహాలక్ష్మమ్మ, భారతీదేవి రంగా, వాసిరెడ్డి హనుమాయమ్మ వచ్చి, సభలు

పెట్టారు. దేశభక్తి ప్రబోధించే పాటలు, సోది మున్నగునవి చెప్పి, సోదిలోకి భారతమాత వచ్చి "గాంధీజీ తన ముద్దుల కొడుకనీ, భారత ప్రజలను విముక్తులను చేయడానికి వచ్చాడనీ" అలా జాతీయ పోరాటం గురించి చెప్పేవారు. మా గ్రామంలో దేశభక్తి పవనాలు బాగా వీచనారంభించాయి. మా అమ్మగారు రాట్నంమీద సన్నటి నూలు దీయడం, నేను "మాకొద్దీ తెల్లదొరతనము" (గరిమెల్లవారి పాట), చిలకమర్తివారి "భరత ఖండంబు చక్కని పాడియావు" పాడేదాన్ని. మా తండ్రిగారు గొట్టిపాటి బ్రహ్మయ్యగారిని ఎన్నికలలో గెలిపించడానికి మా బంధువులను, స్త్రీలను బండికట్టి తీసుకువెళ్ళి ఓట్లు వేయించారు. మా కుటుంబం జాతీయాభిమానంగల కుటుంబంగా తయారైంది.

హైస్కూలు టీచర్లు తమ్మారెడ్డి రామస్వామిగారు, మిక్కిలినేని అక్కయ్య చౌదరిగారు, పెదమద్దాలిపల్లి గ్రామస్తులు. వారు మా యింటికివచ్చి స్వాతంత్ర్య పోరాటం గురించి, కమ్యూనిస్టు విప్లవం గురించి చెప్పేవారు.

నేను పూలు పెట్టుకోడం మానివేయడంవల్ల మా అమ్మ కూడా మానివేసింది. నేను పేరంటానికి వెళ్ళకూడదు గనుక, తానూ వెళ్ళడం మానివేసింది. మా అమ్మను పిన్నీ అని పిలిచే తమ్మారెడ్డి రామస్వామిగారు "మీ అమ్మాయికి మళ్ళీ పెళ్ళి చేయండి. ఆమె జీవితం అలా ఎందుకు వృధా చేస్తారు?" అని మా అమ్మకు చెప్పేవారు. మా అమ్మలో మార్పువచ్చి, నాకు మళ్ళీ పెళ్ళి చేయాలన్న నిశ్చయానికి వచ్చారు. నన్ను చూసుకోడానికి నల్గురైదుగురు యువకులు వచ్చారు. నాలో అప్పటికి వైరాగ్యం కలిగి, నాకిష్టంలేదని చెప్పి, పక్కింటికి వెళ్ళిపోయేదాన్ని. మా అమ్మగారు ఎంతో చింతించేవారు.

ఆ రోజుల్లో వితంతువులకు పెళ్ళి అంటే చాలా తప్పుగా ఎంచేవారు. నాకు మళ్ళీ పెళ్ళిచేస్తే మా తమ్మునికి ఎవరూ పిల్లనివ్వడానికి రారేమోనని మా తల్లిదండ్రులు మా తమ్మునికి 13వ ఏటనే పెళ్ళి చేసేశారు.

## మొలకెత్తిన సంఘసంస్కరణ బీజాలు:

ఇదిలావుండగా కందుకూరి వీరేశలింగంగారు వితంతు పునర్వివాహాలు చేస్తున్న విషయం బాగా ప్రజలలోకి వచ్చింది. మా గ్రామంలో కూడా సంస్కరణ వివాహాలు మొదలయ్యాయి. ఒక వైశ్య కుటుంబంలో వితంతువుకు పెళ్ళి జరిగింది. అయినా, నాలో పురాతన భావాలు పోలేదు. నా నుదుట అలా రాసివుంటే నేను సుమంగళినెలా అవుతానని అంటుంటే, రామస్వామిగారు నవ్వి, నాకు బ్రహ్మసమాజం గురించి, సంఘసంస్కరణ ఉద్యమాల గురించి చెప్పి, అందుకు సంబంధించిన పుస్తకాలు యిచ్చి చదవమనేవారు. ఒకసారి అక్కయ్య చౌదరిగారి భార్య సీతమ్మగారు, రామస్వామిగారు నన్ను గుడివాడ తీసుకువెళ్ళి "వితంతువును వివాహమాడిన" ఒక టీచరుగారి కుటుంబాన్ని చూపెట్టారు. ఆయన బి.ఇడి. టీచరు. వారికిద్దరు పిల్లలు. "కర్మ అనేది నిజమైతే ఈ వితంతువుకు పెళ్ళి ఎలా అయ్యేది? పిల్లలు ఎలా పుట్టేవారు?" అని రామస్వామిగారు చెప్పి, తమ యింట కొన్నాళ్ళు వుంచారు. నాలో పాత భావాలు పోగొట్టారు. నన్ను పెండ్లికూతురని పిలిచేవారు. నాకు పిల్లలంటే

ఎంతో మక్కువగా వుండేది. క్రమంగా నాలో మార్పు వచ్చింది. రామస్వామిగారు గోర్కీ 'అమ్మ' నవల తెచ్చి, మా అమ్మకు చదివి వినిపించమనేవారు. నేను వారిని "అన్నా" అని పిలిచేదాన్ని. 'వారికి నేను స్వంతచెల్లిని కాను. నా గురించి ఇంత తాపత్రయం దేనికి? నా పెండ్లి జరిగితే వారికి ఏమిలాభం?' అనుకునేదాన్ని. వారి నిస్వార్థ సంఘసేవా దృక్పథం అర్థమయింది. అప్పుడు కమ్యూనిస్టులు అంటే నాలో ఎంతో అభిమానం పెరిగింది. వారు వట్టిమాటలు చెప్పరు. చేతల్లో చేసి చూపెడతారు అనే భావాలు నాలో కలిగాయి.

మా అమ్మా, మా తమ్ముడితోబాటు మా నాన్నగారు కూడా నాకు మళ్ళీ పెళ్ళి చేయడానికి సమ్మతించారు. మా అమ్మగారు నాకు రెండవపెళ్ళి ఇతర కులాలతో చేస్తే మరీ వ్యతిరేకత మా కుటుంబాల వారితో వస్తుంది గనుక రెడ్ల కులంలోని యువకుణ్ణే చూడమని రామస్వామిగారికి చెప్పారు.

## సంచలనం కల్గించిన నా పునర్వివాహం:

1937లో కొత్తపట్నంలో రాజకీయ పాఠశాల జరిగింది. రామస్వామిగారు కూడా ఆ స్కూలుకు వెళ్ళారు. ఆ రాజకీయ పాఠశాలకు కొండపల్లి సీతారామయ్యగారు కూడా వచ్చారట. ఆయన రెడ్ల యువకుడని తెలుసుకొని, 'వితంతువును పెండ్లి చేసుకుంటావా?' అని చండ్ర రాజేశ్వరరావుగారిచే రామస్వామిగారు అడిగించారు. ఇదంతా ఆ తరువాత మా అమ్మగారు నాకు చెప్పారు. సీతారామయ్యగారికి యిష్టమై, ముందు ఒక స్నేహితుని, మలిరెడ్డి కృష్ణారెడ్డి అనేవారిని పంపారట. ఆయన గేదెలను వెతకడానికి వచ్చాననే నెపంతో వచ్చి, నా విషయమంతా తెలుసుకొని వెళ్ళారు. తరువాత రంగారెడ్డిగారు సీతారామయ్యగారిని, మరికొందరు పెద్దలను వెంటబెట్టుకొని వచ్చి, నన్ను చూశారు. రామస్వామిగారు, అక్కయ్య చౌదరిగారు నా తరపు పెద్దలు. చివరకు నా వివాహం సీతారామయ్యగారితో నిశ్చయమైంది. శాఖగాని శాఖ, అందుచేత ఏమి గొడవలు జరుగుతాయోమోనని చండ్ర రాజేశ్వరరావు, సావిత్రమ్మ దంపతులు; మద్దుకూరి చంద్రశేఖరరావు, కొసరాజు శేషయ్య మున్నగు పెద్దలందరు వచ్చి, వెంట్రప్రగడలో నా వివాహం జరిపించారు. శెట్టిపల్లి వెంకటరత్నంగారు గేయాలు పాడారు. నూతన పద్ధతులలో, పూలదండలతో, కమ్యూనిస్టు పెద్దల ఆశీస్సులతో మా వివాహం జరిగింది. నాలుగు రోజులు మా నూతన దంపతులకు అక్కడే ఆతిథ్యమిచ్చారు.

అయితే, నా వివాహం మా గ్రామంలో పెద్ద సంచలనం తెచ్చింది. మా కుటుంబాన్ని వెలి వేశారు. మా బంధువులు, కులంవారు మా కుటుంబంతో మాట్లాడకుండా బహిష్కరించారు. నేను ఒక రోజున గుమ్మంలో నిలబడి వుంటే కులపెద్దలు ఒక వితంతు స్త్రీచే నన్ను కొట్టించారు. 'వెధవముండ, పెళ్ళి చేసుకొని కులపరువు ప్రతిష్టలు చెడగొట్టిం'దని తిట్టించారు. కమ్యూనిస్టు యువకులు వచ్చి ఘర్షణకు సిద్ధమైతే, మా తండ్రిగారు వారిని వారించి, వెనక్కు పంపారు. నేను ఆ విధంగా కమ్యూనిస్టు పార్టీకి, కమ్యూనిస్టు ఉద్యమానికి చేరిక అయ్యాను. నా భర్తతో కలిసి ఉద్యమంలో పనిచేయడం మొదలుపెట్టాను.

## రహస్య కమ్యూనిస్టు ఉద్యమ శ్రేణులలో:

అవి (1939) రెండవ ప్రపంచయుద్ధకాలపు రోజులు. కమ్యూనిస్టు పార్టీ రహస్యపత్రిక "స్వతంత్ర భారత్" వచ్చేది. యుద్ధవ్యతిరేక ప్రచారానికిగాను కమ్యూనిస్టు నాయకులను అరెస్టు చేస్తున్నారు. మా తమ్ముడు స్వతంత్ర భారత్ పత్రికను బందరు నుండి జామపళ్ళ బుట్టలలో పెట్టి మా అత్తవారి వూరు పంపుతూ వుండేవాడు. కార్బన్ పేపరు పెట్టి రహస్య పత్రాల కాపీలు తీస్తుండేవారు. నాతో కూడా తీయిస్తూ వుండేవారు. 'పోలీసులొస్తే మేం గోడదూకి పారిపోతాం. నిన్ను కొట్టి జైల్లో పెడతారేమో'ననేవారు. 'మనవాళ్ళెందరో జైళ్ళ కెళ్ళారు కదా? అది కూడా చూస్తా'నని నవ్వేదాన్ని.

స్వతంత్ర భారత్ పత్రిక కట్టలతో జోగారావుగారు, కొండేపూడి లక్ష్మీనారాయణగారు పట్టుబడ్డారనీ, పోలీసులు ప్రెస్ ఎక్కడుందో చెప్పమని చిత్రహింసలు పెడుతున్నారనీ, గోళ్ళల్లో సూదులు గుచ్చినా ఆ కామ్రేడ్సు చెప్పలేదనీ వారిని గూర్చి గొప్పగా చెప్పుకోవడం విన్నాను. లక్ష్యసాధనకై ఎంత బాధనైనా భరిస్తారు కమ్యూనిస్టు లనుకున్నాను.

మేడే నాడు ఊరేగింపులో పాల్గొని, ఎర్రజెండా పాటను (ఎగరాలి ఎగరాలి మా ఎర్రజెండా) ఉత్సాహంగా పాడాను. 1942లో సోవియట్ రష్యామీద నాజీలు యుద్ధం ప్రకటించడం, కమ్యూనిస్టులు దాన్ని ప్రజాయుద్ధమని ప్రకటించడం జరిగింది. జైల్లో వున్నవారు, రహస్యంగా వున్నవారు బైటకొచ్చారు. (సీతారామయ్యగారు కూడాను.) మాకు చందు పుట్టాడు. వాడ్ని కామ్రేడ్సంతా పీపుల్సువార్ అని పిలిచేవారు.

పార్టీ నిర్మాణం కోసం, పత్రికలు నడపడంకోసం సుందరయ్యగారూ, రాజేశ్వర రావుగారూ సొంత ఆస్తినంతా అమ్మి యిచ్చారని విన్నాను. ఎంత త్యాగమనుకున్నాను. నేను పెండ్లి చేసుకుంటే నాపేరనున్న ఆస్తి (మా మేనమామ ఆస్తి) తనకు తిరిగి యివ్వాలని మా తాత పట్టుబట్టాడు. తాతకే ఆస్తి అవసరమైతే ఈ యువకులు ఆస్తికంటే ఆశయం గొప్పదనుకోడం ఎంత గొప్ప విషయమనుకున్నాను. పార్టీ కార్యకర్తలంతా తమ ఆస్తులను పార్టీకోసం అమ్మి యివ్వడం చూశాను. ఈ త్యాగధనుల మార్గం జాతి విముక్తికి మార్గమనుకున్నాను. పార్టీ చెప్పిన పని చేయడానికి సిద్ధమైనాను.

## కన్యాశుల్కం నాటకంలో నా పాత్ర:

1943లో విజయవాడలో జరిపిన రాజకీయ పాఠశాలకెళ్ళాను. సుందరయ్య, కంభంపాటి మొదలైన పెద్దలను చూశాను. రాజకీయాలను తెలుసుకుంటూ మహిళా సంఘాల్లో పనిచేశాను. 1944లో అభ్యుదయ సాహిత్యాన్ని వెలుగులోకి తీసుకురావాలని పార్టీ నిర్ణయించి, అభ్యుదయ రచయితల కాన్ఫరెన్సు జరిపితే, ఆ కాన్ఫరెన్స్‌లో వేసిన కన్యాశుల్కం నాటకంలో వితంతువు మీనాక్షి పాత్రను వేశాను. సంసార స్త్రీలు నాటకరంగంలోకొచ్చే సాంప్రదాయాన్ని ఆ నాటకం ద్వారా ప్రవేశపెట్టింది పార్టీ అన్నారు ప్రముఖులూ, నాటక ప్రియులూ.

సాంఘిక, రాజకీయ, సాహిత్య, సాంస్కృతిక రంగాలకు ఉత్తేజాన్ని, కొత్త అర్థాన్ని తెచ్చిన కమ్యూనిస్టుపార్టీ పత్రికలను నేను, జోస్యభట్ల సుబ్బమ్మగారు మరికొంతమంది కామ్రేడ్సు విజయవాడ వీధుల్లో అమ్మేవాళ్ళం. బండి బుచ్చయ్య నడిపే "ములుకోలు" పత్రిక మాపై దుష్ప్రచారం చేసినా, వేశ్యలను వివాహాలు చేసుకోమని ప్రోత్సహిస్తున్నామనే కోపంతో రౌడీలు ఇంటిపై కొచ్చి దుర్భాషలాడినా అమ్ముతూనే పత్రికల సర్క్యులేషన్ పెంచాం.

## ప్రజాహిత కార్యక్రమాలు:

కాకులు కూయకముందే లేచి వెళ్ళి చౌక డిపోలవద్ద నిలబడి అందరికీ సరుకులు సక్రమంగా అందునట్లు కృషిచేశాం. నగరవాసులతో కమ్యూనిస్టులు ప్రజోపయోగంగా పనిచేస్తారనిపించాం. మేం పనిచేయడానికి పార్టీ యిచ్చిన ఉత్సాహ ప్రోత్సాహాలతోపాటు మా అమ్మగారి సహకారం చాలా వుండేది. ఆమె నా పిల్లలను సాకటమేగాక సీతారామయ్యగారు వెంటబెట్టుకొచ్చిన రోగులను ఆదరించేది. ఇష్టం లేని పెండ్లి జరపబోయే తల్లిదండ్రులనుండి పార్టీ రక్షణ గోరి వచ్చిన యువతులకు మా ఇంట్లో స్థానమిచ్చేది. ఈ విధంగా స్త్రీ ఉద్యమకారులకు సహకరించిన మా అమ్మలాంటి అమ్మలెందరో వున్నారు.

1948లో పార్టీ నిషేధించబడింది. కొంతమంది కామ్రేడ్స్‌ను జైళ్ళల్లో బంధించింది ప్రభుత్వం. మహిళా సంఘం నడుపుతున్న పత్రికను కూడా నిషేధించింది. నిషేధాన్ని నిరసిస్తూ రాష్ట్ర వ్యాపితంగా మహిళా కార్యకర్తలు విజయవాడ కొచ్చారు. అచ్చమాంబగారి నాయకత్వాన వేల సంఖ్యలో స్త్రీలతో ఊరేగింపు జరిపాం. ఊరేగింపు చెదిరిపోవడానికి పోలీసులు టియర్ గేసు వదిలారు...లాఠీఛార్జీ చేశారు. మమ్మల్నందరినీ అరెస్టు చేశారు. సూర్యావతిని, అచ్చమాంబగార్నీ డిటెన్యూలుగా తీసుకెళ్ళారు. వందమందిని జైల్లో పెట్టి భయాన్ని కలిగించి, 16 మందిమీద కేసులు పెట్టి (నాతోసహా) కోర్టుల చుట్టూ తిప్పి బాధపెట్టారు. పార్టీ కార్యక్రమాల్లో పాల్గొనకుండా చేయటానికి పోలీసులు పూనుకున్నారు.

కొంతమంది కార్యకర్తలు పట్టుబడితే...పట్టుబడని కామ్రేడ్సు రహస్యోద్యమానికి ఉద్యమించారు. ఆ ఉద్యమానికి ఉపయోగపడడానికి నాలాంటి మహిళలం కొంతమందిమి రహస్యంగా వెళ్ళాం. వ్రాయడంలోనూ, వండడంలోనూ ఉపయోగపడు టేగాక ఆయుధాలను అందించనుకూడా చేశాం. ఉద్యమకారుల ఆచూకీ తెలుసుకోను సి.ఐ.డీలు, పోలీసులు దమనకాండకు దిగారు. కమ్యూనిస్టువాస నుందనుకున్నవారి ఇండ్లపైబడి సామాను విచ్ఛిన్నం చేశారు. ఆహార పదార్థాలను తగులబెట్టారు. కార్యకర్తల జాడ, ఏ అఘాయిత్యం జరిపినా తెలుసుకోలేక, చివరకు కామ్రేడ్ అని అనుమానం వచ్చినవాళ్ళను కాల్చి చంపారు. ఆ పరిస్థితిలో రహస్యోద్యమాన్ని రాష్ట్రేతర ప్రాంతాలనుండి నడపాల్సి వచ్చింది. కమ్యూనిస్టులున్న డెన్నని తెలియకుండా వుండేందుకు... పిల్లాజల్లాతో వున్న కుటుంబంగా అక్కడి జనం భావించేందుకూ... పిల్లలున్న తల్లులను కొందర్నీ, మా అమ్మా మా పిల్లలనూ కూడా రహస్య స్థలానికి తీసుకువెళ్ళింది రహస్యపు పార్టీ. వీధిలో పిల్లలతో ఆడుకోవాల్సిన నా పిల్లలు

పెద్దవాళ్ళతో డెన్‌లో ఆడేవారు. ఆ ఇంటి నుండి బైటికెడితే తిరిగి ఇంటికొస్తారా? రారా? అని సందేహించే సమయంలో మా అమ్మగారు బంగారం బజారులో అమ్మి సొమ్ము చేసి బియ్యం గ్రట్రా కొని కామ్రేడ్సుకిచ్చి తిరిగి వచ్చేది.

పట్టుబడ్డ కామ్రేడ్సు (సుందరంలాంటివాళ్ళు) ప్రాణాలపై తీపితో రహస్యాలు బైటపెట్టారని విన్నాగాని, స్త్రీలు బైటపెట్టిన వార్తలు వినిపించక మేమెంతో గర్వపడ్డాం.

1948–51 మధ్య జరిగిన సంఘటనలూ...ప్రాణాలర్పించిన మృతవీరుల త్యాగాలూ నాపై చెరగని ముద్ర వేశాయి. మృతవీరుల వారసులం మేమంటూ, మృతవీరుల ధైర్య సాహసాలను కీర్తిస్తూ, మృతవీరులకు నా కానుకగా గేయం రాశాను. 1952 ఎన్నికల్లో దాన్ని గానం చేస్తూ ఎన్నికల ప్రచారం చేశాను. కమ్యూనిస్టు కామ్రేడ్సు విజయపరంపరలు విని మనసారా పొంగిపోయాను. కమ్యూనిస్టుల చిత్తశుద్ధికి జయంగా భావించాను.

ఉత్సాహం, ఉత్తేజం, విశ్వాసం, త్యాగం, నిజాయితీ, నిరాడంబరత పదాలకు అర్థాలు, వాటికి జరిగిన న్యాయం కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతల కార్యాచరణలో చూసి చైతన్యమొందాను.

కొన్ని కారణాల వలన మా కుటుంబం ఛిద్రమైంది. మానసిక, ఆర్థిక బాధలు తట్టుకోలేక, కాకినాడ మహిళా పాలిటెక్నిక్ హాస్టల్లో ఉద్యోగం దొరికింది చేస్తానని సుందరయ్యగారితోనూ, చంద్రంగారితోనూ (మద్దుకూరి) చెప్పాను. వారు నా ముఖం వంక చూస్తూ 'నీవెక్కడున్నా, ఏ పనిచేసి జీవించాలనుకున్నా ముఖస్తుతికీ, ప్రలోభాలకూ, (పై అధికార్ల) వత్తిడికీ లోనుగాక కమ్యూనిస్టు మహిళగా...నిజాయితీగా పనిచేయ'మని చెప్పారు.

అప్పటికే పార్టీ రెండుగా చీలడానికి రంగం సిద్ధమవుతుంది. అయినా, ఇరువురూ నాకాప్తులుగా వెళ్ళి చెప్పాను. పార్టీ రెండుగా చీలిపోయింది. బాధనిపించింది. రెండు వైపులవారి ఆడపిల్లలూ హాస్టల్లో వుండేవారు. వారందర్నీ ఒకటిగానే చూసేదాన్ని. నేను చేయగలిగిన సహాయం, సమంగానే చేసేదాన్ని. మా అమ్మాయి కరుణను వివాహం చేసుకుంటానని రమేష్ బాబొస్తే – సుందరయ్యగార్కి, రాజేశ్వరరావుగార్కి చెప్పి, వారి నిర్ణయం నా నిర్ణయంగా తీసుకోమన్నాను. వారు నన్ను ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ రోజుల్లో చూసినట్లే చూసేవారు.

మా అమ్మగారి స్మారక సభకు మా అమ్మగారికిష్టమైన (ఉభయులలోనూ నా కందుబాటులోనున్న) ఉభయ పార్టీల వారిని పిలచాను. అమ్మ సేవలను గూర్చి వారు మాట్లాడుకుంటుంటేనూ... వేదికపై మాట్లాడితేనూ ఎంతో సంతోషించాను. ఉభయ పార్టీల వారు ఒక వేదిక మీదికి రావడానికి ఇది నాంది కావాలన్నారు మిత్రులు.

నేను రచించిన రెండు పుస్తకాల ఆవిష్కరణకు ఉభయుల మహిళా సంఘాల కార్యకర్తలను పిలిపించి ఆవిష్కరించమన్నాను. ఉభయులు ఒకర్ని ఒకరు పలకరించు కుంటూ నా పుస్తకాల నావిష్కరిస్తే వుప్పొంగిపోయాను. ఆ సభకొచ్చిన కమ్యూనిస్టు సానుభూతిపరులూ – పెద్దలూ 'మంచి పని చేశావమ్మా' అన్నారు. వీరి కలయిక

కోసం కళ్ళొత్తుకు చూస్తున్నా మన్నారు. అప్పుడు నేను అనుకున్నాను – 'వీరంతా అవకాశవాదులా? వామపక్షాల ఐక్యత దేశానికి అవసరమని గుర్తించినవారా?' అని...

ఈనాటి కుల కుమ్ములాటలూ ... మత కొట్లాటలూ మాయాలన్నా ... తలెత్తిన రౌడీయిజం తలవంచాలన్నా... స్వార్థపరుల ఆటలు కట్టాలన్నా... అరాజకం వైపుకు మొగ్గుతూ యువతరం పెడ మార్గాలు పట్టకుండా చూడాలన్నా... హత్యలకూ, ఆత్మహత్యలకూ గురౌతున్న స్త్రీలు మనగలగాలన్నా... ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీలో పనిచేసినట్లు పనిచేసే కార్యకర్తలు కావాలి.

చీలిక తరువాత ఏర్పడిన మంచి చెడ్డలను సింహావలోకనం చేసుకొనే వామపక్ష శక్తులు దేశ పరిస్థితులననుసరించి ఐక్యతతో ఆలోచించాలనీ, వట్టి మాటలు లేకుండా...ఆనాటి కమ్యూనిస్టు నిర్మాతలవలే కార్యాచరణ చూపి సమసమాజ నిర్మాణం కోసం ఉద్యమించాలనీ ఆశిస్తున్నాను; ఈనాటి కార్యకర్తలకు విజ్ఞప్తి చేస్తున్నాను.

★ ★ ★

# శ్రీ చిట్టూరి ప్రభాకరచౌదరి



మా నాన్నగారు కాంగ్రెస్ అభిమాని. మా ఇంటిలో గాంధీ, నెహ్రూ, భగత్‌సింగ్, దత్తు ఫొటోలు ఉండేవి. భగత్‌సింగ్‌ను ఉరితీసినపుడు మా ఇంట్లో వంట చేసుకోలేదు. నాకు సుమారు 10 సంIIలు. నన్ను హోటలుకు తీసుకెళ్ళి టిఫిన్ పెట్టించారు. వాడపల్లి తీర్థంలో గాంధీ ఫోటోపెట్టి ఊరేగించి నందుకు మా బంధువులు రైతులపై డప్పుల సుబ్బారావు (పోలీసు సూపరింటెండెంట్) లాఠీ ఛార్జి చేస్తే, వారికి మా నాన్నగారు కట్లుకట్టించి మా ఇంటివద్ద ఆశ్రయం ఇచ్చారు. రాజమండ్రిలో ఆనాడు కాంగ్రెస్ ఎం.ఎల్.ఎ. శ్రీ బారు రాజారావు కుమారుడు నాతోటి విద్యార్థి. 1933లో నేను ఇంటర్ చదువుతుండగా సుభాస్‌బోసుకు, పట్టాభి సీతారామయ్యగార్కి కాంగ్రెస్ అధ్యక్ష ఎన్నికల పోటీలో సుభాస్‌బోసుకు ఓటు వేశాను.

ఆ రోజులలో రాజకీయ పాఠశాలకు వెళ్ళివచ్చిన బొడ్డు బుచ్చిరాజు అను గ్రాడ్యుయేట్ విద్యార్థి మాతోటి విద్యార్థికి ట్యూషన్ చెపుతూ పరిచయమయి, నాకు సోషలిస్టు సిద్ధాంతం గురించి, రష్యా గురించి చెప్పారు. "సోషలిజం ఎందుకు?" అనే జయప్రకాష్ నారాయణ వ్రాసిన పుస్తకం మా నాన్నగారు చదువుతుండగా, ఆ పుస్తకం చదివాను. "మన్యం విప్లవం", "అల్లూరి సీతారామరాజు చరిత్ర" నన్ను ప్రభావితం చేశాయి. వినాయక్ సావర్కార్ వ్రాసిన "ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామము" అను పుస్తకం నన్ను ప్రభావితుణ్ణి చేసింది. అదేకాలంలో "మాలపిల్ల" సినిమా వచ్చింది. అంతవరకు స్వామి వివేకానంద ఆధ్యాత్మిక బోధనల ప్రభావానికి లోబడివుండే నాకు, మొత్తం ప్రజలందరికీ న్యాయం చేకూర్చే సమ సమాజం కొరకు జీవితాన్ని వెచ్చించాలనే దృఢ నిర్ణయం కలిగి, 1940లో ఇంటర్ పరీక్షలు అయిపోగానే చదువుమాని రాజకీయాలలోనికి ప్రవేశించాలని నిర్ణయించుకున్నాను. "చైనా అరుణతార" అనే పుస్తకం నన్ను కార్యరంగంలోకి దూకడానికి ప్రభావితం చేసింది. 1940 జనవరి 26వ తేదీన స్వాతంత్ర్యదిన ప్రతిజ్ఞ రోజున మద్దూరి అన్నపూర్ణయ్యగారి సహాయంతో కాలేజీలో సమ్మె చేయించడానికి ప్రయత్నించి, సరియైన నిర్మాణ పద్ధతులు తెలియక విఫలమయ్యాను.

### కార్మికులకు రాత్రి బడి:

కాలేజీ, స్కూల్లు తప్ప లోకజ్ఞానంలేని నాకు కార్మికులతో పరిచయం చేసుకోవడం పెద్ద సమస్య అయ్యింది. ఉల్లితోటలో రాములవారి గుడి, ఇన్నీసుపేటలో ముత్యాలమ్మగుడి, కొత్తపేటలో రాములవారి గుడి వద్ద వయోజన రాత్రి పాఠశాలలు నడిపినాను. కార్మికులలో సంఘాలు పెట్టుకోవాలని ప్రచారం మొదలుపెట్టాను. అప్పటికి "కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ" పేరుతో 6గురు సభ్యులు ఉండేవారు. వారితో పరిచయం పెట్టుకున్నాను. కమ్యూనిస్టు పార్టీపై నిషేధం వున్నందువల్ల ఆ పేరుతో వ్యవహరిస్తూ "స్వతంత్ర భారత్" అనే రహస్యపత్రికను రహస్యంగా పంచేవాళ్ళము. ఎంతో నమ్మకం కలిగితేకాని పార్టీ సభ్యత్వం ఇచ్చేవారుకాదు.

1941లో మునిసిపల్ వర్కర్స్ యూనియన్ స్థాపించాము. అదే సంవత్సరంలో సమ్మె జరిగింది. సమ్మె విచ్ఛిన్నానికి గుంటూరు నుంచి యానాదులను తీసుకుని వచ్చారు. సమ్మె విఫలమై కార్మికులు లొంగిపోయే ప్రమాదం ఎదురైంది. అంతలో నెల్లూరు జైలునుండి పారిపోయి రహస్య జీవితం గడుపుతున్న కొరపాటి పట్టాభిరామయ్య వచ్చి, లొంగుబాటుకు సిద్ధపడిన ముసలివాళ్ళ నాయకత్వం తొలగించి స్త్రీలను రంగంలోకి దింపితే నెగ్గుతారని ఆలోచన చెప్పినాడు. స్త్రీలను వెంటబెట్టుకుని కర్రలు మోసుకునే జట్లు కార్మికుల సహాయాన్ని అర్థించాము. వాళ్ళు చీకటి పడ్డాక యానాదులను కొంతమందిని కొట్టి అక్కడినుండి తరిమివేశారు. పోటీ కూలీలుగా వచ్చిన యానాదులు పారిపోయాక మునిసిపాలిటీ, కార్మిక సంఘంతో అగ్రిమెంటు చేసికొంది. అప్పటికి నెలకు 10 రూ॥ జీతంకి ఒక రూపాయి పెంచి అగ్రిమెంటు చేసికొన్నారు. అది నేను నడిపిన మొదటి సమ్మె. ఆ సమ్మె కాలంలోనే కొరపాటి పట్టాభిరామయ్యగారి రికమండేషన్‌తో నాకు పార్టీ సభ్యత్వం ఇచ్చారు. అనగా, కాలేజీ వదిలేసిన $1\frac{1}{2}$ సం॥లు రాజకీయ కార్యకలాపాలలో పాల్గొన్నాక పార్టీ సభ్యత్వం లభించింది.

పార్టీ జిల్లా ఆర్గనైజర్‌గా వున్న పార్థసారథిగారు '3 మాసములు నీ కాళ్ళ మీద నిలబడి పనిచేస్తే పార్టీ కొంత అలవెన్సు ఇస్తుంది' అని చెప్పారు. బియ్యం, కందులు (కందిపప్పు అయితే ఖరీదు ఎక్కువ) కలిపి కుంపటిమీద వండుకుని తింటే నెలకు మూడు రూపాయలలో జీవించవచ్చని లెక్కగట్టి, నాకున్న సైకిల్ 10 రూ॥లకు బేరం పెట్టి ఒక హరిజన మిత్రునిద్వారా ఒక కారు డ్రైవర్‌కు అమ్మినాను. మా ఇంటివద్ద ఇంక రానని, నా జీవితం పార్టీకి, ప్రజలకు అంకితమయిపోయాయని చెప్పాను. కాని, సైకిల్ అమ్మిన సొమ్ము నా మిత్రుడు వసూలు చేసుకుని తినివేశాడు. అప్పుడు కాలేజీ హాస్టల్‌లో స్వీపరుగా పనిచేసే షాదిరా అను పేరుగల వర్కరు హాస్టల్‌లో ఏమి మిగిలితే అవి ఇచ్చేవాడు. (ఒక్కొక్కసారి అన్నం వుండేది, కూరలు వుండేవికావు. ఇరుగు పొరుగు కార్మికులు పచ్చడి ఇచ్చేవారు. దానితో సరిపుచ్చుకునేవాడిని. ఒక్కొక్కసారి అన్నం లేకుండా చిలకడదుంప ముక్కలు పులుసు తెచ్చేవాడు. అవి తిని ఆకలి చంపుకునేవాడిని.) సంఘం విజయం సాధించాక, బలపడిన తరువాత నెలకు రు.5లు అలవెన్సు ఇచ్చేవారు.

## కార్మికోద్యమ తొలి అనుభవాలు:

అంబళ్ళ అప్పలస్వామి అనే జట్టు కార్మికుని పరిచయం చేసికొని, అతని ద్వారా జట్టు మేస్త్రిని కలుసుకుని, "చీపురుపుల్లను విరవగలం గాని చీపురుకట్టను విరవలేము గనుక, మీరు సంఘంగా మారం"డని చెప్పాను. కాలికి జోడు లేకుండా నిక్కరు, అఫ్ షర్ట్‌లో నున్న నన్ను చూసి, "మొత్తం 500 మంది కార్మికులను సమ్మెలోకి తెస్తాను. వారిని ఒక నెలరోజులు పోషించగల శక్తి మీకు ఉన్నదా?" అని అడిగాడు. నేను "ఇప్పుడు సమ్మె చేయమనలేదు గదా" అన్నాను. "వెళ్ళవయ్యా, సమ్మె లేకుండా కూలి ఎలా పెరుగుతుంది? ఏ రోజు కూలి ఆ రోజు ఇంటికి పట్టుకెళ్ళితేగాని గడవని మాకు ధన సహాయం లేకుండా ఎలా సమ్మె చేయగలం. వెళ్ళు వెళ్ళు" అని తిప్పిపంపివేశాడు. నేను చిన్న మొగం చేసికొన్నాను. అప్పుడు కొంతమంది జట్టు కార్మికుల సలహాపై బండ్ల కార్మికుల ఇండ్లకు పోయి, సంఘం పెట్టుకోవాలని, జామి సన్యాసిరావు అనే స్నేహితునితో కలసి ప్రచారం చేశాను. ఇంతలో గోదావరి ఒడ్డున పడవల రేవులో దిగుతూ బండలో పడి బండి తిరగబడటం, ఒక ఎద్దు కాలు విరిగిపోవడం జరిగింది. మొత్తం బళ్ళు అన్నీ ఆగిపోయాయి. ఆ కార్మికుడు తన బ్రతుకు పోయిందని ఎంతో బాధపడుతున్నాడు. పైన చినుకులు పడుతున్నాయి. పడవల మీద బస్తాలు రేవులో దింపి ఉన్నాయి. బజారునుండి వర్తకులు వచ్చి చూచి, ఆ బండ్లవారితో "మీలో 5గురు పెద్దలు వస్తే, చందా వేసి ఎద్దును కొనిస్తా"మని చెప్పి వెళ్ళిపోయారు. 'చందాకాదు, కూలి పెంచమని అడగండి' అని మేము అన్నాము. కార్మికులలో చాలాసేపు తటపటాయింపు జరిగిన తరువాత, కూలి పెంచమని అడగాలని మెజారిటీ నిర్ణయానికి వచ్చారు. 5గురు పెద్దలు వెళ్ళి 'చందా కాదు, కూలి పెంచ'మని అడిగారు. కూలి పెంచందే బళ్ళు కట్టరని వర్తకులకు అర్థమయింది. అప్పుడు (బండికి, బండి తోలేవానికి, జట్టుకు కలిపి) ఒక పావలా వుండేది. బండివానికి మూడు పైసలు, జట్టుకు మూడు పైసలు పెంచారు. అనుకోని విధంగా సమ్మె చేయకపోయినా జట్టుకు, బండ్ల కార్మికులకు కూలి పెరిగింది. ఆ రోజునే బండ్ల కార్మిక సంఘం ఏర్పాటుచేసి, నాతోడి విద్యార్థిగా ఉంటూ స్వాతంత్ర్యసమర యోధుడుగా జైలుకు వెళ్ళిన సత్తిరాజు రామచంద్రరావును ఆర్గనైజరుగా పెట్టాము. మరొక మూడు మాసములలో జట్టు కార్మికసంఘం పెట్టాము. ఇంతకుముందు సంఘం అక్కరలేదు అని నన్ను వెళ్ళగొట్టిన వంగా సూరన్న అనే మేస్త్రి వైస్ ప్రెసిడెంట్ అయి, ఆయన బ్రతికున్నంతకాలమూ అనేక ఇతర కార్మికులను సంఘాలు పెట్టుకోండి అని ప్రచారం చేశాడు. 1942-43 సం॥లలో దాదాపు రాజమండ్రి పట్టణంలో కార్మికులందరిలోనూ ట్రేడ్ యూనియన్ ఉద్యమం వ్యాపించింది.

కాకినాడలో విద్యార్థి ఉద్యమంలో పనిచేస్తూ రాజమండ్రి వస్తూ మునిసిపల్ కార్మిక సమ్మెకు సానుభూతి సహకారాలందించే కామ్రేడ్ జి.ఎస్. బాలాజీ దాస్‌గారు పార్టీ హోల్‌టైమరుగా పనిచేయడానికి నిశ్చయించుకుని, కొత్తపేట తాలూకా పార్టీ ఆర్గనైజర్‌గా వెళదామా లేక, జిల్లా యువజన విభాగం చూద్దామా అనే ఆలోచనలో ఉండగా, రాజమండ్రిలో స్థిరపడి పార్టీ ఆర్గనైజరుగా రమ్మని ప్రోత్సహించినాను.

జిల్లాలోగాని, రాష్ట్రంలోగాని రెండు బాధ్యతలు ఉంటే ఇద్దరం చెరి ఒకటి చేద్దామని, ఒకటే ఉంటే అది ఆయనకే ఇవ్వడానికి అంగీకరించి ప్రోత్సహించి రాజమండ్రిలో ఉండిపోయేలా చేశాను. 1943 నుండి కృష్ణా సినిమావద్ద పార్టీ ఆఫీసు తీసుకొన్నప్పటినుండి బాలాజీ దాసుగారు రాజమండ్రిలో స్థిరపడి, పార్టీ నిర్మాణము, ప్రజా ఉద్యమాల నిర్మాణంలో నాతో కలసి పనిచేశారు.

## రాజమండ్రి కార్మికోద్యమ విశిష్ట లక్షణాలు:

రాజమండ్రిలో 1945లో బ్రహ్మాండమైన ట్రేడ్ యూనియన్ మహాసభ జరిగింది. అన్ని పేటలకు, అన్ని వృత్తులకు వ్యాపించింది. చండ్ర రాజేశ్వరరావుగారు ఇక్కడ కార్మికుల వాలంటీర్ల క్రమశిక్షణ, మొత్తం కార్మికులంతా పార్టీకి రోజు కూలి విరాళం ఇవ్వడం చూచి ముగ్ధులయ్యారు. పార్టీ రహస్య కాలంలో ఉన్న నిబంధనలు మార్చి, కార్మికులలో ఎక్కువమందిని పార్టీ సభ్యులుగా చేర్చుకోమని ప్రోత్సహించారు. రాజమండ్రిలో పార్టీ ఆధ్వర్యాన నిర్మించబడిన కార్మికోద్యమానికి రెండు విశిష్ట లక్షణాలున్నాయి. 1. జట్ల వర్కర్స్ యూనియన్ నిర్మాణం: నూటికి నూరుపాళ్ళు పార్టీకి రోజు కూలి విరాళం ఇచ్చేవారు. (ఇప్పుడు యూనియన్ నుంచి ఇస్తున్నారు.) 2. జట్టుకు ఒక వ్యక్తిగాని, ఇద్దరుగాని వలంటీర్లు మునిసిపల్, అసెంబ్లీ, పార్లమెంట్ ఎన్నికలలో పూర్తికాలం పార్టీకి తోడ్పడతారు. వారికి ఆ నెల రోజులలోనూ కూలిని జట్లు ఇండ్లకు పంపుతాయి. 3. ఎవరైనా సభ్యుడు గానీ మాజీ సభ్యుడుగాని చనిపోతే జట్టుకొక్క మనిషి వచ్చి కర్మకాండలో తోడ్పడతారు. వెయ్యి రూపాయలు కుటుంబానికి ఇస్తారు.

2. అల్యూమినియం వర్కర్స్ కో ఆపరేటివ్ సొసైటీ: లాకౌట్లను ఎదిరించి నిలబడడానికి కార్మిక సంఘానికి అండగా ఉండి, మొత్తం లాకౌట్ కు గురియైన కార్మికులందరికి "పోరా" పద్ధతిపైన వారానికి రెండు రోజులు పనిచెప్పి, షావుకార్లకు లొంగకుండా చేస్తారు. అందువలన షావుకార్లు లాకౌట్లు మాని న్యాయమైన పరిష్కారానికి సంప్రదింపుల ద్వారా వస్తారు.

ఇప్పుడు పార్టీలో కొత్తవాళ్ళు చేరడం తగ్గింది. ఉన్నవాళ్ళ కార్యకలాపాలు పలచబడుతున్నాయి. ఇదివరకు రాత్రి పాఠశాల పెట్టినా, రేషన్ కార్డు ఇప్పించినా, రోగులకు చికిత్స చేయించడానికి తోడ్పడినా, తాలింఖానాలో కసరత్తు ప్రోత్సహించినా ప్రతి మంచిపనికి పార్టీ గుర్తింపు ఉండేది. ఇప్పుడు అలాంటి చొరవను ప్రోత్సహిస్తే ముందుకు వెళతాము. పై నుంచి వచ్చే పిలుపులకు మొక్కుబడిగా చేసే పనులకే గుర్తింపు ఉన్నంతకాలం పార్టీ ముందుకు పోదు. ఇప్పుడు సభ్యత్వానికి 5 లేక 6 రెట్లు కార్మికులను, యువకులను సభ్యులుగా చేర్చుకోవడానికి వారి భావనలను పరిగణనలోకి తీసుకుని కార్యకలాపాలు సాగించితే మార్పు వస్తుంది. ట్రేడ్ యూనియన్ డెమోక్రసీని, పార్టీ అంతరంగిక ప్రజాస్వామ్యాన్ని ప్రోత్సహించితే మార్పు వస్తుంది. సహకార ఉద్యమాన్ని కూడా పార్టీ పెద్ద ఎత్తున ప్రోత్సహించాలి.

★ ★ ★

# శ్రీ పెదపాటి వెంకట్రావు



క్విట్ ఇండియా ఉద్యమంతో నా రాజకీయ జీవితం ప్రారంభమైంది. నేను ఉద్యమంలో 10-9-1942న అరెస్టు చేయబడి రామచంద్రపురం సబ్ జైలులో 23-9-1942 తేదీ వరకు రిమాండులో వున్నాను. తరువాత రాజమండ్రి సబ్ జైలుకు విచారణకు పంపారు. $3\frac{1}{2}$ నెలల తరువాత విడుదల చేశారు. జైలు నుండి వచ్చిన తరువాత రామచంద్రపురంలో ప్రజా నాట్యమండలి ద్వారా ఫాసిస్టు వ్యతిరేక కళారూపాలు ప్రదర్శించాం. 1943 చివరిలో పసలపూడి జనరల్ బాడీలో పార్టీ సభ్యుడుగా తీసుకున్నారు. (చింతం దాసు తాలూకా నిర్మాణం చేసేవారు.) జనరల్ బాడీకి రాష్ట్ర నాయకులు బసవపున్నయ్య హాజరయ్యారు. సీనియర్ నాజర్ రాజమండ్రి వచ్చినప్పుడు నన్ను, వి. బి. రామకృష్ణారావు, బంధకవి రమణమూర్తి ముగ్గురిని దళంగా ఏర్పరచి ట్రైనింగు యిప్పించారు. బుర్రకథ దళం ట్రైనింగు అయి, కష్టజీవి కథ నేర్చుకున్నాం. గ్రామాల్లో బుర్రకథలు చెప్పడం మొదలుపెట్టాం. కొత్తపేట తాలూకాలో జిల్లా రైతు మహాసభ జరిగినప్పుడు గ్రామాల్లో ప్రచారం చేసి, విరాళాలు వసూలు చేశాం. తర్వాత జిల్లాలో చాలాచోట్ల కథలు చెప్పాం.

1946 ఎన్నికల్లో కామ్రేడ్ చింతం సత్యనారాయణదాసును క్యాండిడేట్‌గా పార్టీ నిలబెట్టినప్పుడు నియోజకవర్గంలో ఎన్నికల ప్రచారం చేశాం. ఎన్నికలు అయిపోయిన తర్వాత జిల్లా కమిటీ బుర్రకథ దళాన్ని రద్దుచేసి, పార్టీ నిర్మాణ బాధ్యతలు అప్పచెప్పారు.

అదేకాలంలో ప్రకాశం ఆర్డినెన్సు జారీ అయింది. అదే టైములో అనపర్తి ఐ.ఎల్.టి.డి. కార్మికుల సమ్మె, పందలపాక నూలుమిల్లు కార్మికుల సమ్మె, పసలపూడి లాకు, పామర్రు ఏరియా గ్రామాల్లో ఉధృతంగా సాగాయి. రాష్ట్ర వ్యాపితంగా మునిసిపల్ వర్కర్స్ సమ్మె జరిగింది. రామచంద్రపురం, మండపేట మునిసిపాల్టీలో సమ్మె ఉధృతంగా జరిగింది. మండపేటలోను, రామచంద్రపురంలోను భూస్వామ్య శక్తులు సమ్మెను విచ్ఛిన్నం చేయుటకు ప్రయత్నిస్తే, తీవ్రంగా ప్రతిఘటించి సమ్మెను కొనసాగించాం. అదే సమయంలో వెంటూరులో వ్యవసాయ కూలీ మహాసభ జరిపి 2000 మంది వ్యవసాయ కార్మికులతో వెంటూరు నుంచి రామచంద్రపురం వరకు

వ్యాపింపు నిర్వహించాం. ప్రభుత్వ నిర్బంధ విధానం తీవ్రంగా వున్నా, పోరాటాన్ని నడుపుటకు పార్టీని సమాయత్తం చేశాము. ఈ సమయంలో యించుమించు పార్టీ నాయకత్వం రహస్యంగా పనిచేసింది. ఈ కాలంలోనే (1948) బుద్ధవరం రాష్ట్ర పార్టీ మహాసభ, కలకత్తా కాంగ్రెసు జరిగాయి. కలకత్తా పార్టీ కాంగ్రెస్ నుండి వచ్చిన తరువాత పార్టీ నిషేధించబడింది. రహస్యంగా పనిచేశాం. 1948 జూన్ 3న అరెస్టు చేసి, డిటెన్యూగా రాజమండ్రి సెంట్రల్ జైలుకు పంపబడ్డాను. కొంతకాలం తరువాత రాజమండ్రి నుండి కడలూరు జైలుకు మార్చారు. 1948 జూన్ నుండి 1951 జులై వరకు కడలూరు జైలులో వున్నాను. జులైలో విడుదల అయ్యాను.

జైలు నుండి వచ్చిన తరువాత పార్టీ కార్యకలాపాలు మొదలుపెట్టాం. ఆ సందర్భంలో నన్ను, చిత్తూరు కామ్రేడ్ సీతారామయ్యను రైతు మీటింగు జరుగుతుంది కలకత్తా రమ్మని నాయకులు కబురు పంపారు. కలకత్తా వెళ్ళాం. మమ్మల్ని అక్కడే రహస్యంగా వున్న నంబూద్రిపాద్ వద్దకు పంపారు. 3 రోజులు ఆయన మాతో చర్చించారు. తర్వాత రాజేశ్వరరావుగారు, మద్దుకూరి చంద్రంగారు మరో మూడు రోజులు చర్చలు జరిపారు. అప్పటికే జిల్లాకు సంబంధించి చాలామంది కామ్రేడ్స్ రహస్యంగా వున్నారు. రాజేశ్వరరావుగారు, చంద్రంగారు జిల్లా కాన్ఫరెన్సు జరిపి రహస్యంగా వున్నవారు. లీగల్‌గా వున్న కామ్రేడ్స్‌తో కలిసి జిల్లాలో జరుపుటకు వీలులేదుగాని పూరీలో తిరగమన్నారు. రహస్య కాన్ఫరెన్సు పూరీలో జరిగింది. దానికి రాజేశ్వరరావుగారు హాజరయ్యారు. అందులో రహస్యంగాను, లీగల్‌గాను వున్న కామ్రేడ్స్‌తో కమిటీ వేసి, జిల్లాలో లీగల్ కాన్ఫరెన్సు జరుపుటకు నిర్ణయించారు. లీగల్ కాన్ఫరెన్సు అంతర్వేది పాలెంలో జరిగింది. కాన్ఫరెన్సు కామ్రేడ్స్‌తో సంబంధాలు పెట్టుకొనుటకు, యీ మహాసభ జరుపుటకు రహస్యంగా వుంటూ పనిచేస్తున్న భూపతి వెంకట నర్సయ్యగారు కొరియర్‌గా వుంటూ రాష్ట్ర నాయకులతోను, మాతోను మంచి సంబంధాలు పెట్టుకొని, illigal, legal కాన్ఫరెన్సులు జయప్రదం అగుటకు తోడ్పడ్డారు. నేను పార్టీ నిర్మాణ బాధ్యత తీసుకున్నాక ప్రధానంగా వ్యవసాయ కూలీ సంఘ బాధ్యత తీసుకుని పనిచేశాను. బహుశా 1952 అని గుర్తు, జిల్లా వ్యవసాయ కార్మిక సంఘ ప్రెసిడెంటుగా ఎన్నికయ్యాను. రాష్ట్ర వ్యవసాయ కార్మికసంఘ కార్యవర్గంలోను, జిల్లా వ్యవసాయ కార్మిక ప్రెసిడెంటుగాను, మధ్యలో కొద్దికాలం మినహా ప్రెసిడెంటుగా వున్నాను. జిల్లా పార్టీ కార్యదర్శిగా పనిచేశాను. ఎప్పుడు ఎన్నికై ఎన్ని సంవత్సరాలు పనిచేసినానో గుర్తులేదు. జిల్లా కార్యదర్శిగా పనిచేసినంతకాలం రాష్ట్ర కార్యవర్గ సభ్యునిగా వున్నాను. 1979 అగస్టులో రష్యా వెళ్ళి, 1980 మార్చి నాటికి తిరిగి వచ్చాను. తిరిగి వచ్చాక తిరిగి వ్యవసాయ కార్మికసంఘం ప్రెసిడెంటుగా ఎన్నికై పనిచేశాను.

జిల్లాపార్టీ మహాసభలో జిల్లా కార్యవర్గంలోకి ఎన్నుకున్నారు. సహాయ కార్యదర్శిగా ఎన్నుకోబడ్డాను. సెక్రటేరియట్ రద్దు అయేవరకు సెక్రటేరియట్‌లో వున్నాను. రాష్ట్ర మహాసభలో రాష్ట్ర కౌన్సిల్ సభ్యుడుగా ఎన్నుకోబడ్డాను. సాధారణ సభ్యుడుగా కొనసాగుతూ, యిప్పటివరకు తాలూకా పార్టీ యిచ్చిన కార్యక్రమం నాకు అవకాశమున్నంతవరకు చేస్తున్నాను.

★ ★ ★

# డా॥ మాడభూషి భావనాచార్యులు



మా మాతా పితరులు సంస్కృత పండితులు. మా పితృదేవులు వైయాకరణి కూడా. ఎస్టేట్ ఆస్థాన విద్వాంసులు. తండ్రి పండిత శ్రీమాన్ మాడభూషి గోపాలాచార్య. తల్లి కనకమ్మ. మా అన్నలిద్దరూ బి.ఎ. ప్యాసయ్యారు. జ్యేష్టుడు వివాహమయిన 3 మాసాలకు మరణించాడు. రెండవ సోదరుడు సామర్లకోట ప్యారీ కంపెనీలో కమీషనరుగా, ధాన్యం బస్తా రు.2లు ధర ఉన్నపుడు, నెల 1కి రు.300 జీతంతో ఉద్యోగం చేసేవాడు.

మా యింటిలో మహాభారత–రామాయణ–భాగవత, పదోపనిషత్తులు–దివ్య ప్రబంధానుసంధానం–గోష్టులు అనునిత్యం సాగేవి. ఆ పఠన పాఠన వృత్తాలు నాకు అలవడ్డాయి.

1. పరోపకారేణ యిదం శరీరం: మానవజన్మ ఉత్తమ జన్మ. దీనిని పరోపకారానికే వినియోగించాలి.

2. "సిరి పంచి కుడుచుట మేలు" అనగా, సంపదను అందరూ పంచుకొని అనుభవించాలి అని భీష్ముడు అన్నాడు. ఈ సిద్ధాంతం మేరకే కురుక్షేత్ర మహాసంగ్రామం జరిగింది. రష్యాలో విప్లవం వచ్చింది.
3. రంతిదేవుడు భాగవతంలో – శ్లో॥ నకాంక్షే రాజ్యం, నస్వర్గం, నపురర్భవం, కామయే దుఃఖ తప్తానాం ఆర్తినాశనం – 'నేను రాజ్యాన్ని గానీ, స్వర్గాన్ని గానీ, మంచి జన్మనుగానీ కోరను. దుఃఖార్తులయినవారి కష్టాలను పారద్రోలాలనే నా ఆకాంక్ష' అన్నాడు.
4. మనుధర్మ శాస్త్రంలో – నీ జీవనానికి కావలసినంతే కూడబెట్టు, అంతకంటే ఎక్కువ కూడబెట్టడం దొంగతనమవుతుంది, అది శిక్షార్హం అన్నాడు.
5. ఆత్మవత్ సర్వభూతాని – సర్వ భూతర్ద మాత్మనాం ఈక్షతే యోగ యుక్తా అనగా – నీలో అందర్నీ – అందర్లో నిన్ను చూడాలని ఉపనిషద్వాక్యం.
6. పురాణాంతర్గత శాంతి పాఠంలో "లోకాః సమస్తా సుఖినోభవంతు" – "ప్రపంచమంతా సుఖశాంతులలో ఉండాలి" అన్నారు.
7. ఏకోరసకరుణ ఏవ – "అన్ని రసాలలో ఏకైక రసం కరుణ" అన్నాడు భవభూతి. మానవుడు కరుణ్ రపచానం – వివేకానంద – భగవద్గీత అధ్యయనం ఉండేది.

## కమ్యూనిస్టు తాత్విక చింతన-ఆచరణ:

తరతరాలుగా మన మహర్షులూ మూలగ్రంథాలూ సమసమాజం–దారిద్ర్య దీన రహిత సమాజం కొరకు తపించినా, నేటి వరకు అట్టి సమాజం నిర్మించబడలేదు. అందుకు నేటి సమాజాన్ని సమూలంగా మార్చాలి. అందుకు ఒక సాధనం కావాలి. అదే మార్క్సిజం. కారల్ మార్క్స్, ఎంగెల్స్ కరుణామూర్తులు. దోపిడి సహిత సమాజంలో రాదిది; కార్మిక, కర్షక, పీడిత జనంపై కరుణున్న కార్మిక కర్షక నియంతృత్వం కావాలన్నారు. 1938లో భారత కమ్యూనిస్టు పార్టీలో సభ్యుడ నయ్యాను. భారతీయ తాత్విక చింతననుండి కమ్యూనిస్టు తాత్విక చింతనకు చేరాను. కాకినాడ, పి.ఆర్. కాలేజీ హైస్కూలులో చదువుతున్న రోజులవి. విద్యార్థి ఉద్యమంలో పర్వతనేని వెంకటేశ్వరరావు, పి.ఎన్.శర్మ, పరకాల పట్టాభిరామారావుగార్లు నాయకులు. డిటెన్షన్‌కు వ్యతిరేకంగా విద్యార్థుల సమ్మెలో నేను ప్రథమ శ్రేణిలో ఉన్నాను. 1939 సెప్టెంబర్ 3వ తేదీన నేతాజి సుభాస్‌చంద్రబోస్‌ను స్టూడెంట్ ఫెడరేషన్ మహాసభకు కాకినాడ ఆహ్వానించాం. అది జయప్రదం చేసేందుకు అహర్నిశలూ పనిచేశాం. ఆ రోజునే రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. భారత స్వాతంత్ర్య పోరాటాన్ని ఉధృతం చేసేందుకు యిదే తరుణమని నేతాజీ కాకినాడ టౌన్ హాలులో జరిగిన విద్యార్థి మహాసభ వేదికనుండి గర్జించాడు. తరువాత విద్యార్థి నాయకుడు పర్వతనేని వెంకటేశ్వరరావుకు ప్రభుత్వం వారంటు జారీ చేసింది. అతను అరెస్టు కాకుండా పరారయ్యాడు. ప్రభుత్వం కాకినాడను రెడ్ ఎలర్ట్ చేసింది. మా యిల్లు కూడా పోలీసులు సోదా చేశారు. సి.వి.కె. రావు, పి.ఎస్. శర్మ అరెస్టయ్యారు, కొరపాటి పట్టాభిరామయ్య, మహీధర, పర్వతనేని, పరకాల తదితరుల అజ్ఞాత సాహసగాథలు నన్ను ఉత్తేజపరిచాయి. 1937లో వ్యవసాయ కూలీ మహాసభ రాజోలు తాలూకాలో కొరపాటి నాయకత్వాన జరిగింది. శ్రీ ఎ.టి. రణదీవే వచ్చాడు.

## రాజోలు తాలూకా వ్యవసాయ కార్మిక పోరాటాలు:

రాజోలు తాలూకా వ్యవసాయ కూలీలకు ఒక విశిష్టత ఉంది. అచ్చట కూలీలు చాలామంది రంగూన్ వెళ్ళి, ధనం సంపాదించి తిరిగి వచ్చేశారు. వారు గోచీలను వదలి ప్యాంటు, చొక్కాలను ధరించారు. రాజోలు తాలూకాలో భూమి కేంద్రీకరణ హెచ్చు. భూకామందులకు అది కన్నెర్రకు కారణమైంది. వ్యవసాయ కూలీ సంఘ నాయకుడు రాపాక సత్యనారాయణను పాములరాజు హత్య చేయించాడు. 15 రోజులు తిరగకుండా పాములరాజు కతం చేయబడ్డాడు. కందికుట్ల నాగభూషణం, కోనేటి రామమోహన్‌రావు, కొరపాటి, నాపై కేసు పెట్టారు. నేను చాలా చిన్నవాణ్ణి అగుటచే విడిచిపెట్టారు. కొరపాటి అజ్ఞాతవాసం, కందికుట్ల, కోనేటివారికి శిక్షలు పడినాయి. పోలీసుల క్రూర నిర్బంధం మితిమీరింది. కొరపాటిని ప్రభుత్వం అరెస్టు చేసింది. రాయవెల్లూరు జైలునుండి తప్పించుకుని, మరొక నలుగురితో పరారి అయ్యాడు కొరపాటి. తర్వాత అంతర్వేదిపాలెంలో జైలునుండి పరారి అయిన కొరపాటి, కందికుట్ల, నేను వ్యవసాయ కూలీ మహాసభ పెట్టి, తుపాకి-పిస్తోలు బాంబుల ఆయుధ ప్రధర్శనం చేశాము. మితిమీరిన ఉత్సాహంతో కొబ్బరిచెట్లు యెక్కి, అన్ని కొబ్బరికాయలను తీసి అందరికి పంచి, ఈ సంపదంతా మనదే అన్నాం. ఇది సాహసకృత్యాలే కాని, మార్క్సిజం కాదని రాష్ట్ర పార్టీ భావించి, మాపై చర్యలు తీసుకుంది.

1940లో గాంధీ వ్యక్తి సత్యాగ్రహం పెట్టాడు. పార్టీ ఆదేశం ప్రకారం సత్యప్రమాణ పత్రంపై సంతకం చేశాను. 1940 మార్చిలో పోలవరంలో రాజకీయ మహాసభలు జరిగాయి. దానికి రాజగోపాలాచారి, బులుసు సాంబమూర్తి, యింకా అనేకమంది రాజమండ్రి నుండి వచ్చారు. బులుసు సాంబమూర్తిగారు నన్ను రాజాజీకి పరిచయం చేస్తూ, సత్యాగ్రహ పత్రం మీద నేను సంతకం చేశానని చెప్పారు. రాజాజీ నన్ను ఆదరంగా దగ్గర కూర్చోపెట్టుకొని, పేరు, ఇంటిపేరు అడిగారు. చెప్పాను. మీరు శ్రీవైష్ణవులా?' అన్నారు. కులం అడగడం, చెప్పడం ఆ రోజుల్లో అనాగరికం. అందుచే నేను యిలా అన్నాను: "నా తల్లిదండ్రులు శ్రీవైష్ణవులు." రాజాజీ పెద్దగా నవ్వి 'నువ్వు జైలుకు వెళ్ళడానికి సిద్ధమా?' అన్నారు. అవు నన్నాను.

1947 జనవరిలో కమ్యూనిస్టులను ప్రభుత్వం అరెస్టు చేసింది. ఆ దశలో నేను అజ్ఞాతవాసంలోకి పోయాను. కలకత్తాలో జరిగిన భారత కమ్యూనిస్టు మహాసభకు హాజరయ్యాను. ఆ మహాసభ కాంగ్రెస్ ప్రభుత్వాన్ని ఆయుధాలతో కూల్చాలని తీర్మానించింది. నేను అజ్ఞాతంగా కోనడివిలో ప్రవేశించి, రైతాంగ పోరాటాలను చేపట్టాను. ప్రభుత్వం నన్ను, సుమసుందర్‌ని, మరొక 50 మంది రైతుల్ని అరెస్టు చేసింది. నేను తప్పించుకున్నాను. నా ఆచూకీ తెల్పినవారికి 10 వేలు బహుమతి అని ప్రకటించింది.

సాయుధ పోరాటం వ్యక్తిగత హింసావాదంగా దిగజారింది. దానితో పార్టీతో నాకు విభేదం వచ్చింది. నన్ను ఒక్క నాగలాపల్లెలోనే ఉండమని పార్టీ ఆదేశించింది. పోలీసులకు నా ఆచూకీ తెలిసింది. 4 లారీలతో పోలీసులు వచ్చారు. నేను ఒక మేడమీద ఉన్నాను. ఆ మేడనుండి దూకి ప్రక్కకు వెళ్ళేను. పోలీసు సార్జంటు

పిస్టల్‌తో కాల్చాడు. నేను గోడ ప్రక్కకు తప్పుకోవడం చేత ఆ పిస్టల్ గుండు నాకు తగలకుండా తిన్నగా పోయింది. అరెస్టుచేసి, రాయవెల్లూరు, కడలూరు, మద్రాసు, పెనిటెన్‌షరీ, ఢిల్లీలోని తీహార్‌జైళ్ళలో ఉంచారు.

జైలులోను, తదుపరి జైలు బయటకు వచ్చాక పార్టీ ముందు నేను కొన్ని అభిప్రాయాలను ఉంచాను. అందులో ముఖ్యమైనది:

1. చట్టసభలలో పార్టీ ముఖ్యకార్యకర్తలు చొరబడరాదు. వారు వర్గ చైతన్యాన్ని, ప్రజా పోరాటాలను చేపట్టాలి. ప్రజా ఉద్యమాలు ప్రధానం కాని, ఎన్నికలు ప్రధానం కాదు. 2. పార్టీలో అంతర్గత ప్రజాస్వామ్యం ఉండాలి. 3. మార్క్సిజం ఒక సిద్ధాంతమే కాదు. పిడివాదం కాదు. చిలక పలుకుల మార్క్సిజం కమ్యూనిజానికి వినాశహేతువు. 4. భారతీయ తాత్వికతను మార్క్సిజాన్ని మిళితం చేయాలి. 5. గురజాడ–వీరేశలింగాలు నేటికీ ఆంధ్రావనిలో సజీవులుగా ఉండేందుకు కమ్యూనిస్టు పార్టీ కృషి చేయాలి. 6. స్వామి వివేకానందను విస్మరించరాదు. స్వామి వివేకానంద భావాలను పరిగణనలోకి తీసుకోనిదే భారతదేశంలో సోషలిజం రాదు. వచ్చినా బ్రతకదు.

అలాగే మన వేదాలలో సమాజ శ్రేయస్సుకు చెప్పబడిన విషయాలను మనం పురస్కరించుకుని, ఆ పరిభాషలో మనం సోషలిజం గురించి, కమ్యూనిజం గురించి ప్రజలకు చెప్పాలి. అనగా – మన చరిత్ర, సంస్కృతి, మన తత్వశాస్త్రాల వేళ్ళు (Roots) పట్టుకోవాలి. అక్కడినుండి మార్క్సిజంను అన్వయించి చెప్పాలి.

నాకు మార్క్సిజంలో అచంచల విశ్వాసం ఉంది. మన దేశానికి కమ్యూనిజం వచ్చి తీరుతుంది. అయితే, దానిని మన భారతదేశ విశిష్ట తాత్విక చింతనకు జోడించాలి.

మూడు సంవత్సరాలక్రితం కామ్రేడ్ చండ్ర రాజేశ్వరరావు గారితో ఈ విషయాలే ముచ్చటించాను. మఖ్దూంభవన్‌లో వారు ఏర్పాటు చేసిన సమావేశంలో పాల్గొన్నాను. అప్పుడు వారు నాతో– 'మీరు మన భారతదేశ చరిత్ర, సంస్కృతి, తత్వశాస్త్రాలను మార్క్సిస్టు దృక్కోణంనుండి పరిశోధన చేయండి. అది పార్టీకి చాలా అవసరం. ఈ విషయాన్ని మనం అశ్రద్ధ చేశాం. అందుకే మనం భారత ప్రజల మనస్తత్వాన్ని, ఆలోచనా విధానాన్ని అవగాహన చేసుకోలేకపోయాము' అని అన్నారు. నేను జైలునుండి వచ్చిన తరువాత నా దృష్టిని ఈ విషయంపైననే కేంద్రీకరించాను.

నేను పార్టీ సభ్యత్వం కొనసాగించకపోయినా, కమ్యూనిస్టుగానే కొనసాగుతున్నాను. వేదాలు, ఉపనిషత్తులు, భారత రామాయణాలు, పురాణాలు, వివేకానంద, అరవింద మొదలైన వారి రచనలను, తాత్విక చింతనను మార్క్సిస్టు దృక్పథంలో అధ్యయనం చేస్తున్నాను. ఋగ్వేదం–ఉపనిషత్తులు, భారతీయ తత్వశాస్త్రాలపై పరిశోధన చేసి డిప్లొమా పొందాను. సామాజిక ఉత్పత్తిలో సంబంధం లేకుండా, ప్రజలతో సంబంధం లేకుండా కేవలం అధ్యయనం ఒక్కటే చాలదు అని చెరకు రైతుల సమస్యలపై గత 30 సంవత్సరాలుగా కృషి చేస్తున్నాను. ఒక దశలో చెరకు రైతుల సంఘం పని మానివేద్దామని, తత్వశాస్త్ర అధ్యయనానికే నా కాలం అంతా వినియోగిద్దామని అనుకొని, చండ్ర రాజేశ్వరరావుగారితో సంప్రదించాను. వారు

'రైతాంగంతో సంబంధాలు వదులుకోవద్దు. ప్రజల సమస్యలతో కూడా మనం దగ్గర సంబంధం కల్గి ఉండా'లని సలహా యిచ్చారు. అందుకే రాష్ట్ర చెరకు రైతుల సంఘంలో కృషి చేస్తున్నాను.

"సిద్ధాంతంలేని ఆచరణ గుడ్డిది– ఆచరణలేని సిద్ధాంతం గొడ్డుది" అన్నాడు మార్క్స్ మహర్షి. శ్రీ హర్షుడు 'అధీతి బోధా వరణైః' అన్నాడు నైషధంలో. అధీతి అంటే చదివి దానిని బోధపరుచుకోవడం, తాను ఆచరించడం– దానిని ప్రచారం చేయడం – అవే విద్యఅంటే అన్నాడు. విజ్ఞతగల పండిత హృదయుడు కమ్యూనిస్టు అవ్వాల్సిందే! అని నా విశ్వాసం.

మహాభారతంలో సుభద్ర గర్భవతి– అత్త కుంతికి నమస్కరించింది. కుంతి యిలా ఆశీర్వదించింది:

*శ్లో॥ భాగ్యవంతం ప్రసూమేధా మా పారం మాద పండితం*
*శూరా శ్చకృత విద్యాశ్చ మనుపుతాః వశంగతాః.*

'అమ్మా! సంపన్నులైన సంతానాన్ని కను. శూరుల్నిగానీ – పండితుల్నిగానీ కనకు. శూరులూ, పండితులూ అయినా నా కుమారులు యావజ్జీవం కష్టాలనూ, అరణ్య వాసాలనూ అనుభవించారు.' అంటే, మేధా సంపన్నులైన పండితులూ, శూరులైన తాడిత పీడిత ప్రజలు కాలదోషం పట్టిన ధర్మాలను పారద్రోలి, నూతన ఆగత ధర్మాలకొరకు సంగ్రామాలను సాగిస్తారు. మృత్యోన్ముఖమైన గత ధర్మం, వీరిని కాటు వేస్తుంది. అందుకే శూరులూ, పండితులూ నిరంతర బాధలకు గురి అవుతారు. పిఠాపురంలో కవి పండిత కుటుంబీకుల నందరినీ కమ్యూనిస్టు పార్టీ ఆకర్షించింది. 'Simple living and high thinking' అన్న మిల్టన్ సూక్తి కమ్యూనిస్టులకు వర్తిస్తుంది. నేను కమ్యూనిస్టుగానే పుట్టాను, కమ్యూనిస్టుగానే జీవించాను, కమ్యూనిస్టుగానే మరణిస్తాను.

★ ★ ★

# శ్రీ భూపతి వెంకట నర్సయ్య



నేను నిరుపేద వ్యవసాయ కూలీ కుటుంబంలో జన్మించాను. తల్లిదండ్రులైన తాతయ్యా, సుబ్బమ్మగార్లు కష్టజీవులు; జీవనానికి రెక్కలు కష్టం తప్ప మరొక ఆధారం లేదు. ఆ రోజులలో వ్యవసాయ కూలీ కుటుంబాలలో పస్తులు సర్వసాధారణం. మాదీ అదే పరిస్థితి. కుటుంబంలో నేనే పెద్దవాడను. తల్లిదండ్రులు ఇరువురు కూలి పనులకు వెళితే, నాకంటే చిన్నవారైన చెల్లెళ్ళ దగ్గర యుండుటకు నేను ఇంటివద్దనే వుండేవాడిని. బడికి వెళ్లినా, పుస్తకాలు కొనగలిగే స్థితి లేదు.

మాది తూర్పు గోదావరి జిల్లా అంతర్వేది పాలెం ఫిర్కా మల్లిపురం గ్రామం. మల్కిపురం అంతర్వేది పాలెం ఫిర్కాకు కూడలి గ్రామం. రాజోలు తాలూకా కమ్యూనిస్టు ఉద్యమానికి గుండెకాయ లాంటిది.

రాజోలు తాలూకా కమ్యూనిస్టు పార్టీ ప్రజాసంఘాలు చురుకుగా వ్యాప్తి చెందుతున్న కాలమది. గ్రామ గ్రామాన బాలసంఘాలు ఏర్పాటుగాబడుచున్నవి. బాలబాలికలలో ఆటల పోటీలు జరిగేవి. చదువుపై ఆసక్తి కలిగించేవి. "బాల సంఘ సభ్యులం–భరత

మాత పుత్రులం" లాంటి పాటలతో పల్లెసీమలు మారుమ్రోగుచుండేవి. నేను బాలసంఘాలవైపు ఆకర్షించబడ్డాను. ఇటీవలనే మరణించిన నా బాల్యస్నేహితుడు, ఆప్తమిత్రుడు కీ॥శే॥ గేదెల సోమేశ్వరరావు మా గ్రామ బాల సంఘానికి అధ్యక్షుడు, నేను కార్యదర్శిని.

మా ప్రక్క గ్రామమైన అంతర్వేది పాలెం గ్రామానికి చెందిన గెడ్డాడ నాగ భూషణంగారు బాల సంఘ సమావేశాలకు వచ్చి ఉపన్యసించేవారు. ఉత్సాహపరిచేవారు. వారు చెప్పే విషయాలు నాకయితే అర్ధం అయ్యేవిగాదు గాని, చదువుకోవాలనే ఆసక్తి కలిగించేవి.

మేము ఉండే పేటలోనే రాజోలు తాలూకా కమ్యూనిస్టు పార్టీ ఆఫీసు, జిల్లా వ్యవసాయ కార్మిక సంఘం ఆఫీసు యుండేవి. రాజోలు తాలూకా పార్టీ నిర్మాతలలో ఒకరు, పార్టీ వ్యాప్తికి సర్వస్వం ఒడ్డి పనిచేసి, ఇప్పటికే ఆ కృషిని కొనసాగిస్తున్న కామ్రేడ్ అల్లూరి వెంకట్రామరాజుగారు; ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు, వ్యవసాయ కార్మికోద్యమనేత, ప్రియతమ నాయకుడు, అమరజీవి కందికట్ల నాగభూషణం, తదితర నాయకులు తరచుగా ఆఫీసుకు వచ్చేవారు. నేను ఆఫీసు దగ్గరకు వెళ్ళేవాడిని. కామ్రేడ్ అల్లూరు వెంకట్రామరాజుగారు, కందికట్ల నాగభూషణంగారు నన్నుమంచిగా చూచేవారు. మల్కిపురంలో యున్న పార్టీ ఆఫీసుకు దాదాపు 3 మైళ్ళ దూరంలో యున్న తులావారికొట్లువద్ద చిన్న కాఫీ హోటల్ యుండేది. ఆ హోటల్లో బూరెలు వండేవారు. నాగభూషణంగారు సైకిలుపై నన్ను కూర్చుండబెట్టుకుని హోటల్‌కు తీసుకువెళ్ళేవారు. బూరెలు తినమనేవారు. నన్ను అంత ఆత్మీయతతో చూచేవారు. ఆయన సైకిల్ ఇంకా నాకు గుర్తుంది. ఆయన సైకిలు బ్రేకు కుడిచేతివైపు ఉండేది.

మా అన్నయ్య భూపతి నారాయణమూర్తిగారు అప్పటికే కమ్యూనిస్టు పార్టీ కార్యకర్త, నాయకులు, పార్టీ హోల్‌టైమరు. మా వదినగారైన శ్రీమతి కమలమ్మగారు పార్టీ సభ్యురాలు. వీరందరి ప్రభావం, ముఖ్యంగా బాల సంఘాలు కమ్యూనిస్టు పార్టీకి నన్ను దగ్గర చేర్చాయి.

## విద్యార్థి ఉద్యమ ప్రభావం:

మా చెల్లెళ్ళు కాస్త పెద్దవారయ్యారు. నాకు చదువుకోవాలని వుంది. చదువు కునేందుకు పుస్తకాలు కొనే స్థితి మా కుటుంబానికి లేదు. వెంకట్రామరాజుగారు, నాగభూషణంగారు ప్రోత్సహించారు. సఖినేటిపల్లి లూథరన్‌మిషన్ హయ్యర్ ఎలిమెంటరీ స్కూలులో చేరాను. దాదాపు 6 మైళ్ళు రోజూ నడిచి బడికి వెళ్ళేవాడిని. ఈ పాఠశాల ప్రధానంగా దళితులలో విద్యాభివృద్ధికి అపారమైన కృషి చేసింది. అప్పటి అంతర్వేది పాలెం ఫిర్కా విద్యార్థి ఫెడరేషన్ పటిష్టంగా పనిచేస్తూ ఉండేది. బీర ఆశీర్వాదంగారు ఈద దేవదానంగారు, కోట ఇమ్మానియేలు గారు, ఈద జాషువగారు, తదితరులు ఉద్యమ నాయకులు. వారితో నాకు పరిచయం కలిగింది. ఫిర్కా విద్యార్థి ఫెడరేషన్ మహత్తర చరిత్ర గలిగింది. అంతర్వేదిపాలెం ఫిర్కాలో విద్యాభివృద్ధికి, అందునా పేదలు, దళితులు విద్యాభివృద్ధికి ఆదర్శవంతమైన, అపూర్వమైన కృషి చేసింది. ప్రతి సంవత్సరం పెక్కు వేసవి పాఠశాలలు నిర్వహించేది. ఎంతోమంది విద్యార్థులను పాఠశాలలోనూ, కళాశాలలోనూ చేర్పించింది. చాలామంది డాక్టర్లు,

ఇంజనీర్లు, ఉన్నత విద్యావంతులుగా అభివృద్ధి గావడానికి ప్రశంసనీయంగా దోహదం చేసింది. నేను విద్యార్థి ఫెడరేషన్ సభ్యునిగా చేరాను. సంఘ సభ్యత్వం చేర్పించే వారిలో నేను కూడా ఒకడను. భీమవరంలో జరిగిన రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ మహాసభకు రాజోలు తాలూకా నుండి హాజరైనవారిలో నేను యున్నాను. ఆ సభలోనే తొలిసారిగా వంకా సత్యనారాయణగారిని, మారెళ్ళ నరసింహారావుగారిని చూశాను.

మల్కిపురం హయ్యర్ ఎలిమెంటరీ స్కూలులో 6 వ తరగతి చదువుచున్నాను. ఒకరోజున పాఠంచెప్పే మాష్టారు రాలేదు. క్లాసు రూంలో అల్లరిచేసేవారి పేర్లు వ్రాసి మాష్టారు వచ్చినపుడు చూపించాలి. అల్లరి చేసేవారి పేర్లు వ్రాసేవానిగా, టేబుల్ దగ్గర నిలబడి డిటెన్షన్ విధానం రద్దును గూర్చి ఉపన్యాసం చెపుతున్నాను. పాఠశాల ప్రధానోపాధ్యాయులు శ్రీ ముష్టి నరసింహమూర్తిగారు వచ్చి నా వెనుక నిలబడి ఎంతసేపటి నుండి వింటున్నారో తెలవదు. 'ఒరే భూపతీ! నన్ను పాఠం చెప్పనిస్తావా లేదా?' అన్నారు. నేను చప్పున కూర్చుండిపోయాను. భయంగా వుంది. ఆయన పాఠం ముగించి వెళ్ళి నాకు కబురు చేయించారు. 'ఏరా, నీవు ఎటూ పాడయిపోయావు. బయట ఏలాగూ మీటింగులు పెడుతున్నావు. ఇక క్లాసు రూంలో గూడా ఉపన్యాసాలు చెప్పి మిగిలినవారిని కూడా పాడుచేయడమెందు'కని మందలించారు. ఆయన మంచి టీచరు. క్రమశిక్షణకు మారుపేరు. ఆయన అంటే అందరకు భయం. అంతకుమించి గౌరవం.

## క్లాసు రూమ్‌లో అంటరానితనం:

అప్పుడు అంటరానితనం అమలులో వుంది. షెడ్యూలు కులాల విద్యార్థులు వేరుగా కూర్చోవాలి. పాఠశాలకు ఎదురుగా వున్న మంచినీరు బావిలో నీళ్ళు తోడుకోరాదు. ఎవరైనా నీరు తోడిపోస్తేనే త్రాగాలి. దీనివల్ల ఏదో తెలియని బాధ యుండేది. మా పేటకు వచ్చే కమ్యూనిస్టు నాయకులు అంటరానితనం పోవాలని చెపుతూ ఉండేవారు. ఇది నాకు మంచిగా ఉండేది.

అదే కాలంలో యువజన సంఘాలు గ్రామ గ్రామాన ఏర్పడి పని చేస్తున్నవి. రాజోలు తాలూకా యువజన మహాసభలు మానేపల్లిలో జరిగాయి. నా వయస్సు తక్కువగా వున్నందున ప్రతినిధుల సభకు నన్ను రానీయలేదు. ఆటల పోటీలు చూశాను. బహిరంగసభలో ఉపన్యాసాలు విన్నాను. అల్లూరు బుచ్చిరాజుగారు బరువైన బియ్యమో, ధాన్యమో బస్తా పండ్లతో ఎత్తి పైకి వేశారు. సైకిలు స్లో పందెంలో కడిమి చిన సుబ్బారావుగారు ప్రథమ విజేత. బహిరంగ సభలో ఉత్తేజకరమైన ప్రసంగాలు చేసిన వావిలాల గోపాలకృష్ణయ్యగారు, పరకాల పట్టాభిరామారావుగారు నాకు గుర్తున్నారు. మల్కి పురంలో జరిగిన యువజన మహాసభలో, ఆటలపోటీలు జరిగాయి. ప్రముఖ విప్లవ వీరుడు అంబికా చక్రవర్తిగారు సభలో ఉపన్యసించారు. అప్పటికే కమ్యూనిస్టు పార్టీతో సాన్నిహిత్యం పెరిగింది.

ప్రజా నాట్యమండలి దళాలు గ్రామ గ్రామాన వెలిశాయి. వ్యాప్తి చెందాయి. పాలేరు నాటకంలో నల్లి సంపదరావు, నల్లి కుటుంబరావు మా భూమి నాటకంలో కడిపె నారాయణమూర్తి, కనుమూరి రంగరాజు; ఏకదేశం నాటకంలో కొల్లాబత్తుల

చినవెంకన్న, కొల్లాబత్తుల వెంకట్రావు, బూసి దామోదరరావు; పోతుగడ్డ నాటకంలో కుసుమ సుందరరావు, భూపతి బేబీ సరోజిని, మరెందరో కళాకారులు వివిధ రూపాల కళా ప్రదర్శనలు యిచ్చేవారు. "మా తెలుగు తల్లికి మల్లెపూదండ" పాటను తాడి కృష్ణమూర్తిగారు శ్రావ్యంగా పాడేవారు. అప్పారి చిన్నబ్బాయి, గెద్దం వెంకటరత్నంగార్ల బుర్రకథ దళాలు ప్రజలను ఉర్రూతలూగించేవి.

## ప్రజానాట్యమండలి ఉద్యమంలో:

బెంగాలు కరువును గూర్చి తెలిపే ప్రతిమ నాటకం అనేక ప్రజానాట్యమండలి దళాలు ప్రదర్శించేవి. గుడిమెళ్ళంక, మూలపోడు, మర్కిపురం వారితో కలిసి ఒక ప్రజానాట్యమండలి సమాజం యుండేది. ప్రతిమ నాటకం ప్రదర్శించాలని పాత్రధారులను ఎంపిక చేయడానికి ఆలోచన చేస్తున్నాం. అన్ని పాత్రలు ఎంపిక జరిగినవి. ప్రతిమ పాత్ర ఎవరు వేయాలి? సమర్థులైన నటులు కూడా స్త్రీ పాత్ర గనుక వేయమన్నారు. సమస్య ప్రతిష్టంభనలో పడింది. నాటకం వేయడం మానివేయడం మినహా మరోమార్గం కనిపించలేదు. ఆ స్థితిలో నేను ప్రతి పాత్ర వేయుటకు అంగీకరించాను. రెండు మూడు ప్రదర్శన లిచ్చాం. నేను తప్ప మిగిలిన వారంతా సమర్థులైన నటు లగుటవలన నాటకం రక్తి కట్టింది. 'నీ పాత్ర చూచిన తరువాత ఎవరూ స్త్రీలను కన్నెత్తి చూడ'రని సందర్భం వచ్చినపుడల్లా వెంకట్రామరాజుగారు అనేవారు. మా దళం ఏకదేశం నాటకం ప్రదర్శించేది. ఆ నాటకంలో భార్య చనిపోయిన నడివయస్సు దాటిన రామయ్యపాత్ర నాకిచ్చారు. నాటకం చూచి, వీడప్పుడే ముసలివా డయ్యాడని మా చినతాతయ్యగారు భూపతి ముత్యాలు అనేవారు. మా గ్రామం బాల సంఘం తరపున ఒక బుర్రకథ దళం ఉండేది. ఆ దళంలో నేను రాజకీయం చెప్పేవాడను. ఆ రోజులలో రాష్ట్రంలో చాలా బాల సంఘాలు యుండేవి. ఉప్పుగుండూరు బాల సంఘం బుర్రకథ దళం ప్రసిద్ధి చెందింది.

## భూస్వాముల దౌర్జన్యాలు:

బడికి వెడుతూనే పేదరికం వలన కూలిపనులకు వెళ్ళేవాడను. కామారు వెంకన్న, కొల్లాబత్తుల చిన వెంకన్న గారలు బంటామేస్త్రీలుగా ఉండేవారు. వారి బంటాలో వరి కోతలు, తదితర కూలి పనులకు వెళ్ళేవారము. "పచ్చపచ్చగా పెరిగి పండి ఒరిగున్నాను", "కార్తీక మాసాన కరువంత భరియించి" మొదలగు ఉత్తేజకరమైన పాటలు పంట పొలాలలో మారుమ్రోగేవి. రాజోలు తాలూకాలో 1942లో వ్యవసాయ కూలీలు హెచ్చు కూలికై పెద్ద ఎత్తున పోరాటాలు జరిపారు. చాకలిపాలెంలో కుటుంబ తగాదాల వలన జరిగిన గృహ దహనాలను అవకాశం తీసుకుని, తాలూకాలోని భూస్వామ్య వర్గాల వ్యవసాయ కూలీల పైన – పేటలపైన తీవ్రమైన దమనకాండను అమలు జరిపారు. ఇండ్లలో ప్రవేశించి కుండలు పగులకొట్టారు. వ్యవసాయ కూలీ యువకుల తలలు, మీసాలు గొరికించారు. నాయకులను అరెస్టు చేశారు. కేసులు బనాయించారు. పెద్దపులి–చినపులి అనే వారిపై చాకలిపాలెం గృహదహనం కేసు బనాయించారు. పెద్దపులిని ఉరితీయగా, చిన్నపులికి, మరికొందరకు యావజ్జీవ శిక్ష పడింది. మా పేటపై కూడా పోలీసులు దాడి జరిపారు. భయభ్రాంతులను చేశారు.

నేను చిన్నవాడిని. ఇలా ఎందుకు చేస్తున్నారో నాకు తెలియదు. తాలూకాలో వ్యవసాయ కార్మిక ఉద్యమాన్ని అణచివేయుటకు నిరంకుశ భూస్వామ్య వర్గం ఎంత ప్రయత్నం చేసినా తిరిగి 1944 నాటికి సంఘం పునర్నిర్మించబడింది. బర్మానుండి కాందిశీకులుగా చాలామంది తిరిగివచ్చారు. రాపాక సూర్యనారాయణ, తదితరులు ఉద్యమానికి నాయకత్వం వహించారు. "ఎగరాలి, ఎగరాలి మన ఎర్రజెండా", "జైజైజై అరుణా పతాకుకు జై" అను పాటలు ప్రతిపేటలోను ప్రతిధ్వనించేవి. వ్యవసాయకూలీల సమ్మెలు జరిగాయి. బట్టేలంకలో మూడు మాసములు వ్యవసాయ కూలీ సమ్మె జరిగింది. సమ్మెకు సహాయంగా తాలూకా అంతటి నుండి బియ్యం తదితరాలు వసూలు చేయబడ్డాయి. మా గ్రామం నుండి కూడా వసూలు చేసి సహాయం చేశాం. సమ్మె సందర్భంగా వ్యవసాయ కూలీ సంఘం నాయకులు గంజి నాగేశ్వరరావుగారిని అరెస్టు చేసి రాజోలులో వుంచారు. నాగేశ్వరరావుగారిని విడుదల చేయాలని రెండువేల మందితో సఖినేటిపల్లి నుండి రాజోలు వరకు సుమారు 10 మైళ్ళ కాలి నడకను పెద్ద ఊరేగింపు జరిగింది. ప్రదర్శనలో నినాదాలిస్తూ పాల్గొన్నాను.

పొలాలలోను, ఇండ్లవద్ద గూడా తమకంటే పెద్ద వయస్సున్న కూలీలను కూడా 'ఒరే, ఒసే' అనే పిలిచేవారు. అలా ఎందుకు పిలిచేవారు? ఏమిటదనిపించేది. కమ్యూనిస్టు పార్టీ నాయకులు తరచుగా కూలీల పేటలకు వచ్చేవారు. కూలీలను గౌరవంగా చూచేవారు. మర్యాదగా పిలిచేవారు. అంటరానితనం పాటించేవారుగారు. కలసి మెలసి తిరిగేవారు. ఆ వ్యత్యాసం కూడా నాకు తెలిసేదికాదు.

ఆనాడు బస్సు సౌకర్యం లేదు. తాలూకా కేంద్రమైన రాజోలుకు వెళ్ళడానికి కాలి నడకమే మార్గం. సఖినేటిపల్లి నుండి రాజోలుకు ఒక పడవ వచ్చి వెళ్ళేది. దానిని మెయిల్‌బోటు అనేవారు. పడవ ఉదయం సఖినేటిపల్లిలో బయలుదేరి మధ్యాహ్నం రాజోలు చేరి, తిరిగి రాత్రికి సఖినేటిపల్లి చేరేది. సుమారు 10 మైళ్ళ దూరం ఉండేది. ప్రయాణీకులు రాజోలు వచ్చి వెళ్ళేవారు. సరుకుల రవాణా జరిగేది. మా తండ్రి ఆ పడవను లాగేపని చేసేవాడు. ఆ పడవకు కట్టిన తాడు భుజాన వేసుకుని రాను, పోను 20 మైళ్ళు బరువైన పడవను లాగటం కష్టమైన పని. ఆ పనిలో నేను గూడా చేరాను. మెయిల్‌బోటు వస్తున్నట్లుగా ఒక బూర ఊదేవారు. భుజాన తాడు వేసుకుని, ఒక చేత్తో బూర పట్టుకుని ఊదుతూ పడవ లాగేవాడిని. పొలాలలో పనిచేసినపుడు నేను చిన్నవాడనగుటచే తక్కువ కూలి – ఆడవారికిచ్చే కూలి ఇచ్చేవారు.

కొత్తపేట తాలూకా ర్యాలిలో జిల్లా రైతు మహాసభ జరిగింది. జిల్లా రైతు మహాసభకు రాజోలు తాలూకా నుండి చాలామంది వెళ్ళారు. సభకు వాలంటీరుగా వెళ్ళుటకు నాకు వీలు కలిగించారు. సభకు వెళ్ళేముందురోజున మా ప్రక్క గ్రామమైన అంతర్వేదిపాలెం వెళ్ళి, సభకు సంబంధించిన ఒక కబురు ఏదో చెప్పి రమ్మని పంపారు. సైకిలుపై వెడుతూ పడిపోయాను. కాలు బెణికింది. నడవలేకపోయాను. కాలి బాధకంటే, మహాసభకు వెళ్ళలేకపోయాననే బాధ చాలాకాలం మిగిలింది.

## 1946 ఎన్నికలు:

1946 శాసనసభ ఎన్నికల్లో శాసనసభకు రిజర్వు స్థానం నుండి కందికట్ల

నాగభూషణంగారు, జనరల్ స్థానం నుండి నిమ్మకాయల బాపన్న నాయుడుగారు కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థులుగా పోటీ చేశారు. ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీకి - ఎర్రపెట్టెకే ఓట్లు వేయవలసిందిగా వాలంటీరుగా గ్రామగ్రామాన ప్రచారం చేశాను. మల్కిపురం పోలింగు స్టేషన్‌లో కామ్రేడ్ కందికట్ల నాగభూషణంగారిపై జరిగిన అకృత్యంపై తీవ్రమైన ఉద్రిక్తత ఏర్పడింది. ఆ వార్త తెలిసినవెంటనే అన్ని ప్రాంతాలనుండి, ముఖ్యంగా అంతర్వేదిపాలెం ఫిర్కా అంతటనుండి చేతికందినది తీసుకుని ప్రజలు, పార్టీ కార్యకర్తలు, నాయకులు మల్కిపురం చేరారు. కామ్రేడ్ నాగభూషణంగారిని అవమానించిన వారిపై ప్రతీకారం తీర్చుకోవాలనే పట్టుదల పెరిగింది. రెండు శిబిరాలుగా మోహరింపబడియున్నారు. ఏ క్షణాన ఏమి జరుగుతుందో తెలియకుండా వుంది. రెండు శిబిరాలకు మధ్యన కమ్యూనిస్టు నాయకులు అల్లూరు వెంకటకృష్ణంరాజు (మెంబరుగారు), వలువల సుబ్బారావుగారు నిలిచి, అతికష్టం మీద పరిస్థితి చక్కపర్చారు. ఘర్షణ నివారించబడింది. ఎన్నికల ప్రచారానికై ఉదయం వెళ్ళి, సాయంత్రం వరకు యుండి ఈ ఘటనంతా చూస్తూ యున్నాను.

## పార్టీ సాహిత్యం యిచ్చిన ఉత్తేజం:

1945వ సంవత్సరమని గుర్తు. కామ్రేడ్ అల్లూరు వెంకట్రామరాజుగారి ఇంటి వద్ద తాలూకా పార్టీ జనరల్ బాడీ సమావేశం జరిగింది. సమావేశానికి నేనూ, గేదెల సోమేశ్వరరావుగారు గూడా వెళ్ళాం. సోమేశ్వరరావుగారిని, నన్ను పార్టీ సభ్యులుగా తీసుకున్నారు, తాలూకా పార్టీ కార్యదర్శి అల్లూరు వెంకట్రామరాజుగారు. ఆనాటికి నాకు మైనారిటీ తీరలేదు. అప్పటికే నాకు పార్టీ సాహిత్యం చదవటం అలవాటయింది. ప్రప్రథమంగా నేను చదివిన పుస్తకం సర్దార్ పృథ్వీసింగ్ జీవిత చరిత్ర. అది నన్ను ఎంతో ఉత్సాహపరిచింది. ఆనాడు పార్టీ హోల్ టైమర్సు దగ్గర ప్రజాశక్తి ప్రచురణాలయం వారి పుస్తకాలు అమ్మకానికి యుండేవి. మా అన్నయ్య నారాయణమూర్తి గారి యొద్ద పుస్తకాలుండేవి. పుస్తకాలు కొనలేదు. మా వదినగారితో చెప్పి, మా అన్నయ్యకు తెలియకుండా పుస్తకాలు కట్టవిప్పి పట్టుకు వెళ్ళి నలగకుండా చదివి మరలా కట్టకట్టేవాడిని. ఇది తెలిసి నన్ను మందలించేవారు. నేను కూలి పనులకు వెళ్ళి పుస్తకాలు కొనేవాడిని. అలా చాలా పుస్తకాలు కొన్నాను. 1948లో పార్టీపై సాగిన నిర్బంధ కాలంలో, పోలీసులకు భయపడి మా పెదనాన్నగారు పుస్తకాలన్నీ తగులబెట్టారు. పుస్తకాలు జాగ్రత్తగా పెట్టుకోవాలనే తపనతో పోలీసు ప్రమాదాన్ని లెక్కచేయకుండా నేను ఇంటికి వచ్చాను. అప్పటికే పుస్తకాలు అన్నీ అగ్నికి ఆహుతి అయి, బూడిద మిగిలింది. కండ్లవెంట నీళ్ళు జలజల కారాయి. దుఃఖిస్తూ వెనుదిరిగి వెళ్ళిపోయాను. పైన పేర్కొన్న పరిస్థితుల పూర్వరంగంలో నేను కమ్యూనిస్టునయ్యాను.

మహత్తరమైన కమ్యూనిస్టు పార్టీలో సభ్యునిగా చేరగలిగినందుకు నాకెంతో గర్వంగా వుంది. ఆనాటికి యువకులుగా ఉన్న పార్టీ నాయకుల అపూర్వ త్యాగమయ ఆదర్శజీవితాలు ఇప్పటికి మేను పులకింపచేస్తుంటాయి. ప్రస్తుత పరిస్థితి ఏమిటి? ఎవరికి వారు ఆత్మపరిశీలన చేసుకుని, పార్టీని - ప్రజా ఉద్యమాలను ముందుకు తీసుకుపోవడానికి యువత ప్రయత్నం చేయగలదని ఆశిద్దాం.

★ ★ ★

# శ్రీ మారెళ్ళ నరసింహారావు



నేను 1925 నవంబరు 25 వ తేదీన శ్రీ మారెళ్ళ కృష్ణమూర్తి, సూర్యకాంతమ్మ గార్లకు జన్మించాను. మా గ్రామం జాతీయోద్యమంలో అగ్రశ్రేణిలో వున్న భీమవరం తాలూకాలో ఉంది. ఆ రోజుల్లో భీమవరం వెళ్ళే ప్రతి జాతీయోద్యమ నాయకుడు మా గ్రామం మీదుగా వెళ్ళవలసి వచ్చేది. ఆ విధంగా వెళ్ళేవారినందరినీ మా గ్రామం వద్ద, ఆపి, కొద్దిసేపు ఉపన్యాసం చేయించేవారు. ఆ మీటింగులన్నింటికీ చిన్న వయస్సైనప్పటికీ నేను వెళుతూ వుండేవాణ్ణి.

పెద్దన్నలు యిద్దరూ ఆ రోజుల్లో ఇంగ్లీషు ట్వీల్ షర్టులు, డ్రిల్లు ప్యాంట్లు తొడుగుతూ వుండేవారు. జాతీయోద్యమ ప్రభావంతో, గాంధీజీ "విదేశీ వస్తు బహిష్కరణ" పిలుపుతో వారు కడుతున్న ఇంగ్లీషు డ్రిల్లు, ట్వీల్ బట్టలను గుట్టగా వేసి తగులబెట్టారు. 1936–37లో అసెంబ్లీ జిల్లా బోర్డు ఎన్నికలకు మా చేతికి కాంగ్రెసు జెండా ఇచ్చి ఊరేగింపులు చేయించేవారు.

## జాతీయోద్యమ ప్రభావం:

ఆ రోజుల్లో ఈనాడు కమ్యూనిస్టు పార్టీ నాయకులుగా వున్నవారు కూడా కాంగ్రెసులోనే వుండి, జిల్లా, తాలూకా నాయకత్వ స్థానాల్లో వుండేవారు. సంపూర్ణ స్వరాజ్యం కావాలని, సమానత్వం, అంటే అందరికీ సమాన అవకాశాలు కావాలనీ ఉపన్యాసాల్లో చెబుతూ వుండేవారు. 37, 38 సో॥ బాట్లివాలా ఆంధ్రదేశ పర్యటనలో ఉండి, మా గ్రామం కూడా వచ్చారు. అప్పుడు మా హైస్కూలులోని పెద్ద క్లాసుల వారి నాయకత్వంలో క్లాసులు విడిచి బాట్లివాలా మీటింగుకు హాజరయ్యాం. ఆయన మిగతా రాజకీయాలతోపాటు విద్యార్థుల హక్కులు, విద్యావిధానంలో మార్పు కోసం "విద్యార్థి ఫెడరేషన్" పోరాడుతోందని, అందులో చేరి, గుంటూరులో జరుగుతున్న మహాసభకు హాజరుకమ్మని చెప్పారు. అచ్చటకు వెళ్ళేవారి ఖర్చుల కోసం జోలెలు తీసి చందాలు వెయ్యమంటే, అప్పటికి ఎవరికి అందుబాటులో వున్నది వారు చందాలు వేశారు, గుత్తా ఆంజనేయ చౌదరి నాయకత్వాన. ఆ తరువాత సంవత్సరం మా హైస్కూలులో హిందీ టీచరుగా వచ్చిన కీ॥శే॥ గుత్తా ఆంజనేయ చౌదరి గారు నాతోబాటు మరికొందరిని చేరదీసి విద్యార్థి ఫెడరేషన్ స్థాపించేలా చేశారు. పాలకొల్లులో జరిగిన విద్యార్థి ఫెడరేషన్ జిల్లా ప్రథమ మహాసభకు ప్రతినిధులుగా హాజరయ్యాం. ఆ తరువాత సం॥ మా ఊరిలోనే రెండవ మహాసభ జరిపాం. దానికి కీ॥శే॥ శ్రీయుతులు మద్దూరి అన్నపూర్ణయ్య, అల్లూరి సత్యనారాయణ రాజులు, పి. ఎస్. శర్మ (ఎర్ర శర్మ), ఎర్రమిల్లి నరసింహారావులు హాజరయ్యారు. ప్రతినిధుల సభ తరువాత బహిరంగసభ జరుగుతుండగా ఆనాటికి కాంగ్రెసు నుండి బహిష్కరించిన నేతాజీ సుభాష్‌చంద్ర బోస్ నాయకత్వంలో ఫార్వర్డుబ్లాక్‌లో వున్నారని, కీ॥శే॥ శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్యగారు ఉపన్యాసం ప్రారంభించగానే, మా అన్నగారు, మేనల్లుడు, మరికొంతమంది కాంగ్రెసు వాదులం, గాంధీజీ అనుచరులం అనుకొనేవారు అడ్డు ప్రశ్నలతో అసమ్మతిని తెలియజేయడమేగాక, మీటింగు వారితో జరగనివ్వమని ఆటంకపరచబోయారు. అప్పుడు నేను లేచి, వారికి వ్యతిరేకంగా తమకిష్టం లేకపోతే మీటింగు నుండి వెళ్ళిపోవచ్చునీ, వాక్స్వాతంత్ర్యం అందరికీ ఉందనీ, మీటింగు జరిగి తీరుతుందనీ ఎదిరించటంతో వారు సద్దుమణిగారు. మీటింగు జయప్రదంగా జరిగింది. తరువాత ప్రతినిధుల భోజనాల వద్ద అల్లూరి సత్యనారాయణ రాజు, మద్దూరి అన్నపూర్ణయ్యగార్లు నన్ను కౌగలించుకొని ముద్దుపెట్టుకొని ప్రశంసించటంతోపాటు, ఆ చైతన్యాన్ని ముందుకు తీసుకువెళ్ళి ప్రజాసేవతో సోషలిజం సాధించాలని, అందుకు నీలాంటివారు గట్టి కృషి చేయాలని చెప్పారు.

ఆ మాటలూ, రోజా కీ॥శే॥ గుత్తా ఆంజనేయ చౌదరిగారు విప్లవవీరులను గురించి, సోవియట్‌ను గురించి చెప్పిన మాటలు మనస్సుకు హత్తుకొని, చెరగని ముద్ర వేశాయి. ఆ రోజుల్లో, ఉండి హైస్కూలు హెడ్మాష్టరుగా వున్న శ్రీ పి. బూధరు గారు విద్యార్థులకు చేసే అన్యాయాలకు, ప్రత్యేకించి హరిజన హాస్టలులోని విద్యార్థులకు తిండి సరిగా పెట్టకుండా పొలంలోకి తీసుకువెళ్ళి పని చేయించుకోవటానికి వ్యతిరేకంగా ఉద్యమం నడిపి, సమ్మె కూడా చేయించాం.

## యుద్ధవ్యతిరేక ప్రచారం:

ఆ రోజుల్లో జరుగుతున్న రెండవ ప్రపంచ యుద్ధంలో బ్రిటిషు సామ్రాజ్యవాదులకు, యుద్ధానికి వ్యతిరేకంగా పోస్టర్లు, కరపత్రాలు కార్బన్ పేపర్లతో వ్రాసి పంచుతూ వుండేవారు. ఒక రాత్రి మా హైస్కూలు గోడలు లోపల, బయట కూడా యుద్ధ వ్యతిరేక నినాదాలు వ్రాశాం. ఆకివీడు వరకు నడిచి వెళ్ళి, పోలీసు స్టేషను మీద సహితం యుద్ధ వ్యతిరేక పోస్టర్లు అంటించి, మర్నాడు స్కూల్‌కు హాజరయ్యాం. ఎంత కడిగినా ఆ రాత్రి గోడల మీద వ్రాసిన సిరా చేతికంటినది వదలకపోవటం, నిద్రలేమి వల్ల బడలికతో వుండటంతో స్కూలు విద్యార్థులు, టీచర్లు నన్ను, నాకు సహాయం చేసిన ఆయనను బాధ్యులుగా అనుమానించారు. మరో ఒకటి రెండు రోజుల్లో మమ్మల్ని యిద్దర్ని స్కూలుకు రావద్దన్నారు. అప్పుడే ఏలూరులో "ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు" మహాసభలు జరుగుతున్నాయి. అచ్చటకు పార్టీ నాయకులు, ఫెడరేషన్ నాయకులు వస్తారని, వారి సలహా పొందాలని, యింట్లో చెప్పకుండా ఒక జత బట్టలు, దుప్పటి చంకన బెట్టుకొని, ఉదయమే వచ్చే రైలు ఎక్కి కైకలూరులో దిగి, 14 మైళ్ళు నడచి మధ్యాహ్నం మూడు గంటలకు ఏలూరు చేరాం. అచ్చట నాయకులే మాకు భోజనానికి, పడుకునేందుకు వాలెంటీరు క్యాంపులో ఏర్పాటు చేశారు. నేతాజీ సుభాష్‌చంద్ర బోసు మీటింగును కూడా అతివాదులు ఏర్పాటు చేశారు. దానికి కూడా హాజరయ్యాం. మహాసభల అనంతరం ఉండి తిరిగి వచ్చి మా నాన్నగారు, యితర గ్రామ పెద్దల సహాయంతో స్కూలుకు తిరిగి వెళ్ళగలిగాం. కాని, ఆ సంవత్సరం యాన్యువల్ పరీక్షలు బాగా వ్రాసినప్పటికీ, నాతోపాటు మరో 15 మందిని, విద్యార్థి ఫెడరేషన్ కార్యకర్తలను ఫెయిల్ చేశారు. ఆ అన్యాయానికి వ్యతిరేకంగా విద్యాశాఖ డైరెక్టరు గారికి, మద్రాసు, డి.ఇ., ఏలూరులకు అప్పీలు చేశాం. విచారణాధికారులు వచ్చినా, మాకు న్యాయం కలుగలేదు. వీటన్నింటి ఫలితంగా 40-41లో నన్ను తిరిగి 5 ఫారం చదువుటకు స్కూలులో చేర్చుకోలేదు. నన్ను స్కూలులో చేర్చుకుంటే కడివెడు పాలలో విషపు చుక్క వేసినట్లేనని, నాకోసం హెడ్మాష్టరు లూథరు గారి వద్దకు వెళ్ళిన పెద్దలతో వ్యాఖ్యానం చేశారాయన.

అందుచే ఆ సంవత్సరం శ్రీ గుత్తా అంజనేయులు గారితో కలిసి ప్రయివేటుగా మెట్రిక్యులేషన్ వెళ్ళాలని చదివాం. దానితోపాటే హిందీ రాష్ట్రభాష వరకు చదివి, పరీక్షలకు హాజరై పాసయ్యాను. ఆ రోజుల్లోనే పార్టీవారి సూచన మేరకు కామ్రేడ్ కోయ బాపిరాజుతో కలసి, నిడదవోలులో 3 వ జిల్లా విద్యార్థి మహాసభ జరిపాం. దానికి కామ్రేడ్ ఎస్. వి. కె. ప్రసాద్, బేగ్ వచ్చారు. వారిని రహస్యంగా వున్న జిల్లా పార్టీ నాయకులతో కలిసేందుకు తీసుకువెళ్ళారు. రహస్యంగా వచ్చే "స్వతంత్ర భారత్" పత్రికలు పంచుతూ, రహస్యంగా వచ్చే కామ్రేడ్ ఎస్.ఆర్.కు చేయటమే గాక, గ్రూపు మీటింగులు కూడా ఏర్పాటు చేశాను. అది 1940 సంవత్సరం, 5 వ ఫారం యాన్యువల్ పరీక్షలైపోగానే ఏలూరులో ర్యాలీ జరుగుతుంటే దాంట్లో పాల్గొన్నాను. అప్పుడే కీ॥శే॥ కామ్రేడ్స్ ఉద్దరాజు రామం, మృత్యుంజయుడు, సంకు అప్పారావు మొ॥ వారితో పరిచయ మేర్పడింది.

## వేసవి వయోజన విద్యాశిబిరం:

అదే సంవత్సరం కాకినాడలో వేసవి సెలవులలో విద్యార్థి, యువజన కార్యకర్తలకు క్లాసులు జరుప తలపెట్టారు. దానికి వెళ్ళాను. అప్పుడే కా॥మేడ్ పరకాల పట్టాభిరామారావు, కీ॥శే॥ పర్వతనేని వెంకటేశ్వరరావు మొ॥ వారితో పరిచయమైంది. తరువాత పరకాల అజ్ఞాతవాసంలో ఉంటూ, స్వంత జిల్లా పశ్చిమగోదావరికి విద్యార్థి ఆర్గనైజరుగా వచ్చారు.

## స్కూలునుండి బహిష్కరణ; సి.ఐ.డి.ల నిఘా:

1941–42 విద్యా సంవత్సరంలో తిరిగి ఉండి స్కూలులో చేరుటకు మరో ప్రయత్నం చేస్తే, అది కూడా విఫలం అవటంతో "టి.సి." తీసుకుని కైకలూరు వెళ్ళి అచ్చట హైస్కూలులో చేరాను. అచ్చట కూడా విద్యార్థి ఫెడరేషన్ కార్యకర్తలతో పరిచయం ఏర్పడింది. మా జిల్లా నుండి ఒక స్పెషల్ బ్రాంచి కానిస్టేబుల్ కైకలూరు వచ్చి హెడ్మాష్టరు గార్ని కలసి, నేను కమ్యూనిస్టునని, ఉద్యమాలు నడుపుతానని, అందుచే స్కూలులో వుంచవద్దని చెప్పాడు. హెడ్మాష్టరు గారు నన్ను తమ గదికి పిలిపించి, స్పెషల్ బ్రాంచి వారి రిపోర్టు వచ్చిందని, అయినప్పటికే స్కూలు నుండి పంపించివేయుటలేదు, బాగా చదువుకోమని చెప్పారు. మా బావగార్కి జడిసినా, వేరే వంకలు చెప్పి ఆ సమావేశాలకు హాజరయ్యేవాడిని. కా॥మేడ్ తమ్మారెడ్డి కైకలూరు వచ్చి, తనకు పరిచయమైన కార్యకర్తల ద్వారా నాకు కూడా కబురుచేసి, మీరందరూ కమ్యూనిస్టు పార్టీ సభ్యులు, మీరందరూ కలసి పనిచేయాలని చెప్పారు. నేను సభ్యుణ్ణి కాదంటే, కాదు – మీ జిల్లా కమిటీ మిమ్మల్ని 41లోనే సభ్యుణ్ణిగా చేసినట్లు యీ జిల్లా కమిటీకి కబురు చేసిందని చెప్పారు. పార్టీ మీద నిషేధం తొలగగానే కైకలూరు తాలూకాలో పార్టీ నిర్మాణం కోసం కా॥మేడ్ యార్లగడ్డ బసవయ్యగారు వచ్చారు. అచ్చట ఆఫీసు దొరకటం కష్టమైంది. నేనే చొరవ చేసి, ఒక పాడుపడిన యింట్లో ఆఫీసు పెట్టుటకు ఏర్పాటు చేశాను. ఒక రోజు రాత్రి 8 గం॥ల సమయంలో ఆఫీసులో మాట్లాడుతూ వుండగా, రౌడీ రాజ్యం సాగించే బాషా అనే ఆయన అచ్చటకు వచ్చి, ఈ గ్రామంలో కమ్యూనిస్టు పార్టీ ఆఫీసు వుండుటకు వీల్లేదు, ఎత్తేసి వెళ్ళిపోండి అని దబాయింపు మొదలుపెట్టి, దౌర్జన్యం చేయబోయాడు. కాని, కా॥మేడ్ బసవయ్యగారితోపాటు నేను కూడా ఆయనను ఎదిరించటంతో వెనక్కు తగ్గాడు. మరునాడు మా బావగారితో, మీ బావమరిది యిచ్చట కమ్యూనిస్టు పార్టీ పెట్టిస్తున్నాడు, వాళ్ళను వెళ్ళగొట్టాలంటే రాత్రి నాకు అడ్డువచ్చాడు అని కంప్లెయింటు చేశాడు. ఆ రాత్రి మా బావగారు యింటికి వచ్చి మమ్మల్ని కోప్పడ్డప్పటికీ, నా రుజువర్తన వల్ల యింకేమీ అనలేకపోయారు.

## పార్టీ హోల్ టైమర్ గా:

1943 మార్చిలో ఎస్.ఎస్.ఎల్.సి. పరీక్షలు అయిన తరువాత జిల్లా దివి తాలూకాలో విద్యార్థి యువజన కార్యకర్తలకు క్లాసులు జరిగాయి. ఇంటివద్ద చెప్పకుండానే దానికి హాజరయ్యాను. అచ్చట పార్టీ కార్యక్రమాలు కొనసాగించుటకు

హోల్ టైమర్సుగా రావాలని కామ్రేడ్ తమ్మారెడ్డి విజ్ఞప్తి చేశారు. హోల్ టైమరుగా పనిచేయుటకు నా పేరు యిచ్చాను.

ఉండి తిరిగి వచ్చిన తరువాత ఎస్.ఎస్.ఎల్.సి. ప్యాసైనప్పటికీ, ఆర్థిక యిబ్బందులవల్ల కాలేజీలో చేరే అవకాశం లేకపోయింది. అయినప్పటికీ మా పెద్ద అన్నగారు కొంత ప్రయత్నం చేసి విఫలమయ్యారు. ఆర్థిక వ్యత్యాసాలు లేని సమసమాజం వస్తేగాని మనలాంటివారికి గత్యంతరం లేదు; అందుకు కమ్యూనిస్టు సిద్ధాంతం ఆచరణకు రావాలి. కనుక, మనం దానికి అంకితం కావాలనే దృఢ దీక్ష కలిగింది. ఆనాటి నుండి హోల్ టైమరుగా పనిచేస్తూ విద్యార్థి ఉద్యమ నిర్మాణానికి కృషి చేస్తుండగా, అంతకు ముందు 42 ఆగస్టు ఉద్యమం ఫలితంగా జిల్లా విద్యార్థి ఫెడరేషన్ నిషేధింపబడింది. ఆ కారణంగా విద్యార్థులుగా వుండి విచిత్ర వేషాలతో రాజకీయ ప్రచారం సాగిస్తున్న కామ్రేడ్స్ వంక సత్యనారాయణ, భూపతిరాజు సుబ్బరాజు, పరకాల రమణారావు, కీ॥శే॥ పరకాల శేషావతారం, మరో ఇద్దరితోపాటు, వారికి సహాయం చేశాడనే మిషతో కామ్రేడ్ సోమరాజు గార్లను అరెస్టు చేసి, దీర్ఘకాల విచారణ తరువాత కఠిన శిక్ష విధించారు. ఆ విచారణ కాలంలోనే వారితో పరిచయమైంది. తరువాత వారు విడుదలై వచ్చిన తరువాత ప్రధానంగా నేను, వంక సత్యనారాయణ, శేషావతారం కలసి విద్యార్థి ఉద్యమ నిర్మాణానికి కృషి చేశాం. జిల్లా విద్యార్థి ఫెడరేషన్ నిషేధింపబడిన సంస్థ కనుక, ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ పేరుతో పనిచేసేవారం.

44 జనవరి 26వ తేదీన, నేను, కామ్రేడ్స్ షేక్ మీరా, ఎస్. ఆనందరావు, కీ॥శే॥ దేవరకొండ సుబ్బారావు, సాయన ప్రహ్లాద నిషేధాజ్ఞలు ధిక్కరించి స్వతంత్ర దినోత్సవ ప్రమాణాన్ని కొట్టు కొట్టుకు, యింటింటికి తిరిగి చేస్తూ వుండగా పోలీసులు అరెస్టు చేశారు. దీర్ఘకాలం డిఫెన్స్ ఆఫ్ ఇండియా రూల్స్ (DOIR) క్రింద కేసు విచారణ జరిగి శిక్షలు పడ్డాయి. అక్టోబరు ఆఖరులో విడుదలైన తరువాత తిరిగి ఉద్యమ కార్యక్రమాల్లో పనిచేయసాగాను (కొవ్వూరులో వుండి). ఆ రోజుల్లో విద్యార్థులకు రాత్రిళ్ళు క్లాసు జరిపి, వారికి పాఠాలు బాగా చదువుటకు సహాయపడేవారం. కిర్సనాయిలు కొరత; పేపరు, పుస్తకాల కొరత; డిటెన్షన్ పద్ధతికి వ్యతిరేకంగాను ఉద్యమాలు నడిపి, విద్యార్థులే గాక, వారి తల్లిదండ్రుల ఆదరణను కూడ పొందగలిగాం.

ఆ రోజుల్లో వచ్చిన బెంగాలు కరువు, రాయలసీమ కరువులకు సహాయ నిధులు వసూలు చేసి పంపాం.

## కులాంతర వివాహం:

45 మే 25న కొవ్వూరులోనే అంతర్వర్ణ వివాహం, దండల మార్పిడితో చేసుకున్నాను. దానికి కీ॥శే॥ ఈడ్పుగంటి పూర్ణచంద్రరావు, కామ్రేడ్ పరకాల పట్టాభిరామారావు, మీరా, పసల కృష్ణమూర్తిగారు ఆధ్వర్యం వహించారు. ఆ సంఘటన కొవ్వూరులో పెద్ద సంచలనం రేపింది. ఆ రాత్రి మొదటిసారిగా కొవ్వూరులో జిల్లా బుర్రకథ దళంవారు బుర్రకథ చెప్పారు.

45 విద్యా సం॥ ప్రారంభంలో భీమవరం, ఏలూరుల్లో కాలేజీలు కొత్తగ ప్రారంభమయ్యాయి. పార్టీవారి సూచన ప్రకారం, అత్తవారి సహాయంతో భీమవరం కాలేజీలో చేరాను. అచ్చట కూడా విద్యార్థి ఫెడరేషన్ కార్యక్రమాలు కొనసాగించాం. అప్పుడే కాంగ్రెస్‌వారు విద్యార్థి కాంగ్రెసు నిర్మాణానికి పూనుకొని ఘర్షణలు రేపారు. అయినప్పటికీ కాలేజీలో విద్యార్థులు, లెక్చరర్ల ఆదరణను, గౌరవాన్ని పొందగలిగి, కాలేజీ యూనియన్ కార్యదర్శిగా కూడా ఎన్నుకోబడ్డాను.

యుద్ధం ముగియటంతో నేతాజీ సుభాష్‌చంద్ర బోసు ఏర్పాటు చేసిన, బ్రిటిషు వారికి ఖైదీలుగా చిక్కిన ఇండియన్ నేషనల్ ఆర్మీ సైనికులపై సైనిక కోర్టుల్లో విచారణ జరిపి శిక్షించాలని ఆనాటి భారత ప్రభుత్వం ప్రయత్నించింది. ఆ చర్యకు వ్యతిరేకంగా జిల్లాలోని అన్ని హైస్కూళ్ళు, కాలేజీల్లోను సమ్మెలు నిర్వహించారు.

మొదటి సమ్మె తణుకులో ప్రారంభించాం. కమ్యూనిస్టులపై గుడ్డి ద్వేషంతో ఆనాటి జిల్లా కాంగ్రెసు నాయకుల్లో ఒకరైన కొవ్వలి గోపాలరావుగారి నాయకత్వంలో కాంగ్రెసు జెండాలతో పికెటింగ్ చేస్తున్నవారిపై నడిచి స్కూలుకు వెళ్ళారు. అప్పటికే సమ్మె జయప్రదం అయింది.

46లోనే భీమవరంలో ఆంధ్రప్రదేశ్ విద్యార్థి ఫెడరేషన్ మహాసభ నిర్వహించాం. అందులో రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ అధ్యక్షునిగ ఎన్నుకోబడ్డాను.

46 ఎన్నికల్లో మద్రాసులో కాంగ్రెసు ప్రభుత్వం యేర్పడింది. 47 ప్రారంభంలో ఒక ఆర్డినెన్సు జారీచేసి, కమ్యూనిస్టులను అరెస్టు చెయ్యసాగింది. అందుచే మార్చిలో జరిగే యూనివర్సిటీ పరీక్షలకు హాజరు కాకుండా రహస్య జీవితం ప్రారంభించవలసి వచ్చింది. 47 ఆగస్టు 15 స్వాతంత్ర్య దినోత్సవానికి ముందు బహిరంగంగా వచ్చి, భీమవరంలో స్వాతంత్ర్య దినోత్సవం జరిపాం.

కాని 48 జనవరిలో 30 న గాంధీజీ హత్యానంతరం తిరిగి కమ్యూనిస్టులపై నిర్బంధం ప్రారంభమైంది. దానితో 48 ప్రారంభంలో కలకత్తా మహాసభ తీర్మానం (అతివాద సెక్టేరియన్ పోకడలతో కూడిన తీర్మానం)తో కమ్యూనిస్టు పార్టీ నిషేధింపబడింది. నిర్బంధం ఎక్కువైంది. అందుచే రహస్య జీవితం ప్రారంభించి, కొందేపాడు మకాం మార్చాం. 48 సెప్టెంబరు 16న భీమవరంలో అరెస్టయ్యాను. అయినప్పటికీ కొందేపాడులోని మా యిల్లు మరికొంతకాలంపాటు జిల్లా నాయకులకు డెన్‌గా ఉపయోగపడింది.

## కడలూరు జైలులో నిర్బంధం:

రాజమండ్రి, కడలూరు సెంట్రల్ జైళ్ళలో జరిగిన పోరాట కార్యక్రమాలన్నింటిలోనూ పాల్గొని కామ్రేడ్సు యొక్క మన్ననలను పొందగలిగాను. ప్రధానంగా కడలూరు జైలులో 49 ఆగస్టు 15న జరిగిన కాల్పులు జలియన్‌వాలాబాగ్‌ను గుర్తుకు తెస్తాయి. ఇందులో ఇద్దరు చనిపోయారు. చాలామంది గాయపడ్డారు. నేను, కామ్రేడ్స్ వంక, కపర్ది, రామశాస్త్రి గార్లం కొద్దిలో మరణం నుంచి బయటపడ్డాం. దీనికి నిరసనగా దాదాపు 30 రోజులు నిరాహారదీక్ష, తరువాత రెండు నెలలకు సేలం జైలులో జరిగిన కాల్పులకు నిరసనగా 18 రోజులు నిరాహారదీక్షలు జరిగాయి.

వాటిల్లో పాల్గొన్నాను. కడలూరులోనే 'సి' క్లాసు ఖైదీలపై జైలు అధికారులు జరిపిన నిర్బంధానికి వ్యతిరేకంగా ప్రదర్శన జరుపుతుంటే లాఠీఛార్జీ చేశారు. అందులో మాతోపాటేవున్న కామ్రేడ్స్ కీ॥శే॥ ఎం.ఆర్. వెంకట్రామన్, ఎ.కె. గోపాలన్‌లపై దౌర్జన్యం చేయబోగా వారిని ప్రక్కకు తప్పించాం. లాఠీఛార్జీ చేయటం అన్యాయమని నిరసన చెప్పినందుకు కీ॥శే॥ కామ్రేడ్ డా॥ చెలికాని రామారావు గారిపై విపరీతంగా లాఠీఛార్జీ చేశారు. అంతటితో తృప్తిపడక కాల్పులు కొనసాగించారు. అందులో ఇద్దరు చనిపోయారు. కొద్దిలో మరణంనుంచి బయటపడ్డాం. ఆ సంఘటనకు వ్యతిరేకంగా నిరసన తెలియజేయుటకు దీర్ఘకాలం నిరశన వ్రతం జరిగింది.

1950లో విడుదలైన తరువాత పార్టీ కొవ్వూరు తాలూకాలోనే వుండమనటం వలన అక్కడే వుండి, అప్పటికే కొనసాగుతున్న కామూరులంక రైతు ఉద్యమానికి సహాయం చేస్తూ అనేక కేసుల్లో జైళ్ళలో నిర్బంధించబడ్డాను. 52 ఎన్నికల కార్యక్రమంలో కొవ్వూరు, పోలవరం నియోజకవర్గంలో ప్రచార కార్యక్రమాలు చేపట్టాను. అంతకుముందు జైలు జీవితంలో ఏర్పడిన రాజకీయ విభేదాలను, వ్యక్తిగతంగా తీసుకొని అభ్యర్థి పిన్నమనేని రామచంద్రరావు యీసడిస్తున్నా కార్యక్రమాలు సాగించాను. ఎన్నికల్లో గెలిచిన తరువాత నాటు పొగాకు అమ్మకాల్లో ఏర్పడిన సంక్షోభాన్ని పరిష్కరించాలని, కొవ్వూరు, పోలవరం తాలూకాల్లో తిరిగి ప్రచారం చేసి, యర్నగూడెంలో పెద్ద మహాసభ జరిపాం. ఫలితంగా ప్రభుత్వ దృష్టిని ఆకర్షించి కొంత పరిష్కారం చూపగలిగాం.

1955 మధ్యంతర ఎన్నికల్లో కమ్యూనిస్టు పార్టీ ఓడిపోవటంతో చాలా నిరుత్సాహ వాతావరణం యేర్పడింది. అయినప్పటికీ నిరుత్సాహపడకుండా ధైర్యంతో పార్టీ కార్యక్రమాలు కొనసాగిస్తూ, ట్రేడ్ యూనియన్ నిర్మాణానికి పూనుకొన్నాను. ఐ.ఎల్.టి.డి., ఆర్.టి.సి., పంచదార కార్మికోద్యమాలలో బాధ్యతా స్థానాలలో ఉండి పనిచేశాను.

## కుటుంబంలో సంస్కరణ వివాహాలు:

నమ్మిన ఆశయానికి కట్టుబడి ఆచరణలో చేయాలనే దీక్షతో మా పెద్ద అమ్మాయిని ఒక ముస్లిం యువకునికిచ్చి వివాహం చేశాం.

69, 72లో జై తెలంగాణా, జై ఆంధ్రా ఉద్యమాల తరువాత యీ రెండు ప్రాంతాల సమైక్యతకు తోడ్పడాలనే ఉద్దేశ్యంతో ఆ నాటికి మా పార్టీలో వుంటున్న తెలంగాణా నల్లగొండ జిల్లా రెడ్డి యువకునితో మా రెండవ అమ్మాయి వివాహం హైదరాబాదులోనే చేశాను. దీనికి కీ॥శే॥ కామ్రేడ్స్ రావి నారాయణరెడ్డి, కపర్ది తమ్మారెడ్డి సత్యనారాయణ ఆధ్వర్యం వహిస్తే, పరకాల శేషావతారం మొ॥వారు వచ్చి ఆశీర్వదించారు. సనాతనాచారాల వారైనప్పటికీ మా రెండవ బావ, అక్కయ్య, వదిన, మేనల్లుళ్ళు మొ॥ బంధువులు కూడా హాజరై, మిగిలినవారితో కలిసి భోజనాలు కూడా చేశారు.

కేంద్ర ప్రభుత్వ ఆధ్వర్యంలో డైరక్టర్ జనరల్ ఆఫ్ టెక్నికల్ డెవలప్‌మెంట్ ఆధ్వర్యంలో నున్న ఫుడ్ ప్రాసెసింగ్ డెవలప్‌మెంటు కౌన్సిల్‌లో ఎ.ఐ.టి.యు.సి.

ప్రతినిధిగా మొదటిసారి నేను నియమింపబడ్డాను. మిగిలిన సభ్యులందరు ఐ.ఏ.ఎస్. ఆఫీసర్లు, పరిశ్రమల యజమానుల ప్రతినిధులు. అచ్చట చర్చలో మన భారతదేశంలోని ఉక్కు పరిశ్రమలో తయారవుతున్న వాటిని ముందుగా ఉపయోగించుటకు, పంచదార మొ॥ కోటా యిస్తే ఆమేరకు తయారైన వస్తువుల ధరలు తగ్గించుటకు కృషి చేశాను. నా వైఖరి యజమానుల ప్రతినిధులకు గిట్టకపోయినా గత్యంతరంలేని స్థితిలో అంగీకరించాను.

ఇద్దరు కుమారులకు కట్నాలు యిస్తామని వచ్చినా, నేను, నా భార్య కూడా కట్నాలు తీసుకోం, ఆ విధంగా వచ్చేవారి బంధుత్వం కూడా కలుపుకోం అని చెప్పి నిరాకరించాం. కట్నాలు లేకుండా వెనుకబడిన కులాలుగా పరిగణింపబడేవారి అమ్మాయిలనే కోడళ్ళుగా చేసుకున్నాం.

నా బంధువులంతా వారినికూడా నాతోపాటే సమానంగా చూస్తున్నందుకు వారికి నా అభినందనలు చెప్పాలి.

★ ★ ★

# కీ.శే. పెరంబదూరు ఆనందరావు



మాది పశ్చిమగోదావరి జిల్లా తణుకు తాలూకా మల్లెపూడి గ్రామము. అనాడు మా కుటుంబము ఆర్థికంగా స్థితి కలది. నేను శ్రీకాకుళం జిల్లాలో 1914 అగస్టు 25న పుట్టాను. మా తండ్రిగారు రామానుజరావుగారు జాతీయ ఉద్యమానికి గట్టి మద్దతుదారు. ఆయన కాకినాడ, విజయవాడ కాంగ్రెస్ మహాసభలకు వెళ్ళారు. నా చిన్నతనం నుండి జాతీయ నాయకులు మా ఇంటికే వస్తూ ఉండేవారు. గ్రామంలో సభలు జరుగుతూ ఉండేవి. మా గ్రామంలో విదేశీ వస్త్రాలు పోగుచేసి ఒకటి, రెండు పర్యాయములు వస్త్రదహనం జరిగినది. మా గ్రామం కాంగ్రెస్‌కు అనుకూలంగా ఉండేది. మా ఇంటికే ఆంధ్రపత్రిక దినపత్రిక, వారపత్రికలు కూడా వస్తూ వుండేవి. వాటిని నేను చదువుతూ ఉండేవాడిని. మా ఇంట్లో రాట్నముల సహాయంతో నూలు వడికేవారు. ఎక్కువభాగం ఖద్దరు ధరించేవారు. గాంధీగారి గురించి, అల్లూరి సీతారామరాజు గురించి రకరకాలుగా కథలు చెబుతూ ఉంటే

వినేవాడిని. జలియన్‌వాలా బాగ్‌లో జరిగిన దారుణ హత్యాకాండ గురించి విన్నాను. కాంగ్రెస్ నాయకులు అప్పుడప్పుడు వచ్చేవారు. వారిపేర్లు కొన్ని గుర్తు లేవు. దండు నారాయణరాజుగారు, దువ్వూరి సుబ్బమ్మగారు, కొవ్వలి గోపాలరావు, సత్తిరాజు రామ్మూర్తిగార్లు వగైరా మా ఇంటికి వస్తూ ఉండేవారు. అంతేకాక, గ్రామంలో సభలు పెట్టేవారు. విదేశీ వస్త్రదహన సమయంలో నా బట్టలుకూడా పడవేశాను.

## జాతీయోద్యమ వాతావరణంలో:

మాకు దగ్గరలో చదువుకొనుటకు సౌకర్యం లేనందున మా చుట్టాలతో కలసి బరంపురం వెళ్ళి, వాళ్ళ పిల్లలతోపాటు కొంతకాలం చదువుకున్నాను. 1929లో విదేశీ వస్త్ర దహనానికి న్యాయపతి నారాయణమూర్తిగారు విదేశీ వస్త్రములు పోగుచేయుటకు తిరుగుచున్నపుడు, మా చుట్టాలు తలుపులు వేసుకున్నారు. (వారు గవర్నమెంటు ఉద్యోగులు అయినందువల్ల.) నారాయణమూర్తిగారు కూడా వారికి చుట్టమే. నేను నా చొక్కా ఒకటి కిటికీ నుండి విసిరివేశాను. సైమన్ కమిషన్ వచ్చినపుడు బరంపురంలో జరిగిన సభకు చీకటితోటే వెళ్ళాను. చాలా సంతోషం కలిగింది. 1930 ఏప్రిల్‌లో ఉప్పు సత్యాగ్రహం గోపాలపురం సముద్రతీరాన జరిగింది. నారాయణమూర్తిగారు, గిరిగారి బంధువులు, ఇంకా చాలా మంది సముద్ర తీరాన ఉప్పు తయారుచేశారు. నాకు ఒక మూకుడు ఇచ్చి తయారుచేయమన్నారు. మా చుట్టాల అబ్బాయితో కలిసి వెళ్ళాను. రాత్రి ఇంటికి 10 గంటలకు చేరాము మా చుట్టాల అబ్బాయి, నేను. ఆ కుర్రాడికి ఆస్తిపాస్తులు వున్నాయి, నువ్వేమిటిరా తిరగడం అని ఆ కుర్రాడిని వాళ్ళవాళ్ళు తిట్టారు. దగ్గరలోనే సోమయాజులు గారని లాయర్ ఉన్నారు. ఆయన 1920వ సంవత్సరంలోనే జైలుకి వెళ్ళారు. వాళ్ళ అబ్బాయితో కలిసి నేను వాళ్ళింటికి వెళ్ళి పడుకునేవాడిని. సోమయాజులుగారు ఒక్కొక్క రోజు తెల్లవారు ఝామునే లేచి, భుజాన జెండాపెట్టుకుని, మహాత్మాగాంధీకి జై అంటూ శిబిరానికి వెళ్ళేవారు. అప్పుడు అక్కడ ఉన్న కుర్రాళ్ళందరికీ కూడా చాలా ఉత్సాహం కలిగేది.

ఆ నెలలోనే మా వూరు వచ్చాను. త్రోవ పొడుగునా ఊరేగింపులు, అరెస్టులు చూశాను. సత్యాగ్రహం శిబిరాలు నిషేధించుతూ ప్రభుత్వం లాఠీఛార్జి కూడా చేసింది. తణుకులో శిబిరాన్ని మూసివేయడం వల్ల మా గ్రామం మల్లెపూడిలో శిబిరం ఏర్పాటు చేయడమైంది. శిబిర నిర్వహకులు మా తండ్రిగారు, దండు వెంకట్రాజు, సుబ్బరాజు, సత్తిరెడ్డి వగైరాలు. సత్యాగ్రహంకు డిక్టేటర్‌గా పెనుగొండ వాస్తవ్యులు తేతలి గుర్రెడ్డిగారు వున్నారు. నాలుగురోజులు శిబిరాన్ని నడిపించారు. తర్వాత ప్రభుత్వం నిషేధించింది. ఆయన తణుకులో అరెస్టు కాబడ్డారు. శిక్ష కూడా విధించారు. శిబిరం మూతపడింది. ఎక్కడైనా మీటింగ్‌లు జరిగితే వెళుతూ వుండేవాడిని. ఆ రోజులలో వచ్చే రహస్య సైక్లోస్టైల్ పత్రికలు పంపకం చేస్తూ ఉండేవారు. అరెస్టులు, లాఠీఛార్జీలు జరుగుతూ ఉండేవి. విప్లవకారుల చరిత్ర, వారి త్యాగాల గురించి చదువుతూ ఉంటే ఎంతో ఉత్తేజం కలుగుతూ ఉండేది. వీర సావర్కార్‌ని ఇంగ్లాండ్‌లో అరెస్ట్ చేసి తీసుకువస్తూ ఉండగా ఓడలోంచి సముద్రంలోకి దూకి 6 మైళ్ళు ఈదడం, భగత్‌సింగ్ అనుచరులు, వారి చరిత్రలు,

ారి త్యాగనిరతి, జైళ్ళల్లో కూడా హక్కుల కోసం పోరాడటం, జైల్లో జతిన్‌దాస్ నిరాహారదీక్ష 60 రోజులు చేసి మరణించటం, దేశ స్వాతంత్ర్యం కొరకు ఆ విధమైన త్యాగాలు చేయడం విని ఉత్సాహం కల్గేది.

## చితికిపోయిన కుటుంబ ఆర్థికపరిస్థితి:

మా తండ్రిగారు ఎంతో జాతీయ అభిమాని అయిన ఆ రోజులలో ఆర్థిక దుస్థితి వల్ల ఆదాయం తగ్గిపోవటం వలన అనగా పొలాలు, ఆస్తులు అమ్ముకోవటంతో – నన్ను టాటానగర్ ఉద్యోగం కోసం మా తండ్రిగారి మేనమామ కొడుకులు దగ్గరికి పంపించారు. అందులో ఒకాయన నన్ను ఖరగ్‌పూర్ స్టేషన్ వచ్చిన దగ్గరనుంచి హెచ్చరించేవాడు (జాగ్రత్త సి.ఐ.డి.లు ఉంటారు–అని). టాటానగర్‌లో సాంఘిక కార్యక్రమాలను నేను, మరికొంతమంది చేసేవాళ్ళము. అక్కడ ఏ.డి.యల్. సొసైటీలో తెలుగువారి ఐక్యత గురించి ఒక సమావేశం ఏర్పాటు చేశారు. దానికి తాపీ ధర్మారావుగారు అధ్యక్షత వహించారు. ఆ సమావేశంలో మేమిద్దరమే ఎక్కువగా మాట్లాడినాము. ఒక సంవత్సరం తర్వాత తిరిగి మా ఊరు వచ్చాను. మా తండ్రిగారు చనిపోయారు. ఉన్న ఆస్తులన్నీ కాస్త కాస్త అమ్ముకుంటూ వచ్చాము. జాతీయ ఉద్యమ కార్యక్రమంలో పాల్గొన్నాను. 1932లో గాంధీగారు పర్యటన సందర్భంలో తణుకులో స్వాతంత్ర్య సమరయోధులు రామనాథంగారి ఇంటిలో ఆయన బస చేశారు. గాంధీగారు బస చేసిన గది దగ్గరలోనే నన్ను వాలంటీరుగా వేశారు. అప్పుడు ఆయన్ను దగ్గరలోనే చూడగలిగాను.

## భగత్‌సింగ్ వీరుల స్ఫూర్తి:

దేశ స్వాతంత్ర్యం కొరకు ఎంతోమంది మహనీయులు ఎన్నో త్యాగాలు చేయడం వింటున్నాము. చిటగాంగ్ విప్లవకారుల పోరాటం; సైమన్ కమీషన్ రాక; లాలా లజపతిరాయ్‌ని లాఠీలతో కొట్టడం వలన వాటితోనే ఆయన మరణించడం; దానికి ప్రతీకారంగా లాహోరులో సాండర్సన్‌పై భగత్‌సింగ్ అనుచరులు ప్రతీకారం తీర్చుకోవడం నన్ను బాగా ప్రభావితం చేశాయి. చంద్రశేఖర్ అజాద్ వీరోచిత పోరాటం, జలియన్‌వాలాబాగ్‌లో జరిపిన కిరాతక చర్యలకు ప్రతీకారంగా డయ్యర్‌ని ఉద్దామసింగ్ లండన్‌లో హతమార్చడం – ఇటువంటి చరిత్రలు చదవడం, వినడం ద్వారా ఉత్తేజభరితులమైనాము. సోషలిస్ట్ కమ్యూనిస్ట్ సాహిత్యం చదువుతూ ఉండేవాడిని. మహీధర రామమోహన్, జగన్మోహన్‌గారల విశ్వ సాహిత్యమాల పుస్తకాలు, ఆదర్శ గ్రంథమండలి వారివి చదివేవాళ్ళము. తణుకు తాలూకా కాంగ్రెస్ సోషలిస్ట్ పార్టీ కార్యదర్శిగా పనిచేస్తూ ఉండేవాడిని. 1935 చట్టానికి ఫెడరేషన్ పథకానికి వ్యతిరేకంగా ప్రచారం సాగించాము. 1937 అని అనుకుంటూ, బాగా గుర్తులేదు – ఆచంటలో జిల్లా యువజన మహాసభకు శివయ్యగారు అధ్యక్షత వహించారు. క్రొవ్విడి లింగరాజుగారు ప్రారంభకులుగా విచ్చేశారు. ఆంధ్రాలో ఎమ్.ఎన్. రాయ్ పర్యటించారు. ఆ సందర్భంలో సుందరయ్యగారు యువజన సంఘం తరఫున ఒక కరపత్రం వ్రాశారు. దానిని అచ్చువేయించి పంచిపెట్టాము. తణుకు

తాలూకా పాలమూరులో సభ జరిగింది. సుందరయ్యగారు ముందు కూర్చున్నారు. వారి వెనుక మేమందరమూ కూర్చున్నాం. రాయ్‌గారిని సుందరయ్యగారు ఏవో ప్రశ్నలు వేశారు. ఆ "డీ కాలనైజేషన్" పై తర్జనభర్జనలు జరిగాయి. తరువాత డాంగేగారి పర్యటన ఏర్పాటు చేశారు. జిల్లా సోషలిస్ట్ పార్టీ మహాసభ తణుకులో జరిగింది. రాష్ట్ర సోషలిస్ట్ మహాసభ పాలకొల్లులో జరిగింది. అందులో ప్రతినిధిగా హాజరయ్యాను. జయప్రకాష్ నారాయణ వచ్చారు. బాట్లీవాలా వచ్చి, చుట్టుప్రక్కల సభలు జరిపి, పార్టీ ప్రచారం గావించారు. మంతెనవారి పాలెం రాజకీయ పాఠశాలకు హాజరయ్యాను. రాజకీయ పాఠశాలలో సీనియర్ తరగతిలో మా అధ్యాపకులు, కంభంపాటి సత్యనారాయణగారు (సీనియర్) అర్ధికశాస్త్రం, పి.వి. శివయ్యగారు తత్వశాస్త్రం, కంభంపాటి సత్యనారాయణ (జూనియర్) రాజకీయం చెప్పేవారు. సాయంకాలం కేంద్ర పార్టీ నాయకులు ఒక్కొక్క సమస్యపై ఉపన్యాసం ఇచ్చేవారు.

అంతకుక్రితం 1937 అసెంబ్లీ ఎన్నికల ప్రచారంలో పాల్గొన్నాము. సుభాష్‌చంద్ర బోస్‌ని జిల్లా పార్టీ అహ్వానించినపుడు ఆ సభకి హాజరు అయినాను. ఆ సమావేశం జరిగినప్పుడు కామ్రేడ్ పోలేపెద్ది నరసింహమూర్తి వచ్చి, యుద్ధ వ్యతిరేక కరపత్రాలను మా అందరికీ ఇచ్చారు. వాటిని జనంలో పంచిపెట్టాము. యుద్ధం ప్రారంభం నుంచి కమ్యూనిస్ట్ పార్టీ ఇచ్చిన కార్యక్రమాన్ని ప్రజలలో ప్రచారం గావించాము. మొదటి రోజులలో మా తాలూకాలలో ఐదారుగురం మాత్రమే పార్టీ సభ్యులం ఉండేవాళ్ళము. కమ్యూనిస్ట్ పార్టీ రహస్యంగా పనిచేస్తున్నా సోషలిస్ట్ పార్టీ వాళ్ళమని చెప్పుకున్నా, కొంతమంది కాంగ్రెస్ రాజకీయ నాయకులు మేము ఏ పార్టీ సభ్యులమో చెప్పేవాళ్ళు. మంచి ఎండాకాలంలో సైకిల్ మీద వస్తూ మంచినీళ్ళకోసమని ఒక హోటల్ దగ్గర అగాను. అక్కడ దండు నారాయణరాజు గారు ఉండి, ఇంకొకరికి పరిచయం చేస్తూ, ఈయన కమ్యూనిస్ట్ అని చెప్పారు. యుద్ధ ప్రారంభం నుండి 1940 సెప్టెంబర్ వరకూ తాలూకా పార్టీ అర్గనైజర్‌గా ఉంటూ పనిచేశాను. తరువాత వాలమర్రులో పార్టీ సమావేశం అనంతరం సత్యాగ్రహం చేయడానికి నిర్ణయించాను.

## అరెస్టు ; డిటెన్షన్:

1940 నవంబరులో అరెస్ట్ చేసి వెల్లూరి జైలులో డిటైన్ చేశారు. మనము జైళ్ళలో ఉన్నా పోరాటం సాగిస్తూనే ఉన్నాము. మన హక్కుల కొరకు పోరాటం సాగిస్తూనే ఉన్నాము. వెల్లూరు జైలుకు వెళ్ళేనాటికి ఎస్. వి. ఘాటే, ఎ. ఎస్. కె. అయ్యంగార్ వున్నారు. అంతకు క్రితమే వచ్చిన కాంగ్రెస్ నాయకులు బులుసు సాంబమూర్తి, అయ్యదేవర కాళేశ్వరరావు గారలు అక్కడే ఉన్నారు. జైలులో డిటెన్యూలు ఎక్కువ అవడం వల్ల మాలో కొంతమందిని దగ్గరలోని క్వారంటైన్‌లో ఉంచారు. అక్కడ మాకు మేయర్‌గా సీనియర్ కంభంపాటిగారు ఉన్నారు. అంతకు పూర్వం మాకు మద్దూరి అన్నపూర్ణయ్యగారు మేయర్. 1941 ఏప్రియల్‌లో హక్కుల కొరకై నిరాహారదీక్ష 19 రోజులు చేశాము. మమ్ములందర్నీ జాగ్రత్తగా చూసుకొన్నది సీనియర్‌గారు, అన్నపూర్ణయ్యగారు. వారు కూడా నిరాహారదీక్షలో ఉన్నవారే. మేము అక్కడ ఉండగానే జైలు నుండి అయిదుగురు కామ్రేడ్స్ గోడకి కన్నం తవ్వి

పారిపోయారు. ఉద్యమాన్ని నిర్వహించుటకు వెళ్ళారు. (ఎ.కె. గోపాలన్, ఎస్.ఆర్. దాట్ల, సి.వి.కె. రావు, కొరపాటి పట్టాభిరామయ్య, కన్నన్.) మేము అక్కడ ఉంటూ ఉండగానే బళ్ళారిలోని అలీపూర్ జైలునుండి పి.వి. శివయ్యగారు కూడా తప్పించుకొని వెళ్ళిపోయారు. మేము 1942 జూన్ నెలలో కొంతమందిమి విడుదల కాబడ్డాము. విడుదల అనంతరం మా కార్యక్రమాలన్నీ యధావిధిగా సాగిస్తూ వచ్చాము. మేము కామూరు, పెండ్యాల పంపింగ్ స్కీము .గురించి తీవ్రంగా కృషి చేశాము. 1944 జనవరి 26వ తేదీ స్వాతంత్ర్య దినోత్సవం సందర్భమున అరెస్ట్‌చేసి 6 మాసములు శిక్ష విధించి బళ్ళారి జైలుకే పంపించారు. విడుదల అనంతరం మా కార్యక్రమం కొనసాగించాము. 1946లో ప్రజాశక్తి దినపత్రిక వచ్చునప్పుడు నేను పనిచేస్తున్న ఏరియాకు కామ్రేడ్ చండ్ర రాజేశ్వరరావు గారు వచ్చారు. విజయవాడ ఆఫీసుకి రమ్మన్నారు. హోల్‌టైమర్‌గానే పరిగణించుతా మన్నారు. ప్రజాశక్తి ఆఫీసు స్టాఫ్ నుండి కలకత్తా కాంగ్రెస్‌కు ప్రతినిధిగా ఎన్నుకోబడి, ఆ సభకు వెళ్ళాను. 1947 ఆగస్ట్ 15న ఆఫీసులో స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా పెద్ద సభ జరిగింది. సుందరయ్యగారు ఉపన్యసించారు. తరువాత కాలంలో విశాలాంధ్రలో పనిచేస్తూ వచ్చాను.

* * *

# శ్రీ కాట్రగడ్డ పెదవెంకట్రాయుడు



నా స్వగ్రామం కృష్ణాజిల్లా గన్నవరం తాలూకా బుద్ధవరం. మా జనక తండ్రి తల్లుల పేర్లు రంగయ్య, అన్నపూర్ణమ్మగారలు. జననం ది. 14-7-1919. నా తర్వాత అయిదుగురు చెల్లెండ్రు, యిద్దరు తమ్ముళ్ళు. మా పెద తండ్రి రామయ్యగార్కి సంతానము లేనందున నన్ను దత్తత చేసుకున్నారు. మా పెదతల్లి రాజమ్మగారు నన్ను ఎంతో గారాబంగా పెంచి పెద్దవాణ్ణి చేశారు. మాది ఒక మధ్యతరగతి కుటుంబము. బుద్ధవరంలో నా ప్రాథమిక విద్య పూర్తి అయిన పిమ్మట మా గ్రామానికి మైలు దూరంలో వున్న గన్నవరం హైస్కూలులో ఒకటవ ఫారములో చేర్చారు. ప్రతిరోజూ మైలు దూరం నడిచి వెళ్ళి తోటి విద్యార్థులతోపాటు నడిచి వచ్చేవాడిని. అప్పటికి జిల్లాలో సుమారు 11 హైస్కూళ్ళు, 3-4 మిడిల్ స్కూళ్ళు వుండేవి. బందరులో ఒక కాలేజీ వున్నట్లు గుర్తు. విజయవాడ పట్టణంలో హిందూ హైస్కూలు, మున్సిపల్ హైస్కూలు రెండుమాత్రమే వుండేవి.

మా దత్తత తండ్రిగార్కి నన్ను చదివించి ప్రభుత్వోద్యోగం చేయించాలనే సంకల్పం వుండేది. ఆ రోజుల్లో యింజనీరింగ్ గాని, యమ్.బి.బి.యస్.గాని

అందుబాటులో లేవు. అందుచే యస్.యస్.యల్.సి. చదివిన వారు రెవిన్యూ గుమస్తా ఉద్యోగంగాని, యిరిగేషన్ ఓవర్సీయరుగాని, సబ్ రిజిస్ట్రారుగాని, పోలీస్ సబ్‌యిన్స్పెక్టరు కోర్సుకు గాని వెళ్ళవచ్చు. పై కోర్సులలో మా నాన్న గార్కి యిరిగేషన్ ఓవర్సీయర్, సబ్ రిజిస్ట్రార్ కోర్సులంటే యిష్టపడేవారు. కారణం – జీతంతోపాటు అక్రమ సంపాదన పొందడానికి వీలుండటం. నేను 1936 మార్చి నాటికే యస్.యస్.యల్.సి. రెండు పర్యాయములు తప్పాను. 1937 మార్చి పరీక్షకు మూడవ పర్యాయం చదువుచున్నాను. నన్ను పెంచుకున్న మా పెదతండ్రిగారు తీవ్ర అస్వస్థతకు గురియగుటచే నా వివాహం స్వసంఘ పురోహితుల ద్వారా జరిగింది. అప్పటికదే అభ్యుదయ చర్య.

## జాతీయోద్యమ ప్రభావం:

గన్నవరం ప్రాంతము నేను విద్యార్థిగా వున్న నాటికి రాజకీయంగా చాలా వెనుకబడిన ప్రాంతము. అప్పటికి గాంధీగారు నిర్వహించిన సత్యాగ్రహోద్యమాలలో మా ప్రాంత ప్రజల పాత్ర చాలా తక్కువ. ముస్తాబాద, పెద అవుటపల్లి, ఆత్కూరు, తేలప్రోలు, సిరిహడ, కానుమోలు గ్రామాలకు మాత్రమే జాతీయోద్యమ ప్రభావం పరిమితంగా వుండేది. తాలూకా, జిల్లా బోర్డు ఎన్నికలలో జమీందార్ల ప్రభావం, శాసనసభ ఎన్నికల్లో జస్టిస్ పార్టీ ప్రభావం వుండేది. జస్టిస్ పార్టీ కూడా జమీందార్ల పార్టీయే. ముస్తాబాద గ్రామానికి చెందిన గన్నవరం హైస్కూలు పూర్వ విద్యార్థి శ్రీ పెండ్యాల వెంకటేశ్వరరావుగారూ, బుద్ధవరం గ్రామానికి చెందిన శ్రీ ముక్కామల నాగభూషణంగారూ మా ప్రాంతములో గుర్తింపు పొందిన కాంగ్రెస్ వాదులు. వారిలో శ్రీ పెండ్యాల వెంకటేశ్వరరావుగారు చాలా కాలం క్రితం చదువు మానివేసినా, ప్రతి సంవత్సరం స్కూలు ముగింపురోజున గాంధీ టోపీ, ఖద్దరు వస్త్రములు ధరించి స్కూలుకు వచ్చి విద్యార్థులందరినీ ప్రోగుజేసి ఊరేగింపుగా తీసుకువెళ్ళి, మహాత్మాగాంధీకి జై, కాంగ్రెస్‌కు జై, స్వరాజ్యం మా జన్మ హక్కు, సామ్రాజ్యవాదం నశించాలి 'అని నినాదాలతో తాలూకాఫీస్, పోలీస్‌స్టేషన్ల చుట్టూ త్రిప్పుతూ వుండేవారు. ఆ కార్యక్రమంలో నేనూ ఉషారుగా పాల్గొనేవాడిని. అప్పటి నుంచే నాలో జాతీయ భావాలకు బీజాలు ఏర్పడ్డాయి.

1928లో నేను హైస్కూలులో చేరే నాటికి గ్రామాలలో పోస్టాఫీసులు లేవు. గన్నవరం పోస్టాఫీసు నుంచే చుట్టూ 10 మైళ్ళ వరకూ వారానికి రెండు రోజులు మాత్రమే బట్వాడా జరుగుతూ వుండేది. మా గ్రామ షావుకారుకు ఆ రోజుల్లో మద్రాస్ నుంచి 'ఆంధ్ర' దినపత్రిక పోస్టులో వచ్చేది. తపాలా బంట్రోతు ప్రతిరోజూ రానందున హైస్కూలుకు వెళ్ళే విద్యార్థులను పత్రిక తెచ్చిపెట్టమనేవారు. 1930లో సత్యాగ్రహ సమరం సాగుతున్న రోజులవి. అప్పుడు జరిగే అరెస్టులకు సంబంధించిన వార్తలు మాకు ఉత్సాహాన్ని కలుగజేసేవి. అందుచే ప్రతిరోజూ పత్రిక చదవాలనే కాంక్ష అభివృద్ధి కావడమే కాకుండా మాలో జాతీయభావాలు కూడా చిగురించాయి. శ్రీ ముక్కామల నాగభూషణం, పెండ్యాల వెంకటేశ్వరరావుగారలు కొంత కాలానికి తాలూకా కాంగ్రెస్ అధ్యక్ష, కార్యదర్శులయ్యారు. సభ్యత్వం చేర్పించే కార్యక్రమాలలో

క్రమేపీ నేను కూడా పాల్గొనేవాడిని. శ్రీ ముక్కామల నాగభూషణం గారు హరిజన సేవా సంఘము తరఫున మా గ్రామ హరిజనవాడలో ఒక బావి కూడా త్రవ్వించారు. ఆ కార్యక్రమాలలో నేనూ పాల్గొనేవాడిని. ఆ రకంగా విద్యార్థి దశ నుంచీ ప్రజలతో నా సంబంధాలు పెరగసాగాయి. మా తండ్రిగారు తీవ్ర అస్వస్థులుగా వుండుటచేతనూ, గత్యంతరం లేని పరిస్థితులలో నా వివాహం జరుగుటచేతనూ నాకు మూడవ పర్యాయం హైస్కూలులో చదివే అవకాశమున్నా, నేను నాస్తికుడననే కారణంతో నన్ను హైస్కూలులో చేర్చుకుంటానికి ప్రధానోపాధ్యాయులు అంగీకరించకపోవుటచే నా విద్యాభ్యాసం తాడంకిలో చేయవలసి వచ్చింది.

## ఎర్రజెండా నీడన స్వాతంత్ర్యోద్యమ ప్రచారం:

1937లో బ్రిటిష్ ప్రభుత్వం ప్రకటించిన నూతన రాజ్యాంగానికి వ్యతిరేకంగా భారతదేశమంతటా హర్తాళ్ జరిగింది. అప్పటికి నేను ఎర్రజెండా చూడలేదు. కాంగ్రెస్ జెండా మాత్రమే తెల్సు. గన్నవరం హైస్కూలు పూర్వ విద్యార్థి, కృష్ణాజిల్లా కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకుడు అయిన శ్రీ వెల్లంకి విశ్వేశ్వరరావుగారు గన్నవరంలో హర్తాళ్ చేయించడానికి వచ్చినప్పుడు నేనూ, మా బావమరిది – అమరజీవి జాస్తి వీర రాఘవయ్య, కొర్లగుంటి రాఘవయ్యగారలం ఆ కార్యక్రమంలో పాల్గొని కొట్లు కట్టివేయించాము. రజకులను కూడా బట్టలు ఉతకకుండా సమ్మె చేయించడంతో హర్తాళ్‌ను గురించి విరివిగా ప్రచారం జరిగింది. 'ఎగరాలి ఎగరాలి మన ఎర్రజెండా' పాట పాడుకుంటూ, భారత జాతీయ కాంగ్రెస్‌కు జై, సామ్రాజ్యవాదం నశించాలి, స్వరాజ్యం మా జన్మహక్కు వగైరా నినాదాలతో ఎర్రజెండాలతో గ్రామమంతా ప్రచారం చేశాము.

## కాంగ్రెస్ సోషలిస్టు పార్టీతో పరిచయం:

1937లోనే ఉమ్మడి మద్రాస్ రాష్ట్ర శాసనసభా ఎన్నికలు జరిగాయి. జాతీయ కాంగ్రెస్ తరఫున పశ్చిమ కృష్ణా ద్విసభ్య నియోజకవర్గం నుంచి కాంగ్రెస్ అభ్యర్థులుగా శ్రీ కాట్రగడ్డ నారాయణరావుగారూ, జయంతిపురం రాజాగారు పోటీచేయగా జస్టిస్ పార్టీ తరఫున కోదండరెడ్డి, గూడవల్లి లక్ష్మీనారాయణ గారలు పోటీ చేయగా కాంగ్రెస్ అభ్యర్థులు అఖండ విజయం సాధించారు. గూడవల్లి లక్ష్మీనారాయణగారు ఆయన స్వగ్రామంలోనూ ప్రజలు ఎదురు తిరుగుటచే పోటీ నుంచి విరమించారు. ఈ ఎన్నికలలో గ్రామంలోని యువకులందరినీ సమీకరించి కాంగ్రెస్ అభ్యర్థుల విజయానికి కృషి చేశాను. 1937లో నెహ్రూగారు విజయవాడ వచ్చినప్పుడు జింఖానా గ్రౌండ్సులో జరిగిన సభకు హాజరైనాను. ఆయన ఆ సభలో బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగానూ, రష్యన్ విప్లవాన్ని గురించి చెప్పిన విషయాలు నన్ను ప్రభావితం చేశాయి. అప్పటికే నేను జయప్రకాశ్ నారాయణగారు వ్రాసిన 'సోషలిజం ఎందుకు?' అనే గ్రంథాన్ని చదవడం, రష్యా విప్లవాన్ని గురించి కొద్దిగా తెల్సుకోవడం జరిగింది. నేను తాడంకిలో చదువుచుండగానే జయప్రకాశ్ నారాయణగారు వచ్చినప్పుడు గుడివాడలో జరిగిన కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ వర్కర్సు మీటింగుకు నేను కూడా హాజరయ్యాను.

## డిటెన్షన్ వ్యతిరేక సమ్మె:

1937 సం॥లో తాడంకి హైస్కూలు ప్రధానోపాధ్యాయులుగా శ్రీ సదాశివ శర్మగా వుండేవారు. విద్యార్థులకు చదువు చెప్పడంలోనూ చదివించడంలోనూ ఆయన ఎక్కువ శ్రద్ధ వహించేవారు. అయితే, క్రమశిక్షణ పేరుతో నిరంకుశంగా వ్యవహరించేవారు. ఆ రోజుల్లో యస్.యస్.యల్.సి.లో డిటెన్షన్ విధానం వుండేది. దానికి వ్యతిరేకంగా 3½ దినములు సమ్మె చేయడంతో పై అధికార్లు జోక్యం చేసుకుని అందరినీ పరీక్షకు పంపించారు. దానితో విద్యార్థులలో నూతనోత్సాహం కల్గింది. అప్పటికి విద్యార్థి సంఘాలు లేవు. సమ్మె విజయవంతమైన పిమ్మట రసీదు పుస్తకాలు, తెల్ల కాగితాలతో వ్రాతప్రతులు తయారుచేసి, ప్రతి విద్యార్థి నుంచీ ఒక అణా రుసుం వసూలు చేసి సభ్యులుగా చేర్పించాను. తాడంకి హైస్కూల్ సమ్మె సందర్భంగా శ్రీ వెల్లంకి విశ్వేశ్వరరావుగారితో నా పరిచయం పెరుగుటే గాక శ్రీ కడియాల గోపాలరావు, వేములపల్లి ఆంజనేయులు గారితో కూడా నాకు పరిచయాలు ఏర్పడ్డాయి. పై ముగ్గురూ మా సమ్మె విజయానికి అన్ని విధములా తోడ్పడ్డారు.

తాడంకి హైస్కూలు నుంచి 1938 ఏప్రియల్‌లో తిరిగి యింటికి వచ్చిన కొంత కాలానికే నన్ను పెంచుకున్న మా తండ్రిగారు చనిపోవడంతో కుటుంబ బాధ్యత నా నెత్తిన పడింది. 1938లో జిల్లా విద్యార్థి మహాసభ గన్నవరంలో జరపాలనే ప్రతిపాదన రావడంతో ఆ మహాసభకు ఆర్థిక వనరులు సమకూర్చడానికి తాడంకి, పునాదిపాడు, గన్నవరం హైస్కూళ్ళకు తిరిగి విరాళాలు వసూలు చేశాను. విద్యార్థులూ, ఉపాధ్యాయులు సహకరించారు. సభ జయప్రదంగానే జరిగింది. ఆ మహాసభలో జిల్లా విద్యార్థి సంఘానికి నూజెళ్ళకు చెందిన శ్రీ పిన్నమనేని సత్యనారాయణగారు ప్రధాన కార్యదర్శిగానూ, నేను సహాయ కార్యదర్శిగానూ ఎన్నుకోబడ్డాము. మహాసభ జరిగిన కొద్ది కాలానికే మా నాన్నగారు చనిపోవుటచే, కుటుంబ బాధ్యతలలో మునిగిపోవుటచే నేను కార్యకలాపాలలో పాల్గొనలేని పరిస్థితి ఏర్పడింది.

## బాట్లీవాలా పర్యటన:

1938లో కామ్రేడ్ బాట్లీవాలా కృష్ణాజిల్లాలో పర్యటించిన సందర్భములో తాకాడిగడప, మొవ్వ గ్రామాలలో ఏర్పాటు చేసిన సభలలో పాల్గొన్నాను. ఆయన ఉపన్యాసాలు నాలో నూతనోత్సాహాన్ని కలుగజేశాయి. కామ్రేడ్ విశ్వేశ్వరరావుగారితో నా పరిచయం తర్వాత నేను 'నవశక్తి' రెగ్యులర్‌గా చదవడం ప్రారంభించాను. ఆ రకంగా నేను సోషలిస్టు సాహిత్యంతో పరిచయం ఏర్పాటు చేసుకున్నాను.

1938 నాటికే నాకు రైతు ఉద్యమంతోనూ, యువజనోద్యమంతోనూ కొద్ది కొద్దిగా సంబంధాలు ఏర్పడ్డాయి. శ్రీ కడియాల గోపాలరావుగారు కృష్ణాజిల్లా అంతటా సైకిల్ పైనా, చిన్న కారుపైనా తిరిగి యువజన సంఘ సభ్యత్వాన్ని చేర్పించి అన్ని తాలూకాలలో తాలూకా యువజన సంఘాలు ఏర్పాటుచేసి జిల్లా యువజన సంఘాన్ని ఏర్పాటు చేశారు. గన్నవరం తాలూకాలో శ్రీ పెండ్యాల వెంకటేశ్వరరావుగారు చాలా గ్రామాలు తిరిగి రైతు సంఘ సభ్యత్వం చేర్పించి తాలూకా రైతు సంఘాన్ని ఏర్పర్చారు. ఆ కాలంలోనే విజయవాడ గవర్నరు

పేటలో కాట్రగడ్డ వారి మేడమీద కృష్ణాజిల్లా రైతు సంఘం (రిజిష్టర్డు) ఆఫీసు వుండేది. జిల్లా రైతు సంఘములో జస్టిస్ పార్టీ ప్రముఖుల నుంచి జాతీయవాదులు, సోషలిస్టులు వరకూ వుండేవారు. నాకు గుర్తున్నంతవరకు జస్టిస్ పార్టీ ప్రముఖులు వడ్డే శోభనాద్రిగారు అధ్యక్షులుగాను, కామినేని వెంకటప్పయ్యగారు కార్యదర్శిగాను ప్రారంభంలో వుండేవారు.

## యుద్ధవ్యతిరేక ప్రచారం:

1939 సెప్టెంబరు 1 వ తారీఖున రెండవ ప్రపంచయుద్ధం ప్రారంభమైంది. యుద్ధం ప్రారంభమైన మరురోజే బుద్ధవరంలో ముక్కామల నాగభూషణం గారి యింటి వద్ద ఒక రహస్య సమావేశం జరిగింది. ఆ సమావేశానికి కామ్రేడ్ కొసరాజు శేషయ్యగారు రావాల్సి వుంది. వారు రానందున ఆ సమావేశాన్ని శ్రీ కడియాల గోపాలరావుగారు నిర్వహించారు. ఆ సమావేశంలో నేనూ, పెండ్యాల వెంకటేశ్వరరావుగారూ, మాగులూరు బసవయ్య, జాస్తి రాఘవయ్య, ముక్కామల చిన నాగభూషణం, చింతపల్లి పాపారావు వగైరా 10 మందిమి పాల్గొన్నాం. ప్రస్తుత యుద్ధం సామ్రాజ్యవాద యుద్ధమని, యీ యుద్ధ ప్రయత్నాలకు వ్యతిరేకంగా ప్రచారం చేయాలని నిర్ణయించబడింది. యుద్ధ నిధికి చందాలు యివ్వవద్దని, సామ్రాజ్యవాద యుద్ధానికి సహకరించవద్దని యుద్ధ వ్యతిరేక నినాదాలు వ్రాసిన పోస్టర్లు రహస్యంగా రాత్రిపూట గ్రామాలలో అంటించేవారము. ఈ కార్యక్రమంలో కామ్రేడ్ ముక్కామల చిన నాగభూషణం, చింతపల్లి పాపారావు గారలు నాతోపాటు పాల్గొనేవారు. ప్రొద్దున్నే గ్రామస్తులు రంగు రంగుల కాగితాలపై వ్రాసిన పోస్టర్లు చదవడం, తరువాత గ్రామోద్యోగులు గాని, పోలీసులు గాని వాటిని చింపివేయడం జరుగుతుండేది.

1940లో యుద్ధ నిధి వసూళ్ళకై గ్రామానికి ఆర్.డి.వో. వచ్చి రైతులనందరినీ పిలిపించారు. నేను యుద్ధ నిధి యివ్వనని తిరస్కరించినందుకు అరెస్టు చేసి, పిన్న వయస్కుడనగుటచే గ్రామస్తుల జోక్యంతో నన్ను వదిలిపెట్టారు. యుద్ధం ప్రారంభమైన కొద్ది కాలానికే ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీ రహస్య పత్రిక "స్వతంత్రభారత్" ప్రచురణ ప్రారంభమైంది. ఆ పత్రిక కాపీలను బుద్ధవరం, దావాజిగూడెం, ఆత్కూరు, తేలప్రోలు, ముస్తాబాద్ గ్రామాలలో పంపిణీ చేసేవారం. రహస్యంగా చదవడం, యితరులతో చదివించడం మా కార్యక్రమం.

అప్పటికి గన్నవరం హైస్కూలులో టి. కె. రామస్వామిగారు ఉపాధ్యాయులుగా పనిచేస్తున్నారు. వారు నన్నూ, వెల్లంకి వెంకటేశ్వరరావుగారినీ, పుట్టగుంట నాగభూషణంగారినీ పిలిపించి, వారింటి వద్దనే సమావేశం ఏర్పాటు చేసి, మా ముగ్గురితోనూ పార్టీ శాఖను ఏర్పాటు చేశారు. ప్రతివారం వారి యింటివద్దనే సమావేశాలు జరుగుతూ వుండేవి. ఆ రకంగా మా ముగ్గురితో మా ఏరియాలో ప్రథమ శాఖ ఏర్పాటు చేయబడింది. పార్టీ కార్యకలాపాలలో పాల్గొంటూ ఆటుపోట్లకు తట్టుకుని నిలబడినవారికే సభ్యత్వం యిచ్చేవారు. కొద్దికాలంలోనే కేసరపల్లి, ఆత్కూరు, దావాజిగూడెం, తేలప్రోలు వగైరా గ్రామాలలోనూ; వెద్దిపాడు, ఉంగుటూరు గ్రామాలలోనూ శాఖలు ఏర్పడ్డాయి.

కామ్రేడ్ చింతపల్లి పాపారావు బుద్ధవరం శాఖలో సభ్యుడయ్యాడు. ఆ కామ్రేడ్ వయస్సులో చిన్నవాడైనా ఆయన క్రమశిక్షణ, త్యాగనిరతి, కార్యదీక్ష పార్టీలో ఉన్నతమైన స్థానానికి ఎదగడానికి తోడ్పడింది. ఆ కామ్రేడ్ రైతు, వ్యవసాయ కూలీ, మహిళా, యువజన, విద్యార్థి సంఘాల కార్యక్రమాలన్నిటిలోనూ పాల్గొనుటే గాకుండా ప్రజానాట్యమండలి కార్యక్రమాల్లో కూడా ముందుపీఠి నుండేవారు.

## ప్రజాయుద్ధం; అధికోత్పత్తి ఉద్యమం:

హిట్లర్ ఫాసిస్టు మూకలు యూరప్‌లో ఒక్కొక్క దేశాన్ని ఆక్రమించుకుంటూ 1941 జూన్ 22 వ తేదీ సోవియట్ రష్యాపై దాడిచేయడంతో యుద్ధ గమనంలో వచ్చిన మార్పును గుర్తించి మన పార్టీ యుద్ధ వ్యతిరేకతకు స్వస్తి చెప్పి, ఫాసిజాన్ని ఓడించి ప్రజాస్వామ్యాన్ని సోవియట్ రష్యాను కాపాడాలనే లక్ష్యంతో యుద్ధ ప్రయత్నాల కనుకూలంగా పనిచేయడం ప్రారంభించింది. యుద్ధకాలంలో అధికోత్పత్తి సాగించడానికి వ్యవసాయ కూలీలచే బంజరు భూములు సాగు చేయించడం, రైతులకు అవసరమైన వ్యవసాయ పనిముట్లు, బండిపట్టాలు, ఎరువులు వగైరా కంట్రోలు రేట్లకు అమ్మించడం, గ్రామసీమలలో ప్రజల నిత్యజీవితానికి అవసరమైన పంచదార, కిరోసిన్ వగైరా వస్తువులను కంట్రోలు ధరలకు అమ్మించడం వగైరా కార్యక్రమాలలో మన పార్టీ ముందుండి కృషిచేయుటచే పార్టీ ప్రతిష్ట అపారంగా పెరిగింది.

## విమానాశ్రయ నిర్మాణం; రిక్విజిషన్ వ్యతిరేక పోరాటం:

రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైన వెంటనే గన్నవరంలో విమానాశ్రయ నిర్మాణం నిమిత్తం షుమారు 1000 ఎకరాల భూమిని ప్రభుత్వం యిండియా రక్షణ చట్టము క్రింద స్వాధీనపర్చుకుని, సదరు భూమిలో విమానాలు దిగడానికి ఎగరడానికి 'రన్ వే', విమానాలు ఆగడానికి పెన్‌లు, మిలిటరీ క్వార్టర్సు నిర్మించడానికి పూనుకుంది. కేంద్ర ప్రభుత్వం విమానాశ్రయ నిర్మాణానికి వేలకొలది రైతుల బండ్లను నిర్బంధంగా పనిచేయడానికి ప్రభుత్వం రిక్విజిషన్ చేసింది. నిర్మాణంలో వేలాది మంది తాపీ పనివారు, వడ్రంగులు వగైరా పనివారలు, కూలీలు పాల్గొన్నారు. రైతుల బండ్లకు బాడుగలు యిప్పించి, కూలీలకు కూలి యిప్పించుట పెద్ద కార్యక్రమమయ్యింది. ఆ కాలంలోనే రైతులను రైతు సంఘాలలో చేర్పించడం, సమస్యలపై అధికార్ల వద్దకు రాయబారాలు నడపడం, కూలీల వేతనాలను ఎగగొట్టడానికి ప్రయత్నించిన కాంట్రాక్టర్లపై పోరాడి, వారి వేతనాలు వారికి యిప్పించడంతో మన పార్టీ, రైతుసంఘాల ప్రతిష్ట బాగా పెరిగింది. పై కార్యక్రమాలలో కామ్రేడ్ అట్లూరి శ్రీమన్నారాయణ, నేనూ అప్పుడప్పుడూ భోజనం చేయకుండా వుండవలసివచ్చేది.

ఆ కాలంలోనే గ్రామాలలో యువజన సంఘాల నిర్మాణం, ఆటల పోటీలు, వైజ్ఞానిక దళాలకు తరిఫీదు వగైరా కార్యక్రమాలు క్రమబద్ధంగా సాగేవి. వాటి నిర్వహణ బాధ్యత కామ్రేడ్ పాపారావు వహించేవారు.

## కృష్ణకాలువల మరమ్మతు:

1944లో రైతుసంఘము, మన పార్టీ కలిసి నిర్వహించిన కృష్ణ కాల్వల మరమ్మతు కార్యక్రమం నా మీద చెరగని ముద్ర వేశాయి.

1945లో సోవియట్ ఎర్రసైన్యం చేతులలో హిట్లర్ నాజీమూకలు మట్టికరవడంతో ప్రపంచ వ్యాపితంగా వచ్చిన ప్రజావెల్లువ నన్నెంతో ఆకర్షించి, కమ్యూనిజం యెడల అకుంఠిత విశ్వాసాన్ని కలుగచేసింది.

1946 అసెంబ్లీ ఎన్నికలలో మన పార్టీ అభ్యర్థుల విజయానికి అకుంఠిత దీక్షతో కృషిచేసి, గ్రామ గ్రామానికి మన పార్టీ సందేశం తీసుకువెళ్ళడం, అనేక గ్రామాలలో శాఖలు ఏర్పాటు చేయడం నాలో ఆత్మవిశ్వాసాన్ని కలుగజేసి కమ్యూనిస్టు పార్టీకి నా జీవితాన్ని అంకితం చేశాయి.

## ఆనాటి కమ్యూనిస్టు వైభవం - నేటి దుస్థితి:

అనాడు కమ్యూనిస్టులంటే నీతికి, నిజాయితీకి మారుపేరు. ఉక్కు క్రమశిక్షణ, త్యాగనిరతి, తాను నమ్మిన సిద్ధాంతానికి ఆత్మబలిదానం చేయడానికి సిద్ధపడడం, పార్టీపని ముందు - స్వంతపని తర్వాత అనే దృఢదీక్ష, మూఢాచారాలకు వ్యతిరేకంగా పట్టువిడవని పోరాటం, ప్రజలకు చెప్పే విషయాలు తమ నిత్యజీవితంలో ఆచరించడం, నాయకత్వంపై అకుంఠిత భక్తి విశ్వాసాలు, కష్టజీవుల యెడల అవ్యాజమైన ప్రేమ, వారి సమస్యల పరిష్కారానికి అకుంఠిత దీక్షాదక్షత, మూర్తీభవించిన దేశభక్తి ఆనాటి కమ్యూనిస్టుల సల్లక్షణాలు. ప్రతి కమ్యూనిస్టు తన సిద్ధాంత పరిజ్ఞానాన్ని పెంచుకోవడానికి ఎంతో కొంత కృషి చేసేవాడు. పరిమిత అవకాశాలలోనే పార్టీ ఆ కృషిలో ప్రత్యేక శ్రద్ధ వహించేది.

ఎంత పెద్ద నాయకుడైనా చిన్న తప్పుకు కూడా ఆనాడు విమర్శ-ఆత్మవిమర్శ వుండేది. సహృదయతతో స్వీకరించేవారు.

నాటి పరిస్థితి అలా వుంటే నేడు మనమెక్కడున్నాం? ఆనాడు వందలుగా పార్టీ సభ్యులుండగా నేడు వేలకు పెరిగారు. ఆనాడు గ్రామంలో ఒక్క కమ్యూనిస్టు వున్నా మన వాణి వినపడుతూ వుండేది. నేటి పరిస్థితి ఏమిటి? దీనికి కారణాలను మనమంతా పరిశీలించాలి. పార్టీ యిచ్చే కార్యక్రమాలు ఎంతవరకు అమలు జరుగుతున్నాయి? సక్రమంగా అమలు జరగకపోవడానికి కారణమేమిటి? జిల్లా సమితి, మండల సమితి సభ్యులంతా "విశాలాంధ్ర" దినపత్రిక చదువుచున్నారా? పత్రిక యెడల మనము తీసుకుంటున్న శ్రద్ధ ఏమిటి? విమర్శ-ఆత్మవిమర్శ మన పార్టీలో వున్నదా? దానిని ఎంతవరకు అమలు జరుపుతున్నాము? సాంఘిక దురాచారములకు వ్యతిరేకంగా మన పోరాటం ఎంతవరకు జరుపుతున్నాం? గ్రామాలలో సాంఘిక అసమానతలకు వ్యతిరేకంగా మనం ఎంతవరకు పోరాడుతున్నాం? కష్టకాలంలో మనకు రక్షణ యిచ్చి అన్ని విధాలా మనకు అండగా వున్న పేదప్రజానీకం మననుంచి క్రమేపీ ఎందుకు దూరమయ్యారు? పార్టీ ప్రారంభ దినాలలో సమస్యలు వెతికి, వాటి నివారణకోసం ఏమి చేయాలి అనేది చర్చనీయాంశం. ఈ రోజున చేసేవారుంటే సమస్యలు కోకొల్లలు. సకాలంలో మన దృష్టికి వచ్చిన సమస్యలనైనా తీసుకుని

పనిచేస్తున్నామా? నాయకత్వం ఆదేశాలు యిచ్చినప్పుడు మొక్కుబడి కార్యక్రమాలు చేస్తున్నాము. బూర్జువా పార్టీలలాగానే మనకు కూడా పదవులకోసం వెంపర్లాట ఎందుకు పెరిగింది? ఎన్నికలొస్తే గ్రామాలలో లక్షలు ఖర్చు పెడుతున్నామే? ఆ గ్రామాలలోనే పనిచేసే హోల్ టైమరుకు మనం ఏమి చెల్లిస్తున్నాం? ఆ మొత్తం కనీసం నెలలో 15 దినములకైనా అతనికి సరిపోతుందా? పార్టీ నిధి సామాన్య ప్రజానీకం నుంచి వసూలు చేస్తున్నామా? అలా వసూలు చేయనప్పుడు మన రాజకీయాలు వారిలోకి ఎలా వెళతాయి? పార్టీ సిద్ధాంత పరిజ్ఞానం పెంపొందించడానికి మనపార్టీ చేస్తున్న కృషి ఏమిటి? అది యెంతవరకు ఫలితాలను యిస్తున్నది?

కామ్రేడ్స్!

పై విషయాలన్నీ సమగ్రంగా పరిశీలన చెయ్యాలి. మా తరం కాలం దగ్గరపడుతున్నది. ఒక్కొక్కరిమే జారిపోతున్నాం. ఎన్నో త్యాగాలతో వేలాదిమంది కార్యకర్తలు రక్తతర్పణతో నిర్మించిన ఉద్యమం మనది. ఈ ఉద్యమాన్ని ఎలా ముందుకు తీసుకుపోవాలనే తపన ప్రతి ఒక్కరిలోనూ వుంటేనే మన పార్టీని సక్రమ పద్ధతులలో నడపగలుగుతాము. ఇందుకు యువత నడుం బిగించాలి. నా ఆవేదనను సహృదయతతో అర్థం చేసుకుని, సకాలంలో కార్యాచరణకు దిగి, మన పార్టీ పురోభివృద్ధికి పూనుకుంటారని ఆశిస్తూ శలవు తీసుకుంటున్నాను.

★ ★ ★

# శ్రీ సోమూరి వెంకట్రామయ్య



నేను కృష్ణాజిల్లా పసుమర్రులో 1913 ఫిబ్రవరి 14న జన్మించాను. మా తండ్రిగారు సోమూరి నాగయ్యగారు. మా తల్లిగారు వీరమ్మగారు. వీరి ఐదుగురి సంతానంలో నేను మూడవవాడిని.

అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశం 1921 మార్చి 31, ఏప్రిల్ 1 తేదీలలో విజయవాడలోని నేటి గాంధీనగర్ ప్రాంతంలో జరిగింది. ఆనాడా ప్రదేశమంతా చిన్న చిన్న పొదలతో నిండి వుండేది.

ఆ సభలో పాల్గొన్న మా గ్రామస్తుడు కాజ వెంకట్రామయ్యగారు మా ఊరులో కాంగ్రెస్ సభ ఏర్పాటు చేశారు. ఆ సభలో ఆయన, యితర వక్తలు మహాత్ముని గూర్చి, అంటరానితనాన్ని గూర్చి, విదేశీ పాలన తొలగించుకోవడాన్ని గూర్చి చెప్పారు.

కాజ వెంకట్రామయ్యగారు మా బంధువు. వారి మాటలు నాలో బాగా నాటుకుపోయాయి. ముఖ్యంగా అంటరానితనంమీద వారు చెప్పింది హత్తుకుపోయింది.

మా పాఠశాలలో ఆనందు, సుందరం అనే దళిత విద్యార్థులు చదువుకుంటుండేవారు. వారిద్దరూ ఎడంగా కూర్చునేవారు. నేను వారి దగ్గరకు వెళ్ళి ఆనందు జుట్టు ముట్టుకున్నాను. ఆనాడు నా వయస్సు 8 సంవత్సరాలు. మూడవ తరగతి చదువుతున్నాను. ఆ విషయం తెలుసుకున్న టీచర్ గోడకుర్చీ వేయించి, తలస్నానం చేయించి, బట్టలు మార్పించాడు.

1920వ సంవత్సరంలో గాంధీజీ మా ఊరు వచ్చారు. వారి వెంట కస్తూరిబా కూడా వున్నారు. వారి బోధనలు నన్ను మరింతగా ప్రభావితం చేశాయి. నాలో తెలియకుండానే హేతువాద భావాలు పెంపొందసాగాయి. ప్రశ్నలే నా ఆయుధాలు కావడం కావచ్చు. అందువలన నా కొరకు తిరుపతి వెంకటేశ్వరస్వామి మ్రొక్కుగా కట్టిన పసుపు ముడుపు విప్పి, ఆ డబ్బుతో సురభి వారి డ్రామా ఆనందంగా చూసివచ్చాను.

ఇలా తర్కబద్ధమైన ఆలోచనా ప్రవాహం నాలో ఏనాడూ ఆగిపోలేదు. ప్రశ్నలు, సమాధానాలతో జీవితం నడుస్తూనే వుంది. పసరు కోనేరుగా నేను మారిపోకుండా బ్రతకడానికి ఇదే ప్రధాన చోదక శక్తిగా నన్ను నడిపించిందని నా నమ్మకం. 1930 ఏప్రిల్ ఆరున ఉప్పు సత్యాగ్రహం పిలుపు వచ్చింది. బందరు శిబిరంలో వాలెంటీరుగా చేరడానికి నేనూ, మరికొందరు కలసి కాలినడకన వెళ్ళాం. అక్కడ వున్న పెద్దలు వెనుకకు పంపించివేశారు. 1933లో గాంధీజీ హరిజనోద్ధరణ కొరకై ఉద్యమం ప్రారంభించి, నవంబర్‌లో బందరు వచ్చారు. చేతిలో కానీ లేదు. మా తల్లిగారిని ఒప్పించి, డబ్బులు తీసుకుని గోపయ్యతో కలిసి 13 మైళ్ళు నడిచి బందరు వెళ్ళాను. అలా రెండవసారి గాంధీజీని చూశాను. వ్యక్తిగత విలాసాలకు దూరంగా వుండాలని, బహుజన హితాన్ని కోరుతూ, సాదాగా జీవించాలని ఆనాడే నిర్ణయించుకున్నాను.

హిందీ చదవాలనే కోరిక నాలో బలీయంగా వుండేది. కాశీ వెళ్ళి చదవాలనుకున్నాను. నా పట్టుదల చూసి, చెప్పిస్తామంటూ మావాళ్ళు వాయిదా వేశారు. చివరకు విసుగు కలిగింది. మా బాబాయి కుమారుడు గోపయ్యను కలుపుకుని, ఎవరికీ చెప్పకుండా బెనారస్ పారిపోయాను. ఆ రోజు 1934 జులై 27. అప్పటికి నా వయస్సు 21 సంవత్సరాలు.

నేను కమ్యూనిస్టును కావడానికి ప్రధానమైన తాత్విక బీజాలు బెనారసులోనే పాదుకున్నాయి.

నేనూ, గోపయ్యా కాశీ విద్యాపీఠ్‌లో, కోవిదలో చేరాము. అక్కడ అనేకమంది యువ విద్యార్థులు పరిచయమయ్యారు. వారిలో చాలామంది అతివాద, వ్యక్తిగత హింసావాదనలతో వుండేవారు. జాతీయ భావాల సంగతి చెప్పనవసరం లేదు.

విద్యాపీఠ్‌కు ఆరుమైళ్ళ దూరంలో హిందూ విశ్వవిద్యాలయం వుంది. దాని వైస్ ఛాన్సలర్‌గా పండిత మదనమోహన్ మాలవ్యా వుండేవారు. జాతీయోద్యమ కార్యక్రమాలలో ఆ విశ్వవిద్యాలయంలోని విద్యార్థులు బాగా పాల్గొనేవారు. అందుకు

వారికి పూర్తిగా స్వేచ్ఛ వుండేది. ఈ విశ్వవిద్యాలయం గూర్చి తెలుసుకున్న అనేకమంది ఆంధ్రదేశం నుండి వచ్చి, చదువుకోటానికి అందులో చేరేవారు.

బెనారస్ యూనివర్శిటీలో చేరిన తెలుగు విద్యార్థులలో ముఖ్యంగా శ్రీయుతులు చండ్ర రాజేశ్వరరావు, వారి సోదరులు చండ్ర రామలింగయ్య; పొన్నం వీరరాఘవయ్య, సి. ఎల్. రాయుడు, మునిపల్లి రామారావు, పులుపుల శివయ్య, నందూరి ప్రసాదరావు, పోలేపెద్ది నరసింహమూర్తి, కాట్రగడ్డ నారాయణరావు మొదలగువారున్నారు. జాతీయ భావాలతో నిండిన యువకులు, చదువు సాగించాలని, తెలుసుకోవాలని, బెనారస్ రావడం ఆ రోజులలో బాగా జరుగుతుండేది. దాదాపు వీరందరూ సామ్యవాద భావాలవైపు ఆకర్షితులై అధ్యయనం చేస్తుండేవారు.

విద్యాపీఠ్‌లో 1934లో కమ్యూనిస్టు సెల్ ఏర్పడింది. దానికి ఓంకార్‌నాథ్ అనే ఓహెర్ విద్యార్థి సెక్రటరీగా వుండేవాడు. అప్పటికే మూడేళ్ళ క్రితం బెనారస్ యూనివర్శిటీలో చండ్ర రాజేశ్వరరావుగారి నాయకత్వంలో యంగ్ కమ్యూనిస్టు లీగు ఏర్పడి పనిచేస్తోంది. పొన్నం వీర రాఘవయ్యగారి నేతృత్వంలో సోషలిస్టు స్టడీ సర్కిల్ అని మరో ఆర్గనైజేషన్ వుండేది. వీటికి సంబంధించిన విద్యార్థులు మార్క్సిజం, లెనినిజంలకు సంబంధించిన గ్రంథాలు అధ్యయనం చేసేవారు.

చండ్ర రాజేశ్వరరావు, పులుపుల శివయ్య, మునిపల్లి రామారావు ఎన్.సి.సి. డ్రిల్లు నేర్చుకుంటుండేవారు. రాబోయే పోరాటాలకు ఆ రకమైన శారీరక శిక్షణ అవసరమని వారు భావించారు.

నాకు రాజేశ్వరరావుగారితో బాగా పరిచయం వుండేది. మిలిటరీ కంటోన్మెంట్‌లో మిలిటరీ డ్రిల్లు జరుగుతుండేది. రాజేశ్వరరావు, యితరులు వెళ్ళి, డ్రిల్లు చూసి వస్తుండేవారు. కంటోన్మెంట్ విద్యాపీఠ్‌కు దగ్గరగా వుండేది. డ్రిల్లు చూశాక యీ ముగ్గురూ విద్యాపీఠ్‌కు వచ్చేవారు. తుమ్మల వెంకట్రామయ్యగారిని కలిసి, కాసేపు మాట్లాడి వెళ్ళేవారు.

నేను ఒకరోజున రాజేశ్వరరావు దగ్గరకు వెళ్ళాను. నాకారోజు బాగా గుర్తుంది. అది 1934 నవంబర్ నెల మొదటి ఆదివారం. అక్కడే భోజనం చేసి, ఆయన గదిలోనే వున్నాను. ఆ రాత్రి రాజేశ్వరరావు ఎన్నో క్రొత్త విషయాలు చెప్పాడు. "స్వాతంత్ర్యం వచ్చాక దేశం ఎలా వుంటుందనుకుంటున్నావు?" అని ఆయన ప్రశ్నించాడు. "బ్రిటిష్ వాళ్ళు వెళ్ళిపోతే మనల్ని మనమే పాలించుకుంటాం. మన సంపద మనకే వుంటుంది. బాగా అభివృద్ధి చెందుతాం" అన్నాను.

రాజేశ్వరరావు తన ధోరణిలో అన్నాడు: "నీవన్నది నిజమే. కానీ, సామాన్య ప్రజా జీవితంలో ఎటువంటి మార్పూ రాదు. బ్రిటిషు పెట్టుబడిదారుల స్థానంలో భారత పెట్టుబడిదార్లొస్తారు" అంటూ ఆయన సోవియట్ యూనియన్ గూర్చి, శ్రామిక ప్రజలు సాధించుకున్న సోషలిస్టు సమాజాన్ని గూర్చి వివరించారు. నా జీవితంలో తొలిసారిగా వివరణాత్మకంగా వర్గ పోరాటాన్ని గూర్చి రాజేశ్వరరావు చెప్పగా విన్నాను.

అంతవరకు జాతీయ వాదిగా వున్న నాలో ఆయన మాటల వలన నూతన చైతన్యం ప్రారంభమైంది. మరోకోణంలో జాతీయ పోరాటాన్ని, ప్రజల సంబంధాలను,

వర్గ స్వభావాలను అధ్యయనం చేయడానికి తొలి బీజాలు అప్పుడే మొలకెత్తాయి. ఆ తర్వాత గోర్కీ రచన 'అమ్మ' నవల హిందీ అనువాదం అక్కడే చదివాను. ఆ పుస్తకంపైన నిషేధం వుండి.

శాస్త్రి కోర్సు చదువుకోను బెనారస్ వచ్చిన కురుమద్దాలి వాస్తవ్యుడు గుళ్ళపల్లి పురుషోత్తం, తెనాలి దగ్గరున్న కొల్లూరు నుండి వచ్చిన తుమ్మల వెంకట్రామయ్య విద్యాపీఠ్‌లోని కమ్యూనిస్టు సెల్‌లో చురుకుగా వుండేవారు. ఆ విషయం నాకు ముందుగా తెలియదు. రాజేశ్వరరావు ద్వారా తెలిసింది.

సౌమ్యమూర్తి, మృదుభాషి అయిన తుమ్మలగారితో నా స్నేహం బాగా పెరిగింది. ఆయన ఓంకార్‌నాథ్‌కు నన్ను పరిచయం చేశాడు. సెల్‌తో సంబంధాలు కలిగి, కార్యక్రమాలలో పాల్గొనడం జరిగింది.

సెల్ సమావేశాలలో తీవ్రంగా చర్చలు జరిగేవి. సిద్ధాంతము – ఆచరణల మీద వాగ్వివాదాలు తారాస్థాయిలో వుండేవి.

బెనారస్ విశ్వవిద్యాలయానికి మామూలుగా కాంగ్రెస్ నాయకులు, గొప్ప కళాకారులు వస్తుండేవారు. ఆ తరువాత విద్యాపీఠ్‌కు వచ్చేవారు. అందువలన అనేకమంది ప్రముఖుల మహత్తర సందేశాలను వినే అవకాశం లభించింది.

ఖిలాఫత్ ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన షౌకత్ అలీ, విశ్వకవి రవీంద్రనాథ్ ఠాగూర్, హిందీ సాహిత్యరంగంలో దేదీప్యమానంగా వెలుగొందుతున్న ప్రేమచంద్, మరోకవి రామచంద్ర శుక్లా, రచయిత్రి మహాదేవి వర్మ మొదలగువారి సందేశాలను అలా వినటం జరిగింది.

ప్రముఖ సోషలిస్టు అయిన ఆచార్య నరేంద్రదేవ్ విద్యాపీఠ్ అధిపతి. ఆ కారణం వలన విద్యార్థులకు సోషలిస్టు భావాల ప్రచారానికి బాగా అనుకూలత కలిగింది.

1934లో ఉత్తరప్రదేశ్ అఖిల భారత యువజన సమాఖ్య (ఎ.ఐ.వై.ఎఫ్) సభ, కాశీలో జరిగింది. ఆ సభకు కామ్రేడ్ డాంగే అధ్యక్షత వహించారు. ఆ సమయంలో డాంగే విద్యాపీఠ్‌లో మూడు రోజులున్నారు. తుమ్మల వెంకట్రామయ్య ఆ మూడురోజులూ డాంగేతోనే కలిసి వున్నాడు. తుమ్మలగారి స్నేహం వలన నాకు డాంగేతో పరిచయం కలిగింది.

డాంగే విద్యాపీఠ్ నుండి వెళ్ళిపోయాక నాలుగు రోజులకు తెల్లవారురుఝామున తుమ్మల నా గదికి వచ్చి నిద్రలేపాడు. కరపత్రాల కట్ట యిచ్చి దాచమన్నాడు. ఆ కరపత్రాల శీర్షిక "సశస్త్రక్రాంతికరో", అనగా "సాయుధ పోరాటం చేయండి" అని.

అప్పటికే నా గదిలో చంచల్‌కుమార్ జానా వున్నాడు. ఆయన మిడ్నపూర్ నుండి వచ్చాడు. అక్కడ తెల్ల కలెక్టర్‌ను చంపిన వారిలో ఆయనా వున్నాడు. ఆయనపై రాష్ట్ర బహిష్కరణ బ్రిటిషు ప్రభుత్వం ప్రకటించింది.

మరో వ్యక్తి తారకేశ్వర పాండే. ఆయన కూడా నా రూంలోనే వున్నాడు. పాండే, చంద్రశేఖర్ ఆజాద్ అనుచరుడు. బాంబులు తయారుచేయడంలో నిపుణుడు. వారిద్దరి కొరకు పోలీసులు సోదా చేస్తే, కరపత్రాలు కూడా దొరుకుతాయి.

ఆ విషయం అర్థం చేసుకుని, తుమ్మల "నువ్వింకా అందరి దృష్టిలోనూ పడలేదు. నేను, డాంగే కలిసి వున్నాం గనుక ముందుగా నా గదికే వచ్చి సోదా చేస్తారు.

కరపత్రాలు దొరికితే నన్ను అరెస్టు చేస్తారు. ఒకవేళ నీ రూము సోదా చేసి, కరపత్రాలు పట్టుకుంటే, నేనే యిక్కడ వుంచానని చెప్పు" అన్నాడు.

నా రూముకు పోలీసులు రాలేదు. ఆ ప్రమాదం తప్పింది.

నా జీవితంలో విప్లవ సాహిత్యాన్ని దాచడం, పంచడం, రహస్య జీవితాన్ని అనుభవించే వారికి ఆశ్రయమివ్వడం ముందుగా విద్యాపీఠ్‌లోనే ప్రారంభమయింది.

విప్లవకారుడు పాండే నా రూంమేట్‌గా ఒక సంవత్సరం వున్నాడు. 'పిరికివాడు విప్లవకారుడు కాలేడు. జైలుకు వెళ్ళడానికి వెనుదీయడం పిరికితనం' అనేవాడు.

నా జీవితానుభవంలో 'పిరికివాడు విప్లవకారుడు కాలేడు' అని అతనన్న మాట ముమ్మాటికీ సత్యం. విప్లవకారుడే కాదు, కమ్యూనిస్టుగా అసలు పనికేరాడు. ఇది నా ఉద్దేశ్యం.

1936 ఏప్రిల్ 15న లక్నోలో కాంగ్రెస్ మహాసభలు జరిగాయి. నేను, మరికొందరు కలసి ఎగ్జిబిషన్‌లో వాలంటీర్లుగా పనిచేసేందుకు నెలరోజులు ముందుగా లక్నో వెళ్ళాము. రాజేశ్వరరావు కాంగ్రెస్ సభలకు వచ్చి, మూడు రోజులు నా గదిలోనే వున్నారు. సభలో మేమంతా కూర్చొని నెహ్రూ ఉపన్యాసం వింటున్నాము. ఒక సి.ఐ.డి. మా ప్రక్కన కూర్చొని వివరాలు సేకరిస్తున్నాడు. అది గమనించి రాజేశ్వరరావు చెప్పు తీసుకుని వాడిని చితకబాదాడు. ఆ రాత్రి నా గదిలోనే వుండి, తెల్లవారుఝామున పోలీసులు గుర్తించకుండా వుండేందుకు నా పంచె కట్టుకుని, చొక్కా, తలగుడ్డలతో, కర్ర చేతపట్టుకొని, రైతులాగా బెనారస్ వెళ్ళిపోయాడు.

బెనారస్‌లో దెబ్బలు తిన్న సి.ఐ.డి. ఆయన్ని గుర్తించాడు. నేను నాలుగు రోజుల తర్వాత బెనారస్ వెళ్ళాను. రాజేశ్వరరావు అరెస్టు తప్పించుకోను ఆంధ్రదేశానికి వెళ్ళిపోతూ రైల్వేస్టేషన్‌లో కన్పించాడు. విద్యాపీఠ్‌లో కమ్యూనిస్టు సెల్ కార్యదర్శి ఓంకార్‌నాథ్ వద్ద తన పుస్తకం 'కేపిటల్' వుందని, దాన్ని తెచ్చిపెట్టమని చెప్పి, వెళ్ళిపోయాడు. నేను బెజవాడ వస్తూ తెచ్చి ఆయనకు దానిని అందించాను.

కోవిద పాసయి, 1936 మే ఆఖరున పసుమర్రు తిరిగి వచ్చాను. ఉద్యోగం చేయొద్దని నిర్ణయించుకున్నాను.

కాట్రగడ్డ రాజగోపాలరావు, వల్లభనేని నారాయణదాసు, నేను కలసి కమ్యూనిస్టు సెల్ ఫారమ్ చేశాము. రాజేశ్వరరావు రికమెండ్ చేశాడు.

ఆ తర్వాత సెల్ మెంబర్లు పెరిగారు. టి. కె. రామస్వామి, యార్లగడ్డ బసవయ్య, ఈడ్పుగంటి కూర్మారావు, కాట్రగడ్డ రాజగోపాలరావు, కంచర్ల సుబ్బారావు, పొట్లూరి సీతారామయ్య, ఈడుపుగంటి రామచంద్రరావు (వీరు కమ్యూనిజం పేపరు ఎడిటర్ ఈడుపుగంటి నాగేశ్వరరావుగారి తండ్రి), వేములపల్లి హనుమంతరావు, నేను వుండేవాళ్ళం. తరచు రామస్వామి సెల్ సెక్రటరీగా వుండేవారు. మా ఇంట్లో సెల్ సమావేశాలు జరుగుతుండేవి. నేటి నక్సలైట్ నాయకుడు కొండపల్లి సీతారామయ్యగారు సెల్ సమావేశాలకు వస్తుండేవారు. తొలి రోజులలో తెనుగులో ప్రచురించిన మొదటి కమ్యూనిస్టు పత్రిక "నవశక్తి"కి మద్దుకూరి చంద్రశేఖరరావు సంపాదకులుగా వుండేవారు. తుమ్మల వెంకట్రామయ్యగారు ప్రధాన పాత్ర వహించేవారు.

1939 సెప్టెంబరులో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయింది. పార్టీ సామ్రాజ్యవాద యుద్ధ వ్యతిరేక పంథా తీసుకుంది. ఇందువలన పార్టీ మీద వత్తిడి పెరిగింది. ఆ పరిస్థితిలో పేపరు ముద్రించి, పంచటం కుదరదని ఆపివేశారు. చంద్రంగారు, ఇతరులు రహస్య జీవితం సాగించారు. ఆ సమయంలో చంద్రంగారు పది రోజులు మా యింట్లో వున్నారు.

పార్టీ రహస్య కాలంలో రాజేశ్వరరావు, టి.కె. రామస్వామి, వేములపల్లి ఆంజనేయులు మొదలగు వారెందరో మా యింట్లో దాగేవారు. చాలామంది కొలది కాలం వుండి వెళ్ళిపోయేవారు. 'విప్లవయుగం' రచయిత గద్దె లింగయ్యగారు మా యింట్లో రహస్యంగా వున్నారు.

'నవశక్తి' ఆగిపోయిన తర్వాత పార్టీ నాయకులు రహస్యంగా వుంటూనే 'స్వతంత్ర భారత్' పత్రిక నడపాలనుకున్నారు. 1939 అక్టోబరులో ప్రారంభించారు. కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య, మద్దుకూరి చంద్రశేఖరరావు, కొండేపూడి లక్ష్మీనారాయణ, తుమ్మల వెంకట్రామయ్యగారలు ఆ బాధ్యత తీసుకున్నారు. ఆ పత్రిక పంపిణీలో కొద్దికాలం నేను పాల్గొన్నాను. ముద్రించిన కాపీలు మా యింటికి వచ్చేవి. వాటిని రహస్యంగా ఆంధ్ర దేశమంతా చేరవేసేవాళ్ళం, పంపిణీ చేసేవాళ్ళం. ఆ సమయంలో ఒక నెలరోజులు నేను రహస్య జీవితం గడిపాను. పార్టీ ఆదేశానుసారం అలా చేశాను.

ఆరోగ్య కారణాల వలన కొల్లి రంగదాసుగారి ప్రకృతి ఆశ్రమంలో 1941లో చేరాను. అది అప్పికట్లలో వుండేది. అక్కడనే వల్లూరుపల్లి నాగేశ్వరరావుగారు పరిచయమయ్యారు.

1944లో కొమరువోలు గాంధీ ఆశ్రమంలో వున్నాను. అమరజీవి పొట్టి శ్రీరాములుగారు మాతో ఆరు నెలలు ఆ ఆశ్రమంలోనే వున్నారు.

గోపరాజు రామచంద్రరావుగారి రచన "దేవుడు లేడు" నన్ను బాగా ఆకట్టుకుంది. ఆనాటి నుండి యీనాటివరకు నాస్తికుడుగానే వున్నాను, కమ్యూనిస్టుగానే జీవిస్తున్నాను.

జీవిత ప్రారంభ దశలో గాంధీజీ ప్రబోధనలతో జాతీయవాదిగా వున్నాను. కాశీ విద్యాపీఠ్‌లో చంద్ర రాజేశ్వరరావు బోధనలతో తుమ్మల వెంకట్రామయ్య, పొన్నం వీరరాఘవయ్య తదితరుల సహచర్యం వలన నేను సామ్యవాది నయ్యాను. మార్క్స్ రచనలు చదివాను. పీడిత ప్రజల విముక్తికి వర్గపోరాటమే మార్గమని నమ్మకం కలిగింది. ఏనాటికైనా ప్రపంచంలోని కష్టజీవుల విముక్తి మార్క్సిస్టు దృక్పథంతో నడిపే ఉద్యమాల వలననే జరుగుతుందని నా ప్రగాఢ విశ్వాసం. అంతవరకు ప్రపంచ ప్రజలకు అసలైన శాంతి సౌఖ్యాలు లభించవని నా నమ్మిక.

★ ★ ★

# శ్రీ తాళ్ళూరి మంగపతిరావు



నా జననం 28-8-1917. మా గ్రామం కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా కవుతరం. గుంటూరు టౌన్ స్కూలులోను, తర్వాత చల్లపల్లి గ్రామ హైస్కూలులోను విద్య నభ్యసించాను. యస్.యస్.యల్.సి. పాస్ అయ్యాను. మా గ్రామం ప్రాచీన గ్రామమేగాక, ఆయా కాలములలో అనేకానేక ఉద్యమాలకు దోహదపడినట్టిది. వందేమాతరం ఉద్యమం నుంచి ముందంజ వేసిన గ్రామం. ఈ గ్రామ జాతీయోద్యమ ప్రభావం నామీద వుంది. 1929 సం॥లో మా గ్రామం గాంధీజీ వచ్చినప్పుడు వారి వస్త్రధారణ చూసి ఆశ్చర్యపోయాను.

నేను గుంటూరు టౌన్ హైస్కూలులో దిగువ తరగతులు చదువుతున్న రోజులవి. నా చిన్నమేనమామ అమరజీవి కామ్రేడ్ చల్లపల్లి నారాయణరావు ఎ.సి. కాలేజిలో ఇంటర్మీడియట్ చదువుచున్న రోజులవి. అప్పుడు (1930లో) గాంధీజీ ఉప్పు సత్యాగ్రహమును ప్రారంభించారు. దానికి ముందు గుంటూరు రైల్వేపేటలోని

కాంగ్రెస్ ఆఫీసులో ఆ టౌన్ యువకుల సమావేశాలు ప్రతిరోజు సాయంత్రం జరుగుతూ వుండేవి. వాటికి నేను, నా చినమేనమామ కామ్రేడ్ నారాయణరావు వెళ్ళేవాళ్ళము. ఆ సమావేశాలలో కీర్తిశేషులు కామ్రేడ్ జొన్నలగడ్డ రామలింగయ్య పాత్ర యెక్కువగా వుండేది. నేను ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనలేదు. కాని సానుభూతి వుంది. నా ఇద్దరు మేనమామలు- మా అమ్మ తమ్ముళ్ళు చల్లపల్లి వెంకట రామదాస్, నారాయణరావుగార్లు ఆ సత్యాగ్రహంలో గుంటూరు జిల్లాలో పాల్గొని జైళ్ళకు వెళ్ళారు. వెంకట రామదాసుగారు చల్లపల్లి గ్రామ కరణీకమునకు రాజీనామా యిచ్చి పాల్గొన్నారు. ఆయన తమ్ముడు నారాయణరావు కాలేజీ విద్యకు స్వస్తిచెప్పి సత్యాగ్రహములో పాల్గొన్నారు.

ఆ రోజులలో విప్లవకారులైన భగత్‌సింగ్, సుఖదేవ్, రాజ్‌గురులను ఉరితీయటం యువక లోకాన్ని కుదిపింది. గాంధీజీ అడ్డుపడి వున్నట్లయితే వారికి ఉరి తప్పేదని అనుకున్నాము. కాని, ఆయన అందుకు ప్రయత్నించలేదు. అప్పటినుంచి అతివాద రాజకీయం మీదకు మొగ్గాను.

శతవృద్ధులైన తాతగారిని కనిపెట్టుకొని నేను యింటివద్దనే (కవుతరం) వుండవలసిన కారణంచేత నేను స్కూల్ ఫైనల్ చదువుతోనే సరిపుచ్చుకున్నాను. ఉద్యోగం కొరకు గూడా ప్రయత్నించలేదు. 1935 సంIIలో కాంగ్రెస్‌లో యాక్టివ్ సభ్యుడనయ్యాను. తక్లీవడుకుట, ఖద్దర్ అమ్మకం నా కార్యక్రమం. జాతీయ భాష అయిన హిందీని స్వయం కృషితో "విశారద" వరకు అభ్యసించాను. కాంగ్రెస్ మహాసభ స్వర్ణోత్సవాల సందర్భంలో బందరు కార్యక్రమాలలో పాల్గొన్నాను. అప్పుడే వెలువడిన పట్టాభిగారి 'కాంగ్రెస్ చరిత్ర' (కొడాలి వారి తెలుగు అనువాదం) ఖరీదుచేసి పూర్తిగా చదివాను. దాన్ని పవిత్రమైన బైబిల్ గ్రంథంగా చూచేవాడిని. విజ్ఞానం కోసం మా గ్రామ గ్రంథాలయంలో వున్న రాజకీయ ఆర్థికాది పుస్తకములను, ముఖ్యంగా 1. ప్రపంచ చరిత్ర (H.G. Wells వారి ఇంగ్లీషుకి అనువాదం), 2. చైనా జాతీయోద్యమం, 3. తిలక్, గాంధీ, నెహ్రూల ఆత్మకథలు, వినాయకసర్కార్ జీవిత చరిత్ర, 4. దిగవల్లి వెంకటశివరావుగారి గ్రంథములు, 5. అయ్యదేవరవారి రచనలు చదివాను. అందలి ముఖ్యాంశములు నోట్సుగా వ్రాశాను. ఆ రోజులలో కొవ్వలివారి నవలలు యువకులలో ఎక్కువ ప్రచారంలో వుండేవి. కాని, నేను వాటి జోలికి పోయేవాడిని కాదు. సాధు టి. యల్. వాస్వాని (సింధు) "లార్డ్ కృష్ణమురళి" సిరీస్ ఇంగ్లీషు రచనలు చదువుట వల్ల, భగవంతుడైన కృష్ణుని పేదజనులకు సేవ చేయుటలోనే చూడగలుగుతాము అనే నమ్మకం కలిగింది.

నేను కాంగ్రెస్‌లో చేరినా, స్థానికంగా పనిచేస్తున్న అతివాద గ్రూపులతోనే సన్నిహిత సంబంధం నెరిపేవాడిని. మా గ్రామంలో కామూరి బలరామయ్యగారు అతివాద రాజకీయ గ్రూపుకు చెందినవారు. కాంగ్రెస్ సభ్యులను చేర్పించుటలో గూడా ఆ దృష్టితోనే చేర్పించేవారము. కాంగ్రెస్ అధ్యక్ష స్థానమునకు జరిగిన ఎన్నికలలో పట్టాభిగారు ఓడటం, సుభాష్‌చంద్ర బోస్ గెలుచుట వల్ల మా కృషి ఫలించిందని ఆనందించాము. కాని, పర్యవసానం వేరొక విధంగా పరిణామం చెందింది. నవశక్తి సంచికలు, త్రిపుర కాంగ్రెస్ సంచిక అధ్యయనం ఎక్కువైనది. నార్లవారి "నేటి రష్యా" చదువుటవల్ల సోవియట్ల మీద నాకు అభిమానం కలిగింది.

1937 సం॥రం అసెంబ్లీ ఎన్నికలలో కాంగ్రెస్ అభ్యర్థి గొట్టిపాటి బ్రహ్మయ్యగారి తరపున కృషి చేశాను. ఆ ఎన్నిక ప్రచారార్థమై గుడివాడకు విచ్చేసిన జవహర్‌లాల్ నెహ్రూ సభకు వెళ్లాను. మా గ్రామం కామ్రేడ్ డాంగే, వారి భార్య, కుమార్తె వచ్చారు. డాంగే ఉపన్యసించారు. వారి ఉపన్యాసం నన్ను ఎక్కువగా ఆకర్షించింది. అనేకమంది జమీందారులు ఓడినారు. కాని, కాంగ్రెస్ ప్రత్యర్థి చల్లపల్లి జమీందారు ఓడలేదు. కాగా, ఉమ్మడి మద్రాస్ రాష్ట్రంలో కాంగ్రెస్ ప్రభుత్వంలోకి వచ్చింది. నాకు కొంత సంతృప్తి కలిగింది. ఉత్సాహం పట్టలేక యీ చిన్న ఇంగ్లీష్టాంజా వ్రాశాను:

*"Remember remember the fourteenth day*
*by July, the Indian Renaissance day,*
*The setting of the dummy Ministry*
*The dawning of the Congress Ministry" - by T.M.Rao 14-6-1937.*

జమీందారీ రద్దు విచారణ సంఘానికి నేను కపుతరం గ్రామం యీనాముల గురించి వ్రాసి పంపగా, ఆ నివేదిక Report of Madras Estates and Act Committee Part II (పేజీ 69లో) వెల్లడయింది. నవశక్తిలో చీరాల కాల్పులు, కాళీపట్నం, మునగాల జమీందారీ రైతుల పోరాటాలు, కాంగ్రెస్ ప్రభుత్వం వాటిని అణచివేసిన తీరు చూసి నాలో కాంగ్రెస్ వ్యతిరేకత ఏర్పడింది. 1939 సం॥లో కాశీనాథుని నాగేశ్వరరావుగారు నిర్యాణం కాగా వారి స్మృత్యర్థం వారి పేరుమీద గ్రామ యువజన క్లబ్‌ను ఏర్పాటు చేశారు. ఇండోర్ ఆట కేరమ్స్, అవుట్‌డోర్ ఆట బాల్‌బాడ్మింటన్ సభ్యులు ఆడేవారు. రాజకీయార్థికాది విషయాలమీద, సాంస్కృతిక విషయాలమీద క్లబ్ సభ్యులచే వ్యాసములు వ్రాయించి నెలకొక వ్రాతప్రతి జర్నల్‌ను వెలువరించేవారము. 1939 సెప్టెంబర్‌లో పోలెండుమీద నాజీ జర్మనీ దండయాత్రతో రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయింది. రాష్ట్రాలలోని కాంగ్రెస్ ప్రభుత్వాలు అనుమతి లేకుండా సామ్రాజ్యవాద ప్రభుత్వం మనదేశాన్ని యుద్ధంలోకి దింపింది. కమ్యూనిస్టు పార్టీ ముఖ్యులు యుద్ధవ్యతిరేక కార్యకలాపములు జరుపుటకు రహస్యంగా వెళ్ళారు.

నేను విశాల ప్రాతిపదికమీద కొన్ని ఆశయాలు, నిబంధనావళిని తయారుచేసి మా గ్రామయువజన సంఘాన్ని స్థాపించాను. కాట్రగడ్డ రాజగోపాలరావు, నాటి యమ్.ఎల్.ఏ. కాట్రగడ్డ వెంకట నారాయణరావుగార్లను రప్పించి, మహాసభ ఏర్పాటుచేసి ఉపన్యాసములను యిప్పించాను.

### వయోజన విద్య ప్రభావం - రాత్రి బడులు:

పేదజనులు చదువు సంధ్యలులేని వ్యవసాయ కూలీలకు ప్రపంచంలో జరుగుతున్న విషయాలు ప్రతిరోజు ఎందుకు తెలియజేయకూడదు అనే సంకల్పం నాలో వచ్చింది. ప్రతిరోజు రాత్రులందు ఒక లాంతరు, ఒక దినపత్రికను తీసుకుని మా గ్రామంలోని చినమాలపల్లె గుడివద్దకు చేరి, ఆ పల్లెవాసులను సమావేశపర్చి యుద్ధవార్తలు, యితర వార్తలు తెలియజేసేవాడిని. ఆయా దేశాలను గుర్తించుటకు ప్రపంచ రాజకీయ పటమును చూపించేవాడిని. అదే కాలంలో National Front, స్వతంత్ర భారత్

అనే కమ్యూనిస్టు రహస్య పత్రికలు నాకు రహస్యంగా చేరేవి. వాటిద్వారా కమ్యూనిస్టు పార్టీ వైపుకు ఆకర్షితుడనయ్యాను. సి.పి.యస్.యు. చరిత్ర సైక్లోస్టయిల్ కాపీ ఒకటి నాకు చేరింది. అందు డయలెక్టికల్ మెటీరియలిజమ్ మీద వున్న ఛాప్టర్ నన్ను బాగా ఆకర్షించింది. ఈ ప్రపంచాన్ని ఏ దృక్పథంతో చూస్తే సమస్యలకు పరిష్కారమార్గం సుగమం అవుతుందో గ్రహించగలిగాను. నా మనోవికాసానికి, దృఢ సంకల్పానికి, చురుకైన కమ్యూనిస్టుగా తయారవుటకు దోహదపడింది. అంతే అంతటనుంచి (1940) రహస్య కమ్యూనిస్టు పార్టీచే నడుపబడిన జిల్లా యువజన సంఘంతో తత్సంబంధాలు యేర్పడ్డాయి. ఎలమర్రు, జమీ గొల్వేపల్లిలో జరిగిన వేసవి రాజకీయ క్లాసులలో చేరటం జరిగింది. తర్వాత ఎలమర్రు గ్రామ వ్యవసాయ కూలీ పేటలలో వయోజన విద్య కేంద్రాలను స్వయంకృషితో నడిపాను. ఆ ప్రజలకు విద్య నేర్పటం జరిగింది. వారి సమస్యలు గూడా తీసుకుని పనిచేయుటకు ఉద్యుక్తుడనైతిని. ఆ కాలంలో వెంట్రప్రగడ మహాసభలో జిల్లా వ్యవసాయ కూలీ (కార్మిక) సంఘం యేర్పడింది. కామ్రేడ్, కీర్తిశేషులు అయ్యంకి వెంకటరమణయ్య... [note: printed] దావీదు అధ్యక్షులు. గుంటూరు బాపనయ్య సెక్రటరీ. నా చినమేనమామ చల్లపల్లి నారాయణరావు ఆర్గనైజర్‌గా జిల్లా కమిటీ ఏర్పడింది. నేను పార్టీవైపు ఆకర్షితుడయినట్లే చల్లపల్లి గ్రామవాసి నారాయణరావు గూడా పార్టీ రాజకీయాలకు ఆకర్షితులైనారు. వారు చల్లపల్లి ఆ చుట్టుపట్లగల గ్రామాల వ్యవసాయ కూలీల్లో ప్రచారంచేసి, వారి సమస్యలు తీసుకొని పరిష్కరించుచున్నారు. గుంటూరు బాపనయ్యగారిని కమ్యూనిస్టు పార్టీలోకి తెచ్చింది యీ నారాయణరావుగారే.

### ఆకలి యాత్రలు:

జిల్లా వ్యవసాయ కూలీసంఘం, రహస్య కమ్యూనిస్టు పార్టీల నిర్ణయాల ప్రకారం దివి తాలూకాలో నారాయణరావు, బాపనయ్యగార్ల ఆధ్వర్యాన వ్యవసాయ కూలీలచే ఆకలి యాత్రలు జరుగగా, నా ఆధ్వర్యాన గుడివాడ తాలూకా వ్యవసాయ కూలీల ఆకలి యాత్రలు జరిగాయి. ఆ వూరేగింపులలో “ఎగరాలి ఎగరాలి మన ఎర్రజెండా”, “ఆకలి మంటలచే మలమలమాడే అనాధులందరు లేవండోయ్” పాటలు పాడుతూ గ్రామ నడివీధులలోను, కూలీపేటలలోనూ వూరేగింపులు జరిగాయి. కష్టజీవుల జెండా ఎర్రజెండా అనేది గ్రామసీమ పల్లె వ్యవసాయ కూలీలకు అర్థమయింది. ఆ రోజులనుంచే పార్టీ మీద నిషేధం పోయింది.

నేను, నారాయణరావు, గుంటూరు బాపనయ్యగార్లు కృష్ణాజిల్లా వ్యవసాయరంగం ఫ్రాక్షన్ కమిటీ మెంబర్లం. నేను దానికి సెక్రటరీగా వుంటూ జిల్లా కమిటీలో వుండేవాడిని. స్థానిక కమ్యూనిస్టు యూనిట్స్ సహాయంతో కృష్ణాజిల్లాలోని వ్యవసాయ కూలీలను చైతన్యపరుచుటలో మా ఫ్రాక్షన్ విశేషకృషి చేసింది. కష్టజీవుల పార్టీ కమ్యూనిస్టుపార్టీ అనే నినాదం గ్రామీణ కార్మికవర్గంలో ఆనాటి నుంచి నాటుకుపోయింది.

### జమీందారీ వ్యతిరేక పోరాటంలో ఆత్మబలిదానం:

నేను, నారాయణరావు కూలీపేటలలో రోజులకొలది మకాంపెట్టి, వారి సమస్యలను

పరిష్కరించేవారము. వారి హక్కుల కొరకై పోరాటాలు నడిపాము. వారు పెట్టే పట్టెడు పెసరపప్పు అన్నం ముద్దలను ప్రీతితో ఆరగించి, వారిలో ఒకరిగా మెలిగేవారము. మా బట్టలను మేమే ఉత్తుక్కునేవారము. వారిలో కమ్యూనిస్టు పార్టీ మీద అభిమానంతోపాటు, మా మీద గూడా అభిమానం పెరిగింది. కాని, మా పూర్వాశ్రమ కులం అయిన బ్రాహ్మణ కులం మమ్ములను బహిష్కరించింది. కామ్రేడ్ నారాయణరావు దివి తాలూకా జమీందారీ రైతుల సమస్యలు తీసుకుని పనిచేయ నారంభించారు. కృష్ణలంకలో రైతుల జమీందారీ వ్యతిరేక పోరాటములు నడిపారు. గాజుల లంక పోరాటం, దానిలో నల్గురు వీర మరణం చెందిన సంగతి అందరికీ తెలిసిన సంగతే. ఒకనాడు నిరాయుధుడుగా వున్న నారాయణరావును జమీందారీ తొత్తుల సహాయంతో నాటి ప్రభుత్వం కాల్చి చంపగా, వారు వీరమరణం చెందారు. ఆయనగారితోపాటు గోగినేని తాతయ్య వీరమరణం చెందారు. ఆ తేదీ 12-5-1950.

## పార్టీ అలవర్చిన నిరాడంబర జీవితాలు:

నేను పార్టీ ఆదేశానుసారం గుడివాడ తాలూకా పార్టీ నిర్మాణ కార్యక్రమంలో ప్రవేశించాను. గుడ్లవల్లేరు ఫిర్కా పార్టీ నిర్మాణం, గుడివాడ తాలూకా వ్యవసాయ కూలీరంగం, తాలూకా పార్టీ ఆఫీసు పని చూస్తూ వచ్చాను. ప్రజాశక్తి దినపత్రికకు, పార్టీ ఫండుకు చాలామంది కామ్రేడ్స్ తమవంతు ఆస్తులను అమ్మి విరాళముగా యిచ్చారు. ప్రజాసేవలో పట్టుదలతో నిరంతర కృషి జరుపుటతోబాటు ప్రతి కామ్రేడ్ విలాసాలకు దూరంగా వుండేవారు. తమ బట్టలను తామే ఉతుక్కునేవారు. నేను నా వంతు ఆస్తిని అమ్మి, ప్రజాశక్తి దినపత్రిక స్థాపనకు విరాళంగా యిచ్చాను. నెలసరి రెమ్యునరేషన్ లేకుండా నా ప్రయాణ ఖర్చులకు, నా కుటుంబ ఖర్చులకు నా తల్లి ఆస్తిమీద ఆధారపడి పార్టీ కార్యకలాపములు జరిపాను. పిల్లలు ఎక్కువమంది వుంటే పోషించటం కష్టం గాక, పార్టీకి కూడ బారం. అందుచేత ఒకరిద్దరి సంతానంతో సరిపుచ్చుకుని, పిల్లలు కలుగకుండా ఆపరేషన్ చేయించుకునేవారు. ఆ రోజులలో (స్వాతంత్ర్యం రాకముందు) పార్టీ కామ్రేడ్సే కాదు - చాలామంది మధ్యతరగతి కుటుంబాలవారు ఆ ఆపరేషన్‌లు చేయించుకునేవారు. ఆ ఆపరేషన్ చేసిన డాక్టర్‌కు, చేయించుకున్నవారికి నాటి ప్రభుత్వం శిక్షలు విధించేది. అందుచేత ఆ ఆపరేషన్‌లు రహస్యంగా జరిగేవి. 1944 సంIIలో ఒక ఆడపిల్ల కలిగిన తర్వాత ఆ సంవత్సరంలోనే పిల్లలు కలుగకుండా నేను ఆపరేషన్ చేయించుకున్నాను. ఆ బిడ్డే అమరజీవి నారాయణరావు పెద్దకోడలు. మా తాతగారి ముగ్గురు కుమారులకు నేను ఒక్కడినే మిగిలివున్నాను. నేను ఒక్కడిని గూడా పురుష సంతతి లేకుండా చేసికున్నందుకు ఆనాడు బ్రతికివున్న 98 సంIIల మా తాతగారు చాలా బాధపడ్డారు. నా చిన్న తనములోనే నా తండ్రి గతించినందువల్ల మా తాతగారి అజమాయిషీలో పెరిగి పెద్దవాడనయ్యాను. పెరిగి పెద్దవాడనయిన తర్వాత నా రాజకీయ జీవితం గురించి ముందు జాతీయవాదిగా, తర్వాత ఎలా కమ్యూనిస్టునయ్యానో పైన తెలిపానుగదా!

★ ★ ★

# శ్రీ ముక్తేవి మాధవాచార్య



నేను ఏ అవగాహనతో జాతీయోద్యమంలో పాల్గొన్నానో, ఆ అవగాహన కొనసాగింపే నేను కమ్యూనిస్టుపార్టీలో చేరటానికి దారితీసిందని నా అభిప్రాయం. బ్రిటిష్ పాలనతోపాటు దేశ దారిద్ర్యం కూడా పోతుందని ఆనాటి నా అవగాహన.

నా స్వగ్రామమైన కురుమద్దాలి (కృష్ణాజిల్లా) జాతీయోద్యమంలో చురుకుగా పాల్గొన్న గ్రామాలలో ఒకటి. 10 మంది జైలుశిక్ష అనుభవించారు. మరికొందరు తీవ్ర లాఠీఛార్జీకి గురైనారు.

1921లో బెజవాడలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ కమిటీ సమావేశానికి వచ్చే జాతీయ నాయకులను చూడాలని, వారి ఉపన్యాసాలు వినాలనీ మా గ్రామం నుంచి దాదాపు 15 మందిమి దానికి నడిచివెళ్ళాం. వెళ్ళిన వాళ్ళందరం ఆ జనాన్ని చూసి, నాయకుల ఉపన్యాసాలు విని ఉత్తేజితులమయ్యాం.

ఆ సమావేశం నుంచి గ్రామానికి తిరిగి వచ్చిన తరువాత నా సోదరుడు అనంత పద్మనాభాచార్యులుగారు మా ఇంట్లో ఒక చిన్న గ్రంథాలయాన్ని స్థాపించారు. దానికి కృష్ణా పత్రిక, ఆంధ్ర వారపత్రిక (అప్పుడిది బొంబాయి నుంచి వచ్చేదని గుర్తు), మరికొన్ని మాసపత్రికలు (వీటిలో వీరేశలింగం పంతులుగారు ప్రచురించేవి కూడా వుండేవి) తెప్పించేవారు. గ్రంథాలయంలో గాంధీ, హిందూ-ముస్లిం నాయకుల చిత్రపటాలతో (దాదాపు 20 దాకా) అలంకరించాము. క్రమంగా ఆ గ్రంథాలయం గ్రామ యువతకు అధ్యయన కేంద్రంగా మారింది.

## ఖద్దరు ప్రచారంనుండి కార్యాచరణకు:

ఇదిలా వుండగా మా గ్రామంలోను, చుట్టుపట్ల పామర్రు, ఉరుటూరు, బలిపర్రు మొదలగు గ్రామాలలోను రోజు రోజుకూ ప్రభుత్వ వ్యతిరేక ప్రచారం జోరుగా కొనసాగుతోంది. శ్రీయుతులు చెరుకువాడ నరసింహం పంతులు, కొడాలి ఆంజనేయులు, దుగ్గిరాల బలరామకృష్ణయ్య మొదలగు నాయకులు గ్రామాలలో మీటింగులు పెట్టి, పెద్ద ఎత్తున ప్రభుత్వ వ్యతిరేక ప్రచారం ప్రారంభించారు. ఖద్దరు కట్టాలనీ, విదేశీ వస్త్రాలను కట్టడం, కల్లు గీత – తాగటం మానాలనీ వారు ప్రచారం చేశారు. పర్యవసానంగా కల్లు గీతకు వ్యతిరేకంగా కల్లు గీసే గెలలు నరకటం, కల్లు కుండలు పగులగొట్టడంలాంటి చర్యలతో శాసనోల్లంఘనం మొదలైంది. నా సోదరుడు కేశవాచార్యులుగారు, మరో 5 గురు యువకులు ఈ ఉద్యమంలో పాల్గొని జైలుకు వెళ్ళారు.

బెజవాడ మీటింగు ప్రభావం, ఇంటిలో గ్రంథాలయ ప్రబోధం, నాయకుల ఉపన్యాసాలు, సోదరునికి జైలుశిక్ష – ఇవన్నీ నాలో కార్యాచరణకు పూనుకోవాలన్న ఆకాంక్షను పెంచాయి.

నా కార్యక్రమం మొదట ఖద్దరు ప్రచారం, అమ్మకంతో ప్రారంభించాను. క్రమంగా "విదేశీ వస్తు వస్త్ర బహిష్కారమే లాఠీ దెబ్బకు బదులు దెబ్బ" అనే స్టెన్సిల్‌ను సంపాదించి గ్రామంలో గోడలమీద, పామర్రులో ప్రభుత్వ భవనాల గోడలమీద రహస్యంగా ముద్రించాను. పిమ్మట సైక్లోస్టైల్ యంత్రం ద్వారా ప్రభుత్వ వ్యతిరేక కరపత్రాలను ముద్రించి, పంచటం జరిగింది. అన్నె అంజయ్యగారినుంచి వచ్చిన రహస్య కరపత్రాలు గల కవర్లు పోస్టు చేయటానికి విజయవాడ వెళ్ళి పోస్టు చేస్తుండగా పోలీసులకు పట్టుబడ్డాను. పోలీసులు మా ఇంటిని సోదాచేసి మరికొన్ని రహస్య కరపత్రాలను, వాటిని ముద్రించే యంత్రాన్ని స్వాధీనం చేసుకొని కేసు పెట్టగా, సబ్ మెజిస్ట్రేటు నాకు 14 మాసాల శిక్ష విధించాడు.

ఖద్దరు ప్రచారంతో ప్రారంభమైన నా కార్యాచరణ రహస్య కార్యకలాపాలు జైలుశిక్షతో ముగిశాయి.

రాజమండ్రి సెంట్రల్ జైలు క్వారంటైనులో మొదట పనులు చేయనన్నందుకు కొట్టి, మెయిన్ జైలుకు పంపకుండానే నన్ను బళ్ళారి జైలుకు మార్చారు. ఇక్కడ నాకు మరో ఇద్దరు మిత్రులు – చలసాని జగన్నాథరావు (భట్ల పెనుమర్రు),

ఉద్దరాజు సూరపరాజు (పశ్చిమగోదావరి) కలిశారు. చివరిదాకా మేం ముగ్గురం రాజకీయంగా ఒకే అవగాహనతో వ్యవహరించాం.

## జైలు నిర్బంధాలు, శిక్షలు:

ఆ జైలులోను రాజకీయ ఖైదీలకు మొరటు పనులివ్వరాదని రాజకీయ ఖైదీలు జరిపిన పోరాటం అంతకుముందే వీగిపోయింది. ఆ దశలో మేము ముగ్గురం మొరట పనులు చేయటానికి నిరాకరించాం. అందుకు మమ్మల్ని తీవ్రంగా కొట్టి నిలువు, అడ్డం రెండు బేడీలు వేసి, క్వారంటైనుకు పంపారు. "రాజకీయ ఖైదీలకు మొరటు పను లివ్వరాదనీ, మా బేడీలు తొలగించా"లని మేం ముగ్గురం నిరాహారదీక్ష ప్రారంభించాం. ముక్కుల గుండా ద్రవ పదార్థాలను ఎక్కించేవారు. 4 రోజుల తరువాత జైలు అధికారులు మధ్యవర్తుల ద్వారా మా కోరికలను అంగీకరించినందున మేము దీక్ష విరమించాం. రాజకీయ ఖైదీలందరికీ మొరటు పనులు ఎత్తివేశారు. కాని, మా బేడీలు మాత్రం జైలునుంచి విడుదలయ్యేవరకు తొలగించలేదు.

ఆ సమయంలోనే కామ్రేడ్స్ కంభంపాటి సత్యనారాయణ (సీనియర్), ఎ.కె. గోపాలన్‌గార్లు మద్రాసు జైలునుంచి పనిష్మెంటుగా బళ్ళారి జైలుకు మార్చబడ్డారు. వారిని కూడా బేడీలువేసి క్వారంటైన్‌లోను వుంచారు. వారిని, ముఖ్యంగా సత్యనారాయణగారిని ఇక్కడ వుంచటంవల్ల మా ముగ్గురికి మార్క్సిజం అధ్యయనం చేయటానికి అవకాశం చిక్కింది.

## జైలులో మార్క్సిజం శిక్షణా తరగతులు:

శ్రీ సత్యనారాయణగారు క్వారంటైన్‌లో మా ముగ్గురికి రాజకీయ అధ్యయన తరగతులు నిర్వహించారు. వాటిలో మాకు పెట్టుబడిదారీ విధానం, ఫాసిజం, మార్క్సిజం, వర్గపోరాటం మొదలగు విషయాలను వివరించారు. ఫలితంగా మా ఆలోచనలో మార్పు వచ్చింది. కేవలం బ్రిటిష్ పాలన పోతే ప్రజల దారిద్ర్యం పోదనీ, పెట్టుబడిదారీ విధానానికి వ్యతిరేకంగా పోరాడి సోషలిజాన్ని స్థాపించాలనీ అర్థం చేసుకున్నాం. ఆ అవగాహనతోనే మేం ముగ్గురం జైలునుంచి బైటకు వెళ్ళిన తరువాత కమ్యూనిస్టు పార్టీలో చేరి కార్మికులలో పనిచేయాలని నిర్ణయించుకున్నాం.

నేను జైలు నుంచి విడుదలై స్వగ్రామానికి చేరుకొన్నాను. అప్పుడు హరిజనోద్ధరణ ఉద్యమం జోరుగా సాగుతోంది. హరిజనులు ప్రవేశించిన ఆలయంలో పూజ చేయటానికి అర్చకులు కావలెను అనే ప్రకటనలు పత్రికలో చూశాను. అందుకు సిద్ధపడి నేను భట్ల పెనుమర్రులో ధనుర్మాస పూజలు నిర్వహించాను. అగ్రకులాల వారికీ, హరిజనులకు దైవసన్నిధిని సహపంక్తిని తీర్థ ప్రసాదాలు అందజేశాను.

ఆ తరువాత చలసాని వాసుదేవరావుగారితోను, తరువాత గద్దె లింగయ్యగారితోను పరిచయం చేసుకొని 'అమ్మ', 'కమ్యూనిస్టు ప్రణాళిక' మొదలగు అభ్యుదయ, సోషలిస్టు గ్రంథాలను తీసుకొని, కార్మికులలో పనిచేయాలని తెనాలికి చేరుకున్నాను. జైలుకు వెళ్ళకపూర్వం తెనాలి, చుట్టుపట్ల రెండు, మూడు గ్రామాలలోను నాకుగల

కొద్దిపాటి పరిచయాన్ని పురస్కరించుకొని సామ్యవాద గ్రంథాల ద్వారా సంబంధాలను పెంచుకొంటూ, 1934లో కామ్రేడ్ పోలేపెద్ది నరసింహమూర్తిగారి ద్వారా పార్టీ సభ్యత్వాన్ని స్వీకరించాను.

## నేటికీ అదే అంకితభావంతో...

ఈ 61 సంవత్సరాల పార్టీ జీవితకాలంలో నేను పట్టణ, తాలూకా, జిల్లాల పార్టీ నిర్మాణ బాధ్యతలతోపాటు హైదరాబాద్‌లో నేషనల్ ప్రెస్, ప్రజా ప్రచురణాలయం, తెలంగాణా సాయుధ పోరాటానికి అనుబంధంగా కొన్ని సాంకేతిక బాధ్యతలను నిర్వహించాను.

ఏ అంకిత భావంతో ఆనాడు పార్టీలో చేరానో ఈనాడూ అదే అంకిత భావంతో వుంటూ జీవనయాత్ర సాగిస్తున్నాను.

★ ★ ★

# శ్రీ పెదవల్లి శ్రీరాములు



గుంటూరు జిల్లాలోని పచ్చల తాడిపర్రు మా గ్రామం. (జననం 1919) 4 మైళ్ళు నడచిపోయి నిడుబ్రోలు హైస్కూల్‌లో చదువుకునేవారం. విద్యార్థి సంఘానికి కార్యదర్శిగా వుండేవాడిని. డిటెన్షన్ వ్యతిరేక పోరాటం సాగించి విజయం పొందాం. యస్.యస్.యల్.సి. పరీక్షలు అయిపోయిన తర్వాత వేసవి సెలవుల్లో కమ్యూనిస్టులు ఏర్పాటు చేసిన మంతెనవారిపాలెం రాజకీయ పాఠశాలకు హాజరయ్యాను (1938). అప్పట్లో నామీద ఆచార్య రంగాగారి ప్రభావం వుండేది. ఇడుపులపాడులో జరిగిన రంగా విద్యాలయానికి విద్యార్థిగా హాజరయ్యాను.

చదువుకు రెండేళ్ళ విరామం తర్వాత ఇంటర్ రెండు సంవత్సరాలు బెజవాడ ఎస్.ఆర్.ఆర్. కాలేజీలో చదివాను (1941, 42). శ్రీ యన్. టి. రామారావు సహపాఠిగా వుండేవారు. శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారు మాకు తెలుగు పండిట్. వారి మూలంగానే మాకు తెలుగంటే మంచి అభిమానం ఏర్పడింది.

ఆ రోజుల్లో ఒక రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ మహాసభ జరిగింది. (అది ఎన్నవదో నాకు గుర్తులేదు.) నేను ఆహ్వానసంఘం కార్యదర్శిని, మహాసభకు రు. 1,400/– వసూలు చేయగల్గాం. కామ్రేడ్ తమ్మిన పోతురాజుగారు రాత్రిపూట ముఠాకార్మికులను తీసుకొచ్చి పందిళ్ళు, పాకలు వేయించి, మాకు ఎంతగానో తోడ్పాటు అందించారు.

సోవియట్ యూనియన్ అంటే నాకు మొదటినుండి అభిమానం. భూలోకస్వర్గం అని భావించేవారం. పుట్టినప్పటినుండి – ఆ మాటకు వస్తే పుట్టకముందునుండి మరణించేవరకు ప్రతిఒక్కరి బరువు, బాధ్యతలు తీసుకునే సోషలిజం, మమ్మల్ని సూదంటురాయిలా ఆకర్షించింది. అలాంటి రాజ్యం మనదేశంలో కూడా రావాలని, అందుకు విప్లవ కార్యాచరణకు పూనుకోవాలని కృతనిశ్చయులమయ్యాం.

నేను పార్టీలో చేరినకాలంలో హిట్లర్ ఫాసిస్టు మూకలు రష్యామీద విరుచుకుపడ్డాయి. (1941 జూన్.) రష్యా ప్రపంచ ఆశాజ్యోతి, ఫాసిస్టు ముష్కరులు దానిని ఆర్పివేయకుండా కాపాడుకోటం మనముందున్న బృహత్తర కర్తవ్యంగా భావించాం.

ఏరోజుకారోజు యుద్ధంలో రష్యాలో ఏమి జరుగుతుందాయని పత్రికలు తిరగేసే వారం. ఫాసిస్టు వ్యతిరేక ప్రచారం తారాస్థాయినందుకుంది. వేకువజామున మాగఫోన్ తీసుకొని యుద్ధవార్తలు చెపుతుండేవారం. స్వయంగా బహిరంగ సభలు పెట్టటం వీలుకానప్పుడు వీధి భాగవతుల ప్రదర్శనల సందర్భంగా ముందుగా మా బహిరంగ వుపన్యాసాలు అనర్గళంగా సాగిపోయేవి. అలవాటులేని బ్రాహ్మణుడు సంధ్యావందనం చేసినట్లు నేను కూడా పాటలు పాడాను.

యుద్ధకాలంలో అగ్గిపెట్టెల దగ్గరనుండి అన్నింటికి కొరతే. కిరోసిన్ దొరకక కట్టెలు మండించుకొని అన్నాలు తినేవారు. కనీస అవసరాలు తీరక ప్రజలు నానా యిక్కట్లకు గురయ్యేనారు. దొంగ మార్కెట్టు నుండి సరుకులు బయటకు లాగి క్యూలలో నిలబడినవారికి పంపకం జరిగేలా చూసేవారం. రేయింబవళ్ళు ఒకటేపని. దొంగ మార్కెట్టువాదుల కన్నెర్రకు గురయ్యేవాళ్ళంకూడా.

రష్యా అంటే మాకుండే అభిమానానికి ఒక ఉదాహరణ – స్టాలిన్ చనిపోయినప్పుడు 4 వేల మంది చీరాల ఐయల్‌టిడి వర్కర్సుతో కూడిన సంతాప సభ జరిగింది. బహిరంగంగా నాకు దుఃఖం వచ్చింది. సభలో 10 నిమిషాలు మాట్లాడి యిక మాట్లాడలేక కూర్చోవాల్సి వచ్చింది. ఆ కాలంలో పార్టీలో చేరిన మా తరం వారందరిని "సోవియట్ బిడ్డలు" అనవచ్చునేమో!

## పేదరికం చేసిన సహాయం:

మాది పేదరైతు కుటుంబం. సారంలేని మెట్ట 4, 5 ఎకరాలు వుండేది. నలుగురు అన్నదమ్ములూ, ఒక చెల్లెలు. వితంతువు అయిన ఒక ఉదారవంతురాలు మొదటినుండి నాకు చదువు చెప్పించింది. అదికూడా డబ్బులేక మధ్యలో రెండు సంవత్సరాలు మానివేయాల్సి వచ్చింది. ఇంటర్ పూర్తి కావటంతోనే పార్టీ హోల్‌టైమరుగా మా తాలూకా ఉద్యమ బాధ్యతలు తీసుకున్నాను.

నా పార్టీ జీవితం 54 సంవత్సరాలు (1942–96). తీవ్ర నిర్బంధవిధానం కాలంలో 4 సంవత్సరాలు రహస్యజీవితం గడిపాను. మధ్యలో ఒకసారి అరెస్టు

అయి (నర్సాయపాలెంలో) రైలులో నుండి తప్పించుకున్నాను. చీరాల ఐయల్‌డిటి కంపెనీలో ఒక మహిళా కార్మికురాలిని పనినుండి తొలగించినదానికి నిరసనగా 11 రోజులు నిరాహారదీక్ష చేశాను. దేశవ్యాపితంగా జరిగిన భూఆక్రమణ పోరాటంలో, పెర్లవారిపాలెం ఫారెస్టు బంజరు ఆక్రమణ సందర్భంలో 2 నెలలు జైలుశిక్ష అనుభవించాను.

నా పార్టీ జీవితంలో వివిధ రకాలయిన బాధ్యతలు నిర్వర్తించాను. బాపట్ల తాలూకా పార్టీ కార్యదర్శిగా 14 ఏండ్లు; 5, 6 సంవత్సరాలు నర్సరావుపేట పార్టీ నిర్మాణం, కొద్దికాలం గుంటూరుజిల్లా కార్యదర్శిగా, 7, 8 సంవత్సరాలు చీరాల ఐయల్‌డిటి యూనియన్ కార్యదర్శిగా; 2 దఫాలు ప్రకాశం జిల్లా పార్టీ కార్యదర్శిగా పనిచేశాను (1970–77). ఆరోగ్యం దెబ్బతింది. అల్సర్ అపరేషన్ జరిగింది. ఇస్కాస్, శాంతిసంఘాలలో పనిచేయటం, రాజకీయ పాఠశాలకు హాజరుకావటం చేస్తూవచ్చాను. "లో బిపి" మూలంగా ఆరోగ్యం మరింతగా క్షీణించిన సందర్భంలో చేయగలిగిన పనిగా ఏదైనా వ్రాస్తూవుండటం ప్రస్తుతం జరుగుతుంది.

ఉద్యమ అవసరాల నిమిత్తం పార్టీ ఆదేశానుసారం పిల్లి తన పిల్లలను మార్చినట్లు మా సంసారాన్ని మకాంలు మార్చుకుంటూ వచ్చాం. బాపట్ల, నర్సరావుపేట, చీరాల, ఒంగోలు... చివర మజిలీగా చీరాలలో నిలబడిపోయాను. ప్రసాదనగరం అనే పల్లెలో బంజరులో యిల్లువేసుకొని, యిప్పుడు అందులోనే వుంటున్నాను.

సులువుగా యిన్నిచోట్లకు కాపురాన్ని మార్చటంలో నాకు సహాయపడింది మా పేదరికమే ననుకుంటాను. నాకే గనుక స్థిరచరాస్తులు వుంటే మకాంలు మార్చటం కష్టమయ్యేదేమో! పెట్టుబడులకు నావద్ద డబ్బువుంటే పార్టీ జీవితంలో ఎదురైన గడ్డు పరిస్థితిలో (అలాంటివి పలుమార్లు సంభవించాయి) వ్యాపారాలవైపు మనసు లాగేదేమో!! కొద్దిపాటి పార్టీ అలవెన్సు మీద ఆధారపడివుండటం, ఆర్జనవైపు పోవటం పార్టీపరంగా తప్పని భావించటం వలననే దీర్ఘమైన నా కృషి నిర్విఘ్నంగా సాగిపోయింది. "తక్కువ సామాను ఎక్కువ యాత్రాసుఖం" అనే రైల్వేవారి సూత్రం నా జీవిత ప్రయాణానికికూడా వర్తిస్తుందనుకుంటాను.

## తోటి కామ్రేడుగా నా జీవిత భాగస్వామిని:

నాకు కలసివచ్చిన అదృష్టమల్లా బసవపున్నమ్మ నా జీవిత భాగస్వామిగా దొరకటం. మాది ప్రేమ వివాహం. దొంగచాటుగా లేచిపోయి పెండ్లి చేసుకొనబోతున్నామని తెలిసిన తర్వాత పరిస్థితులు సానుకూలించాయి. మాది 'దండల పెండ్లి'. ఆ రోజుల్లో దండల పెండ్లికి 'కమ్యూనిస్టుల పెండ్లి' అనే మారుపేరు వచ్చింది. అన్నింటికి కలిసివస్తుందని మా పెండ్లిరోజునే బాపట్ల తాలూకా పార్టీ జనరల్ బాడి వేసుకున్నాం.

పెండ్లికి ముందునుండి బసవపున్నమ్మ హయ్యర్‌గ్రేడ్ టీచరు. పెండ్లి అయిన 6, 7 సంవత్సరాలకు మా కుటుంబానికి తీవ్రమైన యిబ్బందులు ఒక్కసారిగా వచ్చిపడ్డాయి. ఒకప్రక్క నానాటా తీవ్రమవుతున్న నిర్బంధ విధానం, ఆమెకు టి.బి. వచ్చినట్లుగా రహస్యంగా వున్న నాకు వర్తమానం రావటం జరిగింది. ఆమె టీచరు ఉద్యోగం అంతకు ముందే పోయింది. 1949లో జరిగిన జిల్లా బోర్డు ఎన్నికలలో ఆమెను మహిళాసీటుకు స్థానికంగా వున్న కామ్రేడ్సు పోటీ చేయించారు.

కమ్యూనిస్టు పార్టీ తరఫున పోటీ చేసినందున సర్టిఫికెట్ రద్దు అయింది. "ఊహించని దెబ్బలు" అని లెనిన్‌గారు చెప్పింది యిలాంటివే కాబోలు.

నేను సంచి పట్టుకొని వూళ్ళమీద తిరుగుతుంటే కుటుంబ భారమంతా ఆమె మీదనే పడేది. లేమిడిలో ఒక పెద్ద కుటుంబాన్ని నడపటం (మాకు ఒక కుమార్తె, ముగ్గురు కొడుకులు) మహా కష్టం. పార్టీ యిచ్చే అలవెన్సు మీదనే ఆధారపడి వుండటంవలన నిత్యం వెతుకులాట పనిగా వుండేది. అయినా "ఇంట్లో విత్తులు లేవు, యిద్దరికి మాటలు లేవు" అనే పరిస్థితి మాకు ఏనాడూ ఏర్పడలేదు.

ఒకప్రక్క కుటుంబం చూచుకుంటూనే రెండవప్రక్క ప్రజావుద్యమాలలోను ఆమె చురుకైన భాగస్వామి. యువకత్వం వున్న దశలో వైజ్ఞానిక కార్యక్రమాలలో చురుకుగా పాల్గొంది. మొదటినుండి మహిళా సంఘాల కార్యక్రమాలలో పాల్గొంటూ వచ్చింది. ఆమధ్యవరకు ప్రకాశం జిల్లా మహిళా సమాఖ్య అధ్యక్షురాలుగా వుంది. మా జిల్లా సభలోను, రాష్ట్ర మహిళాసభలోను (ఖమ్మం) ఒక సీనియర్ మహిళా కార్యకర్తగా సన్మానించబడింది. ఏదో సమయంలో మా జంట సన్మానించబడింది. అదే మాకు తృప్తి, సంతోషమున్నూ.

## ముఖ్యమైన బలహీనత:

అర్ధశతాబ్దం పైగానున్న నా పార్టీ జీవితం మొత్తంగా పార్టీ యిచ్చిన బాధ్యతలను శక్తికొలది నిరంతరాయంగా బాగానే చేస్తూ వచ్చాను. అయితే, సంచి భుజాన వేసుకొని వూళ్ళు తిరగటం తప్ప, ఆలోచించింది చాలా తక్కువ. పార్టీ పాలసీని తెలుసుకొనటం, క్రింది వరకు దానిని వివరించటం తప్ప, దాన్నిగురించి నావరకు నేను తర్కించుకొన్నది, Convience కావటానికి ప్రయత్నించింది చాలా తక్కువ అని చెప్పాలి. పార్టీ పాలసీని అమలు జరపటంలో ఆచరణలో వస్తున్న అనుభవాలను పరిశీలించటంగాని, నూతన పరిస్థితులను అర్థం చేసుకుంటూ విశ్లేషణ చేయటంగాని, సృజనాత్మకంగా ఆలోచించటంగాని చేయలేదు.

ఒక నూతన వ్యవస్థ కొరకు పోరాడే పార్టీకి సరియైన పాలసీలు, విధానాలు కీలకమైనవి. గోడకట్టేముందు బేలుదారు మేస్త్రీ లెక్కతాడు సరిచూచి కడతాడు. దాన్ని అనుసరించి రాళ్ళు పేర్చుకుంటూ పోతారు. తాడులోనే వంకరవుంటే గోడలో వంకరవచ్చి కూలిపోతుంది. మన పార్టీ చరిత్రను పరిశీలిస్తే తప్పుడు పాలసీలవల్ల మనం ఎంతగానో నష్టపడ్డాం. పాలసీలను నిర్ణయించటం నాయకుల పనిగా, పనిచేయటం మనవంతుగా భావించాం.

మన నాయకులు సమర్థులే. కాని విశాలమైన మనదేశం, అందులోని క్లిష్టమైన సమస్యలు వారి శక్తి, యుక్తులకు మించినవిగా వున్నాయని అనుభవం చెప్పుతుంది. బూర్జువా పార్టీ నాయకులు మనకన్నా మెరుగు అనిపించారు. వాస్తవ పరిస్థితులకు దగ్గరగావుండే క్రిందివారి అనుభవం, పైవారి మేధాసంపత్తి కలిసినప్పుడే తక్కువ పొరపాట్లు జరగటానికి వీలవుతుంది. ఒకవేళ జరిగినా, త్వరలో సరిచేసుకుంటానికి వీలు అవుతుంది. ఉక్కు శిక్షణ అనేది ఏమంత మంచి మాటకాదు. చైతన్యయుతమైన శిక్షణ కావాలి. "ప్రతిదానిని సందేహించు" అని మార్క్సు ఊరకనే చెప్పలేదు.

అయితే, పార్టీ నాయకత్వం అవగాహనకు భిన్నంగా మాట్లాడటంలో నిర్మాణ పరంగాను, ఇతరత్రాను కొన్ని చిక్కులను ఎదుర్కోవాల్సి వుంటుందని అనుభవం చెపుతుంది. అందుకని ఇందుకొరకు ధైర్యసాహసాలు కూడా అవసరమవుతాయి.

జస్టిస్ చిన్నపరెడ్డిగారు చెప్పినట్లు – మార్క్సుతోనే చరిత్ర ఆగిపోలేదు. ఆ తర్వాత ఎన్నో పరిణామాలు, మరెన్నో అనుభవాలు... మనదేశంలో దళితుల్లో, మహిళల్లో చైతన్యం పెల్లుబుకుతూంది. దానిని గురించి సృజనాత్మకంగా ఆలోచించాలి. సరియైన విశ్లేషణ చేయాలి. తప్పులు చేసినా పరవాలేదుకాని, ఆలోచించటం మానరాదు.

"శరీరానికి వ్యాయామం ఎలాంటిదో మనసుకు ఆలోచన అలాంటిది" అని ఒక మేధావి చెప్పారు. శరీర ఆరోగ్యానికి నేను ఆసనాలు, అపక్వాహారం చేశానుగాని మనస్సుకు చేసింది తక్కువ. నిజంగా దీనినొక పెద్ద బలహీనతగా భావిస్తున్నాను. త్యాగపూరితమైన ఆచరణ ఎంత ముఖ్యమో, సృజనాత్మకమైన ఆలోచన కూడా అంతే ముఖ్యం. కమ్యూనిస్టు పనిచేస్తేనే చాలదు. ఎలా పనిచేయాలో అలానే చేయాలి.

★ ★ ★

# శ్రీ వి. అనంతరామయ్య



నేను 1922 అక్టోబరు 6 వ తేదీన నెల్లూరు జిల్లా కావలి తాలూకా ఆదిమూర్తిపురం అగ్రహారంలో శ్రీ వేములపాటి సుబ్బరాయుడు, శ్రీమతి లక్ష్మీనరసమ్మగారలకు జన్మించాను. బాగా భూస్థితి కలిగి, "బ్రాహ్మణ జమీందారు" అని కష్టపడి పేరు తెచ్చుకొన్న కుటుంబం.

మా తాత శ్రీ వేములపాటి నారాయణప్ప శాస్త్రులుగారు వేదాధ్యయనపరులు. తాటి ఆకుమీద గంటంతో వ్రాయనేర్చినవారు. గోపీనాథ రామాయణం రచించిన గోపీనాథుని వెంకటకవి గారి ఇద్దరు భార్యలు మా వేములపాటివారి ఆడపడుచులు.

నా తల్లి 1935 అక్టోబర్ 2 వ తేదీ గర్భవతిగా నెల్లూర్లో చనిపోయింది. వారికి మేము నలుగురు కొడుకులు; ముగ్గురు కుమార్తెలు వుండినారు. ఇప్పుడు నేను ఒక్కడినే ఆ సంతతిలో మిగిలివున్నాను.

నా తల్లి చనిపోయిన కొద్దిమాసాలకే నా తండ్రి రెండవ పెండ్లి చేసుకొన్నారు. నా పినతల్లి లక్ష్మమ్మ. ఆమె బ్రతికి వున్నది. నా తండ్రి చనిపోయినాడు. ఈ సంబంధానికి 11 మంది. 7 మంది కొడుకులు, నలుగురు కుమార్తెలు. అందరు బాగున్నారు. మేమంతా కలిసిమెలిసి ఒక తల్లి బిడ్డల మాదిరే వుంటున్నాము.

నా తల్లికి తెలుగు చదువవచ్చు. నీతిచంద్రిక, బాలరామాయణం, సుమతి, వేమన శతకాలు, గో–వ్యాఘ్ర సంవాదం పద్యాలు కంఠస్తం. ముఖ్యంగా మా తల్లికి గో–వ్యాఘ్రసంవాదం పద్యాలు చాలా ఇష్టం. తీరినప్పుడు మమ్ములనందరినీ చేర్చి అందులోని పద్యాలు వర్ణించేది. బాగా అర్థమయ్యేటట్లు వివరించేది. పులికి, బిడ్డకు పాలిచ్చి తిరిగి వస్తాను అని ఒక గోవు వాగ్దానం చేసి, గ్రామానికి వచ్చి దూడను నాకుతూ, ఆ బిడ్డ (దూడ)కు మంచి ప్రవర్తనను గురించి బోధిస్తున్న సన్నివేశం వర్ణించేటప్పుడే, నా తల్లి స్వరం గద్గదమయ్యేది. కంటిలో నీరు వచ్చేది. మేమంతా ఏడ్చేవారం. అందులో నేను మరీ ఎక్కిఎక్కి ఏడ్చేవాడిని. (మా తల్లి వివాహ జీవితంలో ఏమీ సుఖపడలేదు. 12 వ ఏట పెండ్లి అయింది. కనడం, పెంచడం, జామీన్‌దారుగారింటికి వచ్చే పోయే అధికారులకు, రాజకీయ నాయకులకు వండిపెట్టడం, అంతే! అందువల్లనే, ఆ గోవు బిడ్డ (దూడ) మీద చూపే ఆపేక్ష మమ్ములను చూస్తూ, మా భవిష్యత్తు ఎట్లుంటుందో! తన మాదిరే ఆనందం, సుఖంలేని సంసార బానిస జీవితమో, లేక వేరుగా వుంటుందో అనే తను అనుభవించిన బాధ ఆ పద్యాలు వర్ణించేటప్పుడు, ఆమె స్వరంలో ప్రతిబింబించేది. 35 వ ఏట మరో గర్భంతో "గుఱ్ఱపువాయువు"తో నెల్లూరు ఎ.బి.ఎం. ఆసుపత్రిలో తుదిశ్వాస విడిచింది. గోర్కీగారి "అమ్మ" నవల చదివినప్పుడు నా తల్లి "గో–వ్యాఘ్ర సంవాదం" జ్ఞాపకం వచ్చేది. అందుకే 'అమ్మ' అనే నవలను చాలాసార్లు విద్యార్థిగా చదివాను. కమ్యూనిస్టు మానవత్వం అంటే అదే అని స్థూలంగా నా అభిప్రాయంగా ఉండేది. ఇప్పటికీ అంతే!

## కష్టాలతో గడచిన బాల్యం:

నా తల్లి చనిపోయిన సంవత్సరం 1935. నా తండ్రి నన్ను స్కూలుకు పంపడం నిలిపేశాడు. మిట్టపాళం ఎలోధారా చెంచురామయ్య గారి దగ్గర సర్వే నేర్చుకొనుచున్నాను. ఆ రోజుల్లో నేను, నా అన్న, నా తమ్ముళ్ళు సత్యం, పట్టాభి చాలా కష్టాలు పడ్డాం.

ఒకరోజు నా మేనత్త కనకమ్మ భర్త గారైన డాక్టరు అనుమల లక్ష్మీనరసయ్య ఎల్.ఎం.పి. మా వూరు వచ్చారు. నా పరిస్థితి పశువుల కాపరి మాదిరి వుండింది. నన్ను ప్రొద్దుటూరు (కడపజిల్లా) తీసుకొనిపోయి, హైస్కూల్లో చేర్చారు. ఆయనకు సంతానం లేదు. వందలమంది విద్యార్థులకు ఆర్థిక సహాయం చేశారు. ప్రత్యేకంగా "వాసు బ్రదర్స్" అనే బహు కుటుంబీకులకు బాగా సహాయపడ్డారు. ఆ కుటుంబంలో సుమారు 100 మంది సభ్యులు వుండేవారు. అది ఒక పెద్ద కమ్యూనుగ వుండింది. కామన్ వంట, భోజనం, ఒకే విలువ గల వస్త్రాలు – అన్నీ సమానమే. మా మామ వాండ్లను చూపిస్తూ, నిజంగా కమ్యూనిజం వస్తే ఈ

విధంగా కలిసి, మెలిసి సమానంగా వుండాలి అని చెప్పేవారు. వాసు బ్రదర్స్ మా మామను ఈనాటికీ దేవునిగా చూస్తారు.

మా మామ ప్రతి శనివారం సుమారు 100 మందికి వారం భోజనాలు పెట్టేవారు. తను కూడా వడ్డించేవారు. నన్నేగాక మరికొంతమందిని పెద్ద చదువులు చదివించారు. డాక్టరు మామగారింటికి అన్ని పార్టీలవారు, సిద్ధాంతాల వారు, మతాలవారు, మేధావులు రాత్రి భోజనాల తర్వాత చేరేవారు. మా మామగారింట్లో వక్కపొడి చాలా ప్రశంసలను పొందింది. గుండు వక్కల పొడిని నేతిలో వేయించి దానిలో కొబ్బెర తురుము, గసాలు, పచ్చ కుంకుమ, మంచి కర్పూరం, లవంగాలు, ఏలకులు, చారపప్పు వేసేవారు. చెన్నూరు తమలపాకులు సేవిస్తూ రాత్రి ప్రొద్దు పోయేటంతవరకూ రాజకీయాలు చర్చించేవారు. మామూలుగా వారిలో ఎక్కువమంది బ్రిటిషు సామ్రాజ్య వ్యతిరేకులు, నాజీ హిట్లరు సానుభూతిపరులు. బ్రిటిషు వారిని మనం కొట్టలేకపోయినా, మన శత్రువును, హిట్లరు తుక్కుతుక్కుగా కొడ్తున్నాడని సంతోషించేవారు. 1939 ఆ ప్రాంతంలో కొత్తగా H.M.V. వారు ఒక చిన్న రేడియోను ప్రవేశపెట్టారు. మా మామగారు ఒకటి కొన్నారు. బెర్లిన్ నుండి రాత్రి 9 గంటలకు వచ్చే ఇంగ్లీషు బ్రాడ్‌కాస్టును తప్పక వినేవారు. Lord How ఇంగ్లీషులో "Britan always stood for war; Germany stood for peace, Victory is OURS" అని తన రేడియో వార్తా ప్రసారం ముగించేవారు. మా ఇంటికి వచ్చిన వారందరికి మహా సంతోషంగా వుండేది. ఆ రేడియో రహస్యంగా వినేవారు.

మా మామ శ్రీ అరవింద భక్తులు. తప్పనిసరిగా ప్రతి సంవత్సరం నాలుగుసార్లు అరవింద ఆశ్రమం, పాండిచ్చేరి పోయివచ్చేవారు. నన్ను కూడా అప్పుడప్పుడు అరవిందాశ్రమానికి పిలుచుకుని పోయేవారు. శ్రీ అరవిందులు, మాత దర్శనం చేసివచ్చేవారు. మా మామ మెడిటేషన్‌కుపోతే నేను లైబ్రరీలోని పుస్తకాలన్ని తిరగవేసేవాడిని. అరవిందుల కవితలు అర్థం చేసుకోవడం నాకు కష్టంగా వుండింది. అరవిందులకంటే విప్లవకారులు ఎక్కువమంది లేరు; అరవిందులు చూపే Life Divine మార్గమే శరణ్యం అని మామగారు నాకు బోధించేవారు.

పొద్దుటూరులో రంగారావు నిప్పాణి అనేవారు రంగూన్, జావా, బాలి, సుమత్రా దీవులు పర్యటించారు. వారు త్రివేణి పత్రికలో వాటిని గురించి వ్యాసాలు వ్రాసేవారు. (ఆయన మన సినిమాతార జమునకు ఏదో దగ్గర బంధువు అని అంటారు.)

## రవీంద్రుని గ్రంథాలు; స్వతంత్ర భారత్ స్ఫూర్తి:

నిప్పాణి కొందరు యువకులను ఆకర్షించారు. అందులో నేనొకడిని. ప్రొద్దుపోయిన తర్వాత మునిసిపల్ హైస్కూలు గ్రౌండ్స్‌లో మాకు నీతి చంద్రిక కథలు చెప్పారు. తర్వాత రవీంద్రనాథ్ ఠాగూర్ కథలు చెప్పారు. అందులో ముఖ్యంగా "బలిదానం" (Sacrifice) 2, 3 పర్యాయాలు చెప్పారు. నేను అప్పటినుండి కమ్యూనిస్టు పార్టీ రహస్యపత్రిక "స్వతంత్ర భారత్", కమ్యూనిస్టు మేనిఫెస్టో వగైరా సిద్ధాంత గ్రంథాలు

చదవసాగాను. ఇది 1939–40 ప్రాంతంలో. ఈ "బలిదానం" వల్ల నేను శాంతి ఉద్యమంలో చురుకుగా పాల్గొంటున్నాను.

నేను 1936–39 వరకు కావలి జిల్లా బోర్డు హైస్కూల్లో చదివాను. ఆ రోజుల్లో "మద్రాసు కుట్రకేసు" వార్తలు Free Press Journal (Editor=Sampoornanand అనుకొంటా) బాగా వచ్చేవి. ఓ.ఎ. ప్యాసయి, గుమాస్తా ఉద్యోగాలు చేస్తున్న యువకులు వాటిని చదివి మాకు చెప్పేవారు. అందులో కామ్రేడ్ పి. రామమూర్తి, పోలీస్ సర్కిల్ ఇన్‌స్పెక్టర్‌ను (అరుణగిరి మొదలియార్ అని జ్ఞాపకం) Cross Examination చేయడం చాలా ఆకర్షణీయంగా వుండేది. అందులో మోహన్‌కుమార మంగళం, పి. ఎన్. సుబ్రహ్మణ్యం, పి. రామమూర్తి, ఉమానాథ్ వగైరాలు ముద్దాయిలు. ఉమానాథ్ అందరికంటే చిన్నవాడు.

నేను కావలిలో వుండగానే కామ్రేడ్ బాట్లివాలా వచ్చాడు. చాలా అందగాడు. మంచి వర్చస్సు. ఖద్దరు గళ్ళ రెండు జేబుల అరచొక్కా, నీలం నిక్కరు, ఖద్దరు సంచి వుండేవి. మేము రైల్వే స్టేషన్‌కు పోయి ఆయన్ను గుర్తుపట్టలేకపోయినాం. ప్రయాణీకులందరూ పోయిన తర్వాత ఆయన ఒక్కడే దిక్కులు చూస్తుంటే మేము జంకుతూ "బాట్లివాలా?" అన్నాం. మరి అతను ఆయనే!



## నెల్లూరుజిల్లా కమ్యూనిస్టుపార్టీ కమిటి-1947

నిలుచున్న వారు:- మూడవ వరుస(ఎడమ నుంచి కుడికి) 1. రేవూరు భరద్వాజ, 2.అల్లూరి రంగయ్య, రెండవ వరుస(ఎడమ నుంచి కుడికి) 1. విద్యాగిరి శేషాచార్యులు, 2. పూరపాటి గురువ్నాథం, 3. గంగ రమణయ్య, 4. ఎ. కాలప్ప, 5. మహమ్మద్ ఇస్మాయిల్, 6. గంగ పెరకొండయ్య, 7. వేములపాటి అనంత రామయ్య, 8. నెల్లూరు కుమారస్వామి, 9. గుజ్జుల యల్లమందారెడ్డి, 10. మేక అంకయ్య, 11. గుణుపాటి రామచంద్రయ్య, 12. జి.ఎ. పద్మనాభయ్య. కుర్చీలో కూర్చున్నవారు :- (ఎడమ నుంచి కుడికి) 1. పి.పి. సుబ్బయ్య, 2. జి.పి. కొండయ్య, 3. మాకినేని బసవపున్నయ్య, 4. బసవరెడ్డి శంకరయ్య, 5. యం. శంకరయ్య. నేలమీద కూర్చున్నవారు: 1. ఐ. రాఘవయ్య, 2. జొన్న కోటయ్య, 3. ఏలూరు దశరథరామిరెడ్డి, 4. ముత్యాల చిదంబరం, 5. బత్తిపాటి వెంకటసుబ్బారెడ్డి.

బహిరంగ సభకు అల్లూరి రంగయ్య అనువాదకులు. బస్సారెడ్డి శంకరయ్య అధ్యక్షులు. బాట్లివాలా రష్యాను గురించి, సోషలిజాన్ని గురించి మాట్లాడారు. 'ఇంక్విలాబ్ జిందాబాద్! విప్లవం వర్ధిల్లాలి' అనే నినాదాలు బాట్లివాలా ఇస్తే మా కుర్రకారంతా గొంతులు పగిలేటట్లు అరచాం. ఆ రోజుల్లో ఎం.ఎన్. రాయ్ కావలికి వచ్చారు. వెన్నెలకంటి రాఘవయ్య ఆయన ఉపన్యాసాన్ని అనువదించాడు.

1937 ఎన్నికల్లో మేమంతా బొమ్మా శేషురెడ్డి నాయకత్వాన, జస్టిస్ పార్టీ అభ్యర్థి బెజవాడ రామచంద్రారెడ్డికి వ్యతిరేకంగా కాంగ్రెస్ అభ్యర్థి బెజవాడ గోపాలరెడ్డిని బలపరుస్తూ గ్రామ గ్రామాలు తిరిగి ప్రచారం చేశాం. "ఎర్రపెట్టెొద్దకూ ఎళ్ళొద్దుబాబు; పచ్చపెట్టెలో ఓటు వేయండి బాబు" అని. గోపాలరెడ్డిగారు మంచి మెజారిటీతో గెలిచారు. తర్వాత నేను 1940–42లో నెల్లూరు వి. ఆర్. కాలేజీలో ఇంటరు చదివాను. ఎ.ఐ.ఎస్.ఎఫ్.లో చేరాను. డిటెన్షను పద్ధతికి వ్యతిరేకంగా సమ్మెలు చేశాం.

## వయోజన విద్యాకార్యక్రమం:

నెల్లూర్లో వయోజన విద్యా కార్యక్రమాల్లో పాల్గొన్నాను. కోటమిట్టలో మున్సిపల్ కార్మికులకు ఒక గంట విద్య చెప్పి, తర్వాత రాజకీయాలు చెప్పేవాడిని. జనం వినడానికి ఎక్కువగా రావడం ఆరంభించారు. సి.ఐ.డి. వారు కూడా వారి ఏజెంట్లను పంపసాగారు.

మన రాష్ట్ర గవర్నర్ సర్ ఆర్థర్ హోప్ వార్ ఫండు వసూళ్ళకు నెల్లూరు వస్తే Hope, No Hope - Go Back అనే పోస్టర్లు, జాన్‌బుల్ పోస్టర్లు పార్టీ రహస్యంగా సప్లయి చేస్తే, సినిమా పోస్టర్లు అంటించే వారి మాదిరి వేషంతో Hope పోయే రోడ్డంతా కరిపించాం. అధికార్లు విస్తుపోయారు. ప్రజలు ఆసక్తిగా వాటిని చూచారు. మాపై పోలీసు నిఘా హెచ్చింది.

అదే రోజుల్లో గుంటూరులో జరిగిన ఆంధ్రప్రదేశ్ విద్యార్థి మహాసభకు హాజరయ్యాను. జ్యోతిబసు ప్రారంభించారు. ఆమంచర్ల గంగాధరరావును ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకున్నారు. అంతకు మునుపు నేను నెల్లూరులో ఎ.ఐ.ఎస్.ఎఫ్. ఆఫీసు ఇన్‌ఛార్జిగా వుండినాను. అంటే, ఆఫీసు నా రూమే. గంగాధరరావు అండర్ గ్రౌండ్‌కి పోయాడు. నేను వారికి ఉత్తరాలు, పండ్లు, సిగరెట్లు అందించేవాడిని. నాకు ఉబ్బసం ఉండింది. గంగాధరరావుకు సైకిల్ త్రొక్కను చేతకాదు. ఆయన్ను గూడూరు శ్మశానంలో సైకిల్ ఎక్కించుకొని పడమటిపాళెం వరకు 14 మైళ్ళు సైకిల్ త్రొక్కాను. కొంతకాలం తర్వాత గంగాధరరావు జి. కుప్పుస్వామిచే అరెస్టు చేయబడి, తర్వాత విడుదల అయినాడు.

1941 జూన్‌లో నాజీ హిట్లర్ జర్మనీ సోషలిస్టు సోవియట్ యూనియన్ మీద దాడి చేసింది. జర్మనీ, ఇటలీ– జపాన్ ఆక్సిస్ పవర్స్ అయ్యారు. జపాన్ బర్మాను ఆక్రమించుకుంది. ఇండియా మీదికి జపాన్ దాడి చేయవచ్చుననే వదంతులు వుండినవి. అప్పుడు పార్టీ మమ్ములను తీరప్రాంతాలకు పోయి జపాన్ వ్యతిరేక ప్రచారం చేయమనింది. సైకిళ్ళ మీద పోయి పార్లపల్లె, విడవలూరు, దంపూరు, అలగానిపాడు, ఊటుకూరు గ్రామాల్లో మీటింగులు పెట్టాం.

## విద్యార్థి వేదికపై ప్రజాయుద్ధ నినాదం:

1942 మార్చిలో ఇంటర్ పాస్ అయ్యాను. అప్పుడు వి. ఆర్. కాలేజీలో బి.ఎ. లేదు. మద్రాసు (తాంబరంలోని) క్రిస్టియన్ కాలేజీలో చేరాను. వెంటనే పార్టీతో సంబంధాలు ఏర్పడ్డాయి. 1941లో సోవియట్‌పై హిట్లర్ దాడి తదనంతరం మనసారా సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటం నుండి ప్రజాయుద్ధ విధానం అవలంబించాం. విద్యార్థులు మమ్మల్ని హేళన చేసేవారు. "మాస్కోలో ఎండకాస్తే, ఇక్కడ గొడుగు పడ్తారు" అనేవారు. నేను సెయింట్ థామస్ హాల్లో 44 నెంబరు రూములో వుండేవాడిని. నాకు మీసాలు వుండేవి. నాకు మారుపేర్లు పెట్టి హాల్ బులిటన్‌లో వేసేశారు. (comrade 44) లేదా అనంతరాంస్కీ (Anantharamski) అనేవారు. రాజారావు, ఎం. బి. శీనివాసన్, కె. ఆర్. గణేష్, ప్రఖ్యాత సైంటిస్టు డాక్టర్ సి.వి. రామన్ కొడుకు చంద్రశేఖర్, పార్వతి కృష్ణన్ వగైరాలు ఆనాటి ఎం.ఎస్.ఓ. కార్యకర్తలే. ఎం.ఎస్.ఓ. మద్రాసు విద్యార్థి లోకంలో, మద్రాసు ప్రెసిడెన్సీ సంయుక్త పార్టీలో గణనీయమైన పాత్ర నిర్వహించింది. ఈనాటికి సి.పి.ఐ., సి.పి.ఐ. (ఎం)లో నాయకత్వ స్థానాల్లో కొందరున్నారు. ఎక్కువమంది నా మాదిరే పార్టీలో లేకున్నా కమ్యూనిజాన్ని విడనాడలేదు. వేరే బూర్జువా పార్టీలో చేరలేదు. ప్రజాయుద్ధ నినాదాన్ని విద్యార్థుల్లోకి తీసుకువెళ్ళడం చాలా కష్టసాధ్యంగా వుండేది. అనేక ఘర్షణలు జరుగుతూ వచ్చాయి.

నేను మా కాలేజీ పార్టీ సెక్రటరీ అయ్యాను. కామ్రేడ్స్ బాల దండాయుధం, పరమేశ్వరన్ అప్పుడప్పుడు వచ్చి నా రూములో వుంటూ "సెల్" మీటింగులకు హాజరయ్యేవారు.

ఈ ఎం.ఎస్.వో. కార్యకలాపాల్లో విద్యార్థి కామ్రేడ్స్‌కు పార్టీ పోటీ పెట్టింది. ఒక నెల దినచర్య వ్రాయమనింది. బాగా పనిచేసిన కామ్రేడ్స్‌ను గౌరవిస్తామన్నారు. చాలామంది పోటీ పడ్డాం. ఆంధ్ర, తమిళనాడు, కేరళ పార్టీ నాయకులు అన్నీ పరిశీలించి నన్ను, కామ్రేడ్ విజయన్‌ను ఉత్తమ విద్యార్థి కార్యకర్తలుగా ఎంపిక చేశారు. మా పేర్లు Board of Honour మీద వ్రాసి, పార్టీ ఆఫీసులో కొంతకాలం వుంచారు. 21-1-1943 న లెనిన్ వర్ధంతినాడు బ్రాడ్వేలోని పార్టీ ఆఫీసులో పార్టీ జనరల్ బాడీ మీటింగులో మమ్మల్ని అభినందించారు. కామ్రేడ్ సుబ్రహ్మణ్య శర్మ (Kerala) మాకు లెనిన్ జీవిత సంగ్రహం అనే పుస్తకాన్ని బహూకరించారు.

## ఆనాటి పార్టీ సభ్యులలో కొందరు:

క్రిస్టియన్ కాలేజీ పార్టీ సెల్‌లో 1. పి. రామచంద్రన్ (మారుపేరు ఛోటా). ఇప్పుడు సి.పి.ఐ. (ఎం) పొలిట్ బ్యూరో సభ్యుడు; 2. ఏనుగ శ్రీనివాసులరెడ్డి (ఇ.ఎస్.రెడ్డి) యు.ఎన్.ఓ.లో అండర్ సెక్రటరీగా రిటైర్ అయి, అమెరికాలో స్థిరవాసి అయ్యారు. 3. కె. సి. జమాల్‌మణి (టి. టి. కె. తంగమణి దగ్గర బంధువు), 4. ఎం. కె. వేలప్పన్ (కేరళ), 5. పి. సి. రాబర్టు (అతను ఎక్కడ వుండేది తెలియదు), మరిద్దరు గట్టి సానుభూతిపరులుగా వుండేవారు. అందులో ఒకరు ఐ.ఎ.ఎస్. పాస్ అయ్యి, చీఫ్ సెక్రటరీగా ఒక రాష్ట్రంలో పనిచేసి రిటైరు

అయ్యారు. మరొకరు సి. బి. మోటయ్య (C.B. Motaiya) బెంగుళూరులో ప్రఖ్యాత న్యాయవాది మొ॥ ఉండేవారు.

## మాపై శిక్షాచర్యలు:

మా పార్టీ కార్యకలాపాల ఫలితంగా నాకూ, ఛోటా రామచంద్రన్‌కు టి.సి.లు యిచ్చి ఇండ్లకు పంపారు. కాలేజినుండి బర్తరఫ్ చేశారు. ఎంత ప్రయత్నించినా మరల చేర్చుకోలేదు. (నాకు పరీక్షల్లో మంచి మార్కులు వచ్చాయి. మా ప్రిన్సిపాల్ బాయిడ్‌గారు నన్ను పొగుడుతూ ఉత్తరం వ్రాశారు. ఇంకే కాలేజీలోనయినా చేరు అని సలహా యిచ్చారు. బ్రిటిష్ నీతి!)

సరే, మా మామ చాలా ఉదారం, సహనం, ఓర్పుగల వ్యక్తి. ఇంటర్ ప్యాసయి వుంటే చాలు – పూనా లా కాలేజీలో చేరమని పూనా పంపారు. నేను కాలేజీలో చేరిన రెండవ రోజే పూనా కామ్రేడ్స్ నన్ను కలుసుకొన్నారు. వారికి మోహన్ కుమారమంగళం చెప్పారట. నన్ను గణేష్ వాడలోని విద్యార్థి కమ్యూన్‌కు తీసుకొనిపోయినారు. ఆ కమ్యూన్‌లోనే కామ్రేడ్ అజయకుమార్ ఘోష్ తన ఆరోగ్యాన్ని కోలుకొంటూ కొద్దిరోజులు గడిపారు. ఆ కమ్యూన్‌లో నేను, పర్లాకిమీడికి చెందిన ఆర్. బి. నరసింహం, కేరళ రామన్ నంబూద్రిపాద్, ఒ. వి. కురువెళ్ళ, బెంగుళూరుకు చెందిన నగేష్, బొంబాయి అతను అజీజ్ పతిని, అలోని చెల్లెలు, మరికొందరు విద్యార్థులం వుండేవారం. వారికి మా కమ్యూన్‌లో ఉచిత భోజనం లభించేది. సుశీలా గోఖలే, కమలా ఘూర్పురే కమ్యూన్‌కు ప్రతి నిత్యం వచ్చి మా కార్యకలాపాల్లో పాల్గొనేవారు. సుశీల తర్వాత రజనీపటేల్ భార్య అయ్యింది. నన్ను విద్యార్థి కమ్యూన్ సెక్రటరీగా ఎన్నుకొన్నారు. వంటమాత్రం ఒకతను చేసిపెట్టి పోయేవాడు. తతిమా వడ్డనలు, క్లీనింగ్ వగైరా పనులన్నీ డ్యూటీల ప్రకారం మేమే చేసేవారం.

## పూనాలో విద్యార్థిసంఘ కార్యకలాపాలు:

వారానికి ఒకరోజు మామూలుగా ఆదివారాలు ప్రఖ్యాత నాయకులను పిలిచి, కరెంటు టాపిక్స్ మీద ఉపన్యాసాలు వినేవారం. కామ్రేడ్స్ బి. టి. రణదివే, ఎస్. వి. కొల్హాట్‌కర్, ఎస్. వి. పరులేకర్, వారి సతీమణి గోదావరి పరులేకర్, ఎస్. ఎ. డాంగే, ఎన్. వి. గాడ్గిల్, పరంజపే, కొసాంబి వగైరాలు ఉపన్యాసకులుగా వచ్చారు. సి. రాజగోపాలాచారిగారు మాట్లాడటానికి పూనావస్తే – ఆర్.ఎస్.ఎస్. వారు ఆయన మీటింగు పెట్టకుండా అడ్డుపెడితే, మేము విద్యార్థి కమ్యూన్ వారము వారి సభను గుజరాతీ విద్యార్థి మండల్‌లో ఏర్పాటుచేసి, అడ్డంకులు లేకుండా జరిగేందుకు సహాయపడ్డాము. ఆర్. ఎస్. ఎస్. వారికి చాలా బలమైన కేంద్రం ఐనా వారి బలాన్ని చూసి భయపడలేదు. వారే కమ్యూన్‌వారి జోలికి పోవద్దు అని అనేవారు.

మోహన్‌కుమార మంగళం నన్ను చూడటానికి రెండుసార్లు పూనా కమ్యూన్‌కు వచ్చారు. తన తమ్మునిగ నన్ను ప్రేమించేవారు. అది కమ్యూనిస్టు ఆప్యాయత.

నేను ఆ కాలంలో రెండు పర్యాయాలు బొంబాయిలోని పార్టీ హెడ్ క్వార్టర్సుకు పోయాను. కామ్రేడ్ మోహన్ కుమార మంగళం నన్ను కామ్రేడ్ జోషికి పరిచయం చేశారు. కాసేపు వారితో కూడా "లెనిన్ కార్నర్లో" గడిపాను. కామ్రేడ్ జోషి, పార్టీ హోస్టల్ పెద్దగా వున్న "మాయీ"(కామ్రేడ్ లీలా సుందరయ్య తల్లి)ని పిలిచి, "మా అబ్బాయి బాగా తినగలడు. పంజాబ్ కామ్రేడ్స్‌కు తీసిపోడు, రెండు చపాతీలు ఎక్కువ పెట్టు" అని చెప్పాడు. నా భుజంమీద చేయివేసి "సినిమాకు పొయ్యేటట్లయితే పో, మాయీ నీ ప్లేటు వేరేగా పెడ్తుంది" అని ఆప్యాయతగా, కమ్యూనిస్టు ప్రేమతో చెప్పాడు. కామ్రేడ్ కుమారమంగళం నాకు తన భార్య కళ్యాణి కుమార మంగళాన్ని, కామ్రేడ్ అష్రాఫ్‌ను, ఎ. ఎస్. ఆర్. చారిని, అరుణ్‌ను పరిచయం చేశారు. ఆ రోజుల్లో – 1943 సెప్టెంబరు, అక్టోబర్లో హార్వే రోడ్డులోని బొంబాయి స్టూడెంట్సు యూనియన్ ఆఫీసును అందురాల్ ఆక్రమణ చేయడానికి కుంతే గ్రూపుకి చెందిన కొన్నివేలమంది చాలా హింసాకాండతో కూడిన దాడులు జరిపారు. కాని ఎ.ఐ.ఎస్.ఎఫ్. కామ్రేడ్స్ విజయవంతంగా వారి ప్రయత్నాలను తిప్పికొట్టారు. అందులో ప్రధాన పాత్ర వహించిన వారు వదూద్‌ఖాన్, శాన్ట్‌గిరి, అరుణ్, వర్గీస్, ప్రంత్‌సన్యాల్, విమల, గోడ్‌బోలే, రెడ్డి. అందులో నేనూ ఒకణ్ణి. నాకూ ఒక ఇటుకరాయి దెబ్బ తగిలింది. శాన్ట్ గిరికి రాయి తగిలి, పండ్లు వూడిపోయాయి. ఆనాటి వలంటరీ కమాండర్ ఎ. ఎస్. ఆర్. చారి.

నా పూనా అనుభవాలు చాలా వున్నాయి. అందులో ముఖ్యమయినవి కొన్ని ఉదహరిస్తాను. 1. కస్తూరీబా అగాఖాన్ పాలస్‌లో చనిపోయినప్పుడు, పూనా స్టూడెంట్స్ యూనియన్ (P.S.U) సంయుక్తంగా ఏర్పాటు చేసిన సంతాప సభలో నేను పార్టీ విద్యార్థుల తరపున మాట్లాడాను. పార్టీ పత్రికల్లో ఆ వార్త వచ్చింది. 2. గాంధీగారి విడుదల అనంతరం, వారు మహాబలేశ్వర్‌లో మకాం వేసినప్పుడూ నేనూ అక్కడ పదిరోజులు వుండి వారి పాదయాత్రల్లో, పార్టీ మీటింగుల్లో పాల్గొన్నాను. (1945 ఏప్రిల్, మే) గొప్ప అనుభవం అది. 3. భూకా బెంగాల్ ఎగ్జిబిషన్ నడిపాం. గోఖలే ఇన్‌స్టిట్యూట్ డైరెక్టర్ ధనంజయరావ్ గాడ్గిల్ ప్రారంభోత్సవం చేశారు. లీలా సుందరయ్యగారు వచ్చి, రెండు రోజులు కమ్యూన్‌లో వుండి, ఆ ఎగ్జిబిషన్ ఏర్పాట్లు పర్యవేక్షించారు.

## బ్రిటిష్ సోల్జర్స్‌తో పరిచయం:

మా కమ్యూన్‌కు బ్రిటిష్ సోల్జర్స్ తరచుగా వచ్చేవారు. అందులో సర్ ఆర్థర్ గ్రీన్‌వుడ్‌గారి ఇండిపెండెంట్ లేబరు (ఐ.ఎల్.పి) పార్టీకి చెందిన బాక్స్‌టర్ (Baxter) ఒకరు. వారు ప్రతి శుక్రవారం సాయంత్రం కమ్యూన్‌కు వచ్చి పార్టీనిధి ఇచ్చేవారు. అలాగే కొందరు గ్రీక్ కామ్రేడ్స్ వచ్చేవారు. విరాళాలు యిచ్చేవారు. మాతో కలిసి భోంచేసేవారు. అది కమ్యూనిజంలోని నిజమైన అంతర్జాతీయ స్నేహం. మరువరానివి.

1944లో కలకత్తాలో జరిగిన ఎ.ఐ.ఎస్.ఎఫ్. మహాసభకు పొయ్యాను. నౌషర్ అలీ, సరోజినీదేవి ఆ సభలో ముఖ్య అతిథులు. మన మధుసూదనరావు, అతని భార్య సరోజిని కూడా ఆ సభకు వచ్చారు. జాతీయ సమస్యపై డిబేట్ జరిగింది.

అందరు ఉపన్యాసకులు స్టాలిన్ థీసిస్సును బలపరుస్తూ మాట్లాడారు. డిబేట్ చచ్చుగ వుండింది. నన్ను ఆ థీసిస్సును వ్యతిరేకిస్తూ మాట్లాడమన్నారు. "ఇండియా ప్రత్యేక సమస్యలు, మన నాగరికత, చరిత్ర బాగా అధ్యయనం చేయాలి. స్టాలిన్ థీసిస్ రష్యాకు అన్వర్తించవచ్చుగాని గుడ్డిగా దానిని మనదేశంమీద రుద్దకూడదు. రష్యా జాతుల పరిష్కార మార్గం, స్టాలిన్ సూచనలు వారి దేశానికే ఇమిడి వుండాలి. కాని, ప్రతి దేశానికి అదే మార్గం – విధానం అనడం పిడివాదం అవుతుంది. అది చరిత్రను డయలక్టికల్‌గ అర్థం చేసుకొనడం కాదు" అనే ధోరణిలో మాట్లాడాను. అనూహ్యంగా సభలో చాలా కరతాళాలు, హర్షధ్వానాలు వినపడ్డాయి. దాని ప్రభావాన్ని తొలగించడానికి కామ్రేడ్ భూపేష్ గుప్తా ఉపన్యసించారు.

## ప్రజాగాయకుడు అమర్ షేక్:

మహారాష్ట్రలో పేరు ప్రఖ్యాతలు వహించిన ప్రజాగాయకుడు అమర్ షేక్‌ను కనుగొన్నది విద్యార్థి కమ్యూన్. అతన్ని కమ్యూన్‌కు ఆహ్వానించాం. మాతోనే వుంచుకున్నాం. ఆతిథ్యం యిచ్చాం. ఆయన పాటలు విన్నాం. శ్లాఘించాం. ప్రోత్స హించాం. తర్వాత మహారాష్ట్ర ప్రజలను ఉర్రూతలూగించిన మహా గాయకుడయ్యాడు అమర్ షేక్; దురదృష్టవశాత్తు కారు ప్రమాదంలో చనిపోయాడు.

మా స్టూడెంట్ కమ్యూన్‌చే ఆకర్షించబడిన వారిలో బీనాదేవి భర్త, జిల్లా జడ్జిగా రిటైరైన భాగవతుల నరసింహారావు ఒకరు. వారి రచనలలో మా స్టూడెంటు కమ్యూన్ ప్రభావనం లేకపోలేదు. (ఈ మధ్యనే మరణించారు.)

నా 'లా' 1945 మార్చిలో పూర్తి అయింది. తర్వాత అక్టోబరు 1946లో నెల్లూరుకు వచ్చి ప్రఖ్యాత సివిల్ లాయరు శ్రీ చివుకుల మాలకొండయ్యగారి ఆఫీసులో చేరాను. బార్ కౌన్సిల్ పరీక్ష మంచి శ్రేణిలోనే పాస్ అయ్యాను. రిక్షా కార్మికుల సంఘం, జట్కా కార్మిక సంఘం, మునిసిపల్ వర్కర్స్ యూనియన్‌లలో వాటికి అధ్యక్షుడుగా వుంటూ బాగా కృషి చేశాను. జిల్లా యువజన సంఘం అధ్యక్షునిగా చాలాకాలం పనిచేశాను. 1947 ఏప్రిల్ 26 వ తేదీన మద్రాసు హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి సర్ లయోనల్ లీచ్ (Sir Lionel Leech) సమక్షంలో శ్రీ అల్లాడి కృష్ణస్వామిగారి అల్లుడు, శ్రీ అల్లాడి కుప్పుస్వామిగారి బావ, శ్రీ యం. ఉమామహేశ్వరంగారు నన్ను బార్ మెంబరుగా ఎన్‌రోల్ చేయించారు. ఆనాటి నుండి నెల్లూర్లో లాయరుగ స్థిరపడ్డాను. చాలా ఉద్యమాల్లో ముందుండి పనిచేశాను. 30–1–1948 న ఆర్. ఎస్. ఎస్. గాడ్సే మహాత్మా గాంధీని హత్య చేసిన సందర్భంలో నెల్లూరులో కాంగ్రెస్‌వారు ఏమీ మీటింగు గాని, ప్రదర్శనగాని జరపలేదు. నేను, నా పొద్దుటూరు స్నేహితుడు వేణుగోపాల్, నెల్లూరు యువజన సంఘం కాలనీ పెన్నానదిలో రేడియో పెట్టి, దానికి మైక్ అమర్చి లౌడ్ స్పీకర్ల ద్వారా రాజ్‌ఘాట్‌లో జరుగుతుండిన గాంధీజీగారి అంత్యక్రియల ప్రత్యక్ష వ్యాఖ్యానాన్ని తెలుగులోకి అనువదించాం. పదివేల మంది ప్రజలు పెన్నానదికి వచ్చి పాల్గొన్నారు; మెచ్చుకున్నారు. కాంగ్రెస్ వారిని 'ఛీ' కొట్టారు. కమ్యూనిస్టులే మేలు అని శ్లాఘించారు.

తర్వాత చితాభస్మం నిమజ్జనంరోజు శ్రీ బెజవాడ గోపాలరెడ్డి మామగారు శ్రీ తిక్కవరపు రామిరెడ్డిగారి ఆధ్వర్యాన వి. ఆర్. కాలేజీ గ్రౌండ్స్‌లో జరిగింది. మమ్ములను ఉపన్యాసకులుగా ఆహ్వానించక తప్పలేదు. మా నెల్లూరు కామ్రేడ్స్ శేషాద్రి, కె. వి. నరసింహం, కరవది వెంకటేశ్వర్లు వగైరాలు ఆర్.ఎస్.ఎస్.ను ఖండించటానికి జంకుతానేమోనని, పార్టీ మీటింగు పెట్టి, నన్ను ఏమన్నా ఉపన్యసించవలసిందని చెప్పారు. అలాగే మాట్లాడాను. తూచి మాట్లాడటం వల్ల ఫ్రీగా మాట్లాడినంత ఎఫెక్టివ్‌గా ఉపన్యాసం లేదు.

## పార్టీపై నిర్బంధం; "మా భూమి" ప్రదర్శనం:

ఆ కాలంలో జరిగిన కొన్ని సన్నివేశాలు చెప్పాలి. పార్టీమీద నిషేధం వున్న రోజులు అవి. 1. నేను ప్రధానంగా కృషి చేసి "మా భూమి" నాటకం టౌన్ హాల్లో వేయించి "కాంప్లిమెంటరీ" టిక్కెట్ల ద్వారా సుమారు రు. 7,500/–లు వసూలు చేసి వారికి యిచ్చాను. రాజారావు ఇతరులు మెచ్చుకున్నారు. (ఆ రోజుల్లో రు. 7,500/–లు, అంటే ఈనాటి రు. 1,50,000/– లక్షా యాభైవేలు.) 2. టౌన్‌హాలు మైదానంలో పార్టీ పాలసీ ప్రజలకు తెల్పడానికి బహిరంగ సభ పెట్టాం. పార్టీ మీద నిషేధం తొలగలేదు. ఆర్.ఎస్.ఎస్., కాంగ్రెస్‌వారు మీటింగులో గలభా చేయాలని ప్రయత్నిస్తున్నారని తెలిసింది. అప్పుడే కాంగ్రెస్ శేషాద్రి మిలిటరీ కింగ్స్ కమిషన్ ఆఫీసరుగా వుంటూ రాజీనామా చేసి స్వస్థలం నెల్లూరు చేరుకున్నాడు. నా మేనమామ ఇంటి ప్రక్క ఇల్లు వారిది. పరిచయమయింది. మా వాలంటీర్లకు మిలిటరి శిక్షణ ఇవ్వమనగానే యిచ్చారు. అందులో జొన్నా కోటయ్య, ముత్యాల చిదంబరం, జొన్నా శేషయ్య వగైరాలు శిక్షణ పొందారు. మీటింగుకు అధ్యక్షుడు, ప్రధానోపన్యాసకుడు నేనే. ఆ మీటింగుకు సుమారు అయిదు వేలమంది జనం వచ్చారు. మీటింగు ప్రారంభం కావడంతోటే ఆర్.ఎస్.ఎస్. వారు టిఫిన్ బాక్సుల్లో దాచి తెచ్చిన నీటి పాములను ప్రజల మీద వేశారు. వాటిని మన కామ్రేడ్స్ పట్టుకొని చంపి స్టేజీమీదికి తెచ్చారు. కడుపు మండింది. కామ్రేడ్ రేవూరు భరద్వాజ్ ఆ పాములను చంపాడు. చాలా ధైర్య సాహసాలు గల వ్యక్తి. 'మతోన్మాదులారా! ఏనాటికయినా ఈ పాములకు పట్టిన గతే మీకు పడ్తుంది, తప్పదు" అని ఆ పాములను చూపించి, వారిని హెచ్చరించాం. సభకు వచ్చిన ప్రజలను భయపడవద్దు అని చెప్పాం. తర్వాత మీటింగు ప్రశాంతంగా జరిగింది. ఆ మీటింగునే మా పాత కామ్రేడ్స్ "పాముల మీటింగు" అని అంటుంటారు. రాష్ట్రంలో మునిసిపల్ కార్మికుల సమ్మె జరుగుతుంటే, గూడూరులో కామ్రేడ్ పిల్లలమర్రిని ఆహ్వానించి సభ ఏర్పాటు చేశారు. దానిని విచ్ఛిన్నం చేయడానికి ఆర్.ఎస్.ఎస్. వారు పూనుకున్నారు. నేను కాలకృత్యాలు తీర్చుకొనడానికి చెరువుకు పోతే, నన్ను కొట్టవలెనని తరుముకొచ్చారు. నేను పరుగెత్తి వూర్లోకి వచ్చాను. జనం వుండినారు. తప్పించుకున్నాను.

## తెలంగాణా ఉద్యమానికి సంఘీభావం:

తెలంగాణా ఉద్యమాన్ని బలపరుస్తూ మీటింగులు పెడ్తే – నా మీద కుళ్ళిన టొమాటోలు, కోడిగుడ్లు కామాటి వీధిలో వేశారు. ఆ పనిచేసింది ఆర్.ఎస్.ఎస్.

వారే. మరొక విషయం చెప్పి ముగిస్తాను. నాకు పెండ్లి కాకపోయినా కామ్రేడ్ గునుపాటి రామచంద్రయ్య పెండ్లికి (బహుశా 1946) పార్టీ పౌరోహిత్యం వహించాను. ఆ రోజుల్లో పార్టీ పెండ్లి చేసుకున్న సంపన్న రెడ్డి కులానికి చెందిన రామచంద్రయ్యను, ఆయన సతీమణిని మెచ్చుకోవాలి. వారి కొడుకు ప్రసాద్ ఈనాడు నెల్లూరు జిల్లా యువజన సంఘం అధ్యక్షుడుగా, పొదుపులక్ష్మి నాయకుడుగా బాగా ప్రఖ్యాతికి వచ్చాడు.

అదే రకంగా కామ్రేడ్ మోటుపోతుల శంకరయ్య పెండ్లి ఆత్మకూరులో 1946లో పార్టీ పౌరోహితుడుగా జరిపాను. నా పెండ్లి కామేశ్వరితో రు. 200/-ల ఖర్చుతో 30-5-1949లో జరిగింది. రిజిస్ట్రారుగారు శేషాద్రి అనే ఆయన. కయ్యూరు కామ్రేడ్స్‌లో ఒకరికి మేనమామ. నా పెండ్లికి సాక్షులు డాక్టర్ పుచ్చలపల్లి రామచంద్రారెడ్డి, నా మేనమామ అనంతబంట్ల శేషగిరిగారు, నా మిత్రుడు మన్నేపల్లి చలపతిరావుగారు. నా పెండ్లికి నా తండ్రి, నా పిన్నమ్మ వగైరాలు రాలేదు. ఆ రిజిష్టరు పెండ్లిని "మాల మాదిగ పెండ్లి" అని తూలనాడారు. తర్వాత నేను వృత్తిలో స్థిరపడి, సమాజంలో గౌరవస్థానం పొంది, ఆర్థికంగా వృద్ధి చెందిన తర్వాత మమ్ములను ఆపేక్షగా, సగర్వంగా చూచారు. నా పార్టీ మిత్రులు ఆమంచర్ల గంగాధరరావు వగైరాలు వచ్చారు. కె. జి. కన్నభిరాన్ తల్లి శ్రీమతి పంకజమ్మగారు దగ్గరవుండి ఆ పెండ్లి జరిపింది. 1992 ఆ ప్రాంతంలో తమ వారికి రిజిష్టరు పెండ్లి చేశామని కొందరు ఎచ్చులు చెప్తుంటే, "పోంద్రా, 1949లోనే అనంతరాయుడు ఆ పని చేశాడే. నేను దగ్గర వుండి కామేశ్వరి పెండ్లి చేయించాను. ఆ కుటుంబం బాగా వుంది" అని ప్రేమగా, సగర్వంతో చెప్పేది. నెలకు 17 రూపాయల బాడుగ చెల్లిస్తూ, నా 'లా' ప్రాక్టీసు సంసారం ప్రారంభించాను.

ఇవన్నీ నన్ను కమ్యూనిస్టు సిద్ధాంతం ప్రచారకుడిగ చేశాయి.

## ముగింపు మాట:

కమ్యూనిస్టు ఉద్యమంలో నేను చేరిన మొదటి రోజుల్లో కమ్యూనిస్టు నాయకులు, పార్టీ సభ్యులు చాలా నిరాడంబరంగా వుండేవారు. ఖరీదైన బట్టలు, విలాసాలు, అలవాట్లు లేవు. సంపన్న కుటుంబం నుండి వచ్చిన కామ్రేడ్స్ మిగతా కామ్రేడ్స్‌తో కలసి మెలసి అహంభావం, స్వార్థం లేకుండా ఒకరకంగా సహాయపడేవారు. తమ అధిక వరుంబడిని మిగతావారి అవసరాలకు ప్రేమపూర్వకంగా వినియోగించేవారు. ఇప్పుడు ఆ సమానత్వ భావాలు, సింపిల్ లివింగు లేవు.

రెండు: ఆ రోజుల్లో మీ కులం యేమిటి అని అడిగేవారు కారు. కామ్రేడ్ సుందరయ్య వగైరాలు కులాన్ని తెలిపే పేర్లు మాని, మామూలు పేర్లు పెట్టుకున్నారు. నన్ను చాలామంది రెడ్డి అని అనుకొన్నారు. "మనవాడే" అని కూడా కొందరు అన్నారు. ఈనాటికి నన్ను "కమ్మవారు" అని కొందరు అనుకొంటారు. నా ఇంటిపేరు మన పార్టీ పత్రికలలో గూడా "వేములపల్లి" అని వస్తూ వుంటుంది. అంటే - నిజంగా నేను ఏ కులానికి చెందినవాడనో తెలియదు. ఆ రోజుల్లో పార్టీలో కులాభిమానం చాలా తక్కువ. ఎప్పుడూ నా కులాన్ని నేను ప్రచారం చేసుకోలేదు. ఈ ప్రజాస్వామ్య పార్లమెంటరీ ఎన్నికలు వచ్చిన తర్వాత కులానికి ప్రాముఖ్యత

వచ్చింది. నియోజక వర్గంలో ఏ కులంవారు మెజారిటీగా వుంటే వారికే గెలిచే అవకాశాలు ఎక్కువ వున్నవి కాబట్టి, వారినే అభ్యర్థిగా నిలపడం పరిపాటి అయింది.

దోపిడీ వ్యవస్థ ఎల్లకాలము మనలేదని పెట్టుబడిదారీ విధానంలో వున్న వైరుధ్యాలు కొంతకాలం దాటేయవచ్చేమోకాని ఎల్లకాలం దాటేయలేవనీ, మానవ సమాజంలోని అసమానతలు పోవాలంటే సోషలిజమే పరిష్కార మార్గమని నా అచంచలమైన విశ్వాసం. జాతీయ, అంతర్జాతీయ కమ్యూనిస్టు, సోషలిస్టు పార్టీలు తమ తమ విభేదాలు సర్దుకొని, శత్రువును ఐక్యంగా ఎదుర్కొంటే సోషలిజం విజయవంతం కావచ్చు. భారతదేశంలో ప్రధాన కమ్యూనిస్టు పార్టీ సత్వరం ఐక్యం కావలెనని నా ప్రగాఢ వాంఛ.

★ ★ ★

# ప్రొఫెసర్ కె. శేషాద్రి



ఎందరో త్యాగమూర్తులు, మేధావులు, కార్మిక కర్షక నాయకులు నిర్మించిన అంతర్జాతీయ సౌభ్రాతృత్వంతో ప్రపంచమంతటి మానవ జీవితం విశిష్టంగాను దోపిడిదారితనం నుండి, పేదరికం పిశాచి నుండి, అమానుషత్వపు రాజకీయాలనుండి తప్పించి స్వేచ్ఛనివ్వవలెననే ఉద్యమం మార్క్సిజం. అలాంటి ఉద్యమంలో గొప్పగా చెప్పుకోతగ్గ పాత్ర వహించే గౌరవం అందరికి లభించదు. కనీసం కొంతవరకన్నా అలాంటి మహోద్యమంలో ఉడతా భక్తివలె కొంతభాగం కలుగజేసుకున్నాము గదా అనే విషయం సగర్వంగా చెప్పుటకు నాకీ అవకాశం దొరికిందని ఎంతో సంతోషంగా వుంది. జీవితాంతం నేను ప్రపంచంలో బృహత్ ఆశయానికి ప్రజల విముక్తి అనే ఆశయానికంటే గొప్పదేమున్నది – దానికి పాటుబడ్డానని చెప్పగలిగిన తృప్తికంటే వేరేమున్నదని లెనిన్ అన్నారు. ఇటువంటి అనుభవం అందరికి వుండదు. దేశంలో అలాంటి అనుభవం సగర్వంగా చెప్పగలిగిన కమ్యూనిస్టు, సోషలిస్టు నాయకులకు కార్యకర్తలకు తలఒగ్గి నమస్కరిస్తూ ఈ నా స్వల్ప అనుభవాలను చెబుతున్నాను.

30 వ దశాబ్దంలో – 1934–35లో నేను నాల్గవ ఫారం చదివేటప్పుడు నా మామ కలకత్తాలో పనిచేస్తూండేవారు. ఆయన నెల్లూరు వచ్చినపుడు జయప్రకాశ్ నారాయణ వ్రాసిన Why Socialism, మినూ మసాని వ్రాసిన Soviet Sidelithts అనే రెండు పుస్తకాలు తెచ్చినారు. ఆ కాలంలో మాకు కొంత ఇంగ్లీషు ఈకాలపు నాల్గవ ఫారం విద్యార్థులకంటె కొంచెం మెరుగు కాబట్టి, వాటిని చదివాను. సగం జీర్ణం కాలేదు. తర్వాత ఆయన నాకు రష్యా విప్లవాన్ని గూర్చి కొంచెం చెప్పారు. గాంధీజీ, నెహ్రూ వంటివారిని గురించే అందరికి తెలుసును గాని, లెనిన్‌ను గురించి చాలామందికి తెలియదు. పార్టీ స్థాపించబడినప్పటికీ సామాన్య ప్రజానీకానికి పూర్తిగా అన్ని విషయాలు తెలియవు. తర్వాత నేను నెల్లూరు వదలి సికింద్రాబాద్‌లో మా తండ్రిగారి వద్దకు వెళ్ళాను. ఆయన అప్పటి కె.ఇ.ఎమ్. ఆసుపత్రిలో డాక్టరు. మా తల్లిగారి అక్కగారు అక్కడ కొన్ని దినాలుండినది. ఆమె ఆ కాలంలో ఖద్దరు చీరలు ధరించి, రాజకీయాలు అవగాహన చేసుకొనేది. ఆమె మొదటిసారిగా రష్యాలో జరిగిన విప్లవాన్ని గూర్చి విస్తారంగా చెప్పింది. మహాకవి సుబ్రహ్మణ్య భారతి దాన్ని

గూర్చి పాట పాడిన విషయం మొదటిసారి విన్నాను. అది మొదట్లో నాకు రష్యా విప్లవాన్ని గూర్చి కొంత అస్పష్టంగా తెలియటం.

అప్పటి హైదరాబాద్ రాష్ట్రంలోని నిరంకుశ పరిపాలన, బీద ప్రజల యొక్క కష్టాలు, వారి దైన్యత్వం, "నీ బాంచెనయ్య నీ కాలు మొక్కుతా" అనే పదజాలం కొంత వింతగా వుండేది. అయినప్పటికీ, ఆ దోపిడిదారి అమానుషత్వాన్ని గురించి పూర్తిగా అవగాహన చేసుకోలేకపోయాను. మా తాతగారు ఆ కాలపునాటి ఛాందసులుగా లేరు. అది కొంత ఆశ్చర్యమే. ఆయన విష్ణుభక్తుడు. శ్రీ రామానుజుల వారిని గురువుగా స్వీకరించినవాడు. ఆయన నాకు చదువు చెప్పించడమే కాక, ఆ కాలంలో రామానుజులు అస్పృశ్యులందరికి తిరుమంత్ర ముపదేశించి, కొన్ని దేవాలయాలలో వారికి ప్రవేశించే హక్కులిచ్చి, వారిని "తిరుమలత్తార్" (దైవిక కులమువారు) అని పిలచినదని చెప్పారు. అది నా హృదయంలో చాలా ప్రభావం కలుగజేసింది. 11 వ శతాబ్దంలో ఎవ్వరు అంత సాహసించలేదు.

అవి నాకు చాలా చిన్నప్పటి కాలంలో ఒక మానవత్వాన్ని ఇచ్చిన ఘట్టాలని అనుకుంటాను. లేకుంటే నేను ఒక జడమే కదా!

## అమరవీరుడు శేషగిరితో తొలి పరిచయం:

ఇంటర్మీడియట్ చదివేందుకు ఎ. ఆర్. కాలేజికి, నెల్లూరు వచ్చాను. అప్పుడు క్లాసులో దువ్వూరి శేషగిరిరావు వుండేవారు. ఆయన నా ప్రక్కన కూర్చొనేవారు. అంటే, శేషాద్రి తర్వాత శేషగిరిరావని – అప్పటి క్లాసులలో ఆల్ఫబెటికల్ ఆర్డర్‌లో విద్యార్థులు కూర్చొనవలసి వచ్చినందువల్ల అది సంభవించింది. శేషగిరిరావు అప్పటికే కమ్యూనిస్టు పార్టీలో వుండేవారు. అప్పుడు మొదటిసారిగా నాకు రహస్యంగా కామ్రేడ్ సుందరయ్యగారు సైక్లోస్టైల్‌లో తీస్తున్నటువంటి 'స్వతంత్ర భారత్' అనే రహస్య పత్రికను, భారత కమ్యూనిస్టు పార్టీ రహస్యంగా నడుపుతున్న 'కమ్యూనిస్ట్' అనే ఆంగ్ల పత్రికను చూపాడు. అప్పటికే కాంగ్రెస్ యొక్క ఉద్యమాలను గురించి అవగాహన జరగటం వల్ల ఆ పత్రికలను చదవడంలో చాలా అభిలాష ఏర్పడింది. కాని, కమ్యూనిజం మీద మాత్రం కొన్ని అపోహలుండేవి. దేవుడు లేడా? మానవులందరు సమానంగా వుండగలరా? – ఇవి ముఖ్యమైన సమస్యలు! ఆ కాలంలో, ఆ వయస్సులో, ఆ సమాజంలో వాటిని చాలా ఓర్పుతోటి, నేను ఎంత ఎగతాళిగా వాదించినా కోపం లేకుండా శేషగిరి నాకు జవాబు లిచ్చేవారు. ఒక్కొక్కరోజు ఒక్కొక్క విధమైన వాదన. 'దేవుడున్నా లేకున్నా మనకెందుకు, దేశంలో అన్యాయం, అక్రమం వుందా – లేదా? సమానత్వం అంటే అందరూ ఒకే మోస్తరు పుదుచ్చేరి బొమ్మల్లాగా వుంటారనికాదు, అందరికీ సరియైన అవకాశా లివ్వటం, సమాజంలో ఒకరు గొప్ప, ఇంకొకరు హీనమని లేకుండుట' అని ఎంతో వాదించేవాడు. నాకు పూర్తిగా కమ్యూనిజంపై నమ్మకం రాలేదు. ఇదేదో ఊహాజనితంగా వుండే తత్వమేకాని, అనుభవయోగ్యం కాదని ఒక శంక.

1941కు మరల సికింద్రాబాద్ వెళ్ళాను. 1942లో గుంటూరుకు ఆంధ్రా యూనివర్శిటి తరలింది. రెండవ ప్రపంచ సంగ్రామం కారణంగా విశాఖపట్నం, కాకినాడలో రెండు జపాన్ బాంబులు పడ్డందువల్లను, అప్పటికి సుభాష్‌చంద్ర బోస్

యువకులకంతా గొప్ప హీరో. ఆయన తప్పించుకొనిపోయి జర్మనీ ద్వారా జపాన్ చేరి అక్కడనుండి రేడియోలో ప్రసారాలు చేయటం మొదలైంది.

అప్పటికి విద్యార్థులలో చాలామంది మేధావులలో బ్రిటిష్ వారిపై ద్వేషం, తత్కారణంగా జర్మనీపై జపాన్‌పై కొంత సానుభూతి. కాని, నేనప్పటికి Maunice Hindus యొక్క Red Bread అనే పుస్తకం, వెబ్ దంపతుల "సోవియట్ కమ్యూనిజం – నూతన నాగరికత" "స్పానిష్ అంతర్యుద్ధం, రాల్ఫ్‌పాక్స్ కమ్యూనిజం" చదవడం జరిగింది. ఇప్పుడు శేషగిరి లేడుకదా అని చింతించేవాడిని కాని, కమ్యూనిస్టు పార్టీలో సభ్యత్వం మాత్రం తీసుకొనలేదు. సందేహాలున్నాయి కదా? గాంధీ, నెహ్రూల మీద అపారమైన భక్తి ఎంత పెద్ద సైన్యాలను తయారు చేసినా సోవియట్ యూనియన్‌ను ఏమి చేయలేరనే ఒక నమ్మకం పై చెప్పిన పుస్తకాలు చదవడంతో ఏర్పడింది. సోవియట్ యూనియన్ కూడా తటస్థంగా వుండటం వల్ల బ్రిటిష్ సామ్రాజ్యవాదానికిని, జర్మన్ జపాన్ ఫాసిస్టులకును జరిగే యుద్ధంలో ఎవరివైపు కూడా సానుభూతి నాకు కలగలేదు. అప్పటికి సోవియట్ యూనియన్ గురించి చాల తెలుసుకొనగలగటం ఒక ముఖ్యమైన విషయంగా భావిస్తున్నాను.

## క్విట్ ఇండియా ఉద్యమం:

కాని, 1942 ఆగస్టులో క్విట్ ఇండియా తీర్మానాన్ని కాంగ్రెస్ కమిటీ ఆమోదించింది. గాంధీ మహాత్ముని పిలుపు Do or Die అని, Cowards have no Right to live అని. ఇదే ఆఖరు స్వతంత్ర పోరాటమని చాలా ఉత్తేజకరంగా ఇచ్చిన పిలుపుకు చాలమంది విద్యార్థులు ఆకర్షించబడి ఉద్యమంలో పాల్గొన్నారు.

అంతలో రహస్యంగా ఆంధ్ర సర్క్యులర్ ఒకటి వచ్చింది. దానిలో విధ్వంస కార్యక్రమం, అంటే – రైలు పట్టాలు ఊడపీకడం, తంతి తీగలు తెంపడం, బ్రిడ్జిలు పడవేయటం వంటివాటిని "అహింసాత్మకంగా" చేయాలని వ్రాశారు! అది ఒక పెద్ద తప్పుడు సర్క్యులర్. దానిని అనువుగా తీసుకొని కొన్ని కార్యక్రమాలు జరిగినవి. అందులో నేను కూడా కొంతవరకు పాల్గొన్నాను. ఆంధ్ర యూనివర్శిటీ నుంచి ఉద్వాసన కలిగింది. నెల్లూరు వెళ్ళి, అక్కడ నాతోనే కాలేజీ వదలిన మిత్రుడు విస్సా కృష్ణమూర్తి, ఓరుగంటి సుబ్రహ్మణ్యం అను మిత్రుడు, మొదలగువారం కలిసి కరపత్రాలు ముద్రించి రహస్యంగా ప్రభుత్వ వ్యతిరేక ప్రచారం చేశాం. పోలీసుల నిఘా ఎలా వుండినదో తెలియదుగాని, కొన్ని రోజులు రహస్యంగా గడిపాము. గాంధీజీని అరెస్టుచేసి, అగాఖాన్ భవనంలో; నెహ్రూ, అజాద్ మొదలైనవారిని అహ్మద్‌నగర్ కోటలో నిర్బంధించడం జరిగింది. కొన్ని రోజులకు 1942 విప్లవం చల్లబడింది.

## కమ్యూనిస్టు పార్టీ బహిరంగ కార్యక్రమాలు:

ఇంతలో కమ్యూనిస్టు పార్టీ బహిరంగంగా 'పీపుల్స్ వార్' అనే వారపత్రిక, చక్కటి అచ్చుతో, సునిల్‌జానా యొక్క ఫోటోలతో, జోషి యొక్క సంపాదకీయం, అధికారి యొక్క సైద్ధాంతిక వ్యాసం, మోహన్ కుమార మంగళం యొక్క అంతర్జాతీయ వ్యాసం, రాష్ట్రాలలో జరిగే ఉద్యమాలమీద రిపోర్ట్‌లతో ఆకర్షణీయంగా రావటం

మొదలైంది. జోషి యొక్క గొప్పతనం ఏమంటే – ఆయన రచనలు ఉద్రేక రహితంగా అతి ఆకర్షణీయమైన సులభశైలితో ఒప్పించేవిగా వుండేవి. 1942లో సత్యాగ్రహానికి పిలుపు నివ్వలేదని, ఇవ్వటానికి ముందే బ్రిటిష్ ప్రభుత్వం నాయకులను అరెస్టు చేశారని, కాబట్టి 1942లో జరిగిన అలజడులు సత్యాగ్రహంతో సంబంధం లేనివని వాదించాడు. కొంతకాలం తర్వాత గాంధీగారికి, వైస్రాయ్ లార్డ్ వేవెల్‌కు జరిగిన ఉత్తర ప్రత్యుత్తరాలలో కూడా గాంధీజీ, ఆ సంఘటనలు ప్రజల కోపానికి నిదర్శనాలని, తన అహింసాత్మక సత్యాగ్రహం కాదని, దానికంతా బాధ్యత బ్రిటిష్ ప్రభుత్వం యొక్క దమన నీతి అని వాదించారు. జోషి కూడా అదే చెప్పాడు.

కాని, కాంగ్రెస్ వారు, వారిలో వున్న సోషలిస్టులు, అవకాశవాదులు వినిపించుకునే స్థితిలో లేరు. కమ్యూనిస్టు వ్యతిరేక ప్రచారం ముమ్మరంగా సాగింది. మాస్కో మానసపుత్రులని, దేశద్రోహులని ఎన్నెన్నో నిందలు భరించవలసి వచ్చింది.

అలాంటి పరిస్థితులలో నేను మరల సికింద్రాబాద్‌కు వెళ్ళాను. అక్కడ కమ్యూనిస్టులతో పొత్తు పెట్టుకున్నాను. వట్టికోట అళ్వారుస్వామి, మఖ్దూం మొహియుద్దీన్‌తో కొంత స్నేహం ఏర్పడింది. రాజ్ బహదూర్‌గౌడ్ గారికి నాగురించి ఆ రోజులలో జ్ఞాపకం వుండకపోవచ్చు. ఎ. ఎస్. ఆర్. చారి, ఎ. ఎస్. కె. అయ్యంగారి అన్న కుమారుడు ఎ. ఆర్. వి. చారి చాలా చురుకుగా హైదరాబాద్‌లో పార్టీ కార్యక్రమం సాగించారు. నాకు ఆయనతో పరిచయం కావడంతో పార్టీ పత్రికలు, మార్క్సిస్టు సారస్వతం బాగా చదవటం మొదలుపెట్టాను. ఆ కాలంలో స్టాలిన్ వ్రాసిన "లెనినిజం – సమస్యలు"లో "గతితార్కిక భౌతికవాదం" అనే పుస్తకం చాలా ముఖ్యమైన గ్రంథంగా పరిగణించేవారు. దాని ప్రభావం ఆనాటి కమ్యూనిస్టులలో కలగలేదనటం కల్ల. నాకు ముఖ్యంగా ఎంగెల్స్ వ్రాసిన యాంటీ డూరింగ్, మార్క్స్ యొక్క 18వ బ్రూమైర్, లెనిన్ వ్రాసిన స్టేట్ అండ్ రివల్యూషన్‌లతో చాలా ప్రభావితమైనాను.

## నెల్లూరు స్నేహితులు:

అప్పటికి మరల నెల్లూరు వచ్చాను. శేషగిరి కొత్తగూడెం బొగ్గుగనుల కార్మికుల సంఘ నిర్మాణంలో నిమగ్నుడైనాడు. నెల్లూరులో నాకు అప్పుడు వేములపల్లి అనంత రామయ్య యొక్క పరిచయం చాలా ముఖ్యమైన ఘట్టం. ఆ స్నేహం ఈనాటికీ సిద్ధాంతపరంగానే గాక వ్యక్తిగతంగా కూడా చాలా ముఖ్యమైనదనే చెప్పాలి.

ఖండవల్లి కృష్ణారావు, బస్వారెడ్డి శంకరయ్య, సి. సుబ్బయ్య, కాలీషా, జొన్నా కోటయ్య, చిదంబరం, పద్మనాభయ్య, బీర రామనాథం, ఎం. శంకరయ్య, గునుపాటి రామచంద్రారెడ్డి మొదలైనవారు ఆనాటి త్యాగధనులు, పార్టీ ప్రముఖులు, నాకు సన్నిహితులు. కృష్ణా జిల్లానుండి వచ్చి నెల్లూరు లోనే తన స్వగ్రామంగా పరిగణించి అక్కడే పార్టీ నిర్మాణ బాధ్యతలను తీసుకొన్న పరుచూరు రామకోటయ్య, వారి సతీమణి సూర్యమాంబను గురించి కూడా జ్ఞప్తికి తెచ్చుకోవలసి వుంది. ఆ కాలంలో అందరకూ కూడా సుందరయ్యగారు, జోషిగారు, రాజేశ్వరరావుగారు, నంబూద్రిపాద్‌గారు నిరాడంబర జీవితం సాగిస్తూ, బ్రాడ్ మైండ్‌తో ఎలాంటి విచక్షణ

లేకుండా ప్రవర్తించి అందరి గౌరవాభిమానాలను చూరగొన్నారు. అందువల్లనే పార్టీలో కొన్ని పెద్ద తప్పటడుగులు వేసినా పార్టీ గట్టిగా నిలవబడగలిగింది.

## విద్యార్థి పోరాటాలు:

నెల్లూరులో 1946లో పెద్ద వ్యవసాయ కూలీల సమ్మె జరిగింది. దానికి షేక్ కాలీషా, జొన్నా కోటయ్య స్థానిక నాయకులు. కోవూరు తాలూకాలో అంతటి సమ్మె, అంత పెద్ద ప్రదర్శన జరగడం, దానిలో ఎల్లాయపాలెంలో పందిపాటి సుబ్బరామిరెడ్డి కాలీషాను చెట్టుకు కట్టి కొట్టడం, దేవిరెడ్డి వెంకురెడ్డి తలమచిలో దౌర్జన్యాలు తెలంగాణా ఫక్కీలో చేయడానికి వ్యతిరేకంగా వ్యవసాయ కూలీలను సమీకరించి, వారికి సానుభూతిగా విద్యార్థులు, బిట్రగుంటలోని రైల్వే కార్మికులు సుందరమూర్తి నాయకత్వాన ప్రదర్శనలు జరపడంలో ప్రముఖ పాత్ర వహించారు. దీనిని గూర్చి సుదీర్ఘమైన వ్యాసం అనాటి ప్రజాశక్తిలో వ్రాశాను. విద్యార్థి రంగం పార్టీ కొంత బలహీనంగా వుంది. కామ్రేడ్ కె. వి. నరసింహం ఒంగోలు నుండి వచ్చి నెల్లూరులో చదువుకునేవాడు. అతడు ముఖ్యంగా నన్ను బి.ఎ.లో చేరమని, అప్పుడు విద్యార్థి రంగంలో చురుకుగా పని చేయవచ్చని ప్రోద్బలం చేసి చేర్పించాడు. విద్యార్థి మహాసభ 1946లో అల్లూరులో విజయవంతంగా జరిపాం. వి. ఆర్. కాలేజీలో మొదటిసారిగా కమ్యూనిస్టునైన నేను విద్యార్థులలో గుర్తింపువచ్చి, డిటెన్షన్ విధానానికి వ్యతిరేక సమ్మెలో నాయకత్వం వహించాను. ఆ సమ్మె చారిత్రాత్మకమైంది. నలభై మందికిపైగా నిరాహారదీక్ష, ఆలిండియో రేడియోలో దానిని గురించి పేర్కొనడం జరిగింది. అప్పుడు వీరమాచనేని మధుసూదనరావు (నేటి ప్రముఖ ఫిలిం దర్శకుడు) నెల్లూరు వచ్చారు. ఆ సమ్మెతో నెల్లూరంతా అట్టుడికినట్లుండినది. సమ్మె జయప్రదం చేసి, డిటెన్షన్ విధానాన్ని రద్దు చేయించగలిగాము. అనాడు విద్యాశాఖమంత్రి శ్రీ అవినాశలింగం చెట్టియార్ వద్దకు వెళ్ళి, కొంత తీవ్రంగా మాట్లాడాను. ఆ కాలం మంత్రులు కాబట్టే, నాకెలాంటి హాని జరగలేదు.

వి. ఆర్. కాలేజీలో ప్రప్రథమంగా ఒక కమ్యూనిస్టును పెద్ద మెజారిటీతో విద్యార్థిసంఘ ప్రెసిడెంట్‌గా ఎన్నుకొనడం పెద్ద విషయమే. సుందరయ్యగారు, ముక్కామల నాగభూషణం గారు, వావిలాల గోపాలకృష్ణయ్యగారు – ఏనాడూ ఎరుగని వి. ఆర్. కాలేజి విద్యార్థి సంఘంలో ప్రసంగించడం గొప్ప విషయమే. ఆ కాలంలో కమ్యూనిస్టులు విద్యారంగంలోనికి రాకూడదు, వారికి అర్హత లేదని ఉన్న అపోహలన్నీ పటాపంచలైనవి. ఎ.ఐ.ఎస్.ఎఫ్. సభ్యత్వం బాగా పెరిగింది. రౌడిజం, ఆడపిల్లలను హేళన చేయడం మొదలైనవి కట్టించివేశాము.

ఇంతలో తెలంగాణాలో పోరాటం, 2500 గ్రామాలు దేశ్‌ముఖ్ జాగీర్దారీ నైజాం కిరాతక రాజ్యాన్ని మొదటిసారిగా పార్టీ, ఆంధ్ర మహాసభలు ఎదుర్కొని, విముక్తి చేయించాయి. ఆకాలంలోనే నా మిత్రుడు శేషగిరిని అరెస్టు చేసి, తప్పించుకొనడానికి ప్రయత్నించాడని కుంటిసాకుతో నైజాం పోలీసులు కాల్చివేశారు. నైజాంలో జరిగిన పోరాటం వల్ల పార్టీకి సామాన్య ప్రజలలో గౌరవం పెరిగింది. అనాటి హేళనలు, వ్యంగంగా చిత్రించడం ముగిసింది. కాంగ్రెస్‌వారిలో ఈర్ష్య

పెరిగింది. వారి సత్యాగ్రహాలు నామమాత్రమేగాని, కార్యసాధన లేదు. దానితో విశాలాంధ్ర నినాదం బలపడింది. సుందరయ్యగారి 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం' అనే పుస్తకం విరివిగా అమ్ముడు పోయినవి. దానిని ఆంగ్లంలో తర్జుమా చేయగా, దేశమంతటా విశాలాంధ్ర నినాదం ప్రతిధ్వనించింది.

స్వరాజ్యం 15 ఆగస్టు 47లో రావడానికి ముందు నావికుల తిరుగుబాటు ఉద్యమం, ఐ.ఎన్.ఎ. ఖైదీలను విడిపించడానికి చేసిన ఉద్యమం, అన్నిచోట్లలో అలజడులు మొదలైన వాటివల్ల, బ్రిటిష్‌ప్రభుత్వం భవిష్యత్తులో భారతదేశంమీద అధికారం చేయడం కష్టసాధ్యమని దూరదృష్టితో తెలుసుకున్నది. రెండవ ప్రపంచ సంగ్రామానంతరం తూర్పు యూరప్ దేశాలలో విప్లవాలు, చైనాలో కమ్యూనిస్టు పార్టీ యొక్క విజయపరంపరలు, సోవియట్ యూనియన్ ప్రపంచంలో పెద్ద శక్తిగా ఉద్భవించడం మొదలైన అనేక కారణాల వల్ల బ్రిటిష్ ప్రభుత్వం స్వాతంత్ర్యం ఇవ్వడానికి సిద్ధపడింది. గాంధీ మహాత్ముని నైతిక ధోరణి ప్రపంచంలో ఒక నవీనతను చూపి, ప్రజల గౌరవ మర్యాదలనందుకున్నది. అంతేగాని, సత్యాగ్రహం వల్లనే బ్రిటిష్ ప్రభుత్వం వెళ్ళిపోయిందని నేటి దేశభక్తాగ్రేసరులు రొమ్ములు కొట్టుకున్నట్లు కాదని చెప్పవలసి ఉంటుంది.

## కమ్యూనిస్టుల త్యాగదీక్షలు:

కమ్యూనిస్టులు మన రాష్ట్రంలో, దేశంలో, ప్రపంచంలో చేసిన మహత్తర త్యాగాలు, బలిదానాలు, పడ్డ కష్టాలు వర్ణనాతీతము. ఏ ఉద్యమంలో కూడా ఇంత బ్రహ్మాండమైన ప్రజాసేవ, ప్రాణత్యాగం లేదని గట్టిగా చెప్పగలుగుతున్నందుకు కమ్యూనిస్టులు గర్వించాలి.

1947 చివరి రోజులలో ఎ.ఐ.ఎస్.ఎఫ్. అఖిల భారత కాన్ఫరెన్స్ బొంబాయిలో కార్మిక వర్గ నివాసస్థలమైన పరేల్ (Parel)లో జరుపుటకు నిశ్చయించారు. అప్పుడు ఎస్. వి. రంగయ్య ఆంధ్రా విద్యార్థి డెలిగేషన్ నాయకుడు. సత్యపాల్ డాంగే ఆలిండియా నాయకుడు. ప్రెసిడెంట్ గౌతం చటోపాధ్యాయ జనరల్ సెక్రటరీ. కాన్ఫరెన్స్‌లో దేశంలో అన్ని రాష్ట్రాలనుండి విద్యార్థి నాయకులు రిపోర్టు చదివారు, సభలో మాట్లాడినారు. కాని, ఆంధ్ర నుండి నరసయ్యగారు నోరు విప్పలేదు, నోరున్న నాబోటివారిని మాట్లాడవద్దని నిషేధించాడు.

బహిరంగ సభకు అప్పటి బొంబాయి రాష్ట్రానికి ప్రధానమంత్రిగా వున్న మొరార్జి దేశాయ్ నిషేధాజ్ఞ జారీ చేశాడు. మేము ఆ నిషేధాన్ని ధిక్కరించి, వేదిక వరకు వెళ్ళవలెనని నిశ్చయించాము. పోలీసులు లాఠీలతో తరుముతుంటే కొందరు మాత్రం లోనికి చొచ్చుకునివెళ్ళాము. వెంటనే బాష్పవాయు ప్రయోగం అర్జునుడు బాణవర్షాన్ని కురిపించేలాగా కురిపించారు. దేహమంతా మండి, కళ్ళు మూతబడినంత వరకు బాష్పవాయువు ప్రయోగం సాగింది. అన్ని అవస్థలలోనూ తీర్మానాన్ని ఎలాగో చదివి ముగించాము.

తర్వాత విద్యార్థి విభాగంలో చర్చించేందుకు రణదీవే, అధికారి మాత్రమే వచ్చారు. జోషిని చూడవలెనని ఎంతో ఉత్సాహంతో వుండిన అందరికీ పెద్ద ఆశాభంగం, దాని తర్వాత సందేహం... ఏదో కుమ్మకులాట జరుగుతున్నదని, జోషి నాయకత్వానికి

ఉపద్రవం వుందని మాత్రం తెలిసింది. తదనంతరం ఫిబ్రవరి 1948లో కలకత్తాలో పార్టీ రెండవ మహాసభ పెద్ద ఎత్తున జరిగింది. దానికి యుగోస్లోవియా నుండి ఆస్ట్రేలియా నుండి సౌభ్రాతృత్వపు ప్రతినిధులుగా హాజరైనారు.

## రణదీవె అతివాద పంథా:

ఆ సభలో రణదీవె ప్రాముఖ్యం వహించి, జోషి దేశంలో పెల్లుబుకుతున్న విప్లవాన్ని నాశనం చేశాడని, పోరాటాలు వస్తున్న చోట వాటిని తన సంస్కరణవాద పోకడలవల్ల నీరు కార్చాడని ఏవేవో ఆరోపణలు చేశాడు. అయినా... అంతవరకు జోషి యొక్క శిష్యులుగా వుండిన మోహన కుమారమంగళం, వావనీసేన్ మొదలైన వారు నిప్పులు కక్కారు. దేశానికి వచ్చింది స్వతంత్రం కాదని, నాటి బూర్జువా వర్గం సామ్రాజ్య వాదులతో పొత్తు పెట్టుకొని భారత ప్రజానీకాన్ని ఏమార్చి, తమ అధికారాన్ని స్థిరపరచుకొన్నారని ఏవేవో బాలారిష్టపు మాటలు పలికారు. దేశంలో విప్లవం కాచుకుని వుందని, వెంటనే ఆయుధాలు సేకరించి తెలంగాణాలో వలె, అక్టోబరు రష్యన్ విప్లవం వలె, ఈ దేశంలో కూడా విప్లవాన్ని తేవాలని రణదీవె పిలుపు నిచ్చాడు. వెంటనే చాలామంది రహస్య జీవనంలోకి వెళ్ళారు. ఎవ్వరు కూడా రణదీవెకు వ్యతిరేకంగా పల్లెత్తుమాట పలకలేదు. జోషి నిస్సహాయుడై, ఒంటరివాడై నిలిచిపోయాడు. భారతదేశాన్ని పూర్తిగా అర్థం చేసుకుని, దానియొక్క సంస్కృతిని జీర్ణించుకున్న వారిలో గాంధీజీ తర్వాత జోషియే అని నా అభిప్రాయం. అలాంటి నాయకుడు హఠాత్తుగా ఒక nonperson అయినాడు.

అపుడు నేను జిల్లా సభ్యుణ్ణి అయినాను. నాతో బస్వారెడ్డి శంకరయ్య, పరుచూరి రామకోటయ్య, కొండా చొండయ్య, ఎలమంద రెడ్డి, సి. పి. సుబ్బయ్యగార్లు, తతిమా మెంబర్లు. ఆకాలంలో ఆయుధాల సమీకరణ పేరిట చాలా విషయాలు జరిగినవి.

## జైలునుండి పరారీ:

అంతలో రాజమండ్రి జైలు నిండింది. చంద్రంగారు, కంభంపాటి సత్యనారాయణ గారు, తుమ్మల వెంకట రామయ్యగారు, గారపాటి సత్యనారాయణగారు, ప్రభాకర చౌదరిగారు, డాక్టర్ చెలికాని రామారావుగారు, నర్రా అంజనేయులుగారు, బస్వారెడ్డి శంకరయ్యగారు, అల్లు రామలింగయ్యగారు (సినీనటుడు), నేడు విజయవాడ మేయర్‌గా వున్న వెంకటేశ్వరరావుగారు, ఎ. కె. గోపాలన్‌గారు మొదలైనవా రందరూ నాకు జైలులో కలిశారు. కొన్ని రోజుల తర్వాత ఎ. కె. గోపాలన్‌ను మేమున్న చోటికి మార్చివేశారు. తర్వాత కొన్ని రోజులకు తెలంగాణా పోరాటంలో ప్రముఖ పాత్ర వహించిన బాంబే ప్రసాద్ వచ్చారు. జైలులో నేను, రామచంద్రపురం వెంకట్రావు వాలీబాల్ తెప్పించి, కొందరు కామ్రేడ్స్‌కు తర్ఫీదునిచ్చాము. మార్క్సిస్టు సిద్ధాంతం మీద క్లాసులు నడపవలెనని సీనియర్ నన్ను కోరారు. అలా జైలులో కార్యక్రమాలు నడుస్తున్నప్పుడు, బయట పోలీసు నిర్బంధాలు, దౌర్జన్యాలు మితిమీరిపోయినాయని రిపోర్టు లొచ్చేవి. మమ్ములను కడలూరు జైలుకు మార్చాలని నిర్ణయించారు. ఆ పరిస్థితులలో సెంట్రల్ కమిటీ నుండి జైళ్ళలో కూడా సాయుధ పోరాటం

సాగించాలని పిలుపు వచ్చింది. అది ఎవరి బుర్రలో పుట్టిన పురుగో తెలియదు కాని, బందీలుగా వున్నవారు, సాయుధులైన పోలీసులు వార్డెన్‌లతో పోరాటమేమిటి – ఆత్మ హత్యకాక?

నన్ను, కుటుంబరావుగారు, గంజి నాగేశ్వరరావుగారు, తుమ్మల వెంకట రామయ్యగారు మొదలగు 22 లేక 23 మందిని రాజమండ్రి నుండి కడలూరికి తరలించారు. నేను, గంజి నాగేశ్వరరావుతో మాత్రం ఎలాగైనా తప్పించుకుని వెళ్తానని చెప్పాను. తాను కూడా వస్తానంటే, నన్ను అంటిపెట్టుకుని వుండమని చెప్పాను. లోపల ఖాకి నిక్కర్ వేసుకుని, పైన గుడ్డ కట్టుకుని వుండమన్నాను. ఒక్కొక్కరిపై ఒక్కొక్క పోలీసు నిఘా. విజయవాడలో చాలాజనం మమ్ములను చూడటానికి వచ్చారు. నేను స్టేషన్‌లో – సమావేశంలో ప్రసంగించాను. అక్కడే తప్పించుకుని దూకుదామనుకున్నాను. కాని, పోలీసువాడొకడు నా ప్రక్కన వచ్చి నిలబడ్డాడు. తర్వాత గూడూరు నుండి వేకువ జామున తిరుపతి ప్రక్క వెళ్ళే రైలుకు మార్చారు. నేను, నా ప్రక్కన కుటుంబరావుగారున్నారు. కాని, గంజి నాగేశ్వరరావు కనిపించలేదు. ఇద్దరు ముగ్గురు నెల్లూరు కామ్రేడ్స్ నన్ను చూచేందుకు వచ్చారు. రైలు మెల్లగా కదిలింది. నేను కిటికీ నుండి క్రిందికి దూకాను. నేలపై పడ్డాను. కట్టుకున్న ధోవతిని తీసి తలమీద వేసుకుని పరుగెత్తాను. గూడూరుకు ఐదారు మైళ్ళ దగ్గర పాజెర్ల కృష్ణారెడ్డి అనే కామ్రేడ్ చిన్న గుడిశలో ఆయన భార్య శంకరమ్మతో కాపురం ఉండేవాడు. అది ఎవ్వరూ సందేహించని చోటు. సి. సి. సుబ్బయ్య ఇంటికిగాని, అంతోటి రమణయ్య ఇంటికి గాని వెళితే చిక్కిపోవచ్చునని తొందరగా ఆలోచించి కృష్ణారెడ్డి ఇంటికి వెళ్ళాను. ఆయనకు ఆశ్చర్యం. ఇక సరే, పార్టీకి తెలిసిపోయింది. తర్వాత నన్ను మంచి జాగ్రత్తతో వేరు డెన్‌లకు తీసుకుని వెళ్ళారు. ఆ కాలంలో పార్టీ కామ్రేడ్స్‌కు రహస్యమైన చోట్లలో రాజకీయ పాఠాలు చెప్పడం, విద్యార్థి కామ్రేడ్స్‌కు సిద్ధాంతం మీద క్లాసులు రహస్యంగా జరిపాము. మద్రాసులో మా పెద్దతల్లి ఇంటికి వెళ్ళినపుడు దొరికిపోయాను. చిత్రహింసలు, తిట్లు ఓర్చి, ఎవరి ఆచూకి చెప్పలేదు.

## జైలుగోడలమధ్య ఆత్మాహుతి:

తర్వాత పార్టీలో ఎన్నో మార్పులు, ఎందరో కాల్చబడ్డారు. కడలూరులోనే అనుమర్లపూడి సీతారామారావు కాల్చబడ్డారు. బయట తప్పించుకున్నవారిలో నర్రా ఆంజనేయులు, చింతా సత్యనారాయణదాసు కాల్చి చంపబడ్డారు. తెలంగాణా సాయుధ పోరాటానికి కూడా అనైక్యత ఏర్పడింది. తర్వాత విషయాలు అందరికీ తెలిసినవే. సెక్టేరియన్ దృక్పథాలతోటి పార్టీ పెద్దగా గాయపడింది. నేను అలా జీవితాన్ని చూచుకొనవలసి ఏర్పడినది. మద్రాసులో ఎం.ఎ. చదివి, కాలేజీలో ఎంతో కష్టం మీద ఉద్యోగం సంపాదించాను. నేను కమ్యూనిస్టుగా జైలుకు వెళ్ళానని ఆ కాలంలో కాలేజీలలో లెక్చరర్ పదవి నిచ్చేవారు కారు. తర్వాత ఏదో విధంగా కష్టపడ్డాను. చాలా గ్రంథాలు వ్రాశాను. అన్నింటిలో చాలా వరకు మార్క్సిస్టు దృక్పథమే చూపాను. జవహర్‌లాల్ నెహ్రూ యూనివర్శిటీ, ఢిల్లీలో నాకు ప్రొఫెసర్

ఉద్యోగం దొరికింది. అప్పటికి కమ్యూనిస్టులపై వున్న గ్రహణానికి విముక్తి జరిగింది. నెబ్రాస్కా యూనివర్శిటీలో కొన్ని సంఘటనలలో పాల్గొన్నాను.

Marxism and Political Science, Marxism and Indian Polity, Contemporary Marxim and India, Chile-Travail and Trosedy అనే గ్రంథాలు ముఖ్యంగా మార్క్సిస్టు సిద్ధాంతాలపై వ్రాయబడినవి. పార్టీ అరవైయవ సంవత్సర వర్ధంతికి కామ్రేడ్ రాజశేఖరరెడ్డిగారు నన్ను CPI's Contribution to Social-Political Ideas in Indian Politics అనే విషయంపై పుస్తకం రాయమన్నారు. రాశాను. నాకు పార్టీ కంభంపాటి సత్యనారాయణ వర్ధంతిలో పురస్కారం ఇచ్చి గౌరవించింది. అదే చాలా గొప్ప గుర్తింపు. తర్వాత 70 వ వర్ధంతికి కూడా పార్టీలోని భీష్మ ద్రోణ కృపాచార్యుల వంటి నాయకులతోబాటు నన్ను గౌరవించి ఆదరించారు. ఇది చాలా గొప్ప విషయం.

## ప్రజల తప్పులేదు:

పార్టీ చీలి, ఛిన్నా భిన్నాలుగా కావడం చాలా విషాదకరం. కాని, మరల ఆశాజ్యోతులు కనిపిస్తున్నవి. పార్టీలో పూర్వకాలపు నైతిక ప్రవర్తన, త్యాగనిరతి, సేవాపరాయణత్వం, నిరాడంబర జీవితం మరల కనిపించినట్లయితే, మరల ప్రజల ఆదరణ లభిస్తుందనే దానికి సందేహం లేదు. మనదేశంలో పైచెప్పిన అంశాలకు చాలా విలువ వున్నది. పార్లమెంటరీ పోరాటాన్ని వదలకుండా, ప్రజా సంఘాలు నిర్మించి, వాటిలో ప్రజల వివిధ సమస్యలను పరిష్కారం చేస్తూ ప్రభుత్వానికి ఒక ప్రత్యామ్నాయ కేంద్రంగా ప్రజల హక్కులను సర్వదా కాపాడుతుండవలెనని నా అభిప్రాయం. పార్టీని అపకీర్తిలోనుండి ఎంతో కష్టపడిన కాలంలో బయటికి తీసేందుకు చేసిన కృషి అతీతం. అలాంటి పరిస్థితులు ఇప్పుడు లేవు. పార్టీని ఎవ్వరూ దేశద్రోహులని అనరు. కమ్యూనిస్టు సోదరా అని వ్యంగ్యంగా అశ్లీలాలుగా చెప్పరు. మార్క్సిస్టు మేధావి అంటే గౌరవం పెరిగింది. ఇలాంటి పరిస్థితిలో చొరవ తీసుకొని, అన్ని కమ్యూనిస్టు పార్టీలు ఐక్యంగా నడిచినట్లయితే విజయం తథ్యం.

కొన్ని విషయాలు నాకు తోచినవి చెప్పి ముగిస్తాను. ఇది ఆంధ్ర గురించి. నేను నెల్లూరులోనే ఎన్నో పోరాటాలను గురించి చెప్పాను. ఇక ఆంధ్ర దేశమంతటిలో ఇలాంటివి ఇంకా ఎన్నో జరిగినవి. కానీ వాటిని గురించి దేశ వ్యాప్తంగా ఎలాంటి గుర్తింపు లేదు. ఆ కాలపు కమ్యూనిస్టు వారపత్రిక Peoples war లోనే బెంగాల్ గురించి, కేరళ గురించి, పంజాబ్ గురించి, మహారాష్ట్ర గురించి వ్యాసాలు వుండేవి. ఆంధ్ర గురించి ఒక్కటి గూడా వుండదు. ఆంధ్ర నుండి ఎవ్వరూ పార్టీలో మేధావులుగా ఎదగలేదు. ఆంధ్ర గురించి పరిశోధక గ్రంథాలు కూడా లేవు. ఏదో చిన్న చిన్న పోరాటాలు బెంగాలులో వుంటే వాటిని గూర్చి ఎన్నో వుంటవి. నేను ఇంతకుముందు పేర్కొన్నట్లు ఎ.ఐ.ఎస్.ఎఫ్.లో కూడా ఆంధ్రా నుండి ఎవ్వరూ వక్త వుండేవారు కాదు. మనవాళ్ళు అనుకునేవారు – అన్ని రాష్ట్రాలనుండి వక్తలు వస్తుంటే ఆంధ్రనుండి ఎవ్వరూ మాట్లాడలేదని. కమ్యూనిస్టు ఉద్యమమే కాదు, జాతీయ ఉద్యమాలలో కూడా అంతే. అల్లూరి సీతారామరాజును గురించి, చీరాల పేరాల సత్యాగ్రహం గురించి, పెదనందిపాడు తిరుగుబాటు గురించి దేశంలో

చాలామందికి తెలియదు. తెలంగాణా సాయుధ పోరాటం ఒక్కటే దేశమంతటా తెలిసిన తెలుగువారి చరిత్రలో ఘట్టం.

మార్క్సిజం గురించి రెండు ముక్కలు: ఇది శాస్త్రబద్ధమైన, మానవ సమాజ విశ్లేషణ చేసే సిద్ధాంతం, ఏకైక సిద్ధాంతం. కొన్ని మేధస్సుకు పనికొచ్చే తత్వ సిద్ధాంతాలున్నవి. కాని, అవి మానవ సమాజంలోని వాస్తవిక సంఘటనలతో సంబంధం లేని సిద్ధాంతాలు – శంకరుని అద్వైతము, కాంట్ యొక్క సిద్ధాంతము. హెగెల్ యొక్క Speculative Theories. మార్క్సిజం వెలుగులో మేధా కావాలి, ఆచరణ యోగ్యం కావాలి. ప్రపంచంలోని దోపిడీ విధానాన్ని మార్చి, జనకళ్యాణాన్ని శాశ్వతంగా సాధించాలనే గమ్యం. ఇది శాస్త్రీయంగా పరిశీలించాలనేదే ముఖ్యం. తర్వాత, దేశకాల పరిస్థితులను అర్థం చేసుకుని, తదనుగుణంగా సిద్ధాంతాన్ని నిర్వచనం చేసుకొనవలెననే శాస్త్రం. ఎప్పటికైనా, ఏ దేశంలోనైనా ఇది ఒక్కటే సత్యం, దీనికి తిరుగులేదు అనే మతఛాందసత్వం దీనికి విరుద్ధం.

తర్వాత – మానవ జీవితంలో ప్రతి అంశంలోను సరియైన దృక్పథం అవలంభించాలని దాని ప్రయత్నం. పిడివాదం, వితండవాదం, మతఛాందసం మొదలగునవి మానవాభ్యుదయానికి అవరోధములు. ఇది మన హృదయానికి, మెదడుకు తృప్తికలిగించే సిద్ధాంతం. ఎంతోమంది స్వార్థరాహిత్యంతో త్యాగాలు చేసి, తమ హృదయ ఆందోళనతో తీర్చుకున్నారు. ఈ తత్వాన్ని బాగుగా అర్థం చేసుకుని, పరిశోధనలు చేసి, అన్ని శాస్త్రాలలో జ్ఞానాన్ని వృద్ధిచేసినవా రున్నారు. ఇది మార్క్సిజంలో వున్న ప్రత్యేకత. అందువల్లనే నేను దీనికి ఆకర్షించబడ్డాను.

## మార్క్సిజాన్ని సృజనాత్మకంగా అభివృద్ధి చేసుకోవాలి:

ఇంకొక విషయం గుర్తుంచుకోవాలి: మార్క్స్, ఎంగెల్స్ 19 వ శతాబ్దంలో ఆ పరిస్థితులను బట్టి, అప్పటి శాస్త్రీయ విజ్ఞానాన్ని ఆధారంగా చేసుకుని వ్రాశారు. వారు తాము రాసిన దానితో నిలుపుకొనకూడదు. ఇంకా విజ్ఞానాన్ని ముందుకు తీసుకుని పోవాలన్నారు. నేటి పరిస్థితులు వేరే... ఈ శతాబ్దంలో కీలక మార్పులు జరుగుతున్నవి. Satelite communication, కంప్యూటర్లు, ఇంటర్‌నెట్లు మొదలగు వాటితో ప్రపంచమే మారిపోతున్నది. పూర్వపు పెట్టుబడిదారీ విధానంగాని, అప్పటి Proletarict కాని నేడు లేవు. ఈ పరిస్థితులకనుగుణంగా సిద్ధాంతాన్ని అవగాహన చేసుకోవాలేగాని అదంతా అవకాశవాదమని, ఏదో పేరు పెట్టినట్లయితే ముందుకు సాగము. వెనుకబడితే వెనుకేనోయ్. పాదపూజకాదు – ఆ విశాల సిద్ధాంతాల భుజస్కంధాలపైనెక్కి పైకి వెళ్ళాలి.

★ ★ ★

# శ్రీ వి.ఆర్. బొమ్మారెడ్డి



1917లో కృష్ణాజిల్లా తేలప్రోలులో నేను ఒక ధనిక రైతు కుటుంబంలో జన్మించాను. ఆ రోజుల్లో మా గ్రామంలో ఇంగ్లీషు చదువుకున్నవారే లేరు. ముగ్గురు, నలుగురు కుటుంబాలవారు తమ బిడ్డలను పైచదువులకు పంపించి వారిని ఉన్నతోద్యోగులను చేయాలనే ఆకాంక్షతో నాతోసహా నలుగురిని గన్నవరం హైస్కూలుకు పంపించారు. అందులో స్కూలు ఫైనల్ పరీక్ష ప్యాసైనది నేను ఒక్కడినే. ఆ తరువాత నేను బందరులో హిందూ కాలేజీలో ఇంటర్ చదవడానికి వెళ్లడం సంభవించింది.

గన్నవరం హైస్కూలులో చదువుతున్న రోజుల్లోనే ఆంధ్రపత్రిక చదవడంతో దేశ స్వాతంత్ర్యానికై పోరాడుతున్న కాంగ్రెస్ పట్ల అభిమానం ఏర్పడింది. బందరు వెళ్ళిన తరువాత కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ పట్ల అభిమానం పెరిగింది. ఆనాడు డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి ఇంటి వరండాలో ఆయనకు వచ్చే అనేక పత్రికలు ఇతరులు చదువుకొనేందుకు వీలుండేది. దాదాపు ప్రతి రోజూ అక్కడికి

వెళ్ళి వివిధ పత్రికలు చదవడంతో రాజకీయాల పట్ల శ్రద్ధ పెరగడం, సోషలిస్టు పార్టీ నాయకులైన జయప్రకాష్ నారాయణ్, అశోక్ మెహతా లాంటివారి రచనలు, ప్రకటనలు చదవడంతో సోషలిజంపై అభిమానం పెరిగింది. అప్పుడు జయప్రకాష్‌తోపాటు ఆంధ్రలో కాంగ్రెస్ సోషలిస్టుపార్టీ కార్యదర్శిగా వున్న సుందరయ్యగారి ఉపన్యాసాలు వినడంతో సోషలిస్టు రాజ్యం ఏర్పడితేనే భారతదేశ ప్రజలకు నిజమైన స్వాతంత్ర్యం లభించుతుందనే అభిప్రాయం నాలో గాఢంగా ఏర్పడింది.

ఈ పరిస్థితుల్లో నోబిల్ కాలేజీలో చదువుతున్న ఒక విద్యార్థితో పరిచయం ఏర్పడటంతో ఆయన, వారెవరూ నిజమైన సోషలిస్టులు కారనీ; డాంగే, అజయ్‌ఘోష్, పి. సి. జోషీ లాంటి కమ్యూనిస్టు పార్టీ నాయకులే నిజమైన సోషలిస్టులని నాకు నచ్చజెపుడం సంభవించింది. అప్పటినుండి కమ్యూనిస్టు పత్రికైన 'నేషనల్ ఫ్రంట్'ను రెగ్యులర్‌గా చదువుతూ వుండేవాడిని. బి.ఎ. చదివేందుకు మద్రాసు వెళ్ళిన తరువాత కూడా సోషలిస్టు సాహిత్యం, నేషనల్ ఫ్రంట్ పత్రికను రెగ్యులర్‌గా చదివేవాడను. కమ్యూనిస్టుల మీటింగులకు, తమిళం అర్థంకాకపోయినా రెగ్యులర్‌గా వెళ్ళేవాడిని. ఆనాడు రహస్య జీవితం గడుపుతున్న కంభంపాటి జూనియర్, మోహన్‌కుమార మంగళం లాంటివారు అప్పుడప్పుడు మేము వుండే గదుల్లో తలదాచుకొనేవారు. ఆ రోజుల్లోనే – విశాలాంధ్ర జనరల్ మేనేజర్‌గా పనిచేసిన గోళ్ళ రాధాకృష్ణమూర్తి గారితో పరిచయం ఏర్పడింది. అప్పు డాయన లా కాలేజీలో చదువుతూ కమ్యూనిస్టు ఉద్యమంలో పనిచేసేవారు.

బి.ఎ. పూర్తిచేసుకుని ఉద్యోగానికి యత్నించకుండా రాజకీయాల్లో వుండటంతో నన్ను చదివించి ఉన్నతోద్యోగిని చేయాలని కాంక్షించిన మా నాన్నగారు వ్యధ చెందారు. కాంగ్రెస్ తన కుమారుణ్ణి పాడుచేసిందనే క్రోధంతో వుండేవారు. ఆయన 1942లో చనిపోవడంతో బాహాటంగానే కమ్యూనిస్టు కార్యకలాపాల్లో పాల్గొని, పక్క గ్రామాల్లో జరిగే సెల్ సమావేశాలకు హాజరుకావడం, కొంతకాలం గన్నవరం తాలూకా పార్టీ కార్యదర్శికి సహాయకారిగా గన్నవరంలో మకాం పెట్టడం జరిగింది. ప్రజాశక్తి వారపత్రికకు వార్తలు, వ్యాసాలు పంపుతూ వుండేవాడిని.

1945లో ప్రజాశక్తిని దినపత్రికను చేసిన తరువాత అందులో సబ్ ఎడిటర్‌గా పనిచేసే అవకాశం కలిగింది. ప్రజాశక్తినగర్‌లో కాపురం వుండటంతో రాష్ట్ర నాయకులతో దగ్గర సంబంధాలు ఏర్పడినాయి. పత్రిక నిషేధించబడిన తరువాత ఆనాటి 'ఆనందవాణి' పత్రికలో అంతర్జాతీయ సమస్యలపై అప్పుడప్పుడు వ్యాసాలు రాస్తూ, మా ప్రాంతాలలో రాజకీయ తరగతులను నిర్వహించేవాడిని. పార్టీపై నిర్బంధం పెరగడంతో నాయకులు చాలామంది అజ్ఞాతంలోకి పోవడంతో రాజకీయ తరగతులను నిర్వహించడం కూడా రహస్యంగా జరిగేది. అలాంటి రాజకీయ తరగతులు గన్నవరం తాలూకా కపిలేశ్వరపురం వద్ద గల ఒక కుగ్రామంలో జరుగుతూ వుండగా, రాజకీయ పక్షపత్రికను నిర్వహించడానికి రావలసిందిగా పార్టీ నాయకత్వంనుండి నాకు కబురు అందింది. ఎర్రజెండాల రచయిత గంగినేని వెంకటేశ్వరరావు 'జనత' అనే పత్రికకు డిక్లరేషన్‌ను తీసుకొని, దాన్ని వాడుకోవలసిందిగా పార్టీకి యిచ్చి, తాను 'లా' చదవడానికి విశాఖ వెళ్ళిపోయారు. ఆ పత్రికను నేను,

'మా భూమి' నాటకకర్త వాసిరెడ్డి భాస్కరరావుతో కలిసి ఒకటిన్నర సంవత్సరం జయప్రదంగా నిర్వహించాను. పత్రిక మేనేజర్‌గా ఆనందరావుగారు వుండేవారు. జనత పత్రిక ముఖచిత్రం మార్క్స్, ఎంగెల్స్, లెనిన్, స్టాలిన్ బొమ్మలతో వుండేది. ఉద్యమ వార్తలపై నిషేధం వున్నందున ఆ పత్రిక హెచ్చుగా సిద్ధాంత వ్యాసాలను, అంతర్జాతీయ సమస్యలపై వ్యాసాలను ప్రచురించేది. దాదాపు అన్నీ అనువాదాలే. విజయవాడలో నిర్బంధం తీవ్రతరం కావడంతో, మమ్మల్ని కూడా నిర్బంధించుతారనే అనుమానంతో పత్రికను మూసివేసి, మద్రాసుకు వెళ్ళి అక్కడ పనిచేయవలసిందిగా పార్టీ మమ్మల్ని ఆదేశించింది. అక్కడ ఏదైనా పత్రికను పెడదామనే ఆలోచన వుంది. ఈలోపున ఒక లా విద్యార్థి పేరుతో 'సందేశం' అనే పేరుతో ఒక వారపత్రికను మన పార్టీ నిర్వహించడం ప్రారంభించింది. అందులో పనిచేసేవారు ప్రభుత్వానికి కమ్యూనిస్టులుగా తెలిసినవారు కాదు. రహస్యంగా వుంటూ కంభంపాటి సీనియర్ లాంటివారు వ్యాసాలు రాస్తూ వుండేవారు. నన్ను తాపీ ధర్మారావుగారు నడిపే జనవాణిలో పనిచేయమన్నారు. ఆ పత్రికలో నేను; తాపీవారి కుమారుడు, అంతకుముందు ప్రజాశక్తిలో పనిచేసిన తాపీ మోహనరావు పనిచేసేవారం. రహస్యంగా వున్న నీలం రాజశేఖరరెడ్డి, ఎస్. వి. నరసయ్య, కంభంపాటి సీనియర్‌లతో మాకు సంబంధం వుండేది. మాకు – వారికి మధ్య కొరియర్‌గా ఎ. కె. ఆర్. బి. కోటేశ్వరరావుగారు వ్యవహరించేవారు.

జైలులోగాని, అజ్ఞాతవాసంలోగాని వుండేవారికంటే బయట వుండి పార్టీ కోసం పనిచేసే మాలాంటివారి పరిస్థితి దినదినగండంగా వుండేది. మేము ఎవరితో కలుస్తున్నామో తెలుసుకొని, నాయకులను పట్టుకోవడానికి మాపై సి.ఐ.డి. నిఘా ఎక్కువగా వుండేది. అంతేగాక, ఆంధ్రలో నిర్బంధం మరీ తీవ్రం కావడంతో కొంతకాలం తలదాచుకోవడానికి మద్రాసుకు వచ్చేవారికి వసతి ఏర్పాటుచేసే బాధ్యత కూడా మాకు వుండేది. ఎప్పుడు మమ్మల్ని అరెస్టుచేసి చంపుతారో అన్న పరిస్థితి వున్నా, ఆ రోజుల్లో మాకు ఉద్యమంపై వున్న అకుంఠిత విశ్వాసం మా ధైర్యాన్ని దీక్షను సడలనిచ్చేది కాదు. ఒకసారి ఒక అతను కొరియర్‌నని ఒక లేఖ తీసుకొని వచ్చి నేను కాపురమున్న ఇంటిలో పది రోజులు మకాం చేశాడు. తనకు కావలసిన సమాచారం అందించినందున వెళ్ళిపోయాడు. అతడు పార్టీ కొరియర్ అనే భావం మాకు వుంది. ఆ తరువాత జైలులో నిర్బంధించబడినవారిద్వారా అతడు సి.ఐ.డి. అని మాకు తెలిసింది. అలాంటి ప్రాణాంతకమైన అనేక ఘటనలు ఆ రోజుల్లో మాకు ఎన్నో ఎదురయ్యేవి.

ఆ రోజుల్లో దొరికిన కమ్యూనిస్టు నాయకులను, కార్యకర్తలను చంపివేయడం మామూలే. నీలం రాజశేఖరరెడ్డి పట్టుబడినపుడు, ఆయన అరెస్టు వార్తను దినపత్రికల్లో ప్రచురించడానికి మేము ప్రయత్నించి విఫలమయ్యాం. అరెస్టు అయినట్లు వార్త వేస్తే ఇంకా ఆయనను చంపడం ప్రభుత్వానికి సాధ్యంకాదు. కేసు పెట్టడమో, డిటెన్యూగా పంపడం జరుగుతుంది. కనుకనే నాకున్న సంబంధాలతో, పట్టుబడినవారి అరెస్టు వార్తను పత్రికలలో వేయించడానికి యత్నించేవారం ఆ రోజుల్లో.

తెలంగాణా పోరాటం విరమించబడి, ఆంధ్రలో తిరిగి పనిచేయడానికి పరిస్థితులు ఏర్పడగానే నేను తిరిగి విజయవాడకు వచ్చేసి, తిరిగి ప్రారంభించబడిన ప్రజాశక్తి వారపత్రికలో పనిచేయడం ప్రారంభించాను. ఎన్నికల అనంతరం ప్రజాశక్తిని ఆపివేసి, దాని స్థానంలో విశాలాంధ్ర దినపత్రికను ప్రచురించగా, దాదాపు 12 ఏండ్లు అందులో – పార్టీ చీలిపోయేంతవరకు పనిచేశాను.

మార్క్సిస్టు పార్టీ తరపున జనశక్తి వారపత్రిక నిర్వహించబడేది. విశాలాంధ్ర నుండి విడుదలైన తరువాత అకస్మాత్తుగా జనశక్తి ఎడిటర్, మేనేజర్‌తో సహా పార్టీ అగ్ర నాయకులను అరెస్టు చేయడంతో జనశక్తి పత్రిక నిర్వహణను, పార్టీ నాయకత్వం నాకు అప్పగించింది. నాయకులు విడుదలైన తరువాత జనశక్తిని దినపత్రికగా నిర్వహించడం, దాన్ని ఆ తరువాత నక్సలైట్లు కైవసం చేసుకోవడంతో పార్టీకి వేరే పత్రిక అవసరమైంది.

ప్రజాశక్తి పత్రికకు నాయకత్వ ఆదేశంపై నేనే డిక్లరేషన్ తీసుకొన్నాను. ఆ తరువాత ప్రజాశక్తి వారపత్రికగా, త్రైవారపత్రికగా, దినపత్రికగా ప్రచురించబడటం, అందులో నేను పనిచేయడం అందరికీ తెలిసిందే.

వృద్ధాప్యం వలన, అనారోగ్య కారణాల వలన, గత సంవత్సరం ఆఖరులో హైదరాబాద్‌లో జరిగిన మార్క్సిస్టు పార్టీ రాష్ట్ర మహాసభలో అంతకుముందు నుండి రాష్ట్ర కమిటీ సభ్యుడిగా వున్న నేను చిర్రావూరి లక్ష్మీనరసయ్య, అట్లూరి శ్రీమన్నారాయణ, బాలాజీదాస్ మొదలగువారితో కలిసి కమిటీ నుండి రిలీవ్ అయినాను. ఆ తరువాత దినపత్రికలో పనిమాని, ప్రచురణాలయం తరపున గ్రంథాల ప్రచురణ బాధ్యతను ఇప్పుడు తీసుకున్నాను.

అయితే, నా కమ్యూనిస్టు జీవన యాత్రలో చెప్పుకోదగిన ముఖ్యమైన విషయమేమంటే – 50 సంవత్సరాలుగా విరామం లేకుండా కమ్యూనిస్టు పార్టీ నిర్వహించిన పత్రికల్లో వరుసగా పనిచేయగలగడం – కమ్యూనిస్టుగా ఎవ్వరికీ కలుగని గౌరవం నాకు లభించినందుకు గర్వపడుతున్నాను.

పార్టీ చీలిన తరువాత 50 పుస్తకాలను అనువదించడమో, స్వంతంగా రాయడమో జరిగింది. కమ్యూనిస్టు పత్రికల నిర్వహణలో మద్దుకూరి చంద్రశేఖరరావు, కంభంపాటి సీనియర్, మోటూరు హనుమంతరావు, తుమ్మల వెంకటరామయ్య, విద్వాన్ విశ్వం, సెట్టి ఈశ్వరరావు, అనిసెట్టి సుబ్బారావు, తాపీ మోహన్‌రావు, ఏటుకూరి బలరామమూర్తి, పరకాల పట్టాభిరామారావు లాంటివారితో కలిసి పనిచేసే అవకాశం కలిగినందుకు నేను ఎంతగానో సంతృప్తిపడుతున్నాను.

అయితే, నా జీవితం చివరి వరకూ కమ్యూనిస్టుగా ఉద్యమానికి సంబంధించి ఏదో ఒక కార్యక్రమంలో శక్తిమేరకు కృషి చేయాలనే ఆకాంక్షతో వున్నాను.

నా కమ్యూనిస్టు జీవనయాత్రలో అనేక సంఘటనలు జరిగినా, స్థలాభావంతో క్లుప్తంగా పేర్కొన్నందుకు మన్నించగలరు.

★ ★ ★

# శ్రీ నిడమర్తి ఉమారాజేశ్వరరావు



మాది పశ్చిమగోదావరి జిల్లాలోని నిడమర్రు గ్రామం. మా తండ్రి గ్రంథాలయోద్యమ పితామహుల్లో ఒకరూ, జాతీయవాదీ, సంఘసంస్కారీ అయిన నిడమర్తి లక్ష్మీనారాయణ పంతులుగారు. మాది సంపన్న కుటుంబం. 17-10-1923లో పుట్టిన నేను 1928లో 15 రోజుల వ్యత్యాసంతో తల్లిదండ్రులిద్దర్నీ కోల్పోవడంతో మా రెండవ అన్న అశ్వినీకుమార్ దత్తుకి అత్యంత సన్నిహితుణ్ణయాను.

మా యింట్లో రాట్నాలు, తకిలీలు ఎన్నో వుండేవి. బాల్యంలోనే రాట్నం వడుకుతుండేవాడిని. మా ప్రాథమిక పాఠశాలలో ఉప్పు సత్యాగ్రహం సందర్భంగా ఉప్పు పంచిపెట్టడం, ఖిలాఫత్ ఉద్యమ సందర్భంగా గ్రామ వీధుల్లో "హిందూ మౌలానా, డెండా మందానంద మొందింపరయ్యా", గరిమెళ్ళ "మాకొద్దీ తెల్ల దొరతనము" వగైరా జాతీయ గీతాలు పాడుతూ తిరగడమూ గుర్తు.

. 1934, 1935 సంవత్సరాల్లో గుంటూరులో ఇంటర్ చదివిన మా అన్న అశ్వినీకుమార్ దత్తుగారికి భయంకరాచారి - గ్రూపు సభ్యులతో సాన్నిహిత్యమూ, సోషలిస్టు భావాలతో సంపర్కమూ కలిగాయి. ఆ దశల్లో అశ్వినీకుమారదత్తు నా

చేత వినాయక సావర్కార్ జీవితం వగైరా పుస్తకాలు చదివించాడు. 1935లో నన్ను తనతో స్మశానికి తీసుకువెళ్ళి సూర్యుడికి ఎదురుగా నిలబెట్టి, దేశ స్వాతంత్ర్యం కోసం, సోషలిజం కోసం జీవితం అర్పిస్తానని ప్రమాణం చేయించాడు.

1936లో మా అన్నలు దత్తు, సత్యనారాయణ గార్లతోబాటు నేనూ విశాఖపట్నం వెళ్ళి థర్డ్‌ఫారమ్‌లో చేరాను. దత్తు బి.కామ్.లో, సత్యనారాయణ ఇంటర్‌లో చేరారు. దత్తుగారు విశాఖనగరంలో మొదటి కమ్యూనిస్టు సెల్లులో సభ్యులు. అబ్బూరి రామకృష్ణారావు, అత్తలూరి నరసింహారావు, దరిశి చెంచయ్య ప్రభృతులు యితర సభ్యులు. డాక్టర్లు కుప్పా వెంకట్రామ శాస్త్రి. ఐ. వి. చలపతి నాయుడు, గద్దె రామకోటేశ్వరరావు, సి. సూర్యనారాయణ ప్రభృతులు జాలర్ల కోసం నడిపిన రాత్రి పాఠశాలలో నేనుకూడా పాఠాలు చెప్పాను. నేను రాజకీయ పుస్తకాలు విశేషంగా చదువుతూండేవాడిని.

1936లో విశాఖపట్టణం బీచిలో జరిగిన హార్బర్ వర్కర్స్ మీటింగులో, విశాఖలో మొట్టమొదటి సారిగా ఎర్రజెండాను నాచేత ఎగరవేయించారు. తుమ్మల వెంకట్రామయ్యగారి "ఎగరాలి ఎగరాలి మన ఎర్రజెండా" పాట పాడి, పదివేలమంది పాల్గొన్న ఆ సమావేశంలో ఎర్రజెండాను నేను ఎగరేశాను. ఆనాటి నుంచే నన్ను నేను వయస్సుతో ప్రసక్తి లేకుండా ఎమోషనల్‌గా పార్టీ సభ్యుడిగా పరిగణించుకొంటూ వచ్చాను. కరపత్రాలు పంచేవాడిని. రహస్య కామ్రేడ్స్ సమావేశాలు జరుగుతుండగా, సి.ఐ.డి.ల ఆచూకీ కనిపెట్టి, కామ్రేడ్స్‌కి ఉప్పందించడం వగైరాలు చేస్తూండేవాడిని.

ఉడకబెట్టిన చిలగడ దుంపల టిఫిన్లతోనూ, గోధుమ రొట్టెలతోనూ, ఒక్కొక్క క్యారియర్ నుంచి ముగ్గురు నలుగురు భోజనం చేస్తూనూ, మిగిల్చిన డబ్బులతో పార్టీ, ప్రజాసంఘాల కార్యకలాపాలను నిర్వహిస్తూండేవారు కామ్రేడ్స్ ఆ రోజుల్లో.

1937లో కామ్రేడ్ చండ్ర రాజేశ్వరరావు గారు బెనారెస్ నుంచి విశాఖ వచ్చి వైద్య కళాశాలలో చేరాక, ఆయనా, మా నిడమర్తి సోదరులం ముగ్గురం ఎ.వి.యస్. కాలేజి డౌన్‌లోని ఉత్కల్ సమాజ్‌లోని ఓ పెద్ద గదిలో కలిసివుండేవాళ్ళం. ఆ గది విశాఖలో పార్టీ, ప్రజా సంఘాల కార్యకలాపాలకు కేంద్రంగా వుండేది. దత్తుగారు ఆంధ్ర యూనివర్శిటీలో బి.కామ్. చదువుతూ, విద్యార్థుల సమ్మెకి నాయకత్వం వహించి, దరిమిలా సి. ఆర్. రెడ్డి చేత డిబార్ చెయ్యబడ్డారు. ఆ రోజుల్లో మహీధర రామమోహన్‌రావుగారు విశ్వసాహిత్యమాల పుస్తకాలు వేస్తూండేవారు.

సి. ఆర్. మఖ్దూమ్ భవన్ నుంచి 17–6–1993న రాసిన లేఖలోని మాటలు యిక్కడ ఉదహరించడం అప్రస్తుతం కాదనుకుంటాను. "ప్రియమిత్రులు ఉమారాజేశ్వరరావు గారికి, అశ్వనీకుమారదత్తు గారితో మనం విశాఖపట్నంలో ఉన్నప్పుడే నాకు పరిచయం. దత్తుగారు విశాఖపట్నంలోని కమ్యూనిస్టు పార్టీ యూనిట్‌లో సభ్యులుగా ఉండేవారు. చురుకుగా విద్యార్థి సంఘంలో పనిచేసేవారు. మంచి వక్త. పార్టీ తరఫున అప్పుడప్పుడు బహిరంగసభలు పెట్టేవాళ్ళం. చాలా ఉద్వేగంగా మాట్లాడి ప్రజలను ఉగ్రూతలూగించేవారు. 1937 ఎన్నికలలో అందరం చురుకుగా పనిచేశాం. జస్టిసు పార్టీ ప్రతినిధియైన భానోజీరావుగారికి వ్యతిరేకంగా కాంగ్రెస్ తరఫున తెన్నేటి విశ్వనాథంగారు నిలబడ్డారు. జస్టిస్ పార్టీ గుండాయిజాన్ని

వ్యతిరేకించి విద్యార్థులు కాంగ్రెసును గెలిపించారు. అందులో మేమూ గణనీయమైన పాత్ర నిర్వహించాము. – చండ్ర రాజేశ్వరరావు."

సంపన్న కుటుంబాల నుంచి వచ్చిన సి. ఆర్. గారూ, మా సోదరులం బేడా అర్ధణా టిక్కెట్టుతో సినిమాలు చూసి, పార్టీ కోసం డబ్బు మిగిల్చే వాళ్ళం. దత్తుగారు తన ర్యాలీ సైకిలు అమ్మి, సి. ఆర్. యింటినుంచి దండిగా వచ్చే డబ్బుతోనూ పార్టీ కార్యకలాపాలు నిర్వహించేవారు. సర్వేపల్లి రాధాకృష్ణగారు రహస్యంగా లండన్ నుంచి ఒడలో చేరవేసిన సోషలిస్టు సాహిత్యాన్ని అబ్బూరి రామకృష్ణరావుగారి ద్వారా ఆంధ్ర విశ్వవిద్యాలయం నుంచి తెచ్చి చదువుతుండేవారు.

1937 చివర్లో సి. ఆర్. ఆంధ్ర పార్టీ కేంద్రానికి వెళ్ళిపోయిన దరిమిలా మా సోదరులం, పి. సి. తరపున విశాఖ వచ్చిన కొత్తమాసు సత్యనారాయణగారు గోకుల్దాస్ లాడ్జికి మారాం. అప్పటినుంచి పార్టీ పత్రికలు, సాహిత్యం పంపిణీకీ తదితర కార్యకలాపాలకీ అది కేంద్రమైంది. కొమ్మారెడ్డి సత్యనారాయణ, చలసాని వాసుదేవరావుగారల నాయకత్వాన విశాఖ వచ్చిన రైతురక్షణ యాత్రా దళం గోకుల్దాస్ లాడ్జి వరండాల్లో దిగడం నాకింకా గుర్తు. ఆ లాడ్జిలోనే ఓ గదిలో రైల్వే ఆర్.ఎమ్.ఎస్.లో పనిచేస్తూ, పార్టీ రహస్య కార్యకలాపాలు సాగిస్తున్న ఏటుకూరి బలరామమూర్తిగారు వుండేవారు.

దత్తుగారు డిబార్ అయ్యాక నిడమర్రు తిరిగి వెళ్ళిపోతూ మధ్యలో సామర్లకోటలో దిగి, సి. వి. కె. రావుగారితోపాటు కార్మికుల సమ్మెకి నాయకత్వం వహించారు. దరిమిలా అయన పశ్చిమగోదావరి జిల్లాలో పార్టీ, ప్రజా సంఘాల కార్యకలాపాలు కొనసాగించారు.

1939లో ఉండిలో స్కూల్ ఫైనల్ చదివే రోజుల్లో విద్యార్థుల సమ్మెకి నాయకత్వం వహించాను. ఆ సమ్మె ఫలితంగా నేనూ, మారెళ్ళ నరసింహారావు సస్పెండ్ చెయ్యబడ్డాం. హిందీ పండిట్ గుత్తా అంజనేయ చౌదరిగారూ నేనూ ఉండిలో సోషలిస్టు స్టడీ సర్కిల్ నడిపాము.

ఉండి హైస్కూలు హాస్టల్లో అయా కులాల విద్యార్థులకి భోజనాల బల్లల మధ్య తడకలు కట్టివుండేవి. నేను రోజుకొక కులంవారి తడికల గదిలో భోంచేస్తూ, చివరకు అడ్డు తడకలన్నీ తీయించేశాను. విద్యార్థుల సహాయ సహకారాలతో 1939లో మొదటిసారిగా అంధ్రదేశం వచ్చిన తొలి ఆర్.ఎస్.ఎస్. ఆర్గనైజరు ఠాకూర్ నా గదిలో భగత్సింగ్, శివాజీ, రాణాప్రతాప్‌ల ఫోటోలు కొనిపెట్టి, నన్ను చేరదియ్యాలని మహాతంటాలు పడ్డాడు. నేను అతన్ని తిప్పి కొట్టాను.

1939లో కాకినాడలో జరిగిన విద్యార్థి ఫెడరేషన్ రాష్ట్ర మహాసభకి హాజరై, కార్యవర్గ సభ్యుడిగా ఎన్నుకోబడ్డాను. సమ్మె నాయకుడుగా కాకినాడ కాన్ఫరెన్స్‌లో 16 ఏళ్ళ వయస్సుగల నాకు ప్రత్యేకమైన ట్రీట్‌మెంటు లభించింది. 1940–42 ల్లో బందరులో ఇంటర్ చదువుతుండగా విద్యార్థి ఉద్యమంలో పనిచేశాను.

1942లో సెలవలకి నిడమర్రులో వుండగా పశ్చిమ గోదావరి జిల్లా పార్టీ మహాసభ మా యింట్లో జరిగింది. సుందరయ్య, టి. కె. రామస్వామి, మృత్యుంజయుడు,

యూళ్ళబండి పోలిశెట్టి, సంకు అప్పారావు ప్రభృతులు హాజరైన ఆ మహాసభలో తాడేపల్లిగూడెం తాలూకాలో 'ప్రజాశక్తి' పంపిణీ బాధ్యతను నాకు అప్పగించారు.

అప్పట్లో పత్రిక అమ్మకం అంటే నిడమర్రు నుంచి తాడేపల్లిగూడెం నడిచివెళ్ళి, రాత్రికి అక్కడ ఆగి, మర్నాడు రైలుస్టేషన్‌నుంచి పార్శిల్ విడిపించుకొని, తాడేపల్లి గూడెం, దండగర్ర, ఉమామహేశ్వరం, పెంటపాడు, బైరాగుల పెంటపాడు, విప్పర్రు, నిడమర్రు వగైరా గ్రామాల్లో సానుభూతిపరులకు జాతీయ, అంతర్జాతీయ రాజకీయ వ్యాసాలను చదివి, వివరించి చెప్పి, అప్పుడు కాపీ అమ్మడం – ఇలా సాగేది వారం, వారం.

1942లో నేను అనువదించిన "జోయా వీరగాథ", "గెరిల్లా" అనే సోవియట్ కథ ప్రజాశక్తిలో ప్రచురించబడ్డాయి. అవే నా మొదటి అనువాదాలు. 1942 చివర్లో అశ్వినీకుమారదత్తుగారితోపాటు వీరేంద్రనాథ్ ఛటోపాధ్యాయ భార్య యాగ్నిగ్నస్ స్మెడ్లీ రచించిన "చైనా ఎర్రసైన్యం", 1943లో ఎంగెల్సు రచించిన "కమ్యూనిస్టు సూత్రాలు" అనువదించాను. ప్రగతి ప్రచురణాలయంపేర ఈ పుస్తకాలను, మరికొన్ని పుస్తకాలను ప్రచురించాం.

1942–45 మధ్య తాడేపల్లిగూడెం తాలూకాలో సంకు అప్పారావు, ఇందుకూరి సుబ్బరాజు గార్లతో కలిసి ముమ్మరంగా పార్టీ అధ్యయన తరగతుల్లో పనిచేశాను. 1944లో బెజవాడలో జరిగిన తాలూకా పార్టీ ఆర్గనైజర్ల క్లాసులకి హాజరయ్యాను.

ఆ రోజుల్లో సెల్లు మీటింగులు ఆదర్శప్రాయంగా జరిగేవి. ప్రతి కామ్రేడ్ వర్క్ రిపోర్టు రాసి తీసుకువచ్చేవాడు. అలా ముందే రాయలేకపోయినవాళ్ళు ముఖతః రిపోర్టు యిచ్చి, తర్వాత రాసి యిచ్చేవారు. పార్టీ పత్రికలకు సభ్యత్వం చేర్పించి, పుస్తకాల పంపిణీ, పార్టీ నిధి సేకరణ వగైరా విషయాల్లో తీసుకున్న కోటాలు, వాటిలో సాధించిన విజయాలు, ఎదురైన ఆటంకాలు, పనిలో లోపాలు, విమర్శ, ఆత్మవిమర్శ, భవిష్యత్ కార్యకలాపాలకు సూచనలూ వుండేవి. విమర్శ ఖచ్చితంగా, నిర్మొహమాటంగా, నిర్మాణాత్మకంగా, లోపాలు సరిదిద్దేవిగా వుండేవి. ఎదుటివారిని విమర్శిస్తే మనల్ని ఎక్కడ విమర్శిస్తారో అని ఏ కామ్రేడూ భయపడేవాడు కాడు. విమర్శ – ఆత్మ విమర్శ ఆయుధం మహాపదునుగా వుండి, పార్టీ నిర్మాణ పటిమకు విశేషంగా తోడ్పడేది. ప్రతి కామ్రేడ్ సంచిలోనూ పార్టీ సాహిత్యం వుండేవి. తాము చదవడం, ఇతరులకు చదివి చెప్పడం; పత్రికలూ, సాహిత్యమూ అమ్మడం; పార్టీ పత్రికలకి చందాలు కట్టించడం, ప్రజా సంఘాల్లో సభ్యులుగా చేర్పించడం; ఏటిపొడుగునా సాగేది. గ్రామంలో ఒక్క కామ్రేడ్ వున్నా, అతనొక నైతిక శక్తిగా వుండేవాడు. దుస్తులు సాదాగా వుండేవి. నీటిలో చేపల మాదిరిగా జనంతో కలిసిమెలిసి వుండేవారు కామ్రేడ్స్. కామ్రేడ్ పి. సి. జోషీ బొంబాయిలో వేదికమీంచి "పండిత నెహ్రూను నేనీ వేదికనుంచి సవాలు చేస్తున్నాను" అని ఈ రోజున అంటే, ఆ మరుసటిరోజున నిడమర్రు గ్రామంలో సభ పెట్టి, 'ఈ వేదికమీంచి నెహ్రూని సవాలు చేస్తున్నాం' అనేవాళ్లం. అంటే, పార్టీ ఆర్గనైజేషన్ ఆ రోజుల్లో అంత కట్టుదిట్టంగానూ, సజీవంగా, ఒక Live wire మాదిరిగానూ వుండేది. స్విచ్ వేస్తే బల్బులన్నీ వెలిగినట్లు పార్టీ సెల్లులన్నీ (యూనిట్లన్నీ) పనిచేసేవి.

ఆ రోజుల్లో కామ్రేడ్స్ జనంతో సన్నిహిత సంబంధాలు కలిగివుండి, జనం నాడిని తెలుసుకునేవారు. మహిళల సమస్యల పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపేవారు. వారికి ఇంటి పనుల్లో తోడ్పడేవారు. తమ బట్టలు తామే ఉతుక్కునేవారు. తాము తిన్న కంచాలు తామే కడుక్కునేవారు. కులభేదాలు పాటించేవారు కారు. కులాంతర వివాహాలకు వెనుకాడేవారు కారు. వరకట్నాలను వ్యతిరేకించేవారు. విధవా వివాహాలు చేయించేవారు, చేసుకొనేవారు. బాల, యువజన, విద్యార్థి, మహిళా సంఘాలు పెట్టి, సమాజంలోని ఆయా విభాగాలవారిని అభ్యుదయ, సోషలిస్టు భావానురక్తులుగా తీర్చిదిద్దేవారు. త్యాగనిరతి కలిగివుండేవారు. ఉదాహరణకు, నేను నా పెళ్లి కాగానే, అత్తవారిచ్చిన బంగారు ఉంగరం, వెండి కంచం, మరచెంబు, పట్టుతాపితాలు పార్టీ నిధికి విరాళంగా యిచ్చేశాను.

తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటంలో, విశాలాంధ్రలో ప్రజారాజ్యం కోసం, వేర్పాటు ఉద్యమాలకు వ్యతిరేకంగా ఆంధ్ర కమ్యూనిస్టులు అనితర సాధ్యమైన త్యాగాలు చేశారు.

పార్టీ నాయకత్వంలో కొత్త రక్తాన్ని పూరించడం ఎంతైనా అవసరం. నామినేషన్ల ద్వారా కాక, ఉద్యమాల్లోంచి ఆయా పదవులను బాధ్యతలుగా స్వీకరించి, అందుకు తగిన సిద్ధాంత, నాయకత్వ లక్షణాలను అలవరచుకొని, పార్టీ ప్రజా సేవకులుగా రాణింపుకి రావాలి. అభిప్రాయభేదాలు వుంటే, పార్టీ ఫోరమ్‌లో సరిచేసుకోవాలి.

మన దేశానికి అనువైన పద్ధతిలో మార్క్సిస్టు సూత్రాలను అన్వయించుకొని, మన సమాజాన్ని సోషలిస్టు సమాజంగా తీర్చిదిద్దుకోవాలి.

తొలి శ్రామిక రాజ్యమైన పారిస్ కమ్యూన్ 70 రోజులు మాత్రమే నిలిచింది. సోవియట్ సోషలిస్టు వ్యవస్థ కొన్ని నిర్మాణ, సమన్వయ లోపాలున్నప్పటికీ 70 ఏళ్ళు నిలబడి, ఎన్నో పరాధీన దేశాలకు తోడ్పడి, వాటి విముక్తిని సాధించి, జనానికి సుఖమయ జీవనాన్ని అందించింది, ప్రపంచానికి వేగుచుక్క అయింది.

ప్రపంచ చరిత్రలోనే ప్రజల ఓట్లద్వారా కేరళ రాష్ట్రంలో అపూర్వమైన కమ్యూనిస్టు రాజ్యాన్ని సాధించిన ఘనత మనకి వుంది. ప్రజలను సమీకరించి, ప్రజాస్వామిక పద్ధతిలో (హింసాయుత మార్గం అనివార్యం కాకపోతే) సోషలిజం సాధన కృషిలో తమ విశిష్ట పాత్రను యువ కమ్యూనిస్టులు విజయవంతంగా నిర్వహిస్తారనీ, కమ్యూనిస్టులు, వామపక్ష లౌకిక పార్టీల ఐక్యత సాధిస్తారనీ ఆశిస్తాను.

(తాజా కలం: మనది ప్రధానంగా గ్రామీణ దేశం. పార్టీ, ప్రజా ఉద్యమాలకు గ్రామాలు ప్రధాన కేంద్రాలు కావాలి. పార్టీ కేడర్లు ఎక్కువగా గ్రామాల్లో నివసించేవారై వుండటం అభిలషణీయం. పార్టీ పట్టణాలకి పరిమితం కాకూడదు.)

బెంగుళూరు, 12-12-1995

★ ★ ★

# డాక్టర్ ఆవంత్స సోమసుందర్



ప్రియమిత్రులు కామ్రేడ్ పరకాల పట్టాభి లేఖ నాకు కొంత ఆశ్చర్యాన్ని కలిగించింది. ఎంతో ఆనందాన్నీ కలిగించింది. జేబులో పార్టీ కార్డు వున్నవాళ్ళు తప్ప కమ్యూనిస్టు కాదనే దురదృష్టం యిటీవల మరీ పెచ్చరిల్లడమే అందుకు కారణం.

నేను కమ్యూనిస్టును కావడమే సహజ పరిణామం. అలాకాక మరేదైనా అయితేనే ఆశ్చర్యమూ, దుఃఖమూ పొందాల్సింది! రక్తనిష్టమైన ఆవేశోద్రేకాల సహభావాల పరిణామంగా నేను కమ్యూనిస్టు నయ్యాను, ఆ జీవన జల బిందువు పడవలసినచోట పడి మౌక్తికమై ప్రకాశించింది. ఇందులో నేను వ్యక్తిగా గర్వపడిపోవలసిందీ లేదు, దిగులుపడాల్సిందీ లేదు.

అదే నా అంతర్వాణి తరచుగా నాకు చాటుతూ వుంటుంది. అంతర్వాణి అనగానే బెదిరిపోయి, అదేదో ఆదర్శవాదపు చిలుక పలుకు అనుకునేవారున్నారు. గతితార్కిక భౌతికవాద సిద్ధాంతాన్ని యాంత్రిక భౌతికవాదంగా రూపొందించిన దుష్ట చరిత్రను మనమెరుగమా? ప్రతి మనిషికీ మనసులోని మనస్సుంటుంది. అది

మన ప్రతి చేతనా నిర్భూతినీ పరీక్షిస్తుంది. తప్పులు చేస్తుంటే హెచ్చరిస్తుంది. కానయితే మనం పచ్చి భౌతికవాదుల మనుకుంటూ దాని పీక నులిమి చంపేస్తాం. దుర్మార్గాలే జీవన కర్తవ్యాలనుకున్నవారు చేసే ప్రథమ హత్య ఈ అంతర్వాణినే! అంతర్వాణి మార్గదర్శకత్వం అందుకున్నవాళ్ళు ఒక గాంధీగా, ఒక లెనిన్‌గా, ఒక చంద్ర రాజేశ్వరరావులా రూపొందుతారు.

నాకీ వాతావరణ దోహదమూ, బాల్య ప్రభావమూ లేకుండానే సహజంగా అతి బాల్యంలోనే కమ్యూనిస్టు నయ్యాను. అందరికీ నాకున్నదంతా పంచడం, అందరినీ ప్రేమించడం, ఇతరులకోసం దెబ్బలు తినడం వంటివి నా పన్నెండేళ్ళ నాటికే ఎన్నో జరిగాయి. ఎందుకలా జరిగాయంటే జవాబు చెప్పలేను. సహజాతాలని, కనిపించని జన్మ ప్రభావమనీ యిప్పుడు జవాబు చెప్పుకొని వివరాల జోలికి పోనక్కరలేదు.

నా పసితనంనుంచీ మా అమ్మ తెలుగు సాహిత్యం నూరిపోయడం కారణంగా, ఒకప్రక్క తెలుగు మహాకవులు చదవడం, మరోప్రక్క గురువుల ద్వారా సంస్కృత కావ్యాలు చదవడం – ఈ శక్తితో నా పదమూడో యేటనుంచే అనర్గళంగా పద్యాలు రాసేవాడ్ని. ఆ రోజుల్లో ఆశు కవిత్వం ఫ్యాషనుగా అగ్రరంగం మీద వుంది. ఆ విద్య కొనసాగిస్తూనే హైస్కూలు విద్య కొనసాగించాను. దొరికిన గ్రంథమల్లా చదువుతూ, జ్ఞానం స్వార్జితమే అన్న నిర్ణయాని కప్పుడే వచ్చాను. ఎస్.ఎస్.ఎల్.సి.లోకి వచ్చేవారికి నా పేరు స్కూలంతా మ్రోగింది. అది బహుభంగులై, డిబేటింగ్ సొసైటీకి నన్ను యనమండ్ర సూర్యనారాయణ మాస్టారు కార్యదర్శిగా చేశారు. కొంచం ఆలస్యంగా వచ్చి, మాడభూషి భావనాచార్య ఎస్.ఎస్.ఎల్.సి.లో చేరాడు. వస్తూనే అతను నన్ను వర్గశత్రువునన్న భావంతో ద్వేషించేవాడు. నేను డిబేటింగుకు Co-Education is a must for Social Progress అనే విషయంపై చర్చకు నోటీసు పంపితే, అతను దాన్ని ఖండిస్తూ ప్రతిపక్షం గావించి అద్భుతమైన ఉపన్యాసం యిచ్చి నన్ను ఆకర్షించాడు. చివరికి నేను పెట్టిన తీర్మానమే నెగ్గింది. అయినా అతని దగ్గరకు వెళ్ళి 'మీరు చాలా గొప్పగా ఉపన్యసించారండీ!' అని అభినందించినా, అతను ఎగతాళి చేస్తున్నాననుకుని మొగం చీత్కారంగా పెట్టాడు. అతను తప్పించుకు తిరుగుతున్నా నేను మాత్రం మర్కట కిశోర న్యాయం వదిలిపెట్టలేదు. అతనొక్క పుస్తకమైనా కొనుక్కోలేదు. విరాగిలా, ఎప్పుడూ సొంతంగా ఉతుక్కున్నా మాపు వదలని బట్టలతో, రఫ్‌గా వుండేవాడు. వస్త్ర ధారణ విషయంలో ఆదినుంచీ నేను అలంకార ప్రియుణ్ణి. పట్టుకు వదలకపోయేసరికి నాపై గల శత్రుత్వం దిగమ్రింగి– 'మీ టెక్స్టు పుస్తకాలు యిస్తారా?' అన్నాడు, అర్ధపరీక్షల ముందు. "మా యింటికి రండి, కలసి చదువుకుందాం!" అని ఆహ్వానించాను.

అప్పుడు మా ఇంగ్లీషు పాఠ్యాంశంగా టెన్నీసన్ యులిసిస్ వుంది. చదివి వినిపిస్తున్నాను – Old order change the yielding place to new అని. అంతే. ఆ మాటను పట్టుకొని మానవ సమాజ చరిత్ర యావత్తూ చెప్పనారంభించాడు. ఆదిమ సమాజంలో మనుషులు అందరూ ఆహారాన్వేషణకై ఎలా కష్టపడేవారో, ఎలా అనుభవించారో లగాయతు సోవియట్ యూనియన్ వరకూ మొత్తం మానవజాతి పరిణామక్రమాన్ని వివరించాడు. అంతే – పదకొండు గంటల రాత్రి అయింది.

మరింకేం చదువుతాం? అతనికి పరుపువేయబోతే 'నాకు చాప చాలు. కప్పుకుందుకు దుప్పటీ, పరుపు నాకు వేంద్రం పుడుతుంది' అన్నాడు. ఆ వేంద్రం అనే మాట నేనంతకు ముందు వినలేదు.

పిఠాపురం రాజావారి కోటగుమ్మం ముందు వ్యష్టి సత్యాగ్రహం చేశారు యిద్దరు దేశభక్తులు. వారికి దండలువేసి ప్రక్కనే నుంచున్నాను. వారిని అరెస్టు చేసి, నన్ను పక్కకు తోసేశారు. అదే పోలీసోడి చేయి నా ఒంటిమీద పడటం, ఎందుకో కెలపరం పుట్టింది. పోలీసు తోసేస్తూంటే క్రింద పడిపోకుండా సందిట పట్టుకున్నాడు. ఆయన ఎవరో నాకు తెలియదు. అప్పుడే తెలిసింది వేపూరి గోపాలదాసుగారని.

నేను పుట్టకముందే మా యింటికి అల్లూరి సీతారామరాజు వచ్చి, మా నాన్నగారి నడిగి ఖద్దరు చాపు తీసుకున్నాడు. ఆయన్ని పల్లకీలో బలవంతంగా కూర్చోబెట్టి మా నాన్నగారు ఊరేగింపు చేయించి మంగళహారతు లిప్పించారు. ఈ కార్యానికి వెంటనే ఫలితం అనుభవించారు – శిక్ష పొందడం, కరిణీకం కోల్పోడం. నేను పుట్టి పెరుగుతుండగా మా యింట నిత్యం ఆయన పేరే చెప్పుకొనేవారు. భగత్సింగ్ ఉదంతాలున్నూ చెప్పుకొనేవారు. మా పెద్దన్నయ్య ఈ ఇరువురి వీరుల మీదా పాటలు రచించి పాడేవారు. నాకు మాటలు పెందరాళే వచ్చాయి. నాకు అవి నేర్పి, నాచేత పాడించేవారు. ఆ మహోద్రేకపు రోజుల్లో గుండె కుతకుతలాడుతూ పెరిగిన వాడికి కమ్యూనిస్టుగా మారే వాతావరణం సంసిద్ధంగానే వుంటుంది. సరిగ్గా అదే సమయంలో భావనాచార్య సన్నిహితుడయ్యాడు.

క్రమంగా అతనికి నాపై నమ్మకం కుదిరి, తన గదికి రమ్మని ఆహ్వానించాడొకరాత్రి. ఆ రాత్రి శ్రీ డి. పార్థసారధి రహస్యంగా వచ్చి, Red Star వగైరా పత్రికలు తెచ్చి యిచ్చాడు. చదివి మా ఇంటికి వచ్చేశాను.

కొన్ని స్థానిక ఆకర్షణల వల్ల ఎస్.ఎస్.ఎల్.సి. పాసై, కాకినాడలో చదువుకోవాలని పించలేదు. లెక్కల పేపరునాడు ఆశువుగా ఆన్సర్ పేపర్లపై పద్యాలు రాసి యిచ్చేసి వచ్చాను. ఒక సబ్జెక్టులో పోయినా పోయినట్లే లెక్క మరుసటి సం॥రం (41–42) మళ్ళీ ఎస్.ఎస్.ఎల్.సి. చదివాను. భావనాచారి ప్యాసై, కాకినాడ కాలేజీలో చేరాడు. సత్యానంద పిళ్ళేగారని ఇంగ్లీషు లెక్చరర్ వుండేవారు. ఆయన కొంచెం క్రూరంగా వుండేవారు. అతను భావనాచార్యను ఏదో ప్రశ్నించగా, యితను సర్ చేర్చకుండా మాట్లాడాడు. ఆయన తిట్టి, సర్ అని తీరాలన్నారు. 'సర్ అనేది బానిసకీ యజమానికీ మధ్య వుండే సంబంధాన్ని తెలుపుతుంది. నేనెలా ఉచ్చరించ'నన్నాడు. వెంటనే బయటకు పంపేయడమే గాక – టి.సి. యిచ్చి కాలేజీలోంచే పంపేశారు. ఆ సంవత్సరమంతా నా దగ్గరకు వచ్చేవాడు. స్టూడెంట్స్ ఫెడరేషన్ ఆర్గనైజ్ చేసేవాడు. పిఠాపురంలో రైలుపట్టాలు పక్క యిసక పోగు వుండేది. అక్కడ జరిపాం తొలి విద్యార్థి మీటింగు. అతనూ, నేనూ ఉపన్యాసాలిచ్చాం. ఎస్.ఎఫ్.ఐ.ని కూడా నేనెక్కువ సీరియస్‌గా తీసుకోలేదు. నా దృష్టి కావ్యపఠనంపైనా, పద్యాల రచనపైనా, యితర చిల్లర విషయాలపైనే కేంద్రీకరించబడేది. 1942 మార్చి పరీక్షలలో కూడా నన్ను తప్పించుకునే ఏర్పాటు చేసుకున్నాను. సుఖంగా మూడు సం॥ ఛాన్సులూ అయిపోతాయి. ప్యాసయితీరాలని కొంత శ్రద్ధ చూపనారంభించా కాని, ఆ

సంవత్సరమే క్విట్ ఇండియా ఉద్యమం ప్రశాంతి లేకుండా చేసింది. ఒకరాత్రి సినిమా సెంటర్ వెళ్ళి వస్తూంటే మమ్మల్నిద్దరినీ క్విట్ ఇండియా అని గోడలపై రాస్తున్నామని ఒక హోంగార్డు పోలీసు స్టేషన్‌కు తీసుకుపోయాడు. రాత్రి తెల్లవార్లూ అక్కడ వుంచి ఉదయమే పొమ్మన్నారు. ఆగస్టు 9వ తేదీన విద్యార్థుల సమ్మె చేయించినప్పటినుంచి నన్ను అనుమానంగా వెంటాడేవారు.

పిఠాపురంలో విద్యార్థి సంఘం పేరుతో ఆఫీసు తెరిచాం. కొప్పవ్రల వెంకటరావుగారు బి.ఎ. ప్యాసై రహస్య కాలం నుంచీ, మలిరెడ్డి వెంకటరాజుగారితో సహా కంభంపాటివారి శిష్యులుగా పార్టీ మెంబర్లు ఆయన పిఠాపురం ఆర్గనైజర్‌గా చేరారు. భావనాచారి సంచారజీవిగా మారిపోయాడు. మేము ముగ్గురం ముఖ్య కార్యకర్తలుగా విద్యార్థులను సంఘంలో చేర్పిస్తూ క్లాసులు నడుపుకునేవాళ్ళం. కొప్పవ్రల వెంకటరావు పరిశుద్ధమైన వ్యక్తి. బట్ట మాయనిచ్చేవారుకాదు. మాట తీరూ, నడక, అన్నీ పరిశుద్ధంగా వుండేవి. మంచి విషయాలు చెబుతూ విద్యార్థులను బాగా ఆకర్షించేవారు. 1942లోనే జపానువారు కాకినాడ–విశాఖలపై బాంబులు వేశారు. కొప్పవ్రల వెంకటరావుగారు సిఫారసు చేయగా నన్నూ మరి ముగ్గుర్నీ పార్టీ సభ్యులుగా తీసుకున్నారు. 1942–అక్టోబరు 21వ తేదీ వేసి శ్రీ మహీధర జగన్మోహనరావు జిల్లా కార్యదర్శిగా సంతకం చేసి పార్టీ కార్డు పంపారు. అది చేతికి వచ్చిన రోజున మేమెంత ఆనందించామో యిప్పటికీ మరిచిపోలేదు.

జిల్లా పార్టీ పక్షాన శ్రీ జోస్యభట్ల సత్యనారాయణగారిచేత ఎ.ఆర్.పి. ట్రైనింగు క్లాసులు 15 రోజులు ఏర్పాటు చేశాం. అంటే, యాంటీ ఎయిర్ రెయిడ్ ప్రికాషన్స్ ప్రజలకు బోధించి, శత్రు బాంబులకు గురై మరణించకుండా రక్షించే ఏర్పాట్లు. దీనికి పిఠాపురం తాలూకానుంచి నన్ను, కోట అబ్బన్న అనే మా క్లాసుమేటును విద్యార్థులుగా పంపారు. జోస్యభట్లగారు చాలా చక్కగా పాఠం చెప్పేవారు. నోట్సు డిక్టేట్ చేసేవారు. ఆ ఎ.ఆర్.పి. జ్ఞానంతో జపానువారు బాంబులువేస్తే ప్రజలనందరినీ రక్షించగలమనే ధైర్యంతో ఆవేశమూ కలిగింది. కాని, వాడి దయవల్ల మళ్ళీ మన భారతదేశంపై బాంబులూ వేయలేదు, మా ఎ.ఆర్.పి. జ్ఞానాన్ని ప్రదర్శించే అవకాశమూ యివ్వలేదు.

ఆ ట్రెయినింగు జరుగుతుండగా ఒకనాటి ఉదయమే కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య పెద్ద హోల్డాల్ మోసుకుంటూ పార్టీ ఆఫీసుకు వచ్చారు. అప్పుడు పార్టీ ఆఫీసు జగన్నాథపురంలో ఉప్పుటేరుప్రక్క – మనిషి నడిస్తే చాలు ఒణికిపోయే పాతమేడలో వుండేది. కామ్రేడ్ జాన్ అనే చింపాంజీలాగుండే ఒక చక్కని కామ్రేడ్ వుండేవారు. అతనికి పార్టీ అంటే ఎంత భక్తి విశ్వాసాలో! కాకినాడ నగర పార్టీ ప్రముఖులుగా సి. వి. కె. రావు, సి. ఎస్. శర్మ, ఎస్. వి. రత్నం, జె. వి. ఎస్. రామచంద్రుడు, పొన్నాడ మార్కండేయులు, మేకా పట్టాభిరామయ్య వంటి విద్యార్థి నాయకులు ముఖ్యులు. 1937లో భారతదేశంలో ప్రథమ సమ్మె జరిపిన కీర్తి వున్న కాకినాడకు, భయంకరాచారి బాంబు కేసుతో ఎంతో కీర్తి ప్రతిష్టలు పొందిన కాకినాడకు పార్టీ చరిత్రలో ఆనాడు ఎంతో స్థానం వుండేది.

ఎ.ఆర్.పి. ట్రెయినింగు పూర్తిచేసుకొని పిఠాపురం తిరిగి వచ్చిన తర్వాత కొద్దిరోజులకు శ్రీ పుత్సల సత్యనారాయణగారిచేత పదిహేను రోజులపాటు కామ్రేడ్ స్టాలిన్ రచించిన ప్రాబ్లెమ్స్ ఆఫ్ లెనినిజంపై క్లాసులు పెట్టించుకున్నాం. ఈ అధ్యయనం తాత్వికంగా ఎంతో పుష్టిని కలిగించింది. పార్టీ ఆఫీసుపై, విద్యార్థి సంఘ కార్యాలయముపై కాంగ్రెస్‌వారు అసంఖ్యాకమైన దాడులు, కొన్ని పరమ నీచమైనవీ చేయనారంభించారు.

1943లో కాకినాడలో ఇంటర్‌లో చేరిన తర్వాత విద్యార్థి ఉద్యమంలో తీవ్రంగా పనిచేయ నారంభించాను. 1944 నవంబరులో కలకత్తాలో జరిగిన ఎ.ఐ.ఎస్.ఎఫ్. కాన్ఫరెన్స్‌కు వెళ్ళిన ప్రతినిధివర్గంలో నేనూ వెళ్ళి పాల్గొన్నాను. సరోజినీనాయుడు ప్రారంభోపన్యాసం ఎంతో ఉత్తేజమిచ్చింది. అదే సందర్భంలో శాంతినికేతన్, అలహాబాద్, ఢిల్లీ, ఆగ్రాలలో పర్యటించి కాకినాడ తిరిగి వచ్చాను. ఒకప్రక్క రాజకీయ కార్యకలాపాలు చేస్తూనే, వేరొకప్రక్క సాహిత్య రచనా వ్యాసంగం చేస్తూ కృష్ణశాస్త్రిగారిని ప్రతి దివసాంతంలోనూ కలుసుకుంటూ గడిపేవాణ్ణి. నిజానికి కలకత్తాలోనే అప్పటి మహాక్షామావశేషాలు చూసి ద్రవించిన హృదయంతో రచించిన మౌనఘోష నా వజ్రాయుధంలో చేర్చబడింది.

1945లో పరిమిత ఓటింగుతో ఎన్నికలు రాగా, కాకినాడలోనే వుండి పార్టీ అభ్యర్థి శ్రీ సి.వి.కె. రావును గెలిపించడం కోసం అహర్నిశలూ కష్టపడ్డాను. కాని, కాంగ్రెస్ అభ్యర్థి శ్రీ పైండా వెంకటనారాయణగారే నెగ్గారు. అయ్యదేవర కాళేశ్వరరావు కమ్యూనిస్టులు ప్రజల యిక్కట్లలో పాలుపంచుకుంటూ కిరసనాయిలు యిప్పించడంలో సహకరిస్తూంటే, దానిని వెక్కిరిస్తూ, ఆముదపు దీపాలపై – అదే మన భారతీయ సంప్రదాయమంటూ ఉపన్యాసం యివ్వడం నన్ను బాగా కదిలించింది. దానితో చదువుకు స్వస్తిచెప్పి పిఠాపురం చేరుకున్నాను.

పిఠాపురం రాజా శ్రీ సూర్యరాయ బహద్దూరు షష్టిపూర్తికి రైతులనుంచి నిర్బంధంగా చందాలు వసూలు చేశారు. దీనికి వ్యతిరేకంగా మేమంతా తీవ్రంగా ఆందోళన జరిపాం. చివరికి ఆయన దృష్టికి రాగా వసూలు చేసిన మొత్తం పేరు పేరునా రైతులకు డబ్బు వాపసు చేయడం జరిగింది. అదే ప్రథమ విజయం. తదుపరి పంచాయతీ పారిశుధ్య కార్మికుల సమ్మె నలభై రోజులు జరుగగా, కామ్రేడ్ బుల్లిరాజు మలేరియా పీడితుడవడంవల్ల, ఆ ఉద్యమ నాయకత్వం వహించే సదవకాశం నాకు కలిగింది. కాంగ్రెస్‌వారూ వీధులు తుడవ నారంభించారు. దానితో ఉద్యమం మరింత పటిష్టమైంది. చివరికి విజయం సాధించాం.

ఇంతలో జమీందారీ వ్యతిరేక పోరాటాలు ప్రారంభమయ్యాయి. 1947 వరకూ చెరువుపడకల అమ్మకం–అడవుల అమ్మకం వగైరాలను వ్యతిరేకించి–8 కేసులు బనాయించగా, నేను 5 నెలల 20 రోజులు తుని సబ్ జెయిలు జీవితం గడపవలసి వచ్చింది. మద్రాసు హైకోర్టులో పోరాడితే తప్ప బెయిలు యివ్వలేదు. ప్రభుత్వం పెట్టిన కేసులన్నీ ఓడిపోయాయి. తర్వాత నాకు ఒక సం॥రం ఇంటర్న్‌మెంటు (గృహ నిర్బంధం) విధించారు. 1948లో బుద్ధవరం కాన్ఫరెన్సు నుంచి తిరిగి వచ్చేసరికి

పోలీసులు నాపై నిర్బంధ వలయాన్ని సంసిద్ధం చేశారు. చాలామంది కామ్రేడ్స్ అరెస్టయ్యారు. నాపై కేసులున్నందున నన్ను డిటెన్యూగా తీసుకుపోలేదు.

1948లో ఘోరమైన చీకటి వ్యాపించింది. అభ్యుదయవాణి వినిపించడమే కరువైపోయింది. దానితో కవి సోదరులందరితోనూ సంప్రదించి, డబ్బు సంపాదించి (భూమి అమ్మకం ద్వారా) నా వజ్రాయుధం, ఆరుద్ర త్వమేవాహం (1949లో) ప్రచురించాను.

మిగిలిన కవి సోదరుల కావ్యాలు కూడా ప్రచురించాలనే సంకల్పించాను. కాని అనిసెట్టి, రమణారెడ్డి, దాశరథి, తమ కావ్యాలు తామే ప్రచురించుకోడానికి పూనుకున్నారు.

కారుచీకటిలో ఈ అభ్యుదయ కావ్యాలు ఒక గొప్ప కాంతికిరణాలను ప్రోదిచేశాయి. ఈ కారణంవల్లనే మద్రాసు రాష్ట్ర ప్రభుత్వం 1950 ఫిబ్రవరి 5 వ తేదీ ఉత్తరువుతో వజ్రాయుధాన్ని నిషేధించి, ప్రతులన్నీ జప్తుచేసింది. ప్రచురణకర్తగా నిలచిన రాంషాపై కేసు నడిచింది. సామర్లకోట పట్టణ కాంగ్రెస్ ప్రెసిడెంటు శ్రీ అళక్కి సర్వేశ్వరశాస్త్రిగారు మాకు అనుకూలంగా యిచ్చిన సాక్ష్యంవల్ల కేసు నెగ్గగలిగామే కాని వజ్రాయుధంపై నిషేధం తొలగించుకోలేకపోయాం. 1956లో సంజీవరెడ్డి ప్రభుత్వం హైదరాబాద్‌లో ఏర్పడ్డాక శ్రీ సుందరయ్య గట్టిగా ప్రశ్నించగా, ప్రస్తుతం మన ప్రభుత్వం ఏ గ్రంథాన్నీ నిషేధించలేదని చెప్పడంతో ద్వితీయ ముద్రణ ఏర్పడింది.

దీనితో ఒక ప్రాథమిక దశ గడిచింది. చెప్పవలసిందెంతో వుంది. అది స్వీయ చరిత్రకుకాని దీనికి సాధ్యంకాదు.

★ ★ ★

# శ్రీ ఎం. రాజన్న



1942లో మదనపల్లె సంతను నేను పాడాను. 1946 వరకు అది నాక్రిందే వుంది. మదనపల్లి పరిసరాల గ్రామాల ప్రజలు తమ కూరగాయలను సంతలో అమ్ముకోవడానికి బుట్టలతో తీసుకు వచ్చేవారు. వీరికి ఏదైనా అన్యాయం జరిగితే, వారి తరపున కామ్రేడ్ డి. సీతారామయ్య వచ్చి మాట్లాడేవారు. న్యాయం చేసేవారు. ఈ కాలంలోనే ఆయనతో నాకు పరిచయం ఏర్పడింది. ఆయన కమ్యూనిస్టు పార్టీ గురించి, దాని సిద్ధాంతాలు గురించి, కమ్యూనిస్టుల పోరాటం గురించి నాకు వివరించేవారు. ఆవిధంగా నేను కమ్యూనిస్టు భావాల వైపుకు ఆకర్షితుడనయ్యాను. ఆయన నిర్వహించే కార్యక్రమాలలో పాల్గొనేవాణ్ణి. 1948లో పార్టీపై నిషేధం విధించిన సమయంలో కామ్రేడ్ సీతారామయ్య అజ్ఞాతవాసంలో వుండి, పోలీసులకు దొరకకుండా జిల్లా అంతటా పర్యటిస్తూ పార్టీ శాఖల పనితీరును పరిశీలించేవారు. మదనపల్లెశాఖ సమావేశాలను ఊరు బయట వున్న దట్టమైన పొదల్లో రాత్రివేళ

జరిపేవారు. సమావేశానికి కావలసిన కిరోసిన్ బుడ్డీలు, ఆహారం నేను తీసుకువెళ్ళి అందజేసేవాణ్ణి. కామ్రేడ్ సీతారామయ్యను రేణిగుంట వద్ద పోలీసులు అరెస్టు చేశారు. దానితో మదనపల్లెలో పార్టీ కార్యక్రమాలలో కొంత స్తబ్దత చోటు చేసుకున్నది. పార్టీపై నిషేధం తొలగించడంతో కామ్రేడ్స్ రాటకొండ నరసింహారెడ్డి, సీతారామయ్యలు తిరిగి ప్రజలలోకి వచ్చారు. అనంతరం జరిగిన ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థిగా డి. సీతారామయ్య పోటీచేసి గెలుపొందారు. నేను ఆయన తరపున విస్తృతంగా ప్రచారంలో పాల్గొన్నాను. ఇలా నేను కమ్యూనిస్టు పార్టీ పిలుపునందుకొని వివిధ కార్యక్రమాలలో పాల్గొని, పార్టీ సభ్యుడనయ్యాను. ఈ ఎన్నికల అనంతరం జిల్లాలో ఒక ప్రక్క కరువు, మరో ప్రక్క కలరా వ్యాపించాయి. కమ్యూనిస్టు పార్టీ విజయవాడ నుంచి డాక్టర్లను తీసుకొచ్చి కలరా నిర్మూలనకు కృషి చేసి, మరో పక్క కరువు నివారణకు గంజి కేంద్రాలు నడిపింది. మదనపల్లె మీదగా వెళ్ళే ధాన్యం లారీలను నిలుపుచేసి, వాటిని తక్కువ ధరకు పేదలకు పంపిణీచేసి, ఆ డబ్బును వారికిచ్చి పంపాం. ఈ కార్యక్రమాలన్నింటిలోనూ కమ్యూనిస్టుగా నా వంతు కృషి నేను చేశాను.

పార్టీ చీలిక అనంతరం నేను, కామ్రేడ్ కదం క్రిష్టాజీ మాత్రం భారత కమ్యూనిస్టు పార్టీలో వున్నాం. ఆ తరువాత కొద్ది సంవత్సరాలకే క్రిష్టాజీ కూడా పార్టీని విడిచిపెట్టారు. · నేను ఒక్కణ్ణే పార్టీలో మిగిలాను. పార్టీ కార్యక్రమాలు పలచబడ్డాయి. ప్రత్యేక ఆంధ్రరాష్ట్ర ఆందోళనకు వ్యతిరేకంగా సమైక్యాంధ్ర కోసం పార్టీ పిలుపునిచ్చింది. మదనపల్లెలో నేను ప్రత్యేక రాష్ట్ర ఆందోళనకు వ్యతిరేకంగా రెండు కరపత్రాలు ప్రచురించాను. నాకు బెదిరింపులు వచ్చాయి. కొందరు నామీదకు దాడికి వచ్చారు. కానీ వారికి ప్రజలు బుద్ధి చెప్పారు. అప్పటివరకు నేను పార్టీ కార్యకర్తగానే వుండేవాణ్ణి. ఈ ఘటనతో ప్రజలు నన్ను నాయకుణ్ణి చేశారు. జిల్లా నాయకులు మదనపల్లెలో ఈ కార్యకలాపాలను గుర్తించారు. జిల్లా పార్టీ కౌన్సిల్ సభ్యుడిగా నన్ను తీసుకున్నారు. నాటినుండి పార్టీ నిర్మాణానికి కృషి చేస్తున్నాను.

★ ★ ★

# శ్రీ పూలకుంట సంజీవులు



1920 సంవత్సరం సెప్టెంబర్ నెలలో మా అమ్మ పుట్టినిల్లు అనంతపురం జిల్లా ప్రసన్నాయపల్లిలో జన్మించాను. తల్లి వెంకటమ్మ, తండ్రి అంజినప్ప. అణచబడ్డ కులంలో (వడ్డెర) వారికి ఒకే కుమారునిగా జన్మించాను. ఆస్తిపాస్తులు బొత్తిగా లేని కుటుంబం. మా తండ్రి దేవాలయాలు, భవనాలు నిర్మించే నైపుణ్యం గల మేస్త్రీ. మంచి శిల్పి కూడా. ఆ కాలంలోనే ఒక భట్రాజు దగ్గర రాత్రిపూట స్కూల్లో చదువుకున్నాను. భారత, రామాయణ గ్రంథాలను చదివి అర్థం చేసుకొనే స్థాయి వుండేది. మా స్వగ్రామం పూలకుంట. నా ఏడవ ఏట మా వూరి వీధి బడిలో చేర్పించారు. మా ఉపాధ్యాయుడు ఒక ముస్లిం. ఆయన తెలుగు సాహిత్యంలో కవి, పండితులు, విమర్శకులు. ఆయన పేరు గౌస్ ముల్లాసాహెబ్. మా గ్రామంలో మా నాన్న, ఈ ఉపాధ్యాయుడు, కొంతమంది వర్తక ప్రముఖులు రాత్రిపూట పురాణ పఠనం నెలలుగా సాగించేవారు. మా గ్రామంలోను, చుట్టుపక్కల గ్రామాల్లోను ఒక గుర్తింపు కలిగిన వ్యక్తి మా నాన్న ప్రభావం వల్లనే నేను కాంగ్రెసుగా, కమ్యూనిస్టుగా ఇంతకాలంగా రాజకీయ జీవితం సాగించాను. దాదాపు గ్రామంలో ఎనిమిదేళ్ళుగా

వీధిబళ్ళో చదివాను. పై చదువులకు పట్టణమునకు పంపించాలని మా నాన్న పట్టుదల. మా అమ్మ అందుకు వ్యతిరేకం. 'నా ఒక్కగానొక్క కొడుకు కళ్ళెదుటే వుండాలా' అని పట్టుపట్టి, పట్టణంలో ఒంటరిజీవితం అసాధ్యమని మా అమ్మ మా నాన్నతో తీవ్రంగా పోరాడి, నా పైచదువులకు ఆటంకం కలిగించింది.

## గాంధీజీ ప్రబోధం; ప్రభావం:

అవి 1934 రోజులు... మా అనంతపురానికి మహాత్మా గాంధీగారు వస్తున్నారని మా గ్రామాల్లో వ్యాపించింది. మా గ్రామంలో పదిమంది కుర్రవాళ్ళు నిత్యం జతగాళ్ళం. డ్రామాలు, సంగీతం వగైరాలతో కాలం వెళ్ళబుచ్చేవాళ్ళం. అప్పటికే ఆంధ్రపత్రిక వగైరా పత్రికలు, వీరేశలింగం రచనలు చదివేవాళ్ళం. మా గ్రూపు లీడరు ముల్లా మోదీసాబ్. ఈయన మా ఉపాధ్యాయుని కుమారుడు, స్వాతంత్ర్య సమరయోధులు. ఇప్పటికీ జీవించి వున్నాడు. ఈయన అనంతపురంలో చదువుతూ కాంగ్రెస్ గురించి చెప్పేవాడు. మంచి గాయకుడు. ఖద్దరు గుడ్డలు ధరించేవాడు. ఆయనతో కలిసి గాంధీగారిని చూచేందుకు అనంతపురానికి 10 కి.మీ. నడిచి వెళ్లాం. ఆనాడు గాంధీని చూడడానికి ఎందరెందరో నడుచుకుంటూను, ఎడ్లబండ్లలోనూ వచ్చారు. గాంధీగారి ఉపన్యాసం హిందీ, ఆంగ్లంలో సాగింది. మా మోదీసాబ్ నెత్తిన టోపీ ధరించాడు. ఆవేళ మేమూ టోపీలు ధరించాం. తిరిగి వూళ్ళోకి ప్రవేశిస్తూనే గాంధీగారి గురించి పాటలు పాడుతూ వూరంతా తిరిగాం. మా ప్రాంతంలో పసులూరి హరిజన ఎరికలప్ప గొప్ప కాంగ్రెస్‌వాది. ఈయన జిల్లా బోర్డ్ మెంబర్ కూడా. ఈయనగారు మా గ్రూపును తీసుకొని పల్లెల్లో కళ్ళంగడి దగ్గరికె వెళ్ళి కల్లు తాగవద్దని పాటలు పాడుతూ ప్రబోధించేవాడు. అక్కడ తాగేవారు మాపై కల్లు చల్లేవారు. అయినా, కల్లు తాగవద్దని కాళ్ళదగ్గర పడేవాళ్ళం. తన్నేవారు కూడా.

## భూస్వామ్య వర్గాల నిరంకుశత్వంపై తిరుగుబాటు:

మా గ్రామంలో పెత్తనం అంతా రెడ్లది. వర్తకులు, ధనవంతులయినా రెడ్లకు లొంగవల్సిందే. గ్రామంలో హరిజనులపై, బలహీనవర్గాలపై దోపిడీ విచ్చలవిడిగా జరిగేది. కిందకులంవారు మంచంపై కూర్చోకూడదని ఒకసారి వూళ్ళో దండోరా వేయించారు. ఈ దండోరాకు వ్యతిరేకంగా మా నాన్నతోపాటు మధ్యతరగతి వర్తకులు నిరసించారు. దౌర్జన్యంగా పెత్తందారీ ఏజెంట్లు వీధుల్లో మంచాలు విరగొట్టారు. మా వీధిలోకి రాకుండా 30 మంది మా నాన్నతోపాటు వాళ్ళను ఎదుర్కొన్నారు. వాళ్ళు పారిపోయారు. ఈ తిరుగుబాటు చూచి కొంతమంది మధ్యతరగతి రైతులు మావైపు వచ్చారు. ఈ పెత్తందార్లు గ్రామంలో చందాల పేర్లతో లంచాల రూపంలో గ్రామ సమష్టి ఆదాయాలన్నీ 2, 3 కుటుంబాలే భోంచేయడం చూచి, మధ్యతరగతి రైతులు నిరసించేవారు.

1936–37 సం॥ కాలంలో శ్రీ సదాశివన్‌గారు మా గ్రామానికి వచ్చేవారు. హరిజన హాస్టల్ (కేశవ నికేతన్) నడుపుటకై సదాశివన్ పల్లెల్లో ధాన్యం వసూలు చేసేవారు. ఆ ధాన్యాన్ని నేను ఒకరిద్దరితో కలసి అనంతపురం హాస్టలుకు గాడిదల

మీద తీసుకెళ్ళేవాడని. నన్ను ఆ రాత్రికి సదాశివన్ హాస్టలులో నిలుపుకునేవారు. ఆయన నాతో సోవియట్ రష్యా విప్లవాలగురించి, సామ్యవాద వ్యవస్థను గురించి చెప్పేవారు. ఆ చర్చల్లో జి. రామకృష్ణ, శివశంకర్ (స్వాతంత్ర్య సమరయోధులు), గొట్టిపాటి సుబ్బరాయుడు, ఆర్. నాగేశ్వరరావు, ఇంకా జిల్లాలో అనేకమంది యువకులు, వ్యక్తులు హాస్టల్‌కు వచ్చి పాల్గొనేవారు. సదాశివన్‌గారు సోషలిజం, అమ్మ, డార్విన్ థియరీ (విశ్వరూపం) పుస్తకాలు నాకు అందజేసేవారు.

## సదాశివన్ ద్వారా కమ్యూనిస్టు ఉద్యమస్ఫూర్తి:

1941లో అనుకుంటా, సి.పి.ఐ. నాయకులు రహస్యంగా అనంతపురానికి వచ్చి పోయేవాళ్ళు. ఇందులో ఏటుకూరి బలరామమూర్తి ఒకరు. ఆయనతోపాటు గొట్టిపాటి సుబ్బరాయుని ఇంటిలో ఒకరోజు భోజనం చేశాం కూడా.

1941-42 సం॥ కాలంలో - నాకు అప్పటికే పెళ్ళయింది, మా నాన్న వెంట నేను క్వారీకి వెళ్ళి బండలు రాళ్ళు కొట్టి పనిచేసేవాడిని. పనిలో నేనూ నైపుణ్యం కలవాడ్ని అని మా నాన్న ఇతరులతో చెప్పి సంతోషించేవారు. ఆ సందర్భంలోనే మహాత్మా గాంధీ వ్యక్తి సత్యాగ్రహానికి పిలిపిచ్చారు. సదాశివన్‌గారు మా గ్రామానికి వచ్చి, మా గ్రామంలో 13 మంది సత్యాగ్రహం చేయాలని ఆదేశించారు. 13 మంది సత్యాగ్రహానికి తయారయ్యాం. పేర్లు ప్రకటించారు. మా మోదిసాబ్‌గారి భార్య శ్రీమతి రాబియాబిగారు తన పేరు ప్రకటించింది. ఆంధ్రదేశంలో ముస్లిం స్త్రీ సత్యాగ్రాహిగా ముందుకు రావటం చూచి ఆంధ్రావని అంతా హర్షధ్వానాలు చేసింది. (ఆమె ఇటీవలనే చనిపోయింది.) జిల్లా కాంగ్రెస్ నాయకుల సమక్షంలో సత్యాగ్రహం చేసింది. నెహ్రూ, అజాద్ వగైరా నాయకులంతా ఆమెకు ప్రశంసాపత్రాలు అందజేశారు. మా వూళ్ళో ఎంతమంది సత్యాగ్రహం చేసినా ఎవరినీ అరెస్టు చేయలేదు. అపుడు నేను, మా గ్రామంలోని కె. నరసింహారెడ్డి (స్వాతంత్ర్య సమరయోధులు) మంచి వక్త కలసి వూళ్ళూళ్ళూ తిరిగి బ్రిటిష్‌వారికి వ్యతిరేకంగా ఉపదేశించాం. నెలరోజులు తిరిగాం.

1942 ఏప్రిల్ నెలలో సి.పి.ఐ.పై నిషేధం తొలగిన తర్వాత నీలం రాజశేఖరరెడ్డి, చిట్రగుంట రామచంద్రరావు, జి. రామకృష్ణగార్లు జాతీయోద్యమ గ్రామాలైన పూల కుంట, బియ్యేడు, మన్నీలల్లో పర్యటించేందుకు వచ్చారు. పై మూడు గ్రామాల్లో నన్ను వెంట తీసుకొనిపోయి ఉపన్యసించారు. ఈ సందర్భంలో రాజశేఖరరెడ్డి, తరిమెల నాగిరెడ్డి, సదాశివన్ గార్లను నేను అనంతపురం వెళ్ళి తరచుగా కలిసేవాణ్ణి.

## 1942 ఆగస్టు అరెస్టులు:

ఇంతలోనే 1942 ఆగస్టు సంఘటనలు దేశమంతా విజృంభించాయి. నేను మా నాయన క్వారీలో పనిచేస్తున్నాం. క్వారీ దగ్గరికే పోలీసు వ్యాన్ వచ్చి నన్ను అరెస్టు చేసింది. అనంతపురం సబ్ జైలు అన్ని రాజకీయ పార్టీ నాయకులతో నిండిపోయింది. వివిధ రకాల కేసుల్లో ఇరికించి నెలలుగా నిర్బంధించారు. కేసులు ఋజువు కానందున మమ్మల్ని విడుదల చేశారు.

1943లో శ్రీ రాజశేఖరరెడ్డిగారు అనంతపురం పిలిపించి నాకు సభ్యత్వం యిచ్చారు. నాతోపాటు ప్రసన్నాయపల్లి నాగిరెడ్డి, ముద్దలాపురం ఓబులప్ప, కె. నరసింహారెడ్డిగార్లకు సభ్యత్వం యిచ్చారు. అనంతపురం తాలూకాలో కొన్ని గ్రామాల్లో కమ్యూనిస్టు ఉద్యమానికి పునాదులు వేశాం. పూలకుంట, ప్రసన్నాయిపల్లి, బియ్యేడు, ముద్దులాపురం గ్రామాల్లో ఎర్రజెండాలు ఎగరేసి, శాఖలు నిర్మించాం.

1944లో విజయవాడలో అఖిల భారత రైతుసంఘం మహాసభ జరిగింది. మా గ్రామాలనుంచి 15 మంది ఆ సభకు ఉత్సాహంగా వెళ్ళాం. జిల్లాలో నిత్యం కరువులతో అల్లాడే ప్రజలను సమీకరించి ఉద్యమాలు, ఊరేగింపులు, ఆకలి యాత్రలు నిర్వహించేవారు. మా స్వంతపని చేసుకుంటూ అన్నిరకాల ఉద్యమాల్లో పాల్గొనేవాణ్ణి.

## పెత్తందార్ల వ్యతిరేక పోరాటాలు:

1946–47లో పూలకుంట, ఉప్పరపల్లి, దుర్గం గ్రామాల పెత్తందార్ల దుర్మార్గాలు, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా పోరాటం చేశాము. అరెస్టు చేయాలని వచ్చే పోలీసులకు కళ్ళలో కారం కొట్టి తప్పుకొనేవారం. రాత్రిపూట పేదవర్గాలకు చదువు చెప్పేవారం. అంటువ్యాధులు వ్యాపిస్తే వాలంటీర్లుగా వెళ్ళి వీధులు శుభ్రం చేసేవాళ్ళం. దుర్గం హరిజన వాడలో కలరాతో 7గురు చనిపోయారు. కమ్యూనిస్టు వాలంటీర్లుగా వెళ్ళి, శవాలను పూడ్చి, ఆ గ్రామంలో ఆరోగ్యవిధులు కాపాడాం. ఆ సందర్భంలోనే హరిజనుల ఇళ్ళస్థలాలకోసం, మంచినీటి బావులు, స్కూళ్ళకోసం ప్రభుత్వంతో పోరాడి వాళ్ళకు సాయం చేసేవాళ్ళం.

1946 జిల్లా కమ్యూనిస్టు పార్టీ ప్రథమ సభ ఉరవకొండలో జరిగింది. ఈ సభకు రాష్ట్ర నాయకులు చండ్ర రాజేశ్వరరావుగారు వచ్చారు. జిల్లాలోని 64 మంది ప్రతినిధుల్లో మా ప్రాంత ప్రతినిధులు 20 మంది. శ్రీ నీలం రాజశేఖరరెడ్డిగారిని జిల్లా కార్యదర్శిగా ఎన్నుకున్నాం.

## 1948-50 తీవ్ర నిర్బంధ విధానం:

1948 డిశంబర్‌లో గాంధీగారి హత్యానంతరం దేశమంతటా కమ్యూనిస్టు నాయకులను కాంగ్రెస్ ప్రభుత్వం విచ్చలవిడిగా అరెస్టు చేసింది. జిల్లాలో కమ్యూనిస్టు పార్టీ కార్యకలాపాల నిర్మాణంలో మార్పులు వచ్చినవి. మా అనంతపురం తాలూకా పార్టీ కార్యకలాపాల ఏరియా ఆర్గనైజర్‌గా వి.కె. ఆదినారాయణరెడ్డిగారిని నియమించారు. మా గ్రామాలపై పోలీసులు నిత్యం దాడిచేస్తూ దౌర్జన్యం సాగించారు. నేనూ, వి.కె. గారూ రహస్యంగా తాలూకా అంతటా తిరిగేవాళ్లం. నేను దొరకలేదని మా ఇంటి మీద రెండుసార్లు దాడిచేసి, కొంపలోని సామాన్లు చిందరవందరచేశారు. మా నాన్నను, నా భార్యను అరెస్టు చేయాలని దాడులు సాగించారు. నా భార్య ఇద్దరు బిడ్డలతో తమ బంధువు ఇంట్లో (ధర్మవరం తాలూకా కాటమకుంట గ్రామంలో) తల దాచుకుంది. మా నాన్నగారు మా వూరు విడిచి వూరూర తిరుగుతున్నారు. ఈ సందర్భంలోనే పూలకుంటలో భూస్వాముల దగ్గరున్న బంజరు భూములను 280 ఎకరాలను ఆక్రమించి ఎర్రజెండాలు నాటి

స్వాధీనపరచుకున్నాం. మా మూడు గ్రామాల్లో నూటికి అరవై, డెబ్బైమంది కౌలుదార్లు వున్నారు. దీనితో పండిన పంటలో కౌలుభాగం ఎక్కువ కావాలని 3 గ్రామాల్లో రైతుకూలీలు భూములు దున్నకుండా సమ్మె చేశారు. ఈ సమ్మెను కామ్రేడ్ వి.కె.గారు, నేను రహస్యంగా నడుపుతున్నాం. భూములు బీడులయ్యాయి. ప్రభుత్వం ఈ ఉద్యమాన్ని ఆపించాలని కొండలమధ్య రిజర్వు దళాలను దాచిపెట్టి, సబ్ కలెక్టరు వగైరా పోలీసు ఉన్నతోద్యోగులు నలుగురు మాత్రమే వూర్లో ప్రవేశించి సమ్మెదార్ల నాయకులను పిలిపించుకొని సంజీవులుగార్ని పిలిపించండి, ఈ సమస్యను పరిష్కారం చేస్తామని ప్రజలకు భ్రమలు పెట్టారు. కొంతమంది ముఖ్యులు నా రహస్య డెన్‌కు వచ్చి, పోలీసులు నలుగురు మాత్రమే వచ్చారు. రమ్మని నన్ను బయటకు పిలిపించారు. స్కూల్లో కలిసి మాట్లాడుతుండగానే రెండు పోలీసు వ్యాన్లు స్కూలును చుట్టేశాయి. దాదాపు 7, 8 వందలమంది రైతుకూలీలు రాళ్ళు రప్పలు తీసుకొని ఆహాకారాలు చేశారు. పోలీసు ఆఫీసర్లు నాతో "గ్రామంలో రక్తపాతం కావాలంటారా లేక ప్రశాంతత కావాలా మీరే నిర్ణయించుకోవాలి" అని అన్నారు. అపుడు నేను ప్రజలను శాంతింపచేసి అరెస్టయ్యాను. అపుడు కడలూరు క్యాంపుకు తీసుకెళ్ళి 2 సం॥ నిర్బంధించారు. ఆ జైల్లోనే రెండుసార్లు కాల్పులు జరిపారు. ఆరుగురు కామ్రేడ్స్ హతులయ్యారు. ఈ సంఘటనలో మా తండ్రి రెండుసార్లు కడలూరుకు వచ్చి, నాకు ధైర్యం చెపుతూ కన్నీరు కార్చారు. నా తండ్రిని, నా రాజకీయ మహోపాధ్యాయులు నీలం రాజశేఖరరెడ్డిని స్మరిస్తూ ఆఖరు క్షణాలవరకు జిల్లా కమ్యూనిస్టు పార్టీలో కౌన్సిల్‌లో సభ్యునిగా కొనసాగుతూ కమ్యూనిస్టు పార్టీకి సేవచేశారు.

★ ★ ★

# శ్రీ బి.ఆర్. భగవాన్ దాస్



వరంగల్ జిల్లాలోని హన్మకొండ (నగరప్రాంతం) కుమార్ పల్లిలో ఒక పేద దళిత కుటుంబములో జన్మించాను. నాకు చదువు ఎక్కువగా అబ్బలేదు. 4వ తరగతివరకు మాత్రమే చదివాను. నేను నివసించే వార్డులో అందరూ బిల్డింగ్ వర్కర్లుగా జీవించేవారు. పనికొరకు ఎక్కువగా ఇతర ప్రాంతాలకు వెళ్ళేవారు. 1944లో నా 14వ ఏట మా వార్డు నుండి చాలామందిమి సింగరేణి కాలరీస్ కొత్తగూడెం వెళ్ళినాము. నేను టైలర్ పని నేర్చుకొనేందుకు పోయాను. అక్కడ బొగ్గుగనుల్లో పనిచేస్తున్న కార్మికులు సంఘంగా వుంటూ పోరాటాలు నిర్వహిస్తున్న నేపథ్యంలో అనాటి కార్యకర్తలు, నేటి సింగరేణి వర్కర్స్ యూనియన్ ప్రధాన కార్యదర్శి కా॥ యం. కొమరయ్యగారు, వెంకటస్వామి తదితరులతో పరిచయమేర్పడింది.

రెండవ ప్రపంచయుద్ధం వివరణ, సోషలిస్టు భావాలతో సోవియట్ యూనియన్ ప్రగతి వివరణ మన రహస్య పత్రిక ద్వారా కా॥ కొమరయ్యగారు స్వయంగా చదువుతూ

మమ్మల్నందరితో చర్చించి యిచ్చేవారు. హన్మకొండ నుండి టైలర్ పని నేర్చుకొనేందుకు పోయిన నేను, కా॥ మద్ది రాజయ్య తదితరులము ఎంతో ప్రభావితమైనాము.

సింగరేణి కార్మికులు కా॥ శేషగిరిరావు గారి నాయకత్వాన జరిగే పోరాటాలు, కార్మికులు నివశించే పేటల్లోనేగాక ఏ వీధిలో చూసినా ఎక్కడికెళ్ళినా పోరాట చర్చలే జరుగుతుండేవి. ఈ పోరాటాల కార్యక్రమంలో వారికి నేను, నా మిత్రులు జెండాలు కుట్టి యిచ్చేవాళ్ళం. ఆనాటి చర్చల్లో సోవియట్ 'రెడ్ ఆర్మీ' వీరోచిత పోరాటాలు, ఉత్పత్తి విధానం, అక్కడ స్త్రీలు కూడా యుద్ధంలో పాల్గొని విజయం సాధించుతున్నారనేది ప్రధానంగా వుండేది. అలాంటి చర్చలే నన్ను కమ్యూనిస్టులు జరిపే పోరాటాలవైపు ఆకర్షించింది. ఇదే సందర్భంగా నైజాం రజాకార్లకు, భూస్వాములకు, జాగీర్దారీ వ్యవస్థకు వ్యతిరేకంగా జరుగుతున్న పోరాటాలు, సోషలిస్టు భావాల ప్రచార ప్రాముఖ్యత, వారి ఆచరణ నన్ను ఆ వైపుకు నడిపించి, ఎర్రజెండాను భుజాన పెట్టుకొనేలా చేసింది.

అంతేకాక, వరంగల్‌లోని అజాంజాహి మిల్లులో ఆ కార్మికులు జరిపే పోరాటాలు, తోళ్ళ కార్మికుల పోరాటాలు కా॥ సర్వదేవభట్ల రామనాథంగారి నాయకత్వాన జరుగుతుండేవి. క్రింది స్థాయిలో వున్న అట్టడుగు పేదజనాలతో అనేక ఉద్యమాలు జరుగుతున్న పరిస్థితిలో నాలో విశ్వాసం కల్గిస్తూ నాలాంటి పేద యువకులను మరింత దృఢపడేలా చేసింది. నేను నివసించే వార్డులో అజాంజాహిమిల్లులో పనిచేసే కార్మికులు కొందరు వుండేవారు. వారి పోరాటాలు, ఆ తీరుతెన్నులు చర్చించేవారు. దానికి తోడుగా కా॥ గొర్రె అంజయ్యగారు మా వార్డు నివాసియే. ఆయన బెల్లంపల్లిలో ఒక ప్రయివేట్ కాంట్రాక్టర్ దగ్గర గుమస్తాగా పనిచేసేవారు. ఆయనకు కార్మికులతో విస్తృతమైన పరిచయాలు వుండేవి. మేము కొత్తగూడెంలో వుండగా కా॥ అంజయ్యగారు బెల్లంపల్లి నుండి పనిపై వచ్చి మాతో చర్చించుతూ మాకు సూచనలు చేస్తూ, కమ్యూనిస్టు పార్టీ పేదలపార్టీ. ఎర్రజెండా నీడక్రింద పని చెయ్యాలని, పార్టీ రహస్య జీవితాల గురించి వివరించేవారు.

1946లో మహాత్మా గాంధీగారు వరంగల్ పర్యటనకు వచ్చినప్పుడు మధ్యతరగతి ప్రజలు అశేషంగా పాల్గొన్నారు కాని, స్థానికంగా అజాంజాహిమిల్లు తోళ్ళ ఖార్ఖానాల్లో కార్మికుల పోరాటాలు విస్తృత స్థాయిలో జరుగుతున్నపుడు పేదప్రజలు ఎర్రజెండా వైపుననే బాసటగా నిలిచినట్లుగా భావించాను. కా॥ అరుణా అసఫలీగారు అజాంజాహిమిల్లు పోరాట సందర్భంగా వచ్చినప్పుడు ఆ కామ్రేడ్‌తో నేను, మా యువకులందరము కలిసి మాట్లాడినాము.

స్వాతంత్ర్య పోరాటంలో అనేకమంది అమరులైనారు. కాని నన్ను ఆకర్షించినది మాత్రం సర్దార్ భగత్‌సింగ్ ఆత్మ బలిదానం. కా॥ భగత్‌సింగ్‌ను ఉరితీసేముందు లెనిన్ జీవిత చరిత్రను చదువుతున్న విషయం తెలిసి, దానికున్న ప్రభావం ఇంతగా వున్నదా అని అనుకునేవాణ్ణి. దాన్ని చదవాలనే తపన నాలో పెరిగింది. అటువైపే నా ప్రయాణం జరిగింది. జీవితాంతం పార్టీకి అంకితమైనాను. సోవియట్ యూనియన్ విజయాలు, తెలంగాణా పోరాట ప్రభావం నాలో తీవ్రంగా పనిచేసినవి.

చివరికి మా ఇల్లు సాయుధ పోరాట కాలంలో "డెన్"గా మారి, కామ్రేడ్‌లను తీసుకెళ్ళి వారి వారి గమ్యస్థానాలకు చేర్చి, కొరియర్‌గా పనిచేసేవాడిని. పార్టీలోకి ఎంతోమంది యువతీయువకులను ఆకర్షించేలా చేసినాను. అనేకమంది క్యాడర్‌ను తయారుచేసినాను. ఇప్పటికీ నావంతు కర్తవ్యంగా దీక్షతో పనిచేస్తూ వున్నాను. రహస్య జీవితంలో పనిచేసే నాయకుల పేర్లు మాత్రం నాడు నాకు తెలియదు. ఎందుకంటే, అన్నీ మారుపేర్లు వుండేవి. 1947 తర్వాత చాలామంది కామ్రేడ్స్‌తో పరిచయాలు ఏర్పడినాయి. వారితో కలిసి పనిచేసే అవకాశం కూడా కలిగింది.

★ ★ ★

# డా॥ సిహెచ్. వెంకట్రామారావు



నేను రాజకీయాల్లో ఓనమాలు నేర్చుకుంది సిర్సిల్ల ఆంధ్ర మహాసభలో. అందులో నేనొక స్వచ్ఛంద సేవకుణ్ణి. ఆ తదుపరి కరీంనగర్ ఉస్మానియా ఆంధ్ర భాషానిలయాన్ని గ్రంథాలయోద్యమంలో ప్రవేశపెట్టింది. 1939లో నేను హైదరాబాదులో విద్య అభ్యసిస్తున్న సందర్భంలో నాకు విద్యార్థుల వందేమాతర ఉద్యమం, ఆర్య సమాజ కార్యక్రమాల్లో పాల్గొనే సదవకాశం లభించింది. పండిత నరేంద్రజీ ఉపన్యాసాలతో ఆకర్షితుడనై, అతనితో వ్యక్తిగత సంబంధాలు పెరిగాయి. నరేంద్రజీ, నాకు గురువైన విఠల్ ప్రసాద్ వైద్య గారికి దగ్గరి మిత్రులు. 1942లో నేను వైద్య విద్య ముగించుకొని కరీంనగర్ చేరాను. కొద్దికాలంలోనే వైద్యవృత్తిలో నిలదొక్కుకోగలిగాను. తగినంత ప్రాక్టీసు, చేతినిండ సంపాదన సాధించగలిగాను. ఆనాటి కాలంలో వైద్యుల కొరత తీవ్రంగా వుండేది. ప్రయివేటుగా ప్రాక్టీస్ చేసేది డా. పార్థసారథి గారు, నేను

మాత్రమే. ఆ కాలంలోనే రోజు సాయంత్ర సమయం మిత్రులతో, ఆంధ్రభాషా నిలయంలో గ్రంథాలు, పత్రికా పఠనం, బ్యాడ్‌మెంటన్ ఆడటం జరుగుతుండేది. శ్రీయుతులు పోల్కంపల్లి వెంకటరామారావుగారు, వెంకటరాజన్న అవధాని, డాక్టర్ పార్థసారథి, మురహర్‌రావ్ వకీలు, బద్దం ఎల్లారెడ్డిగారు, ఆనభేరి ప్రభాకర్‌రావు, సింగిరెడ్డి భూపతిరెడ్డి, తదితర మిత్రులెందరో అచ్చట దర్శనమిచ్చేవారు. మిత్రులు సింగిరెడ్డి భూపతిరెడ్డి నా స్కూల్‌మేటు, నాకంటే ఒక తరగతి సీనియర్. మా అన్నయ్య క్లాస్‌మేటు. అందువల్లే అతనితో విద్యార్థి దశలోనే నాకెంతో చనువు. కరీంనగర్‌లో నా క్లినిక్ అతని అక్కగారైన కాంతమ్మ ఇంట్లో అద్దెకు తీసుకున్నాను. అతని బావ వీరారెడ్డి (రేపాక) వకీలు. ఈ ఇల్లు సిక్‌వాడి, బోయవాడల నడిబొడ్డులో వుంది.

## స్వాతంత్ర్యోద్యమ స్ఫూర్తి:

15 ఆగస్టు 1947లో మనదేశానికి స్వాతంత్ర్యం వచ్చింది. ఈ దేశ స్వాతంత్ర్యం గాలి హైదరాబాద్ చుట్టూ వ్యాపించటం సహజం గదా! హైదరాబాద్ రాష్ట్రాన్ని భారతదేశంలో విలీనం చేయాలని ఇచ్చటి రాష్ట్ర కాంగ్రెస్, ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీల ఉద్యమాలు తీవ్రతరమయ్యాయి. రాజకీయ కేంద్రంగా ఉన్న ఆంధ్ర భాషా నిలయంపై రజాకార్ల కన్నుపడింది.

గ్రంథాలయ కార్యదర్శిగా వున్న వెంకటరాజన్న అవధానిగారిపై వారు దాడి కేంద్రీకరించారు. వాటిని తట్టుకోజాలక అవధానిగారు తమ పిల్లలతో సహా మంథనికి మకాం మార్చారు. ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీ నాయకులంతా నైజాం వ్యతిరేక పోరాటంలో నిమగ్నులయ్యారు. పోల్కంపల్లి వెంకట రామారావుగారు అంతకుముందే అనారోగ్యంలో దివంగతులయ్యారు. కాబట్టి, గ్రంథాలయ బాధ్యతను నేనే స్వీకరించాల్సి వచ్చింది. అది ఆనాడు అన్ని పార్టీలకు కేంద్రంగా వుండేది. 1950 వరకు దాని బాధ్యునిగా కొనసాగి, అప్పుడు సి.సి. బ్యాంకు అధ్యక్షులుగా వున్న అయితేపెల్లి తిరుపతిరావుగారికి ఆ బాధ్యతను అప్పగించాను. మిత్రుడు భూపతిరెడ్డి అతి సౌమ్యుడు, శాంతమూర్తి, గాంధేయవాది, గొప్ప మానవతామూర్తి. అతను సిరిసిల్లా తాలూకా ఆంధ్ర మహాసభ బాధ్యతను చూస్తుండేవాడు. ఇచ్చట జిల్లా ఆంధ్ర మహాసభ ఆఫీసు సైతం బోయవాడలోనే వుండేది. కాబట్టి, నా క్లినిక్ అతనికి రెండవ కేంద్రంగా పనిచేసేది. వారికి ఒక డొక్కు సైకిలు వుండేది. దానిపై గ్రామాలకి ఇతని పర్యటన, సైకిల్ హేండిల్ పైన ఒక మందుల సంచి, వెనుక క్యారీయర్‌పైన ఆంధ్ర మహాసభ సాహిత్యం సదా వుండాల్సిందే. గ్రామాల్లో ఎచ్చట, ఎంత దూరమైనా సంఘం కార్యకర్తలు జబ్బుపడ్డ వార్త తెలిస్తే అచ్చట అతను వాలాల్సిందే. కరీంనగర్ వచ్చిన ప్రతి సందర్భంలో మలేరియా, విరోచనాల, దగ్గు తుమ్ములు, ఇతర సామాన్య వ్యాధులన్నింటికి ఫస్ట్ ఎయిడ్ అవసరమైన మందులు నావద్ద తీసుకెళ్ళేవాడు. గ్రామాల్లో వయోజన పాఠశాలలకు ఆనాడు అతను పెట్టింది పేరు. అహింసావాది గాంధేయవాదిగా ప్రారంభించిన అతని జీవితం నైజాం దమన నీతి, రజాకార్ల దుండగాలు అతన్ని సాయుధ పోరాటానికి సమాయత్తపరిచాయి. ప్రభుత్వము కమ్యూనిస్టు పార్టీ, ఆంధ్ర మహాసభ కార్యక్రమాలను నిషేధించింది.

## నా జీవిత గమనాన్నిమార్చిన అల్లీపురం సంఘటన:

అది ఆగస్టు 13వ తేదీ 1947వ సంవత్సరము. గాలిపెల్లి నుండి ఒక రైతు భూపతిరెడ్డిగారినుండి ఒక ఉత్తరం తెచ్చాడు. నేను జబ్బుపడ్డాను రమ్మని ఆ ఉత్తరం సారాంశం. ఆ పిలుపు అందుకొని నేను అతను వున్న జవహారుపేట (జవ్వార్ పేట) బయలుదేరి వెళ్ళాను. అది మిత్రులు అశిరెడ్డిగారి ఇల్లు. ఆంధ్ర మహాసభ కార్యకర్తలకు, నాయకులకు పెట్టని కోట. వచ్చిన ప్రతివారికి భోజనం, అవసరమైన డబ్బులు, ఇతర సదుపాయాలు కలిగించడం అతని రోజువారి కార్యక్రమాలు. అశిరెడ్డిగారు గొప్ప త్యాగశీలుడు. రైతుల పెన్నిధి. నేడు అతడు లేడు. జవ్వార్ పేటలో భూపతిరెడ్డిగారికి వైద్య సేవలందించి నేను నా బంధువు, అతని శ్రేయోభిలాషి యస్. నారాయణరావు (అనంతగిరి) గారి వద్దకు వెళ్ళాను. ఆనాడు 15 ఆగస్టు హైదరాబాద్ రాష్ట్రాన్ని ఇండియా యూనియన్లో చేర్చాలని గ్రామగ్రామాన జాతీయ ఝండా ఎగురవేయాలని, ప్రదర్శనలు సభలు, సమావేశాలు జరపాలని అన్ని రాజకీయ పార్టీల పిలుపు. ఆ పిలుపు నందుకొని అన్ని గ్రామాల నుండి ప్రదర్శనలు జరుపుతూ గాలిపెల్లి నాయకత్వంలో అనంతగిరి సమీపంలో వున్న అల్లీపురం (సిద్దిపేట తాలూకా)లో బహిరంగ సభ ఏర్పాటు చేశారు. వేలాదిజనం అనంతగిరి గ్రామం ద్వారా అన్ని గ్రామాల నుండి అల్లీపురం వెళుతున్నారు. ప్రతివారివద్ద ఏదో ఒక ఆయుధం వుంది. తుపాకులు, గండ్ర గొడ్డళ్ళు, బర్సీలు, గునపాలు వారి ఆయుధాలు.

"కత్తులు దూసుకపోయినా
నెత్తురు టేరులు పారినా
ఎత్తిన ఝుండదించకోయ్
అరుణ పతాకకి జై"

అంటూ కదం త్రొక్కుతూ, పాడుతూ సమూహాలు వెళుతూనే వున్నాయి. పెల్లుబుకుతున్న ప్రజా చైతన్యానికి ప్రభావితుడనై అల్లీపురం వెళ్ళాలని నిర్ణయించుకున్నాను. బంధువు, గురు సమానులైన కా. నారాయణరావుగారు వలదన్నా, వారించినా వెళ్ళాను. అల్లీపురం గ్రామంబైట గొప్ప సభ జరుగుతూంది. బల్లలతో వేదిక ఏర్పాటు చేశారు. ఎర్రజెండాలు, జాతీయ జెండాలతో వేదికనలంకరించారు. సుమారు ముప్పది నలబది వేల జనంతో సభ కిటకిటలాడుతోంది. తిరునగిరి సూర్యనారాయణ చిరుత వయసు పిల్లవాడు. కల్లు నిషేధమనే పుస్తకం చదువుతున్నాడు. అందరు నిశబ్దంగా వింటున్నారు. మధ్యమధ్య ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీలకు జై అనే నినాదాలు, అడపాదడపా కాంగ్రెసుకు జై, మహాత్మా గాంధీకి జై అనే నినాదాలు మిన్నుముట్టుతున్నాయి. పుస్తకమంతా చదవటం అయిపోయింది. సూర్యనారాయణ వేదికపై ఒక ప్రక్క కూర్చున్నాడు. అయినా జనం లేవలేదు. సభకు ముందు భూపతిరెడ్డి వస్తారని ప్రకటించారు. కాబట్టి, జనం అతడు వస్తాడని నమ్ముతున్నారు. భూపతిరెడ్డి జిందాబాద్ అని నినాదాలు మిన్నుముడుతున్నవి. వారు వచ్చేవరకు అందరూ వుండాల్సిందేనని సమావేశకర్తల ఆదేశాలు. సభకు దూరంగా జనంలో నిలబడ్డ నేను జనంలో వున్న ఉత్సాహంతో ప్రేరేపితుడనై నావెంటనున్న అనంతగిరి రైతుల వద్ద ఒక బనీయను, రుమాలు, వేరొక రుమాలును ధోతిగా మార్చి

ధరించి, నేనే భూపతిరెడ్డినయ్యాను. జనం భూపతిరెడ్డి వచ్చాడనే ఉత్సాహంతో ఉప్పొంగిపోయారు. అతనంటే జనంలో కట్టలుతెగే వాత్సల్యం, ప్రేమ వుంది. అతను సంఘ నాయకుడుగా, వారికి అందించే సేవలే దీనికి తార్కాణం. ఉపన్యాసం ఆరంభమైంది. అంతలో సిద్దిపేట నుండి ఒక పోలీసు వ్యానులో వచ్చిన పోలీసులు సభ జరుపవద్దని, కర్ఫ్యూ, 144 సెక్షన్ విధించామని హెచ్చరించారు. జనం రెచ్చిపోయింది. సభ జరగాల్సిందేనన్నారు. పోలీసు వ్యానుపైన దాడి జరిగింది. వ్యాను అద్దాలు పగులగొట్టారు. ముందుభాగం కొంత ధ్వంసమైంది. ఇద్దరు పోలీసులను చితకబాదారు. పోలీసులు, సబ్ ఇన్స్పెక్టర్‌తో సహా వచ్చినదారి పలాయనం చిత్తగించారు. జనం వారిని వెంబడించింది. అల్లీపురం గ్రామంలో వున్న పోలీసు వ్యానును ధ్వంసం చేశారు. పోలీసు వ్యాన్ సిద్దిపేట వైపు దూసుకువెళ్ళింది. జనసమూహం సభ జరగాల్సిందేనని పట్టుబట్టారు. వారి ఉత్సాహానికి నేను కరిగిపోయాను. అదే నాకు మొదటి బహిరంగసభ, పొంగులు వారుతున్న జనప్రవాహం ప్రేరణతో ఒక గంటన్నర వరకు ధారాళంగా మాట్లాడాను. జనం నన్ను భూపతిరెడ్డిగానే స్వీకరించారు. ఆనందించారు. నేను సంతోషించాను. సభానంతరం నావేషం మార్చి అనంతగిరి చేరాను. తిరుగు ప్రయాణంలో జవ్వారుపేట వెళ్ళాను. భూపతిరెడ్డిగారిని కలిస్తే వారెంతో సంతోషించారు. అనారోగ్యంతో వారు లేని లోటును తీర్చినందుకు నన్ను కౌగిలించుకున్నారు.

అనాటి ఘటన నా జీవిత గమనాన్నే మార్చింది. నన్ను సమరశీల రాజకీయ వాదిగా తీర్చిదిద్దింది. ఒక రాజకీయ నాయకునిగా నిలబెట్టింది.

కరీంనగర్ తిరిగివచ్చిన నేను ఆనాటి నుండీ రహస్యంగా కాంగ్రెస్, కమ్యూనిస్టులనే భేదం లేకుండా స్వంతగా ఆర్థికంగా కార్యకర్తలకు తోడ్పడటం, విరాళాలు సేకరించి పంపటం, రహస్యంగా డాక్టరుగా వైద్య సేవలందించడం నా నిత్యకృత్యమైపోయింది. వైద్యరంగంలో లీడింగ్ ప్రాక్టీషనర్‌గా అధికార అనధికారులతో నాకున్న పలుకుబడి, వైద్య సంబంధాలు ఉద్యమానికి బాగా తోడ్పడ్డాయి. అల్లీపురం ఘటనతో పోలీసులు నాపై వారంటు జారీ చేశారు. క్లినిక్ సోదా చేసి, క్లినిక్ రెండువైపుల దూరంగా పోలీసు నిఘా ఏర్పాటు చేశారు. స్థానిక పోలీసు అధికార్లతో నాకున్న వైద్య సంబంధాలతో నన్ను అరెస్టు చేసే సంకల్పాన్ని విరమించుకున్నారు. అల్లీపురం సంఘటన నాలో వున్న చైతన్యాన్ని త్యాగశీలతను తట్టిలేపింది.

కాంగ్రెస్ పార్టీకి చెందిన కీర్తిశేషులైన కె.వి. నర్సింగరావు, పి.వి. నరసింహారావు గారితో నాకున్న స్నేహం, రాజకీయ సంబంధాలు నాతో చాందా క్యాంపుకు సుమారు ఏడు, ఎనిమిది వేల రూపాయలు సేకరించి పంపించడానికి తోడ్పడింది. రెండుసార్లు రహస్యంగా చందా క్యాంపుకు వెళ్ళి విరాళాలు సేకరించి యిచ్చివస్తున్న సందర్భంలో మెట్టుపెల్లిలో పోలీసులు అరెస్టు చేశారు. మూడు రోజుల తర్వాత కరీంనగర్‌లోని ఉన్నత పోలీసు అధికార్ల సలహాలపై మళ్ళీ విడుదల చేయటం జరిగింది. రెండవసారి సుల్తానాబాద్ తాలూకాలో విరాళ సేకరణకై కాంగ్రెస్ నాయకుడు చొక్కారావు గారితో కలిసి తారపెల్లిగూడెం, తదితర గ్రామాల్లో విరాళాలు సేకరించాను. సేకరించిన విరాళాలు చొక్కారావు గారి ద్వారా చందా క్యాంపుకు పంపించి, నేను హన్మకొండ

ప్రయాణం కట్టాను, వరంగల్ జిల్లాలో విరాళాలు సేకరించే నిమిత్తం (పాతకపెల్లి).

రైల్వేస్టేషన్‌లో రైలు ఎక్కే సందర్భములో పోలీసులు నన్ను అరెస్టు చేశారు. ఆ రాత్రంతా (పోలీస్ స్టేషన్) తానాలోనే వుంచారు. తెల్లవారంగానే తానే జమేదార్ (ముస్లిమ్ – సీర్లపంచ సిర్సిల్ల తాలూకా – పేరు జ్ఞాపకం లేదు) వచ్చి నన్ను గుర్తుపట్టాడు. ఇతడు పేరు ప్రఖ్యాతిగల డాక్టర్ వెంకటరామారావుగారని, కరీంనగర్‌లోని డి.యస్.పి. తదితర పోలీసు అధికార్లకు వైద్య సేవ చేసేవారని సబ్ ఇన్‌స్పెక్టర్‌కు నచ్చచెప్పి ఒప్పించి విడుదల చేయించాడు. వైద్యసేవ లందించడంలో కాంగ్రెస్, కమ్యూనిస్టులనే భేదము లేకుండా ఖాసింపేట వెంకటరెడ్డి, జె. దామోదర్‌రావు, అనంతారం మురళీధరరావు, సింగిరెడ్డి భూపతిరెడ్డి, గౌతంరావు తండ్రి, ఇరుకుల్ల చొక్కారావుగారలు తదితరులెందరికో సుదూర ప్రాంతాల్లో వుండి వైద్య సేవలందించడం జరిగింది. ఇందులో కొందరు కాల్పులకు లోనై గాయపడినవారున్నారు.

నాపై వారంటున్నా; క్లినిక్, ఇంటిపైన నిఘావున్నా అన్ని పార్టీల రాజకీయ కార్యకర్తలు రాత్రి సమయాల్లో చేతిలో మందు సీసాలు పట్టుకొని రావడం జరుగుతుండేది. రోగులుగా వచ్చే ఈ పద్ధతి నిఘాలో వున్న పోలీసులు కళ్ళు కప్పడానికి బాగా ఉపయోగపడింది. నా ఇల్లు ఆనాడు పోరాట కేంద్రాలకు ఆయుధాలు, గ్రెనేడ్లు, ఉత్తరాలు అందించే కేంద్రంగా పనిచేసింది. ఒకనాడు కె.వి. నర్సింగరావు గారు నా ఇంట్లో వున్నట్లు వార్త తెలిసి పోలీసు దాడి జరిగింది. ఇంటివెనుక వున్న దర్వాజ నుండి బోయివాడలో వేరేచోటికి ఆ రాత్రి మార్చి మరునాడు చందాకు పంపించడమైంది. ఆనాటి వార్తాహరుల (కొరియర్ల) వ్యవస్థ, వారి త్యాగాలు అనన్యసామాన్యం. వారు ఎంతటి త్యాగాలకైనా వెనకాడేవారు కారు. వీరు గొప్ప త్యాగధనులు. వీరంతా చరిత్ర పుటల్లో అనామకులుగానే మిగిలిపోయారు. గాలిపెల్లి దహనం, మాంధాపురం ఘటన, స్థానిక పోలీసులకు తెలువకముందే కొరియర్ల ద్వారా నాకందించడం జరిగింది. ఈలాంటి ఘటనలు ఎన్నెన్నో. దినమనక, రాత్రనక, కాలినడకన, సైకిళ్ళపైన వీరు వెళ్ళాల్సిందే. ఆనాటి పోరాటానికి వీరే జీవనాడులు. ఎందరో మహానుభావులు, త్యాగధనులు – వారి త్యాగాల ఫలితమే నేటి స్వాతంత్ర్యం.

## మాంధాపురం పోరాటం:

అనభేరి ప్రభాకరరావుగారు పోలంపల్లిలో ఒక సంపన్న కుటుంబంలో జన్మించారు. ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీ ఉద్యమాలకు ఆకర్షితులయ్యారు. నైజాం వ్యతిరేక పోరాటంలో, కరీంనగర్ జిల్లా మొదటి దళానికి నాయకత్వం వహించారు. సింగిరెడ్డి భూపతిరెడ్డి అతని అనుంగు మిత్రుడు, సహచరుడు. భూపతిరెడ్డి ఎంత సౌమ్యుడో, ప్రభాకర్ అంత మిలిటెంటు. శత్రువుగుండెల్లో అతని చూపులే తూటాలై నిలిచేవి. సాహసానికి, ధైర్యానికి ఇతను పెట్టిందిపేరు. కరీంనగర్ జిల్లాలో నైజాం మిల్టిరీకి వ్యతిరేకంగా రణభేరి మ్రోగించింది, అనభేరి ప్రభాకరే. వీరు పీడిత ప్రజల విముక్తికై మా జిల్లాలో ప్రాణా లర్పించిన మొదటి అమరవీరుడు.

వీరి త్యాగాలు అసమానమైనవి. చిరస్మరణీయమైనవి. కరీంనగర్ తాలూకా మాంధాపురం గుట్టల్లో వందలాది నైజాం పోలీసు, రజాకార్ల నెదిరిస్తూ వీరు వీరమరణం

చెందారు. మాంధాపురం పోరాటం చరిత్ర పుటల్లో సువర్ణాక్షరాలతో కలకాలం నిలిచి వుంటుంది. అది మనరాష్ట్ర స్వాతంత్ర్య చరిత్రలో చెరగని ముద్రవేసింది.

"ఒక వీరుడు మరణిస్తే
వేలకొలది ప్రభవింతురు
ఒక నెత్తురు బొట్టులోన
ప్రళయాగ్నులు ప్రజ్వరిల్లు"

అన్న విప్లవనానుడి అక్షరాల రుజువు చేసింది. ఆ స్ఫూర్తితోనే 'నీ బాంచ్‌ను కాల్మొక్కుత, గులాపోన్ని' అన్న ఆనాటి సామాజిక వ్యవస్థ నుండి వేలాది నైజాం వ్యతిరేక పోరాట వీరులు ప్రభాకర్, భూపతిరెడ్డి గారలకు వారసులుగా నిలిచారు. నైజాం మిల్టరీ, రజాకార్ మూకలనెదిరిస్తూ ప్రాణాలొడ్డారు. తుదకు నైజాం రాజరికానికి పతనం తప్పలేదు. ఖాసిం రజ్వీ, అతని రజాకార్ మూకలు మట్టి కరిచారు. పీడిత ప్రజావిముక్తి పోరాటం అంతిమ విజయం సాధించింది. వారి త్యాగాల స్ఫూర్తి, దీప్తి నేటి యువతకు ఆదర్శంగా నిలవాలి.

★ ★ ★

# శ్రీ కర్నాటి కృష్ణయ్య



1922 ఆగస్టు 25వ తేదీన నేలకొండపల్లి శివారు పాతకొత్తూరు అనే కుగ్రామములో జన్మించారు. గ్రామములో ప్రైవేటు పాఠశాలలో 2వ తరగతి, తరువాత నేలకొండపల్లి ప్రభుత్వ పాఠశాలలో 4వ తరగతి వరకు మరల ప్రైవేట్ పాఠశాలలో 8వ తరగతి వరకు చదివిన తరువాత గుంటూరు జిల్లా బాపట్ల తాలూకా మంతెనవారి పాలెంలో అన్నాప్రగడ కామేశ్వరరావుగారు విద్యావనమనే విద్యా సంస్థను నెలకొల్పారని తెలిసి అక్కడికి వెళ్ళి 10వ తరగతి చదువుచుండగా ఆ పాఠశాలపై ప్రభుత్వము నిషా వేసింది. అప్పటి బ్రిటిష్ ప్రభుత్వము ఆయన గారిని నిర్బంధించింది. పాఠశాల నిలిచిపోయిన కారణంగా ఇంటికి తిరిగి వచ్చి చదువుకు స్వస్తి చెప్పాను.

ఒక గ్రామములో ప్రైవేట్ పాఠశాల నడుపుతూ గ్రామములోనే హరిజనులకు పాఠశాల ఏర్పాటు చేసి ప్రతిరోజూ పగలు గ్రామములోని ప్రైవేటు పాఠశాల, రాత్రిపూట హరిజన పాఠశాల నడుపుతుండగా గ్రామంలోని అగ్రకులాలవారు గూడెం

బడిపెట్టితే గ్రామంలోని పాఠశాల నడపవద్దని బెదిరించారు. దానితో గ్రామములో పాఠశాలను కూడా పెట్టడం మనస్కరించలేదు. అందువలన పాఠశాలకు కూడా స్వస్తి చెప్పాను. అప్పటికి నాకు 18 సంవత్సరములు.

గాంధీగారి ఖమ్మం పర్యటనలో వెళ్ళాను. ఆంధ్ర మహాసభలో గ్రామాలలో సభ్యత్వము చేర్పించి, గ్రామ సంఘాలు ఏర్పాటు చేయడం చేశాను. ఆంధ్ర మహాసభలకు మడికొండ, భువనగిరి, ఖమ్మం, హైదరాబాద్ సభల్లో పాల్గొన్నాను. ఆ రోజులలో 1945-46 సంవత్సరాలలో లెవీ పేరుతో య. 1కి 2 కుండలు ధాన్యం వసూలు చేసి గ్రామాధికారుల దగ్గర ఉంచెడివారు. వాటిని పేదవారికి అవసరమైనపుడు ఇచ్చి తక్కువ నాగుతో తిరిగి తీసుకోవాలని ఇది ఒక కమిటీ ద్వారా జరగవలెనని, ప్రభుత్వ ఆదేశం. కానీ గ్రామాధికారులెవరూ పేదలకు ఇచ్చిన దాఖలు లేవు. వారు స్వంతావికే ఉపయోగించుకునేవారు. అందువలన నేనీ వ్యతిరేక పోరాటము, వెట్టిచాకిరి వ్యతిరేకంగా జరిగే పోరాటంలో పాల్గొనేవాడిని.

గ్రామములో మా నాయనగారు కూడా బాకీలు పెట్టుతుండెడివారు. ఒక బలహీన వర్గానికి చెందిన రైతు భూమిని అప్పుక్రింద కట్టుకున్నారు. ఆ సంగతి తెలిసి బాకీ క్రింద భూమిని కట్టవలసిన పనిలేదని చెప్పాను. ఆ రైతు భూమిని స్వాధీనము చేసుకున్నాడు. ఆంధ్ర మహాసభ జరిపే వెట్టిచాకిరి, లేవీ వ్యతిరేక పోరాటాలు, జమీందారీ, జాగీర్దారీ వ్యతిరేక పోరాటాలు నన్ను ఆకర్షింపచేసి, 1945లో కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వము తీసుకున్నాను. అప్పటి నుండీ ఆంధ్ర మహాసభ, కమ్యూనిస్టు పార్టీలు నిర్వహించే శిక్షణా తరగతుల్లో పాల్గొన్నాను.

రజాకార్ దుండగాలకు వ్యతిరేకంగా ఆంధ్ర మహాసభ కమ్యూనిస్టు పార్టీ ఆదేశముల మేరకు ఖమ్మం – కోదాడ రహదారి, గువ్వలగూడెం – నేలకొండపల్లిల మధ్య ఉన్న వాగుపై వంతెన వద్ద ఈతచెట్లు కొట్టి అడ్డంగా వేశాము. దానిపై రాకపోకలు నిలిచిపోవడంతో ప్రాంతంలో పెద్ద సంచలనం ఏర్పడింది. 3వ రోజున పోలీసులు గ్రామోద్యోగులు, గ్రామ నౌకర్లతో వచ్చి మా ఇంటిని చుట్టుముట్టారు. మా అమ్మగారు నన్ను లేపి పోలీసులు ఇంటి చుట్టూ ఉన్నారని చెప్పారు. నేను లేచి కంప దూకి పరారయ్యాను. నేను దూకిన చోట గ్రామ నౌకరు కాపలా వున్నాడు. అయ్యా, నెమ్మదిగా వెళ్ళండని చెప్పాడు. పోలీసులు ఇంటిలోకి చొరబడి, నా భార్యను నీ భర్త ఎక్కడ ఉన్నాడో చెప్పమని అన్నారు. నాకు తెలియదని చెప్పితే, సిగరెట్లు ఇప్పుడు కాల్చినవే. ఎక్కడున్నాడో చెపుతావా లేదా అని బెదిరించితే, నాకే సిగరెట్లు త్రాగే అలవాటున్నది అని ఎదురు సమాధానం ఇచ్చినది. దానితో మా నాయనగార్ని, అన్నగార్ని చేతులు కట్టి కొండపల్లి తీసుకువచ్చి కాల్చివేస్తామని బెదిరించారు. అయినా, మా ఇంటికి రావడం లేదని సమాధానము ఇచ్చారు. ఈసారి ఇంటికివస్తే పట్టిస్తామని రాయించుకుని వదిలిపెట్టారు.

దానితో నా రహస్య జీవితం ప్రారంభమైంది. ఒక దళాన్ని ఏర్పాటుచేసి మునగాల పరగణా సిరిపురములో క్యాంపు ఏర్పాటు చేసినాను. ఆ గ్రామ కామ్రేడ్స్ పూర్తి సహకారము ఇచ్చినారు. అక్కడినుంచి గ్రామాల్లో భూస్వాముల వద్ద ఉన్న తుపాకులు స్వాధీనము చేసుకుని, ఈ ప్రాంతములో పాలేరు గ్రామం నుండి కృష్ణాజిల్లా

సరిహద్దు గ్రామం మల్కాపురం వరకు ప్రభుత్వ కార్యకలాపాలను స్తంభింపచేశాము. ఈ గ్రామాలలో ప్రజాకోర్టులు నిర్వహించాం.

పాలేరు మధ్యతరహా ప్రాజెక్టు క్రింద 10వేల ఎకరాలు సాగు అవుతుండేది. అధికారులు వెళ్ళిపోయినందున రైతుల కోరిక మేరకు ప్రాజెక్టు నిర్వహణ బాధ్యతను స్వీకరించి విజయవంతంగా పంటలు పండించడానికి తోడ్పడి రైతాంగ మన్ననలను పొందాం. ఈ స్థితిలో పాలేరు ప్రాంతంలో తిరుగుతున్న కృష్ణయ్య అనువానిని పట్టి ఇచ్చినవారికి 10వేల రూపాయలు పారితోషికము ఇస్తామని ప్రభుత్వము ప్రకటించింది. అయినా ఎవ్వరూ ముందుకు రాలేదు. ఈ దశలో కొంతమంది కమ్యూనిస్టు నాయకులు పార్టీకి రాజీనామా ఇచ్చి కాంగ్రెస్ తీర్థము పుచ్చుకున్నారు. మా నాయనగారు నన్ను పిలిపించుకుని "నాయకులు రాజీనామా ఇస్తున్నారు. ఏమి చేయాలని ఆలోచిస్తున్నావు? ఏమైనా సరే, మాకు ఎన్ని కష్టాలు వచ్చినా భరించుతాము. నీవు రాజీనామా చేయవద్దు. నీ దారిని నీవు ప్రయాణం చేయ"మని చెప్పినారు. ఆ విధంగానే కొనసాగాను. కమ్యూనిస్టు పార్టీ అగ్రనాయకులు దేవులపల్లి వెంకటేశ్వరరావు. పుచ్చలపల్లి సుందరయ్య; మొదలగువారు ఈ ప్రాంతమునుండే విజయవాడకు వెళుతుండెడివారు. వారిని సురక్షితముగా పంపించుతుండెడివాడిని. 1947 సెప్టెంబర్ 7వ తేదీన యూనియన్ సైన్యాలు రాష్ట్రములోనికి ప్రవేశించినవి. ఆ రోజునే మా దళం నేలకొండపల్లి ప్రాంతముపై దాడిచేసి, ఆయుధములు, మందుగుండు సామగ్రి స్వాధీనము చేసుకున్నవి. నేలకొండపల్లిలో వున్న ముస్లింలు భయభ్రాంతులైనారు. వారికి 2 రోజులు మా గ్రామములో వసతి కల్పించి, అభయమిచ్చి పంపించినాము. యూనియన్ సైన్యాలు నాకోసం గాలించి, మా నాయనగార్ని, మామగార్ని అరెస్టు చేసి, రాష్ట్రములో మొదటి ఎన్నికలు జరిగేటప్పుడు విడిచిపెట్టారు.

★ ★ ★

# కీ॥శే॥ అనిశెట్టి సుబ్బారావు



ప్రముఖ అభ్యుదయ కవి అనిశెట్టి సుబ్బారావును "నీవు కమ్యూనిస్టు పార్టీలో ఎందుకు చేరావు?" అని అడిగారు. ఆయన సమాధానంగా "సమధర్మం జగత్తు నిర్మించేందుకు నా మేధస్సు, హృదయం అర్పించాను" అని *1945* జులై *11* ప్రజాశక్తి వారపత్రికలో వ్రాశారు. అనిశెట్టి నేడు లేరు కాని, ఆయన యిచ్చిన అమూల్యమైన సమాధానం వుంది. ఇప్పటికి అర్ధశతాబ్దం క్రిందట, అంటే *51* సంవత్సరాల క్రితం ఆయన వ్రాసిన యీ సమాధానం నేటికీ ప్రగతిశీల రచయితలందరికీ వర్తిస్తుంది. వారి భావాలను ప్రతిబింబిస్తుంది. సమధర్మ జగత్తు నిర్మించే ఆ పోరాటం ఎన్నో ఎన్నెన్నో ఒడిదుడుకులకు గురవుతూ యింకా సాగుతూనే వుంది.

రష్యాలో, తూర్పు యూరప్‌లో సోషలిస్టు సమాజ నిర్మాణ ప్రయోగాలు తాత్కాలికంగా దెబ్బతినవచ్చు కాని, సమధర్మ జగత్తు నిర్మించే ఆ పోరాటం ఆగలేదు, సాగుతూనే వుంది. అందుకే మరొక్కమారు యీ అభ్యుదయ కవి వాక్కులను యీ సందర్భంలో పాఠకులకు జ్ఞప్తికి తెస్తున్నాం — సం॥

ఇంటా బయటా ఒకే ప్రశ్న: ఎందుకు ప్రవేశించావు కమ్యూనిస్టు పార్టీలో? అన్నారు, అంటున్నారు. కొందరు విజ్ఞానులు సుముఖమౌతున్నారు. కొందరు అజ్ఞానులు దూరమౌతున్నారు.

వ్యవస్థా చక్రంలో తప్పనిసరిగా తిరుగుతూ కొత్తదనాన్ని ప్రతిదాన్నీ శంకించే వ్యక్తుల్ని చూస్తే జాలివేస్తుంది. నాకు తెలుసు: ఒకనాటికే ఈ విముఖులు, శత్రువులు తాము చరిత్రనే కళంకితం చేసినట్లు గ్రహిస్తారని.

మానవుణ్ణే నేను. కోట్ల మానవుల అమాయిక ప్రాణాలు దాహం తాగే సమాజ యంత్రంలో పనిముట్టుకాదు నా దేహం. వ్యక్తతా ప్రకాశం. జీవన చైతన్యం కలిగిన నేను చరిత్రకు బానిసనుగాను – నేతను.

చరిత్రలో బుద్ధుడు, జీసస్, సోక్రటీస్, జీవితాన్ని పరిణతి పొందించేందుకు మధనపడి వధపొందిన సహస్రజీవులు ప్రేమ విశ్వాన్నంతనూ చైతన్యమయ జీవనోద్యమంగా మార్చుతుంది అన్నారు. విపులమైన పరిశీలనతో, గతి తార్కిక తత్వంతో మార్క్స్ సిద్ధాంతీకరించాడు. చరిత్రకు కర్తవ్యతాజ్ఞానం ఇచ్చాడు.

మానవ హృదయానికీ, పాదానికీ ఎల్లలు హద్దులు లేవు. జగత్తు అంతా మానవుని శోభామయ గృహంగా వెలిసేందుకు కమ్యూనిస్టులు కృషి చేస్తున్నారు.

నాకు తెలుసు: ఇది మానవుని బాల్యం. చైతన్య రాహిత్యం. జీవన దౌర్బల్యం కారణంగా సంప్రాప్తమైన బాల్యారిష్టాలు అతని జీవాన్నే కుంగదీసి, పీల్చి పిప్పి చేస్తున్నాయి. ఇది విధి! స్వచ్ఛమైన, కళంక రహితమైన సమాజ వికాసాన్ని ప్రోద్బ వించడం, నూత్న జీవనశంఖం పూరించడం!

గుండె గుండెకూ మధ్య కట్టుబాట్లు, ఇంటింటి నడుమ రాతిగోడలు, చేను చేనుకూ, జాతి జాతికీ మధ్య పొలిమేరలు నన్ను, నా సోదర మానవుల్ని అవమానిస్తున్నాయి. ప్రబలమైన ఈ జాడ్యానికి మానవత్వం ఆహుతౌతోంది. అర్ధణాడబ్బుల వద్ద విచ్ఛిన్నమైన కుటుంబాల్లో ద్వేషం, పొలంగట్లవద్ద కొట్లాడిన పల్లీయులు ఓడ్చిన నెత్తురు, నది కోసం, గనికోసం పోరాడిన జాతులు కోల్పోయిన కోట్ల మానవుల కంకాళాలు ఏమని ఘోషిస్తున్నాయి? “ఇది రాక్షసం. సమాజ యంత్రం సమాజాన్ని ధ్వంసం చేస్తోంది. దీన్ని బ్రద్దలు చెయ్యి. సమధర్మం నిర్మించు!” అని, ఈ ఘోష విన్న ప్రతి హృదయం దద్దరిల్లుతోంది. తన సర్వశక్తులూ మేళవించి యీ యంత్రాన్ని మూలమట్టం చేస్తోంది. ఈ మహత్కార్యం మానవత్వాన్ని నిరూపిస్తోంది, సర్వతోముఖంగా, అవ్యాహతంగా. ఇందుకే కమ్యూనిస్టు పార్టీ పోరాడుతోందని చరిత్ర రుజువు చేస్తోంది!

పీడితులు, బాధితులు, దరిద్రులు జగత్తులో మానవత్వాన్ని సమర్ధిస్తున్నారు. నిర్మిస్తున్నారు. ఈ మహోద్యమానికి కమ్యూనిస్టు పార్టీ శిరస్సు. ప్రకృతిలో పాతుకుపోయిన పాదాలతో, ఆదర్శ శిఖరాల్లో విహరించే ఊహాలతో, అలజడితో, ఆందోళనతో ఏండ్ల తరబడి కళవరపడి విముక్తి మార్గాన్ని కనుగొన్నాను. సమధర్మ జగత్తు నిర్మించేందుకు నా మేధస్సు, హృదయం అర్పించాను.

కమ్యూనిస్టు పార్టీ ప్రపంచమంతటా శత్రువుకెదురై పోరేందుకు ఆయుధాల్ని,

నాయకత్వాన్నేగాక భావి సమాజాన్ని సృష్టించేందుకు తత్త్వ పరిజ్ఞానాన్ని గూడ ప్రసాదిస్తోంది. విప్లవం ఎప్పుడో రాదు – జరుగుతోంది!

నాకు తెలుసు: జగత్తులో ఇప్పుడు రెండే రెండు తెగలు. గత ప్రస్తుతాల ఊబిలో కూరుకుపోయి ప్రస్తుతపు అమానుషాన్ని సహించే, సమర్థించే మూఢులు, స్వార్థపరులు; ప్రస్తుతంలోని రాక్షసాన్ని గ్రహించి, హృదయం కంపించి, ప్రస్తుతాన్ని బ్రద్దలు కొట్టి, మహత్తర భవిష్యత్తును నిర్మించేందుకు పిడికిలెత్తి ప్రతిజ్ఞబూనే పురోగాములు.

అవ్యాహతంగా, నిరాఘాటంగా ప్రవహించే జీవన వాహినిని వెనక్కు తిప్పే వ్యర్థయత్నంలో సమసిపోతోంది మొదటితెగ.

అభ్యుదయోత్తరమైన సక్రమ పథాన మళ్ళించేందుకు జగత్తును పంటపొలం చేస్తోంది రెండవ తెగ.

మొదటి తెగ ప్రశ్నించవచ్చు – ఎందుకు మీకీ విపరీత త్యాగాలు కోరే మహోద్యమం? ఒకప్పుడు నేనూ ప్రశ్నించుకుని వెర్రెత్తిపోయాను.

యుగాలుగా దారిద్ర్యంలో కుమిలికాలిన లక్షల కుటుంబాలు జవాబు చెప్పినై. శతాబ్దాలుగా మానవత్వాన్ని విసర్జించిన బానిసల దీన వదనాలు జవాబు చెప్పినై. సమాజమే సృష్టించి పెంచి లీలగా, ఆటగా వధించిన 50 లక్షల బెంగాల్ సోదరుల మరణాక్రందనలు జవాబు చెప్పినై. తోవలో స్పృహ తప్పి పడిపోయే ప్రతి బిచ్చగాడు ఈ ప్రశ్నవిని పరిహసిస్తున్నాడు. చరిత్ర కంఠంతో శపిస్తున్నాడు.

ఈ వైకల్యానికి, వ్యధకు కారణం ఊహించలేక తత్త్వవేత్తలు వెతచెందారు. ప్రతి ఒక్కరి పరిశీలన, నిర్ణయాలు నన్నాకర్షించినై. వారి ఊహాసౌధాలు చక్కని కాంక్షలుగా మాత్రం నిలిచిపోయినై. జగత్తు మాత్రం ఈ జాడ్యభారంతో కుంగిపోతూనే వచ్చింది. గాఢంగా యోచించి, వరించి, జీవన సంగ్రామాన్ని పరిశీలించేందుకు మార్క్సు అవలంబించిన గతి తార్కిక తత్వం ఒక్కటే సరైంది అని గ్రహించాను. వేదాంతుల్ని వేధించిన సందేహాలన్నీ వర్గపోరాట సిద్ధాంతంలో, దానికి ప్రాతిపదిక అయిన భౌతిక వాదంలో, సుస్పష్టంగా తీరిపోయాయి.

మానవుల్లో మానవులేగాదు, పిశాచాలూ వున్నారని; యంత్రాలు నిర్జీవమైనవేగాదు. ప్రస్తుతం మానవుని పరిపాలిస్తున్నాయని నాకు తెలుసు. పూర్వ వేదాంతులకు చరిత్ర జీవం పోసి నిలిచింది. మార్క్సు చరిత్రకు జీవం పోశాడు – సర్వతోముఖ సుఖజీవనం కమ్యూనిస్టు దశలోనే సాధ్యమని, తప్పనిసరి ఐన కమ్యూనిస్టు దశలోకి సమాజాన్ని పరిణమింపచెయ్యండని:

కమ్యూనిస్టు సిద్ధాంతం పురోగామి సిద్ధాంతం. అది జగత్సత్యాన్ని గ్రహించి కర్తవ్యం నిర్ణయిస్తుంది. పతితుల జీవంతో వెల్గించిన ఈ జ్యోతి గాఢాంధమైన భావిని దీప్తివంతం చేసింది. మానవ జీవితం ఆ త్రోవ ననుసరించటానికి చేయూత నిచ్చేందుకు నాకు దార్ఢ్యం కూర్చింది అందుకని.

ప్రస్తుతం మానవ జీవితం మూసలో కళపెళలాడుతూంది. గతకాలపు జడతత్వ కాఠిన్యాలు కరుగుతున్నాయి. వర్తమానపు ముద్రలు చెరిగిపోతున్నాయి. దివ్యమైన నూత్నాకారాన్ని పొందుతోంది జీవితం. అందుకే భావిని ఆలపించే కవులు

రారా ఓ మానవుడా!
మానవుడా!
రారా ఓ మానవుడా!
కరువుల పుట్టిల్లుధాత్రి కామధేను వయ్యేనురా!
కాడులేని స్వర్గమిచట కట్టితిమయ్యా నీకై;
రారా ఓ మానవుడా!
అవతరించె శుద్ధావని అవనిక పైకెక్కెనురా!
నవజీవన దివ్యవాణి నాంది పలెంచెను నీకై;
రారా ఓ మానవుడా!

అంటున్నారు. జీవశక్తి మహోధృతంగా విజృంభిస్తోంది. ఈ పరిణామ దశలో నా కర్తవ్యం ఇది.

నాకు తెలుసు: ఈ కష్టసముద్రం దాటేందుకు కట్టే వారధికి ఎత్తే ఒక రాయినైతే చాలునని!

భవిష్యత్తుకోసం శత్రువుల్ని బలి యిచ్చేటప్పుడు వారి గుండెల్లోంచి దూసుకుపోయే ఒక తుపాకి గుండునైతే చాలునని.

నూత్న జగత్తులో ద్వేషం, ఈర్ష్య, అప్పులు, అసూయ ఎరుగని శిశువు పెదవులు పూచే చిరునవ్వునైతే చాలునని!

★ ★ ★

# శ్రీ ఎ. బోధాయన



నేను 1914 సంవత్సరం ఏప్రిల్ 11వ తేదీన జన్మించాను. ప్రాథమిక విద్య తిరువూరు తాలూకా ఊటుకూరు గ్రామంలో పూర్తిచేశాను. ఆ పిమ్మట వరంగల్ జిల్లా నర్సంపేట గ్రామంలో ఉర్దూ ప్రధాన భాషగా ఫస్టుఫారం పాసైనాను. సెకండ్ ఫారం ఖమ్మం పట్టణంలో చదువుతున్న రోజులలో నా తల్లి అనంతోజు వీరభద్రమాంబ చనిపోయింది. ఈ ఘటనతో నా చదువుకు అంతరాయం కలిగింది.

తెలుగు భాషాభివృద్ధి చేసుకోమని మా నాన్నగారు ఇందుకుగాను కొన్ని సూచనలు చేశారు. ఆ సూచనల మేరకు గోపీనాథ రామాయణము, ఉత్తర రామాయణము, మనుచరిత్ర, మేఘసందేశం, బిల్హణీయం, శ్రవణానందం, శ్రీకృష్ణ కర్ణామృతం, శృంగార నైషధం, రాధికస్వాంతనము అధ్యయనం చేశాను.

ఈ గ్రంథాలతోపాటు కందుకూరి వీరేశలింగంగారి గ్రంథాలన్నీ తెప్పించుకొని చదివాను. సాక్షి సంపుటాలు, కాశీమజిలీల కథలూ, శరత్‌బాబు, ప్రేమ్‌చంద్, ముల్కురాజ్ ఆనంద్, చిలకమర్తి, గోపీచంద్ నవలలను చదివాను.

1937 సంవత్సరం, ఫిబ్రవరి నెలలో దేశం మొత్తంమీద సాధారణ ఎన్నికలు జరిగాయి. మన రాష్ట్రంలో కాంగ్రెస్ పార్టీకి పోటీగా జస్టిస్ పార్టీ రంగంలోకి వచ్చింది. ఈ సమయంలోనే కామ్రేడ్స్ సుంకర వీరభద్రరావు, అనుమర్లపూడి సీతారామారావు, పొన్నలూరి రాధాకృష్ణమూర్తి, మునుకుంట్ల వెంకటప్పయ్య ప్రభృతులతో పరిచయం ఏర్పడింది. జనరల్ ఎన్నికలలో నేను పాల్గొని, కాంగ్రెస్ పార్టీ అభ్యర్థుల విజయానికి కృషి చేశాను. జస్టిస్ పార్టీ అతి ఘోరంగా ఓడిపోయింది. కాంగ్రెస్ పార్టీ అభ్యర్థులు అఖండ విజయం సాధించారు.

ఈ సమయంలోనే జి. డి. బాసు ఇంగ్లీషు భాషలో రచించిన బ్రిటిష్ మహాయుగం అనే గ్రంథాన్ని మానికొండ సత్యనారాయణగారు తెనిగించారు. ఈ గ్రంథాన్ని సాధించి అధ్యయనం చేశాను. ఈ గ్రంథం అప్పట్లో నిషేధించబడివుంది. ఈ గ్రంథం చదివిన తరువాత, డాక్టర్ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు రచించిన కాంగ్రెస్ పార్టీ చరిత్రను తెప్పించుకొని అధ్యయనం చేశాను. ఈ గ్రంథాలు చదివిన

పిమ్మట అప్పటివరకు నిండి నిబిడీకృతమైవున్న దైవభక్తి సన్నగిల్లింది. దేశభక్తి ఉప్పొంగింది. కాంగ్రెస్ పార్టీ సభ్యత్వం చేర్పించటమే గాకుండా నేను కూడా పావలా చెల్లించి కాంగ్రెస్ పార్టీ సభ్యత్వం పొందాను. మహాత్మా గాంధీ నిర్దేశించిన విధంగా రాట్నంపైన నూలు వడికి నేయించి, ఆ గుడ్డలు సైకిల్ పైన పెట్టుకొని గ్రామాలలో అమ్మకం చేయడం జరిగింది.

1938 సంవత్సరంలో పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ పార్టీ రాజకీయ మహాసభలు తిరువూరు పట్టణంలో వైభవోపేతంగా మూడు రోజులు జరిగాయి. ఆ మహాసభల నిర్వహణకుగాను కామ్రేడ్ సుంకర వీరభద్రరావుతో కలిసి నేను దండిగా విరాళాలు వసూలు చేసి మహాసభ నిర్వాహకులకు అందించటం జరిగింది. అంతేకాకుండా, ఈ మహాసభలు జరిగిన మూడు రోజులు ఖద్దరు షర్టు, ఖద్దరు నిక్కరు వేసుకొని, కాంగ్రెస్ జెండా చేతపట్టుకొని వలంటీరుగా పనిచేశాను. సహపంక్తి భోజనాలు, ఎంగిలి ఆకులు ఎత్తివేయటం వలంటీరుగా నేనూ నా సహచరులు చేసిన పని.

ఈ విషయం కొంతమంది రైతుల ద్వారా తెలుసుకున్న నా మామగారు వజ్రల రాజయ్యగారు – మిగతా బంధువులు – నన్ను ప్రాయశ్చిత్తం చేసుకోమని చెప్పారు. నేను మొండిగా నిరాకరించాను. అందులకుగాను నన్ను సంఘంనుండి బహిష్కరించారు.

ఈ మహాసభలకు కామ్రేడ్స్ చండ్ర రాజేశ్వరరావు, మునిపల్లి రామారావుగారలు వచ్చి, వాలంటీర్లకు డ్రిల్లు శిక్షణ యిచ్చి, తిరువూరు పట్టణంలో ప్రదర్శన చేయించారు. ఈ ప్రదర్శన ప్రజలను బాగా ఆకర్షించింది. ఈ మహాసభలకు తెన్నేటి విశ్వనాథం, సింధు రాష్ట్ర ముఖ్యమంత్రి సిద్వా, కర్నాటక మంత్రి కరంత్, మన జిల్లా నాయకులు కాట్రగడ్డ వెంకట నారాయణరావు, గద్దె రంగయ్యనాయుడు, పేట బాపయ్య, పిడికిటి రామకోటయ్య ప్రభృతులు హాజరైనారు. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులు చనిపోయారు. ఈ మహాసభలో కామ్రేడ్ నండూరి ప్రసాదరావు సంతాప తీర్మానాన్ని ప్రవేశపెట్టగా, మహాసభ ఓ నిమిషం మౌనం పాటించి, శ్రద్ధాంజలి ఘటించింది.

1939 సంవత్సరంలో తిరువూరు తాలూకా తునికిపాడు గ్రామంలో ఆంధ్ర – తెలంగాణా రైతాంగ విద్యాలయం 20 రోజులపాటు జరిగింది. నేను ఆ విద్యాలయానికి ఫోటోగ్రాఫర్‌గాను, విద్యార్థిగాను హాజరైనాను. ఈ విద్యాలయానికి ప్రిన్సిపాల్‌గా రాచకొండ నర్సింహారెడ్డిగారు వ్యవహరించారు. ఉపాధ్యాయులుగా ఆచార్య ఎన్.జి. రంగా, ఆయన సతీమణి భారతీరంగా, మద్దూరి అన్నపూర్ణయ్య, కంభంపాటి సీనియర్, కంభంపాటి జూనియర్, మద్దుకూరి చంద్రశేఖరరావు, డి. సీతారామయ్య, రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, కామ్రేడ్ చండ్ర రాజేశ్వరరావు, మునిపల్లె రామారావులు కూడా వచ్చి విద్యార్థులకు డ్రిల్లు శిక్షణ యిచ్చారు.

ఈ సమయంలో కామ్రేడ్ చండ్ర రాజేశ్వరరావుగారు రచించిన 'మార్క్సిజం– అంటే ఏమిటి?', 'భౌతికవాదం – అంటే ఏమిటి? అనే గ్రంథాలు, నవశక్తి ప్రచురణ రష్యా సంచిక, త్రిపుర సంచికలు అధ్యయనం చేశాను. జయప్రకాశ్ నారాయణ్ వ్రాసిన 'సోషలిజం ఎందుకు?' అనే గ్రంథాన్ని, భారత స్వాతంత్ర్య ప్రథమ పోరాటం, భగత్‌సింగ్ జీవిత చరిత్ర, విప్లవ యుగం, 'అమ్మ' అనే గ్రంథాలు కూడా చదివాను.

ఆ రోజులలో 'అమ్మ' నవల నిషేధింపబడివుంది. ఈ గ్రంధాలన్నీ – నన్ను తీవ్రంగా ప్రభావితం చేశాయి. గొప్ప ప్రేరణ కలిగించాయి. ఈ నేపధ్యంలోనే నేను కమ్యూనిస్టు పార్టీలో సభ్యునిగా చేరాను. నాకు సభ్యత్వం యిచ్చినది కామ్రేడ్ పేట రామారావు. ఈ విధంగా మార్క్సిజం–లెనినిజం సిద్ధాంతాల యెడల ఎనలేని అభిమానాన్ని, ఆత్మవిశ్వాసాన్ని పెంపొందించుకున్నాను. సభ్యత్వం స్వీకరించినరోజున – నేనెంతో ఘనకార్యం చేసినట్లుగా భావించి, అవధులులేని ఆనందాన్ని పొందాను.

నా సతీమణి అనంతోరాజు రామకోటమ్మ 1946లో పార్టీ సభ్యత్వం స్వీకరించింది. ప్రముఖ సంఘ సేవకురాలుగా, స్థానిక మహిళామండలి అధ్యక్షురాలుగా, తిరువూరు తాలూకా మహిళా సమాఖ్య నాయకురాలిగా, పంచాయతీసమితి కోఆప్షన్ సభ్యురాలుగా, పంచాయతీ వార్డు మెంబరుగా, కుట్టు టీచరుగా పనిచేస్తూ వుండటమేగాక తిరువూరు తాలూకా కమ్యూనిస్టు ఉద్యమంలో మంచి పాత్ర వహించింది. నన్ను నూటికి నూరుపాళ్ళు అనుసరించటం; మార్క్స్, జన్నీమార్క్స్ల దాంపత్య జీవితంలాగా గడపాలనే కాంక్ష కొంతలో కొంత సంతృప్తి కలిగించి ఆమె 1993 మే నెల 5వ తేదీన తుదిశ్వాస విడిచేవరకు నన్ను అనుసరించిన కారణంగాను; మా కుటుంబ సభ్యులు, ముఖ్య బంధువులు కమ్యూనిస్టులుగా వుండటంవల్ల; అలాగే నా అన్నదమ్ములు ఐదుగురు ఒకేసారి అరెస్టు కాబడి రాజమండ్రి సెంట్రల్ జైలులో 5 మాసాల 23 రోజులు జైలుశిక్ష అనుభవించారు. ఇలాంటి ఇబ్బందులు ఎన్ని వచ్చినా, వారందరియొక్క ఆశీస్సులు, అండదండలు, మార్క్సిజం, లెనినిజం సిద్ధాంతాల పట్ల వున్న ఆత్మవిశ్వాసాన్ని సడలింపజేయలేకపోయాయి. ఇంతేగాదు, మా ముఖ్య బంధువులు, ముఖ్యంగా నా మామగారు, బావమరుదులు, మా నాన్నగారు చిత్రహింసలకు గురైనారు. ఇదంతా మా అల్లుడుగారి పుణ్యం అంటూ నా మామగారు వ్యాఖ్యానించినట్లు నాకు తరువాత తెలిసింది. ఈ ఇబ్బందులన్నింటిని తట్టుకొని నిలబడటం సామాన్య విషయం కాదు.

ఆరు దశాబ్దాల సుదీర్ఘ రాజకీయ జీవితంలో ఎన్నో అనుభవాలను, గుణపాఠాలను పొందాము. అందువల్లనే నేటి యువతరానికి చేసే విజ్ఞప్తి ఏమిటంటే – పెట్టుబడిదారీ వ్యవస్థ సామాన్య ప్రజలు ఎదుర్కొంటున్న మౌలిక సమస్యలను పరిష్కరించలేదు అనే విషయాన్ని చరిత్ర చాటిచెప్పిన విషయం మనం విస్మరించకూడదు.

అందువల్ల మార్క్సిస్టు–లెనినిస్టు సిద్ధాంతాలు ప్రాతిపదికగా ఏర్పడిన సోషలిస్టు వ్యవస్థ మాత్రమే ప్రజలు ఎదుర్కొంటున్న మౌలిక సమస్యలను పరిష్కరించగలదని నా దృఢ విశ్వాసం. దారిద్ర్య నిర్మూలన, నిరుద్యోగ సమస్య, విద్యా, వైద్య సౌకర్యాలు, సాంఘిక న్యాయం, పేదవారికి భూమి ఇవ్వగలిగిన వ్యవస్థ ఒక్క సోషలిస్టు వ్యవస్థ మాత్రమే. గతంలో సోవియట్ యూనియన్లోను, ఇప్పుడు చైనాలోను, వియత్నాంలోను, క్యూబాలోను, ఉత్తర కొరియాలోను జరుగుతున్న పాలనా పద్ధతులు ఎంతో ఆత్మవిశ్వాసాన్ని కలిగిస్తున్నాయి. అందువల్ల నేటి యువతరం మార్క్సిస్టు–లెనినిస్టు సిద్ధాంతాలను అధ్యయనం చేయటంద్వారా భారత కమ్యూనిస్టు పార్టీలో సభ్యులుగా చేరి, కమ్యూనిస్టు పార్టీ నిర్వహించే ప్రజా ఉద్యమాలలో పాల్గొని భారతదేశంలో సైతం సోషలిస్టు వ్యవస్థ అవిర్భావానికి కృషి చేయాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

# రూపశిల్పి శ్రీ కుమార్



నేను కమ్యూనిస్టు పార్టీలో 1939లో చేరాను. అది సామ్రాజ్య వ్యతిరేకదశ. ఆనాడు పార్టీసభ్యుడు అవడమే చాలా కష్టంగా వుండేది. ఆనాడు పార్టీ కట్టుదిట్టంగా క్రమశిక్షణతో కూడుకొని వుండేది. అప్పటినుంచి నేటివరకు నాకు ఎన్ని అవాంతరాలు ఎదురైనా, ఎన్ని ఎదురుదెబ్బలు తగిలినా పార్టీలో 57 ఏళ్ళు మనగలిగినందుకు గర్వపడుతున్నాను.

రాష్ట్ర పార్టీ నా 57 ఏళ్ళ సుదీర్ఘ పార్టీ చరిత్రను గుర్తించి, "భారత కమ్యూనిస్టు" పార్టీ 70వ వార్షికోత్సవ సందర్భమున 26–12–1995 తారీకున హైదరాబాద్‌లో సత్కరించి, మెమెంటో అందచేసింది.

నెల్లూరు జిల్లా పార్టీ 11–1–1986 తారీఖున నన్ను పార్టీలో సీనియర్‌గా గుర్తించి దుశ్శాలువతో సన్మానించింది.

1962లో విజయవాడలో భారత కమ్యూనిస్టు పార్టీ మహాసభలు జరిగాయి. ఆ మహాసభల సందర్భాన జరిగిన సాంస్కృతిక ప్రదర్శనలలో "మేకప్ వెనోరిమా –

అనగా మేకప్‌మ్యాజిక్" అనే ఒక ఐటమ్‌ను కార్యక్రమంలో ప్రకటించింది. ఆ ఐటమ్ ప్రకారం అంతర్జాతీయ నాయకుల, జాతీయ నాయకుల మేకప్‌లను రూపొందించాలి. లెనిన్, మార్క్స్, ఎంగిల్స్, గురజాడ, వీరేశలింగం, అల్లూరు సీతారామరాజు రూపాలను మిమిక్రీ ఆర్టిస్టు నేరెళ్ళ వేణుమాధవ్ మీద రూపొందించాలని డాక్టర్ రాజారావు ప్రభృతులు నిర్దేశించారు. అర్ధగంట వ్యవధిలో మేకప్ మ్యాజిక్ చేసి రికార్డు సృష్టించాను. ఈ రికార్డు సృష్టించినందుకు ఆ వేదిక నుంచే డాక్టర్ రాజారావుగారు "రూపశిల్పి" బిరుదు ప్రకటించారు. ఆ బిరుదుకు ప్రేక్షకులు కరతాళధ్వనుల ద్వారా ఆమోదం తెలిపారు.

1952లో కమ్యూనిస్టు పార్టీ ఎలక్షన్లో పాల్గొన్నది. ఆ ఎలక్షన్ల ప్రచార మీటింగ్‌లలో 'ఓటెవరికి', 'రాజకీయ భాగవతము' అనే సెటైర్సు ప్రదర్శించేవారు. రాజకీయ భాగవతంలో కాంగ్రెస్ మంత్రుల, రాజకీయ నాయకుల రూపాలను మన ప్రజానాట్యమండలి కళాకారులకు అచ్చం వారిలాగా కనబడేటట్లు మేకప్ చేశాను. దీని ద్వారా ఆంధ్ర దేశములో ప్రతి మారుమూల గ్రామంలో నా మేకప్ బాగా రాణించి కీర్తి తెచ్చింది.

అఖిల భారత స్థాయిలో నాకు ఖ్యాతిని యిచ్చి, తీర్చిదిద్దినందుకు కమ్యూనిస్టు పార్టీకి నేను ఋణపడి వున్నాను.

## డాక్టర్ రాజారావుతో నా పరిచయం:

డాక్టర్ రాజారావుగారు మేకప్‌పై తెలుగులో పుస్తకం వ్రాయమని ప్రోత్సహించారు. మేకప్ పుస్తకాన్ని వ్రాయడానికి – మేకప్ మీద రీసెర్చి చేశాను. ఇంగ్లీషులో వున్న చాలా మేకప్ పుస్తకాలు చదివాను, అధ్యయనం చేశాను. మేకప్‌పై పుస్తకం వ్రాశాను. రాజారావుగారు తీసిన "పుట్టిల్లు" చిత్రానికి మేకప్ చీఫ్‌గా పనిచేశాను. అదే సమయంలో రష్యన్ కళాకారులు తీసిన "శాంతి" చిత్రంలో మన ప్రజానాట్యమండలి కళాకారులు నటించారు. ఈ చిత్రం రచయిత అనిశెట్టి సుబ్బారావుగారు. నేను చదివిన సాహిత్య అవగాహనతో కలర్ మేకప్ వేశాను. ఈ చిత్రాన్ని రష్యాలో రిలీజ్ చేశారు. రష్యన్ కళాకారులు నా మేకప్‌ను ప్రశంసించారు. "శాంతి" లాస్టుడే షూటింగ్ రోజున గ్రూప్ ఫోటో తీశారు.

## వాహిని సంస్థతో నా సంబంధాలు;
## సౌత్ ఇండియన్ మేకప్ ఆర్టిస్టు్స్ అసోసియేషన్ స్థాపన:

వాహిని సంస్థకు మేకప్‌చీఫ్‌గా పనిచేస్తున్న, మా గురువుగారైన హరిబాబుగారు చనిపోయిన తర్వాత, వాహిని పిక్చర్స్ అధినేతలు, ప్రఖ్యాత దర్శకులు శ్రీ బి. ఎన్. రెడ్డిగారు, శ్రీ కె.వి. రెడ్డిగారు శ్రీ హరిబాబుగారి స్థానాన్ని నాకు అప్పగించారు. అప్పగించిన స్థానం ప్రత్యేక హోదాతో కూడుకొన్నది. సినిమారంగంలో ఈ అవకాశంతో మేకప్ ఆర్టిస్టుల సంక్షేమం కొరకు సంఘం స్థాపించాలనుకున్నాను. డాక్టర్ రాజారావు గారింట్లో మేకప్ ఆర్టిస్టుల సమావేశం ఏర్పాటు చేశాను. ఆ సమావేశానికి నా పిలుపును గౌరవిస్తూ తెలుగు, తమిళ, మలయాళ, కన్నడ రంగాల్లో

పనిచేస్తున్న మేకప్ ఆర్టిస్టులు పెద్ద సంఖ్యలో హాజరయ్యారు. సౌత్ ఇండియన్ మేకప్ ఆర్టిస్ట్సు అసోషియేషన్ పేరుతో సంఘం రిజిష్టరు చేశాం. మేకప్ ఆర్టిస్టుల ఆఫీసు కోడంబాకంలో (వడపళని)లో మేకప్ ఆర్టిస్టు జయరామన్ ఇంట్లో పెట్టాం. ఈనాడు పై సంఘం బలమైన సంస్థగా రూపొందింది. సంఘంలో మెంబర్లుగా చేరని మేకప్ ఆర్టిస్టులకు మేకప్ వేసే అవకాశం వుండదు.

ఆంధ్ర ఫిల్మ్ జర్నలిస్టుల అసోషియేషన్ – మద్రాస్‌కి 1941–1966లో రజతోత్సవ మహాసభలు జరిగాయి. ఆ సందర్భమున సినిమారంగంలోని వివిధ రంగాలలో నిష్ణాతులను సత్కరించి, స్క్రోల్సు అందచేసింది. ఆ సెలెక్టెడ్ 12 మంది నిష్ణాతులలో నేనొకడిని. ఈ మహాసభలు ఆంధ్ర ఫిల్మ్ జర్నలిస్టు అసోషియేషన్ సెక్రటరీ ఇంటూరు వెంకటేశ్వరరావుగారి ఆధ్వర్యంలో జరిగాయి.

## ఆంధ్ర నాటక విద్యాలయం వారి సన్మానం:

ఆంధ్ర నాటక కళాపరిషత్తు ఆధ్వర్యాన విజయవాడలో నిర్వహించబడుతున్న నాటక విద్యాలయంలో 'మేకప్ కళ'లో శిక్షణా తరగతులు నిర్వహించారు. మేకప్‌పై శిక్షణ యిచ్చుటకు నాకు అవకాశం యిచ్చారు. మేకప్‌పై శిక్షణ యిచ్చిన సందర్భంలో నాకు సన్మానం జరిగింది. ప్రిన్సిపాల్ శ్రీనివాస చక్రవర్తిగారు, కొడాలి ఆదిశేషయ్యగారలు సన్మాన సభలో మాట్లాడారు. ప్రిన్సిపాల్ శ్రీనివాస చక్రవర్తి "నాట్యకళ" అనే పత్రికలో నేను వ్రాస్తున్న నాటక కళపై వ్యాసాలను ప్రత్యేకంగా ఉదహరించారు.

## శాంతి, సమత:

శాంతి, సమతలమీద కార్టూన్లు మానవాళి ప్రగతికి శాంతికి అవశ్యకం. ఆంధ్రప్రదేశ్ పదవ శాంతి మహాసభలు నెల్లూరులో జరిగాయి. అమెరికా దుస్సాహసిక కార్యకలాపాలను బైటపెట్టుతూ 200 కార్టూన్లు, పోస్టర్ల ప్రదర్శన ఏర్పాటు చేయడం జరిగింది. ఆ కార్టూలన్నిటినీ నేనే చిత్రించాను. ఇప్సో ప్రధాన కార్యదర్శి శ్రీమతి పెరిన్ రమేష్‌చంద్ర ఈ ఎగ్జిబిషన్‌కు ప్రారంభోత్సవం చేశారు. ఆమెతోపాటు రమేష్‌చంద్ర, కంపూచియా రాయబారి, సోవియట్ కాన్సులేట్ జనరల్ తిలకించారు. బహిరంగ సభలో పెరిన్ రమేష్‌చంద్ర నన్ను వేదికపైకి పిలిచి, ప్రత్యేకముగా నా కార్టూన్ల గురించి ప్రస్తావిస్తూ అభినందించారు.

## నా పుట్టుక - శ్రీమతి పుట్టుక:

నేను నెల్లూరులో కామాటి వీధిలో 1917లో జన్మించాను. నా తల్లిదండ్రులు లక్ష్మీదేవమ్మ. వేలూరు ఈశ్వరయ్య. నా దత్తు తల్లిదండ్రులు – మంగతాయారమ్మ డాక్టరు వేలూరు అరుణాచలం నాయకర్. నా శ్రీమతి సరోజిని పత్తేఖాన్‌పేటలో జన్మించింది. తల్లిదండ్రులు రామలక్ష్మమ్మ, అగ్నిహోత్రం సుబ్బయ్య. నా శ్రీమతి వాళ్ళకు ఏకైక సంతానం. మా అక్క రామలక్ష్మమ్మగారు వేయి దేవుళ్ళ చుట్టూ తిరిగి, ఎన్నో పూజలు, పురస్కారములు చేసింది, సరోజిని జన్మించడానికి. అందువలన ఆమె బలే అపురూపముగా పెరిగింది. నా శ్రీమతి చదువు 6వ

క్లాసుతోనే ఆగిపోయింది. ఆమెకు యింట్లోనే ట్యూషన్ చెప్పే బాధ్యత నాదైంది. వివాహామునకు ముందే ఆమె నాకు జీవిత భాగస్వామేగాక, రాజకీయ భాగస్వామిగా వుండేటట్లు మలచుకున్నాను. స్వంతంగా ఆలోచించేశక్తి గలుగచేశాను. మా పెళ్ళిలో నా యిష్ట ప్రకారం నా శ్రీమతి నడుచుకున్నది. పట్టుచీరలకు బదులు ఖద్దరునే వాడాం. నేను కడలూరు జైలులో వున్నప్పుడు ఇంగ్లీష్ నేర్చుకోవాలని గట్టి ప్రయత్నం చేసి సాధించింది. యిప్పటికీ ఆమె కమ్యూనిస్టు తాత్త్విక చింతనకు, ఆచరణకు దూరం కాలేదు. మనుమరాళ్ళకు, మనుమలకు చతుర్, చలాంతిక్, తాత్విక్, చరిత్, సమాఖ్య, సమగ్రత, నీహారిక అని పేర్లు పెట్టుకుంది.

## పెద్దతండ్రిగారు వీరేశలింగం సమాకాలికులు:

మా పెద్ద తండ్రిగారు కొంతకాలం రాజమండ్రి గవర్నమెంటు ఆస్పత్రిలో డాక్టరుగా పనిచేశారు. కందుకూరు వీరేశలింగం సమకాలికులు. వీరేశలింగం చేసే వితంతు పునర్వివాహములకు మా పెద్ద తండ్రిగారు హాజరయ్యేవారట. రాజమండ్రి నుంచి నెల్లూరు జిల్లాకు ట్రాన్స్ఫర్ అయ్యారు. వెంకటగిరిలోనూ, వింజమూరులోనూ, అల్లూరులోనూ డాక్టరుగా పనిచేసిన తర్వాత రిటైరయ్యారు. పత్తేఖాన్‌పేటలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. ఆయన పెంపకంలో ఆయన ఆదర్శాలు కొన్ని నాలో చిగురించాయి. నన్ను C.A.M. కిండర్ గార్టెన్ స్కూలులో యింగ్లీషు మీడియంలో చేర్చారు. నేను ఒకటవ తరగతికి వచ్చేటప్పటికి మా పెద్ద తండ్రిగారు చనిపోయారు. మా పెద్ద తల్లిగారు నేను చదివే స్కూలు కిరస్తానీ స్కూలు అయినా నా చదువును అక్కడనే కంటిన్యూ చేసింది. అయితే, నా పెద్దతల్లి నా వేషం మార్చివేసింది. పింగళ జీరంతోపాటు ఒక చిన్న పిలక, చెవులకు ఎర్రరాళ్ళ దిద్దులు, నొసట పంగనామాలు, చెడ్డీకి బదులు ఒక అడ్డపంచ, అచ్చం అయ్యంగారి బిడ్డగా మారిపోయాను. స్కూలు నుంచి యింటికి వస్తుండగానే మా పెద్దతల్లి నన్ను తలవాకిట నిలబెట్టి పసుపునీళ్ళు నామీద చల్లేది, కిరస్తాని అంటుపోడానికి. అయిదవ క్లాస్ పాసైన తర్వాత మూలాపేట మిడిల్ స్కూలులో చేరాను. మా పెద్దతల్లికి కిరస్తాని స్కూలు బెడద తప్పింది. ఆమెలో చాలా మార్పు వచ్చింది. నా జోలికి రావడం మానేసింది. కిరస్తాని స్కూలు జుట్టు, కట్టూ, బొట్టు మాయమైనాయి. క్రాఫ్, చెడ్డీతో స్కూలుకు పోయేవాడిని. మిడిల్‌స్కూలులో తిక్కవరపు పఠాభి (రాగాలు డజను రచయిత, కన్నడ పిక్చరు 'సంస్కార' డైరెక్టరు, మంచి మానవతావాది) నా క్లాస్‌మేట్, బెంచిమేట్. పఠాభిగారి తండ్రి నెల్లూరు జిల్లాలో పెద్ద ల్యాండ్ లార్డు, మైకామైన్సు యజమాని, రాజకీయ బాస్– మునిసిపల్ ఛైర్మన్ – అందువలన పఠాభి స్కూలుకు రావడంలో ఒక విశేషం కనపడేది. రాజువెడలే మాదిరిగా వుండేది. హెడ్‌మాస్టరు తూములూరు సుబ్రమణ్యంగారు గేట్ దగ్గర వెయిట్ చేసి, పఠాబిని రిసీవ్ చేసుకొనేవారు. క్లాస్‌లో పఠాబికి ప్రత్యేకంగా ఒక కుర్చీ అరేంజి చేసేవారు. ఈ తతంగంతో స్టూడెంట్సులో గుసగుసలు బయలుదేరాయి. పఠాబి మా గుసగుసలు విని క్లాసులో నుంచి బయటకు వెళ్ళిపోయారు. గుసగుసలకు నేనే కారణం అని భావించి హెడ్‌మాస్టరు ఆఫీసు

రూమ్‌కు పిలిపించి కేనింగ్ చేశారు. మరుసటి రోజు పఠాబి క్లాసులోకి వస్తుండగానే నా ప్రక్కన వచ్చి కూర్చొన్నారు. నన్ను కేనింగ్ చేసినందుకు బాధపడ్డారు. మా చిన్ననాటి స్నేహం పఠాబి మరిచిపోలేదు. ఆయన దర్శకత్వం చేసిన కన్నడ పిక్చరుకు నేను మేకప్ చీఫ్‌గా పనిచేశాను.

## టెర్రరిస్టులతో సంబంధాలు:

థర్డుఫారమ్ పాసైన తర్వాత నేను C.A.M. హైస్కూలులో చేరాను. S.S.L.C. వరకు అక్కడనే చదివాను. S.S.L.C.లో గాలి నారాయణరావుగారు మాకు యింగ్లీషు లెక్కలు మాస్టరు. ఆయన శుద్ధ ఖద్దరు ధరించేవారు. తలపాగ, క్లోజ్‌కోట్‌తో క్లాసుకు వచ్చేవారు. ఆయన క్లాసుకు వచ్చిన వెంటనే పత్రికలలో వచ్చే తాజా వార్తలను మాకు యింగ్లీష్‌లో అర్థమయ్యేటట్లు చెప్పేవారు. ఆ తాజా వార్తలు చెప్పేటప్పుడు దేశభక్తిని ప్రబోధించేవాటినే ఎక్కువగా చెప్పేవారు.

ఈ విషయం D.E.O. గారికి కంప్లైంట్ యిచ్చారు. D.E.O. గారు మలయాళీ. ఆయన బ్రిటిష్ రాజభక్తుడు. ఆయన పేరు వర్గీస్. M.A. (Oxford). కంప్లెయింట్ ఆధారముగా తీసుకొని D.E.O. నారాయణరావుగారికి షోకాజ్ నోటీస్ యిచ్చారు. ఆ షోకాజ్ నోటీసు విషయం స్టూడెంట్సుకు తెలిసింది. వెంటనే క్లాసులు బాయికాట్ చేశాం. హెడ్ మాస్టరును కలుసుకొని మా అసమ్మతి తెలియచేశాం. ప్రతిరోజు ఉదయం 10 గంటలకు మెయిన్‌గేట్ దగ్గర నిలబడి 'D.E.O. Down Down' నినాదాలు చేసి యిళ్ళకు వెళ్ళిపోయేవాళ్ళం. మాలో కొంతమంది నినాదాలు యిచ్చిన తర్వాత స్కూలుకు ఎదురుగా వుండే ముస్లిం యింటి అరుగుల మీద కూర్చొని మాట్లాడుకొని యిళ్ళకు వెళ్ళేవాళ్ళం. ఆ ముస్లిం యింట్లో గణపణం బాలకృష్ణారెడ్డి (టెర్రరిస్టు) బాడుగకు వుంటున్నారు. ఆయన వి. ఆర్. కాలేజీలో F.A. చదువుతున్నారు. ఆయన మా పరిస్థితులు గమనించి, మాతో టచ్ పెట్టుకొని సలహాలు యివ్వడం మొదలు పెట్టారు. ఈ లోపల నారాయణరావుగారే మమ్ములను కలుసుకొని, శాంతపరచి క్లాసులకు హాజరయ్యేటట్లు చేశారు. ఈ సంఘటన తర్వాత నారాయణరావుగారికి గుంటూరు టవున్ హిందూ హైస్కూలు హెడ్ మాస్టరుగా అపాయింట్‌మెంట్ ఆర్డర్సు వచ్చాయి. ఆయన మా స్కూలు వదిలి గుంటూరు వెళ్ళిపోయారు. నాకు గణపణం బాలకృష్ణారెడ్డిగారితో పరిచయం అయి, ఆయన రూమ్‌కు తరుచుగా వెళ్ళడం జరిగింది. ఒకరోజున గణపణం బాలకృష్ణారెడ్డిని పోలీసులు అరెస్టు చేసి తీసుకొని వెళ్ళారు.

## గుడిపాటి వెంకటచలం శిష్యరికం:

S.S.L.C.తో నా చదువు ఆగిపోయింది. నెల్లూరు గవర్నమెంటు ట్రెయినింగ్ స్కూలు డ్రాయింగ్ మాస్టర్ యస్. వి. రామన్ దగ్గర చిత్రకళ అధ్యయనం చేయుటకు చేరాను. ఎస్. వి. రామన్‌గారు ఆంధ్ర జాతీయ కళాశాలలో చిత్రకళ అధ్యయనం చేశారు. ఆ టైంలోనే నెల్లూరు గవర్నమెంట్ ట్రెయినింగ్ స్కూలులో గుడిపాటి వెంకటచలంగారు మాస్టరుగా వున్నారు. యస్. వి. వెంకట్రామన్ ద్వారా గుడిపాటి వెంకటచలంగారికి నేను శిష్యుడనయ్యాను. ఆయన వ్రాసిన

చిత్రాంగి, సావిత్రి నాటకములను టౌన్ హాలులో ప్రదర్శించాం. నేనే దర్శకత్వం వహించాను. ఈ నాటకములలో పాల్గొన్న వారంతా పత్తేఖాన్‌పేట యువకులే.

## రాజకీయ పాఠశాల:

ఆ రోజులలో వెన్నలకంటి రాఘవయ్య (కాంగ్రెస్ నాయకులు) ప్రతిరోజు సాయంత్రం 6 గంటల నుంచి 8 గంటల వరకు రాజకీయ పాఠశాల నడిపేవారు. ఈ రాజకీయ పాఠశాలకు పత్తేఖాన్ పేట నుంచి ఎక్కువమంది పాల్గొనేవారు. ఆ క్లాసులు మాకు దేశభక్తిని పురిగొల్పాయి. కాంగ్రెస్‌లో చేరాం. నేను డివిజనల్ కాంగ్రెస్ ప్రెసిడెంట్‌గా, రహీం టౌన్ కాంగ్రెస్ సెక్రటరీగా ఎన్నికైనాం. కాంగ్రెస్‌లో చేరిన కొన్ని రోజుల తర్వాత కాంగ్రెస్‌లో యిమడలేకపోయాం. కమ్యూనిస్టు నాయకుడు రావి ఆదిశేషయ్యను కలుసుకున్నాం. వీరు మాకు 'స్వతంత్ర భారత్' రహస్య పత్రికను పంచే బాధ్యత అప్పగించారు. నేను, రహీం, అరిగెల వీరరాఘవయ్య, అల్లూరు రామసింగ్ మాకు అప్పగించిన కార్యక్రమం జయప్రదం చేశాం. జయప్రదం చేసినందుకు పార్టీకి మామీద నమ్మకం ఏర్పడింది. పత్తేఖాన్ పేటలో కమ్యూనిస్టు పార్టీ ఆఫీసు ప్రారంభించాం. ఈ ప్రారంభానికి ఆమంచర్ల గంగాధరరావు (రిటైర్డ్ హైకోర్టు జడ్జి), ఖండవల్లి కృష్ణారావ్‌గారు హాజరయ్యారు. ప్రతి ఆదివారం రోజున పత్తేఖాన్‌పేటలో ఉదయం 5 గం॥లకు ప్రభాత్ భేరి ఊరేగింపు జరిపేవాళ్ళం. ఆర్.ఎస్.ఎస్. సభ్యుడైన గున్నంరెడ్డి వెంకటరెడ్డి ప్రభాత్ భేరి ఊరేగింపు మీద రాళ్ళు రువ్వేవాడు. 30–1–48న గాడ్సె గాంధీ మహాత్ముని హత్యచేసిన తర్వాత గున్నంరెడ్డి వెంకటరెడ్డి ఎక్కడికో పారిపోయాడు. 4 సంవత్సరాల తర్వాత నెల్లూరు చేరాడు. పార్టీకి సన్నిహితుడైనాడు. పార్టీ సభ్యుడైనాడు. విశాలాంధ్ర దినపత్రికను చందాదారులకు పంచే బాధ్యతను తీసుకున్నాడు. టౌన్ కమ్యూనిస్టు పార్టీ సహాయ కార్యదర్శిగా పనిచేశాడు. యిటీవలే చనిపోయాడు. పబ్లిక్‌లో విశాలాంధ్ర వెంకటరెడ్డిగా ఆయనపేరు నిలచిపోయింది.

## కమ్యూనిస్టు వ్యతిరేకతను ఎదుర్కోవడం:

ఒకప్పుడు నెల్లూరు కామాటివీధి కమ్యూనిస్టు వ్యతిరేక సెంటరు. కామాటి వీధిలో వున్నవారంతా మా దగ్గరి బంధువులే. సుందరయ్యగారి టౌన్‌హాల్ మీటింగ్‌లో పాములు వదలిపెట్టి గలభా చేసింది మా బంధువులే. ప్రజాశక్తి పత్రికలను తగులపెట్టేది మా బంధువులే. ఈ అరాచకాన్ని అరికట్టడానికి కమ్యూనిస్టు పార్టీ చక్కటి ప్లాను యిచ్చింది. ఆ ప్లాను ప్రకారం మా తల్లి లక్ష్మీదేవమ్మ జట్కా బండికి యిరుప్రక్కల ఎర్రజండాలు కట్టుకొని కామాటి వీధిలో తిరగాలని, నేనేమో ప్రజాశక్తి పత్రికలు టౌన్లో పంచాలని నిర్ణయించింది. పార్టీ ప్లాను జయప్రదమైంది. బంధువులలో చీలిక వచ్చింది. పార్టీకి ఒక సెక్షను అనుకూలమైంది.

## పార్టీ ఆఫీసులో కాపురం:

నేను, నా శ్రీమతి పార్టీలో తిరగడంతో మా మామగారికి, మా అక్కగారికి

మామీద కోపం వచ్చింది. మామీద ఆంక్షలు పెట్టడం మొదలుపెట్టారు. ఇక యిల్లువదలి పెట్టి పార్టీ ఆఫీసులోనే కాపురం పెట్టాం. ఆఫీసు మధ్వపతివారి వీధిలో వుండేది. ఆఫీసులోనే వంటచేసుకునేవాళ్ళం. అప్పట్లో ఆఫీసులో మాతోకూడా ఎనుగ శ్రీనివాసులురెడ్డి U.N.O. Under Secretary, Retired), గుజ్జుల యలమందారెడ్డి, ఆఫీసు సెక్రటరీలు డబ్ల్యు.వి. శేషయ్య, సుందరరాజన్‌లు వుండేవారు. పెద్దమ్మాయి కల్పన కడుపులో వున్నదని మా అక్కగారికి తెలిసినది. తక్షణం ఆఫీసుకు వచ్చి మమ్మల్ని యింటికి తీసుకొని వెళ్ళింది.

## మునిసిపల్ కార్మికుల సంఘం:

మునిసిపల్ కార్మికుల సంఘం, రిక్షా కార్మికుల సంఘం, జట్కా బండ్ల సంఘం – ఈ మూడు సంఘాలను నేను, అనంతరామయ్య సైకిల్పు ఎక్కి ముఖ్యమైన సెంటర్లకు వెళ్ళి పరామర్శించి వచ్చేవాళ్ళం. అవసరమైనప్పుడు జిల్లా అధికారులను కలుసుకొని వాళ్ళ సమస్యలను తీర్చేవాళ్ళం. మాతో ప్రొఫెసర్ శేషాద్రి కూడా తిరిగేవారు. ఈ టైంలో ఆఫీసు కళకళలాడుతూ వుండేది. కె. వి. రఘునాధరెడ్డి (బెంగాల్ గవర్నర్), వాదారి వెంకట రమణ (ఆంధ్ర అడ్వకేట్ జనరల్), ప్రొఫెసర్ శేషాద్రి, కరవది వెంకటేశ్వర్లు (ఒంగోలు), కె. వి. నరసింహం (ఒంగోలు), జి. యలమందారెడ్డి, బాల నరసారెడ్డి (కె. సి. రెడ్డి) వీళ్ళందరూ విద్యార్థి రంగంలో పనిచేసేవారు.

## పెన్నానది పొంగి పొర్లడం:

ఒకటైంలో నెల్లూరులో పెన్న పొంగిపొర్లింది. ఆ పొర్లడంతో పెన్న నీటివేగం పొలుగట్టుకు అనిపోయింది. పొల్లుగట్టు లోతట్టులో నివసించే జనం డాబాలమీద చిక్కుకొనిపోయేరు. డాబాల చుట్టూ నీళ్ళు చుట్టుముట్టాయి. డాబాలమీద జనం దిక్కుతోచక కేకలు వేస్తున్నారు. జిల్లా కలెక్టరు, యితర జిల్లా అధికారులు పొల్లుగట్టు మీద నిలబడి, చిక్కుకొని పోయిన వారిని రక్షించడానికి ప్లాను వేస్తున్నారు. నేను, అనంతరామయ్య పెన్నవార్త విని యకాయకి అక్కడకు చేరుకున్నాము. నేను వెనుక ముందు చూడకుండా తక్షణం నీళ్ళలో దూకి డాబాలవైపుకు యీదుకుంటూ దూసుకుపోతున్నాను. ఈ నా సాహసాన్ని చూస్తున్న నెల్లూరు డి.ఎస్.పి. టైగర్ జయరాం నాయుడుగారు ఆలస్యము చేయకుండా నాకు సహాయంగా నీళ్ళలో దూకి యీదుకుంటూ డాబాల దగ్గరకు చేరుకున్నారు. యిద్దరం డాబాల దగ్గరకు చేరుకున్నాం తర్వాత రిజర్వుడ్ పోలీసు, ఫైర్ సర్వీసు వాళ్ళు రంగంలో దిగారు. డాబాల మీద వున్నవారిని రక్షించి ఒడ్డుకు చేర్చారు.

## మునిసిపల్ కార్మికుల సమ్మె:

ప్రొఫెసర్ కె. శేషాద్రి జమీన్ రైతు పత్రికలో 4–10–85న మునిసిపల్ కార్మిక సంఘమును గురించి తన జ్ఞాపకాలుగా వ్రాశారు:

"నెల్లూరు మునిసిపల్ కార్మిక సంఘమునకు వేలూరు కుమారస్వామి (రూప శిల్పికుమార్) ప్రెసిడెంట్. పాకిదొడ్ల కార్మికులకు నాయకుడై రేయింబగళ్ళు వాళ్ళకు

పనిచేసి వాళ్ళ ఆదరణకు పాత్రుడైనాడు. సైకిలెక్కేసి సానిటరీ ఇన్‌స్పెక్టర్లకంటే ముందు తయారు. రాష్ట్ర మునిసిపల్ కార్మిక సంఘం పిలుపు మీద రాష్ట్రమంతా సమ్మె జరిగింది. ఒక నెల్లూరులో తప్ప ఇతర చోట్ల సమ్మె జయప్రదం కాలేదు. నెలా పదిరోజులు నెల్లూరులో సమ్మె జరిగింది. జయప్రదమైంది. ప్రభుత్వం కార్మికుల హక్కులను ఒప్పుకుంది. సమ్మె విరమించారు.

'జై బోలో కార్మిక సంఘానికి జై! జై బోలో స్వతంత్రభారత్‌కు జై! జై కార్మికనాయకుడు కుమారస్వామికి జై!' బాకా బట్టుకొని, ఒంగోలు నుంచి కాలేజీలో చదువుకోడానికి వచ్చిన కె. వి. నరసింహం అరచి, నెల్లూరునంతా ధ్వనించేవాడు."

## యానాదుల సంఘం:

మునిసిపల్ కార్మికుల సమ్మె జయప్రదమైంది. అయితే, మునిసిపల్ కార్మికులలో 30% యానాదులు (చల్లా యానాదులు, మంచి యానాదులు) సమ్మెకాలంలో ఈ యానాదుల ఊరేగింపులకు గాని, మీటింగులకు గానీ హాజరు కాలేదు. యానాదులు మిలిటెన్సి జాతికాదు, పిరికివాళ్ళు. అదికాక, చెట్టుకొకరు పుట్టకొకరు నివసిస్తూ వుంటారు. వీళ్ళందరిని ఒకచోట చేర్చాలని, కాలనీ ఏర్పర్చాలని పార్టీ నిర్ణయించింది. దర్గామిట్ట దగ్గర యామాలశెట్టి బావికి పడమటి దిక్కున ఖాళీస్థలంలో గుడిసెలు వేయడానికి నిర్ణయించాం. అయితే, మునిసిపల్ కార్మికులు గుడిసెలు వేసుకోడానికి ముందుకు రాలేదు. పత్తేఖాన్‌పేట రైతుల భూములను తరతరాలుగా కాపలా కాసే యానాదులు ముందుకు వచ్చి కాలనీలో గుడిసెలు వేసుకున్నారు. పత్తేఖాన్‌పేట రైతులు యానాదులు తమ గుప్పెటలో నుంచి జారిపోతున్నారని, యానాదుల మీద పగ సాధించాలని వెన్నలకంటి రాఘవయ్యగారి సహాయం కోరారు. వెన్నలకంటి రాఘవయ్యగారు రాజకీయ స్వార్థముతో యానాదుల కులపెద్దలతో కాలనీలో అడుగుపెట్టారు. ఆ టైంలో నేను అక్కడనే వున్నాను. రాఘవయ్య నన్ను చూడగానే నామీద మండిపడ్డాడు. కాలనీలో గుడిసెలు వేసుకున్న యానాదులు; కులపెద్దలు పోలీసు నీడలో చేసే అకృత్యాలను రాఘవయ్య సమక్షంలో చిట్టా విప్పారు. రాఘవయ్య ఆ చిట్టాల దెబ్బకు తట్టుకోలేక జారుకున్నారు. ఈ కాలనీ ఏర్పడిన తర్వాత నెల్లూరు యానాదులలో చైతన్యం వచ్చింది.

## కడలూరు జైలు:

రణదివె పిరియడ్‌లో నేను అరెస్టు అయ్యాను. అరెస్టులకు, డిటెన్షన్‌లకు వ్యతిరేకంగా ఊరేగింపు విజయవాడలో తీయాలని రాష్ట్ర మహిళా సంఘం పిలుపు నిచ్చింది. నెల్లూరు నుంచి సూర్యాంబ, నా శ్రీమతి ఊరేగింపులో పాల్గొన్నారు. విజయవాడలో 144 సెక్షను ప్రకటించారు. దాన్ని ధిక్కరించి ఊరేగింపు చేశారు. పోలీసులు బాష్పవాయువు ప్రయోగించారు. 80 మందిని అరెస్టుచేసి, నందిగామ జైలులో పెట్టారు. అందులో నా శ్రీమతి సరోజినీ, సూర్యాంబ కూడా వున్నారు. ఈ ఊరేగింపుకు అచ్చమాంబ, మానికొండ సూర్యావతి నాయకత్వం వహించారు. నెల్లూరులో మా అన్న రామనాథంగారిని కూడా అరెస్టు చేశారు. వారం రోజుల తర్వాత నా శ్రీమతిని, మా అన్నగారిని వదలివేశారు. నేను కడలూరు జైలులో

వున్నపుడు మా అమ్మ చనిపోయింది. కడలూరు జైలులో విషయాలు కమ్యూనిజంలో చాలామంది వ్రాశారు. అందువలన నేను వాటిని టచ్ చేయడంలేదు. కడలూరు జైలులో వున్నపుడు 15 రోజులకు ప్రజా నాట్యమండలి రూపాలు ప్రదర్శించాలని అందుకు కమిటీని ఎన్నుకున్నారు. ఆ కమిటీలో కోగంటి గోపాలకృష్ణయ్య, నేను, అల్లు రామలింగయ్య, కొడాలి ఆదిశేషయ్య వున్నాం.

కడలూరు నుంచి విడుదలయిన తర్వాత నేను సినిమారంగంలో ప్రవేశించడం జరిగింది. మద్రాసులో స్థిరపడ్డాను. అప్పుడప్పుడు ప్రజానాట్యమండలి కార్యక్రమాలలో పాల్గొనడం జరుగుతుంది.

పూర్వపు క్రమశిక్షణ, నిరాడంబరత్వం యిప్పుడు పార్టీలో లేవు. మరల పూర్వపు క్రమశిక్షణ, నిరాడంబర జీవితం కనబడినట్లయితే పార్టీకి ప్రజల ఆదరణ లభిస్తుంది.

నేను, నా శ్రీమతి యిప్పటికీ పార్టీ ఆశయాలకు విరుద్ధము కాదు.

నేను సాధారణ సభ్యుడుగా కొనసాగుతున్నాను.

★ ★ ★

# శ్రీ జాలాది రామకోటయ్య



నేను 1916 వ సంవత్సరంలో కృష్ణాజిల్లా ఇందుపల్లిలో మా తాతగారైన శ్రీ కోగంటి జగన్నాథము గారి ఇంటివద్ద జన్మించాను. నా తల్లిదండ్రుల పేర్లు పురుషోత్తం, అన్నపూర్ణమ్మ. నాకు 3 సం॥ల వయస్సులోనే తండ్రి చనిపోయినారు. అందుచే నేను మా తాతగారు, మేనమామ వెంకట నారాయణగారి ఇంటి వద్దనే పెరిగాను. స్వగ్రామం వెల్దిపాడు.

నేను ఇందుపల్లిలో అప్పర్ ప్రైమరీ స్కూల్లో VII క్లాసు వరకు చదివాను. తర్వాత బయట వూరు వెళ్ళి చదువుటకు అవకాశం లేక చదువు మానివేశాను. ఇందుపల్లిలోనే వుంటూ వ్యవసాయ పనులు చేస్తూనే రోజా ఆంధ్ర పత్రిక చదివేవాడ్ని. ఆ రోజుల్లో పేపర్లో కాంగ్రెస్ స్వాతంత్ర్యోద్యమ వార్తలు ఎక్కువగా వుండేవి. ఆ స్వాతంత్ర్యోద్యమ వార్తలే నాకు కాంగ్రెసులో చేరి స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొనే స్ఫూర్తిని కలుగచేశాయి.

నేను 1936వ సం॥లో మా స్వగ్రామం వెల్దిపాడు వచ్చాను. ఇక్కడ కుటుంబ వ్యవసాయ పనులు చూసుకొంటూనే అనాటి కాంగ్రెస్ నిర్మాణ కార్యక్రమంలో

భాగమైన రాట్నం ఒడికి నూలు తీసేవాణ్ణి. హరిజనవాడలో రాత్రిపాఠశాల పెట్టి వయోజన విద్యాకార్యక్రమం నడిపేవాణ్ణి.

గ్రామంలో యువకులను సమీకరించి, సూరపనేని లక్ష్మీపెరుమాళ్ళుగార్ని తీసుకు వచ్చి, వారిచే హిందీ పాఠశాల పెట్టించి, వారివద్ద హిందీ నేర్చుకున్నాము. 1937లో కాంగ్రెస్ సభ్యత్వం తీసుకొని, పశ్చిమ కృష్ణాకాంగ్రెస్‌లో అనాటి ముఖ్యులైన శ్రీ అన్నే అంజయ్య, పిడికిటి రామకోటయ్య, పేట బాపయ్య, కాకాని వెంకట రత్నం, వెల్లంకి విశ్వేశ్వరరావుగార్లతో సన్నిహితంగా వుండేవాణ్ణి. వారు గ్రామాల్లో కాంగ్రెస్ సభ్యత్వం చేర్పిస్తూ, రైతు సంఘాలు స్థాపిస్తూ, జిల్లాలో జమీందారీ ముఖాసాదారీ వ్యతిరేక రైతు పోరాటాలకు ప్రోత్సాహం ఇచ్చేవారు.

## ప్రథమ రైతు మహాసభ:

1937లో కృష్ణాజిల్లా ప్రథమ రైతు మహాసభ ఈడ్పుగల్లులో జరిగింది. ఆ సభకు శ్రీ సూరపనేని గోపాలకృష్ణయ్య అధ్యక్షత వహించారు. శ్రీ ఆచార్య రంగాగారు ప్రారంభోపన్యాసం చేశారు. రంగాగారి ఉపన్యాసం నన్ను బాగా ఆకర్షించింది. దేశ ప్రజలందరికీ కావలసిన కనీస అవసరాలైన తిండి, బట్ట ఉత్పత్తి చేసేది గ్రామాల్లోని రైతులేనని, రైతులు పండించే పంటలు వారి చేతికి పూర్తిగా రాకుండా జమీందార్లు, ముఖాసాదార్లు, లంచగొండి ఉద్యోగులు దోచుకుంటున్నారనీ ఆయన చెప్పారు. ఈ మహాసభకు గన్నవరం ప్రాంతంనుండి నాతోబాటు శ్రీ ముక్కామల నాగభూషణం, శ్రీ పెండ్యాల వెంకటేశ్వరరావు తదితరులు వచ్చారు.

1937లో మద్రాసు రాష్ట్ర అసెంబ్లీకి జరిగిన ఎన్నికల్లో కాంగ్రెస్ పార్టీ తరఫున ప్రచారం చేశాను. అనాడు గ్రామాల్లో గ్రామాధికార్లు, గ్రామ పెత్తందార్లు చాలామంది జస్టీసు పార్టీకి అనుకూలంగా పనిచేశారు. అయినా, పశ్చిమ కృష్ణాలో కాంగ్రెస్ అభ్యర్థులిద్దరూ శ్రీ కాట్రగడ్డ వెంకటనారాయణరావుగారు, జయంతిపురం రాజా మహాదేవతాగూరారు విజయం సాధించారు.

1937లో రైతు ఋణవిమోచన సభ గన్నవరంలో జరపాలని, ఇందుకు శ్రీ ముక్కామల నాగభూషణం ఆహ్వానసంఘ అధ్యక్షునిగా, శ్రీ పెండ్యాల వెంకటేశ్వరరావు కార్యదర్శిగా, నేను మరికొంతమందిమి సభ్యులుగా ఆహ్వానసంఘం ఏర్పడింది. సభకు కాంగ్రెస్ నాయకులను, రైతు నాయకులను, ముఖ్యంగా రంగాగారిని పిల్చి, సభా ప్రారంభం రంగాగారితో చేయించాలని నిర్ణయించి, తగు ఏర్పాట్లు ముమ్మరంగా చేస్తున్నాము. అప్పుడు గన్నవరంలో ప్రముఖ భూస్వామి, జస్టీసు పార్టీ నాయకుడు అయిన శ్రీ వెలివెల సీతారామయ్య సభ ఏర్పాట్లకు ఆకర్షింపబడి, ఒకనాడు ఆహ్వానసంఘ సమావేశంలో పాల్గొని, తనే స్వయంగా మీటింగుకు వచ్చిన ప్రతినిధులందరికీ భోజన సదుపాయాలు చేస్తానని వాగ్దానం చేసి, ఆ విధంగా సహాయపడినారు. ఈ సభకు ఆచార్య రంగా, గద్దె రంగయ్యనాయుడు, నెల్లూరు వెంకట్రామానాయుడు, బద్దేపూడి వెంకట్రామారెడ్డి, కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తి, గొట్టిపాటి బ్రహ్మయ్య, కాట్రగడ్డ వెంకటనారాయణరావు హాజరైనారు. శ్రీ బద్దేపూడి వెంకట్రామారెడ్డి సభకు అధ్యక్షత వహించారు. ఆచార్య రంగా ప్రారంభోపన్యాసం చేశారు. శ్రీ

చంద్ర రాజేశ్వరరావు ఈ సభకు వాలంటీరు దళ కమాండరుగా పనిచేశారు. సభ జయప్రదంగా జరిగింది. తర్వాత ప్రభుత్వం రుణవిమోచన చట్టం చేసింది.

## కాంగ్రెస్‌లో భేదాభిప్రాయాలు:

కాంగ్రెస్‌లో అతివాద, మితవాద భేదాభిప్రాయాలు ఎక్కువైనాయి. పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెసులో అతివాదుల ప్రాబల్యం ఎక్కువగా వుండుట వల్ల ఆనాడు పశ్చిమకృష్ణా జిల్లా అధ్యక్ష కార్యదర్శులైన పేట బాపయ్య, కాకాని వెంకటరత్నం గార్ల ఆధ్వర్యంలో నేను, వెల్లంకి విశ్వేశ్వరరావులాంటి వారం నిజాయితీగా చేర్పించిన 37వేల మంది కాంగ్రెసు సభ్యత్వాన్ని రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులైన పట్టాభి శీతారామయ్య రద్దు చేశారు. 1938లో ఏలూరులో రాష్ట్ర రాజకీయ మహాసభ, యువజన మహాసభలు జరిగాయి. ఆ సభలను సుభాసుచంద్రబోసు ప్రారంభించారు. మా గ్రామం నుండి నలుగురం హాజరైనాము. 1938లో మా గ్రామంలో సహకార సంఘమును స్థాపించుటకు కృషికి చేశాం. ఈ కృషి కంచర్ల రాజబాపయ్య, పల్లోతు సుబ్బారావు, కాట్రగడ్డ వెంకటేశ్వరరావుగార్లు కూడా బాగా తోడ్పడ్డారు. వారి కృషి కూడా వున్నది. 2–12–1938న 'ది వెల్దిపాడు కమలానెహ్రూ ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘం' అను పేరుతో స్థాపించాము. సన్నకారు, మధ్య తరగతి రైతులకు, వ్యవసాయ కార్మికులకు సంఘం ద్వారా రుణములు ఇప్పించెడివారము.

## సాహిత్య ప్రభావం:

నేను కందుకూరి వీరేశలింగంగారు, త్రిపురనేని రామస్వామి చౌదరిగారి గ్రంథాలను, గద్దే లింగయ్యగారు రచించిన విప్లవవీరులు అనే నిషేధపు పుస్తకాన్ని చదువుట వలన నాలో అతివాద భావాలే ఎక్కువగా వున్నవి. శ్రీ వెల్లంకి విశ్వేశ్వరరావులాంటి కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ నాయకులతో సంబంధాలు వుండుటచే అవి నాలో బాగా ఏర్పడినవి. గన్నవరము ప్రాంతములో ముక్కామల నాగభూషణం, పెండ్యాల వెంకటేశ్వరరావు, గుంటక పుల్లారెడ్డి, శనగల విశ్వనాథం, పుట్టగుంట నాగభూషణం మొదలగువారితో కలిసి పనిచేస్తూ వుండేవాణ్ణి. రంగాగారి రచనలు, జయప్రకాష్ నారాయణగారిచే రచించబడిన "సోషలిజం ఎందుకు", నార్ల వెంకటేశ్వరరావుగారు రచించిన "నేటి రష్యా" వగైరాలు చదువుటచే నాలో సోషలిస్టు భావాలు బలపడటానికి కారణమైనాయి.

శ్రీ కడియాల గోపాలరావుగారితో సాన్నిహిత్యం ఏర్పడిన తర్వాత (నాకు ఇందుపల్లితో ఎక్కువ సంబంధాలు వుండుట వల్ల) కమ్యూనిస్టు సాహిత్య పుస్తకాలు చదువుట ద్వారా కమ్యూనిస్టు భావాలు ఏర్పడి, కడియాల, వెల్దిపాడులో ఇంకా తలశిల వెంకట నారాయణ, పల్లోతు సుబ్బారావు, మాదాల రామస్వామి, పొట్లూరు సీతారామస్వాములను పార్టీలోకి తీసుకొన్నాము. 1941లో మా గ్రామంలో పార్టీ సెల్ ఏర్పాటు చేసినాము. రోజా స్టడీ సర్కిల్, వయోజన పాఠశాల, యువజన సంఘం ఏర్పాటు, ఆటలు పాటలు కూడా జరుపుతూ వుండేవాళ్ళం. హరిజన వాడలో రాత్రిపూట నేను, కాట్రగడ్డ వెంకటప్పయ్య, పొట్లూరు సీతారామస్వామి

యువజనులకు విద్యను నేర్పుతుండేవాళ్ళం. తర్వాత చదలవాడ శోభయ్య, సజ్జా వెంకటేశ్వరరావు, బొకినాల పెద ఇజ్రాయేలు, బొకినాల అజిరయ్య, ఉయ్యూరు ప్రకాశం పార్టీ సభ్యులైనారు. మా గ్రామ సమావేశాలకు అనాడు వీరవల్లి ఫిర్కా ఆర్గనైజరుగా వున్న వై. వి. కృష్ణారావుగారు హాజరయ్యేవారు.

## వీరవల్లి ఫిర్కా ఆర్గనైజేషన్:

తర్వాత నన్ను వీరవల్లి ఫిర్కా ఆర్గనైజరుగా పార్టీ నియమించింది. అప్పుడు వీరవల్లి ఫిర్కాలో వెల్దిపాడు, వుంగుటూరు, కొయ్యగూరపాడు, తేలప్రోలు, తిప్పనగుంట గ్రామాలు వుండేవి. వాటిని రెగ్యులర్‌గా సమావేశపరుస్తూ పార్టీ కార్యక్రమాలు అమలు జరిగేట్లు చూస్తూ వుండేవాడ్ని. తర్వాత గన్నవరం తాలూకా కమ్యూనిస్టు కమిటీ 1942లో ఏర్పడింది. ఆ కమిటీలో నేను సభ్యుడుగా వున్నాను. మా గ్రామంలో కమ్యూనిస్టు పార్టీ సెల్ ఏర్పడినప్పటినుండి యాక్టివ్‌గా పనిచేయడం వల్ల గ్రామంలో యువకులు, రైతులు, వ్యవసాయ కూలీలు, స్త్రీలు ఎంతోమంది పార్టీ అభిమానులైనారు. అందువల్ల పార్టీ జిల్లా, రాష్ట్ర నాయకులు ఎక్కువగా రహస్య సమావేశాలు జరుపుతూ వుండేవారు. కానీ రహస్యం బయటకు పోయేదికాదు. అప్పటికే ప్రపంచ యుద్ధం జోరుగా సాగుతోంది. శ్రీ కాట్రగడ్డ వెంకటప్పయ్య విద్యార్థిగా బయటవుంటూ, గ్రామానికి వచ్చినప్పుడు యువజనుల సమావేశాల్లో పాల్గొని రాజకీయాలు చెపుతూ వుండేవారు. తరువాత వెంకటప్పయ్య జిల్లా విద్యార్థి ఫెడరేషను కార్యదర్శిగా, రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్‌కు సహాయ కార్యదర్శిగా పనిచేశారు. యుద్ధ వార్తలు ఏరోజుకారోజు కంచర్ల వెంకయ్యగారి డాబా పైనుండి లౌడ్ స్పీకరు ద్వారా శ్రీ పాటూర్లు సీతారామస్వామి ప్రచారం చేస్తుండేవారు. యుద్ధం తీవ్రంగా జరుగుతోంది. కమ్యూనిస్టు పార్టీ, దాని అనుబంధ సంస్థలు. అనగా రైతు, వ్యవసాయ కార్మిక, యువజన, మహిళా, విద్యార్థి సంఘాలు చురుకుగా పనిచేస్తున్నాయి. అప్పటికే బ్రిటిషు ప్రభుత్వం పార్టీని నిషేధించింది. అందువల్ల పార్టీ సమావేశాలు, కార్యక్రమాలు రహస్యంగా జరుగుతూ వుండేవి. మా గ్రామములోనే చంద్ర రాజేశ్వరరావు, చలసాని వాసుదేవరావు, కడియాల గోపాలరావు, నండూరి ప్రసాదరావు రహస్యంగా వుంటూ వుండేవారు. చాలాకాలం మా గ్రామంలో ఆఫీసు నిర్వహించేవారు. పార్టీతరఫున స్వతంత్ర భారత్ అనే సైక్లోస్టైల్ పేపరును ముద్రించి జిల్లాలోని వివిధ శాఖలకు పంపేవారము. సైక్లోస్టైల్ పేపరును స్టెన్సిల్ పేపరుపై వ్రాసి ముద్రించే బాధ్యత శ్రీ పాటూర్లు సీతారామస్వామి నిర్వహించేవారు. పగలు ఉద్యోగము చేసుకుంటూ రాత్రిపూట ఈ పని చేసేవారు. యుద్ధం ముగిసిన తర్వాత పార్టీపై నిషేధం తొలగించినారు.

మా గ్రామంలో నాతోపాటు మొదట పార్టీలో పనిచేసినవారిలో తలశిల వెంకట నారాయణ నూజివీడు తాలూకా పార్టీ ఆర్గనైజరుగాను, పాటూర్లు సీతారామస్వామి జిల్లా పార్టీ ఆఫీసులో సెక్రటరీగాను నియమింపబడినారు.

1940లో గన్నవరం తాలూకా రైతు సంఘం స్థాపించబడింది. కామ్రేడ్ రామినేని పిచ్చయ్య అధ్యక్షులుగా, గుంటక పుల్లారెడ్డి కార్యదర్శిగా, పెండ్యాల వెంకటేశ్వరరావు,

కృష్ణా, అర్జునరావు, శనగల విశ్వనాథం, పి. సీతారామిరెడ్డి, జాలాది రామకోటయ్య, సూరపనేని సుబ్బారావు, అట్లూరు వెంకటేశ్వరరావు, కొణసాని సుబ్బారావు కార్యవర్గ సభ్యులుగా ఎన్నికైనాము. ఆనాడే బుడమేటి వరదల నివారణకై కరకట్టలు పొయ్యాలని, బుడమేటి వెంట బృందము తిరిగి సర్వే చేసి, గవర్నమెంటు వారికి ఒక విజ్ఞాపనము సమర్పించింది. ఆనాడు మా రైతు సంఘ కృషిని మన తెలుగు దినపత్రికలైన ఆంధ్రప్రభ, ఆంధ్రపత్రికలు ఎంతో మెచ్చుకొంటూ వ్రాసినవి. ఆ రోజుల్లో తెలుగు దినపత్రికలు అవి రెండే. తర్వాత గుడివాడ, ఇందుపల్లిలో పర్వతనేని బసవశంకరరావుగారు కలిసి బుడమేటి రైతు మహాసభలు జరిపి కట్టలు పోయవల్సిందిగా తీర్మానించి ఆందోళన చేశాము.

1943లో జిల్లా రైతు సంఘ కార్యవర్గ సభ్యునిగాను, తర్వాత జిల్లా కార్యదర్శిగా ఎన్నికైనాను. 43లోనే గన్నవరం తాలూకా పార్టీ సభను గ్రామంలో జరిపాము. 1943లో పశ్చిమ కృష్ణాలో దాదాపు 120 ప్రాథమిక వ్యవసాయ సహకార పరపతి సంఘాలు పార్టీ నాయకత్వంలో నడుస్తూ వుండేవి. నేను సెంట్రల్ బ్యాంకుకు డైరెక్టరుగా ఎన్నికైనాను. అందువల్ల నన్ను తాలూకా పార్టీ బాధ్యతలనుండి పార్టీ రిలీవ్ చేసింది. మన పార్టీ ఆధ్వర్యంలో నడుస్తూ వున్న సొసైటీల వర్కును సమన్వయం చేసి, తొందరగా లోన్లు శాంక్షను చేయడం, సొసైటీలకు అందేటట్లుగా చూడవలసిందిగా పార్టీ ఆ బాధ్యతను నాకు అప్పగించింది. 1944లో ఆలిండియా రైతు మహాసభ విజయవాడలో జరుపుటకు నిర్ణయించబడింది. దాని నిర్వహణకు ఏర్పడిన ఆహ్వానసంఘంలో నేను, ముక్కామల నాగభూషణం, కాట్రగడ్డ రఘురామయ్యగార్లము నిర్మాణ కమిటీ సభ్యులుగా వున్నాము. నాగభూషణంగారు ఎక్కువగా ప్రజానాట్యమండలి కార్యక్రమాలు, మహాసభ చందా వసూళ్ళ కార్యక్రమాల్లో పాల్గొనుచుండుట వల్ల నేను ఎక్కువగా నిర్మాణ కార్యక్రమంలో రాత్రిళ్ళు, పగలు పనిచేసి, పందిళ్లు, పాకలు, ప్లాట్ ఫారం వగైరాలు పూర్తిచేశాను. రఘురామయ్యగారు అప్పుడప్పుడు వచ్చి సూచనలు, సలహాలు యిస్తూ వుండేవారు. ఈ సభల సందర్భంగా కుటుంబ నియంత్రణ, వ్యవసాయ, పశుప్రదర్శన ఏర్పాటు చేశాము.

## బందరు కాలువ త్రవ్వకం:

1944లో బందరు కాల్వ త్రవ్వకము పనిలో పాల్గొన్నాము. అదే సంవత్సరం వచ్చిన వరదలలో ఏలూరు కాల్వకు కేసరపల్లి సమీపంలో గండిపడగా దానిని పూడ్చుటకు ఉప్పులూరు వాస్తవ్యుడు కాంట్రాక్టు తీసుకొని, పనివారు దొరకటము లేదని పనిని ఆలస్యము చేస్తూ వుంటే నేను, కాట్రగడ్డ పెద వెంకట్రాయుడు, అమరజీవి చింతపల్లి పాపారావు గ్రామాల వెంట తిరిగి ప్రజలను పోగుచేసి, ఆ గండిని పూడ్చినాము. సకాలములో పొలాలకు నీరు అందుడానికి ఏర్పాట్లు చేశాము.

మునగాల రైతాంగ పోరాటంలో పాల్గొన్నాము. నేను విజయవాడలో వుండి రైతు సంఘం బాధ్యతలు నిర్వహించుచున్నాను. కలుకోవ గ్రామములో పోలీసులు కాల్పులు జరుపగా భీమా గురవయ్య (హరిజనుడు, వ్యవసాయ కార్మికుడు) మరణించాడు. ఈ వార్త తెలియగానే విజయవాడనుంచి నేను, నాటి మద్రాసు శాసనసభా సభ్యులు పిల్లలమర్రి వెంకటేశ్వర్లు, రాష్ట్ర మహిళా సంఘం అధ్యక్షురాలు డాక్టరు కొమర్రాజు

అచ్చమాంబ, లీలా సుందరయ్య, ప్రజా నాట్యమండలి కార్యకర్త తాపీ రాజమ్మగారు కలుకోవ గ్రామం వెళ్ళి అక్కడి పరిస్థితులను గమనించాము. కలుకోవ గ్రామంలో మృతుని కుటుంబాన్ని ఓదార్చి, మందలపు రామయ్యగారి ఇంటిపైబడి పోలీసులు చేసిన దౌర్జన్యాలను తెలుసుకొని వారి కుటుంబాన్నికూడా ఓదార్చినాము. వారికి మా సానుభూతిని తెలిపి విజయవాడ వచ్చి, మునగాల జమీందారు చేసే దౌర్జన్యాలను, పోలీసు కాల్పులను ఖండిస్తూ పత్రికా ప్రకటన చేసినాము.

1947 పై చివరి వారంలో మద్రాసు రాష్ట్ర రెవిన్యూ మంత్రి శ్రీ కళా వెంకట్రావు గొట్టిపాటి బ్రహ్మయ్యగారితో కలిసి మునగాల వచ్చారు. వారిని నేను, వై. వి. కృష్ణారావు కలిసి, పరగణా, జిల్లా రైతు సంఘాల తరపున పోలీసు కాల్పులపై విచారణ, బ్రహ్మయ్య అవార్డును తొందరగా అమలు పరచాలని పిటిషన్లు ఇచ్చినాము. దానికి మంత్రిగారు పోలీసు కాల్పులపై విచారం వ్యక్తం చేస్తూ కాల్పులపై విచారణ జరిపిస్తామని, బ్రహ్మయ్య అవార్డు అమలు చేయిస్తానని హామీ ఇచ్చినారు.

1947లోనే బుద్ధవరంలో జరిగిన పార్టీ రాష్ట్ర 4 వ మహాసభ జయప్రదంగా జరగటానికి కృషి చేశాను.

## రహస్య జీవితం:

1948 మార్చి 21, 22 తారీకులలో గన్నవరము తాలూకా రైతు మహాసభను మా గ్రామంలో జరిపాము. సభ ప్రారంభం కాగానే పోలీసులు జీపులో వచ్చి, ప్రభుత్వం 144వ సెక్షన్ విధించినట్లు ప్రకటించారు. అప్పటినుండి నా రహస్య జీవితం ప్రారంభమయింది. నాపై ప్రభుత్వ ఉత్తర్వు ధిక్కరణ, దావాజిగూడెం మర్డరు కేసులో ముద్దాయిగా కేసులు పెట్టినారు. నేను రహస్య జీవితాన్ని వెల్దిపాడు, కొయ్యగూరపాడు, వేంపాడు, తిప్పనగుంట, చినఓగిరాల, గండిగుంట, విజయవాడ, అనంతపురంజిల్లా, తెన్నేరు గ్రామాలలో గడిపాను. చివరకు 1943లో తెన్నేరు గ్రామంలో మిత్రద్రోహి గొంది కోటేశ్వరరావు బృందముచే పట్టుబడినాను. మానికొండ పోలీసు స్టేషనులో అప్పచెప్పినారు. గన్నవరం, నూజివీడు, విజయవాడ జైళ్ళలో నన్ను నిర్బంధించారు. నా తరపున కేసులలో శ్రీ పొన్నం వీరరాఘవయ్య వాదించారు. కేసు కొట్టివేయబడింది. 1950 చివర్లో జైలునుండి విడుదలయ్యాను. శ్రీ చంద్ర రామలింగయ్య జిల్లా రైతు సంఘ అధ్యక్షులుగా, నేను కార్యదర్శిగా పనిచేశాము. 1944లో కమ్యూనిస్టు పార్టీ రైతుసంఘాలు అధికారోత్పత్తికై బంజర్లు బీడులు సాగుచేయవలసిందిగా పిలుపు నిచ్చాయి. మా గ్రామానికి సంబంధించి అవుటపల్లి, వెల్నూతల పొలాలకు ఏలూరు కాలువనుండి వచ్చు ఉంగుటూరు కాల్వ ద్వారా నీరు సప్లయి అయ్యేది.

మా గ్రామమైన వెల్దిపాడుకు దక్షిణంగా ఉన్న కండ్రిక పొలాలు, తూర్పుగా ఉన్న వెల్దిపాడు పొలాలు బీడులుగా వుండేవి. అపుడు పి. డబ్ల్యు. డి. (ఇరిగేషన్ శాఖ) వార్ని కలిసి వారితో అదనపు సాగుకై కాల్వ త్రవ్వవలసిన విషయాన్ని మాట్లాడి వార్ని మా గ్రామానికి తీసుకువచ్చాను. వారికి బీడులు అవి చూపించి వాటిని సాగుచేయుటకు కాల్వ ద్వారా నీరు కావాలి కాబట్టి ఉంగుటూరు కాల్వనుండి వున్న అవుటపల్లి బోదె ప్రక్కనే సమాంతరముగా కాల్వ త్రవ్వి ఆ బోదె చివర్లో మలుపు

తిరిగి మరల దక్షిణముగా వచ్చి మరల తూర్పుదిక్కుగా కాల్వ త్రవ్వి మా గ్రామ హరిజన వాడకు దగ్గర్లోకి వచ్చి అక్కడ నుండి దానికి రెండు కాల్వలు త్రవ్వినచో మొత్తము బీడులు సాగు అగునని రైతు సంఘం తరపున చెప్పి కృషి చేసాము. పి.డబ్ల్యు.డి. వారు దానికి స్పందించి కాల్వ త్రవ్వుటకు శాంక్షను చేశారు. ఆ కాల్వ త్రవ్వుట వలన వేంపాడు గ్రామ రైతుల పొలాలకు, మా గ్రామ రైతుల పొలాలకి నీరు సప్లయి అయి, బీడులు మాగాణి పొలాలుగా మారిన. మా గ్రామ హరిజనులకున్న పొలాలు కూడా ఈ కాల్వ క్రింద సాగులోకి వచ్చినవి.

అదే విధముగా ముస్తాబాద గ్రామానికి ఏలూరు కాల్వనుంచి కాలువ త్రవ్వి ఆ ఊరి పెద్ద చెఱువుకు కనక్షను ఇచ్చే విధముగా ఏర్పాటు చేయవలసినదిగా కోరినాము. మొదట పి.డబ్ల్యు.డి. వారు తిరస్కరించారు. దానితో మాలో పట్టుదల పెరిగినది. ప్రక్క గ్రామమైన సావారుగూడెం కాల్వద్వారా నీరు ఇస్తున్నారు. అదే విధముగా ఈ గ్రామానికి కూడా కాల్వ ద్వారా నీరు సప్లయి చేసినచో 5000 ఎకరములు సాగు అగునని చెప్పగా, చివరకు శాంక్షను చేసినారు. ఈ కృషిలో చంద్ర రామలింగయ్య, నేను, డాక్టరు సి. ఎల్. రాయుడు, మద్దుకూరి సత్యనారాయణ కృషి చేశాము. ఆ విధముగా ఆ గ్రామములో కూడా మెట్టపొలాలు మాగాణి భూములుగా మారినవి. 1959లో వీరవల్లి పంచాయతీ సమితిలో 5 వ స్టాండింగు కమిటీ సభ్యునిగా ఎన్నికైనాను. గ్రామాభివృద్ధికి కృషిచేశాను.

## సహకార పరపతి సంఘం బాధ్యతలు:

1960 ఫిబ్రవరి 16 న మా గ్రామ సహకార పరపతి సంఘానికి అధ్యక్షుడుగా ఎన్నికై, 1984 వరకు ఆ పదవిలో ఉన్నాను. ఈ కాలములోనే వేర్వేరు సొసైటీలైన నాగవరప్పాడు, వెల్నూతల గ్రామ సొసైటీలను మా గ్రామ సహకార సంఘంలో కలిపి మూడు గ్రామాలకు ఒకే సొసైటీని ఏర్పర్చినాను. సొసైటీకి స్వంత భవనాన్ని నిర్మించాము. భవన నిర్మాణములో నాతోపాటు శ్రీ కాట్రగడ్డ ఆంజనేయులు కూడా కష్టపడినారు. ఇపుడు మా సొసైటీకి నా సోదరుడు జాలాది భాస్కరరావుగారి రెండవ అబ్బాయి బాలకృష్ణ ప్రసాదు అధ్యక్షులుగా ఉన్నారు. మా సొసైటి పుట్టినప్పటినుండి ఎక్కువ కాలము కమ్యూనిస్టులే అధ్యక్షులుగా ఉన్నారు.

మా జాలాదివారు ఎక్కువగా కమ్యూనిస్టు ఉద్యమంలోనే ఉన్నారు. దేశ స్వాతంత్ర్య పోరాటములో మా బంధువులు జాలాది సత్యనారాయణ, జాలాది పార్థసారథి పాల్గొన్నారు. నాతోపాటు కమ్యూనిస్టు ఉద్యమంలో పనిచేసిన జాలాది వెంకటేశ్వరరావు, జాలాది దశరథ రామారావు, జాలాది బుచ్చయ్య, జాలాది వెంకట ఉదయ భాస్కరరావు జైలు జీవితము గడిపినవాళ్ళు. నా మేనమామగారి పెద్ద అమ్మాయి శ్రీమతి గద్దే సీతామహాలక్ష్మి మహిళా ఉద్యమంలో పనిచేసింది.

మా గ్రామమును సందర్శించిన ముఖ్యులు అఖిల భారత కమ్యూనిస్టు పార్టీ నాయకులు చండ్ర రాజేశ్వరరావు, పుచ్చలపల్లి సుందరయ్య, మాకినేని బసవపున్నయ్య, రైతు ఉద్యమ ప్రముఖ నాయకులు వై. వి. కృష్ణారావుగారు, నండూరు ప్రసాదరావు, రాష్ట్ర రైతు ఉద్యమ నాయకులు చలసాని వాసుదేవరావు, కడియాల గోపాలరావు, అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ నాయకులుగా పనిచేసి నేటి రాష్ట్ర పార్టీ

కార్యదర్శిగా పనిచేయుచున్న దాసరి నాగభూషణరావు, రాష్ట్ర వ్యవసాయ కార్మిక సంఘ నాయకులు గుంటూరు బాపనయ్య, రాష్ట్ర శాంతి ఉద్యమ నాయకులు పొన్నం వీరరాఘవయ్య మరియు వేములపల్లి శ్రీకృష్ణ.

మన దేశములో కమ్యూనిస్టు పార్టీ స్థాపించి 50 సం॥లు దాటాయి. గన్నవరం తాలూకా కమ్యూనిస్టు కమిటీ 1976లో నాకు సన్మానము చేసింది. మరల 1995 సెప్టెంబరు 1వ తారీఖున విజయవాడలోని తుమ్మలపల్లివారి క్షేత్రయ్య కళాక్షేత్రములో రాష్ట్ర రైతు సంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ కొల్లి నాగేశ్వరరావు అధ్యక్షతన నాకు, డాక్టరు సి. ఎల్. రాయుడుకు; కృష్ణాజిల్లా రైతుసంఘం, కృష్ణా జిల్లా వ్యవసాయాభివృద్ధి సమితిచే అఖిల భారత రైతుసంఘ నాయకులు శ్రీ వై. వి. కృష్ణారావుగారిచే సన్మానము చేయబడినది. ఇప్పుడు నా వయస్సు 80 సం॥ పై బడింది. ఇపుడు నేను క్రియాశీల రాజకీయాలలో పాల్గొనకపోయినప్పటికీ పార్టీతో నిత్యసంబంధాలు కలిగిఉన్నాను.

★ ★ ★

# ప్రథమ భారతీయ సోషలిస్టు మహిళ మేడమ్ కామా

- పి.వి. రాఘవయ్య



మేడమ్ కామా (విభాజీ రుస్టోమ్ కామా) 24-9-1861న బొంబాయిలోని ధనిక పార్శీ కుటుంబంలో జన్మించింది. ఇదే సంవత్సరంలో కలకత్తాలో రవీంద్రనాథ్ ఠాగూర్ జన్మించారు. మేడమ్ కామా తండ్రి సొరాబ్జీ ఫ్రాంజీ పటేల్. తల్లి జిజీభాయి. బొంబాయిలోని అలెగ్జాండర్ పార్శీ గరల్స్ స్కూలులో చదివింది. తరువాత పలు విదేశీ భాషలు నేర్చుకున్నది. 24 సంవత్సరాల వయస్సులో వివాహం జరిగింది. ఆమె భర్త రుస్టుం (సొలిష్టర్) బొంబాయిలో పేరు ప్రఖ్యాతలు కల్గిన ఓరియంటల్ ప్రొఫెసర్. కుర్షీద్‌జీ రుస్టుంజీ కుమార్డు. మేడమ్ కామా చిన్నతనంలోనే విశాలమైన సాంఘిక భావాలు కలిగి, నిర్ణీతమైన రాజకీయ దృక్పథం కలిగిన మహిళ. భారతదేశంలో బ్రిటీష్ వారి పాలన అంతం చేయాలని ఆమె గాఢమైన ఉద్దేశం. ఆమె అన్నిరకాలా మనిషిని మనిషి దోచుకునే విధానానికి వ్యతిరేకం. ఆమె స్వేచ్ఛ కలిగి అభివృద్ధి చెందిన దేశంగా భారత్‌ను రూపుదిద్దాలని కలలు గన్నది. కానీ ఆమె భర్త సంప్రదాయం (కన్జర్వేటర్) రాజకీయ, సాంఘిక అభిప్రాయాలు కలిగినవాడు. బ్రిటీష్ వారు భారతదేశాన్ని మరో వంద సంవత్సరాలు పాలించడం మంచిదనే అభిప్రాయం కలిగినవాడు. ఇద్దరి అభిప్రాయాలు భిన్నమైనవి. ఒక దానికొకటి వ్యతిరేకం.

1896లో బొంబాయిలో ప్లేగు వచ్చింది. అప్పుడు మేడమ్ కామా తన ఇల్లు వదిలి ఆ ప్రాంతానికి వెళ్ళి ఎంతో ధైర్య సాహసాలతో ఆ ప్రజలకు సేవ చేసింది. వ్యాక్సిన్ కూడా కనిపెట్టని రోజులవి. ఈ సేవలు ఆమె కుటుంబానికి, ఆమె భర్తకు ఇష్టంలేదు. బీదలకు సేవలు చేయడం వారి హోదాకు చిన్నతనంగా భావించారు. మేడం కామాకు, ఆమె కుటుంబానికి మధ్య అభిప్రాయాలలో అగాధం పెరిగింది. 1901లో ఆమె కుటుంబాన్ని వదిలి వెళ్ళాలని నిశ్చయించుకొంది. 1901 డిసెంబరులో ఇండియా వదలిపెట్టి, వివిధ ఖండాలలో భారతదేశ విముక్తికి విప్లవ కార్యకర్తగా కార్యదక్షతతో పనిచేసింది.

మేడమ్ కామా 1902 నుండి 1907 వరకు ఇంగ్లాండులో వుంది. దాదాభాయ్ నౌరోజీ, సరోజినీ నాయుడు లాంటివారు అప్పటికే ఇంగ్లండులో వున్నారు. నౌరోజీ నాయకత్వంలో దేశ స్వాతంత్ర్య ఉద్యమంలో పనిచేసింది. ఈ దశలోనే ఇటలీ విప్లవకారిణి మజ్జిని అభిప్రాయాలు, ఆలోచనలు కామాను ప్రభావితం చేశాయి. క్రమంగా ఆమె ప్రపంచ సామ్రాజ్య వ్యతిరేక ఉద్యమం వైపు ఆకర్షితురాలైంది. కాంగ్రెస్‌లోని అతివాదులైన బాలగంగాధర తిలక్, బిపిన్ చంద్రపాల్, లాలా లజపతిరాయ్ వైపు మొగ్గు చూపింది. ఈ నేపథ్యంలోనే శ్యామ్‌జీ కృష్ణవర్మ, రాణాజీలతో ఆమెకు సన్నిహిత సంబంధాలు ఏర్పడ్డాయి.

ఆమెలో బలంగా నెలకొని వున్న అంతర్జాతీయ దృక్పథం, సామ్రాజ్య వ్యతిరేక ఉద్యమ ఐక్యత భావాల కారణంగా భారత స్వాతంత్ర్య ఉద్యమాన్ని ఆ దృక్కోణం నుంచే చూడాల్సి వచ్చింది. ఇది ఆమె ఆలోచనా విధానంలో, ఆచరణలో పెద్ద మార్పు తీసుకువచ్చింది. ఫలితంగా తొలుత ఆమె ఫ్రెంచ్ సోషల్ డెమోక్రటిక్ పార్టీ, ఆ తరువాత మార్క్సిజం వైపు ఆకర్షితురాలైంది. రెండవ అంతర్జాతీయ స్టట్‌గర్ట్ సమావేశానికి (1907) హాజరయ్యింది. అక్కడ లెనిన్ ఉపన్యాసం విని ఆయన అభిమానిగా మారింది.

లండన్‌లో ఈ ముగ్గురు విప్లవకారులు భారతదేశ స్వాతంత్ర్య ఉద్యమంలో ముఖ్యులుగా నిలిచారు. పండిట్ క్రిష్ణవర్మ సంపాదకత్వంలోని 'ఇండియన్ సోషలిస్టు' పత్రిక ఇంగ్లండులో భారత స్వాతంత్ర్య ఉద్యమం గురించి ప్రచారం చేసేది. మేడమ్ కామా, రాణాజీలు ఈ మాసపత్రికకు క్రమం తప్పకుండా వ్యాసాలు రాసేవారు. వారి కార్యాచరణ వారిని ప్రపంచ విప్లవకారులు కార్యక్రమం దగ్గరకు తీసుకువచ్చింది.

కృష్ణవర్మ 1905లో ఇండియన్ హోంరూల్ సొసైటీని లండన్‌లో స్థాపించారు. ఈ సంస్థ కార్యకలాపాలలో కామా కూడా ప్రముఖ పాత్ర వహించింది. ఇండియన్ సోషలిస్టు పత్రికలో ప్రచురించే అభిప్రాయాలతో కూడా ఏకీభవించేది. ఈ పత్రిక భారత కాంగ్రెస్ నిర్ణయాలకు సహాయపడేది. అయితే ఆమె క్రమేపీ కాంగ్రెస్ నుంచి దూరమైంది. మితవాద కాంగ్రెస్ నాయకుల విధానాలే ఈ చర్యకు కారణమైంది. కామా విప్లవకారులతో కలిసింది. 1905లో తొలిసారిగా బ్రిటన్‌లో 1857 భారత స్వాతంత్ర ప్రథమ పోరాట వార్షికోత్సవం జరిపారు. ఆ సభకు మేడమ్ కామా అధ్యక్షత వహించారు.

సావర్కార్ లండన్ వచ్చిన తరువాత భారత్ జాతీయవాదుల, దేశభక్తులలో విప్లవ కార్యక్రమాలు తీవ్రతరం చేశాడు. వీనిలో మేడమ్ కామా ప్రముఖ పాత్ర వహించింది. యువ విప్లవకారులను ఉత్తేజపరిచింది. వారిలో పోరాట స్ఫూర్తిని పెంచింది.

1905–1911 మధ్య భారతదేశంలో విప్లవ కార్యక్రమాలు పెరిగాయి. బెంగాల్, పంజాబ్‌లలో విప్లవోద్యమం తీవ్ర రూపం దాల్చింది. ప్రజలు ఆయుధాలను చేపట్టారు. విప్లవకారులకు ఆయుధాలు సరిగా అందుబాటులో లేకపోయాయి. ఆ దశలో కామా లండన్ నుండి విప్లవకారులకు ఆయుధాలు సరఫరా చేసింది.

సాయుధ పోరాటంలో నమ్మకమున్నప్పటికీ, ఆమె అభినవ భారత్ సభ్యురాలిగా క్రియాశీల పాత్ర వహించింది. తన పోరాట మార్గం గురించి మేడమ్ కామా

ఈ విధంగా చెప్పింది:

"నేను ఊరుకోలేను. పోరాట పద్ధతులు చెప్పదలిచాను. మన దేశంలోని బ్రిటీష్ వారి నిరంకుశ క్రూర పాలన, ప్రతిరోజూ మనదేశ స్వాతంత్ర్య పోరాట నాయకులను దేశం బయటకు వెళ్ళగొట్టడం, శాంతియుత పోరాట మార్గాలను నిషేధించడం జరుగుతున్నది. మనలో కొంతమందికి నేను స్త్రీ అవటం చేత దౌర్జన్య విధానాన్ని వ్యతిరేకించాలనే ఉద్దేశం ఉండవచ్చు. స్వాతంత్ర్యం పొందడానికి మూల్యం చెల్లించాలి. ఏ దేశం మూల్యం చెల్లించకుండా స్వాతంత్ర్యం సంపాదించింది?

"మన భారతదేశ ప్రజలకు విప్లవం పవిత్రమైంది. మనదేశం తొందరగా వలస పాలన నుంచి విముక్తి పొందాలి. మనదేశం విముక్తి పొందాలి. మనదేశం విముక్తి పొందడం, ఐక్యతతో కొనసాగడం, నేను నా జీవితంలో చూడాలనే కోర్కె. యువకుల్లారా! మిమ్మలను ప్రాధేయపడుచున్నాను. మీరు చిత్తశుద్ధితో స్వరాజ్యం ధ్యేయంగా ముందుకు నడవండి. మన సిద్ధాంతం ఏమంటే, మనమందరం భారతదేశానికి ప్రజల తరపున బాధ్యులు కావాలి."

లండన్‌లో ఇండియన్ సొసైటీ, స్వదేశీ, వందేమాతరం సంస్థల ఆధ్వర్యంలో జరిగిన సమావేశాల్లో భారతదేశంలో హిందువులు, ముస్లింల సంబంధాల విషయం గురించి కామా చెప్పిన మాటలు:

"భారతదేశంలో ముస్లింలకు పోరాటబలం వున్నందుకు సంతోషం. హిందువులు, ముస్లింల మధ్య ఐక్యత వుండటం చాలా అవసరం. ఈ ఐక్యతే భారతదేశ సమైక్యతకు గ్యారంటీ. బలప్రయోగం, హింసలు అనివార్యం. ఈ ప్రయోగాలు ఉపయోగించకుండా వుంటే స్వాతంత్ర్యం ఒక కల. అది తమాషా అవుతుంది."

## బ్రిటన్ ప్రభుత్వంతో ఘర్షణ:

1907లో బ్రిటీష్ ప్రభుత్వం, 1857 భారత ప్రథమ స్వాతంత్ర్య పోరాటం అణచివేత 50వ వార్షికోత్సవాన్ని లండన్‌లో జరపాలని నిర్ణయించింది. భారత దేశభక్తియుత ప్రజల పోరాటాన్ని ఉద్దేశ పూర్వకంగా కించపరచటమే దీని వెనుక వున్న బ్రిటీష్ సామ్రాజ్యవాదుల ఉద్దేశం. దీన్ని లండన్‌లోని భారతీయ విప్లవకారులు వ్యతిరేకించారు. 1857 పోరాటం భారత స్వాతంత్ర్యం కోసం సాగిన యుద్ధంగా చాటి చెప్పటానికి 50వ వార్షికోత్సవం జరపాలని నిర్ణయించారు. ఈ సందర్భంగా ఒక కరపత్రం ప్రచురించారు. వీటిని ఉచితంగా పంపిణీ చేశారు. భారతదేశానికి కూడా పంపారు. ఈ సందర్భంగా ఇంగ్లాండ్, ఇండియాలోను వెలువడే 'ది టైమ్స్' పత్రిక అరంభమైంది. స్వాతంత్ర్యసమరం సంక్రమించినదాది, వారసత్వంగా మెరయు విజయదరహాసం అంతిమంగా అని ఒక ఆంగ్లగేయాన్ని ప్రచురించింది.

ఈ సందర్భంగా మేడమ్ కామా ప్రసంగిస్తూ, "విదేశీయులు పోవాలి అనే దృఢ సంకల్పంతో పోరాటాన్ని కొనసాగించాలని మనం నిర్ణయించుకున్నాం. బానిసత్వాన్ని మట్టిలో కలిసేటట్టు చేయడం, స్వేచ్ఛను సింహాసనం అధిష్టించేటట్లు చేయడం మన కర్తవ్యం. మన అమరులు చేసిన 1857 పోరాటం కొనసాగిస్తాం. ఇందులో రాజీ లేదు. వారు చేసిన యుద్ధాన్ని, మొదటి స్వాతంత్ర్య పోరాట యుద్ధంగా ఎంచుకున్నాం.

1857 గడిచి 50 సంవత్సరాలైంది. అయినా, దాన్ని మేం మరచిపోం. వజ్రోత్సవాల నాటికి, మా ప్రాణాలర్పించి అయినా అమరుల కోరిక నెరవేర్చుతాం" అన్నారు.

ఆమె ప్రసంగం అక్కడి వారిని ఉత్తేజపరచింది. ఉద్రేకపరచింది.

దేశ స్వాతంత్ర్య వీరులలో ప్రముఖ పాత్ర వహిస్తున్న లాలా లజపతిరాయ్‌ను, సర్దార్ అజిత్‌సింగ్‌ను బ్రిటీష్ ప్రభుత్వం అరెస్టు చేసి, దేశం బయటకు పంపారు. ఈ ఘటన దేశంలోపల, వెలుపల వున్న విప్లవకారులను ఉద్రేకపరచింది. దేశభక్తులను కోపోద్రిక్తులను చేసింది. ఈ సందర్భంగా మేడమ్ కామా ఇండియన్ సోషలిస్టు పత్రికలో "బ్రిటీష్ నిరంకుశత్వానికి వ్యతిరేకంగా తిరుగుబాటు చేయండి" అని పిలుపు నిచ్చింది. పారిస్‌లోనూ, లండన్‌లోనూ భారతీయుల సమావేశాలలో ప్రసంగించింది. "మనలో ఒకరైన దేశభక్తుడు లాలా లజపతిరాయ్‌ను బంధించినట్లు విని నా గుండెలదిరిపోయాయి. స్త్రీ, పురుషులంతా ఈ దారుణమైన క్రూరత్వాన్ని నిరసించండి. మీరు దృఢ సంకల్పులు కండి. బానిసత్వంలో ఉండేకంటే, మానవులంతా చావడమే మంచిది.

"ఇండియా, పర్షియా, అరేబియా ఘనత చెందిన మన ప్రాచీన చరిత్ర చెప్పుకుంటే లాభమేమిటి, నేడు బానిసత్వం అనుభవిస్తూ!

వీరత్వం కలిగిన రాజపుత్రులు, సిక్కులు, పఠాన్లు, గూర్ఖాలు, చురుకైన పార్శీలు, ధైర్య సాహసాలు కలిగిన మహమ్మదీయులు, మృదువుగా సమాధానపడే జైనులు, ఓర్పుగల హిందువుల బలమైన జాతుల పిల్లలూ, మీరు మీ సాంప్రదాయాల సరళిలో ఎందుకు ఉండటంలేదు? మీరు బానిసత్వంలో ఉండటానికి కారణం ఏమిటి? బయటకు రండి. స్వరాజ్యం సంపాదించి స్వేచ్ఛా సమానత్వం ఏర్పరచండి. మీరు లేవండి, మీ శ్రేయస్సు కొరకు లేవండి, మీ పిల్లల కొరకు లేవండి. సోదరీసోదరులారా! మానవ హక్కుల కోసం పోరాడండి. తూర్పు పశ్చిమానికి పాఠాలు నేర్పగలదని ప్రపంచానికి చాటండి.

"లాలా లజపతిరాయ్‌ని విడిపిద్దాం. జైలుగోడలు పగులగొట్టి అయన్ను బయటకు తీసుకువద్దాం. మీరూ ధైర్యంగా రండి. మనల్ని ఈ నిరంకుశ ప్రభుత్వం ఎన్ని జైళ్ళలో బంధించగలదు? అయితే, ముందు మనం ఐక్యంగా ఉండాలి. ఆ తరువాత బ్రిటీష్ నిరంకుశ ప్రభుత్వాన్ని నిలదీయాలి. భారతీయులందరూ 'వందేమాతరం' అంటూ ఉత్తేజం ఉప్పొంగేలా కదలాలి" అని ఆమె పేర్కొన్నారు. దేశ ఐక్యత ప్రాధాన్యతను నేడేకాదు, అనాడే మనవారు గుర్తించారనడానికి ఈ మాటలే నిలువుటద్దాలు. ఆ ఐక్యత పరిరక్షణకు మనం కంకణబద్ధులం కావాలి.

## అంతర్జాతీయ వాదిగా:

కామా పారిస్‌నుండి ఆమె కార్యక్రమాలను ద్విగుణీకృత కార్యదక్షతతో ప్రారంభించింది. జాతీయ ఉద్యమాలగురించి, సామ్రాజ్యవాదం, సోషలిస్టు ఉద్యమం గురించి ఈమె ఆలోచనలలో మార్పు వచ్చింది. దానితో భారత విమోచనోద్యమంతోనూ, విదేశీ విప్లవకారులతోనూ తన సంబంధాలను అభివృద్ధి చేసుకున్నది. ఇతర జాతీయ విమోచనోద్యమానికి, మన జాతీయ ఉద్యమానికిగల సంబంధాన్ని అర్థం చేసుకున్నది.

ఈ దశలోనే 1909 ఫిబ్రవరిలో వినాయక్ సావర్కార్‌ను నాసిక్ కుట్రకేసులో ఇరికించారు. పిస్టల్, మందుగుండు సామాను రహస్యంగా తెప్పించినందుకు ఈ అరెస్టు జరిగింది. అదే సందర్భంలో మదన్‌లాల్ ఢింగ్రాను కూడా అరెస్టు చేసి, ఉరి తీశారు. దేశ స్వాతంత్ర్య జ్వాలలకు ఆహుతి అయిన తొలి వ్యక్తి ఢింగ్రా. సావర్కార్‌కు ఈ పిస్టల్‌ను లండన్ నుండి రాణాజీ, శ్యామ్‌జీలు పంపించారనే కారణంతో వారిని కూడా కేసులో ఇరికించాలని ప్రయత్నం చేశారు. అపుడు మేడమ్ కామా తన సహచరులైన విప్లవకారులకు సహాయపడేందుకు పారిస్‌లోని బ్రిటిష్ కాన్సులేట్ కార్యాలయానికి స్వయంగా వెళ్ళి, తానే పిస్టల్ పంపినట్లు లిఖితపూర్వకంగా తెలియచేసింది. సావర్కార్‌ను ఓడలో ఇండియాకు తీసుకువస్తుండగా మారిషస్ వద్ద ఓడ నుండి తప్పించుకుని, ఫ్రాన్స్ ప్రభుత్వ రక్షణ కోరాడు. ఫ్రాన్స్ ప్రభుత్వం తిరిగి బ్రిటిష్ వారికే అప్పగించింది. ఈ చర్యను ప్రపంచ వ్యాప్తంగా ఖండించారు. సావర్కార్ కేసును మేడమ్ కామా హేగ్‌లోని అంతర్జాతీయ కోర్టుకు పంపేటట్లు చేసింది. అయినా, ఫలితం దక్కలేదు. మేడమ్ కామా తన శక్తిని, ధనాన్ని భారతదేశంలో విప్లవోద్యమాన్ని నిర్మించటానికే ధారపోసింది. ఆమెది మానవత్వం కలిగిన హృదయం. ఆమె ఇతరులకు సహకారమిచ్చే మనస్సు కలిగిన నిస్వార్థ విప్లవకారిణి.

## ప్రథమ భారత సోషలిస్టు:

మేడమ్ కామా 1907 ఆగస్టులో స్టట్‌గర్ట్ 2వ అంతర్జాతీయ సోషలిస్టు సభకు వెళ్ళినపుడు ఆమె జీవితంలో పెద్దమార్పు వచ్చినది. ఆమెతోపాటు రాణాజీ కూడా హాజరయ్యారు. ఆ మహాసభలో వలస సమస్య గురించి, భారత్ స్వాతంత్ర్యం ఉద్యమం గురించి, ప్రపంచ కార్మిక ఉద్యమాల గురించి చర్చలు జరిగాయి. ఆశ్చర్యకరమైన విషయ మేమిటంటే, బ్రిటిష్ లేబర్ నాయకుడు, రామ్‌సేస్ మేగ్నల్డ్ (తరువాత ప్రధానమంత్రి) భారతీయు లిద్దరినీ డెలిగేట్స్ కావటానికి అభ్యంతరపెట్టాడు. అయినప్పటికీ, ఇతర దేశాల సోషలిస్టు, కార్మిక నాయకులు బలపరచటం వల్ల ప్రతినిధులు కాగలిగారు. ఆ మహాసభలో లెనిన్, లక్సంబర్గ కూడా ఉండి బలపరిచారు. 18–8–1907న భారతదేశ జాతీయ జెండాను ఆ మహాసభలో ఎగురవేసినది కామా. ఈ సందర్భంగా ఆమె చెప్పిన మాటలు: "భారతదేశ స్వతంత్రజెండా చూడండి. ఈ జెండా భారతదేశంకోసం ప్రాణాలర్పించిన యువ అమరవీరుల రక్తం నుండి వచ్చింది. మీరందరూ భారతదేశ జాతీయ జెండాకు నమస్కరించండి. ప్రపంచములో స్వేచ్ఛ అభిమానులందరూ ఈ జెండాతో సహకరించి, ప్రపంచ మానవాళిలో అయిదవ వంతైన భారత ప్రజలు స్వేచ్ఛను పొందటానికి మార్గం వేయండి."

మేడమ్ కామా భారతదేశం సంపూర్ణ స్వాతంత్ర్యం పొందాలని తీర్మానం ప్రతిపాదించింది. ఆమె ఈ సందర్భంలో చెప్పిన మాటలు – "బ్రిటిష్ పరిపాలన భారతదేశంలో పొడిగించడం ప్రమాదకరం, భారత ప్రజల స్వప్రయోజనాలకు హాని. ప్రపంచములో స్వేచ్ఛ కాముకులు అందరూ కలిసి వచ్చి ప్రపంచంలో 5వ వంతుగా ఉన్న మా దేశాన్ని బానిసత్వమునుంచి విముక్తి చేయటానికి సహకరించండి." ఈ

తీర్మానాన్ని సోషలిస్టు, మార్క్సిస్ట్ డెలిగేట్స్ బలపరిచారు. అప్పట్లో భారతదేశ కాంగ్రెస్ మితవాద ధోరణిలో ఉండేది.

మేడమ్ కామా మన భారతదేశ స్వాతంత్ర్య ఉద్యమములో ప్రత్యేకమైన స్థానము వహించింది. భారతదేశం పూర్తి స్వాతంత్ర్యం పొందాలని కోరిన ప్రథమ వ్యక్తి మేడమ్ కామా. స్వపరిపాలన కావాలని చెప్పిన ప్రథమ వ్యక్తి కూడా ఆమే. అంతర్జాతీయ వేదికమీద భారతదేశ జెండాను ఎగురవేసిన ప్రథమ వ్యక్తి కూడా ఆమే. మేడమ్ కామా లేవనెత్తిన నినాదం జాతీయ కాంగ్రెస్ కొన్ని సంవత్సరాలకు లేవనెత్తింది. ఆ విధంగా అనంతర కాలంలో జాతీయ ఉద్యమం నిర్మాణయుతం కావటానికి ఆమె కారకురాలైంది. 1906లో కలకత్తాలో అవిష్కరించిన స్వదేశీ జెండాకు, 1907లో స్టట్ గార్ట్ మహాసభలో అవిష్కరించిన జెండాకు దగ్గర పోలికలు ఉన్నాయి. రెండు జెండాలకు ఈ దగ్గరి పోలికలవల్ల 1906 కలకత్తా జెండా విదేశాలలో ఉన్న విప్లవకారులను చేరింది. హేమచంద్ర రెండవ స్టట్ గార్ట్ జెండాను రూపొందించారు. లాహోర్ జాతీయ కాంగ్రెస్‌లో అవిష్కరించిన మూడు రంగుల జెండా అధికారంగా అంగీకరించబడి, తీర్మానం చేయబడినది. లాహోర్ కాంగ్రెస్‌కు 20 సంవత్సరాలకు ముందే 1907లో మేడమ్ కామా ఈ పని చేసింది.

### మార్క్సిస్టుగా:

మేడమ్ కామా అంతర్జాతీయతను అర్థం చేసుకొన్న, సోషలిస్టు దేశాలతో నమ్మకమున్న ప్రథమ భారతవ్యక్తి. స్టట్ గార్ట్ మహాసభ జరిగిన తరువాత లెనిన్ గురించి, రష్యన్ పోరాటాల గురించి ప్రత్యేక ఆసక్తిని కనబరచింది. విప్లవకారుడు వీరేంద్రనాథ్ ఛటోపాధ్యాయ మాటల ప్రకారము లెనిన్ అంటే ఉత్తేజపడిన ప్రథమ ఇండియన్ మహిళ లేక ఇండియన్ విప్లవకారిణి మేడమ్ కామా. రష్యన్ విప్లవం గురించి తెలుసుకోవటానికి ఆమె చాలా ఉత్సాహం కనబరిచేది. పారిస్‌లో ఉన్న రష్యన్ విప్లవకారిణి పావలొవిచ్ నుంచి చాలా విషయములు తెలుసుకొనేది. "ఆ రోజులలో మేడమ్ కామా మార్క్సిస్టు సాహిత్యం చదివేదని ఆమె చెప్పింది. ఫ్రెంచి సోషలిస్టు పార్టీలో నుంచి బయటకు వచ్చిన తరువాత ఫ్రెంచి కమ్యూనిస్టు పార్టీలో చేరినది లేనిది వివరము లేదు. 1925లో డాక్టర్ భూపేందర్ దత్తా ఇండియా వచ్చేటప్పుడు ఆమె మాట్లాడుతూ భారతదేశంలో కార్మికులను, కర్షకులను సమీకరించాల్సిన ఆవశ్యకతను స్పష్టం చేసింది."

### కామా - రష్యన్ విప్లవం:

ఆమె విప్లవంలో ప్రజలయొక్క పాత్ర గురించి ఆలోచించింది, అర్థం చేసుకొన్నది. పోరాటాలు కొద్దిమంది టెర్రరిస్టు గ్రూపులతో సాధించలేం. ప్రజా ఉద్యమాల, కార్యదక్షతవల్ల విజయం సాధించగలమని చెప్పింది. 1917 రష్యన్ విప్లవం మేడమ్ కామాలో నూతన ఆశలు రేకెత్తించాయి. గాంధీజీ కూడా 1905లో రష్యన్ విప్లవాన్ని ఆఫ్రికానుంచి ప్రశంసించాడు. మేడమ్ కామా మొదటి ఇండియన్ మార్క్సిస్టుగా అంతర్జాతీయ వ్యక్తిగా 1917 అక్టోబరు విప్లవం అర్థం చేసుకున్నది. 1907లోనే ఇండియా సోవియట్ యూనియన్ స్నేహము యొక్క ప్రాధాన్యతను గుర్తించిన

మొదటి వ్యక్తి మేడమ్ కామా. మొదటి ప్రపంచ యుద్ధ కాలములో ఇండియన్ సైనికులను తమ ఆయుధాలను అవతల పారవేయమన్నది. ఫ్రెంచి గవర్నమెంటు మేడమ్ కామాను అరెస్టు చేసినది కాని బ్రిటీష్ వాళ్ళకు అప్పచెప్పలేదు. ఆ సమయములో రష్యన్ స్నేహితులు సహాయపడ్డారు. ఫ్రెంచి సోషలిస్టులు కామాను విడిపించటంలో సహాయపడ్డారు. మేడమ్ కామా రష్యన్ స్నేహితుల, ఫ్రెంచి సోషలిస్టుల సహకారంతో ఫ్రాన్స్‌లో ఉండటానికి అనుమతించారు. ఆమె ఆరోగ్యము బాగా దెబ్బ తిన్నది. బ్రిటీష్ ప్రభుత్వము ఇండియాకు తిరిగి వచ్చేందుకు పలుసార్లు అనుమతించలేదు. చివరకు 1935లో, 74 సంవత్సరాల వయస్సులో అనుమతి పొంది ఇండియా వచ్చింది. పది నెలలు అనారోగ్యముతో ఉండి 12-08-1936న చనిపోయింది. సావర్కారు ఈ సందర్భంగా చెప్పిన మాటలు: "శ్రీమతి కామా ఎవరికి తెలియని పరిస్థితులలో బొంబాయిలో దయాదాక్షిణ్యంలేని, పూర్తిగా ఎవరికి తెలియని విధముగా చనిపోయింది." లెనిన్ ఆమెను మాస్కో రమ్మని ఆహ్వానించినట్లు చాలామంది చెబుతారు. కామా చివరి జీవితంలో కమ్యూనిస్టు అయినట్లు తెలుస్తుంది.

మేడమ్ కామా పారిస్‌లో వందేమాతరం అనే ఇంగ్లీషు వారపత్రిక ప్రారంభించింది. 9 సంవత్సరములు దీనిని నడిపింది. భారతదేశంలో బ్రిటీష్ పరిపాలన ఖండించి వారిని వెదొలమని ఈ పత్రిక ద్వారా ప్రచారం చేసింది. ఆమెకు తాల్వార్ అనే పత్రికతో సంబంధము ఉన్నది. ఈ పత్రిక అభినవ భారత్‌కు చెందినది. మేడమ్ కామా గొప్ప భారతీయ మహిళ. భారతీయులలో చాలా గొప్ప వ్యక్తి. భారతజాతి గర్వపడవలసిన వ్యక్తి. ఆమెను దాదాబాయి, తిలక్, గాంధీజీలతో పోల్చవచ్చును.

మేడమ్ కామా శతజయంతి సందర్భంలో ముంబాయి (బొంబాయి) మున్సిపల్ కార్పొరేషన్ ఘన నివాళి అర్పించింది. ఈ సందర్భంగా ఒక తీర్మానం కూడా చేసింది. భారత స్వాతంత్ర్య సమర చరిత్రలో సువర్ణాక్షరాలతో లిఖించదగిన చారిత్రాత్మక పాత్ర నిర్వహించిన ధీర వనిత మేడమ్ కామా. భారత జాతీయోద్యమ నిర్మాతలలో ఆమె ఒకరు. హిందీ ఉమ్మడి భాషగా స్వతంత్ర, సమైక్య భారత రిపబ్లిక్‌ను వాంఛించిన తొలి భారతీయ మహిళ ఆమె. అంతేకాదు, భారత్‌కు తొలి జాతీయ పతాకాన్ని అందించిన తొలి విప్లవకారిణి మేడమ్ కామా. ఆమె శతజయంతి సంవత్సరం సందర్భంగా నగరంలోని ప్రధాన రహదారికి ఆమె పేరు పెట్టాలి అని ఆ తీర్మానంలో పేర్కొన్నారు. 1962 జనవరి 26 రిపబ్లిక్‌డే రోజున ఆ తీర్మానాన్ని అమలుపరుస్తూ మహారాష్ట్ర సచివాలయం రోడ్డుకు 'మేడమ్ కామా రోడ్డు'గా నామకరణం చేశారు.

భారతీయ మహిళల విప్లవ స్ఫూర్తికి మేడమ్ కామా ఒక ప్రతీక. భారత స్వాతంత్ర్యానికి అనుకూలంగా యూరోపియన్ అభిప్రాయాన్ని మలిచేందుకు, భారతీయ విప్లవకారులకు మద్దతు ఇవ్వడంలోనూ, వారిని ప్రోత్సహించడంలోనూ ఆమె తన సుదీర్ఘ జీవిత కాలాన్ని తనకు తానుగా విదేశాలలో గడిపింది. మన జాతీయ పతాకాన్ని ప్రపంచానికి ఎరుక పరిచేందుకు ఆమె చేసిన మహత్తర కృషి మనం సదా స్మరించాలి. మేడమ్ కామా జీవితం ప్రజలకు, ముఖ్యంగా భారతదేశ యువతకు మార్గదర్శకం కావాలి అని శ్రీమతి ఇందిరాగాంధీ ఒక సందర్భంలో పేర్కొన్నారు.

23-8-1936న హారిన్ ఛటోపాధ్యాయ కైసర్-ఇ-హింద్ పత్రికలో కామాను గురించి వ్రాసిన మాటలు - "భారతీయ మహావ్యక్తి అయిన మహిళ చనిపోయినది. భారతదేశములో కొద్దిమందికి మాత్రము తెలుసు. విదేశాలలో ఇంగ్లాండ్, ఫ్రాన్స్, జర్మనీలలో అందరు విప్లవకారులతోపాటు ఈమెను కూడా ప్రశంసించేవారు. స్వాతంత్ర్య పోరాటంలోనూ, సాంఘిక వ్యవస్థలోనూ మహిళల పాత్ర అమోఘమైందని ఆమె గట్టిగా విశ్వసించారు." ఒకసారి ఈజిప్టులో ఒక సమావేశంలో ఆమె మాట్లాడుతూ "మీటింగ్‌లో మహిళలు ఎక్కడ?" అని ప్రశ్నించారు. అంతేకాదు, "జ్ఞాపకం ఉంచుకోండి. ఉయ్యాలవూపే చేతులే, మనిషి గుణాన్ని కూడా రూపొందిస్తాయి. ఆ సుతిమెత్తని చేతులు జాతీయ జీవనంలో ముఖ్యమైనవి. కనుక శక్తివంతమైన ఆ చేతిని చిన్నచూపు చూడవద్దు" అన్నది కామా.

## జర్నలిస్టుగా:

మేడమ్ కామా ఒకవైపు రాజకీయ ఉద్యమాలలో ఊపిరి సల్పని రీతిలో ఉన్నప్పటికీ, జర్నలిస్టుగా కూడా విశేష కృషి చేసింది. పారిస్‌లో 'వందేమాతరం' అనే ఆంగ్ల పత్రికను నిర్వహించారు. తొమ్మిది సంవత్సరాలు వెలువడిందా పత్రిక. బ్రిటీష్ నిరంకుశ చర్యలను ఎండగట్టింది. దేశాన్ని విడిచిపెట్టి పోవాల్సిందిగా తన అక్షరాయుధాల్ని సంధించింది. అభినవ భారత్ తరపున నడచే 'తల్వార్' పత్రికతో కూడా ఆమెకు సంబంధం వుంది. ఈ పత్రికను వీరేంద్రనాథ్ ఛటోపాధ్యాయ నడిపేవారు. అలానే కృష్ణవర్మ సంపాదకత్వంలోని 'ఇండియన్ సోషలిస్టు' పత్రికలో కూడా ఆమె అనేక వ్యాసాలు ప్రచురించింది.

## మహిళగా, స్నేహితురాలిగా:

మేడమ్ కామా జాతీయోద్యమంలో పాల్గొనడం ఆమె కుటుంబ సభ్యులకు గిట్టలేదు. అందుకే ఆమెను దూరంగా వుంచేందుకు ప్రయత్నించారు. ఎ.కె. సెన్ రాసిన జ్ఞాపకాలలో ఆయన పారిస్‌లో కామాను కలిసినపుడు, కామా తన బంధువులందరి గురించి అడిగింది. ఆయన కామాను 'భారతదేశం ఎందుకు రారు?' అని అడిగారు. అపుడు "బ్రిటీష్‌వారు తనను క్షమాపణలు చెప్పమని, ఎన్నడూ ఇకముందు రాజకీయాలలో పాల్గొనని హామీ ఇవ్వమన్నారు" అని ఆమె, సమాధానం చెప్పింది. "మీకు వృద్ధాప్యం వచ్చింది కనుక, రాజకీయాలలో పనిచేయటం కష్టం కదా?" అని ప్రశ్నించగా ఆమె పట్టుదలతో, కోపంతో చెప్పిన జవాబు: "నేను రాజకీయాలలో పనిచేయటానికి వృద్ధాప్యం అడ్డురాదు. భారతదేశంలో రాజకీయ సమావేశాలలో మాట్లాడటం నాకు చాలా ఇష్టం" అని అన్నారు. కానీ, ఆమె కోరిక నెరవేరలేదు.

ఆమె మాతృప్రేమ కలిగిన మహిళగా, యువ విప్లవ కారులకు సోదరిగా ఉండేది.

ధనవంతుల కుటుంబంలో పుట్టి పెరిగి, ధనాన్ని, హోదాను తృణప్రాయంగా ఎంచి భారతదేశ దాస్య శృంఖలాల విచ్ఛేదనకు తన జీవితాన్ని ఒక సమిధగా నిలిపిన మహత్తర మహిళ, త్యాగమూర్తి. నేటి మహిళలకు, మహిళా ఉద్యమాలకు ఆమె స్ఫూర్తి ఎంతైనా అవసరం.

స్వాతంత్ర్య సమరయోధుడు - మార్క్సిస్టు మేధావి

# కీ.శే. డాక్టర్ కె. బి. కృష్ణ

- కంభంపాటి సత్యనారాయణ (సీనియర్)



[గుంటూరు జిల్లా ఇంటూరులో 1898లో జన్మించి; 1921 నుండీ 1929 వరకు బ్రిటన్‌లోను, 1929 నుండి 1939 వరకు అమెరికాలోను విఖ్యాత విశ్వవిద్యాలయా లలో ఉన్నత విద్యాభ్యాసంచేసి, మార్క్సిస్టు మేధావిగా భారతదేశ చరిత్ర, సంస్కృతి, తత్త్వశాస్త్రాల గురించి అనేక అత్యుత్తమ పరిశోధనలను జరిపి, భారతదేశ స్వాతంత్ర్య పోరాట కాలంలో స్వదేశంలో జైలు శిక్షలు అనుభవించి, రెండవ ప్రపంచ యుద్ధకాలంలో రాయవెల్లూరు జైలులో ఉండగా ఫాసిస్టు వ్యతిరేక ప్రజాయుద్ధ నినాదాన్ని తొలిసారిగా ప్రతిపాదించిన డాక్టర్. కె. బి. కృష్ణ (కాట్రగడ్డ బాలకృష్ణ) జీవితం – పరిశోధనల గురించి ఈ తరం వారు తెలుసుకోవలసిన విషయాలు అనేకం ఉన్నాయి.

డాక్టర్ కె. బి. కృష్ణతో కలిసి ఆ రోజుల్లో జైలు జీవితం గడిపి, ఆ తరువాత వారి గ్రంథాలను వెలుగులోకి తెచ్చిన ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమ ప్రముఖులు, చరిత్రకారులు కీ.శే. కంభంపాటి సత్యనారాయణగారు 1980 డిసెంబరులో మెయిన్ స్ట్రీమ్ పత్రికలో వ్రాసిన వ్యాసాన్ని పాఠకులకు అందిస్తున్నాం. డాక్టర్ కె. బి. కృష్ణ బ్రిటిష్ ప్రభుత్వ నిర్బంధ విధానం క్రింద జైలుశిక్షలు అనుభవించడమేకాక, జైలు నుండి విడుదలైన తరువాత సి.ఐ.డి.ల వేట వలన, సామ్రాజ్యవాద పాలకుల జోక్యంవల్ల ఏ విశ్వవిద్యాలయంలోను ఉద్యోగం దొరకక, అనేక యిబ్బందులు పడ్డారు. 1948 ప్రాంతంలో కమ్యూనిస్టుపార్టీ పైగల ఘోర నిర్బంధకాండల మధ్య అత్యంత క్లిష్ట పరిస్థితుల్లో ఉండగా డాక్టర్ కృష్ణ కడకు జీవనోపాధి కూడా లేకుండా, అత్యంత నిస్సహాయ పరిస్థితుల్లో మరణించారు.

డాక్టర్ కె. బి. కృష్ణ ప్రతిభావంతమైన రెండు పరిశోధన గ్రంథాలను – ఒకటి: భారతదేశంలో రాజరిక వ్యవస్థ – సిద్ధాంతం, రెండు: బౌద్ధ గ్రంథకర్తల రాజకీయ, సాంఘిక భావజాలం – ప్రచురించిన ఘనత విశాలాంధ్ర ప్రచురణాలయానికి, దానిని నిర్వహిస్తున్న కమ్యూనిస్టుపార్టీకే దక్కింది.

డాక్టర్ కె.బి. కృష్ణ మిగిలిన అముద్రిత రచనలు రాష్ట్ర ప్రభుత్వ పురావస్తు భాండారంలో యిప్పుడు భద్రపరచబడి ఉన్నాయి.

భారతదేశంలో భౌతికవాదం అన్న కె. బి. కృష్ణ రచనను ఇటీవలే శ్రీరవిచంద్ గారు ప్రచురించారు.

డాక్టర్ కె. బి. కృష్ణ (కాట్రగడ్డ బాలకృష్ణ) ప్రతిభావంతమైన అధ్యయనవేత్త. సామాజికాభ్యుదయం పట్ల అంకిత భావం కల్గినవాడు; సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా సాహసోపేతంగా పోరాడినవాడు; కార్మిక వర్గ ప్రయోజనాలను ఎలుగెత్తి చాటినవాడు. ఆయన గుంటూరు జిల్లా ఇంటూరులో 1898లో పుట్టారు. 1948 డిశంబరులో నిడుబ్రోలులో కన్నుమూశారు. అయితే, ఆయన జీవితం, ఆయన కృషి ఎవరికీ తెలియకుండా మరుగున పడిపోయింది.

ఆయన స్మృతి చిహ్నంగా 1980 డిశంబరు 20వ తేదీ మెయిన్‌స్ట్రీమ్ పత్రికలో కీ.శే. కంభంపాటి సత్యనారాయణ (సీనియర్)గారు ఒక సుదీర్ఘ వ్యాసం వ్రాశారు. అంతకుముందు ఆయన అముద్రిత గ్రంథాలను సేకరించి, కొన్నింటిని విశాలాంధ్ర ప్రచురణాలయం ద్వారా ప్రచురించి, మిగిలినవాటిని రాష్ట్ర పురాతత్వ శాఖవారి భాండాగారానికి అరువుగా యిచ్చి, అక్కడ భద్రపరిచారు.

1980 డిశంబరు 20వ తేదీ మెయిన్ స్ట్రీమ్‌లో కంభంపాటి సత్యనారాయణగారు వ్రాసిన వ్యాసాన్ని అనుసరించి కె. బి. కృష్ణ అమూల్య పరిశోధనల గురించి, వారి జీవితం గురించి పాఠకులకు ఈ సమాచారాన్ని అందిస్తున్నాం. – సం॥]

"భారతదేశంలో మైనారిటీల సమస్య; కుల, మత ప్రాతినిధ్య సమస్య" అన్న శ్రీ కె. బి. కృష్ణ గ్రంథం మైనారిటీలపై అంతవరకు ప్రచురించబడిన రెండు ఉత్తమ గ్రంథాలలో ఒకటిగా 1950 దశకంలో ఐక్యరాజ్య సమితి సాంస్కృతిక సంస్థవారు ప్రశంసించారు. "భారతదేశంలో రాజరికం సిద్ధాంతాలు" అన్న గ్రంథాన్ని, రామాయణం, మహాభారతం, మనుస్మృతి, ఐతరేయ బ్రాహ్మణం, బంధాయన ధర్మసూత్ర, వశిష్ఠ సంహిత, శతపథ బ్రాహ్మణం, శుక్రనీతి, కాళిదాసుని రఘువంశం, కార్తికేయుని అర్థశాస్త్రం మొదలైన ప్రాచీన సాహిత్యం, మూలాధారాల సహాయంతో కె. బి. కృష్ణ రచించారు. "బౌద్ధ గ్రంథకర్తల రాజకీయ, సాంఘిక యోచనలు" అన్న గ్రంథాన్ని – వజ్రసూచి, సూత్రాలంకార, సుందరానంద కావ్యం, బుద్ధచంద్ర, లలిత విస్తార, ఆర్యసూర వ్రాసిన జాతకమాల, బుద్ధఘోషుని నీతికథలు మొదలైన వాటిని ఆధారం చేసుకొని వ్రాశారు.

## బ్రిటన్, అమెరికాలలో విద్యాభ్యాసం:

1921 నుండి 1929 వరకు కె. బి. కృష్ణ బ్రిటన్‌లో ఆర్థిక, రాజకీయ శాస్త్రాలను అభ్యసించారు. 1929 నుండి 1938 వరకు అమెరికాలోని హార్వర్డు

విశ్వవిద్యాలయంలో విద్యార్థిగా, పరిశోధకుడిగా పైన తెలిపిన మూలాధారాల ప్రాచీన గ్రంథాల అనువాదాలను అధ్యయనం చేయడానికి స్వేచ్ఛగా అవకాశం కల్గింది. ఆయన హార్వర్డు యూనివర్శిటీలో విద్యార్థిగా చేరారు. ఆయన పనిచేసి సంపాదించుకుంటూనే చదువు సాగించారు. తన అభిమాన విషయాలపై అమూలాగ్రమైన అధ్యయనం కొనసాగించారు. అదే సమయంలో ఆర్థిక, సాంఘిక శాస్త్రాల గురించి, తత్త్వశాస్త్రం గురించి పఠించారు. న్యాయశాస్త్రం, పరిపాలనా చట్టాలు, ప్రభుత్వ చట్టాల తులనాత్మక పరిశీలన గురించి కూడ ఆయన అధ్యయనం చేశారు.

సామాజిక అభివృద్ధి గురించి అవగాహన చేసుకోవడానికి మార్క్సిజం ఉత్తమ సాధనమని కె. బి. కృష్ణ కనుగొన్నారు. సామ్రాజ్యాలు, సంస్థలు, సామాజిక విధానాలు ఎలా పుడతాయో, ఎలా పతనమవుతాయో – వాటి పరిణామాలకు మార్క్సిస్టు సూత్రాలను అన్వయించి ఆయన అధ్యయనం చేశారు.

ఈ విధంగా చేసిన అధ్యయనాన్ని ఆధారం చేసుకొని సంపాదించిన అపారమైన విజ్ఞానంతో అనేక అంశాలపై ఆయన పరిశోధనలను సాగించారు. అనేక విలువైన పరిశోధనా పత్రాలను తయారుచేశారు. అందులో హిందూ భౌతికవాదం, బౌద్ధతత్త్వం, ద్రవిడ రాజ్యాంగ వ్యవస్థ, భారత జాతీయత, నానాజాతి సమితి, భారతదేశంలో ఫ్యాక్టరీ చట్టాలు మున్నగునవి ఉన్నాయి.

భారతదేశంలో మైనారిటీల గురించి, హిందూ ముస్లిమ్ సమస్యల గురించి ఆయన అధ్యయనం చేశారు. ఈ పరిశోధనలతోబాటు భారత జాతీయత గురించి, సామ్రాజ్యవాదం గురించి ఆయనచేసిన అధ్యయనం 'భారతదేశంలో కుల మత ప్రాతినిధ్యం' అన్న అంశంపై థీసిస్‌గా రూపొందింది. దానిని ఆయన హార్వర్డు యూనివర్శిటీకి పిహెచ్.డి. కోసం సమర్పించారు. అయినాఈ థీసిస్‌కు కె. బి. కృష్ణ ప్రొఫెసర్ గారి నుండే తీవ్ర ప్రతిఘటన ఎదురైంది. ఇందులో ప్రతి పేజీని ప్రొఫెసర్ రూపర్ట్ ఎమర్సన్ విమర్శించి తీవ్రంగా ఎదుర్కొనడం జరిగింది. ఆ విధంగా ఆయన ప్రతిఘటన తనకు మహోపకారం చేసినట్లు కె. బి. కృష్ణ చెప్పుకొన్నారు. ఎమర్సన్ లేవనెత్తిన ప్రతి ప్రశ్నకు కె. బి. కృష్ణ సమర్థవంతమైన సమాధానాలు యివ్వగల్గారు. దానితో ఆయన పిహెచ్.డి. పరిశోధన ఏకగ్రీవంగా ఆమోదం పొందింది. ఆయన ప్రతిభావంతంగా తన పరిశోధన ఫలితాలను సమర్థించుకొని సంరక్షించుకోగల్గారు. కరడుగట్టిన సామ్రాజ్యవాద అనుకూలుడైన ఆ ప్రొఫెసర్ ఈ థీసిస్ ముందు తలవంచక తప్పలేదు.

ఆ తరువాత తాను అదనంగా సంపాదించిన సమాచారంతో కె. బి. కృష్ణ తన పరిశోధన పత్రాన్ని మరింత సంపద్వంత మొనరించుకుంటూ వచ్చారు. లండన్‌లో ఉన్న ఇండియా ఆఫీసు లైబ్రరీ నుండి, వలస కార్యాలయం లైబ్రరీ నుండి, బ్రిటిష్ మ్యూజియం నుండి; ఇండియా లీగ్, తదితర సంస్థల గ్రంథాలయాలనుండి విలువైన సమాచారాన్ని ఆయన సంపాదించగల్గారు. చివరకు 1939–జనవరిలో ఈ గ్రంథాన్ని "జార్జి ఎలెన్ అండ్ అన్విన్" వారు ప్రచురించారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారతదేశంలో అవలంబించిన "విభజించి పాలించు" దుష్ట రాజనీతి ఈ గ్రంథం అత్యంత శక్తివంతంగా తూర్పారబట్టింది.

## భారతదేశం తిరిగిరాక:

రెండవ ప్రపంచ యుద్ధం (1934 సెప్టెంబరు) ఇక కొద్దిరోజులకు ప్రారంభమవుతుందనగా కె. బి. కృష్ణ భారతదేశం తిరిగి వచ్చారు. ఆయన మద్రాసులో దిగారు. చిదంబరంలో జరిగిన తమిళనాడు ప్రథమ రాష్ట్ర విద్యార్థి మహాసభలో ఆయన పాల్గొన్నారు. దక్షిణాది విద్యార్థి ఉద్యమ నిర్మాణంలో ఆయన ప్రముఖ పాత్ర వహించారు. అనేక విద్యార్థి సభలలో ఆయన మాట్లాడుతూ, బ్రిటిష్ సామ్రాజ్యవాదులు భారత ప్రజలపై బలవంతంగా యుద్ధాన్ని రుద్దారని విమర్శించారు. ఈ ఉపన్యాసాల ఫలితంగానే బ్రిటిష్ ప్రభుత్వం ఆయనను (జైలు) కటకటాలలో పెట్టింది. ఆయన విదేశాలలో ఉండగా అక్కడ ఉండే స్వేచ్ఛను కొంతవరకైనా అనుభవించడానికి అలవాటుపడిన కె. బి. కృష్ణకు భారతదేశంలో బ్రిటిష్ సామ్రాజ్యవాద ప్రభుత్వం అనుసరించే నిర్బంధ విధానం గురించి అంతగా తెలియదు. 1941 తొలి అర్ధభాగంలో ఆయనను భారతదేశ రక్షణ చట్టంక్రింద అరెస్టుచేసి, రాయవెల్లూరు సెంట్రల్ జైలులో డిటెన్యూగా నిర్బంధించారు.

కంభంపాటి సత్యనారాయణ (సీనియర్) కూడా అదే జైలులో ఉన్నారు. ఉమ్మడి మద్రాసు రాష్ట్రంలోని నాల్గు భాషా ప్రాంతాలలోని డిటెన్యూలు సుమారు 200 మంది ఆ సెంట్రల్ జైలులో అప్పుడు వుండేవారు. దాదాపు ఒకటిన్నర సంవత్సరాలు కంభంపాటి, కె. బి. కృష్ణ జైల్లో కలిసి ఉన్నారు. అనేక విషయాలపై ఇరువురూ చర్చలు జరుపుకొనేవారు. సీనియర్ ఆయన ప్రసంగాలు విన్నారు. అనేక సమస్యలపై ఆయనతో సంభాషణలు జరిపేవారు. తనతో సన్నిహితంగా ఉండేవారందరితో కె. బి. కృష్ణ నిర్మొహమాటంగా మాట్లాడే తీరు, నిరాడంబరత, గాఢమైన ఆసక్తి, లోతైన పరిజ్ఞానం, శక్తివంతమైన విశ్లేషణ, నిస్పష్టమైన అభిప్రాయాలు – ఎంతగానో ఆకర్షించాయి.

కారల్ మార్క్స్ వ్రాసిన "పెట్టుబడి" గ్రంథాన్ని జైలులో ఆయన ఒక వినూత్నమైన విధానంలో బోధించేవారు. ఈ విధానంలో ఉపాధ్యాయుడు కూడా విద్యార్థిగా వ్యవహరించేవాడు. డిటెన్యూ విద్యార్థులలో కొంచెం తెలివితేటలున్న వారందరినీ ముగ్గురు ముగ్గురు చొప్పున చిన్నచిన్న గ్రూపులుగా విడదీసేవారు. ఒక్కొక్క అధ్యాయంలోని ఒక్కొక్క విషయాన్ని ఈ గ్రూపు ముందుగా చర్చించేది. అందులో ఏమి చెప్పబడి ఉందో ఒకరి కొకరు అర్థం చెప్పుకొనేవారు. ఆ విధంగా గ్రంథ రచయిత వాదనలు ఏమిటో అవగాహన చేసుకొనేవారు. ఆ తరువాత ఉపాధ్యాయుడైన కె. బి. కృష్ణ కూర్చునేవారు. అర్థంకాని విషయాలు అడిగేవారు. ఆ గ్రూపులో కొంచెం బాగా వివరించగల్గే వానిచే ఆ మరునాడు మొత్తం తరగతిలోని వారందరికీ ఆ విషయం చెప్పించేవారు. ఉపాధ్యాయుడు (కె. బి. కృష్ణ) ఆ విద్యార్థి ప్రక్కనే కూర్చుని అంతా ఆలకించేవారు. ఆ తరువాత మరో గ్రూపులోని ముఖ్యుడు సందేహాలకు, సమాధానాలు యిచ్చేవాడు. మరో గ్రూపులోని ముఖ్యుడు ఆయా విషయాలపై మరింత వివరంగా చెప్పేవాడు. చివరకు ఉపాధ్యాయుడు (కె. బి. కృష్ణ) ఈ విషయాన్ని సాకల్యంగా బోధించేవారు. ఏమైనా పొరపాట్లు ఉంటే చక్కదిద్ది చెప్పేవారు. ఈ విధంగా విద్యార్థుల నుండే అధ్యాపకులను తర్ఫీదు చేయడం జరిగేది.

## సోవియట్‌పై హిట్లర్ దాడి:

రాయవెల్లూరు జైలులో డిటెన్యూలు ఈ విధంగా రాజకీయ పాఠాలు చెప్పడం, నేర్చుకోవడం ముమ్మరంగా జరుగుతున్న సమయంలోనే 1941 జూన్ 21వ తేదీన మాస్కో రేడియో, హిట్లర్ సైన్యాలు 200 మైళ్ల పొడవునా సోవియట్ సరిహద్దులను అతిక్రమించి బ్రహ్మాండమైన దాడి చేశాయని ప్రకటించింది. రెండు రాజ్యాల మధ్య జరిగిన నిర్యుద్ధ ఒడంబడిక నుల్లంఘించి హిట్లర్ ఈ దాడి చేశాడు.

ఫాసిస్టు రాజ్యాలు జర్మనీ, ఇటలీ, జపాన్ మూడింటినీ ఓడించడానికి బ్రిటన్, అమెరికా, చైనా, సోవియట్ యూనియన్‌లు పరస్పర స్నేహ, సహకార ఒడంబడికను చేసుకున్నాయని కూడా మాస్కో రేడియో తెలియజేసింది. ఈ ప్రకటన రావడంతోనే జైలులోని డిటెన్యూలు అందరిలోనూ ఎంతో సంచలనం ఏర్పడింది. అంతవరకు యుద్ధం పట్ల ప్రాతికూల్య వైఖరినే వారు అవలంబిస్తూ ఉండేవారు. ఎందుకంటే ఈ యుద్ధం యొక్క స్వభావం సామ్రాజ్యవాద స్వభావం కనుక. సోవియట్ యూనియన్‌మీద హిట్లర్ దాడి చేసిన తరువాత, మిత్ర రాజ్యాల ఒడంబడిక జరిగిన తరువాత కూడా ఈ యుద్ధ స్వభావం అటువంటిదేనా? ప్రపంచం యొక్క భవిష్యత్ ఏమిటి? భారతదేశంలాంటి వలస, అర్ధ వలస దేశాల భవితవ్యం ఏమిటి? ఫాసిస్టు శక్తులు కనుక గెలుపొందితే ప్రపంచ భవిష్యత్ ఏమిటి? భారత దేశం వంటి అర్ధ వలస దేశం మిత్ర రాజ్యాలవైపు నిలబడి ఫాసిజానికి వ్యతిరేకంగా పోరాడటం సాధ్యమా? ఇందుకు బ్రిటన్ సామ్రాజ్యవాదులు అవరోధాలు కల్పించకుండా ఉంటారా? ఈ యుద్ధంలో మిత్రరాజ్యాలు గెలుపొందితే వలస దేశాలు, అర్ధ వలస దేశాలు స్వేచ్ఛ పొందుతాయని గ్యారంటీ ఏమైనా ఉన్నదా? ఇటువంటి ప్రశ్నలన్నీ జైలులో తలెత్తాయి. పరిస్థితులలో మౌలికమైన మార్పు వచ్చిందని కొంతమంది అభిప్రాయబడ్డారు. భారతదేశానికి సంబంధించినంతవరకు చాలామందికి పరిస్థితులలో ఎటువంటి మార్పు వచ్చినట్లు కనబడలేదు.

## నూతన పరిస్థితిపై కె. బి. కృష్ణ థీసిస్:

ఆ సమయంలో రాజకీయ శిక్షణా తరగతులను కె. బి. కృష్ణ తాత్కాలికంగా నిలుపుచేశారు. ఆయన చాలా గట్టిగా ఆలోచించనారంభించారు. ఒకవారం తరువాత ఎక్సర్‌సైజు పుస్తకం సైజులో 300 పేజీలుగల ఒక థీసీస్‌ను ఆయన వ్రాశారు. మరికొంతమంది మరికొన్ని అధ్యయన పత్రాలను తయారుచేశారు. అందులో విభిన్న దృక్పథాలను వెల్లడించారు. పదిరోజుల తరువాత ఆ ముసాయిదా పత్రాలను చర్చించడానికి మొత్తం డిటెన్యూలందరూ సమావేశం అయ్యారు.

కె. బి. కృష్ణ తన అధ్యయన పత్రంలో సోవియట్‌పై హిట్లర్ దాడిలో అంతర్జాతీయ పరిస్థితులలో గుణాత్మకమైన మార్పు ఎలా సంభవించిందో నిరూపించారు. ప్రపంచ సామ్రాజ్యవాదం రెండు శిబిరాలుగా చీలిపోయింది. ఒక శిబిరం ప్రజాస్వామ్య సోషలిస్టు శిబిరంవైపు వచ్చి చేరింది. మరో శిబిరం ఫాసిజం అనే భయంకరమైన బ్రహ్మరాక్షసి స్వరూపం ధరించింది. ఈ యుద్ధం ఇక ఎంత మాత్రం సామ్రాజ్యవాద యుద్ధం కాదు. ఇది ఫాసిస్టు వ్యతిరేక యుద్ధంగా మార్పు చెందింది. ఫాసిజాన్ని

ఓడించి ప్రజాస్వామ్యాన్ని, సోషలిజాన్ని సాధించవలసిన కర్తవ్యం వైపునే కార్మికవర్గ ప్రయోజనాలు ఉన్నాయి. భారతదేశంలో కార్మికవర్గ అగ్రగామి, యావత్తు ప్రపంచ కార్మికవర్గ ప్రయోజనాల వైపున, కర్తవ్యం వైపున నిలబడి తన యొక్క వ్యూహాన్ని రచించుకోవాలి. అనగా, ఫాసిజాన్ని ఓడించే వ్యూహాన్ని ఏర్పరచుకోవాలి. అని డాక్టర్ కృష్ణ తెలిపారు. ఆయన తన సిద్ధాంత పత్రంలో అన్ని పారిభాషిక వ్యాకదంపుడు పదాలను వదిలివేసి ఆ దశలో స్పష్టంగా కర్తవ్యాలను రూపొందించారు. దాదాపు రెండు దశబ్దాల పాటు విదేశాలలో ఉంటూ భారత రాజకీయ రంగానికి దూరంగా ఉన్న ఒక పరిశోధకుడు ఆ విధంగా అంతర్జాతీయ పరిస్థితులలో వచ్చిన మార్పులకు గతి తార్కిక సూత్రాలను అన్వయించగలగడం చాలా గొప్ప విషయం. కేవలం పదిరోజులలో అటువంటి సిద్ధాంత పత్రాన్ని ఆయన అలా తయారుచేయగలగడం చాలా గొప్ప విశేషం.

కానీ జైలులోని మెజారిటీ డిటెన్యూలు కె. బి. కృష్ణ సిద్ధాంత పత్రాన్ని అంగీకరించలేదు. వారాల తరబడి జైలులో చర్చలు కొనసాగాయి. ఆ చర్చలలో చాలా తీవ్రమైన విభేదాలు, పరస్పర వైషమ్యాలు కూడా తలెత్తాయి. కె. బి. కృష్ణ చాలా సున్నిత మనస్కులు. ఆ రాజకీయ వైషమ్య వాతావరణానికి ఆయన గందరగోళంలో పడ్డారు. తాను ఒంటరివాడి నయిపోయినట్లు భావించుకున్నారు. భారత కమ్యూనిస్టుపార్టీ అధికారయుతంగా ఆ (ఫాసిస్టు వ్యతిరేక ప్రజాయుద్ధ) విధానాన్ని ప్రకటించిన తదుపరి ఆ సమాచారం జైలులోకి వచ్చే సమయానికి కె. బి. కృష్ణ మరో జైలుకి బదిలీ చేయబడ్డారు.

ఫాసిస్టు విజృంభణ అత్యంత ప్రమాదకర స్థాయిలో ఉన్నప్పుడు డా. కె. బి. కృష్ణ జైలునుంచి విడుదల అయ్యారు. కానీ ఆయన తన్ను తాను పోషించుకోవడానికి కనీస వనరులు కూడా లేకపోవడంతో చాలా నిరాశ నిస్పృహలకు లోనయ్యారు.

భారతదేశంలో ఉద్యోగపరిస్థితులు చాలా భిన్నంగా ఉన్నాయి. భౌతిక అవసరాలు కూడా సమకూరడం చాలా కష్టంగా తయారయింది. ఆయన తనకు అనుగుణ్యమైన ఉద్యోగం కోసం అన్వేషించడం ప్రారంభించారు. కొంతకాలం బెల్గాం యూనివర్సిటీలో ప్రొఫెసర్‌గా పనిచేశారు. కానీ అధికారులతో వచ్చిన విభేదాల కారణంగా ఆ పదవికి రాజీనామా చేశారు. కొలంబో యూనివర్శిటీలో ప్రొఫెసర్‌గా చేరటానికి ఆయన శ్రీలంక వెళ్ళారు. కానీ బ్రిటిష్ అధికారులు జోక్యం చేసుకోవడంవల్ల ఆయనకు అక్కడ ఉద్యోగం రాలేదు. చివరకు అఖిల భారత ఉత్పత్తిదారుల సంఘం అధ్వర్యాన "రెండవ ప్రపంచ యుద్ధకాలంలో భారతదేశ పారిశ్రామికీకరణ" అనే అంశంపై పరిశోధన చేయటానికి ఆయన బాధ్యత స్వీకరించారు. కానీ ఆయన తయారుచేసిన పరిశోధన పత్రం "మరీ ఎక్కువ!" ఆ పరిశోధనను వారు అంగీకరించలేదు. దానితో వారా ఉద్యోగానికి స్వస్తి చెప్పవలసి వచ్చింది.

ఆయనకు ఒకే ఒక్క స్నేహితుడు శ్రీ దర్శి చెంచయ్య మదరాసులో ఉండేవారు. చెంచయ్యగారు గదర్ పార్టీ విప్లవ యోధుడు. భారతదేశపు జైళ్ళలో ఆరు సంవత్సరాలపాటు శిక్షను [మొదటి ప్రపంచ యుద్ధానంతరం] అనుభవించినవాడు ఆయన. ఆయన భార్య శ్రీమతి సుభద్రమ్మ. ఆ దంపతులు డా. కె. బి.

కృష్ణకు ఆశ్రయం యిచ్చి, ఎంతో ఆదరాభిమానాలతో చూసుకునేవారు. ఆయన నిరాశా నిస్పృహలను పోగొట్టడానికి ఎంతో కృషి చేశారు. కానీ జీవితంలో పొందిన ఆశాభంగం ఆయనను చాలా కృంగదీసింది. ఎవరూ ఆయనకు సంతుష్టి కల్గించలేకపోయారు. అనేక వారాలు ఆయన కేవలం 'టీ' త్రాగి కాలం గడిపారు. చివరకు ఆయన 1948 డిశంబరులో మృతిచెందారు.

## మైనారిటీల సమస్య:

"మైనారిటీల సమస్య – లేదా కుల, మత ప్రాతినిధ్యం" అన్న అంశంపై డా. కె. బి. కృష్ణ పుస్తకం ఆయన డాక్టరేట్‌కు సమర్పించిన థీసిస్ ప్రాతిపదికగా వ్రాసిన పుస్తకం. దాని ఇతివృత్తం ఈ విధంగా ఉంది: [ఆయన మాటలలోనే] "భారతదేశం బ్రిటిష్ సామ్రాజ్యవాదుల క్రింద ఒక వలస దేశంగా ఉంది. ఈ దేశంలో హిందువులకు, ముస్లింలకు, అలాగే సిక్కులకు, క్రైస్తవులకు ఎవరికీ పౌర హక్కులనేవి లేవు. వారు తమ దేశంలోనే తాము బానిసలుగా జీవిస్తున్నారు. బ్రిటిష్ సామ్రాజ్యవాదులు తమ ప్రయోజనాలను సాధించుకోవడం కోసం 'మైనారిటీలు' అనే పదాన్ని సృష్టించారు. అంతేకాక, వెనుబడిన వృత్తులవారిని కూడా కొంతమందిని ఈ మైనారిటీల వర్గంలో చేర్చారు. దేశీయులనే, దేశీయులకు వ్యతిరేకంగా త్రిప్పడానికి దీనిని ఒక సాధనంగా వాడుకొన్నారు. ఈ మైనారిటీలు తమకు అవిధేయులుగా ఉండకూడదు. విద్రోహకర ధోరణులు ప్రదర్శించ కూడదు. వారు మితవాదులుగా ఉండాలి. కాదు కాదు – అభివృద్ధి నిరోధకంగా కూడా ఉండాలి. వారు తమ రక్షణల కోసం బ్రిటీష్ ప్రభుత్వానికి సాష్టాంగ దండప్రణామం చేయాలి. వారు అమాంతంగా పైకి వెళ్ళిపోవడానికి సులభమార్గాలు కోరతారు. దీని అర్థం ఏమిటంటే – మైనారిటీ మతస్థులుగా ఉన్న వృత్తులలోని వారు లేదా కులాలలోవారు ప్రభుత్వాధికారంలో తమకు భాగం ఉండాలని కోరతారన్నమాట. మెజారిటీ ప్రజల వలన తమకు ఏవో బాధలు, ఇబ్బందులు కలుగుతున్నాయని చెప్పడం కేవలం మిథ్య. ఇటువంటి మిథ్యా విషయాలు ఎవరికి అవసరమో వారే వీటిని లేవదీస్తారు. హిందూ ముస్లింల మధ్య సంఘర్షణలు, అలాగే సవర్ణ హిందువులకు, దళితులకు మధ్య ఘర్షణలు – వీటికి కారణం ఈ దేశంలోని సామాజిక ఆర్థిక వ్యవస్థల వలన కలుగుతున్నాయి తప్ప మతరీత్యా కాదు. అందువలన మతరీత్యా, ప్రజాప్రాతినిధ్య సభలలో ఎన్నికలనేవి రద్దుచేయాలి.

ఇక కులాల ప్రాతినిధ్య సమస్యకు సంబంధించిన చరిత్ర ఎటువంటిది అంటే, అది వివిధ కులాల మధ్య జరుగుతున్న సంఘర్షణల చరిత్రే. ఇక కులాలు – బ్రిటిష్ ప్రభుత్వం విషయానికి వస్తే, అది కులాల ప్రాతిపదికమీద బ్రిటిష్ ప్రభుత్వం అన్వయిస్తూ వచ్చిన రాయితీల చరిత్ర; తమ పరిపాలనను, ఆధిపత్యాన్ని మరింత బలపరచుకునే చరిత్ర; విభజించి పాలించే నీతిని మరింతగా అమలుపరచే చరిత్ర; కుల, మత ప్రాతిపదికపై ఉద్యోగాలు ఇవ్వాలనీ, వేతనాలు పెంచాలనీ పరోక్షంగా ప్రాధేయపడటానికి ఉద్దేశించబడినదే. దీనికంతకూ పరిష్కార మార్గం ఏమంటే – భారతదేశానికి స్వాతంత్ర్యం కావాలని కోరడమే – కుల, మత ప్రాతిపదికపై ప్రజా

ప్రాతినిధ్య విధానాన్ని రద్దుచేయాలన్న కోర్కె, దేశానికి స్వాతంత్ర్యం కావాలన్న కోర్కె విడదీయటానికి వీలులేని విషయాలు. అయితే, స్వాతంత్ర్యం అన్నది ఒకరిచ్చే బహుమతి కాదు. అది పోరాడి సంపాదించుకోవాల్సిన విషయం. బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా జాతీయైక్య సంఘటన నిర్మించుకోవడం ద్వారా సాధించవలసిన విషయం."

డా. కె. బి. కృష్ణ కుల, మత ప్రాతిపదికపై ప్రజా ప్రాతినిధ్యం కూడదు అన్న తన వాదనను సమర్థించుకోడానికిగాను బ్రిటిష్ వైస్రాయి, స్టేట్ సెక్రటరీల ప్రకటనలనుండి; వెనుకబడిన కులాల, మతాల నాయకుల ప్రకటనల నుండి ఎన్నో అంశాలను సవిస్తరంగా ఉదాహరించారు. అలాగే భారత జాతీయ కాంగ్రెస్, భారత కమ్యూనిస్టుపార్టీ మొదలైన సామ్రాజ్యవాద వ్యతిరేక పార్టీల ప్రకటనలనుండి కూడా ఉదాహరించారు. ఈ విషయంలో కమ్యూనిస్టుపార్టీ అభిప్రాయాలను కె. బి. కృష్ణ ఇలా ఉదాహరించారు: "కమ్యూనిస్టులు – సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయైక్య సంఘటనకోసం పాటుపడుతున్న వారిలో ప్రప్రథములు. సామ్రాజ్యవాద వ్యతిరేక జాతీయ పోరాటంలో వారు విడివిడి వేర్పాటువాదులుగా ఎంతమాత్రం లేరు. ఈ విషయంలో జాతీయ కాంగ్రెస్ ఇదివరకే పెంపొందిస్తున్న జాతీయైక్యతను కమ్యూనిస్టులు సామ్రాజ్యవాద జాతీయైక్య సంఘటనగా పరివర్తన చేస్తున్నారు."

## బౌద్ధ గ్రంథకర్తల రచనలు:

"బౌద్ధ గ్రంథకర్తల సామాజిక రాజకీయ యోచనలు" – అన్న కె. బి. కృష్ణ గ్రంథాన్ని ఆయన మరణానంతరం 1960లో విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడవారు ప్రచురించారు. బౌద్ధ గ్రంథాల గురించి అనేక ఉదాహరణలు యిస్తూ, "మానవ తాదర్శాలతో కూడిన వ్యవస్థగా రాజరిక వ్యవస్థ భావనను బౌద్ధమతం సంస్కరించి, తీర్చిదిద్దిం"దని కె. బి. కృష్ణ నిర్ధారణకు వచ్చారు. "రాజు దైవాంశ సంభూతుడనే భావాన్ని బౌద్ధం కొట్టిపారేసింది. పురోహిత వర్గాల దుష్ట ప్రభావాన్ని త్రోసివేసి, రాజకీయాధికారానికి మూలం ప్రజలే అన్న భావాన్ని ప్రవేశపెట్టింది. రాజరిక విధానం అన్నది ఉద్యోగ ధర్మం మాత్రమేనని స్పష్టం చేసింది. యజ్ఞ యాగాదుల ద్వారా జరిపే హింసను, బలులను ఖండించింది. సమానత్వ భావాన్ని ప్రబోధించింది. సమానత్వ ప్రాతిపదిక దృష్ట్యా కుల వ్యవస్థను ఖండించింది" అని తెలిపారు.

అదే విధంగా "భారతదేశంలో రాజరిక విధానం గురించిన సిద్ధాంతాలు" అన్న డా॥ కె. బి. కృష్ణ గ్రంథాన్ని కూడా విశాలాంధ్ర ప్రచురణాలయమే 1960లో ప్రచురించింది.

రాజు దైవాంశ సంభూతుడనే భావం; రాజే దైవం; భగవంతుడు ఎటువంటి సర్వాధిపతియో రాజు అటువంటి సర్వాధిపతి అనే మితిమీరిన రాజరిక దైవత్వ భావం భారతదేశంలో ఎప్పుడూ లేదని చెప్పడానికి డాక్టర్ కె. బి. కృష్ణ భారత దేశ ప్రాచీన సాహిత్యం నుండి అనేక ఉదాహరణలను యిచ్చారు. హిందూ మత గ్రంథాలు ఉల్లేఖించిన విషయం ఏమంటే – రాజరిక వ్యవస్థ దైవనిర్మితం అని మాత్రమే. అంతే తప్ప, పశ్చిమ దేశాలలో వలే రాజు దైవాంశ సంభూతుడు అన్న

నిర్ధారిత తర్కానికి తావీయలేదు – అని కె. ఓ. కృష్ణ తన గ్రంథంలో వివరించారు.

## ద్రవిడ సాహిత్యంలో రాజకీయ భావజాలం:

"ద్రవిడ సాహిత్యంలో రాజకీయ భావజాలం" అన్న కె. ఓ. కృష్ణ గ్రంథాన్ని, యితర అనేక పత్రాలను "అరువు" ప్రాతిపదికపై శ్రీ కంభంపాటి సత్యనారాయణ హైదరాబాద్‌లోని రాష్ట్ర ప్రభుత్వ పురాతత్వ భాండాగారానికి యిచ్చారు. క్రైస్తవ మతం తమిళనాడులో ప్రవేశించిన తొలిదశలోని తమిళ ప్రాచీన గ్రంథాల నుండి, మధ్యయుగంనాటి తొలి దశలోని తెలుగు, కన్నడ, మలయాళ సాహిత్యాల నుండి అనేక అంశాలను సేకరించి కె. ఓ. కృష్ణ ఆ గ్రంథంగా సంకలనం చేశారు. అందులో ఎక్కువ పేజీలు తమిళ ప్రాచీన సాహిత్యానికి సంబంధించినవే. తిరువళ్ళువార్ రచించిన కురళ్, ఆయనకాలంనాటి రాజకీయ ఆర్థిక, నైతిక విషయాలు అధ్యయన గ్రంథం. ఆయన యావత్తు మానవ జాతిని ఉద్దేశించి తన రచనలో ప్రబోధాన్ని చేశాడు. అంతేతప్ప కులం, వర్గం, మతం అన్న దృష్టిని పెట్టుకోలేదు. ఆయన రచనలలో రాజు దైవాంశ సంభూతుడు అన్న భావాన్ని ఎక్కడా పేర్కొనలేదు. రాజరిక వ్యవస్థ ఎలా ఆవిర్భవించింది అన్న విషయం కూడా లేదు. రాజకీయాలలో నైతిక విలువలు, అహింసా విధానాలకు ఆయన ప్రాధాన్యత యిచ్చారు. జూదం, త్రాగుడు, నైతిక భ్రష్టత్వం మున్నగు వాటికి ఆదర్శ రాజరిక వ్యవస్థలో ఎంతమాత్రం చోటు లేదని తిరువళ్ళువార్ స్పష్టం చేశాడు. రాజులు, మంత్రులు, రాయబారులు, గూఢచారులు మున్నగువారి విధులు ఏమిటో ఆయన స్పష్టంగా పేర్కొన్నారు. ఇలాంగో రచించిన శిలప్పధికారం అన్న గ్రంథంలో అయిదు శాసన సభలు, ఒక పురోహిత శ్రేష్ఠుడు, మంత్రులు ఉండే పరిమిత రాజరికాన్ని ఇలాంగో సూచించాడు. "పరిపాలకులకు ఉత్తమాదర్శాలు ఉండాలి. ఔదార్యం అనేది ప్రధానంగా ఉండాలి. దానికి ఉన్నత స్థానం యివ్వాలి. అయిదు విభిన్న వృత్తుల సమాహారంగా సమాజం అన్నది ఉండాలి" అని ఇలాంగో చిత్రించాడు. మణిమేఖలై అన్న మరో ప్రాచీన తమిళ కావ్యం గురించి కె. బి. కృష్ణ అభివర్ణించుతూ – అందులో బౌద్ధ ధర్మం పాటించే చక్రవర్తి ఎటువంటి ఆదర్శాలను అనుసరించాలో చెప్పారని అన్నారు. అందులో కుల వ్యవస్థకు తావుండరాదు, సమానత్వ భావం అమలు జరపాలి అని ఆ కావ్యం చెబుతుంది.

చింతామణి, శైవ మతాధిపతులు, ప్రార్థన శ్లోకాలు మొదలైనవాటి గురించి కూడా డాక్టర్ కృష్ణ పేర్కొన్నారు.

కృష్ణదేవరాయలు రచించిన ఆముక్త మాల్యద; ప్రతాపరుద్రుడు రచించిన నీతిశాస్త్రం; యాజ్ఞవల్క్య విరచిత మితాక్షర; బద్దన రచించిన నీతి ముక్తావళి; ఫణి భట్ట రచించిన "రసాయన" మొదలగు ప్రాచీన తెలుగు గ్రంథాలను కె. బి. కృష్ణ పరిశీలించారు.

## భారతీయ భౌతికవాదం:

"హిందూ (భారతీయ) భౌతిక వాదం గురించిన అధ్యయనం" అన్నది మరొక అముద్రిత గ్రంథం. ఇదికూడ ఆంధ్రప్రదేశ్ పురావస్తు భాండాగారంలో భద్రపరచబడి ఉంది. బృహస్పతి, చార్వాకుల కాలం నుండి వేమన వరకు భారతదేశంలో

భౌతిక వాదుల చరిత్ర గురించి డాక్టర్ కృష్ణ అందులో పరిశీలించారు. బృహస్పతి, చార్వాకుల (క్రీ.పూ. 1200-200 సం॥) గురించి మూలాధార సమాచారాన్ని ఎనిమిది తరహాలుగా డాక్టర్ కృష్ణ విభజించారు. ఇందులో మొదటి భాగంలో లోకాయత గురించి పరోక్షంగా ప్రస్తావించే పాఠ్యాలు ఋగ్వేదం, ఐతరేయ బ్రాహ్మణం, ఐతరేయ అరణ్యక, తైత్తరీయ బ్రాహ్మణ, యాస్క నిరుక్త, ఉపనిషత్తులు, పురాణాలు, మహాభారతం, రామాయణం, మనుస్మృతి గురించి ఉన్నాయి.

రెండవ భాగంలో బౌద్ధ పాఠ్యాలు, బౌద్ధ సూత్రాలు, ధర్మపథ సూత్ర నిపాత; సర్యుక్తనికాయ; అంగుత్తనికాయ, మళింత పన్హా, సుధర్మ లంకావతార సూత్ర, అభిధర్మత్తసంఘ, కాడవత్తు, పతిమోక్క, మాగావగ్గ, చుల్లావగ్గ మొదలైనవి ఉన్నాయి. మూడవ భాగంలో నంది సూత్ర, అన్యయోగాద్వరణి సూత్ర, జైన సూత్ర మొదలైన జైన పాఠ్యాలు ఉన్నాయి. నాల్గవ భాగంలో లోకాయత గురించి పరోక్షంగా ప్రస్తావించిన ప్రతికూల రచయితల గ్రంథాల గురించీ – అనుగీత; అశ్వఘోష, భాస, భాస్కరాచార్య, బ్రహ్మసూత్ర, హర్షుని రచనలు, కౌటిల్య, కృష్ణమిశ్ర, మాధవాచార్యుని సర్వదర్శన సంగ్రహం, పాణిని, పతంజలి, శంకర, వాత్స్యాయన, వాచస్పతి, మిశ్ర మొదలైనవి వున్నాయి. అయిదవ భాగంలో ముఖ్యమైన వ్యాసాలు, రచనలు పదహారు వరకు ఉన్నాయి. అవన్నీ భౌతిక వాదానికి సంబంధించినవి. ఆరవ విభాగంలో 25 పుస్తకాలున్నాయి. ఇవి భౌతిక వాదాన్ని పరోక్షంగా ప్రస్తావిస్తాయి. 7వ విభాగంలో రకరకాల పుస్తకాలు మూడు ఉన్నాయి. ఆఖరి విభాగంలో పండిత సంఘాలకు చెందిన 9 పత్రికలున్నాయి.

లోకాయత గురించిన ప్రాథమిక స్వభావం గురించి డా॥ కె. బి. కృష్ణ వివరిస్తూ "ప్రపంచాన్ని పదార్థము, పరిణామమూ కల్గిన ఒక నిర్దిష్ట వాస్తవిక ప్రపంచంగా గాక, కేవలం ఇంద్రియ జ్ఞానానికి సంబంధించిన ప్రపంచంగా వీరు అభివర్ణించడం జరిగిం"దని తెలియజేశారు. ఇంద్రియ గోచరమైనది అనగా ప్రత్యక్షంగా కళ్ళకు కనబడేది ఏదో అదే జ్ఞాన సంపాదనకు మూలమని లోకాయతులు గట్టిగా చెబుతారు.

"భూమి, గాలి, నీరు, నిప్పు" ఈ నాలుగు భౌతికములే – స్వయంభూత సూత్రాలు కల్గినవి; ఈ నాల్గింటి కలయికలు, విభజనలే అనంతమైన భౌతిక స్వరూపాలుగా, ఆకారాలుగా మారుతుంటాయి అని లోకాయతులు చెబుతారు తప్ప పంచభూతాలు గురించిన పరిజ్ఞానాన్ని వారు విశ్లేషణ చేయలేదు, తెలియజేయలేదు.

"జ్ఞాన సంపాదనకు మూలాధారం యాంత్రీకృతమైన వూహా, అవగాహనలే ప్రాతిపదిక" అన్న వాదాన్ని వ్యతిరేకించిన లోకాయతులు – సరిగ్గా అదే రకమైన యాంత్రీకృతమైన హేతువాదానికి ఎలా దిగబడ్డారన్నది ఆశ్చర్యకరం. నాలుగు భూతాలు (నీరు, గాలి, నిప్పు, భూమి) కలయికవలనే ప్రాణం ఏర్పడిందని (అందులో మేధస్సు, అంతస్సు కూడా ఉన్నాయని) వారు చేసిన విశ్లేషణ కూడా విచిత్రమే. సోదర ప్రజలను మోసం చేయడానికి వ్యక్తులు కనిపెట్టినదే "మతం" అని ఖండించటం ద్వారా లోకాయతులు – తమ కాలంలో ప్రచారంలో ఉన్న భావనలను మించి ముందుకు వెళ్ళలేకపోయారు. వేద ప్రమాణాన్ని వారు అంగీకరించలేదు. నిరసించారు కాని, తమ అభిప్రాయాలను సమర్థించుకోడానికి ఉపనిషత్తుల నుండి అనేక వాదనలను ఉదాహరించారు. అస్తిత్వానికి మూలం "చెడుదుర్బుద్ధి" అన్న

బుద్ధుని బోధనతో వారు ఏకీభవించలేదు. బాధలతో కలగలిసి ఉన్నప్పటికీ, జీవితం అన్నది ఆనందంగా అనుభవించదగిందేనని వారు అభిప్రాయపడ్డారు. "బౌద్ధం అన్నది పాత సీసాలలో పోసిన కొత్త సారామే అయిన విధంగా లోకాయత కూడా పాత సీసాలలో పోసిన కొత్త సారామే" అని డాక్టర్ కె. బి. కృష్ణ వ్యాఖ్యానించారు. "భారతదేశం సహజంగా కన్న శిశువు – లోకాయత" అనీ, అది భారతదేశం చట్రంలోనే పోతపోయబడిందనీ, భారతదేశ పరస్పర విరుద్ధ జీవన స్రవంతులలో భాగమేనని డాక్టర్ కృష్ణ వ్యాఖ్యానించారు.

కపిలుని సాంఖ్యయోగం (క్రీస్తు పూర్వం 700–600) గురించి డాక్టర్ కృష్ణ వ్యాఖ్యానిస్తూ, "కపిలునికి కొన్ని ఛాందస అభిప్రాయాలు ఉన్నప్పటికీ ఆయన ఒక ప్రజాస్వామ్యవాది" అని అన్నారు. కులంతో నిమిత్తం లేకుండా ప్రజలందరూ విముక్తి పొందగల శక్తి గలవారే... డెస్కార్టెస్ వలెనే తనకు ముందున్న ఏ విషయం గురించీ ఏ ప్రమాణాన్ని తాను అంగీకరించనని కపిలుడు అన్నాడు. తన దృఢాభిప్రాయానికి, తన హేతువాద దృష్టికి అంగీకార యోగ్యమైన దానినే తాను విశ్వసిస్తానని ఆయన ప్రకటించాడు. జ్ఞానం వలన తప్పితే మత కర్మకాండల ద్వారా ఆత్మ పుణ్యప్రాప్తి పొందదన్నది కపిలుని తాత్విక చింతనలో ప్రధానాంశం.

ఉపనిషత్కాలం తరువాత (క్రీస్తుపూర్వం 1000–600 సం॥) ఉద్భవించిన అయిదుగురు భౌతికవాదులు అజితకేశ కాంబ్లిన్, పాకుత్త కాచాయన, సంజయ బేలాతపుత్ర; పురాణకశ్యప, మక్కాలి గోసాల్ మొదలైనవారు లోకాయతుల వలె ప్రత్యక్ష భౌతికవాదులు కారని డాక్టర్ కృష్ణ అభిప్రాయపడ్డారు. అయినప్పటికీ వీరు మరణానంతర జీవితం, శ్రాద్ధకర్మలు మొదలైనవాటిని అంగీకరించలేదు. ఈ నమ్మకాలను వారు ఖండించారు. "సంజయ బేలాతపుత్ర" – డాక్టర్ కె. బి. కృష్ణ దృష్టిలో భారతీయ గతితార్కిక వాదానికి పితృ సమానుడు. మక్కాలి గోసాల్ ఈ ప్రపంచం ఒక హేతువాద దృష్టితో, ఒక ప్రయోజన పూర్వక క్రమబద్ధతతో నడుస్తోందని భావించాడు. "ఈ విశ్వ వ్యవస్థలో ప్రతీదానికి దాని స్థానం దానికి వుంది. దానికి ఉద్దేశించబడిన విధ్యుక్త ధర్మం దానికి వుంది. మొత్తం విశ్వశ్రేయస్సుకు అది ఉపకరిస్తుంది" అని ఆయన అభిప్రాయపడ్డాడు.

### భగవద్గీతలో భౌతికవాద భావాలు:

భగవద్గీతలో కూడా భౌతికవాద భావాలున్నాయని డాక్టర్ కృష్ణ కనుగొన్నారు. భగవద్గీతాచార్యుడు శ్రీకృష్ణుడు జ్ఞానయోగంతోపాటు కర్మయోగాన్ని కూడా నొక్కిచెప్పాడు. సిద్ధాంతాన్ని ఆచరణను జోడించి ప్రబోధించాడు. ఇచ్ఛాపూర్వక సంకల్పం యొక్క పాత్రను శ్రీకృష్ణుడు త్రోసిపుచ్చలేదు. ఈ యిచ్ఛాపూర్వక సంకల్పం కూడా ప్రకృతి వల్లనే నిర్ణయించబడుతుంది. ప్రకృతి అన్నది ప్రతీ వ్యక్తిలో స్వయం నిర్ణయమయ్యేది. ప్రకృతి, పురుషుడు కూడా స్వయం నిర్ణయమైనవే. ఈ నిర్ణాయకతలో సైతం పురుషునికి క్రియాస్వేచ్ఛ ఉంది.

క్రియాశీలతలో చైతన్యం అన్నది సాగినప్పుడు ప్రకృతి యొక్క పనిముట్టుగా ఉంటుంది. ఈ భావాన్ని శ్రీకృష్ణుడు ప్రబోధించినప్పుడు కర్మ పరిపాక సిద్ధాంతాన్ని

కొట్టిపారవేయడం జరిగింది. ఆయన వేదాలను మృదువుగా మందలించి నిరసించాడు. (ఈ మిథ్యా – క్షణభంగుర ప్రపంచానికి వేదాలు యిచ్చే సందేశం ఏమీలేదు) యుక్తిలేని మూర్ఖులు వల్లించేవి పదాడంబర పదాలని, వేదాల తరువాత ఏమీ చూడనొల్లనివారని కృష్ణుడు యీసడించడు. శ్రీకృష్ణుడు గీతలో ఎక్కడా జన్మతః కులం ప్రసక్తి తేలేదు. ప్రకృతి రీత్యా ఏర్పడినదే కులం అని ఆయన వాక్రుచ్చాడు. ప్రతీ పురుషునికి అతని ప్రకృతి అతనికి ఉంటుంది. వీటిని ఉల్లంఘించడం పనిలేని పని.

కృష్ణమిశ్ర 10 వ శతాబ్దంలో వ్రాసిన రూపకాలంకార నాటకం "ప్రబోధ చంద్రోదయ"లోని భౌతికవాద భావాలు గురించి డాక్టర్ కె. బి. కృష్ణ పరిశీలించారు. అందులోని పాత్రలు చార్వాక, బౌద్ధ, జైన, తదితర వ్యక్తులను పోలిన పాత్రలు. ఆ నాటకంలో పాత్రధారుల గుణగణాలు, వివేకము, సౌశీల్యము, వారి మానసిక వాంఛలు మున్నగువాటిని పరిశీలించారు. ఇతర తాత్విక చింతనలకు వ్యతిరేకంగా అద్వైత సిద్ధాంతాన్ని సమర్థించడానికి ఆ నాటకం ఉద్దేశించబడింది. ఆ నాటకంలోని సంభాషణల ద్వారా వ్యక్తమైన భావాలు, ఛాందసవాద తాత్విక భావాలు కల్గిన వారు తమ ప్రతిపక్షుల భావాల గురించి పునరాలోచించేటట్లు చేయగల్గాయి. కొన్ని సందర్భాలలో ఆ నాటకంలోని భావాలు బౌద్ధమతం, జైనమతాలలో ఏవిధంగా చొప్పించబడ్డాయో, అదేవిధంగా తదుపరి హిందూమత భావనలలో కూడా చొప్పించబడినాయి.

చివరకు వేమన గురించి డాక్టర్ కె. బి. కృష్ణ పరిశోధన సాగించారు. వేమన భౌతికవాది కాకపోయినా సమకాలీన సమాజంలోని చెడుగుణాలన్నింటిని ప్రయోజనకరమైన రీతిలో ఆయన బహిర్గతం చేశాడు. బౌద్ధులు ఏవిధంగా అయితే విగ్రహంగాను, మర్యాదపూర్వకంగాను తమ నిరసనను తెలియజేశారో, అదే విధంగా వేమన నాటి సమాజంలోని దుర్వర్తనల పట్ల తన నిరసనను ప్రకటించాడు. ఆయన దేవుని, ఆత్మను కాదనలేదు. ఆయన త్రోసిపుచ్చినది ఏమంటే – భజనలు, పూజలు, పురస్కారాలు, బాహ్యాడంబరాలు, యాత్రలు, విగ్రహారాధన, బ్రాహ్మణ పురోహిత వర్గాలు చేసే కర్మకాండలు, బలులు మొదలైన వాటిని మాత్రమే. అంతవరకు ఎవరూ ఖండించనంత తీవ్రంగా, నిశితంగా కుల వ్యవస్థను ఆయన ఖండించాడు. ఆయన ఎక్కువగా సంఘ సంస్కర్త అని చెప్పవచ్చు.

## నానాజాతి సమితిలో భారతదేశ పాత్ర:

"భారతదేశం – నానాజాతి సమితి" అన్న గ్రంథంలో, నానాజాతి సమితిలో భారతదేశ పాత్ర గురించి డాక్టర్ కృష్ణ సవిస్తరంగా చేసిన అధ్యయనం ఉన్నది.

అనేక సభ్యదేశాల ఆర్థికాభివృద్ధి, కార్మికుల పరిస్థితులపై చట్టాలు రూపొందించడం, నిరాయుధీకరణ, అంతర్జాతీయ న్యాయ చట్టాల క్రోడీకరణ, శాంతి పరిరక్షణ, శిశు సంక్షేమ పథకాలు మొదలైన విషయాలపై భారతదేశం నిర్వహించిన పాత్ర అందులో వివరించబడింది. అప్పటికి భారతదేశంలో కేంద్ర శాసనసభ, కౌన్సిల్ ఆఫ్ స్టేట్ ఉన్నప్పటికీ నానాజాతి సమితి ప్రతినిధులను ఆ చట్ట సభలనుండి ఎన్నుకోవడం కాక, ప్రభుత్వమే నియమించుతుండేది. భారతదేశ పాత్రకూడా

బ్రిటన్‌కు లోబడి ఉండేది. అందువలన ఆయుధాల తగ్గింపు, సైన్యాల నిర్మాణం, ఆర్థికాభివృద్ధి మున్నగు కీలకమైన విషయాలలో భారతదేశ ప్రతినిధుల వైఖరి బ్రిటిష్ ప్రభుత్వ ప్రతినిధుల వైఖరికంటే ఏమంత మెరుగుగా ఉండేదికాదు అని డాక్టర్ కృష్ణ ఆ గ్రంథంలో స్పష్టం చేశారు. ఇక స్వదేశ సంస్థానాల విషయం వచ్చేసరికి బ్రిటిష్ ప్రభుత్వం కొరడా ఝళిపించుతూ సర్కస్ రింగ్ మాస్టర్‌లా వ్యవహరించేదని డాక్టర్ కృష్ణ విమర్శించారు. నానాజాతి సమితికి పంపే భారతదేశ ప్రతినిధులు ప్రాతినిధ్య స్వభావంపట్ల కేంద్ర అసెంబ్లీలో ఎన్నుకోబడిన సభ్యులు తీవ్ర ప్రాతికూల్యం చూపించడం జరిగేది. ఆ విషయంలో బ్రిటిష్ ప్రభుత్వం అవలంబించుతున్న నిరంకుశ విధానాన్ని వారు తూర్పారబట్టేవారు. ఆ వాదోపవాదాలన్నింటిని డాక్టర్ కృష్ణ పూసగుచ్చినట్లు ఆ గ్రంథంలో వివరించారు.

అదే సమయంలో అంతర్జాతీయ కార్మిక సంస్థకు (ఐ.ఎల్.వో.) భారతదేశంలోని ట్రేడ్ యూనియన్‌లు తమ ప్రతినిధులను ఎన్నుకొని పంపుతూ ఉండేవారు. అటువంటి వారిలో శ్రీ వి. వి. గిరి, శ్రీ ఎన్. ఎమ్. జోషి, శ్రీ ఎస్. వి. పరులేకర్ మొదలైనవారు ఉండేవారు. వారు భారత కార్మికవర్గ అభిప్రాయాలను ప్రతిబింబించేవారు.

## రాష్ట్రాల పునర్విభజన సిద్ధాంతం - పుట్టుక:

"భారతదేశంలో రాష్ట్రాల పునర్విభజన సిద్ధాంతం-పుట్టుక చరిత్ర" అన్న కె. వి. కృష్ణ సిద్ధాంత వ్యాసం పరిమిత స్వభావం కల్గింది. అందులో రాష్ట్రాల పునర్విభజన సిద్ధాంతం ఏమిటో గ్రంథకర్త చెప్పారు తప్పితే రాష్ట్రాల పునర్విభజన కోసం జరిగిన ఉద్యమాల గురించి చెప్పలేదు. కాని, ఉద్యమాల స్వభావం గురించి కొంత పేర్కొన్నారు. బెంగాల్ అస్సాం విభజన (1903-1906) గురించి; మాంటెగ్యూ - ఛెమ్స్‌ఫర్డ్ నివేదిక (1918) గురించి; ఇంగ్లీషు విద్యనభ్యసించినవారి ప్రతినిధుల సమావేశాలు; చారిత్రకంగా రూపొందిన ఆంధ్రులు, తమిళులు, కన్నడిగులు, ఓఢ్రులు మొదలైన భాషా ప్రాంతాల, జాతుల ప్రతినిధుల సమావేశాలు చేసిన తీర్మానాలు; అఖిలపక్ష సభల తీర్మానాలు (1928); స్టాట్యూట్ రీ కమిషన్ (1920) నిర్ణయం; రెండవ రౌండ్ టేబుల్ కాన్ఫరెన్స్; శ్వేతపత్ర ప్రతిపాదనలు; జాయింటు కమిటీ రిపోర్టు; భారతదేశానికి నూతన రాజ్యాంగం బిల్లు మొదలైన వాటినన్నింటిని డాక్టర్ కృష్ణ అందులో పరిశీలించారు. చారిత్రకంగా రూపొందిన వెనుకబడి ఉన్న కులాల నుండి, వివిధ వృత్తులు ఉద్యోగాలు చేసుకొనే వర్గాల అభివృద్ధితో ఈ రాష్ట్రాల పునర్విభజన సిద్ధాంతం ఆవిర్భవించిందని డాక్టర్ కృష్ణ పేర్కొన్నారు. చారిత్రకంగా రూపొందిన జాతులలోని ఉద్యోగాలు, వృత్తులు చేసుకొనేవారి మధ్య - వారు ఏ రాష్ట్రం నుండి విడివడ గోరుతున్నారో ఆ రాష్ట్రంలోని వారిమధ్య జరుగుతున్న పోరాట చరిత్రే రాష్ట్రాల పునర్విభజన ఉద్యమ చరిత్ర అని; బ్రిటిష్ ప్రభుత్వానికి సంబంధించినంతవరకు ఇది ప్రభుత్వం పైనపేర్కొన్నవారికి యిచ్చిన రాయితీల చరిత్ర, పరస్పర పోటీలు రేకెత్తించిన చరిత్ర అని డాక్టర్ కృష్ణ తెలిపారు.

## భారతదేశ పారిశ్రామికీకరణ సమస్య:

"రెండవ ప్రపంచ యుద్ధకాలంలో భారతదేశ పారిశ్రామికీకరణ" అన్న గ్రంథం ఆయన జైలు నుండి విడుదలైన తరువాత తీవ్ర పరిశోధన ఫలితంగా రచించబడింది. ఈ పరిశోధన కార్యక్రమాన్ని డాక్టర్ కె. బి. కృష్ణకు అఖిల భారత ఉత్పత్తిదార్ల సంఘంవారు అప్పగించారు. కాని, తీరా పరిశోధన పూర్తి అయిన పిమ్మట దానిని వారు స్వీకరించక నిరాకరించారు. ఆ పరిశోధన అంశం ఇది:

భారతదేశంలో ఉన్న రాజ్యం బ్రిటిష్ సామ్రాజ్యవాద రాజ్యం. అది బ్రిటిష్ మిల్లు యజమానుల, ధనాఢ్య వర్గాల ప్రయోజనాలకోసం నడుపబడుతోంది. బాల్య దశలో ఉన్న భారత బూర్జువా వర్గం యొక్క ప్రధాన సమస్య తాను ఉత్పత్తి చేసిన సరుకులు అమ్ముకోడానికి అవసరమైన మార్కెట్‌ను ఏర్పరచుకోవడం. తన మార్కెట్ కోసం ఇది సామ్రాజ్యవాద రాజరికానికి వ్యతిరేకంగా సంఘర్షిస్తుంది. ఈ సంఘర్షణలోనే జాతీయోద్యమం ఆవిర్భవించుతుంది. భారతదేశంలోని పారిశ్రామికాభివృద్ధి చరిత్ర – భారత జాతీయోద్యమం రాజకీయ స్వాతంత్ర్యం కోసం జరిపిన పోరాట చరిత్ర; సామ్రాజ్యవాదుల నుండి రాయితీలు సంపాదించుకున్న చరిత్ర 1890–1920 మధ్య జరిగిన పారిశ్రామికాభివృద్ధి సామ్రాజ్యవాదుల పెత్తనం క్రింద జరిగింది. చాలా పరిమిత స్వభావం కల్గినది.

దేశీయ బూర్జువా వర్గం నడుపుతున్న ఏకైక పెద్ద పరిశ్రమ వస్త్ర పరిశ్రమ. మొదటి ప్రపంచ యుద్ధకాలంలో బట్టల పరిశ్రమ బ్రహ్మాండమైన లాభాలు సంపాదించింది. అలాగే 1920–39 మధ్య బట్టల పరిశ్రమ మరింత అభివృద్ధి చెందింది. అయితే అదికూడా పరిమిత స్వభావం కల్గింది. సిమెంటు, బొగ్గు, ప్రత్తి, జనపనార, అగ్గిపెట్టెలు, కాగితం, దుక్క ఇనుము, పంచదార, ఉక్కు దిమ్మలు మొదలైన పరిశ్రమలు కూడా అభివృద్ధి చెందాయి. ముఖ్యంగా వినిమయ వస్తు పరిశ్రమలు అభివృద్ధి చెందాయి. ప్రత్తి, దుక్క ఇనుము, ఉక్కు, గాజు, కాగితం, సబ్బులు, ఇనుప సామాగ్రి మున్నగు సరుకుల విషయంలో పాక్షికంగా స్వయం పోషకత్వం వచ్చింది. రాయితీల కోసం పెద్ద యెత్తున రాజకీయ ఆందోళన, పోరాటం కూడా జరిగాయి.

కాని, భారతదేశ ఆర్థిక విధానంలో ఉన్న తీవ్రమైన లోపాల వలన భారత పరిశ్రమలు తదుపరి మరింతగా అభివృద్ధి పొందడంలో తీవ్రమైన ఆటంకాలు ఏర్పడ్డాయి. మొదటిది: ఫ్యూడల్ నిరంకుశత్వం అణచివేతలు గ్రామీణ ప్రాంతాలలో ప్రజల కొనుగోలు శక్తిని దెబ్బ తీస్తున్నాయి. రెండవది: బడా పారిశ్రామిక వేత్తలైన టాటా, బిర్లాల సంస్థలకు, చిన్నరకం పారిశ్రామికదారులకు మధ్య పోటీ బాగానే సాగుతుంది. మూడవ విషయం: పారిశ్రామిక ఆర్థిక సంస్థలకు బ్యాంకుల మీద ఎటువంటి అజమాయిషీ ఉండటం లేదు. ఈ బ్యాంకులు ఎక్కువ భాగం బ్రిటిష్ వడ్డీ వ్యాపారుల చేతుల్లో ఉన్నాయి. చివరి విషయం : రవాణా పరిశ్రమ, నౌకా పరిశ్రమ, మోటారుకారు పరిశ్రమ మున్నగువాటిని ప్రభుత్వం ఎంతమాత్రం ప్రోత్సహించడంలేదు.

రెండవ ప్రపంచ యుద్ధకాలంలో, పారిశ్రామిక వస్తువుల ఎగుమతుల వలన కొన్ని పరిశ్రమలు అభివృద్ధి చెందడానికి ప్రోత్సాహం కల్గింది. అవి జౌళి పరిశ్రమ,

యంత్ర పరికరాలు, ఇంజనీరింగ్ వస్తువులు, సైంటిఫిక్ పరికరాలు, మందులు, భారీ రసాయనాలు వగైరా. యుద్ధ అవసరాల దృష్ట్యా ఈ పరిశ్రమలు ఇలా అభివృద్ధి చెందాయి. అయితే, భారత పారిశ్రామికులు రికార్డు స్థాయిలో లాభాలు గడించారు. ఎగుమతులపై కంట్రోళ్లు, నిరంకుశ ప్రభుత్వయంత్రం చట్టాలు, అసమర్థ మేనేజిమెంటు, అవినీతి, లంచగొండితనం మొదలైనవి పరిశ్రమలు మరింతగా అభివృద్ధి చెందడానికి అవరోధాలుగా తయారయ్యాయి. అంతేకాదు – నౌకా పరిశ్రమ, మోటారుకారు పరిశ్రమ, విమానాల తయారీ పరిశ్రమ, ఇనుము, ఉక్కు మొదలైన పరిశ్రమలను ప్రభుత్వం ప్రోత్సహించదన్న విషయం స్పష్టం.

డాక్టర్ కె. ఓ. కృష్ణ భారతదేశ పారిశ్రామికీకరణ సమస్యపట్ల తన అభిప్రాయాలను ఇలా వివరించారు:

"భారతదేశంలో పరిశ్రమలు అభివృద్ధి చెందాలని మనం కోరుకుంటున్నాం. అంటే భారతదేశంలో పెట్టుబడిదారీ విధానం స్వేచ్ఛగా అభివృద్ధి చెందడానికి తగిన పరిస్థితులు కావాలని కోరుతున్నాం. అంటే, దీని అర్థం ఫ్యూడలిజానికి, సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా పోరాడటం అన్నమాట. దేశానికి స్వాతంత్ర్యం సంపాదించిన తరువాత – స్వేచ్ఛాయుతమైన పెట్టుబడిదారీ విధానం చట్రంలో ఎంతవరకైతే అభివృద్ధికి అవకాశం ఉంటుందో అంతవరకు కార్మికవర్గం, రైతాంగం, విద్యార్థులు, మధ్యతరగతి వర్గాలు – ప్రభుత్వాన్ని బలపరుస్తారు. ఎందుకంటే, తాము కూడా కొంతవరకు అభివృద్ధి చెందడానికి యిందులో అవకాశాలుంటాయి గనుక. తదుపరి అభివృద్ధికి ఎప్పుడైతే ఉత్పత్తి విధానం ఆటంకంగా పరిణమిస్తుందో అప్పుడు కార్మికవర్గం, దాని మిత్రవర్గాలు, వారివారి చైతన్య స్థాయినిబట్టి, నిర్మాణ పటిష్టతనుబట్టి, ప్రజానీకంపై తమ పలుకుబడినిబట్టి, ఈ సమస్యను ఎదుర్కొంటారు."

## అపారమైన పరిశోధనలు:

ఈ పై గ్రంథాలేకాక డాక్టర్ కృష్ణ అనేక అంశాలపై పరిశోధన పత్రాలు తయారుచేశారు. అందులో – భారతదేశంలో ఫ్యాక్టరీ చట్టాలు – బొంబాయి రాష్ట్రంలో వాటి అమలు తీరు; సామ్రాజ్యవాదం గురించిన పరిశీలన; భారతదేశంలో విప్లవోద్యమాల విజృంభణ; ఫెడరల్ వ్యవస్థలో భారతదేశ స్వదేశీ సంస్థానాలు; న్యాయవ్యవస్థ – కార్యనిర్వాహక అధికారాల వేర్పాటు – ముఖ్యంగా భారతదేశం మెజిస్ట్రేట్ విధానం గురించి; ఫ్రెంచి విప్లవం; మూడు రష్యన్ విప్లవాలు; సోవియట్ యూనియన్‌లో జాతుల సమస్య; మూడు అంతర్జాతీయ కమ్యూనిస్టు సంస్థలు, డియట్రాఫ్; 17వ శతాబ్దపు ఇంగ్లాండులో ప్రజాస్వామ్య భావాల ఆవిర్భావం, పెరుగుదల; బేకన్ (నోట్సు) తత్త్వశాస్త్ర చరిత్రపై అధ్యయనం (నోట్సు).

ఒక జాతియొక్క అభివృద్ధి స్థాయి, ఔన్నత్యం పురోగతి ఆ జాతి [illegible]వింపజేసిన సృజనాత్మక పరిశోధకుల సంఖ్యనుబట్టి నిర్ణయించబడుతుంది. కా[illegible] [illegible] దోపిడీపై ఆధారపడిన సమాజాలలో పరిస్థితి అలా వుండదు. అస్తిత్వంలో ఉన్న విధానానికి అనుగుణ్యంకాని సృజనాత్మక మేధాశక్తి, ఆ విధానాన్ని శాశ్వత మొనరించేందుకు వెంటనే ఉపయోగపడని సృజనాత్మక మేధాశక్తి ఏవిధంగా మన[illegible]తాయో వూహించ[illegible]

కష్టం. మానవాళి సృజించే మేధో సంపద, ఎందుకూ కొరగాకుండా ఎలా నిరర్థకం చేయబడుతుందో చెప్పడానికి డాక్టర్ కె. బి. కృష్ణను ఒక దృష్టాంతంగా చెప్పవచ్చు. అంతేకాదు, ప్రకృతి సూత్రాల గురించిన, సామాజిక సూత్రాల గురించిన వాస్తవాలను స్పష్టంగా విప్పిచెప్పగల్గడానికి పడే సంఘర్షణలో ఎంత మానసిక క్షోభ, వ్యధ అనుభవించవలసివస్తుందో చూపడానికి కూడా ఆయన ఒక ఉదాహరణ. మానవాళి తనలో ఉన్న మేధో సంపత్తిని – అన్ని వనరులకంటే అత్యుత్తమ వనరు అయిన మేధో సంపత్తిని ఎప్పుడు పరిపూర్ణంగా సద్వినియోగ పరచుకోగల్గుతుంది?

– కంభంపాటి (సీనియర్)
1980 డిశంబరు 20 "మెయిన్‌స్ట్రీమ్" నుండి.

## కె. బి. కృష్ణ రచించిన "భారతీయ భౌతిక వాదం - ఒక అధ్యయనం"

డాక్టర్ కాట్రగడ్డ బాలకృష్ణ తెలుగుదేశంలో పుట్టిన కారణంగా స్వరాష్ట్రంలో సైతం తగినంత పరిగణనలోకి రాకుండానే రాలిపోయిన మార్క్సిస్టు పండితుడు, పరిశోధకుడు.

1948లో 50వ ఏటనే చనిపోయిన బాలకృష్ణ, ఇంగ్లాండు, అమెరికాలలో విద్యాభ్యాసం చేస్తుండగానే మార్క్సిస్టు మేధావిగా రూపొందాడు. 1940–42 సంవత్సరాలలో వేలూరు జైలులో కమ్యూనిస్టు డిటెన్యూగా, కీ.శే. కంభంపాటి సత్యనారాయణ గారి సహచరుడు. సోవియట్‌పై హిట్లర్ దురాక్రమణతో రెండో ప్రపంచ యుద్ధం గుణాత్మకమైన మార్పు చెందిందని అందరికంటె ముందుగా ఊహించిన దూరదర్శి.

వీరి రెండు రచనలను – 1) బౌద్ధ రచయితల సామాజిక, రాజకీయ అవగాహన, 2) భారతదేశంలో రాజ్యవ్యవస్థపై ప్రాచీన సిద్ధాంతాలు – అనే ఆంగ్ల గ్రంథాలను విశాలాంధ్ర ప్రచురణాలయంవారు చాలాకాలం క్రితమే ప్రచురించారు. మిగిలిపోయిన గ్రంథాలను కీ.శే. కంభంపాటి సత్యనారాయణగారు రాష్ట్ర పురావస్తు శాఖ గ్రంథాలయానికి అప్పగించారు.

అందులోనుండి ఇప్పుడు టి. రవిచంద్ అను యువ మార్క్సిస్టు పరిశోధకుడు హిందూ భౌతికవాద అధ్యయనం అనే గ్రంథాన్ని ప్రచురించారు.

ఈ గ్రంథాన్ని డాక్టరు బాలకృష్ణగారు 1932లో వ్రాశారు. ఇందులో –

1) లోకాయతపై సుదీర్ఘమైన వ్యాసం.

2) కపిలుడు – సాంఖ్యతత్త్వశాస్త్ర పరిచయం.

3) ఉపనిషత్ అనంతర కాలంలో భౌతికవాద తాత్త్వికులు.

4) భగవద్గీతలో భౌతికవాద భావనలు.

5) వేమన – భౌతికవాది – అనే ఐదు అధ్యాయాలున్నాయి.

లోకాయతంపై వ్రాస్తూ వీరు మొదట్లోనే ఆలోచనాత్మకమైన ఒక మాట అన్నారు:

"సాంప్రదాయ పిడివాదాన్ని ఎదుర్కొనేందుకు చారిత్రకంగా రూపొందిన పిడివాదం, భౌతికవాదం."

భౌతికవాదం పిడివాదం అనేమాట కటువుగా ఉన్నా వీరిచ్చిన వివరణ ఎంతో హేతుబద్ధంగా ఉంది.

"ఆ రోజుల్లో ఒక పిడివాదాన్ని, మరో పిడివాదం ద్వారా ఎదుర్కోవటం మినహా మార్గాంతరం లేదు" అని కూడా అన్నారు.

లోకాయత అయిదు దశలను అధిగమించింది:

1. మొదట్లో లోకాయత అంటే ప్రకృతి విజ్ఞానం. ఆ రోజుల్లో లోకాయతులు హృదయంలో పవిత్రతను, ఆచరణలో నిర్మలత్వాన్ని పుణికి పుచ్చుకున్న తాత్వికులు. వారిలో ఎట్టి దుర్లక్షణమూ లేదు, సల్లక్షణమూ లేదు.
2. రెండో దశలో వారు సహజంగానే అసహనాన్ని పెంచుకున్నారు. ఆనాటి వేద వ్యతిరేక, బ్రాహ్మణ వ్యతిరేక ఉద్యమాల ప్రభావం అది. అప్పటికీ లోకాయతులకు ఒక నిశ్చయాత్మక తాత్త్వికత అంటూ లేదు.
3. మూడో దశలో వీరు 'స్వభావవాద' సూత్రాన్ని రూపొందించారు. ఇంద్రియ జ్ఞానం మాత్రమే గ్రాహ్యం అన్నారు. అనుమాన ప్రమాణాన్ని నిరాకరించారు.
4. నాలుగో దశలో వీరు 'సుఖవాదం' వైపు మళ్ళారు. ఈ దశలోనే వారికి 'చార్వాకులు' అను పేరు వచ్చింది. బ్రాహ్మణ మతం అపుడు పూర్తి పిడివాదంగా ఉండేది. అందుకు ప్రతిగా చార్వాకులు మరొక పిడివాదాన్ని రూపొందించారు. బౌద్ధానికి పూర్వం జీవించిన అసిత కేశకంబళ, ప్రకృధ కాత్యాయన ఇత్యాదులందరూ ఈ కోవకు చెందినవారు. కౌటిల్యుని అర్థశాస్త్రం, వాత్స్యాయన కామసూత్రాలలో చార్వాకులు అంటే వీరే.
5. మాధవ విద్యారణ్యుడు 12 వ శతాబ్దిలో సర్వదర్శన సారసంగ్రహం రాసేనాటికి, వీరిని నిందించటానికి, దూషించటానికి దురదృష్టవశాత్తు సాంప్రదాయవాదులకు పూర్తి అవకాశం లభించింది.

ఈ వివరణ స్థూలంగా సరైనది. బాలకృష్ణగారికి ముందు భారతీయ భౌతిక వాదులను గురించి రచించినవారు యం. యం. రాయి ఒక్కరే. రాహుల్ సాంకృత్యాయన్, దేవీప్రసాద్ ఛటోపాధ్యాయ ఇత్యాదులందరూ ఆ తర్వాతి వారే. యం. యన్.రాయిగారు ఇట్టి విశ్లేషణ చేయలేదు. రాహుల్జీ, దేవీప్రసాద్‌లు సైతం ఇంతటి సునిశిత విశ్లేషణ చేయకపోవటం ఆశ్చర్యకరం.

చార్వాక సిద్ధాంతానికి మూలపురుషుడు బృహస్పతి అని దాదాపు అన్ని ప్రాచీన గ్రంథాలు పేర్కొంటున్నాయి. బృహస్పతి అంటే దేవగురువు. అతని బోధనల ననుసరించి జీవించినవాడు ఇంద్రుడు.

ఇది కల్పనా? లేక చారిత్రకత ఏదైనా ఉందా?

శ్రీ బాలకృష్ణగారు ఈ అంశాన్ని సుదీర్ఘంగా చర్చించి, బృహస్పతి చారిత్రక వ్యక్తి అని, ఒకరు కాక, ఇద్దరు బృహస్పతు లున్నారని భావించారు.

నాకు చూడగా, ఇందులో చారిత్రకతకంటే కల్పనే హెచ్చు అనిపిస్తుంది. కల్పనలోనూ ఒక ఆలోచనా క్రమబద్ధత ఉన్నది. అదేమంటే –

వేదాలలోనూ, పురాణాలలోనూ వర్ణితమైన రీతిలో ఇంద్రుడు దేవతల అధిపతి, మరణం లేదు. ఆర్యులు కోరిన విధంగా అనార్యులను, వారి నగరాలను ధ్వంసం చేసినవాడు. పురాణకాలంలో తనకు ప్రత్యర్థులౌతారని భావించిన భూపతులను, రుషులను మాయోపాయాల ద్వారా వచించినవాడు. స్త్రీ వ్యసనంలో అతనికి అతడే సాటి.

ఇట్టివాని గురువు బృహస్పతి. అతడు పురాణ గాథల ననుసరించి నీతిమంతుడు కాదు. శుక్రాచార్యుని వద్దనున్న మృతసంజీవనీ విద్యను మాయోపాయం ద్వారా అపహరించేందుకు స్వయంగా తన కుమారుడైన కచుని పంపినవాడు.

తర్వాత కాలంలో చాణక్య నీతిగా ప్రసిద్ది చెందిన రాజకీయ తంత్రాన్ని బృహస్పతి, ఇంద్రుడు – ఉభయులూ అనుసరించారు. వీరిద్దరూ అనాదిగా చాణక్య కుటిల రాజనీతికి ప్రతీకలు.

అట్టి బృహస్పతి చార్వాక వాదానికి మూలపురుషుడు అని పూర్వగ్రంథాలు పేర్కొనటంలో ఈ అంతరార్థం ఉన్నదని నాకు తోస్తున్నది. ఇందులో వాస్తవికత, కౌటిల్యం రెండూ ఉన్నాయి.

బృహస్పతి ప్రస్తావన ఛాందోగ్యంలో ఉంది. ప్రజాపతి వద్దకు విరోచనుడు, ఇంద్రుడు ఉభయులూ వెళ్ళి, ఆత్మజ్ఞానం ప్రసాదించవలసిందిగా వేడుకుంటారు. 'దేహమే ఆత్మ' అని ప్రజాపతి అంటాడు. అంతటితో విరోచనుడు సంతృప్తి చెంది, దేహాత్మ వాదాన్ని రాక్షసులకు బోధిస్తాడు. ఇంద్రుడు తిరిగి వచ్చి నాకా వాదన సంతృప్తి ఇవ్వలేదంటాడు. తిరిగి తపస్సు చేసిన తర్వాత ఆత్మ వేరు, దేహము వేరు, ఆత్మకు చావులేదు అను ఆత్మజ్ఞానాన్ని దేవేంద్రుడు గ్రహిస్తాడు.

ఆత్మజ్ఞానం కలిగినవారు దేవతలనీ, దేహమే ఆత్మగా భావించినవారిని రాక్షసులని అప్పటికి ఒక విభజన జరిగింది.

ఐనా ఇంద్రుడు ఆచరణలో సర్వ అవినీతికర కార్యాలకూ పాల్పడుతూనే ఉంటాడు. బహూశా ఆచరణ వేరు, అవగాహన వేరు అయి ఉండాలి.

బృహస్పతి అంటే ఉపనిషత్కారులకు గౌరవభావం లేదు. ఇంద్రుడిని మాత్రం వేరుచేసి, 'ఆత్మజ్ఞానాన్ని' అతడికి అందజేశారు.

బృహస్పతి లోకాయతానికి మూలపురుషుడు అనే కల్పనలో ఈ అంతరార్థమున్నట్లు నాకు తోస్తున్నది. తర్వాత బృహస్పతులు అనగా లోకాయతాన్ని కొనసాగించినవారు అనేకులు వచ్చారు. విశ్వామిత్రుడు, వశిష్ఠుడు రుగ్వేదంలో ఉన్నారు. రామాయణ కాలంలో ఉన్నారు. పురాణ కాలంలో ఉన్నారు. ఇవన్నీ కొన్ని సాంప్రదాయాలు. ఆ సాంప్రదాయాన్ని కొనసాగించినవారినంతా అదే పేరుతో వ్యవహరించారు. లేక ప్రస్తావితులైనారు.

బృహస్పతి విషయంలో బాలకృష్ణగారి భావన ఎలా ఉన్నా, లోకాయతాన్ని అయిదు దశలుగా పరిణామానికి లోనైనట్లు చూపటం పూర్తిగా సరైనది. లోకాయతంలో పరిణామం ఉన్నట్లే భౌతికవాదంలో అయిదు దశలు ఉన్నాయి. భౌతిక వాదం విస్తృతమైనది. అందులో ముఖ్యమైనది లోకాయతం.

భౌతికవాదంలో అయిదు దశలను బాలకృష్ణగారు ఇలా పేర్కొన్నారు:

1. ప్రకృతివాదం – మానవాతీత వాదానికి విరుద్ధమైనది.
2. సంశయవాదం – బౌద్ధం, జైనం.
3. నాస్తికవాదం – సాంఖ్యం.
4. అనుభవవాదం – చార్వాకులు.
5. సుఖవాదం – ఆఖరు దశ.

ఈ విభజన ఫలితంగా తొలుత ఆలోచనా ధోరణిగా మాత్రమే ఉన్న లోకాయతం, క్రమంగా, వైదికవాదుల నిందారోపణలతో ఒక మూలకు కొట్టుకుపోయి, పిడివాదంగా ఎలా తయారైందో బాలకృష్ణగారు వివరించగలిగారు.

లోకాయతకు, తాంత్రిక, కాపాలిక మార్గాలకుగల సంబంధాన్ని కూడా వీరు చర్చించారు. లోకాయత ప్రారంభంలో అశ్లీల, అనాచారాలకు తావివ్వలేదు. లోకాయత ఎంత ప్రాచీనమో, తాంత్రికత కూడా అంతే ప్రాచీనం. హరప్పకాలం నుంచే ఈ ధోరణి ఉంది. ఋగ్వేదంలోనే తాంత్రికవాదం అక్కడక్కడా చోటు చేసుకున్నది.

పశుపోషణ దశలోని సంతాన ప్రక్రియలపై ఉండే మూఢ విశ్వాసాలు తంత్రానికి మూలం. వైదిక మంత్రాలు మూఢవిశ్వాసాలే కనుక, ఈ రెండూ సమాన మానసిక స్థాయికి చెందినవి. మూఢాచారాలపై నిరసనతో లోకాయత మొదలైంది. కాని అనేక తాత్త్విక సమస్యలను ఉపేక్షించిన కారణంగా లోకాయతలో మొదటినించి బలహీనత ఒకటి ఉంది. అప్పుడప్పుడే రూపొందుతున్న వర్ణ వ్యవస్థ చట్టానికి లోకాయత పూర్తిగా వ్యతిరేకం. ఆ తర్వాత కొందరు వైదికవాదులు సైతం లోకాయత వాదనలపట్ల సుముఖత చూపినా, మౌలికంగా అది అనార్య సాంప్రదాయం నుండి ఆవిర్భవించింది.

తంత్రవాదం మరీ క్షీణించి వామాచారమైంది. మదిర, మానిని, మత్స్యం, మైథునం, ముద్ర అనే పంచమకారాలతో లైంగిక సుఖమే సర్వస్వమనే స్థాయికి పడిపోయింది. విశృంఖల లైంగికత్వమే ఆరాధ్యమైంది. వైదికులను తృప్తిపరచటానికో, ప్రజలను మోసపుచ్చటానికో, లైంగిక సుఖం ద్వారా మోక్షప్రాప్తి అని కూడా వారు అన్నారు. ఆ ఆత్మవంచన, పరవంచనా శిల్పం; అనాగరిక అశ్లీల ఆచారాలు స్వీకరించే వారందరూ చెప్పే మాటలనే వారూ చెప్పారు. యజ్ఞ యాగాదులలో జంతుహింస, తదితర అశ్లీల ఆచారాలన్నిటిని వైదికులు ఇలాగే సమర్థించుకున్నారు. వైదికులు, తాంత్రికులు – ఒకే నాణానికి బొమ్మ, బొరుసు మాత్రమే.

ఈ ఘర్షణ పెరిగి వైదిక వాదం, క్రమంగా శాస్త్ర పురాణ యుగాలలో వర్ణ వ్యవస్థసమర్థకమైన మనుధర్మశాస్త్రపరంగా సాగింది. లోకాయతం వర్ణ వ్యవస్థను పూర్తిగా వ్యతిరేకించే బ్రాహ్మణేతర, దాసవర్ణాల ఆలంబన రూపొందింది.

బౌద్ధానికి పూర్వం జీవించిన అసితకేశ కంబళ, ప్రకృధ కాత్యాయన, మక్కలి ఘషాల్ ఇత్యాది చార్వాకులందరూ సామాజిక నీతిపట్ల ఉపేక్షనేకాదు, నిరసనను కూడా ప్రదర్శించారు.

"సత్ప్రవర్తనవల్ల ప్రయోజనంలేదు, దుష్ప్రవర్తనవల్ల కీడులేదు" అనే వైఖరీ దాదాపు వీరందరికీ సామాన్య ధర్మం.

ఆ పిమ్మట కొద్ది రోజులకే, లోకాయత, కాపాలిక ధోరణిగా క్షీణదశకు చేరుకున్నది. ఈ వివరాలన్నిటినీ బాలకృష్ణగారు వివరించారు.

సాంఖ్యంపై వారు వ్రాసిన రెండో వ్యాసంలో ఒక ఆసక్తికరమైన అంశం ఉంది. సాంఖ్యంలో ప్రకృతి అనాది. ప్రకృతికి అంతర్గతంగా చలనశక్తి ఉంది. అది దాని స్వభావం. ఈ చలన శక్తి ఒకరకమైన జీవాంశ. జైనులలోనూ దాదాపు ఇదే భావన ఉంది. ఈ జీవాంశ పరిణామక్రమంలో బుద్ధి, మనస్సు, అహంకారాలుగా మారుతుంది.

అహంకారంతో 'నేను' అనే పురుషభావం ఏర్పడి, పురుషుని వాంఛా సంతృప్తి కొరకే, ప్రకృతి పరిణామం అనే విపరీత ధోరణి తలెత్తింది. పురుష భావన అవిర్భావం తర్వాత పంచ మహాభూతాలు ఆవిర్భవిస్తాయనడం మరో బలహీనత. భావం నుండి పదార్థం అనే భావనకు ఇక్కడ బీజం ఏర్పడ్డది. నిరీశ్వర సాంఖ్యం ఈశ్వర సాంఖ్యంగా మార్పుచెందిన బలహీనత మొదటినుంచి సాంఖ్యంలో ఉంది.

ఈ అంశాన్ని బాలకృష్ణగారు వివరంగా కాకపోయినా, స్థూలంగా చర్చించారు.

భగవద్గీత, ప్రబోధ చంద్రోదయం, వేమనలపై శ్రీ బాలకృష్ణగారు వ్రాసిన అధ్యాయాలలో భౌతికవాదం అనే మాటను కాక మరొకమాటను వాడి ఉంటే బాగుండేది. వేమనపై పరిశోధన చేసినవారు కొందరు ఆయన చార్వాక సిద్ధాంతాన్ని ఆమోదించినట్లు భావించినా, హెచ్చుమంది అలా భావించడం లేదు. మూఢవిశ్వాసాలను, కులాచారాలను ఖండించిన సంస్కర్తగాను, నిర్గుణభావ స్ఫోరకమైన అద్వైత భావనను స్థాపించినవాడుగానే వేమనను గుర్తిస్తున్నారు. ప్రబోధ చంద్రోదయం వివిధ భౌతికవాద ధోరణులను ప్రస్తావించటం – వాటిని విమర్శించటానికేగాని, సమర్థించటానికి కాదు.

భగవద్గీతలో వైదిక కర్మకాండపై నిరసన, సత్వరజస్తమోగుణాలలో సత్వగుణ ప్రాధాన్యతను వివరించే స్థితప్రజ్ఞ భావన ఉంది.

కర్మ, జ్ఞానయోగాల సంయోగాన్ని సిద్ధాంతం, ఆచరణల సమ్మేళనగా బాలకృష్ణగారు చేసిన ఊహ సరైనది. గీతకు విశ్వజనీనతను చేకూర్చిన అంశం ఇదే.

వర్ణ వ్యవస్థ సమర్థకులు గీతకు అపార్థం చెబుతున్నారని, పుట్టుకతోనే వర్ణాధిక్యత అని గీత చెప్పలేదని బాలకృష్ణగారు తెలియజేశారు. స్వధర్మం అనే మాటను 'కులధర్మం' అనే అర్థం చెప్పటం తప్పు అన్నారు. స్వభావసిద్ధమైన ధర్మం, విధి ప్రతి వ్యక్తికి వేరువేరుగా ఉంటాయని చెప్పటమే గీత పరమార్థం.

గీత విషయంలో బాలకృష్ణగారు సృజనశీల వ్యాఖ్యను చేయటం హర్షణీయం. కపిలుడు, వేమన, ప్రబోధ చంద్రోదయ అధ్యాయాలు సాధారణ స్థాయిలో ఉన్నప్పటికీ, లోకాయత, గీతపై గల రెండు అధ్యాయాలు ఎంతో సృజనాత్మకతను కలిగి ఉన్నాయి. గీతలోని అనుకూల అంశాలను, భారతీయ తత్త్వశాస్త్రానికి అది చేసిన తోడ్పాటును బాలకృష్ణగారు యిలా విశ్లేషించారు:

1. కర్మ జ్ఞాన మార్గాల సమన్వయం.
2. సిద్ధాంత, ఆచరణల మధ్య ఏకత్వం ఉండాలనటం. ఆధునికమైన మార్క్సిస్టు భావన ఇదే చెబుతుంది.

3. మానవునికి స్వేచ్ఛ ఉంది. ఈ స్వేచ్ఛ, చిట్టచివరకు సర్వ ప్రపంచాన్ని ఆవరించిన నియతిలో, ఋతంలో అంతర్లీనం అవుతుంది. స్వేచ్ఛా, నియతి భావనలో కూడా ఆధునికమైన మార్క్సిస్టు స్ఫురణ ఉన్నది.
4. వర్ణ వ్యవస్థను సమర్థించలేదు. విమర్శించింది.
5. యజ్ఞయాగాదులను మృదువుగా విమర్శించింది.

ఈ రచనలో కొన్ని అధ్యాయాలనైనా తెలుగులో ప్రచురించటం మంచిది. శ్రీ రవిచంద్‌గారు ఆ బాధ్యతను కూడా వహించగలరని ఆశించటం అత్యాశకాదు.

ఇలాంటి ఉత్తమ గ్రంథాన్ని ఆంగ్లంలో ప్రచురించి, మరుగునపడిన తెలుగు పరిశోధకుడ్ని అఖిల భారత వేదికపైకి తెచ్చిన శ్రీ రవిచంద్‌గారిని మరొకసారి అభినందిస్తున్నాను.

* * *

# కీ.శే. ఉప్పల లక్ష్మణరావు-మెల్లీషోలింగర్

ఉప్పల లక్ష్మణరావు గారు గంజాం జిల్లా బరంపురంలో 1898లో జన్మించారు. కలకత్తాలో బి.ఎస్‌సి. ప్యాసై, ఎడింబరోలో ఎం.ఎ. పట్టా పుచ్చుకొన్నారు. జర్మనీలోని ట్యూబింగెన్ యూనివర్శిటీలో వృక్షశాస్త్రం చదివి, 1924లో డాక్టరేట్ తీసుకున్నారు. జర్మనీలో ఉండగా స్విస్ దేశస్థురాలైన మెల్లీ షోలింగర్‌తో వీరికి పరిచయమైంది. ఆమె 1898లో జూరిచ్‌లో జన్మించారు. ఆమెతో కలిసి 1924లో కార్మికోద్యమంలో పనిచేశారు. స్వదేశానికి వచ్చి వి. వి. గిరి గారికి అంతరంగిక కార్యదర్శిగా 1926–27లో బెంగాల్ నాగపూర్ రైల్వే సమ్మెలోను, రైల్వే కార్మికోద్యమంలోను పనిచేశారు. ఆ తరువాత రెండు సంవత్సరాలు సుప్రసిద్ధ వృక్ష శాస్త్రవేత్త సర్ జగదీశ్ చంద్రబోసు వద్ద శిక్షణ పొందారు. మెల్లీ స్విడ్జర్లాండులో వైద్యశాస్త్రం చదివి, చదువు పూర్తిచేయకముందే తండ్రిగారి రసాయనిక, పట్టు వ్యాపారంలో ప్రవేశించారు. 1928లో యూరపు పర్యటించి, 1929లో భారతదేశం వచ్చారు. శాసనోల్లంఘనోద్యమ ప్రారంభ దశలో గాంధీజీ సబర్మతీ ఆశ్రమం వెళ్లి, అక్కడ ఖాదీ పరిశ్రమలో తర్ఫీదు పొందారు. లక్ష్మణరావుగారు 1929లో

కాకినాడలోను, 1930లో అలీఘర్ ముస్లిం విశ్వవిద్యాలయంలోను అధ్యాపకులుగా ఉన్నారు. ఆ తరువాత శ్రీమతి షోలింగర్‌తో కలిసి 1934 వరకు ఖాదీ పరిశోధనలు ఖాదీ ప్రచారం చేశారు.

ఉభయులు కలిసి ఆంధ్రలో పొందూరు సన్నసూలు చర్ఖాపై పరిశోధనలు జరిపి, "భారతి", "మోడర్న్ రివ్యూ" పత్రికల్లో ధారావాహికంగా కొన్ని వ్యాసాలు ప్రచురించారు. వారి పరిశోధనలవల్ల చర్ఖాకు బాల్‌బేరింగ్ పరికర మొకటి అమర్చబడింది. దాని సహాయంతో నూలు త్వరత్వరగా వడకడం, పెద్ద బారలతో వడివడిగా వడకడం సాధ్యపడ్డమేకాక, శ్రమ చాలా తగ్గుతుంది. దానిని విశాఖపట్నంలో ఆంధ్ర ఇంజనీరింగ్ కంపెనీ తయారుచేసింది. లక్ష్మణరావుగారు 1934లో విశాఖపట్నంలోని ఆంధ్ర ఇంజనీరింగ్ కంపెనీలో ప్రవేశించారు. 1937 సాధారణ ఎన్నికల్లో అత్యంత ప్రాధాన్యత వహించిన బొబ్బిలి నియోజకవర్గంలో లక్ష్మణరావుగారు జస్టిస్ పార్టీ నాయకుడైన బొబ్బిలి రాజాకు వ్యతిరేకంగా పోటీ చేస్తున్న వి. వి. గిరి గారిని బలపరుస్తూ ప్రచారం చేశారు. వేలమంది హాజరైన ఒక బహిరంగ సభలో జవహర్‌లాల్ నెహ్రూ ఉపన్యసిస్తుంటే, జమీందారీ గూండాలు డప్పులు వాయించి సభ జరక్కుండా చేశారు.

1937లో వృత్తిరీత్యా జర్మనీ వెళ్లారు. ఆ సందర్భంలోనే మెల్లీతో కలిసి ఉభయులు సోవియట్ యూనియన్ వెళ్ళారు. అక్కడే వివాహం చేసుకొని, 1938లో బెజవాడ వచ్చారు. బెజవాడలో లక్ష్మణరావుగారు ఆంధ్ర సిమెంటు కంపెనీ మేనేజరుగా పనిచేశారు. మెల్లీ 1940 వ్యక్తి సత్యాగ్రహోద్యమంలో మొదటిసారి 9 నెలలు జైలుశిక్ష అనుభవించారు. రెండవసారు చెన్నపట్నం నుండి ఉద్యమంలో పాల్గొని, ఒక సంవత్సరం శిక్ష అనుభవించారు. మూడవసారి క్విట్ ఇండియా ఉద్యమంలో బెజవాడలో అరెస్టు అయి, $1\frac{1}{2}$ సంవత్సరముల శిక్ష విధింపబడి, సంవత్సరం తరువాత విడుదల చేయబడ్డారు.

లక్ష్మణరావుగారు సోవియట్ యూనియన్‌లో తమ అనుభవాలను వర్ణిస్తూ "సోవియట్ యూనియన్ భూతల స్వర్గం" అనే పుస్తకం వ్రాశారు. రెండవ ప్రపంచ యుద్ధకాలంలో వీరు ఏ పార్టీలోను చేరలేదు. యుద్ధానంతరం కాంగ్రెసు వర్కింగ్ కమిటీ కమ్యూనిస్టుల్ని తొలగిస్తూ (కాంగ్రెసు నుంచి) తీర్మానించి తరువాత కమ్యూనిస్టు పార్టీతో సంబంధ మేర్పరచుకొని, కొంతకాలం తరువాత ఆ పార్టీలో సభ్యులుగా చేరారు. 1958 నుంచి 1970 వరకు సోవియట్ యూనియన్‌లో ఉండి, ప్రగతి ప్రచురణాలయంలో ముఖ్య తెలుగు అనువాదకునిగా పనిచేశారు. అనేక మార్క్సిస్టు సిద్ధాంత గ్రంథాలను తెలుగులోకి అనువదించారు. తెలుగు–రష్యన్ నిఘంటువుకు ప్రధాన సంపాదకుడుగా పనిచేశారు.

మెల్లీ షోలింగర్ మాస్కోలో 1965లో ఒక ప్రమాదంలో మరణించారు. లక్ష్మణరావుగారు ఒక దశాబ్దం క్రితం మరణించారు.

★ ★ ★

## నిష్కళంక దేశభక్తుడు, ఆదర్శ కమ్యూనిస్టు, మహోన్నత మానవతామూర్తి

# కీ.శే. డాక్టర్ చెలికాని రామారావు

- పరకాల పట్టాభిరామారావు



డాక్టర్ చెలికాని రామారావుగారు 1901లో తూర్పుగోదావరి జిల్లా తిమ్మాపురంలో మాతామహుల యింట జన్మించారు. వారి స్వగ్రామం పిఠాపురం తాలూకా కొండెవరం. పిఠాపురం హైస్కూలులో విద్యాభ్యాసం చేస్తున్నప్పుడే బ్రహ్మసమాజం, మత సంస్కరణ భావాలు, ప్రధానోపాధ్యాయులైన కూచి నరసింహంపంతులుగారి జాతీయభావాలు రామారావుగారికి అలవడినాయి. ఆ రోజుల్లో పిఠాపురం మహారాజా

కందుకూరి వీరేశలింగంగారి సంఘ సంస్కరణోద్యమానికి అండ దండలు యిచ్చారు. పేద విద్యార్థులకు సహాయం చేసేవారు. చెలికాని రామారావుగారి విద్యాభ్యాసం కూడా చాలావరకు వారి సహాయంతోనే సాగింది.

హైస్కూలు విద్యాభ్యాసం కాలంలోనే రామారావుగారిపై వందేమాతరం ఉద్యమం, అనిబిసెంట్ హోమ్‌రూల్ ఉద్యమం ప్రభావాలు పడ్డాయి.

## సహాయ నిరాకరణోద్యమంకోసం గృహపరిత్యాగం:

1919–22లో గాంధీజీ నాయకత్వాన ప్రారంభమైన సహాయ నిరాకరణోద్యమ సమయంలో రామారావుగారు కాలేజీ చదువుకు స్వస్తిచెప్పి స్వాతంత్ర్యోద్యమంలో ప్రవేశించారు. ఉద్యమంలో ప్రవేశించడానికి 1921 జనవరి 26న గృహపరిత్యాగం చేశారు. దేశసేవకు జీవితాన్ని అంకితం చేయదలచుకొన్నాననీ, నాకు ఇక కుటుంబ ఆస్తి పాస్తులతో ఏమీ నిమిత్తం లేదనీ, తన కాళ్ళపై తాను నిలబడి బ్రతక దలిచాననీ, దేశసేవ చేయకుండా తాను చదువుకొని తన బాగు ఒక్కటే తాను చూసుకోవడం మహాపాపమనీ వారు తమ అన్నగారికి వ్రాసిన లేఖ నాటికీ నేటికీ దేశభక్తులందరికీ ఉత్తేజం కల్గించే త్యాగపత్రం. (రామారావుగారు ఆ విధంగా తన కుటుంబ ఆస్తి పాస్తులను వదులుకొన్నప్పటికీ వారి అన్నగారు ఎంతో ఔదార్యంతో వారికి అవసరమైనప్పుడల్లా ఆర్థిక సహాయం చేసి ఆదుకొనేవారు.)

సహాయ నిరాకరణోద్యమంలో ప్రధానాంశాలు త్రివిధ బహిష్కరణలు – అనగా యింగ్లీషు విద్య బహిష్కరణ, ఇంగ్లీషు కోర్టులు బహిష్కరణ, విదేశీ వస్త్ర బహిష్కరణ, కల్లు అంగళ్ళ బహిష్కరణ మొదలైనవి. రామారావుగారు త్రికరణశుద్ధిగా ఈ కార్యక్రమాన్ని తాను అమలుజేసి, ఇతరులకు ఆదర్శవంతులయ్యారు. ఆ సందర్భంలో రామారావుగారు అరెస్టయి రాజమండ్రి జైలులో వున్నారు. అల్లూరి సీతారామరాజు మన్యం సాయుధపోరాటం; శ్రీ మద్దూరి అన్నపూర్ణయ్య, క్రొవ్విడి లింగరాజు ప్రభృతుల సోషలిస్టు భావాలు రామారావుగారిని ఆకర్షించాయి. హరిజనోద్ధరణ, తదితర సంఘసంస్కరణ కార్యక్రమాల్లో కూడా శ్రీ రామారావు చురుకుగా పాల్గొనేవారు.

## కాకినాడ కాంగ్రెస్ సభ నిర్వహణ:

1923లో కాకినాడలో అఖిల భారత కాంగ్రెస్ విస్తృత సమావేశం జరిగింది. గాంధీజీ తప్ప అఖిల భారత కాంగ్రెస్ అగ్రనాయకులందరూ కాకినాడ వచ్చారు. మహాసభ నిర్వహణ భారమంతా కాంగ్రెస్ స్వచ్ఛంద సేవా దళ నాయకునిగా రామారావుగారి మీద పడింది. వివిధ రాష్ట్రాల ప్రతినిధులతో రామారావుగారికి పరిచయం ఏర్పడింది. ముఖ్యంగా నిజాం సంస్థానం నుండి వచ్చిన శ్రీ మాడపాటి హనుమంతరావు, శ్రీ అనే వాసుదేవరావు తదితరులతో పరిచయాలు ఏర్పడ్డాయి.

హైదరాబాద్ వాస్తులతో ఏర్పడిన ఈ పరిచయాలను పురస్కరించుకొని రామారావుగారు వైద్య విద్యాభ్యాసానికి అక్కడకు వెళ్ళారు. కాకినాడ కాంగ్రెస్ తరువాత ఇంటర్మీడియట్ పూర్తిచేసి, తన కాళ్ళమీద తాను నిలబడి వైద్య విద్యాభ్యాసం చేశారు. ఇంగ్లీషు ట్యూషన్‌లు చెప్పి, ఆ డబ్బుతో చదువు కొనసాగించారు.

సరోజినీనాయుడు గారి భర్త ముత్యాల గోవిందరాజులు నాయుడుగారు వైద్య కళాశాలలో వీరికి లెక్చరర్. సరోజినీదేవికి – గోవిందరాజులు నాయుడు గారికి వివాహం చేయించింది కందుకూరి వీరేశలింగంగారు. వారి యిల్లు "గోల్డెన్ థ్రెష్‌హోల్డ్" సంఘ సంస్కరణ ఉద్యమాలకు, జాతీయ వాదులకు నిలయం. మాడపాటి హనుమంతరావు, బూర్గుల రామకృష్ణారావు, సురవరం ప్రతాపరెడ్డి మున్నగువారు ఆంధ్ర మహాసభ కార్యక్రమాలు, ఆంధ్ర భాష, ఆంధ్ర సాంస్కృతికోద్యమాలు మున్నగువాటిని అప్పుడే ప్రారంభించారు. నిజాం రాష్ట్రంలో ప్రారంభమైన ఆ ఆంధ్ర మహాసభ ఉద్యమాలతో చెలికాని రామారావుగారికి మంచి సంబంధాలు ఏర్పడ్డాయి. రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి మున్నగు యువకులతో సన్నిహిత పరిచయాలు పెరిగాయి.

## ఉప్పు సత్యాగ్రహంలోకి రావి నారాయణరెడ్డి ప్రభృతులు:

వైద్య పరీక్షలు (L.M.I.S) ఇక 15 రోజులకు జరుగుతాయనగా త్వరలో ప్రారంభం కానున్న ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొనాలని బులుసు సాంబమూర్తిగారి పిలుపురావడంతో పరీక్షలకు స్వస్తిచెప్పి రామారావుగారు కాకినాడ బయలుదేరారు. అయితే, ఆయన ఒక్కరూ బయలుదేరలేదు. తన విద్యార్థి మిత్రులు శ్రీ రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, గోపాలరావు ఎక్బోటే, జి. ఎస్. మేల్కోటే మొదలైన 100 మందిని వెంటబెట్టుకొని కాకినాడ వచ్చారు. ఆ విధంగా రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి ప్రభృతులను జాతీయోద్యమంలోకి తీసుకొనివచ్చిన ఘనత చెలికాని రామారావుగారిదే. జాతీయోద్యమంలో తొలిపాఠాలు వీరు కాకినాడలో నేర్చుకున్నారు. ఆ తరువాత ఆ యువ నాయకులే నైజాం సంస్థానంలో కమ్యూనిస్టు ఉద్యమానికి పునాదులు వేశారు. (కాకినాడ సత్యాగ్రహ శిబిరంలోనే మొట్టమొదటిసారిగా జాతీయ కవి గరిమెళ్ళ సత్యనారాయణ వ్రాసిన "మాకొద్దీ తెల్లదొరతనము" మొదలైన జాతీయ గీతాలను తాము పాడుతూ వూరేగింపులు చేసేవారమని శ్రీ రావి నారాయణరెడ్డిగారు హైదరాబాద్‌లో జరిగిన గరిమెళ్ళ శతజయంతి సభలో వెల్లడించారు.)

1930 వ సంవత్సరం ఆఖరులో రామారావుగారు అరెస్టు చేయబడ్డారు. రాజమండ్రి జైలులో వుండగా బెంగాల్ సోషలిస్టు నాయకులతోను; ఆంధ్ర కమ్యూనిస్టు నాయకులు పుచ్చలపల్లి సుందరయ్య, కలిదిండి సుబ్రహ్మణ్యం మొదలైన వారితోను పరిచయాలు ఏర్పడ్డాయి. సోషలిస్టు భావాలవైపు ఆకర్షితులయ్యారు.

1931 లో గాంధీ–ఇర్విన్ ఒడంబడిక ఫలితంగా సత్యాగ్రహులందరూ విడుదల య్యారు. కాకినాడ హిందూస్థాన్ సేవాదళ్ శిక్షణా శిబిరానికి రామారావుగారు కెప్టెన్‌గా పనిచేశారు. ఆ సందర్భంలోనే రామారావుగారు విపరీతమైన లాఠీఛార్జికి గురి అయ్యారు. మళ్ళీ అరెస్టు చేయబడి, ఈసారి బళ్ళారి జైలులో నిర్బంధించబడ్డారు. అరెస్టు కాకముందు తూర్పుగోదావరి జిల్లాలో రహస్య కాంగ్రెస్ పత్రికలు రణదుందుభి, తిరుగుబాటు మున్నగువాటిని తయారుచేయడంలో పాల్గొని, వాటిని పంచుతూండేవారు.

ఆరు నెలలు బళ్ళారి జైలులో వుండగానే రామారావుగారికి క్షయవ్యాధి అంకురించింది. వారిని టి.బి. శానిటోరియమ్‌లో చేర్చి చికిత్స చేశారు. విడుదలైన

తరువాత హైదరాబాదు వెళ్ళి వైద్య పరీక్ష వ్రాసి ఉత్తీర్ణులయ్యారు. ఆ తరువాత జిల్లా హరిజన సేవాసంఘ అధ్యక్షులుగా పనిచేశారు.

1932లో రెండవ రౌండ్ టేబుల్ మహాసభ విఫలమైన తరువాత మళ్ళీ బ్రిటిష్ ప్రభుత్వం తీవ్ర నిర్బంధ విధానం ప్రారంభించింది. రామారావుగారు తిరిగి అరెస్టయి, 18 నెలలు కోరాపుట్టి, కడలూరు జైళ్ళలో నిర్బంధించబడ్డారు.

విడుదలై వచ్చిన తరువాత 1935లో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీలో చేరారు. మద్దూరి అన్నపూర్ణయ్య, పుచ్చలపల్లి సుందరయ్య, మద్దుకూరి చంద్రశేఖరరావు, తుమ్మల వెంకట్రామయ్య మున్నగువారితో పరిచయాలు ఏర్పడ్డాయి. అంతకుముందే 1934లో క్షయవ్యాధిపై డిప్లమో కోర్సు చేయడానికి మైసూరు వెళ్ళారు. అక్కడ వైద్య విద్యార్థినిగా వున్న కమలమ్మగారితో పరిచయం ఏర్పడింది. కమలమ్మగారి కుటుంబం మైసూరులో స్థిరపడిన తెలుగు కుటుంబం. ఆమె తండ్రి శ్రీ రామస్వామి నాయుడుగారు కందుకూరి వీరేశలింగంగారి అనుయాయులు. తమ కూతురిని రాజమండ్రి వీరేశలింగంగారి శరణాలయంలో వుంచి, వీరేశలింగం – రాజ్యలక్ష్మమ్మగార్ల సంరక్షణలో చదువు చెప్పించారు. బ్రహ్మసమాజ మతావలంబకులైన కమలమ్మగారికీ రామారావుగారికీ ఆశయాలు ఒక్కటే అవడంతో వారి పరిచయం ఆ తరువాత పరిణయంగా పరిణమించింది. కమలమ్మగారి చదువు పూర్తి అయ్యేంతవరకు ఆగి, ఆ తరువాతనే వారు దాంపత్య జీవితం ప్రారంభించారు.

తన వైద్యవృత్తి ప్రారంభించడానికి కావలసిన డబ్బుకోసం రామారావుగారు 1937లో రంగూన్ వెళ్ళి వైద్య వృత్తిద్వారా డబ్బు సంపాదించి జిల్లాలో హరిజనోద్యమం సాగించడానికి డబ్బు పంపేవారు. కొంత డబ్బు సంపాదించుకొని తిరిగి వచ్చిన తరువాత రామచంద్రపురంలో వైద్యవృత్తి మొదలుపెట్టారు. కమలమ్మగారు 1939లో మొదట రాజోలు తాలూకా వైద్య అధికారిణిగా ఉద్యోగం సంపాదించారు. తరువాత రామచంద్రపురం బదిలీ అయి, అక్కడే వారు ఇరువురు స్థిరపడ్డారు. రామారావుగారు కొన్నాళ్ళు కాకినాడలో కూడా హాస్పిటల్ నడిపి సోషలిస్టు పార్టీలో, కమ్యూనిస్టు పార్టీలో పనిచేసే కార్యకర్తలకు ఉచిత వైద్యం చేస్తుండేవారు. ఆవిధంగా వైద్య సేవలు పొందినవారిలో నవశక్తి పత్రిక సంపాదకవర్గంలో వున్న తుమ్మల వెంకట్రామయ్యగారు ఒకరు. వారికి క్షయవ్యాధి సోకినప్పుడు వారిని రామారావుగారు కాకినాడ తీసుకువచ్చి వారికి చికిత్సతోపాటు అన్నపానాదులు కూడా సమకూర్చేవారు. 1938 డిశంబరులో కాకినాడలో జరిగిన తూర్పు గోదావరి జిల్లా ప్రథమ విద్యార్థి మహాసభలో తుమ్మల వెంకట్రామయ్యగారు, దేవులపల్లి కృష్ణశాస్త్రిగారితోపాటు చెలికాని రామారావుగారు కూడా పాల్గొన్నారు.

## చారిత్రాత్మక రైతురక్షణ యాత్ర:

జమీందారీ విధానం రద్దు కోరుతూ ఇచ్ఛాపురం నుండి మద్రాసు వరకు కాలినడకన శ్రీ కొమ్మారెడ్డి సత్యనారాయణమూర్తిగారి నాయకత్వాన జరిగిన చరిత్రాత్మకమైన రైతురక్షణ యాత్ర జరిగినప్పుడు చెలికాని రామారావు, కంభంపాటి సత్యనారాయణ (సీనియర్), ఇనుగంటి నారాయణరావుగార్లు తూర్పుగోదావరిజిల్లాలో వేలాది రైతాంగాన్ని సమీకరించడంలో ప్రముఖ పాత్ర వహించారు. జమీందారీ

విధానానికి వ్యతిరేకంగా ఆంధ్ర దేశమంతటా రైతాంగ పోరాటాలకు ఆ రైతు రక్షణ యాత్ర ఎంతో ఉత్తేజాన్ని కల్గించింది. 1946లో జమీందారీ రద్దు బిల్లు చట్టం కావడానికి ఆ రైతురక్షణ యాత్ర దోహదం చేసింది.

## ఫాసిస్టు వ్యతిరేక ప్రజాయుద్ధం దశలో:

1939 సెప్టెంబరు 1వ తేదీన రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమైంది. సరిగా అదే రోజున కాకినాడలో 16వ ఆంధ్రరాష్ట్ర విద్యార్థి మహాసభ జరిగింది. సుభాష్‌చంద్ర బోసు సభను ప్రారంభించడానికి వచ్చారు. ఆ సభ జయప్రదం చేయడానికి స్థానిక కాంగ్రెస్‌వాదులు, కమ్యూనిస్టులు, చెలికాని రామారావుగారు అందరూ తోడ్పడ్డారు. ఆ తరువాత బ్రిటిష్ ప్రభుత్వ నిర్బంధ విధానం తీవ్రమైంది. అనేకమంది కమ్యూనిస్టులు, విద్యార్థి నాయకులు అరెస్టు చేయబడ్డారు. చాలామంది అజ్ఞాతవాసంలోకి వెళ్ళారు. అజ్ఞాతవాసంలో వున్న విద్యార్థి నాయకులకు, కమ్యూనిస్టులకు రామారావుగారు ఎంతో సహాయం చేశారు. ఈ వ్యాస రచయిత ఇదే కాలంలో డాక్టర్ రామారావుగారింట కొన్నాళ్ళు అజ్ఞాతవాసంలో వున్నారు.

1941 జూన్ 22న సోవియట్‌రష్యాపై హిట్లరు నాజీ సైన్యం బందిపోటు దాడి చేసింది. ఆనాటి యుద్ధం ఫాసిజానికి వ్యతిరేకంగా ప్రపంచ ప్రజాయుద్ధంగా మారింది. కమ్యూనిస్టులు యుద్ధ వ్యతిరేక వైఖరిని విడనాడి ఫాసిజాన్ని ఓడించేందుకు యుద్ధ అనుకూల వైఖరిని తీసుకున్నారు. అదే సమయంలో అంతిమ పోరాటంగా 1942 క్విట్ ఇండియా ఉద్యమాన్ని భారత జాతీయ కాంగ్రెస్ ప్రారంభించింది. ఫార్వర్డు బ్లాక్ నాయకుడు సుభాష్‌చంద్ర బోసు నాజీ జర్మనీ, ఫాసిస్టు ఇటలీ, సైనిక నియంతృత్వ జపాన్‌లతో కూడిన అక్షరాజ్యాల సహాయంతో భారతదేశాన్ని విముక్తి చేయాలనే పంథా అవలంబించారు. అంతవరకు బ్రిటిష్ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఏకోన్ముఖంగా వున్న వివిధ రాజకీయ పార్టీలు భిన్న వైఖరులు తీసుకున్న ఆ దశలో డాక్టర్ చెలికాని రామారావుగారు స్థూలంగా ఫాసిస్టు వ్యతిరేక ప్రజా యుద్ధ నినాదాన్ని అంగీకరించినా, సుభాష్‌చంద్ర బోస్ నిర్మించిన అజాద్ హింద్‌ఫౌజ్ పట్ల, కాంగ్రెస్ ప్రారంభించిన క్విట్ ఇండియా ఉద్యమం పట్ల అననుకూల వైఖరిని తీసుకోలేదు. ఆ విషయంలో పార్టీ విధానంతో ఆయన ఏకీభవించకపోయినా, అంతరంగిక రాజకీయ చర్చలకే పరిమితం చేశారు కాని బహిరంగ ప్రకటనలు చేయలేదు. క్విట్ ఇండియా ఉద్యమంలో అరెస్టయి జైలులో వున్న కాంగ్రెస్ వాదుల పట్ల సానుభూతి, సహాయ సహకారాలను అందించారు. 1942లోనే కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం తీసుకున్నారు. ఆ విధంగా కమ్యూనిస్టు ఉద్యమంలోని క్రమశిక్షణను పాటిస్తూనే తన అభిప్రాయ స్వాతంత్ర్యాన్ని నిలబెట్టుకున్నారు. అదే సమయంలో అనేక వ్యవసాయ కార్మిక పోరాటాలకు, పందలపాక మిల్లు కార్మికుల పోరాటాలకు అండదండలుగా నిలిచారు. శ్రీ పెదపాటి వెంకట్రావు, పాలచర్ల పనసరామన్న మొదలగువారితో కలిసి ఆ పోరాటాలు నిర్వహించారు.

కమ్యూనిస్టులు తమ ప్రజాసేవ కార్యక్రమాలకు ఆటంకం కలగకుండా పరిమిత సంతాన విధానాన్ని అవలంబించినప్పుడు ఆ విధానాన్ని జయప్రదం చేయడానికి

సంతాన నిరోధక ఆపరేషన్లు చేయడానికి రాష్ట్రంలో ముందుకు వచ్చిన ముగ్గురు డాక్టర్లలో డాక్టర్ చెలికాని రామారావుగారు ప్రథములు. మిగతా ఇద్దరు ఏలూరులో డాక్టర్ తిలక్, నిడదవోలులో డాక్టర్ వి.వి.ఎల్.ఎన్. రాజుగారు. 1946లో తమకు ఒక కుమారుడు (డాక్టర్ స్టాలిన్) కల్గిన తరువాత రామారావుగారు కూడా కుటుంబ నియంత్రణ విధానం అవలంబించారు.

1948–52 తీవ్ర నిర్బంధ కాలంలో అనేకమంది కమ్యూనిస్టు నాయకులతోపాటు డాక్టర్ రామారావుగారిని ప్రభుత్వం అరెస్టు చేసి కడలూరు జైలులో డిటెయిన్ చేసి నిర్బంధించింది. కడలూరు జైలులో నిరాయుధులైన కమ్యూనిస్టు ఖైదీలపై పోలీసులు కాల్పులు జరిపినప్పుడు కృష్ణాజిల్లా రైతు నాయకుడు అనుమర్లపూడి సీతారామారావు, మరికొందరు తెలంగాణా పోరాటయోధులు మరణించారు. జైలులో ఆ దుస్సాహస పోరాట విధానంతో విభేదించుతూనే రామారావుగారు తమ ప్రాణాలను లెక్కచేయకుండా గాయపడిన వారిని రక్షించడానికి తుపాకి గుండ్ల మధ్య వెళ్లి వారిని ప్రక్కకు తీసుకొనివచ్చి కట్లుకట్టి వైద్యం చేశారు.

## పార్లమెంటు సభ్యునిగా ఆస్పత్రిలో వుండే పోటీ:

1952లో తొలి జనరల్ ఎన్నికలు జరిగినపుడు తూర్పుగోదావరిజిల్లా కాకినాడ నియోజకవర్గం నుండి డాక్టర్ రామారావుగారు పోటీ చేయాలని పార్టీ నిర్ణయించింది. ప్రజాపార్టీ అభ్యర్థి బులుసు సాంబమూర్తిగారిని, కాంగ్రెస్ అభ్యర్థి మొసలికంటి తిరుమలరావుగారిని ఓడించి, డాక్టర్ రామారావుగారు లోక్‌సభకు ఎన్నికయ్యారు. అనారోగ్యం వలన మద్రాసులోని తాంబరం ఆసుపత్రిలో డాక్టర్ రామారావుగారు వుండగానే ఈ ఎన్నిక జరిగింది. ఎన్నికల ప్రచారాలలో కూడా వారు పాల్గొనకపోయినా కాకినాడ నియోజకవర్గ ప్రజలు రామారావుగారిని గెలిపించారు. 1948–52 మధ్య కాంగ్రెస్ ప్రభుత్వం అవలంబించిన ఘోర దమనకాండకు వ్యతిరేకంగా ప్రజలు తమ తీర్పు యిచ్చి, కమ్యూనిస్టులను ఆంధ్ర ప్రాంతంలో ప్రథమ పార్టీగా ఎన్నుకొన్నారు. కాంగ్రెస్ మంత్రులను పేరు పేరునా ఓడించారు. తెలంగాణా ప్రాంతంలో శ్రీ రావి నారాయణరెడ్డిగారిని దేశంలోని అత్యధిక ఓట్ల మెజారిటీతో గెలిపించారు. నెహ్రూగారికంటే రావి నారాయణరెడ్డిగారికే అత్యధిక ఓట్లు వచ్చాయి. కమ్యూనిస్టులు ఆ దశలో దుస్సాహస విధానాలను, సెక్టేరియన్ విధానాలను అవలంబించనప్పటికి తాము నమ్మిన సిద్ధాంతం కోసం ప్రాణాలు సైతం తృణప్రాయంగా అర్పించిన కమ్యూనిస్టుల చిత్తశుద్ధికి, అంకితభావానికి ప్రజలు వారికి ఓటువేసి కాంగ్రెస్‌ను ఓడించారు.

## డాక్టర్ రామారావుగారి చిత్తశుద్ధి:

1952 ఎన్నికలలో మద్రాసు రాష్ట్రంలో కాంగ్రెస్ మైనారిటీలో పడింది. ప్రజాపార్టీ, కృషికార్‌లోక్‌పార్టీ, కమ్యూనిస్టు పార్టీ కలిసి ఒక ఐక్యసంఘటనగా ప్రభుత్వం ఏర్పాటు చేయడానికి అవకాశం యివ్వవలసిందిపోయి, కృషికార్ లోక్‌పార్టీని చీల్చి కొంతమందిని తమవైపునకు తెచ్చుకొని, శ్రీ రాజగోపాలాచారిని కౌన్సిల్‌కు నామినేట్ చేయించి, వారిని ఉమ్మడి మద్రాసు రాష్ట్ర ముఖ్యమంత్రిగా చేశారు. అదేవిధంగా

కర్నూలులో ప్రత్యేకాంధ్ర రాష్ట్రం ఏర్పడినప్పుడు కమ్యూనిస్టులు మెజారిటీగా వున్నప్పటికీ, ఐక్యసంఘటన నాయకుడుగా వున్న శ్రీ టంగుటూరి ప్రకాశంగారిని కాంగ్రెస్ అసోషియేట్ సభ్యునిగా చేర్చుకొని ఆయనను ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రిగా చేశారు. ప్రకాశం మంత్రివర్గం కర్నూలులో ఓడిపోయినప్పుడు ప్రతిపక్ష నాయకుడు శ్రీ తరిమెల నాగిరెడ్డిని ప్రభుత్వం ఏర్పాటు చేయవలసిందిగా ఆహ్వానించకుండా గవర్నరు పాలన విధించారు. ఆ సందర్భాలలో పండిట్ నెహ్రూ ప్రధానిగా అవలంబించిన అప్రజాస్వామిక చర్యలను, నెహ్రూపట్ల ఎంత గౌరవం వున్నప్పటికీ డాక్టర్ రామారావుగారు పార్లమెంటులో తీవ్రంగా ఎదుర్కొన్నారు. 'ఇది ప్రజాస్వామ్య విధానానికి భవిష్యత్తులో తీరని ముప్పు కల్గిస్తుం'దని రామారావుగారు అప్పుడే హెచ్చరిక చేశారు. 1955 మధ్యంతర ఎన్నికలలో కమ్యూనిస్టులను అధికారంలోకి రాకుండా చేయడానికి కాంగ్రెస్ నాయకత్వం అవలంబించిన కుతంత్రాలను కూడా డాక్టర్ రామారావుగారు ఖండించారు.

## పార్లమెంటులో ఆదర్శకృషి:

పార్లమెంటులో శ్రీ రామారావుగారు అన్ని జాతీయ, అంతర్జాతీయ సమస్యలపై పార్టీ దృక్పథాన్ననుసరించి ఎంతో సమర్థవంతంగా చర్చలలో పాల్గొని అనేక నిర్మాణాత్మక సూచనలు చేసేవారు. స్వాతంత్ర్యానంతరం జాతీయ పునర్నిర్మాణం ప్రధాన కర్తవ్యంగా ఎంచి, వివిధ రంగాలలో అభివృద్ధి కార్యక్రమాలకు అనేక సూచనలు చేశారు. తన రాజకీయ జీవితం ప్రారంభం అయినప్పటినుండి ప్రజలతో నిత్య సంబంధాలు కల్గివుండటంచేత వివిధ వర్గాల ప్రజల సమస్యలతో ఆయన ప్రత్యక్ష అనుభవం కల్గి, వారి పురోభివృద్ధికి ఎన్నో విలువైన సూచనలు చేయగల్గేవారు.

1923లో కాకినాడలో జరిగిన కాంగ్రెస్ మహాసభలో సేవాదళ్ వాలంటీరు కెప్టెన్‌గా మొత్తం సభనంతను సమర్థవంతంగా నిర్వహించిన డాక్టర్ రామారావుగారి నిర్మాణ దక్షతను, అంకితభావాన్ని, సేవా భావాన్ని పండిట్ నెహ్రూ ప్రత్యక్షంగా చూశారు. అందుచేత పార్లమెంటులో శ్రీ రామారావుగారు చేసే ప్రతీ ప్రసంగాన్ని ప్రతీ సూచనను ప్రధానిగా నెహ్రూ ఎంతో శ్రద్ధతో ఆలకించి, ఎంతో గౌరవ భావంతో చూసి, ఎంతో విలువ యిచ్చేవారు. ముఖ్యంగా శ్రామిక ప్రజల సమస్యలను ఎంతో నేర్పుగా డాక్టర్ రామారావుగారు ప్రతిబింబించేవారు. దేశంలో, ఆంధ్రరాష్ట్రంలోను అపారంగా వున్న ప్రకృతి వనరుల వినియోగం, పారిశ్రామికీకరణ, నదీజలాల పంపకానికి ట్రిబ్యునల్, నందికొండ, నాగార్జునసాగర్, తుంగభద్ర, వంశధార ప్రాజెక్టుల సత్వర నిర్మాణం, దున్నేవానికే భూమి పంపకం, కాకినాడ, మచిలీపట్నం రేవుల అభివృద్ధి, వ్యవసాయ కార్మికులకు కనీస వేతనాలు, దేశానికి స్వతంత్ర ఆర్థిక వ్యవస్థ, స్వావలంబన మొదలైన అనేక సమస్యలపై డాక్టర్ రామారావుగారు ఎన్నో విలువైన సూచనలు చేసే ప్రధాని నెహ్రూ ప్రభృతుల మన్ననలు పొందగల్గారు. 'పార్లమెంటు సభాభవనంలో పొగ త్రాగకూడదు' అనే నియమం పెట్టడానికి డాక్టర్ రామారావుగారి సూచన ప్రధాన కారణం.

అల్లూరి సీతారామరాజు మన్యం విప్లవంలో పాల్గొని, ఆనాటి వరకు సజీవులుగా మిగిలివున్న గాం మల్లుదొర విద్యావంతులు కాకపోవడం వలన రకరకాల అలవెన్సులు యివ్వకుండా అధికారులు మోసం చేస్తే, ఆ విషయం తెలపడానికి ప్రధాని నెహ్రూ వద్దకు మల్లు దొరను స్వయంగా తీసుకువెళ్ళి ఆయనకు తగు న్యాయం చేకూర్చారు. రైలుకట్టకు అటు యిటు వున్న యిళ్ళపై రైలు ఇంజన్ పొగగొట్టంలోంచి నిప్పురవ్వలు పడి యిళ్ళు దగ్ధమయ్యేవి. అది స్వల్ప విషయంగా భావించి ఎవరూ పట్టించుకొనేవారు కాదు. రామారావుగారు ఆ సమస్యను పార్లమెంటులో ప్రస్తావించి, నివారణోపాయాలు, నష్టపరిహారాల సమస్యలను సూచించి, అన్ని పార్టీల వారి మన్ననలు పొందారు.

## భూ సంస్కరణల ప్రాధాన్యత గురించి:

భూ సంస్కరణలు అమలుజరిపి దున్నేవానికే భూమి పంచకపోతే గ్రామీణ ప్రాంతాలలో నూటికి 70 మందిగా వున్న వ్యవసాయ కార్మికులు, కౌలుదార్లు, పేద రైతాంగం పరిస్థితులు బాగుపడవనీ గ్రామీణ దారిద్ర్యం తొలగదనీ కాంగ్రెస్‌లో తిష్టవేసిన జమీందార్లు, భూస్వాములు భూసంస్కరణలను అడ్డం కొడతారనీ, వారిని ప్రతిఘటించనిదే భూసంస్కరణలు జయప్రదంగా అమలు జరగవనీ పార్లమెంటులో అనేకసార్లు రామారావుగారు హెచ్చరించారు. పార్లమెంటులో హెచ్చరికలు చేయడంతో వూరుకోక రామచంద్రపురం తాలూకాలో, ఇతర ప్రాంతాలలో వ్యవసాయ కార్మికుల, కౌలుదార్ల పోరాటాలకు స్వయంగా నాయకత్వం వహించారు. ఆ విధంగా పార్లమెంటరీ వేదికను ప్రజా పోరాటాలకు జోడించడంలో కృతకృత్యులయ్యారు. పార్లమెంటరీ పదవులు పదవులకోసంకాక ప్రజా పోరాటాలను ముందుకు తీసుకొనిపోవడానికేనన్న కమ్యూనిస్టు పార్టీ సూత్రీకరణను ఆచరణలో అమలుజరిపి మార్గదర్శకులయ్యారు.

## విదేశీ మందుల కంపెనీల దోపిడీకి వ్యతిరేకంగా:

పార్లమెంటులో మరొక ప్రధాన సమస్యపై డాక్టర్‌గా శ్రీ రామారావు తీవ్ర పోరాటం చేశారు. అది విదేశీ మందుల కంపెనీల దోపిడీకి వ్యతిరేకంగా. మందులలో విదేశీ గుత్త కంపెనీల ఆధిపత్యాన్ని తొలగించి స్వయం పోషకత్వం సాధించడానికి గాను ప్రభుత్వ రంగంలో ఐ.డి.పి.ఎల్. స్థాపనకు, పింప్రీలో పెన్సిలిన్ కర్మాగారం స్థాపనకు, తదితర చర్యలకు ఆ పోరాటం దోహదం చేసింది. ఇంగ్లీషు వైద్యంతో పాటు ఇతర దేశీయ వైద్యాలకి తగిన ప్రోత్సాహం కలిగించాలని, అందుకు దేశీయ వైద్య విధానాన్ని రూపొందించాలని డాక్టర్ రామారావు అనేక సూచనలు చేశారు. అదే సమయంలోనే డాక్టర్ రామారావుగారు భారత చైనా మిత్రమండలి వ్యవస్థాపక సభ్యులుగా వుంటూ, పార్లమెంటరీ ప్రతినిధివర్గ సభ్యునిగా చైనాలో పర్యటించారు. మావో సే టుంగ్‌ను కలుసుకొన్నారు. అయితే, 1962లో భారతదేశంపై చైనా దండయాత్ర చేసినప్పుడు దానిని ఖండించడానికి వెనుకంజ వేయలేదు.

## సాంఘిక సంస్కరణలకై కృషి:

డాక్టర్ రామారావుగారు ఫ్యూడల్ సంప్రదాయాలతో మర్యాదలతో పురాతన కట్టుబాట్లతో నిండిన వెలమదొరల కుటుంబం నుండి వచ్చినప్పటికే తన చిన్నతనం నుండి అటువంటి ఫ్యూడల్ రాచరిక సంప్రదాయాల నుండి తమ కుటుంబాలు, బంధువులు బైటపడాలనీ కృషి చేస్తూ వచ్చారు. తమ యింట స్త్రీలను ఘోషా వదిలిపెట్టి, చదువులు చదువుకొని, విద్యావిజ్ఞానాలు పెంపొందించుకోవాలని చెప్పి స్వయంగా ఆచరించారు. తమ అన్నగారి కుమార్తె శ్రీమతి లక్ష్మీకాంతమ్మను తొలిసారిగా కాలేజీలో చదివించి గ్రాడ్యుయేషన్ చేసి, వర్ణాంతర వివాహం చేశారు. తమ సోదరి కుమార్తెను మొదటి మెడికల్ గ్రాడ్యుయేట్‌ను చేసి వారికి కూడా వర్ణాంతర వివాహం చేశారు. డాక్టర్ రామారావుగారు చేసుకున్నది కూడా వర్ణాంతర వివాహమే. బ్రహ్మ సమాజమతం, వీరేశలింగంగారి సంఘ సంస్కరణోద్యమం, ఆ తరువాత జాతీయోద్యమం, కమ్యూనిస్టు ఉద్యమాలు డాక్టర్ రామారావుగారి సంఘసంస్కరణోద్యమానికి స్ఫూర్తినిచ్చాయి. స్వాతంత్ర్య సమరయోధులు, సహచరులు అయిన పుత్సల సత్యనారాయణగారి తోడ్పాటు ఆ విషయంలో రామారావుగారికి లభించింది. పార్లమెంటులో హిందూకోడ్ బిల్లు చర్చకు వచ్చినప్పుడు, సనాతనుల ప్రతిఘటనను ఎదుర్కొని, బిల్లును చట్టంగా చేయడంలో రామారావుగారు కృషిచేశారు. స్త్రీలకు ఆస్తి హక్కు వుండాలనీ, తండ్రి ఆస్తిలో కుమారులతోబాటు కుమార్తెలకు జన్మతహా ఆస్తి హక్కు సంక్రమింపచేయాలనీ, అలాగే భర్త ఆస్తిలో బిడ్డలతో పాటు భార్యకు హక్కు వుండాలనీ, స్త్రీ స్వాతంత్ర్యానికి మూలం ఆర్థిక స్వాతంత్ర్యమేనని ఆ సందర్భంలో వాదించారు. ఆశించినంత కాకపోయినా హిందూ కోడ్ బిల్లు స్త్రీలకు కొన్ని హక్కులనైనా యిచ్చే విధంగా డాక్టర్ రామారావుగారు కృషిచేసి తాము పార్లమెంటు సభ్యులుగా వుండగానే చట్టంగా రూపొందించడానికి తోడ్పడ్డారు.

## మానవతామూర్తిగా:

రాజకీయ, సిద్ధాంత విభేదాలతో ప్రమేయం లేకుండా కాంగ్రెస్, కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, కమ్యూనిస్టు పార్టీలలో వుండే కార్యకర్తలను, వారి కుటుంబాలను డాక్టర్ రామారావుగారు ఎంతో ఆదరాభిమానాలతో చూస్తూ, వారి కష్టసుఖాలను పంచుకుంటూ కమ్యూనిస్టుగా మార్క్స్, లెనిన్‌లు చెప్పిన పరిపూర్ణ మానవతా దృక్పథంతో తన యావజ్జీవితము గడిపారు. క్విట్ ఇండియా ఉద్యమ సమయంలో, కమ్యూనిస్టు పార్టీ తీవ్ర నిర్బంధ కాలంలో ఆయా కార్యకర్తలకు, వారి కుటుంబాలకు తన శాయశక్తులా ఆర్థిక సహాయం, వైద్య సహాయం అందించారు. ఆయా పార్టీలలో క్రమశిక్షణ తప్పకుండానే, రాజకీయ భేదాభిప్రాయాలు ఎన్ని వచ్చినప్పటికీ సామరస్య పూర్వకంగా సంయమనంతో వాటిని పరిష్కరించుకుంటూ ఆదర్శవంతంగా మెలగేవారు. అందుచేతనే అన్ని పార్టీలలోని దేశభక్తులందరి ప్రేమాభిమానాలను పొంది, అజాత శత్రువుగా అందరి మన్ననలు చూరగొన్నారు. దేశభక్తి, చిత్తశుద్ధి, నిరాడంబరత, మానవత మూర్తీభవించిన డాక్టర్ చెలికాని రామారావుగారు నిండు జీవితం గడిపి, 1985 సెప్టెంబరు 25వ తేదీన రామచంద్రపురంలో కన్నుమూశారు.

లెనిన్ చెప్పిన విధంగా "ఈ నా జీవితం వ్యర్థం కాలేదు; మానవాళి సేవలో సార్థకత చెందింది" అన్న సంతృప్తితో 1922లో వారు వ్రాసిన గృహత్యాగపత్రం సాక్షిగా వారి చివరి రోజులు గడిచాయి.

గాంధీజీ నిరాడంబరత, లెనిన్ విప్లవ దీక్ష తమ జీవితాదర్శంగా వారు తీసుకున్నారు. ఒక్కమాటలో జాతీయోద్యమం, కమ్యూనిస్టు ఉద్యమం నిర్మించిన ఉత్తమ విలువలను, సుసంప్రదాయాలను డాక్టర్ చెలికాని రామారావుగారు పెంపొందించి ఆచరించి చూపారు.

నిష్కళంక దేశభక్తునిగా, ఆదర్శ కమ్యూనిస్టుగా, మహోన్నత మానవతా మూర్తిగా తన యావజ్జీవితము దేశ స్వాతంత్ర్యంకోసం, కష్టజీవుల విముక్తి కోసం, సమసమాజ నిర్మాణ లక్ష్యంకోసం ధారపోసిన మహనీయుడు డాక్టర్ చెలికాని రామారావుగారు.

★ ★ ★

# కీ.శే. దరిశి చెంచయ్య



కీ.శే. దరిశి చెంచయ్య గారు నెల్లూరు జిల్లా వాసి. ఉన్నత విద్యాభ్యాసానికి అమెరికా వెళ్ళారు. అక్కడ గదర్ (విప్లవం) పార్టీలో చేరి పని చేశారు (1912–15). యుద్ధకాలంలో (1914–18) భారతదేశాన్ని విముక్తి చేసేందుకు ఆ పార్టీ రూపొందించిన పథకంలో వీరికి కూడా పాత్ర ఉంది. బర్మాను విముక్తి చేయడానికి పంపబడ్డ ఎనిమండుగురిలో వీరొకరు. కాని, బర్మా చేరకముందే వీరు సయాంలో అరెస్టు చేయబడ్డారు. వివిధ జైళ్ళలో $4\frac{1}{2}$ సంవత్సరాలు డెటెన్యూగా ఉండి, 1919లో విడుదల చేయబడ్డారు. విడుదల అనంతరం 1935 వరకు సంఘ సంస్కరణోద్యమాల్లో పని చేశారు. (వితంతు వివాహాలు, అనాధ శిశు రక్షణ, పడుపువృత్తి నిర్మూలన, హరిజనోద్ధరణ వగైరా).

1935లో మద్రాసులో ఉండగా షెర్వుడ్ ఎడ్డీ రచించిన రెండు పుస్తకాలు వీరిని ప్రభావితం చేశాయి. అవి: "రష్యా సవాలు", "నేటి రష్యా." ప్రపంచంలోకల్లా రష్యాలోనే ఏసుక్రీస్తు బోధలు అమలు జరుగుతున్నాయనేది ఆ రచయిత అభిప్రాయం. 1936లో విశాఖపట్నంలో ఉండగా, చంద్ర రాజేశ్వరరావుగారు బెనారస్ విశ్వవిద్యాలయంలో విద్య నభ్యసించి విశాఖపట్నం వచ్చారు. మెడికల్ విద్యార్థిగా వుంటూ పార్టీ పనిచేసేవారు. చెంచయ్యగారు మార్క్సిస్టు గ్రంథాలను అధ్యయనం చేసి, మొదట కాంగ్రెసు సోషలిస్టు పార్టీలోనూ, తరవాత కమ్యూనిస్టు పార్టీలోనూ చేరారు. 1936 సెప్టెంబరులో రాజమండ్రిలో జరిగిన ఆం. రా. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ మహాసభకు వీరూ, వీరి భార్య సుభద్రమ్మగారూ ప్రతినిధులుగా వెళ్ళారు. సుభద్రమ్మగారు గాంధీజీ స్థాపించిన హరిజన సేవాసంఘంలో ముఖ్యకార్యకర్తగా ఉండేవారు. ఎంగెల్స్ రచించిన "సోషలిజం : ఊహాజనితం, శాస్త్రీయం" అనే గ్రంథాన్ని తెలుగులోకి అనువదించారు. ఉభయులూ మద్రాసు కార్మికోద్యమంలో పనిచేశారు. సామ్రాజ్యవాద యుద్ధదశలో చెంచయ్యగారు డెటెన్యూగా నిర్బంధించబడ్డారు.

# అమరజీవి కామ్రేడ్ ఉద్దరాజు రామం

- అల్లూరి సత్యనారాయణ

## మొగ్గతొడిగిన స్వాతంత్ర్య భావాలు:



పశ్చిమ గోదావరి జిల్లా పాలకొల్లు వద్దగల వాలమర్రు గ్రామంలో 1910 అక్టోబరు నెలలో పద్మనాభరాజు, బంగారమ్మ గార్లకు నాల్గవ సంతానంగా రామంగారు జన్మించారు. (మొత్తం 9 మంది సంతానం.) వాలమర్రులోనే ప్రాథమిక విద్యను అభ్యసించారు. అక్కడి స్కూలుకు ఎవరో దాతలు పుస్తకాలు పంపిస్తే మీలో ఆసక్తిగలవారు ఒకరిద్దరు తప్ప ఈ పుస్తకాలు చదవలేరని టీచర్లు అన్నారట. దానితో పట్టుదలతో ఆ పుస్తకాలన్నీ రామంగారు చదివేశారు. అందులో వివేకానందుని బోధనలు రామంగార్ని ఆకర్షించాయి. అపుడు ఓ భజన బృందంలో రామంగారు సభ్యులుగా వుండేవారు. ఈ బృందం గ్రామాలలో భజనలు చేస్తూ కొంత డబ్బు కూడబెట్టింది. ఈ సొమ్మును గుడికట్టించడానికి ఉపయోగించాలా లేక, గ్రంథాలయం ఏర్పాటు చెయ్యాలా?! అని ఆ బృందంవారు తర్జన భర్జనలు పడ్డారు. రామంగారు మరికొందరు మిత్రులు గ్రంథాలయం కోసం పుస్తకాలు కొనాలని పట్టుపట్టడంతో అదే చివరకు నెరవేరింది. ఆ గ్రంథాలయంలో వున్న పురాణాలను, ఇతిహాసాలను రామంగారు అధ్యయనం చేశారు.

తండ్రి కాంగ్రెస్‌వాది కావడం, కాంగ్రెస్ నాయకులు ఇంటికి వస్తూపోతూ వుండడంతో వారి ప్రభావం ఆయనపై ప్రగాఢమైన ముద్ర వేసింది. తండ్రి వ్యవసాయంలో క్రొత్త పద్ధతుల ననుసరించడంవల్ల వ్యవసాయంపై ఆసక్తి కలిగింది.

అల్లూరి సీతారామరాజు దేశభక్తి, విప్లవ చర్యలు విని ఉత్తేజితులైనారు. రావికుదురులోని ప్రాథమిక ఉన్నత పాఠశాలలో చదివే కాలంలో అక్కడి ప్రధానోపాధ్యాయుడు బండారు కృష్ణయ్యగారు చెప్పిన దేశభక్తియుత పాఠాలు రామంగారిపై చెరగని ముద్ర వేశాయి. ఆనాటి సహాయ నిరాకరణోద్యమ ప్రభావంతో వీరవాసరం హైస్కూల్‌లో ఆంగ్ల విద్య చదవడానికి నిరాకరించి, హిందీ నేర్చుకోవడానికి 'కాశీ' బయలుదేరి వెళ్ళారు. కానీ అక్కడ చదువు సాధ్యం కాలేదు. స్వాతంత్ర్య ఉద్యమంలో చేరడంవల్ల తరువాత స్కూలు విద్యను కొనసాగించలేకపోయారు. ఉద్యమకాలంలో జైళ్ళలోనూ ఆయన హిందీ, ఇంగ్లీషు భాషలను అభ్యసించారు.

## వివాహం, ఉద్యమ ప్రవేశం:

తండ్రి రామంగారితో సంప్రదించకుండా మాణిక్యాంబగారితో వివాహాన్ని కుదిర్చారు. జాతీయ ఉద్యమంలో పాల్గొనాలంటే వివాహం అడ్డంకి కాబట్టి వివాహం చేసుకోవడానికి రామంగారు అడ్డం తిరిగారు. తరువాత అన్నగారు ఒప్పించడంతో సమస్య పరిష్కారం అయ్యింది. వివాహం అయిన మూడోరోజే ఆయన నర్సాపురం వద్దగల మూలపర్రులో జరుగుతున్న ఉప్పు సత్యాగ్రహ శిబిరంలో చేరిపోయారు. ఈ శిబిరంలో వుండగానే గాంధీజీని అరెస్ట్ చేసినట్లు వార్త వచ్చింది. ఈ సందర్భంగా ఆశ్రమవాసులు మరింత దృఢదీక్షతో ఉద్యమంలో పాల్గొంటామని, తమకు వున్న సిగరెట్లు, చుట్ట, కాఫీ త్రాగడం వంటి దురలవాట్లను వదులుకొంటామని ప్రతిజ్ఞలు చేశారు. అపుడు రామంగారు "నాకు ఏ దురలవాట్లు లేవు, గాంధీగారిని అరెస్టు చేయడం అన్యాయం, స్వాతంత్ర్య సాధనకు కృషి చేస్తా"నన్నారు. తన గురించి అంత ధీమాగా చెప్పగల్గిన రామంగారు అదే శిబిరంలో వున్న సుందరయ్యగార్ని ఆకర్షించారు. అపుడే వారిద్దరి పరిచయం కూడా ఏర్పడింది.

1930 మే నెలలో ఆ శిబిరంలోనే రామంగారు అరెస్టు చేయబడ్డారు. రాయవెల్లూరు జైలులో 8 నెలలు జైలు శిక్షను అనుభవించారు. 1932లో మాణిక్యాంబగార్ని కాంగ్రెస్ వాలంటీర్‌గా చేర్చారు. ఆ ఉదంతం వాలమర్రు పరిసర గ్రామాలలో పెద్ద సంచలనం కలిగించింది. ఆ సందర్భంగా జరిగిన వాగ్వివాదంలో తండ్రి ఆగ్రహించి రామంగారికి, ఆయన అన్నగారికి కూడా బెత్తం దెబ్బలు తగిలించారు. తరువాత కోపం తగ్గాక బాధపడ్డారు కూడా. అప్పటి నుంచి వారి జీవిత సహధర్మచారిణి మాణిక్యాంబగారు జీవితంలో చివరి వరకూ ఉద్యమాలలో చేదోడువాదోడుగా నిలిచి, కష్టాలను ఎదిరించి, జైలు శిక్షలు కూడా అనుభవించి, ఆదర్శ మహిళగా పేరుపొందారు.

## బర్మా రహస్య సాహసిక యాత్ర:

ఉద్దరాజు రామంగారి జీవిత చరిత్రలో ఒక గొప్ప సాహసిక ఘట్టం సుభాష్‌చంద్ర బోస్ 1936లో రచించిన భారత స్వాతంత్ర్య సమరం (Indian struggle for Freedom)ను అచ్చువేయించడానికి రహస్యంగా బర్మా వెళ్ళిన ఘట్టం. శ్రీ కలిదిండి సుబ్బరాజు, శ్రీ కస్తూరి సూర్యప్రకాశరావు, శ్రీ వెంకట్రావు అనేవారలతో కలిసి రామంగారు రంగూన్ వెళ్ళి, అక్కడ ప్రవాసాంధ్రుల సహాయంతో పుస్తకం అచ్చువేసి

బర్మా–భారత సరిహద్దుల్లోంచి బ్రిటిష్ సి.ఐ.డి.ల కన్నుగప్పి, దుర్గమారణ్యంలో చావు దప్పి బ్రతికి బైటపడి, ఎలాగో స్వదేశం చేరారు. ఆ గ్రంథాన్ని శ్రీ కాళీపట్నం కొండయ్యగారు తెలుగులోకి అనువదించారు.

## కమ్యూనిస్టు భావాలు నాటుకొన్న వేళ:

1930లో రాయవెల్లూరు జైలులో నిర్బంధంలో వున్న కాలంలో ఆయన జాన్ రీడ్ రచించిన "ప్రపంచాన్నే కుదిపివేసిన ఆ పది రోజులు" అనే గ్రంథాన్ని చదివి మొదటిసారిగా కమ్యూనిజం గురించి, అది సాధించిన విజయాల గురించి తెలుసుకొని, వాటివైపు ఆకర్షించబడ్డారు. 1931–32 కాలంలో కాంగ్రెస్ మితవాద పోకడలను నిరసిస్తూ టెర్రరిస్ట్ భావాలను కూడా కలిగి ఉండేవారు. "వీర భారతి" అనే నిషిద్ధ పత్రికను కూడా పంపిణీ చేసేవారు. 1932లో వాడపల్లిలో జరిగిన రథోత్సవంలో ప్రజలపై కాల్పులు జరిపిన డి.ఎస్.పి. ముస్తాఫాలీఖాన్‌ను మట్టుపెట్టాలని కొందరు మిత్రులతో కలిసి పథకం పన్నారు. అతను రానందువల్ల ఆ ప్రయత్నం విరమించుకొన్నారు. తరువాత టెర్రరిస్ట్ భావాల నుంచి తెంచుకొని పూర్తిగా కమ్యూనిస్టు ఉద్యమం వైపు నిలబడ్డారు. ఈ కాలంలోనే సుందరయ్యగారు పంపిణీ చేసిన 'కమ్యూనిస్టు ప్రణాళిక', 'కూలి, శ్రమ, పెట్టుబడి' మొదలైన గ్రంథాల అనువాద వ్రాతప్రతులను చదివి ప్రచారం చేశారు.

1934లో జిల్లాస్థాయి కమ్యూనిస్టు శాఖ భీమవరంలో ఏర్పడింది. ఆ శాఖలో సభ్యులుగా వుంటూ, జిల్లాలో కమ్యూనిస్టు భావ వ్యాప్తికి ప్రధానపాత్ర నిర్వహించారు. ఆ కాలంలోనే కాంగ్రెస్ కార్యకలాపాలలో చురుగ్గా పాల్గొంటూ, శ్రీమతి నల్లీసేన్ గుప్తా అధ్యక్షతన కలకత్తాలో జరిగిన అఖిల భారత కాంగ్రెస్ మహాసభలకు ప్రతినిధిగా వెళ్ళారు. అక్కడి ప్రభుత్వం హౌరా జైలులో కొంతకాలం బంధించింది. ఆ కాలంలో రామంగారు గ్రామగ్రామానా యువజన సంఘాలు ఏర్పాటు చేసి, పుస్తకాలు పఠనం, అధ్యయనం చేయించేవారు. రాత్రిపూట గ్రామాలలో దీపాలు తీసుకొనివెళ్లి 'అమ్మ' వంటి ఉత్తేజపూరితమైన నవలలు యువకులకు చదివి వినిపించేవారు.

## రైతాంగ ఉద్యమాలలో:

ఆనాడు కమ్యూనిస్టులు జాతీయ ఉద్యమాన్ని మరింత ముందుకు తీసుకుపోవాలనే ఉద్దేశ్యంతో కాంగ్రెస్ పార్టీలోనే పనిచేస్తూ అతివాదులుగా వుండేవారు. 1938 కాలంలో దేశం అంతటా జమీందారీ వ్యతిరేక పోరాటాలు ముందుకు వచ్చాయి. రామంగారు జిల్లాలో జరిగిన అన్ని రైతాంగ పోరాటాలలోనూ పాల్గొన్నారు. కాళీపట్నం, కానూరు, పెండ్యాల, బుచ్చంపేట వంటి పోరాటాలు అనేకం జిల్లాలో జరిగాయి. ఇందులో ముఖ్యంగా కాళీపట్నం రైతాంగ పోరాటం చెప్పుకోతగ్గది. విశాలమైన ఎర్రభూములను జమీందారు ఉచితంగా కాజేయాలనే యత్నాన్ని ప్రజలు ప్రతిఘటించారు. ఆ పోరాటానికి ఆనాటి నర్సాపురం తాలూకా కాంగ్రెస్ కమిటీ నాయకత్వం వహించింది. రామంగారు దానికి అధ్యక్షులుగా వుండేవారు. ఆ పోరాటకాలంలో సత్యాగ్రహాలు ఉధృతంగా జరిగాయి. వందలాదిమంది కార్యకర్తలు అరెస్ట్ చేయబడ్డారు. చాలామంది

జైలుకు వెళ్ళారు. అప్పటి రాష్ట్ర కాంగ్రెస్ అధ్యక్షులు పట్టాభి సీతారామయ్యగారు ఆ అతివాద పోరాట పద్ధతులను వ్యతిరేకిస్తూ గాంధీజీకి రిపోర్టు చేశారు. గాంధీజీ తాలూకా కాంగ్రెస్ నాయకత్వాన్ని మందలిస్తూ "హరిజన్" పత్రికలో ఓ సంపాదకీయం కూడా వ్రాశారు.

## విప్లవ ఉద్యమ పథంలో:

రెండో ప్రపంచ యుద్ధకాలంలో (1940-42) అజ్ఞాతవాసంలో గడుపుతూ ఉద్యమాన్ని నిర్మించారు. 1943-44లలో సంవత్సరంపాటు జైలులో ప్రభుత్వం నిర్బంధించింది. స్వాతంత్ర్యం అనంతరం తెలంగాణాలో రైతాంగ పోరాటం ఉధృతంగా ప్రారంభమైంది. దానికి నాయకత్వం వహిస్తున్న కమ్యూనిస్టు పార్టీని ఆంధ్ర ప్రాంతంలో కూడా నిషేధించారు. అనేకమంది కార్యకర్తలను, నాయకులను పోలీసులు కాల్చివేశారు. 1948-52లో రామంగారు అజ్ఞాతవాసంలో వుంటూ రహస్యంగా ఉద్యమాన్ని నిర్మించారు. ఆ సందర్భంగా పాలమూరు గ్రామంలో ఓ సంఘటన జరిగింది. కమ్యూనిస్టు నాయకులను కనిపిస్తే కాల్చివేసే రోజులవి. ఒక పోలీస్ గ్రూప్ రామంగార్ని పట్టుకున్నారు. కానీ ఇన్‌స్పెక్టర్‌కు రామంగారని తెలియదు. ఆ గ్రామంలో బహిరంగంగా సంకెళ్ళు వేసి తీసుకువెళుతుంటే విషయం గ్రామప్రజలు గ్రహించి, ఓ పెళ్ళిదండులాగా వచ్చి పోలీసులపై పడి రామంగార్ని విడిపించుకొని పోయారు. ఆ సంఘటనతో ఆగ్రహించిన పోలీసులు ఆ గ్రామంలో పోలీస్ క్యాంప్ పెట్టి కాంగ్రెస్‌వారితో సహా ప్రజలందరినీ వివిధ రకాల చిత్రహింసల పాల్జేశారు. ప్రజలు తమ ప్రియతమ నాయకుని రక్షించుకొన్న ఆనందంలో ఆ కష్టాలన్నీ మౌనంగా భరించారు. అంత ప్రజాదరణ రామంగారికి వుండేది.

## ప్రజానాయకునిగా సమున్నత స్థానాలలో:

1935 సంIIలలో జిల్లా కాంగ్రెస్ యువజన విభాగానికి అధ్యక్షునిగానూ, నర్సాపురం తాలూకా కాంగ్రెస్ పార్టీ అధ్యక్షునిగానూ ఎన్నికయ్యారు. 1935 నుంచి 51 వరకు అవిభక్త కమ్యూనిస్టు పార్టీ జిల్లా కార్యదర్శిగానూ, రాష్ట్ర కమిటీ సభ్యులుగానూ పనిచేశారు. 1964లో సి.పి.ఐ. (ఎం) పార్టీ ఏర్పడిన నాటినుండీ రాష్ట్ర కార్యదర్శివర్గ సభ్యులుగా చివరి వరకూ పనిచేశారు. రాష్ట్ర రైతుసంఘ అధ్యక్షునిగానూ, అఖిల భారత కిసాన్ సభ అధ్యక్షునిగా కూడా పనిచేశారు. 1957లో నర్సాపురం పార్లమెంటు నియోజకవర్గం నుండి 35 వేల మెజార్టీతో పార్లమెంట్‌కు ఎన్నికై, ప్రజల ఆదరాభిమానాలను చూరగొన్నారు.

1960లలో చెకోస్లోవేకియా, 1980లలో చైనా దేశాలలో పర్యటించారు. 1968లో "ఇరిగేషన్ వర్క్స్ ఇన్ ఇండియా" అనే పేరుతో సర్ ఆర్థర్ కాటన్ రచించిన అముద్రిత వ్యాసాలను పుస్తక రూపంలో ప్రచురించారు.

మార్క్సిస్ట్ సిద్ధాంత మౌలిక సూత్రాలను ప్రజలకు అర్థమయ్యే భాషలో అందించాలనే సంకల్పంతో కామ్రేడ్ శివవర్మ హిందీలో చేసిన రచనలను తెలుగులోకి అనువదించి ప్రచురింపచేశారు.

## ఆర్థిక ఇబ్బందులు, నిర్బంధాలను లెక్కచేయని జీవితం:

రామంగారికి చెందిన ఆస్తి, భార్య మాణిక్యాంబగారు తెచ్చిన ఆస్తి క్రమంగా తరిగిపోతున్నా ఏనాడూ చలించలేదు. బాధపడలేదు. పార్టీ యిచ్చే అలవెన్స్‌తో క్లుప్త ఖర్చుతో జీవించారు. నిర్బంధాలు, రహస్య జీవితం, వచ్చే ఆదాయంలేక పిల్లలతో సహా పస్తులుండే పరిస్థితులు ఏర్పడినా ఏనాడూ మనోధైర్యం వీడలేదు. ముఖ్యంగా 1948–51 నిర్బంధకాలంలో మాణిక్యాంబగార్ని, ఆరుగురు బిడ్డలను వీరవాసరం అద్దె ఇంటిలో కూడా నిలువనీయక, బిడ్డలను 'మీ నాన్న ఎక్కడున్నాడురా?' అంటూ అనేక హింసలు పెట్టినా; తిండి, బట్టకు కూడా కరువైన స్థితిలో రామంగారు చలించలేదు. ఆనాడు వారి కష్టాలు చూసినవారంతా కంటతడి పెట్టారు.

## నిరాడంబరత, ఆదరణ, నమ్రత:

రామంగారు జీవితాంతం నిరాడంబరంగా జీవించారు. కాంగ్రెస్ నాయకుడుగా, కమ్యూనిస్టు నాయకుడిగా, జిల్లా, రాష్ట్ర, కేంద్ర నాయకుడుగా, పార్లమెంటు సభ్యునిగా, అఖిల భారత కిసాన్ సభ అధ్యక్షునిగా వివిధ నాయకత్వ ఉన్నత బాధ్యతలు నిర్వహించినా జీవితాంతం నిరాడంబరంగా జీవించారు. జిల్లాలో చిన్నచిన్న అద్దెయిండ్లలో నివసించారు. విజయవాడలో రాష్ట్ర బాధ్యతలలో వున్నపుడు ప్రథమదశలో ఓ మిత్రుని ఖాళీస్థలంలో ఓ పూరిపాక నిర్మించుకొని కాలం గడిపారు. చూడ్డానికి వచ్చే కార్యకర్తలు, స్నేహితులను ఆదరించి పంపించేవారు. కార్యకర్తల యోగ క్షేమాలు తెలుసుకొని అవసరమైన సలహాలు, సహాయాలు అందించేవారు. అనారోగ్యంతో వున్న కాలంలో కూడా ముందు వచ్చినవారి సత్కారంకై ఆరాటపడేవారు.

## చివరవరకూ ఉద్యమం ఎడల నిబద్ధత:

పార్టీ ఉద్యమాలలో కేంద్రీకృత ప్రజాస్వామ్య పద్ధతులను, క్రమశిక్షణను తూ–చ తప్పక పాటించేవారు. అనారోగ్యంతో జ్ఞాపకశక్తి కూడా కోల్పోయిన స్థితిలో కూడా ఏనాడూ పార్టీపై అసంతృప్తిగాని, నష్టం కల్గించే మాటగాని ఆయన నుండి రాలేదు. 1988–90లలో రెండుసార్లు అనారోగ్య పరిస్థితులలో కూడా పశ్చిమగోదావరి జిల్లా పర్యటించినప్పుడు ఆయా సభలలో సందర్భోచితంగా మాట్లాడి అభిమానులను ఆశ్చర్యచకితులను చేశారు.

సుమారు 6 సంవత్సరాలు మతిస్థిమితం లేక, ఎవరినీ గుర్తు పట్టలేని స్థితిలో వుంటూ, మృత్యువుతో మూగగా పోరాడుతూ, 1994 నవంబర్ 27వ తేదీన కన్ను మూశారు.

★ ★ ★

# నిష్కళంక దేశభక్తుడు, ఆదర్శ కమ్యూనిస్టు
# కీ.శే. జె.ఎస్.ఆర్. ఆంజనేయశాస్త్రి

- పరకాల పట్టాభిరామారావు



కృష్ణాజిల్లా కమ్యూనిస్టు నాయకులు, రాష్ట్ర వ్యవసాయ కార్మికోద్యమ ప్రముఖులు అయిన శ్రీ జె. ఎస్. ఆర్. ఆంజనేయశాస్త్రిగారి స్వీయ చరిత్ర ఆయన స్వీయ చరిత్ర మాత్రమే కాదు.

అర్ధశతాబ్ద కాలానికి పైగా ఆంధ్రదేశంలో జరిగిన అపూర్వ రాజకీయ, సాంఘిక పరివర్తనకు అద్దం పట్టే చరిత్ర అది.

అంతేకాదు, ఆంధ్రదేశంలో కమ్యూనిస్టు ఉద్యమం ఏమి సాధించింది? అంటే ఇదిగో! ఇటువంటి నిష్కళంక దేశభక్తుల్ని, నిస్వార్థ ప్రజా సేవకులను సృజించింది అని సగర్వంగా చెప్పుకోవడానికి నిదర్శనంగా చూపగల్గిన జీవిత చరిత్ర అది.

## రెండు మహత్తర జాతీయ ఉద్యమాల ప్రభావం:

మధ్యయుగాల నాటి మతమౌఢ్యం, సాంఘిక దురాచారాలు, ఛాందసత్వ భావాలనుండి భారత ప్రజలు బైటపడి సామాజిక పరివర్తనకు, హేతువాద దృష్టికి, ఆధునిక అభ్యుదయ భావాలకు చేరుకోడానికి రెండు మహోద్యమాలు తోడ్పడ్డాయి.

ఒకటి: రాజారామమోహనరాయ్, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, మహదేవ గోవింద రనడే, పండిత రమాబాయి, జ్యోతిబాపూలే, కందుకూరి వీరేశలింగం, నారాయణగురు మున్నగు సంఘ సంస్కర్తలు నడిపిన భారత జాతీయ పునరుజ్జీవన ఉద్యమం.

రెండవది: "స్వరాజ్యం నా జన్మహక్కు" అనే సింహనాదం చేసి బ్రిటిష్ సామ్రాజ్యవాద బానిసత్వంలో పడివున్న భారత జాతిని మేల్కొల్పి, దేశభక్తిని రగిలించి, భారత స్వాతంత్ర్య సమర శంఖం పూరించిన లోకమాన్య బాలగంగాధర తిలక్, లాలా లజపతిరాయ్, బిపిన్‌చంద్రపాల్; అటు పిమ్మట గాంధీజీ, నెహ్రూ, బోస్, భగత్‌సింగ్, అల్లూరి సీతారామరాజు మున్నగు స్వాతంత్ర్య సమరయోధుల నాయకత్వాన సాగిన భారత జాతీయ స్వాతంత్ర్యోద్యమం. ఈ రెండు జాతీయ మహోద్యమాలు - మట్టిలోంచి మహావీరులను సృజించాయి.

## కమ్యూనిస్టు ఉద్యమ చరిత్రాత్మక పాత్ర:

1934 నుండి ఆంధ్ర దేశంలో ఆవిర్భవించిన కమ్యూనిస్టు ఉద్యమం ఈ రెండు జాతీయ ఉద్యమాలను, ఈ దేశభక్తియుత సంప్రదాయాలను మరింత ముందుకు తీసుకుపోయింది.

జాతీయోద్యమంలో అంతర్భాగంగా ఫ్యూడల్ జమీందారీ భూస్వామ్య వ్యతిరేక పోరాటాల్ని మేళవించి, అపూర్వమైన సాంఘిక విప్లవోద్యమాన్ని, ప్రజాతంత్ర విప్లవోద్యమాలను నడిపింది.

కారల్ మార్క్స్, ఫ్రెడరిక్ ఎంగిల్స్, వి. ఐ. లెనిన్ మహాశయులిచ్చిన శాస్త్రీయ సామ్యవాద సిద్ధాంతాల కరదీపికతో సాగించిన ఈ మహోద్యమాలలో ఆంధ్రదేశంలో ప్రభవించిన యోధులలో, నిస్వార్థ ప్రజా సేవకులలో తమ జీవితాలను దేశం కోసం, ప్రజల కోసం, ముఖ్యంగా పీడిత ప్రజల కోసం ధారపోసిన ఆదర్శ కమ్యూనిస్టు నాయకులలో కామ్రేడ్ జంధ్యాల సీతారామాంజనేయశాస్త్రి ఒకరు.

కృష్ణా జిల్లా చివఓగిరాలలో 1918లో జన్మించి, 1994 ఫిబ్రవరిలో హైదరాబాద్‌లో కనుమూసి, 1938లో రాజకీయ రంగంలో ప్రవేశించింది లగాయతు తుది క్షణం వరకు 56 సంవత్సరాల సుదీర్ఘకాలం దేశభక్తియుత రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక కార్యకలాపాలలో, పీడిత ప్రజాసేవలో నిష్కళంక ప్రజాజీవితం గడిపిన ధన్యజీవి శ్రీ శాస్త్రిగారు.

## ఫ్యూడల్ భావజాలానికి, సంస్కృతికి వ్యతిరేకంగా...

వేదాధ్యయన సంపన్నులు, అగ్రహారీకులు, నిప్పును కూడ నీళ్ళలో కడిగేటంత సనాతన వైదిక బ్రాహ్మణ కుటుంబంలో జన్మించిన శ్రీ శాస్త్రి జాతీయోద్యమంలోకి, ఆ తర్వాత కమ్యూనిస్టు ఉద్యమంలోకి రావడం దానికదే ఒక పెద్ద సాంఘిక విప్లవం – యింటా బైటా అనేక అగ్నిపరీక్షలలో నెగ్గితేనేకాని ఆనాటి సనాతన బ్రాహ్మణ కుటుంబాలలోని యువకుల జాతీయ ఉద్యమాలలోకి, కమ్యూనిస్టు ఉద్యమంలోకి రావడం అసాధ్యంగా ఉండేది. "కిరస్తానీ చదువులు" గనుక అసలు ఇంగ్లీషు చదువులు చదువుకొనడమే నిషిద్ధంగా ఉండే రోజులు అవి.

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తమ స్వీయ చరిత్ర "అనుభవాలు–జ్ఞాపకాలు"లో చెప్పినట్లు దేవభాష అయిన సంస్కృతం చదువుకోవాలి తప్ప, వేదాధ్యయన కుటుంబాలలోని బాలురు తెలుగుభాష నేర్చుకోవడం కూడా అపభ్రంశ చర్య, అవైదిక, అబ్రాహ్మణ చర్య. శ్రీపాద వారు తెలుగు నేర్చినందుకు, గోష్పాదమంత పిలక మిగుల్చుకొని క్రాపింగ్ చేయించుకొన్నందుకు తిట్లు, చివాట్లేకాదు – తమ ఇంట "దేహశుద్ధి" కూడా అనుభవించక తప్పలేదు. ఇన్ని బాధలుపడి ఆ తరువాత వీరేశలింగం అనుయాయులుగా సంఘ సంస్కరణ ప్రయోజనం కల గొప్ప తెలుగు కథా సాహిత్యాన్ని సృష్టించారు.

శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రిగారు తెలుగు నేర్చి, సాంఘిక సంస్కరణోద్యమంలోకి రావడం జరిగితే, జంధ్యాల సీతారామాంజనేయశాస్త్రిగారు సంస్కృత విద్య మాని ఇంగ్లీషు చదువుల్లోకివచ్చి ఆ తరువాత సహపంక్తి భోజనాలతో ప్రారంభమై సంఘ

సంస్కరణ ఉద్యమాల్లోకి, ఆ తరువాత జాతీయోద్యమంలోనికి అడుగు పెట్టారు.

బ్రహ్మసమాజ మతం సంస్కరణోద్యమ ప్రభావాలు పడిన బ్రాహ్మణ కుటుంబాలలోని యువకులు జాతీయోద్యమంలోకి, కమ్యూనిస్టు ఉద్యమంలోకి రావడం కొంత సులువు అయ్యేది. కాని, ఆ విధంగా సంఘ సంస్కరణోద్యమ ప్రభావం సోకని సనాతన బ్రాహ్మణ పురోహిత వర్గాలలోని యువకులు, ఆనాటి ఫ్యూడల్ సంస్కృతి, ఆచార వ్యవహారాలనుండి ఛాందసవాద సంకెళ్ళను తెగగొట్టుకొని రావడానికి మరింత భీషణ పోరాటం చేయవలసి వచ్చేది. ఆ విధంగా పోరాటం చేసిన వారిలో శ్రీ శాస్త్రిగారు ఒకరు.

## జాతీయోద్యమంలో శాస్త్రిగారి ప్రవేశం:

శాస్త్రిగారికి తన 11వ యేట అతి బాల్యవివాహం (1929లో) జరిగింది. 1929-30లలో వచ్చిన ఆర్థిక మాంద్యంతో తలక్రిందులైపోయిన అగ్రహారీకుల కుటుంబాల ఆర్థిక పతనం మధ్య ఎట్టకేలకు అతికష్టంపై గుడివాడ, బెజవాడ, గుంటూరులలో ఇంగ్లీషు హైస్కూలు, కాలేజీ చదువులు చదివారు. హైస్కూలు దశలోనే జాతీయోద్యమంలో ప్రభావితులై శ్రీ శాస్త్రిగారు భారత జాతీయ కాంగ్రెస్‌కు చేరువైనారు. 1934లో కాంగ్రెస్ అధ్యక్షులు బాబు రాజేంద్రప్రసాద్ బీహారు భూకంప బాధితుల సహాయార్థం ఆంధ్రప్రదేశం పర్యటిస్తూ బెజవాడ వచ్చినప్పుడు విరాళాల వసూలుకు కాంగ్రెసు వాలంటీరుగా చేరారు. బ్రాహ్మణేతరులతో తొలిసారిగా సహపంక్తి భోజనాలు చేసినందుకు తమ యింట దర్భలతో నాలికపై వాతలతో "అగ్నిశుద్ధి"కి గురయ్యారు.

1938లో శ్రీ శాస్త్రిగారు (తన 20వ యేట) హరిపుర కాంగ్రెస్‌కు ప్రతినిధిగా వెళ్లారు. ఉపనయనానికి పెట్టిన బంగారు రాళ్ళ కమ్మలు, బటువులు (ఉంగరాలు) అందుకై తెగనమ్మారు. ఆ తిరుగు ప్రయాణంలో మహాకోసల కాంగ్రెస్ అధ్యక్షులు, "కర్మవీర్" హిందీ పత్రిక సంపాదకులు అయిన శ్రీ మఖన్‌లాల్ చతుర్వేదితో ఏర్పడిన పరిచయం శ్రీ శాస్త్రి జీవితంలో ఒక మూల మలుపు తెచ్చింది. కాలేజీ చదువుకు స్వస్తిపలికి, ఖాండ్వా వెళ్ళి "కర్మవీర్" పత్రికలో చేరారు మేనేజరుగా. అటుపిమ్మట న్యూస్ ఎడిటరుగా పనిచేశారు.

## సోషలిస్టు భావాలతో పరిచయం:

గుంటూరు హిందూ కాలేజీలో ఉండగానే విద్యార్థి ఉద్యమంలో కాంగ్రెస్ సోషలిస్టులతో, కమ్యూనిస్టులతో పరిచయాలు ఏర్పడ్డాయి. విద్యార్థి సమ్మెలలో పాల్గొన్నారు. 1938లో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ, కమ్యూనిస్టు పార్టీల ఆధ్వర్యాన జరిగిన మంతెనవారిపాలెం వేసంగి రాజకీయ పాఠశాలకు హాజరయ్యారు. అంతకు ముందే గుంటూరు కాలేజీ విద్యార్థులకు చంద్ర రాజేశ్వరరావుగారు నిర్వహించిన మిలిటరీ డ్రిల్లు క్లాసుకు హాజరై కుస్తీ, కర్రసాము మొదలైనవి నేర్చుకున్నారు. ఆ విధంగా సోషలిస్టు భావాలవైపు పరివర్తన చెందారు. 1937లో కాంగ్రెస్ ఎన్నికలలో జస్టిస్ పార్టీవారిని ఓడించడానికి కృషి చేశారు. యువజన సంఘాలను నిర్మించారు.

ఆటల పోటీలు, సాంస్కృతిక కార్యక్రమాలు, వయోజన విద్యాప్రచారం మున్నగు కార్యక్రమాల్లో పాల్గొన్నారు. 1940లో కమ్యూనిస్టు పార్టీ సభ్యుడుగా చేరారు. వ్యవసాయ కార్మికులను సంఘటితపరచి, హెచ్చు కూలి కొరకు సమ్మెలు నడిపించారు. పాలేళ్ళ ఉద్యమాలు నిర్వహించారు. కమ్యూనిస్టు ఉద్యమాల వృద్ధికేగాక, దళిత విముక్తి ఉద్యమానికి తన జీవితాన్నంతా ధారపోశారు.

## అంటరానితనానికి వ్యతిరేకంగా...

అంటరానితనానికి వ్యతిరేకంగా శ్రీ శాస్త్రిగారు తన పోరాటం తన ఇంటిలో నుండే ప్రారంభించారు. ఒకసారి వారి పాలేరు, హరిజనుడు వెంకటేశును ఎద్దు కుమ్మింది. తీవ్రంగా గాయపడ్డాడు. అతనిని తీసుకొనివచ్చి యింట్లో తన మంచంపై పక్కవేసి పరుండబెట్టి, వళ్ళంతా మందులురాసి, మర్దనచేసి, వేడినీళ్ళు కాపడం పెట్టి ఉపచారాలు చేశారు. హరిజనుడు ఎదురుబడితే సచేల స్నానం చేసే ఆ రోజుల్లో శ్రోత్రియ బ్రాహ్మణ కుటుంబాల్లో అదొక పెద్ద ఉప్పెలాయం (విప్లవం) తెచ్చింది. విజయవాడలో మున్సిపల్ వర్కర్సు (అప్పుడు వారిని పాకీపనివారు అని మాత్రమే పిల్చేవారు)తో పనిచేయడానికి శ్రీ శాస్త్రి వెళ్ళినప్పుడు కూడా – వారు అస్పృశ్యులు గనుక స్నానం చేయకుండా ఇంట్లోకి రానిచ్చేవారుకాదు, భోజనం పెట్టేవారు కాదు. ఇంట్లో అదొక నిత్య ఘర్షణ.

## సాంఘిక సంస్కరణ ఉద్యమ వ్యాప్తికై...

శాస్త్రిగారి మొదటి భార్య ఒక ఆడబిడ్డను ప్రసవించి అకస్మాత్తుగా మరణించింది. ఆమె పుట్టింటివారి ప్రోద్బలంతో బిడ్డను చూడటానికి వీలుగా వారి కుటుంబంలోని కన్యనే శాస్త్రిగారికి యిచ్చి 1940లో ద్వితీయ వివాహం చేశారు. వారే శ్రీమతి లక్ష్మి సుందరమ్మగారు. శాస్త్రిగారి కుటుంబం వలెనే శుద్ధ శ్రోత్రియమైన వేద పండితుల కుటుంబం నుండి వచ్చిన లక్ష్మి సుందరమ్మగారిని మహిళా ఉద్యమంలోకి తీసుకురావడానికి, తన విప్లవ ఆశయాల కనుగుణంగా తీర్చిదిద్దడానికి, పురాతన కట్టుబాట్లను తెగతెంచడానికి శాస్త్రిగారు తీవ్రపోరాటం చేయవలసి వచ్చింది. గడపదాటి స్త్రీలు బైటికి రావడమే సాంఘికంగా ఆ రోజుల్లో పెద్ద అపరాధం. అత్తమామలు కొత్త కోడలిని అసలే బైటకి వెళ్ళనీయరు. అట్టి పరిస్థితుల్లో తొలిసారిగా గ్రామంలో జరుగుతున్న మహిళల సమావేశానికి లక్ష్మి సుందరమ్మను శ్రీ శాస్త్రిగారు తీసుకువెళ్ళినప్పుడు ఆమెను అత్తమామలు తిరిగి యింట్లోకి అడుగు పెట్టనివ్వలేదు. కావాలని అమావాస్య నాడు కొత్తకాపురం, కొత్త కుండలతో, దీపాలు లేని యింట్లో ప్రారంభించారు. శ్రీ శాస్త్రిగారు శుద్ధ శ్రోత్రియ కుటుంబం నుండి అనేక ఆచార వ్యవహారాలు, మత విశ్వాసాల మధ్య పెరిగిన సుందరమ్మగారిని ఆ పాత సంప్రదాయాల నుండి, నమ్మకాల నుండి బైటకి తీసుకురావడానికి శాస్త్రిగారు పడిన పాట్లు అలాంటివి అనేకం. వీరేశలింగంగారి అడుగు జాడల్లో మూఢ నమ్మకాలను, శకునాలను, మతమౌఢ్యాన్ని ఎదుర్కొని కమ్యూనిస్టులు తీవ్ర పోరాటం చేశారు. తెలుగునాట గొప్ప సాంఘిక సంస్కరణ ఉద్యమాన్ని నడిపారు.

ఆ రోజుల్లో అంటరానితనాన్ని, కుల మత భేదాన్ని పాటించని కమ్యూనిస్టు కార్యకర్తలకు బ్రాహ్మణులు ఇతర అగ్రకులాలవారు కూడా ఎవరూ యిళ్ళు అద్దెకు యిచ్చేవారుకారు. అందుచేత అట్టడుగు కులాలవారు, యాదవులు, రజకులు, ముస్లిములు మొదలైనవారి యిళ్ళలోనే శాస్త్రిగారు కాపురం ఉండవలసి వచ్చేది. అన్ని సనాతన కట్టుబాట్లను ఉల్లంఘించుతున్నందుకు, అన్ని కులాలవారి ఇళ్ళల్లోను తింటున్నందుకు "కులభ్రష్టుడై" పోవడమేకాక, సద్బ్రాహ్మణ కుటుంబంలోని తమ యింటి కోడలిని తీసుకొనిపోయి వూళ్ళంట తిప్పుతున్నందుకు ఆగ్రహించిన శాస్త్రిగారి తండ్రి, శాస్త్రిగారు మొదటిసారి వేరే కాపురం పెట్టడానికి లక్ష్మీసుందరమ్మ గారిని తీసుకు వెళుతున్నప్పుడు యింట్లోంచి కట్టుబట్టలతో బైటికి పంపారు. ఇంట్లోంచి పూచిక పుడకకూడా తీసుకు వెళ్ళడానికి వీలులేదని సుగ్రీవాజ్ఞ జారీచేసి కట్టడి చేశారు.

## వ్యవసాయ కార్మికవర్గ పక్షాన...

శాస్త్రిగారు ముఖాముఖీగా తండ్రితో అనేక విషయాలలో ఘర్షణ పడవలసి వచ్చేది. వర్షాకాలంలో వ్యవసాయ కార్మికులకు పనులు లేక తిండికి మాడవలసి వచ్చేరోజులు. నామకు పెద్ద ఆసాముల దగ్గర తిండి గింజలు తెచ్చుకొనేవారు. అట్టి పరిస్థితుల్లో శాస్త్రిగారు తమవద్ద పనిచేసే పాలేళ్ళను, వ్యవసాయ కార్మికులను యింటికి రమ్మని, ధాన్యం పురిలోంచి ధాన్యం బైటికి తీసి వారికి కొలిచి యిస్తున్నారు. ఆ సమయానికి తండ్రిగారు ప్రత్యక్షమై, ఎవడురా పురిలోంచి ధాన్యం తీయించుతున్నదని, వీలులేదని అడ్డంకొట్ట జూస్తే, శ్రీ శాస్త్రిగారు తిరగబడి, "ఈ ధాన్యంలో ప్రతీ మూడవ గింజ నాది, నాకు హక్కుంది, కొలుస్తున్నాను" అని ధాన్యం యిచ్చి వ్యవసాయ కార్మికులను పంపారు. శాస్త్రిగారు యిద్దరు సోదరులు; (తమ్ముడున్నారు) తండ్రితో కలుపుకొని ముగ్గురు హక్కుదార్లు. ఆ విధంగా కమ్యూనిస్టులు ఆ రోజుల్లో వ్యవసాయ కార్మికుల కోసం యింటా బైటా ఎంత తీవ్ర పోరాటం చేయడం జరిగిందో, అవసరమైతే కుటుంబ పెద్దలతో తెగతెంపులు చేసుకొని వ్యవసాయ కార్మికుల పక్షాన ఎలా నిలబడ్డారో చూపటానికి ఇటువంటి ఉదంతాలు అనేకం.

అదేవిధంగా కుల, మత విభేదాలను అధిగమించడానికి అటువంటి హెచ్చుతగ్గు భావాలను పోగొట్టడానికి తరతరాలుగా అగ్రకుల బ్రాహ్మణ వర్గాలలో క్రింది కులాలవారిపట్ల ఉన్న హైన్యభావాన్ని పోగొట్టడానికి ఎంతగానో పోరాడారు. శ్రీ శాస్త్రిగారు ఒకసారి ఇంటికి కామ్రేడ్సును భోజనానికి తీసుకువచ్చారు. భోజనాలు పూర్తి అయ్యాయి. విస్తళ్ళు సుందరమ్మగారు మారు మాటాడకుండా తీయవలసిందే! తీశారు. కాని, ఆ కామ్రేడ్స్ వెళ్ళిపోయిన అనంతరం మిట్టమధ్యాహ్నం దొడ్లో తలార స్నానం చేస్తున్నారు. ఆ విషయం శాస్త్రిగారి కంటబడింది. విషయం అర్థమైంది. భోజనం చేసిన వారిలో అబ్రాహ్మణులు ఉండవచ్చు. అందుకు ఆమె స్నానం చేస్తున్నారని అర్థం కావడంతో, నేలకు జీరాడే ఆమె తలకట్టును ఒడిసి పట్టుకొని ఆమెను బరబర యీడ్చుకుంటూ దొడ్డి తలుపుకేసి బైటికి గెంటివేశారు. తడిసిన బట్టలతో, తడిసిన తలకట్టుతో అలాగే గంటల తరబడే నట్టనడివీధిలో నుంచోబెట్టి శాస్త్రిగారు వేసిన ఆ శిక్ష – గాంధీజీ కస్తూరిబాయికి వేసిన శిక్షను

గుర్తుకు తెస్తుంది. (తన స్నేహితుడు ఉపయోగించిన పాకీదొడ్డి వూడ్చనందుకు గాంధీజీ కస్తూరిబాయిని తలుపు తీసి బైటికి గెంటివేశారు.)

ఒక్కసారిగా సనాతనాచార వ్యవహారాలను సుందరమ్మగారు వదలిపెట్టలేని స్థితి. అయినప్పటికీ ఆమె అనతికాలంలోనే శాస్త్రిగారి విప్లవ జీవితంలో మమేకమై పోయింది. శాస్త్రిగారు సుందరమ్మగారికి విద్యా విజ్ఞానాలు నేర్పించడానికి లాహోరులో దేవ సమాజ్‌వారు నడుపుతున్న విద్యాలయంలో హిందీ ఎమ్.ఎ. ఉన్నత విద్యా శిక్షణకు పంపారు. భారత – పాకిస్తాన్ విభజన సమయంలో మత కలహాలు చెలరేగిన కల్లోల సమయంలో సుందరమ్మగారు అతికష్టంమీద పంజాబు నుండి ఆంధ్రప్రదేశానికి రాగల్గారు. తన విప్లవ జీవితంలో నిజమైన సహభాగినిని చేయడానికి శాస్త్రిగారు ఆ విధంగా చేసిన కృషి అనాడు స్త్రీ విముక్తి ఉద్యమానికి కమ్యూనిస్టుపార్టీ చేసిన నిరంతర కృషికి నిదర్శనం. తమ కుటుంబ ప్రాచీన సంప్రదాయాలు, తమ మత విశ్వాసాలు ఎలా ఉన్నా, శ్రీమతి సుందరమ్మగారు నిండు మనసుతో శాస్త్రిగారి విప్లవ జీవితంలో నిజమైన సహధర్మచారిణి అయ్యారు. సుందరమ్మగారి జీవిత సాహచర్యం లేకపోతే శాస్త్రిగారు అంత కఠోర విప్లవ జీవితాన్ని గడపగల్గి ఉండేవారు కాదు.

## అజ్ఞాతవాసంలో అష్టకష్టాలు:

1948–51 తీవ్ర నిర్బంధ కాలంలో కమ్యూనిస్టు నాయకులు, కార్యకర్తలు పడిన బాధలు వర్ణనాతీతం. తెలంగాణా సాయుధ పోరాటానికి వెన్నుదన్నుగా ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం నిలబడింది. దానితోబాటు సాయుధ పోరాటాన్ని ఆంధ్ర ప్రాంతానికి కూడా విస్తరింపజేయాలనే దుందుడుకు అతివాద నిర్ణయం తీసుకోవడంతో తీవ్ర నష్టాలకు గురి అయింది. దారుణమైన నిర్బంధ విధానం ఆంధ్ర జిల్లాల్లో ప్రారంభమైంది. కమ్యూనిస్టుల బలమైన కేంద్రాలన్నీ పోలీసు దాడులకు గురయ్యాయి. ఇళ్ళు వాకిళ్ళు, ఆహార పదార్థాలు ధ్వంసం చేయబడ్డాయి. కాటూరు, ఎలమర్రు గ్రామాలలో ప్రజలను దిగంబరులుగా చేసి, గాంధీ విగ్రహం చుట్టూ ప్రదక్షిణలు చేయించారు. కనబడిన కమ్యూనిస్టునల్లా కాల్చివేశారు. ఆ విధంగా వందలాదిమంది తాము నమ్మిన విప్లవ సిద్ధాంతం కోసం ప్రాణా లర్పించారు. అనాడు పార్టీ తీసుకున్న దుందుడుకు పోరాట విధానంతో విభేదించుతున్నవారు కూడా ఎంతోమంది పార్టీ క్రమశిక్షణకు కట్టుబడి చివరికంటా పోరాడుతూ ఆత్మబలిదాన మొనరించారు. శాస్త్రిగారు, సుందరమ్మగారు అప్పుడే పుట్టినబిడ్డ విప్లవ కుమార్‌తో దూరప్రాంత జిల్లాలో అనేక రహస్య కేంద్రాలలో అడుగడుగునా అనేక ప్రమాదాలు దాటుకుంటూ అగ్నిపరీక్షలకు తట్టుకొని ప్రాణాలతో 1952 నాటికి బైటకి వచ్చారు. శాస్త్రిగారిపై అనేక హత్యా నేరాలున్నాయి. శాస్త్రిగారు ప్రాణాపాయాల నుండి తృటిలో అనేకమార్లు తప్పించుకొన్నారు. పరాయి రాష్ట్రాలలో తలదాచుకొనవలసిన ఆ సందర్భంలోనే నేను, శాస్త్రిగారు అజ్ఞాతవాసంలో సుమారు రెండేళ్ళు కలిసి మధ్యప్రదేశ్‌లో జీవించాము. సుదూర ప్రాంతాలలో చెట్టుకొకరు పుట్టకొకరు చెదిరిపోయి, అనుక్షణం ప్రాణాపాయ స్థితిలో ఉన్న కామ్రేడ్సును సురక్షిత ప్రాంతాలకు తరలించడంలో కలిసి పని చేశాము. ఆ వీరోచిత, సాహస ఘట్టాలన్నింటిని ఈ

స్వీయ చరిత్రలో సోదరి లక్ష్మీ సుందరమ్మగారు అన్ని వివరాలతో పూసగుచ్చినట్లు వివరించారు.

## సహధర్మచారిణి శ్రీమతి సుందరమ్మ:

శాస్త్రిగారు వ్రాసుకున్న స్కెచ్ ఆధారంగా సోదరి సుందరమ్మగారు ఈ జీవిత చరిత్ర వ్రాశారు. శాస్త్రిగారు వ్రాసుకొనే దానికంటే శక్తివంతంగా, సమర్థవంతంగా దీనిని వ్రాశారు. కాని, ఇన్ని వివరాలు ఎలా జ్ఞాపకం పెట్టుకొని వ్రాయగల్గారా? అని ఎవరికైనా ఆశ్చర్యం కలుగుతుంది. శాస్త్రిగారి రాజకీయ జీవితంలో అడుగిడింది మొదలు సుందరమ్మగారు ఆయన జీవిత సహధర్మచారిణిగా యించుమించు ప్రతి విషయంలోను, ప్రతి ఉద్యమంలోను పాల్గొన్నారు. విడదీయరాని విప్లవ జంటగా వారు అన్ని కార్యక్రమాలలోను పాల్గొంటూ వచ్చారు. అది యువజన, మహిళా ఉద్యమాలు కావచ్చు., వయోజన విద్యా ప్రచారం కావచ్చు., రైతు, వ్యవసాయ కార్మిక సమస్యలు కావచ్చు – అన్ని సమస్యలను వారిరువురు కలిసి అధ్యయనం చేసేవారు. ఏ ప్రకటన అయినా, ఏ తీర్మానం అయినా, ఏ వ్యాసం అయినా ఆయన చెప్పేవారు. సుందరమ్మ వ్రాసేవారు. అలాగే, తీవ్ర నిర్బంధ సమయంలో ఎక్కువకాలం రహస్య కేంద్రాలలో, స్థావరాలలో శాస్త్రిగారితో, యితర కామ్రేడ్సుతో కలిసి సుందరమ్మగారు జీవించారు. అన్ని క్లిష్ట సమయాలలోను చేదోడు వాదోడుగా ఉన్నారు. అందుచేత స్కెచ్‌ని శాస్త్రిగారు వ్రాసినప్పటికి ఈ స్వీయ చరిత్రనంతా పూసగుచ్చినట్లు చెప్పింది, వ్రాసింది సుందరమ్మగారే. అందుచేత ఇది శాస్త్రిగారి స్వీయచరిత్ర మాత్రమే కాదు – ఉభయుల స్వీయచరిత్ర అని అనడమే సమంజసం.

## ఆదర్శ విప్లవ దాంపత్యం:

శాస్త్రిగారు అత్యంత ఆరోగ్యవంతులైనప్పటికీ ఆయనకు రాకూడని లివర్ క్యాన్సర్ వ్యాధివచ్చి అకాలమృతి చెందారు. అశనిపాతం వంటి శాస్త్రిగారి మృతి సుందరమ్మగారికి తీవ్రమైన, ఎన్నటికీ కోలుకోలేని మానసిక వ్యధకు లోను చేసింది. ఈ దుఃఖభారాన్ని వహిస్తూనే ఈ స్వీయ చరిత్రను వారు రక్తాక్షరాలతో వ్రాసినట్లుగా వ్రాశారు. తనలో మిగిలి ఉన్న ప్రతి రక్తపు బొట్టును ఒక్కొక్క అక్షరంగా మార్చుకున్నానని వారు చెప్పినమాట ఎంతమాత్రం అతిశయోక్తి కాదు. దాంపత్య జీవితాన్ని, రాజకీయ జీవితాన్ని కూడా అంత గాఢంగా, అంత అన్యోన్యంగా, అంత అభేదంగా వారిరువురు పంచుకొన్నారు. విప్లవోద్యమ చరిత్రలో ఇటువంటి ఆదర్శ దంపతులు అరుదు. వారి వైవాహిక జీవితం 54 వసంతాలు చూసింది. అన్ని అగ్ని పరీక్షలు చూసింది. తట్టుకొని నిలిచింది.

సుందరమ్మగారు చిన్నతనంలోనే సంస్కృతాంధ్రాలు, కాళిదాసు మొదలు అష్ట దిగ్గజాల వరకు వ్రాసిన ప్రాచీన కావ్యాలు బాగా చదువుకొన్నవారు. శ్రావ్యమైన కంఠంతో ఆమె సంస్కృత శ్లోకాలు, స్తోత్రాలు, దేశభక్తి గేయాలు పాడుతూంటే వినవలసిందే. ఎన్నెన్ని యువజన, మహిళా కార్మిక మహాసభలలో కృష్ణశాస్త్రి మొదలు పులుపుల శివయ్య, వేములపల్లి శ్రీకృష్ణ వరకు ఎందరెందరో రచించిన ఎన్నెన్నో గేయాలు ఆమె పాడేవారు. హరినాగభూషణం వంటి సుప్రసిద్ధ సంగీత

విద్వాంసుల వద్ద సంగీతం నేర్చుకున్నారు. శాస్త్రిగారు రాజకీయ రంగంలో చిక్కు సమస్యల వలన మానసికాందోళన ఎక్కువగా ఉన్న సమయాలలో సుందరమ్మగారిచే పాటలు పాడించుకొని, మానసిక ప్రశాంతత స్వస్థత పొందేవారు. ప్రాచీన కావ్య పరిభాషలోనే వారు తమ పరస్పర ప్రేమాభిమానాలు నెరపుకొనేవారు. శాస్త్రిగారు సుందరమ్మగారిని "షట్కర్మయుక్త" అని పిలిచేవారట. "కార్యేషుదాసి, కరణేశు మంత్రి, భోజ్యేషు మాతా, శయనేషు రంభ, రూపేచ లక్ష్మి, క్షమయా ధరిత్రి, షట్కర్మయుక్త, కులధర్మపత్ని" అన్నది ఆ శ్లోకం. సుందరమ్మగారికది అన్ని విధాలా అన్వర్థ నామధేయ.

కంట తడి పెట్టేటట్లు చేసే ఘట్టం - శాస్త్రిగారు తన అవసాన సమయం సమీపిస్తున్నప్పుడు సుందరమ్మగారిచే తన కిష్టమైన శ్లోకాన్ని తన కిష్టమైన రాగంలో చివరిసారిగా పాడి వినిపించుకున్న ఘట్టం.

1943లో శాస్త్రిగారు తన వాటాకు వచ్చిన ఆస్తినంతా అమ్మి పార్టీకి ఇచ్చేశారు. తన రాజకీయ జీవితంలో అనేక ఆర్థిక ఇబ్బందులు పడ్డారు. అయినప్పటికీ తన గురించి ఎప్పుడూ ఆలోచించుకోలేదు. పార్టీ గురించి, ప్రజల గురించే ఆయన నిరంతరం ఆలోచించారు.

## శాస్త్రిగారు నిర్వర్తించిన విప్లవోద్యమ కర్తవ్యాలు:

కమ్యూనిస్టు ఉద్యమంలో చీలిక నివారణకు శాస్త్రిగారు శాయశక్తులా కృషి చేశారు. కమ్యూనిస్టు ఉద్యమంలో వచ్చిన సెక్టేరియన్ పోకడలను ఆయన చివరికంట ఎదుర్కొని పోరాడారు. కమ్యూనిస్టు పార్టీ నీతి, నియమాలను, విలువలను, క్రమశిక్షణను, ఆయన తు-చ తప్పక పాటించారు. ఆంధ్రదేశంలో జరిగిన భారత కమ్యూనిస్టు పార్టీ మహాసభ లన్నింటిలో శాస్త్రి - సుందరమ్మ దంపతులు ఆహారశాఖను నిర్వహించటంద్వారా విశిష్ట సేవలు అందించారు.

ఫ్యూడల్ భావజాలాన్ని, ఫ్యూడల్ సంస్కృతిని ఎదుర్కొని పోరాడటమే గాక, జమీందారీ, భూస్వామ్య ఆర్థిక విధానాలకు వ్యతిరేకంగా జరిగిన అనేక పోరాటాలలో శాస్త్రిగారు ప్రత్యక్షంగా పాల్గొన్నారు. వ్యవసాయ విప్లవానికి అగ్రగామి పాత్ర వహించే వ్యవసాయ కార్మిక వర్గాన్ని సంఘటితపరచడంలో, వారి పోరాటాలకు నాయకత్వం వహించడంలో రాష్ట్ర స్థాయిలో నాయకత్వం వహించారు. యువజన మహిళా ఉద్యమాలకు అండదండలు యిచ్చి, సాంఘిక సంస్కరణలకు, సాంస్కృతిక పునరుజ్జీవనానికి తోడ్పడ్డారు. ఒక్కమాటలో - ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు ఉద్యమం గత అర్థశతాబ్ద కాలంగా సాధించిన ఆర్థిక, సామాజిక పరివర్తనలో పూర్తి భాగస్వామ్యం వహించారు.

జాతీయ కర్తవ్యాలను - కార్మికవర్గ కర్తవ్యాలను ఎలా మేళవించాలి? అన్న విషయంలో శాస్త్రిగారు ఎల్లప్పుడూ నిర్దిష్ట అభిప్రాయాలను వెలిబుచ్చడమే కాక, ఆ విషయంలో సరియైన వైఖరి అవలంబించలేకపోవడంవల్లనే భారత కమ్యూనిస్టు ఉద్యమం తన చారిత్రక కర్తవ్యాన్ని నెరవేర్చలేకపోతూందనీ, ఒక ప్రత్యామ్నాయ శక్తిగా రూపొందలేకపోయిందనీ, దేశానికి ఒక ప్రత్యామ్నాయ మార్గాన్ని చూపించలేకపోయిందనీ నిరంతరం ఆవేదన పడేవారు.

# కీ.శే. పందిరి మల్లిఖార్జునరావు



పందిరి మల్లిఖార్జునరావు (జననం: 1903) రాజమండ్రి నివాసి. 1920లో కాంగ్రెస్ ఆదేశానుసారం చదువుకు స్వస్తిచెప్పి, హిందీ నేర్చుకున్నారు. 1921 డిశంబరులో వేల్స్ యువరాజు భారతదేశానికి వచ్చినప్పుడు యావద్భారత దేశంలో నిరసన ప్రదర్శనలు జరిగాయి. అప్పుడు వీరు అలహాబాద్‌లో ఉన్నారు. వయస్సు 17 సంవత్సరాలు. మోతీలాల్ నెహ్రూ సొంత గృహమైన ఆనందభవన్‌లో నెహ్రూ కుటుంబ సభ్యులు మొదటి దళంగా 144వ సెక్షన్ ధిక్కరించి అరెస్టు కాగా, రెండవ దళంలో మల్లిఖార్జునరావు అరెస్టయి, ఆరు నెలలు జైల్లో ఉన్నారు. విడుదల అనంతరం రాజమండ్రి తిరిగి వచ్చారు. 1922–26 మధ్య హిందీ క్లాసులు నడిపారు. అలహాబాద్, కాన్పూరు, లక్నో మొదలైన పట్టణాలనుంచి వెలువడే "ప్రతాప్", "ఆజ్" మొదలైన హిందీ పత్రికలు తెప్పించి చదివేవారు. వాటిలో రష్యా విప్లవాన్ని గురించీ, లెనిన్ గురించీ, సోషలిస్టు వ్యవస్థను గురించీ వెలువడే వ్యాసాలు చదివి ఉత్తేజం పొందేవారు. అంతేకాదు, ఆ పత్రికలకు రిపోర్టరుగా వుంటూ, ఆంధ్రలో రాజకీయ పరిణామాల్ని గురించి వార్తలు పంపేవారు. వాటితోపాటు, లండన్‌నుంచి ఫేబియన్ సొసైటీవారు పంపే సోషలిస్టు కరపత్రాలెన్నో తెప్పించేవారు. 1924–25 మధ్య, పుచ్చలపల్లి సుందరయ్య తన బావగారి పోషణ క్రింద రాజమండ్రి హైస్కూలులో చదువుకొంటూ, మల్లిఖార్జునరావుగారి హిందీ క్లాసులకు హాజరయేవారు. వారి సలహామేరకు సుందరయ్య చరిత్ర, రాజనీతి, అర్థశాస్త్ర గ్రంథాలు చదివేవారు. ఖద్దరు ధరించేవారు. అప్పుడప్పుడు మల్లిఖార్జునరావు మదరాసు వెళ్ళేవారు. అక్కడ ప్రఖ్యాత కమ్యూనిస్టు సింగారవేలు చెట్టియార్‌ని కలుసుకొని, యిష్టాగోష్ఠి సంభాషణలు జరిపేవారు.

1923లో కాకినాడలో జరిగిన కాంగ్రెసు మహాసభకు అధ్యక్షత వహించిన మౌలానా మహమ్మదాలీ అధ్యక్షోపన్యాసాన్ని వీరు తెలుగులోకి అనువదించి యిచ్చారు.

1928లో ప్రపంచ ఆర్థిక సంక్షోభం ముమ్మరంగా వున్న రోజుల్లో వీరికి విదేశాలనుంచి సోషలిస్టు, కమ్యూనిస్టు సాహిత్యం విరివిగా వచ్చేది. అప్పటినుంచి పదేళ్ళు వీరిమీద పోలీసు నిఘా ఉండేది. 1929లో పోలీసులు వీరి యిల్లు సోదాచేసి, కొన్ని పుస్తకాలు స్వాధీనపరుచుకొన్నారు. వాటిలో కొన్ని : స్టాలిన్ "లెనినిజం", ట్రాట్‌స్కీ "రష్యా విప్లవ చరిత్ర", గాంధీజీ "హింద్ స్వరాజ్", తోరూదత్తు వ్రాసిన పుస్తకమూను. మీరట్ అరెస్టుల తరువాత, 1930లో 300 మంది పోలీసులు వీరి యింటినీ, పొరుగు యిళ్ళనూ కలిపి ముట్టడించారు.

ఉప్పు సత్యాగ్రహానికి ముందు గాంధీజీ రాజమండ్రి వచ్చి, సీతానగరం ఆశ్రమంలో కాంగ్రెసు వర్కర్లను సమావేశపరిచారు. సభ ప్రారంభమవడానికి ముందు మల్లిఖార్జునరావు తన పరిచయ వాక్యాల్లో గాంధీజీ సిద్ధాంతాలను విమర్శించుతూ ఉపన్యసించారు.

1930లో మే మాసంలో, శాసనోల్లంఘనోద్యమం ముమ్మరంగా సాగుతూన్నప్పుడు, పోలీసులు వీరిని క్రూరమైన హింసాకాండకు గురిచేశారు. తరువాత, ఒకనాడు, లెనిన్ దినోత్సవ సందర్భంలో ఉపన్యసిస్తూ, గాంధీ మార్గాన్ని ఖండించి లెనిన్ మార్గాన్ని కొనియాడారు. ప్రేక్షకుల్లో కొందరు వీరిని అవహేళన చేశారు; దూషించారు. వాటినాయన లెక్క చేయలేదు.

శాసనోల్లంఘనోద్యమం విరమింపబడ్డ తరువాత, 1934లో మల్లిఖార్జునరావు కమ్యూనిస్టు పార్టీలో సభ్యుడుగా చేరారు. 1935 నుండి 1938 వరకు తూర్పు గోదావరి జిల్లా కమ్యూనిస్టు కమిటీ కార్యదర్శిగా పనిచేశారు. తరువాత మద్రాసు వెళ్ళి, అక్కడ వ్యాపారంలో స్థిరపడ్డారు.

★ ★ ★

# కీ.శే. పుత్సల సత్యనారాయణ



పుత్సల సత్యనారాయణగారు (జననం: 1909) తూర్పుగోదావరిజిల్లా ఉప్పాడవాసి. కాకినాడలో 7వ తరగతి చదువుతూ, కాంగ్రెసు ఆదేశం మేరకు చదువు మానే శారు. దగ్గరలో జాతీయ విద్యాలయమేదీ లేనందున యింటిదగ్గర ట్యూషన్ చెప్పిం చుకొంటూ, గాంధీజీ సంపాదకత్వం క్రింద వెలువడే "యంగ్ ఇండియా" పత్రిక చదు వుతూ ఉండేవారు. రామకృష్ణ పరమహంస, వివేకానందుల రచనలు వీరిమీద గాఢమైన ప్రభావం కలిగించాయి. ఉత్తరదేశ యాత్రకు వెళ్ళి తిరిగి వచ్చాక, జిల్లా కాంగ్రెసు నాయ కుల ప్రోత్సాహంతో పిఠాపురం తాలూకా లాహోరు కాంగ్రెసుకు ప్రతినిధిగా వెళ్ళి, 31వ తేదీ అర్ధరాత్రివేళ రెండు లక్షల మంది హాజరైన సభలో సంపూర్ణ స్వాతంత్ర్య తీర్మానాన్ని ఉత్సాహంతో బలపరచారు. 1930లో స్వగ్రామమైన ఉప్పాడ సముద్రతీరాన ఉప్పు సత్యాగ్రహం చేశారు. సీతానగరం ఆశ్రమవాసి అయిన క్రొవ్విడి లింగరాజుగారితో కలిసి అరెస్టు అయి, 6 నెలల జైలుశిక్ష అనుభవించారు. విడుదలై వచ్చాక, 1931లో తల్లిగారి తోడ్పాటుతో తూర్పు, పశ్చిమ గోదావరి జిల్లాలలో మహిళల్ని సత్యాగ్రహులుగా రిక్రూట్ చేసి, మద్రాసుకు పంపేవారు. వారిని పోలీసులు చట్ట ధిక్కారణనేరం క్రింద అరెస్టు చేసేవారు.

సత్యనారాయణగారు కాకినాడలోను, పెద్దాపురంలోను పోలీసు లాఠీదెబ్బలకు గురి అయ్యారు.

సత్యాగ్రహోద్యమం విరమింపబడ్డాక వీరు హరిజన ప్రచారం ప్రారంభించారు. హరిజన బాలబాలికల్ని యింట్లో ఉంచుకొని, వారికి నేత నేర్పి, చదువు చెప్పి, రాజకీయాలు బోధించారు. ఇది చూచి, ఊరంతా వీరి కుటుంబాన్ని వెలివేసింది. రెండేళ్ళు ఏ వృత్తివారూ వీరి గుమ్మం తొక్కలేదు.

కొన్నాళ్ళ తరువాత సత్యనారాయణగారు జిల్లా కాంగ్రెసు కమిటీ సభ్యుడుగా ఎన్నుకోబడ్డారు. కాకినాడలో జరిగిన ఆంధ్ర రాష్ట్ర రాజకీయ మహాసభకు ఏర్పాట్లు చేశారు. బీహారు భూకంప బాధితుల సహాయార్థం విరాళాలు వసూలు చేశారు. స్వదేశీ వస్తువులు కొనమని ప్రజలకు బోధించారు.

1934లో స్థాపింపబడ్డ అఖిల భారత కాంగ్రెసు సోషలిస్టుపార్టీ నాయకుల్లో ఒకరైన మసానీ రాజమండ్రి వచ్చినప్పుడు కాంగ్రెసు భవనంలో బహిరంగసభ జరిగింది. దానికి సత్యనారాయణగారు అధ్యక్షత వహించారు. క్రమంగా వీరు సోషలిస్టు భావాలవైపు మొగ్గారు. తూర్పు గోదావరిజిల్లా ముంగండ నుంచి వెలువడుతున్న విశ్వసాహిత్యమాల గ్రంథాలూ, సోషలిస్టు కమ్యూనిస్టు నాయకుల ఉపన్యాసాలూ వీరిని సోషలిస్టుగా మార్చాయి.

పెద్దాపురం, పిఠాపురం తాలూకాలకు చెందిన 5 గ్రామాల్లో నివసించే 1,500 చేనేత కుటుంబాలు సిల్కుబట్టలు నేసి జీవిస్తూ ఉండేవారు. వారికిచ్చే కూలి రేట్లు బహు తక్కువ. సత్యనారాయణగారు 1935లో వారి సమస్యలు తీసుకొని, వారందరినీ ఒక సంఘంగా చేర్చి, కరపత్రాలద్వారా ప్రచారం చేసి, సమ్మెకు పిలుపు యిచ్చారు. 15 రోజుల అనంతరం సమ్మె జయప్రదంగా ముగిసింది. ఆ విజయాన్ని ఆధారం చేసుకొని, కోస్తా జిల్లాలలో విస్తృతంగా ప్రచారం చేసి, ఉప్పాడలో రాష్ట్ర చేనేత మహాసభకు ఏర్పాట్లు చేశారు. దానికి 600 మంది ప్రతినిధులొచ్చారు. సత్యనారాయణగారు రాష్ట్ర సంఘానికి ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. క్రమంగా జిల్లా సంఘానికి ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. తరువాత జిల్లా సంఘాలేర్పడ్డాయి. బహిరంగ సభల్లో రష్యా విప్లవాన్ని గురించీ, సోషలిస్టు సమాజాన్ని గురించీ ఉపన్యాసాలు చేయడం ద్వారా చేనేత కార్మికుల్లో సంఘ చైతన్యం కలిగించారు. కొన్నాళ్ళ తరువాత కమ్యూనిస్టు పార్టీలో సభ్యుడుగా చేరారు.

★ ★ ★

# కీ.శే. ప్రతాప రామసుబ్బయ్య

ప్రతాప రామసుబ్బయ్య (జననం 1908) గారిది గుంటూరు. 1921లో గుంటూరు జిల్లాలో జరిగిన పన్నుల నిరాకరణోద్యమ ప్రభావం వల్ల రెండవ ఫారం చదువుతూ మానేసి, ఖద్దరు బట్టలు ధరించి ప్రచారం చేస్తూ, కొన్ని రోజులు పోలీసు నిర్బంధంలో ఉన్నారు. గుంటూరులోనూ, బందరులోనూ జాతీయ కళాశాలల్లో విద్య నభ్యసించారు. నూలు వడకడం, బట్టలు నేయడం, వడ్రంగంపని మొదలైనవి నేర్చుకున్నారు. 1922లో ఉద్యమం విరమింపబడ్డ తరవాత హైస్కూల్లో చేరారు. అన్నాప్రగడ కామేశ్వరరావు మొదలైన విప్లవకారులతో పరిచయం చేసుకొని, విప్లవ సాహిత్యం చదివారు. శారీరక మానసిక పాటవం పెంచుకొంటూ, నిర్మాణ కార్యక్రమాల్లో పాల్గొన్నారు.

1928లో, ఎస్.ఎస్.ఎల్.సి. పూర్తయిన తరువాత, సైమన్ కమిషన్ వ్యతిరేక ప్రదర్శనలో పాల్గొని, 15 రోజులు నిర్బంధంలో వున్నారు. విడుదలయ్యాక, షేక్ గాలిబ్, అమంచర్ల గోపాలరావు మొదలైన వారితో కలిసి యువజన సంఘం స్థాపించారు. వివిధ దేశాల స్వాతంత్ర్యోద్యమ చరిత్రలు చదివారు. తోటి యువకులతో కలిసి రాజకీయ సామాజిక సమస్యలపై జరిగే చర్చలలో పాల్గొనేవారు. జిల్లా కాంగ్రెసు నాయకులైన కొండా వెంకటప్పయ్య, ఉన్నవ లక్ష్మీనారాయణ, దుగ్గిరాల గోపాలకృష్ణయ్య ప్రభృతులతో పరిచయ మేర్పరచుకొని, వారి కార్యకలాపాలచే ప్రభావితులయ్యారు.

1931లో కరాచీ కాంగ్రెసుకు, 1934లో బొంబాయి కాంగ్రెసుకు ప్రతినిధిగా వెళ్ళారు. అ.భా.కాం. సోషలిస్టు మహాసభలో (1934) పాల్గొన్నారు. అంతకు ముందే రామసుబ్బయ్యగారు రాష్ట్ర కాంగ్రెసు కమిటీలో సభ్యులు. 1930–34 శాసనోల్లంఘనోద్యమంలో పాల్గొని, రెండుసార్లు జైల్లో నిర్బంధింపబడ్డారు. $2\frac{1}{2}$ సంవత్సరాల తరవాత విడుదలై వచ్చి, యువజన సంఘాల కార్యక్రమాల్ని ఉధృతం చేశారు. 1934లో పుచ్చలపల్లి సుందరయ్యగారు గుంటూరు వచ్చినప్పుడు, జొన్నలగడ్డ రామలింగయ్య, మాడభూషి వెంకటాచారి మొదలైనవారితో కలిసి సోషలిస్టు – కమ్యూనిస్టు సిద్ధాంతాలపైన, రష్యా విప్లవం, లెనిన్ నాయకత్వం పైన జరిగే చర్చలలో పాల్గొనేవారు. వారందించిన గ్రంథాలను రాత్రింబవళ్ళు అధ్యయనం చేశారు.

దుర్భా కృష్ణమూర్తి, పోలేపెద్ది నరసింహమూర్తి, పెండ్యాల లోకనాథం మొదలైన వారితో కలిసి గుంటూరులో, వీరి యింట్లోనే ప్రథమంగా ఎర్రజెండా ప్రతిష్ఠించబడినది. సుందరయ్యగారి నాయకత్వాన 1935లో కమ్యూనిస్టు పార్టీ స్థాపించబడింది. ఆనాడు భారత కమ్యూనిస్టు పార్టీ నిషిద్ధ సంస్థ. అందువల్ల, కార్మికుల్లో పనిచేసేందుకు కూలీ రక్షణ సమితి స్థాపింపబడింది. దాని అధ్యక్షుడు రామసుబ్బయ్యగారు; కార్యదర్శులు జొన్నలగడ్డ రామలింగయ్య, దుర్భా కృష్ణమూర్తిగార్లు.

★ ★ ★

# కీ.శే. పెండ్యాల లోకనాథం

పెండ్యాల లోకనాథం (జననం: 1909) గుంటూరు జిల్లా పెదనందిపాడు ఫిర్కా పుసులూరు గ్రామంలో మేనమామల యింట్లో ఉండగా పన్నుల నిరాకరణోద్యమం జరిగింది. రైతులు పన్నులు చెల్లించడం మానివేయడం, పోలీసులు తమ బళ్ళను జప్తుచేయకుండా నిరోధించడానికి చెరువులో వాటిని వదిలివేయడం, విలువగల వస్తువుల్ని రహస్య స్థలాల్లో దాచటం, ధాన్యం – బిందెలు – పాత్రలు పేదరైతుల, కూలీల యిళ్ళలో భద్రపరచుకోవడం, పోలీసులు కరణాన్ని అరెస్టు చేసి జైలుకు పంపడం, విదేశ వస్త్రాల దహనం, ఖద్దరు వ్యాప్తి – యివన్నీ వీరిని ఉత్సాహపరచాయి. కొన్నాళ్ళు కాంగ్రెసు ప్రచారకులతో కలిసి గ్రామాల్లో తిరిగారు. "ఆ రోజులు అత్యంత మధురమైనవిగా, అత్యంత పవిత్రమైనవిగా, మహోన్నతమైనవిగా భావించవచ్చు"నని ఆయన తన జ్ఞాపకాలలో తెలియజేశారు.

1934లో జొన్నలగడ్డ రామలింగయ్య, ప్రతాప రామసుబ్బయ్య ప్రభృతులు చట్టధిక్కారణ నేరానికి జైలుశిక్ష లనుభవించి, విడుదలై వచ్చారు. చర్చల సందర్భంలో వారు "కాంగ్రెసు ధనికవర్గ సంస్థ అనీ, దాని కార్యక్రమం మితవాదపూరితమనీ, మోసపూరితమనీ, తెల్లవారిస్థానే నల్ల (ధనిక) వారి రాజ్యస్థాపన వారి ఆశయమనీ, పేదల రాజ్యం కావాలంటే కార్మిక కర్షకులు పోరాడి కమ్యూనిస్టు రాజ్యం స్థాపించుకోవా"లనీ వగైరా తాము నమ్మిన సిద్ధాంతాలను బోధించారు. లోకనాథంగారికి వారి బోధలు నచ్చాయి.

"ఉత్సాహం పట్టలేక, వారితో చెప్పకుండానే పేటలలో, మిల్లులలో, బజార్లలో తిరిగి, వారి (కార్మికులు) కష్టాలను వారికి గుర్తుతెస్తూ కార్మిక సంఘాల ఆవశ్యకతను గురించి ప్రబోధించసాగాను. కాని, వారు నేను చెప్పేనదంతా విన్నారేకాని, చివరకు సంఘం అంటే సమ్మె చేయమనేగా మీరు చెప్పేది? మా కొద్దులే సంఘాలు" అని వెళ్ళిపోయేవారు. వారికి ఎట్లా నచ్చచెప్పాలో నాకు తెలియలేదు. ప్రతిరోజూ సాయంత్రం నాకు యిదే పని. చివరకు ఒకటి తోచింది. వారి కష్టాలను ప్రతిబింబిస్తూ, వర్గపోరాట ప్రాముఖ్యాన్ని విశదపరుస్తూ, కార్మికులు పాడుకొనే సులభశైలిలో ఒక పాట రాశాను: 'కూలీలందరు ఏకమైతే కూటికీ తరుగేమిరా....'

ఆ పాట రాసి, కార్మికులకు పనిలేని సమయంలో వారి యిండ్లకు వెళ్ళి, వారిని కూచోపెట్టి వినిపించేవాణ్ణి. ఆ పాట వాళ్ళ మనస్సులలో బాగా హత్తుకుపోయింది. అంతా ఇది నిజమేరా! అనుకున్నారు. ఆ మీదట విజయగర్వంతో వెళ్ళి నా కామ్రేడ్స్‌తో నేను కార్మికులలో పనిచేసే తీరును గురించి కొంత చెప్పగా, వారు అమితంగా సంతోషించారు. పాట చదివి సంతోషపడ్డారు. అప్పటినుంచి వారు

కూడా నాతోపాటు ప్రచారంలో దిగారు. ప్రచారం జోరుగా సాగుతోంది. మాకు రోజూ యిదే పని. ఆ పాటను మేము అచ్చు వేయించి వేలకొలది ప్రతులు పంచిపెట్టాం."

కార్మికుల్లో వర్గచైతన్యం కలిగించి, సంఘాల్లో వారిని సభ్యులుగా చేర్చి పోరాటాలు నడపడానికొక సంస్థ అవసరమైంది. కమ్యూనిస్టు పార్టీ నిషిద్ధసంస్థ గనుక, ఆ కర్తవ్యం నెరవేర్చడానికి పదిమంది కామ్రేడ్స్‌తో కూలీ రక్షణ సమితి ఏర్పరచబడింది. దానికొక ఆఫీసు, ఆ ఆఫీసు కొక సుత్తి - కొడవలి ఎర్రజండా, దాని ఆధ్వర్యాన చాల కరపత్రాలు ప్రచురింపబడ్డాయి. కూలి రక్షణ సమితి సభ్యుల్లో కొందరు కమ్యూనిస్టు పార్టీ సభ్యులు.

"మా ప్రబోధం వినడానికి క్రైస్తవ కార్మికులు చర్చీలలోకి కూడా మమ్మల్ని పిలిపించుకొని, మా పాట పాడించుకొని, మా బోధలు శ్రద్ధగా వినసాగారు" అని లోకనాధంగారు వ్రాశారు. సామ్రాజ్యవాద వ్యతిరేకత, కాంగ్రెసు వ్యతిరేకత, మత వ్యతిరేకత, దైవభావ వ్యతిరేకత - యివి తమ మార్గదర్శక సూత్రాలని కూడా వారు వ్రాశారు.

★ ★ ★

# కీ.శే. తుమ్మల వెంకట్రామయ్య



తుమ్మల వెంకట్రామయ్య (జననం: అక్టోబరు 1914) తెనాలి తాలూకా కొల్లూరులో జన్మించారు. ఊహ తెలిసిన నాటినుంచీ రాజకీయ వాతావరణంలో పెరిగారు. కాంగ్రెసు పిలుపు నందుకొని, కొల్లూరులో స్థాపింపబడ్డ జాతీయ పాఠశాలలో చేరి హిందీ, తెలుగు, సంస్కృతం నేర్చుకున్నారు. ఇంగ్లీషు భాష బేసిక్ పద్ధతిలో నేర్పబడేది. ఆ పాఠశాల స్థాపకుడు బ్రహ్మాండం నరసింహంగారు. దాని నిర్వహణార్థం విద్యార్థుల్ని వెంటబెట్టుకొని భిక్షాటన చేసేవారు. విరాళాలు వసూలు చేసేవారు. వారు కనిపెట్టిన "నీల్ కాల్" సిరా గాంధీ ప్రశంస అందుకొంది.

ఇతర విద్యార్థులతో పాటు వెంకటరామయ్య స్కూలులో రాట్నంమీద నూలు వడికారు. మగ్గంమీద బట్టలు నేశారు. వడ్రంగి పని నేర్చుకున్నారు. బుక్ బైండింగు చేశారు. సబ్బులు మొదలైనవి చేయడానికి ప్రయత్నించారు. కొన్నాళ్ళ తరువాత, ఆర్థిక యిబ్బందులవల్ల పాఠశాల మూసివేయబడింది. అందుచేత వేరు మార్గంలేక హైస్కూలులో ప్రవేశించారు. ఉప్పు సత్యాగ్రహం, జాతీయ గేయాలు,

నాయకుల అరెస్టులు విద్యార్థుల్ని ఉద్రూత లూగించేవి. సావర్కార్ జీవిత గాథ, భగత్సింగ్, సుఖదేవ్, రాజగురుల ఉరి, విప్లవకారుల వీరకృత్యాలు వీరిపై గాఢ ముద్ర వేశాయి. "పాఠ్య గ్రంథాల్లోని బ్రిటిష్ చక్రవర్తుల ఫోటోలు చించివేశాం. ఖద్దరు టోపీ ధరించినందుకు శిక్షిస్తున్న రోజుల్లో అందుకు నిరసనగా క్లాసు విద్యార్థులమంతా ఖద్దరు టోపీలు ధరించి క్లాసులకు హాజరయ్యాం. అందుకు జరిమానా విధించారు. అరెస్టులకు నిరసనగా క్లాసులను బహిష్కరించాం. సబ్ రిజిస్ట్రార్ ఆఫీసుపై ఎగిరే యూనియన్ జాక్‌ను రహస్యంగా తగులబెట్టాం" అని వీరు తన వ్యాసంలో వ్రాశారు ("కమ్యూనిజం", డిశంబరు 1975). అరెస్టు వారంటు కూడా పుట్టిందటగాని, అమలు జరగలేదట.

తరువాత గాంధీజీ ప్రారంభించిన హరిజనోద్యమం వీరిపై గాఢమైన ప్రభావం కలిగించింది. పొరుగు గ్రామమైన అనంతవరంలో కొందరు ఉదారవాదులు హరిజనులకు కరువు రోజుల్లో 'నాము' లేకుండా అప్పులిస్తే, కొందరు రైతులు దాన్ని వ్యతిరేకించారు. హరిజనులపై ఆంక్షలు విధించారు. హరిజనుల్ని ఆదుకొన్న రైతు కుటుంబాల్ని వెలివేశారు. వీటికి హరిజనులు లెక్కచేయక, మాల మాదిగలు ఒకటై ఊరేగింపు జరిపారు. వారికి అండగా ఉన్న ఒక గాంధీవాది నిరాహార వ్రతం చేశారు. జిల్లా కాంగ్రెస్ నాయకులు జోక్యం చేసుకొని ఆ సమస్యను హరిజనుల కనుకూలంగా పరిష్కరించారు. ఆ రోజుల్లోనే, ఒక గ్రామంలో హరిజనులపై దౌర్జన్యం జరిగిందన్న వార్త చదివి, వెంకట్రామయ్యగారు గాంధీజీకి ఉత్తరం వ్రాశారు. తాను ఆంధ్రలో పర్యటించేటప్పుడు ఈ విషయాన్ని విచారిస్తానని గాంధీజీ తన కార్యదర్శి ద్వారా జవాబు వ్రాయించారు.

అనంతవరంలో ఒక కాంగ్రెసువాది ధూళిపాళ కోటయ్య "కార్మిక ప్రచురణలు" అంటూ 1933 డిశంబరులో చిన్న చిన్న కరపత్రాలు ప్రచురించసాగారు. వాటిని ఉచితంగా, ఎవరడిగితే వారికి పంపేవారు. పేద రైతులు, వ్యవసాయ కూలీల బాధలను కథల రూపంలో చిత్రించి, వారిపట్ల సానుభూతి కలిగేలా వ్రాసేవారు.

7వ ప్రచురణలో (1934 జులై) "మాతృ హృదయం" అనే శీర్షికలో వీరు రచించిన కథ మాక్సింగోర్కీ "అమ్మ" నవలకు సంక్షిప్తీకరణ. ఆనాడు కాశీ విశ్వవిద్యాలయంలో చదువుకొంటున్న కాట్రగడ్డ నారాయణరావుగారు పంపిన "అమ్మ" చదివి రాసిన కథ అది. "నాకు కమ్యూనిస్టు భావాల అంకురార్పణ ఈ గ్రంథంతో కలిగిందనవచ్చు" అని రాశారు, తుమ్మల తన వ్యాసంలో.

తుమ్మల "మాతృ హృదయం" రచించాక, కాశీ విద్యాపీఠ్‌లో "శాస్త్రి" కోర్సు చదవడానికి వెళ్ళారు. దాన్ని నెలకొల్పింది శివప్రసాద్ గుప్తా. కొత్తగా స్థాపింపబడ్డ అఖిల భారత కాంగ్రెసు సోషలిస్టు పార్టీ నాయకుల్లో ఒకరైన ఆచార్య నరేంద్రదేవ్ దానికి ప్రిన్సిపాల్. సంపూర్ణానంద్, శ్రీప్రకాశ్ మొదలైనవారు అధ్యాపకులు.

విద్యాపీఠ్‌లో 1934లో కమ్యూనిస్టు సెల్ ఏర్పడింది. అందులో తుమ్మల సభ్యుడు. ఓంకార్ నాథ్ సెల్ సెక్రటరీ. రహస్యంగా కమ్యూనిస్టు సాహిత్యం ఇవ్వడమే గాక అధ్యయన తరగతులు నిర్వహించేవారు. బోగ్దనోవ్ రచించిన "ఎ.బి.సి.

ఆఫ్ కమ్యూనిజం" వీరి మొదటి పఠన గ్రంథం. "మాకు జటిలంగా వున్న కమ్యూనిస్టు గ్రంథాలను తీరికగా వున్న వేళల్లో ఆచార్య నరేంద్రదేవ్ చేత, సంపూర్ణానంద్ చేత, శ్రీప్రకాశ్ చేత చెప్పించుకొనేవారం. ఒకసారి డయలెక్టిక్స్ (గతి తార్కికవాదం) గురించి శ్రీప్రకాశ్‌ని వివరించమని అడిగాం. ఆయన దాన్ని చాలా సరళంగా బోధించారు. కానీ, తానీ సిద్ధాంతాన్ని నమ్మననీ, తన అభిప్రాయాలు వేరనీ చెప్పారు. తాము భేదించే రాజకీయాలను కూడా ఉన్నవి ఉన్నట్లు వివరించి చెప్పే సహృదయత నాటి విద్యాపీఠ్ అధ్యాపకుల కుండేది" అన్నారు తుమ్మల వ్యాసంలో.

తన సెల్ సెక్రటరీ ఓంకార్ నాథ్ పచ్చి సెక్టేరియన్. ఆనాటి పార్టీ పాలసీ అలాంటిది. మీరట్ కుట్రకేసులో విడుదలయి వచ్చిన కొందరు ప్రముఖులు విద్యాపీఠ్‌లో ఉపన్యాసాలిస్తూ ఉండేవారు. 1935లో కోమింటర్న్ ఏడవ మహా సభ ఆమోదించిన ఐక్య సంఘటన విధానం నరేంద్రదేవ్‌కి ముందుగానే తెలిసినట్లుంది. "మీ పద్ధతులు మార్చుకో"మని ఆయన హితవు చెప్పారు. కాని, ఓంకార్ నాథ్ అది నమ్మక, నరేంద్రదేవ్‌తో దెబ్బలాడాడు. పైగా, ఆయన చూపించిన పత్రాలు ఫోర్జరీ అని నిందించాడు. ఆ తరువాత కొన్నాళ్ళకు గుంటూరులో జరిగిన యువజన మహాసభకు ఓంకార్ నాథ్‌ను ఆహ్వానించాం. అక్కడ కూడా ఆయనది అదే ధోరణి. యువజన మహాసభకు వచ్చిన కాంగ్రెసువాదులంతా ఈయన వాడిన పరుష వాక్యాలకు నిరసనగా సభనుంచి వెళ్ళిపోయారు (కమ్యూనిజం, డిశంబరు 1975).

విద్యాపీఠ్‌లో సిద్ధాంత చర్చలు ఎక్కువగా జరిగేవి. ఒకవైపు అజ్ఞాతవాసంలో ఉన్న విప్లవకారులతో వారి మార్గం సరియైనది కాదని నచ్చచెప్పవలసి వచ్చేది. మరోవైపు మనువునూ, మార్క్సునీ సమన్వయమొనర్చుతున్న భగవాన్ దాస్ లాంటి ఉద్దండ పండితులుండేవారు. అ. భా. కాంగ్రెసు సోషలిస్టు పార్టీ స్థాపకులు నరేంద్రదేవ్ లాంటివారూ ఉన్నారు. "వీరందరి మధ్య, మా గొంతు ఎంత చిన్నదయినా, మా సంఖ్య ఎంత స్వల్పమైనదైనా, ఎర్రజండా పరువూ, కమ్యూనిస్టు అంటే గౌరవమూ అక్కడ చోటుచేసుకున్నాయి" అని వ్రాశారు తుమ్మల.

విద్యాపీఠ్‌లో పార్టీ సభ్యులు దైనందిన రాజకీయాల్లో కూడా పాల్గొనేవారు. మిల్లు కార్మికులతో పనిచేసేవారు. కాంగ్రెసులో అతివాదుల పక్షాన నిలబడి, కరాచీ కాంగ్రెసు తీర్మానాలను అమలు జరపాలని విద్యార్థులు ఒకసారి ఎర్రజండాలతో ఊరేగింపు జరుపుతూంటే, మితవాదులు దౌర్జన్యం చేయడానికి ప్రయత్నించారు. అప్పుడు హిందూ విశ్వవిద్యాలయం నుంచి వచ్చిన కామ్రేడ్స్ విద్యాపీఠ్ కామ్రేడ్స్‌ని ఆదుకున్నారు.

వెంకట్రామయ్యగారు కాశీ విద్యాపీఠ్‌లో చదువు పూర్తి కాకుండానే, ఒక్క సంవత్సరం మాత్రం చదివి, గుంటూరుజిల్లాకు వచ్చి, పార్టీ కార్యకలాపాల్లో పాల్గొన నారంభించారు. వారితోపాటు కాశీ విద్యాపీఠ్‌కి వెళ్ళిన సోమూరి వెంకట్రామయ్య "కోవిద" డిగ్రీ చదివి, కమ్యూనిస్టు ఉద్యమం వల్ల ప్రభావితులై, చదువు పూర్తి అయ్యాక బందరు తిరిగి వచ్చారు.

ఆనాటి పార్టీ పంథాకు అనుగుణమైన వ్యాసాలు, కథలు, గేయాలు, కొన్ని

పత్రికలు ప్రచురిస్తూ ఉండేవి. ఆ పత్రికల్ని చదవడం, చదివించడం ఒక కార్యక్రమంగా ఉండేది. వెంకట్రామయ్యగారు ఒక ఇంటర్వ్యూలో యిలా తెలియజేశారు: "మేము కాంగ్రెసు ఉద్యమంలో గట్టిగా పనిచేసి యుండడంవల్ల జిల్లాలో కాంగ్రెసు నాయకు లెవరూ మా కార్యక్రమాలకు ఎదురు చెప్పేవారు కారు. కాంగ్రెసు సభ్యులుగా ఉంటూ యీ పనులు చేసేవాళ్ళం. 1935లో మేము పార్టీ ఆదేశానుసారం కాంగ్రెసు నుంచి రాజీనామా యివ్వవలసి వచ్చింది. తర్వాత, 1936లో పార్టీ పాలసీలో మార్పు వచ్చిన ఫలితంగా, తిరిగి కాంగ్రెసులో చేరాం. ఈ మార్పు కాంగ్రెసు నాయకుల్లో కొద్దిమందికే తెలుసు. ప్రజలకు మాత్రం కాంగ్రెసు వాదులంగా, దేశభక్తులుగా, త్యాగశీలురంగా కనిపించేవాళ్ళం."

★ ★ ★

# కీ.శే. కొండేపూడి లక్ష్మీనారాయణ

కొండేపూడి లక్ష్మీనారాయణ (భీమవరం) 1930–31లో సత్యాగ్రహ సమరం కొనసాగుతూండగా బొండాడ గ్రామంలో మరికొందరితో కలిసి తాటిచెట్లకు కట్టిన కల్లుకుండలను క్రిందినుంచి రాళ్ళతో పగలగొట్టడం, రాత్రిపూట చెట్లమీద, దేవాలయ శిఖరంపైన జాతీయ పతాకా లెగురవేయడంవంటి కార్యక్రమాల్లో పాల్గొనేవారు. "వీర భారతి" ప్రతుల్ని రహస్యంగా పంచేవారు. భీమవరంలో చదువుకొంటున్నప్పుడొకసారి సమ్మె జరిగితే అందులో పాల్గొన్నారు. "విద్యార్థి" అనే సైక్లోస్టైయిల్ మాసపత్రిక నిర్వహించేవారు. ఇంటరు చదువుతూండగా కాకినాడ బాంబు కేసు విచారణ జరుగుతూంటే దానిపట్ల ఆసక్తి చూపేవారు. సెలవుల్లో స్వదేశీ వస్తువులు విక్రయించడం, రాత్రులు కార్మికులకు చదువు చెప్పడం వంటి కార్యక్రమాల్లో పాల్గొనేవారు. "ప్రజాబంధు" "చిత్రగుప్త" పత్రికలకు కథలు, వ్యాసాలు, నాటికలు వ్రాసి పంపేవారు. కాంగ్రెసులోని అతివాదులు అల్లూరి సీతారామరాజు జన్మదినోత్సవాలు జరుపుతోంటే వారికి సహాయపడేవారు. ఆ సందర్భంలో రెండుసార్లు పోలీసు అరెస్టు నుంచి తప్పించుకున్నారు.

ఇంటర్మీడియట్‌లో చదువుకు స్వస్తిచెప్పి, ఏలూరులో మకాంపెట్టి, గారపాటి మొదలైన వారితో కలిసి కూలీరక్షణ సమితి, ప్రెస్ వర్కర్స్ యూనియన్, తోళ్ళ కార్మిక సంఘం, యువజన సంఘ కార్యక్రమాలకు తోడ్పడేవారు. తరవాత, కాంగ్రెసు సోషలిస్టు పార్టీలో చేరారు. 1936 సెప్టెంబరు చివరి వారంలో రాజమండ్రిలో జరిగిన ద్వితీయ ఆం.రా.కాం.సో. పార్టీ మహాసభకు ప్రతినిధిగా వెళ్ళారు. కమ్యూనిస్టులు, అతివాద కాంగ్రెసు నాయకులు నిర్వహిస్తున్న ప. గో. జిల్లా కాంగ్రెసు కమిటీకి ఆఫీసు మేనేజరుగా పనిచేశారు. కొన్నాళ్ళ తరువాత కమ్యూనిస్టు పార్టీలో చేర్చుకోబడి, రాజమండ్రి నుంచి వెలువడే "నవశక్తి" వారపత్రిక (రాష్ట్ర కాంగ్రెసు సోషలిస్టుపార్టీ పత్రిక) ఆఫీసు మేనేజరుగా పనిచేశారు. ఆ పత్రిక బెజవాడకు మార్చబడ్డాక ప్రెస్ మేనేజరుగాను, ఆఫీసు మేనేజరుగాను ఉన్నారు. ఆ విధులు నిర్వర్తిస్తూనే నవశక్తికి కథలు, వ్యాసాలు కూడా వ్రాస్తూ ఉండేవారు.

★ ★ ★

# కీ.శే. ఆరుట్ల రామచంద్రారెడ్డి



ఆరుట్ల రామచంద్రారెడ్డి (జననం: 1909) నల్గొండజిల్లా భువనగిరి తాలూకా కొలనుపాకలో జన్మించారు. 1926లో భువనగిరి వెళ్ళి, అక్కడి మాధ్యమిక పాఠశాలలో ఫస్టుఫారంలో ప్రవేశించారు. రెండేళ్ళ తరవాత హైద్రాబాద్ వెళ్ళి ఘోషా మహల్ మిడిల్ స్కూలులో మూడవ ఫారంలో చేరి, 1928లో ప్యాసయ్యారు. 1930లో నాంపల్లి హైస్కూల్లో మెట్రిక్ ప్యాసయ్యారు. గాంధీజీ ప్రారంభించిన ఉప్పు సత్యాగ్రహం, భగత్సింగ్ తదితరుల సాహస కృత్యాలు వీరిని ఉత్తేజపరచాయి. తన "తెలంగాణా పోరాట స్మృతులు" అనే పుస్తకంలో రామచంద్రారెడ్డిగారిలా వ్రాశారు: "నేను ఖద్దరుధారినై, తకిలీపై దారం తీస్తూ, బజారులో నడుస్తూ, ఊరేగింపులందు పాల్గొనేవాణ్ణి. గాంధీని ఒక ఆదర్శనాయకునిగా గుర్తించి, వారి గుణగణాలను అలవరచుకొనుటకు తీవ్రకృషి చేసేవాణ్ణి. అంతకుపూర్వం చెడు సహవాసములో ఉండటంవల్ల చెడు అలవాట్లకు గురైన నేను, నన్ను బాగుపరచుకొనుటకు చేసిన కృషి యింతింత అని చెప్ప వీలుపడదు."

వీరు తన మేనమామ కుమార్తె కమలాదేవిని నాలుగు షరతుల మీద వివాహం చేసుకున్నారు: వధూవరులు ఖద్దరు దుస్తులు ధరించడాని కనుమతించడం; వరకట్నం తీసుకోకుండడం; వివాహానంతరం వధువును చదివించడానికి హైదరాబాద్ పంపడం; వివాహంలో మధు మాంసాల నిషేధం.

ఆ రోజుల్లో హైదరాబాద్‌లో బాలికల హాస్టల్ లేదు. రామచంద్రారెడ్డిగారు తనతోబాటు బాలుర హాస్టల్‌లో ఉంటున్న 20 మంది విద్యార్థుల్ని వెంట బెట్టుకుని, పోలీస్ కమీషనర్ వెంకట్రామారెడ్డితో తమ చెల్లెండ్రను కూడా చదివిస్తామని చెప్పించి, బాలికల హాస్టల్‌ను తెరిపించేటట్లు చేశారు కాని, మామగారు తన కూతుర్ని హైదరాబాద్ పంపడానికి నిరాకరించారు. దానిమీద నిరశన వ్రతం చేసి ఆయనను లొంగదీశారు. కమలాదేవి మూడవ తరగతిలో చేరి, మెట్రిక్ ప్యాసయాక భర్తతో కలిసి కార్యరంగంలో ప్రవేశించారు. సంతానం ప్రజాసేవకు ఆటంకమవుతుందని తెలుసుకొని, కుటుంబ నియంత్రణ పాటించారు.

రెడ్డిగారు 1931–32లో ఉస్మానియా యూనివర్సిటీలో చేరి, విద్యార్థిగా ఉంటూనే ఆంధ్ర మహాసభ, ఆర్యసమాజ్, స్టేట్ కాంగ్రెసు కార్యకలాపాల్లో పాల్గొనేవారు. ఫలితంగా, ఇంటరు మూడు సంవత్సరాలు చదవవలసి వచ్చింది. బి.ఏ. కూడ మూడు సంవత్సరాలు చదివి, కొన్ని సబ్జక్టులలోనే ప్యాసయారు. ఆ ఆరేళ్ళూ విద్యార్థిగానే ప్రజా ఉద్యమాలలో పాల్గొన్నారు.

1930లో జోగిపేటలో జరిగిన ప్రథమాంధ్ర మహాసభకు రావి నారాయణ రెడ్డిగారి నాయకత్వం క్రిందవెళ్ళిన 25 మంది వాలంటీర్లలో రామచంద్రారెడ్డి ఒకరు. అప్పటినుంచీ ప్రతి ఆంధ్ర మహాసభకు వాలంటీరుగానో, ప్రతినిధిగానో వెళ్ళి, వివిధ తీర్మానాలపై ఉపన్యాసా లిచ్చేవారు.

కొలనుపాక జాగీరుగ్రామం. ఒకరోజు జాగీర్దారు బహద్దర్ యార్జంగ్ వందల సంఖ్యలో హరిజనుల్ని సమీకరించి, వారంతా ముస్లిం మతంలో చేరితే వెట్టి, నిర్బంధ వసూళ్ళు ఉండవని చెప్పి, ముస్లిం మతంలో చేర్చాడు. ముస్లిం పేర్లు పెట్టి, నమాజు చేయించాడు. ఆ వార్త విని ఆర్యసమాజ్ నాయకులు కొలనుపాక వచ్చారు. కాని, హరిజనులు భయం వలన యీ విషయం చెప్పలేదు. ఆర్యసమాజ్ నాయకులు హైద్రాబాద్ వెళ్ళి రామచంద్రారెడ్డిగారితో చెప్పగా, ఆయన కొలనుపాక వెళ్ళి హరిజనులనుంచి వాస్తవం తెలుసుకున్నారు. మతం మార్చుకున్నా వెట్టి రద్దు కాలేదనీ, నిర్బంధ వసూళ్ళు సాగుతూనే ఉన్నవని చెప్పి, వారిలో ఆత్మవిశ్వాసం కలిగించారు. స్థానిక యువకుల సహాయంతో హరిజనుల్ని సంఘటితపరచి పోరాటం నడిపారు. పోలీసులు గ్రామాన్ని చుట్టుముట్టగా రామచంద్రారెడ్డి, లక్ష్మీనరసింహారెడ్డి మొదలయినవారు పోలీసు ఉన్నతోద్యోగుల మీద ఒత్తిడి తెచ్చి ముట్టడిని రద్దుచేయించారు. మతం మార్చుకున్న హరిజనులంతా తిరిగి హిందూ మతంలో చేరారు. గ్రామాలలో వెట్టి, నిర్బంధ వసూళ్ళు రద్దయాయి. అక్రమ పన్నులు రద్దయాయి. గ్రామంలో ఒక గ్రంథాలయం, బాలికల పాఠశాల స్థాపింపబడ్డాయి. పోలీసులు హిందూ మతస్థులపై జరిపే జులుంను ప్రజలు తిప్పికొట్టారు. ఆర్యసమాజ నాయకులు హైద్రాబాద్ సంస్థానానికి వచ్చి పెద్ద సంఖ్యలో సత్యాగ్రహాలు నడిపి, కోర్కెలను సాధించుకున్నారు.

ఆ రోజుల్లోనే, బాధ్యతాయుత ప్రభుత్వం కొరకు స్టేట్ కాంగ్రెసు ప్రారంభించిన సత్యాగ్రహోద్యమానికి రామచంద్రారెడ్డి విద్యార్థిగా ఉంటూ చేయూత నిచ్చారు. వారితోబాటు చదువుకొంటున్న ఐదుగురు విద్యార్థులు సత్యాగ్రహం చేయగా, పోలీసులు వారిని అరెస్టు చేసి చిత్రహింసలకు గురిచేశారు. దాన్ని గాంధీజీ ఖండించారు.

స్టేట్ కాంగ్రెసు ప్రారంభించిన సత్యాగ్రహం ఆపుజేయబడ్డాక, రెడ్డిగారు యూనివర్సిటీ విద్యార్థులతో కలిసి వందేమాతరం ఉద్యమ సందర్భంలో బర్తరఫు చేయబడి, చదువు పూర్తి చేయడానికి నాగపూరు యూనివర్శిటీకి వెళ్ళారు. 1937లో జరిగిన హరిపుర కాంగ్రెసుకు వలంటీర్‌గా వెళ్ళి, అక్కడి కార్యకలాపాలను వీక్షించారు. ఆ రోజుల్లో ఆయన అచ్చమైన గాంధీవాది; స్టేట్ కాంగ్రెసు కార్యకర్త. మహాసభ సందర్భంలో జరిగిన ఊరేగింపుకు ముందు ఒక ఏనుగునెక్కి, గాంధీజీ నిలువెత్తు చిత్రపటాన్ని చేత ధరించారు. "నేను ఊరేగింపు సందర్భమున కమాండరు ఫౌజు

పెట్టి, 'నీవు ఫలానా ఏనుగుపై ఎక్కి ఫలానా ఫోటో ధరించాలి' అని చెప్పాచూ, గాంధీగారి ఫోటో యింకెవరి చేతినుండో తీసుకొన్నాను" అని వ్రాశారు రెడ్డిగారు. (అదే పుస్తకంలో.)

స్టేట్ కాంగ్రెసు ప్రారంభించిన సత్యాగ్రహోద్యమానికి నాయకత్వం వహించిన రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, ఆరుట్ల లక్ష్మీనరసింహారెడ్డి మొదలయినవారు కమ్యూనిస్టు పార్టీలో చేరేక, రామచంద్రారెడ్డి కమ్యూనిస్టు సిద్ధాంతం, ఆచరణ ఎట్టివో తెలుసుకొని, తాను కూడ ఆ పార్టీలో చేరారు. ఆంధ్ర మహాసభ కార్యకర్తగా, నల్గొండ జిల్లాలో సాయుధ పోరాటం నడిపారు.

* * *

# కీ.శే. తమ్మిన పోతరాజు



శ్రీ తమ్మిన పోతరాజు 1913వ సంవత్సరంలో విజయవాడలో ఒక పేద కుటుంబంలో జన్మించారు. వీరి బాల్యం కష్టాలతోనే గడిచిపోయింది. వారానికి ఒకటి రెండు రోజులైనా పస్తులతో వుండటం పరిపాటయింది.

ఆ దుర్భర పరిస్థితులు ఎదుర్కొంటూనే స్కూలు ఫైనల్ వరకు చదువుకున్నారు. హైస్కూలు విద్యార్థిగా వున్న దశలోనే వీరు కీ.శే. పావర్కారు జీవిత చరిత్ర భారత స్వాతంత్ర్యోద్యమ పోరాట చరిత్ర, మాలపల్లి మొదలైన ఉత్తమ గ్రంథాల అధ్యయనం ద్వారా ఉత్తేజితులై రాజకీయాలవైపు ఆకర్షింపబడ్డారు.

బ్రిటిష్ సామ్రాజ్య వాదులను భారత దేశంనుండి పారద్రోలాలనే దీక్షతో జాతీయోద్యమంలో ప్రవేశించారు. విదేశీ వస్తు బహిష్కరణోద్యమంలో పాల్గొన్నారు.

విప్లవ యోధులు భగత్ సింగ్ మొదలగువారిని ఉరికంబాల కెక్కించిననాడు, జితేంద్రనాథ్ దాసు జైలులో అసువులు వీడిననాడు బ్రిటిష్ సామ్రాజ్య వాదుల దౌర్జన్యానికి అసమ్మతిగా విద్యార్థులకు నాయకత్వం వహించి సమ్మె చేయించారు.

శ్రీ పోతరాజు అతివాద భావాలవేపు మళ్ళడానికి ఈ ఘటనలే ముఖ్య కారణమయ్యాయి.

భగత్‌సింగ్ వంటి వీరులవలె సాయుధ పోరాటంద్వారా బ్రిటిష్ ప్రభుత్వాన్ని కూల దోయాలన్న భావంతో, ఆయుధాలు ఉపయోగించడం నేర్చుకోవాలని కొన్నాళ్ళపాటు సైన్యంలో చేరి పనిచేశారు.

1939లో కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం తీసుకొన్నారు. అయితే, వాస్తవంగా. అంతకు మునుపు నుండే పార్టీతో సంబంధాలు కలిగివున్నారు.

సోవియట్ రష్యాలో వలె యీ దేశంలో కూడా కష్టజీవుల రాజ్యాన్ని నెలకొల్పాలన్న దృఢదీక్ష, అవిరళకృషి ఆయన్ను ప్రజాసేవకునిగా రూపొందించాయి.

విజయవాడలో కమ్యూనిస్టు పార్టీ నిర్మాతగా, బలీయమైన కార్మిక సంఘాల నిర్మాణ కర్తగా పనిచేశారు. విజయవాడలో పలు కార్మిక సమ్మెలు, పోరాటాలను నడిపారు.

1948 ప్రాంతంలో కమ్యూనిస్టు పార్టీపై ప్రభుత్వం దారుణ దమన కాండను అమలు జరిపిన సందర్భంలోనూ, అక్రమ కేసుల సందర్భంలోనూ సుమారు ఐదున్నర సంవత్సరాలు జైలు జీవితం అనుభవించారు. ఒకటిన్నర సంవత్సరం రహస్య జీవితం గడిపారు. 1952-64 సంవత్సరాలలో రెండుమార్లు కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థిగా ఇదే నియోజకవర్గంనుండి శాసనసభకు ఎన్నికయ్యారు.

ప్రజా ఉద్యమాల్లోనేగాక, శాసనసభలోనూ మంచి వక్తగా, మంచి దక్షతగల ప్రజానాయకునిగా పేరు పొందారు.

★ ★ ★

# కీ.శే. వి.కె. ఆదినారాయణరెడ్డి



ప్రముఖ స్వాతంత్ర్య సమరయోధులు, అనంతపురంజిల్లా కమ్యూనిస్టు పార్టీ సీనియర్ నాయకులు శ్రీ వి. కె. ఆదినారాయణరెడ్డి 1917లో అప్పటి తాడిపత్రి తాలూకా ప్రస్తుత పెద్దపప్పూరు మండలం చీమలవాగుపల్లిలో శ్రీ రంగప్ప-రంగమ్మలకు జన్మించారు. ఈయనకు సోదరుడు వి. కె. నారాయణ రెడ్డి, సోదరీలు శ్రీమతి బి. పార్వతమ్మ, ఓబులమ్మ వున్నారు. అయితే, సోదరుడు నారాయణరెడ్డి, సోదరి ఓబులమ్మ ఇదివరలోనే మరణించారు. వారు సి.పి.ఐ.లో పనిచేశారు. బి. పార్వతమ్మ ప్రస్తుతం మహిళా సమాఖ్య రాష్ట్ర నాయకురాలు.

కా॥ వి.కె. హైస్కూల్ విద్యాభ్యాసాన్ని (పదవ తరగతి వరకు) తాడిపత్రిలో అభ్యసించారు. తర్వాత గుత్తిలో లండన్ మిషన్ స్కూల్‌లో ఎస్.ఎస్.ఎల్.సి. పూర్తి చేశారు. అనంతరం 1938లో అనంతపురంలోని ప్రఖ్యాత ఆర్ట్స్ కళాశాలలో పి.యు.సి. చదివారు.

అంతకుముందే (1937)లో ఉమ్మడి మదరాసు రాష్ట్రానికి ఎన్నికలు జరిగాయి. ఆ సందర్భంలో భూస్వామ్య అనుకూల జస్టిస్ పార్టీ, కాంగ్రెస్ పార్టీ ఎన్నికల్లో నిలబడ్డాయి. ఆయన కాంగ్రెస్ అభ్యర్థిని బలపరిచారు. అప్పటికే విద్యార్థి సమాఖ్యను స్థాపించిన కామ్రేడ్ వి.కె. బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలో పాల్గొన్నారు. క్విట్ ఇండియా 1942 ఉద్యమ సందర్భంలో అనంతపురం కళాశాల లేబొరేటరీని విద్యార్థి కాంగ్రెస్ అనుయాయులు తగులబెడితే, కామ్రేడ్ వి.కె., రాజశేఖరరెడ్డి తదితరులను ఈ దహనం కేసులో ఇరికించి అరెస్టు చేశారు. బళ్ళారి జైలుకు తరలించారు. అప్పుడు వీరి తరపున బళ్ళారి రాఘవ, నగరూరు రాఘవాచారి అనే న్యాయవాదులు వాదించి, జైలు నుండి విడిపించారు. బయటికి వచ్చిన మరుక్షణం నుంచే ఆయన స్వేచ్ఛా, స్వాతంత్ర్యాలకోసం, హక్కులకోసం పోరాడారు. విద్యార్థి సమాఖ్యను మరింత బలోపేతం చేశారు. అప్పటికే పెద్దోళ్ళ కుటుంబాలంటే అసహ్యించుకొనే కా॥ వి.కె. కర్నూల్ జిల్లాకు చెందిన భీమసేనరెడ్డి, హన్ రెడ్డి, కళ్యాణదుర్గానికి చెందిన వన్నూరప్పలను ఎస్.ఎఫ్. నాయకులుగా తయారుచేశారు.

వ్యక్తిగత స్వేచ్ఛకోసం పోరాడేందుకు సైన్యంలా అప్పటి విద్యార్థులను (సహచరులు) తీర్చిదిద్దారు.

కా॥ వి.కె.గారు 1937 ప్రాంతంలో కాంగ్రెస్‌లో వున్నారు. అయితే, ఆ పార్టీలో అప్పటికే ఛాందస, పెత్తందారీ శక్తుల ఆధిపత్యం సాగేది. శ్రీ భోగరాజు పట్టాభి సీతారామయ్య ప్రోత్సాహంతో కాంగ్రెస్‌పట్ల వి.కె. ఆకర్షితులైనారు. తర్వాత ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు కా॥ ఏటుకూరి బలరామమూర్తి మార్క్సిజం గురించి కమ్యూనిస్టు ఉద్యమం గురించి చేసిన బోధనలు కారణంగా, ఆయనిచ్చిన స్ఫూర్తితో కా॥ వి.కె.గారు స్వతంత్ర పోరాటంలో పాల్గొంటూనే సి.పి.ఐ.లో చేరారు.

సి.పి.ఐ. అంటే పేదల పార్టీ అని తెలుసుకునే ఆయన ఆనాడు చేరారు. అప్పటినుండి కా॥ వి.కె. అనంతపురం జిల్లాలో కమ్యూనిస్టు పార్టీకి బీజాలు వేసి పార్టీని తీర్చిదిద్దారు. అప్పట్లో ఆయన్ను సహచరులంతా 'భీముడు'గా పిలుచుకొనేవారు. ఆయన తర్వాత కా॥ తరిమెల నాగిరెడ్డి, కా॥ ఐదుకల్లు సదాశివన్, కా॥ నీలం రాజశేఖర్‌రెడ్డి, కా॥ విద్వాన్ విశ్వం పార్టీకి పునాదులయ్యారు. తర్వాత విద్వాన్ విశ్వంగారు రచనావ్యాసంగంలోకి వెళ్ళారు.

1942లో పార్టీ నిర్మాణం కోసం కా॥ వి.కె.ని కర్నూల్ జిల్లా ఆదోనికి పంపారు. అప్పుడు కమ్యూనిస్టు పార్టీపై నిషేధం వుండడంతో అక్కడా, ఇక్కడా రహస్యంగా పనిచేస్తూ, 1952 వరకు పార్టీ నిర్మాణమే ధ్యేయంగా పనిచేశారు.

ఆ సమయంలో అండర్‌గ్రౌండ్‌లో వుంటూనే ఆయన స్వగ్రామం చీమల వాగుపల్లిలో కూడా సదస్సు జరిపారు. అప్పటికే ఆయన తరిమెల గ్రామంలో పార్వతమ్మను వివాహమాడారు. కా॥ వి.కె. దంపతులకు పిల్లలు లేరు. ఆయనకున్న 50 ఎకరాల భూమిని పార్టీ కోసమే వెచ్చించారు. చీమలవాగుపల్లిలో వున్నప్పుడు జి. రామకృష్ణ అందజేసిన 'అమ్మ', 'మాలపల్లి' పుస్తకాలను చదివారు. వాటితో ఉత్తేజం పొందిన కా॥ వి.కె. విద్యార్థి ఉద్యమాలను మరింత బలోపేతంగా తీర్చిదిద్దారు.

బొంబాయిలో జరిగిన సి.పి.ఐ. రాజకీయ పాఠశాలకు కామ్రేడ్ వి.కె. వెలరోజులపాటు హాజరైనారు. క్లాసులను కా॥ పి.సి. జోషి, అధికారి, ఎన్.కె. క్రిష్ణన్ నిర్వహించారు. తిరిగి వచ్చిన తర్వాత కర్నూల్ జిల్లాలోని కోసిగి దొరల దౌర్జన్యాలకు, అకృత్యాలకు వ్యతిరేకంగా వీరోచిత పోరాటం సలిపి, విజయం సాధించారు. వెంటనే ఆలూరులో మున్సిపల్ వర్కర్స్ యూనియన్‌ను స్థాపించారు.

1946లో అనంతపురం తిరిగివచ్చి కా॥ వి.కె. గారు అప్పటి ఎన్నికల్లో తరిమెల నాగిరెడ్డి, నీలం సంజీవరెడ్డి (బావ, బావమరుదులు) తలపడుతున్న సమయంలో కమ్యూనిస్టు అభ్యర్థి అయిన నాగిరెడ్డి తరపున ప్రచారం నిర్వహించారు. అయితే, అప్పటికే చిల్లరోళ్ళ పార్టీగా పిలవబడుతున్న సి.పి.ఐ. అభ్యర్థి నాగిరెడ్డి ఓడిపోయారు. అయినా, ఏమాత్రం నిరుత్సాహంలేని కా॥ వి.కె. తర్వాత జిల్లాలోని పాముపల్లి, దొరిగల్లు, కొనకొండ్ల, శాసనకోట, కౌకుంట్ల అగడాలకు వ్యతిరేకంగా రాజీలేని పోరాటాలు నడిపి విజయదుందుభి మ్రోగించారు. తిరిగి 1952లో ఎన్నికలొచ్చిన

సందర్భంగా నాగిరెడ్డి, సంజీవరెడ్డిలు పోటీచేస్తే నాగిరెడ్డి (తరిమెల)ని, జైలునుండే నామినేషన్ వేయించి, 13 వేల మెజార్టీతో గెలిపించి, విరోచిత విజయునిగా వి.కె. కీర్తిని గడించారు.

1955 ఎన్నికల్లో తాడిపత్రిలో కాంగ్రెస్ అభ్యర్థి చల్లా సుబ్బారాయుడుతో కా॥ వి.కె. పోటీ చేసి ఓడిపోయారు. 1962 ఎన్నికల్లో గుత్తినుండి పాపాసాహెబ్‌పై ఎన్నికల్లో పోటీ చేసి గెల్చి, కా॥ వి.కె. అసెంబ్లీకి వెళ్ళారు. 1966లో 'విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు' అనే పోరాటంలో కమ్యూనిస్టు పార్టీ ఆదేశానుసారం శాసనసభ సభ్యత్వాన్ని త్యజించారు.

సి.పి.ఐ. 1964లో చీలిపోయినపుడు ముఖ్య నాయకులు సి.పి.ఎం.వైపే వెళ్ళడంతో రాయలసీమ జిల్లాల సి.పి.ఐ. నిర్మాణం కా॥ వి.కె. భుజస్కంధాలపై పడింది. నెలకు 25 రోజులపాటు పార్టీ పటిష్టతకే పనిచేసి, సి.పి.ఐ.ని బలమైన పార్టీగా రూపొందించారు. ఈ నేపథ్యంలోనే అప్పటికే రాయలసీమలో తాండవిస్తున్న కరువుపై ప్రత్యేక దృష్టి సారించి క్యాంపులు నిర్వహించేవారు. అనాడు ఈయన్ను కరువురెడ్డిగా కూడా పిలిచేవారు. ఒక్కమాటలో చెప్పాలంటే, అనాటినుండి నేటివరకు కరువు నివారణ ప్రాజెక్టుల అభివృద్ధికోసం, హింసా, దౌర్జన్యాలకు వ్యతిరేకంగా పోరాడుతూనే వున్నారు.

కా॥ వి.కె. మూడు దశాబ్దాలపాటు రాష్ట్ర విద్యార్థి సమాఖ్యకు ఇన్‌ఛార్జిగా వున్నారు. 1964 నుండి సి.పి.ఐ. రాష్ట్ర కార్యవర్గసభ్యులుగా, కార్యదర్శివర్గసభ్యులుగా, జాతీయ సమితి సభ్యులుగా, జాతీయ కంట్రోల్ కమిషన్ సభ్యులుగా పనిచేశారు. విశాలాంధ్ర విజ్ఞానసమితి గవర్నింగ్‌బాడీ సభ్యులుగా కూడా పనిచేశారు. గత దశాబ్దకాలంగా ఆయన నిరంతరం జిల్లా సమస్యలు, ప్రాజెక్టులు, పెండింగ్ ప్రాజెక్టులు, కరువు పరిస్థితులను తెలుసుకుంటూ అలుపు ఎరుగని ఆత్మస్థయిర్యంతో పోరాడుతూనే జిల్లాకు పెద్ద దిక్కుగా నిలిచారు. జిల్లా ఎడారి దిశవైపు వేగవంతంగా పయనిస్తోందన్న శాస్త్రజ్ఞుల హెచ్చరికలను ఎప్పటికప్పుడు గుర్తు చేస్తూ, అనునిత్యం రాష్ట్ర, కేంద్ర ప్రభుత్వాల దృష్టికి తీసుకెళుతూ, అవసరమైన ప్రజా పోరాటాలను ప్రత్యక్షంగా నిర్వహించేవారు.

చివరకు ఆస్పత్రిలోని కోర్డియాలజీ విభాగంలోని బెడ్‌పై మృత్యువుతో పోరాడుతూ కూడా, జిల్లాకు 42 టి.ఎం.సి.ల నీళ్ళు రావాల్సి వుండగా 23 టి.ఎం.సి.లు మాత్రమే వస్తున్నాయిరా!, అని ఆయన అన్న కుమారుడు వి. కె. రంగారెడ్డితో అన్నారు. అటువంటి ఆయన పుట్టపర్తి ఆస్పత్రిలో 1997 జులై 18న గుండెపోటుతో కన్నుమూశారు.

★ ★ ★

# కీ.శే. పి. వెంగమనాయుడు



అనంతపురం జిల్లా సీనియర్ కమ్యూనిస్టు నాయకుడు కామ్రేడ్ పి. వెంగమనాయుడు 20 యేళ్ళు జిల్లా పార్టీ కార్యదర్శిగా పనిచేశారు.

చీమలవాగుపల్లెలో 5 వ తరగతి వరకు చదివారు. ఆ తరువాత సొంతంగా ఇంగ్లీషు నేర్చుకుని, చదివి అర్థం చేసుకోగల స్థితికి చేరారు. 1950 ప్రాంతంలో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. 1950కి ముందు కమ్యూనిస్టు పార్టీ నిషేధం వున్న రోజుల్లో కమ్యూనిస్టుపార్టీ నాయకులకు ఇంట్లో ఆశ్రయం యిచ్చి, వారికి అవసరమైన సహాయ సహకారాలు అందించేవారు.

మొదటి కుమారుడు: పి. రాజేశ్వరరావుగారు విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ మేనేజరు, రెండవ కొడుకు: పి. రామాంజన నాయుడు, సొంత వ్యాపారం; మూడవ కొడుకు పి. అజయ్‌కుమార్ అనంతపురంలో మున్సిపల్ ఎలిమెంటరీ స్కూల్‌లో హెడ్మాష్టర్‌గా ఉద్యోగం చేస్తూ, పార్టీలో టీచర్స్ ఫ్రంట్‌లో పనిచేస్తున్నారు. కుమార్తె పి. ప్రమీలాదేవి, శ్రీకృష్ణదేవరాయ యూనివర్శిటీ లైబ్రరీలో లైబ్రరీ అసిస్టెంట్‌గా పనిచేస్తున్నారు. మొత్తం కుటుంబం మొదటినుండి కమ్యూనిస్టుపార్టీలో పనిచేస్తూ కమ్యూనిస్టు కుటుంబంగా కొనసాగుతోంది. ఇపుడు పెద్ద కుమారుడు హైదరాబాదులోను, మిగిలిన కుమారులు, కుమార్తె అనంతపురంలో వుంటున్నారు.

వీరి పూర్తి పేరు పెనకలపాటి వెంగమనాయుడు. తండ్రిపేరు: హనుమంతు, తల్లిపేరు: బాలమ్మ, పుట్టినతేది: 26-8-1926 అనంతపురం జిల్లా, పెదపొప్పూరు మండలం, చీమలవాగుపల్లె గ్రామంలో. భార్యపేరు నారాయణమ్మ.

## చిన్నతనంలో వెంగమనాయుడు:

వెంగమనాయుడు గారికి ఒక తమ్ముడు, ఇద్దరు అక్కలు, ఒక చెల్లెలు వున్నారు. వారిది చిన్నరైతుకుటుంబం. మొదట స్వగ్రామానికి 10, 15 కిలోమీటర్ల దూరంలో వున్న నాపరాయి గనుల నుండి నాపరాళ్ళను బండ్లకెత్తుకుని 120 కిలోమీటర్ల దూరంలో వున్న బళ్ళారికి అమ్ముకొనే నిమిత్తం వాళ్ళ నాన్నగారితోపాటు వెళ్లేవారు. దాంట్లో మిగిలిన పైకంతోనే జీవనాధారం. ఉన్న 10 ఎకరాల మెట్టపొలాన్ని సొంతంగా సాగు చేసుకునేవారు.

## కమ్యూనిస్టు పార్టీతో సంబంధాలు:

కమ్యూనిస్టుపార్టీతో సంబంధాలు ఏర్పడ్డాక, ఆ పార్టీలో చేరాక ప్రజల సమస్యలపైనే పనిచేసేవారు. చీమలవాగుపల్లెలో పేద ప్రజలకోసం కో-ఆపరేటివ్ సొసైటీని స్థాపించి దానిద్వారా వ్యవసాయ కార్మికులకు, రైతులకు అప్పులు ఇప్పించి, దాదాపు 15 సంవత్సరాలు సొసైటీని సమర్థవంతంగా నిర్వహించి, జిల్లాలో ఉత్తమ సొసైటీగా తీర్చిదిద్దారు. సొసైటీ ద్వారానే చౌకడిపోని కూడా ప్రారంభించి 10 సంవత్సరాలు నిత్యావసర వస్తువులను ప్రభుత్వం నిర్ణయించిన ధరలకే సక్రమంగా పంపిణీ చేశారు. ఊరి ప్రజలే కాక చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలుకూడా వచ్చి రోజు దాదాపు రాత్రి 10 గంటలవరకు, వారి సమస్యలను చెప్పుకోవడం, వారి సలహాలను తీసుకోవడం వుండేది. పెద్దకుమారుడు ఆ వచ్చినవారికి అతిథి మర్యాదలు చూడడంతో చదువు కూడా సాగేదికాదు. చుట్టుప్రక్కల గ్రామాల్లోను, ఆ ఊర్లోను శ్రీ వెంగమనాయుడుగారితో మన సమస్య చెప్పుకుంటే పరిష్కారం అవుతుంది అనే నమ్మకం ప్రగాఢంగా వుండేది.

1960 దశకంలో కమ్యూనిస్టు పార్టీ ఇచ్చిన పిలుపు మేరకు బంజరుభూములు, దేవాదాయ భూములు పోరాటంలో సుమారు 3 నెలలపాటు 'గుత్తి' సబ్ జైలులో జైలు శిక్షను కూడా అనుభవించారు. యాడికి, తాడిపత్రి ప్రాంతాలలో పేద ప్రజలకు ఇండ్ల స్థలాలు ఇప్పించేందుకుగాను పోరాటాలు; అలాగే బంజరు భూములు, దేవాదాయ భూములు పేద ప్రజలకు పంచేందుకు అనేక పోరాటాలు నిర్వహించారు. తాడిపత్రికి దగ్గరలో వున్న "ఎర్రగుంట్ల స్పిన్నింగ్ మిల్స్" వర్కర్స్ సమస్యలపైన, తాడిపత్రిలో మున్సిపల్ వర్కర్స్ సమస్యలపైన నిరంతరం పోరాడుతూ వచ్చారు. యాడికిలో చేనేత కార్మికులను సంఘటితపరచి, వారి సమస్యలను సాధించేందుకు పోరాడారు. ఆ పోరాటాలలో నష్టపోయిన భూస్వాములు మరియు పెట్టుబడిదారులు ఆయనపై కత్తి కట్టారు.

వెంగమనాయుడు అత్యంత ధైర్యశాలి. ఎన్నోసార్లు శత్రువుల బారినుండి బయటపడ్డారు. ఎదురుగా శత్రువు వస్తున్నా పిరికితనంతో పారిపోకుండా "వాళ్ళు నన్ను ఏమి చేస్తారురా?" అని ధైర్యంగా వెళ్ళేవారు. ఎక్కువగా కాలినడకనే వెళ్ళేవారు. లేదా, సైకిలు వాడేవారు. తాడిపత్రి, అనంతపురంలలో కూడా నడక లేదా అద్దెసైకిలు వాడేవారు. రిక్షా, ఆటో వాడడం అరుదు. హైదరాబాదుకు వచ్చినా సిటీబస్సు, లేదా నడక- చాలా నిరాడంబరంగా జీవించారు. సంతతికి ఆయనకు చేతనైనమేరకు చదువులు చెప్పించి, మీ బ్రతుకులు మీరు చూసుకోండి అన్నారు. 'మీకు నేను ఇంతకంటే ఏమీ యివ్వలేను. మీరు నాకు ఏమీ యివ్వనక్కరలేదు' అనేవారు.

1950లో కమ్యూనిస్టుపార్టీలో చేరిన వెంగమనాయుడు పార్టీ కార్యక్రమాలు రహస్యంగా ప్రారంభించారు. ఆ రోజుల్లో చీమలవాగుపల్లిలో వ్యవసాయ కార్మిక మహాసభకు ఏర్పాట్లు చేశారు. సీనియర్ కమ్యూనిస్టు నాయకులు శ్రీ వి. కె. ఆదినారాయణరెడ్డి, మరికొంతమంది ముఖ్యులు హాజరయ్యారు. పోలీసులు ఆ మహాసభపై దాడి చేశారు. కాల్పులు జరిపారు. వెంగమనాయుడు, మిగిలిన

కమ్యూనిస్టు నాయకులు పోలీసుల కళ్ళుగప్పి తప్పించుకున్నారు. 1952లో పార్టీపై నిషేధం తొలగిన తరువాత తాడిపత్రి తాలూకా సి.పి.ఐ. కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహించారు.

ఆ తరువాత జిల్లా పార్టీలో చురుకుగా పనిచేసి, అనేక కార్యక్రమాలు నిర్వహించారు. భూ పోరాటాలు, వ్యవసాయ కార్మికుల కూలి పోరాటాలు నిర్వహించారు. 1972లో అనంతపురం జిల్లా కార్యదర్శిగా ఎన్నికయినారు. ఆ బాధ్యతలలో 1992 వరకు కొనసాగారు.

ఆయన కార్యదర్శిగా వున్న కాలంలో అనేక భూపోరాటాలు నిర్వహించారు. వాటిలో కాకుంట్లలో జరిగిన భూ పోరాటం చరిత్ర గలది. ఆ పోరాటం ఫలితంగా అప్పటి ముఖ్యమంత్రి ఎన్.టి. రామారావు వచ్చి, అక్కడ భూములు పంపిణీ చేశారు.

1977లో జరిగిన ఒక భూపోరాటం సందర్భంగా ఆయనపై ప్రత్యర్థులు తుపాకి కాల్పులు జరిపారు. 1991లో జిల్లా ప్రజాస్వామ్య పరిరక్షణ పోరాటంలో ఆయన తాడిపత్రి ప్రాంతంలో వీరోచితంగా పాల్గొన్నారు. 1997 జులై 12వ తేదీన కామ్రేడ్ వెంగమనాయుడును అనంతపురంలో పట్టపగలు భూస్వామ్య వర్గాల కిరాయి గూండాలు దారుణంగా హత్యచేశారు. వెంగమనాయుడు తన జీవితంలో ప్రజా సమస్యలపై పట్టుదలతో పనిచేసి ప్రజలకోసం జీవించిన మనిషిగా చరిత్రలో నిలుస్తారు.

★ ★ ★

# శ్రీ గారపాటి సత్యనారాయణ



గారపాటి సత్యనారాయణ (ఏలూరు) ఉప్పుసత్యాగ్రహంలో పాల్గొని 15 రోజులు సబ్ జైల్లో ఉండి, మరల అరెస్టు అయి, 4 నెలలు రాయ వెల్లూరు జైలులో ఉన్నారు. అక్కడ యితరులతో కలిసి విప్లవ సాహిత్యం చదివారు. 1931 జనవరి 26న పోలీసులు కాంగ్రెసు వలంటీర్లపై జరిపిన లాఠీఛార్జీని నిరసిస్తూ వేలాది ప్రజలు కాల్వగట్టున కర్రలతో ప్రతిఘటనకు పూనుకోగా, పోలీసులు తుపాకులు కాల్చడం, ఒక వ్యక్తి మరణించడం, యిద్దరు గాయపడ్డం జరిగింది. ఈ ఘటన సత్యనారాయణ గారిని కుదిపి వేసింది. మరింత పట్టుదలతో పనిచేయసాగారు. నిర్బంధ విధానం అడ్డూ అపూ లేకుండా సాగిపోతూంటే, రాత్రులు గ్రామాలకు వెళ్ళి గోడలమీద పోస్టర్లు అంటించడం, నిషిద్ధ పత్రికలు పంచడం, జండా లెగురవేయడం చేశారు. 1932 ఏప్రిల్ 13న జలియన్వాలాబాగ్ దినోత్సవం జరపరాదంటూ ప్రభుత్వం విధించిన నిషేధాజ్ఞను ధిక్కరించి, పెదపాడులో యితర కాంగ్రెసు వాదులతో కలిసి బహిరంగ సభ జరిపారు. పోలీసులు ప్రజలపై లాఠీఛార్జీ చేశారు. కొందరిని అరెస్టు చేశారు. సత్యనారాయణ గారిని 15 రోజులు సబ్ జైలులో నిర్బంధించి, తరవాత వదిలివేశారు. మే నెలలో తిరిగి అరెస్టు, తిరిగి నిర్బంధం.

జూన్ 25న భీమవరంలో చట్టవిరుద్ధంగా జరిగిన జిల్లా రాజకీయ మహాసభకు హాజరైన 100 మంది కార్యకర్తల్లో వీరొకరు. ఆ సందర్భంలో పోలీసులు అనేకమందితో పాటు వీరిని కూడా అరెస్టు చేశారు. దాదాపు సంవత్సరంపాటు రాజమండ్రి సెంట్రల్ జైల్లో వున్నారు. అక్కడ భగత్సింగ్ సహచరులైన విజయకుమార్ సిన్హా, జయదేవ్ కపూర్, మహావీరసింగ్‌లతో పరిచయమైంది. కపూర్‌ను జైలు వార్డను తిట్టడంవల్ల కపూర్ వాని దవడ పగలగొట్టారు. ఫలితంగా, కపూర్ 30 కొరడా దెబ్బలకు గురి చేయబడ్డారు. ఆ చర్యను నిరసిస్తూ రాజకీయ ఖైదీలంతా నిరాహారవ్రతం చేశారు. వారిపై క్రూరమైన దమనకాండ అమలు జరపబడింది. కొందరి చేతులకు,

కాళ్ళకు బేడీలు వేశారు. మరికొందరిని ఒంటికొట్లలో నిర్బంధించారు.

ఆ ఘటనలు సత్యనారాయణగారి కార్యదీక్షను యినుమడింపజేశాయి. జైలు అధికార్లు వీరిని, తనికెళ్ళ వెంకట చలపతి, కొసరాజు శేషయ్య వగైరాలను తిరుచునాపల్లి జైలుకు ట్రాన్స్‌ఫర్ చేశారు. అక్కడ లాహోరు కుట్ర కేసు ఖైదీలు కొందరూ (బటుకేశ్వర దత్తు, కుందన్‌లాల్ వగైరా), బెంగాల్ డిటెన్యూలు కొందరూ (జీవన్‌లాల్ చటర్జీ, సురేష్ మోహన్‌ఘోష్, పంచానన్ గంగూలీ) ఉండేవారు. వారి ద్వారా కమ్యూనిస్టు సాహిత్యం విరివిగా లభించేది. ప్రసంగాలు, చర్చలు కొనసాగేవి. ఫలితంగా వీరూ, తనికెళ్ళ వెంకట చలపతి, కొసరాజు శేషయ్య తదితరులు కమ్యూనిస్టు పంథా చేబట్టారు. ఆ కాలంలోనే వివిధ జైళ్ళలో నిర్బంధింపబడ్డ కలిదిండి సుబ్రహ్మణ్యం వగైరాలు కమ్యూనిస్టులుగా మారేరు. సత్యనారాయణగారు 1933 ఏప్రిల్‌లో విడుదలై వచ్చాక సుందరయ్య గారితో పరిచయ మేర్పడింది. జిల్లాలోని యితర కార్యకర్తలతో సంబంధ మేర్పరచుకొని పార్టీ కార్యక్రమాన్ని అమలుచేయసాగారు. అక్కడనుంచి తిరిగి వచ్చాక, 1935లో కూలీ రక్షణ సమితులు, కార్మిక సంఘాలు స్థాపించడంలో కృషిచేశారు.

ఏలూరులో స్థాపించబడ్డ మొట్టమొదటి కార్మికసంఘం ప్రెస్ వర్కర్స్ యూనియన్. దాన్ని నడిపినవారు బనిసెట్టి అప్పారావు, కరణం నరసింహారావు, విభూతి రాఘవయ్య, జోగారావు వగైరాలు. వారితో కలిసి కడుపు రాములు, రంభా వెంకటప్పయ్య, తాడి అప్పలస్వామి, వంకినేని సత్యనారాయణ, అత్తులూరి సర్వేశ్వరరావు, మూల్పూరి రామమోహనరావు, కొత్తపల్లి అక్కభగవానులు వగైరాలు పనిచేసేవారు. విద్యార్థుల్లో కొందరు గ్రూపుగా ఏర్పడి పార్టీకి సహకరించేవారు. 1936 ప్రారంభంలో మద్రాసులో జరిగిన అ. భా. ప్రెస్ వర్కర్స్ మహాసభకు వీరు ప్రతినిధిగా వెళ్లారు.

★ ★ ★

# అమరవీరుడు
# శ్రీపతి పండితారాధ్యుల మల్లిఖార్జునశర్మ

- బొల్లిముంత శివరామకృష్ణ



"కామ్రేడ్ శర్మ". జన్మస్థలం తెనాలి తాలూకా ఈమని గ్రామం. 1910వ సంవత్సరంలో ఒక సనాతన ఆరాధ్య కుటుంబంలో పుట్టాడు. తండ్రిగారు వీరభద్రయ్య అయ్యవారు. తల్లి లింగమాంబ. నలుగురు అన్నదమ్ములలో చిట్టచివరివాడు. తన రెండోయేటనే మాతృహీనుడయ్యాడు. పినతల్లి భ్రమరాంబగారి ఆదరణలో పెరిగాడు.

ఉపనయనాదికాలన్నీ తాడికొండలో మేనమామ గారింట జరిగాయి.

మాతృభాష ఐన తెలుగు బాగా చదువుకున్నాడు. పంచకావ్యాలు పఠనం చేశాడు. 5వ ఫారం వరకూ ఇంగ్లీషు చదివాడు. హిందీలో రాష్ట్ర భాష దాకా

అధ్యయనం చేశాడు. తన యిరవయ్యోయేట భవాని అనే ఆమెను వివాహం చేసుకొని గృహస్తుడయ్యాడు. (1930)

అవి దేశమంతటా జాతీయ భావాలు వెల్లివిరుస్తున్న రోజులు. అప్పటి వరకూ కాంగ్రెస్ ఉద్యమం లాయర్లలాంటి మేధావుల చుట్టూనే తిరుగుతూండేది. ప్రభుత్వానికి విజ్ఞప్తులు పంపుకొనడంతోనే సరిపెట్టుకునేది కాని...

1930 నాటికల్లా ఆ కట్టుతాళ్ళను తెంచుకున్నది జాతీయ ఉద్యమం. మహాత్మాగాంధీజీ నాయకత్వం వహించాడు.

## జాతీయ ఉద్యమంలో

బ్రిటిష్ సామ్రాజ్యవాదులకు వ్యతిరేకంగా విదేశీ వస్తువులను బహిష్కరించడం, మాతృభాషలోనే సర్వకార్యాలూ నిర్వహించబడాలి అన్న భాషా రాష్ట్ర వాంఛ, కోర్టులను, ఇంగ్లీషు చదువునూ నిరశించడం, అస్పృశ్యతా నివారణ, మద్యపాన నిషేధం ప్రచారం, ఈత, తాడి చెట్ల గెలలు నరికి శాసనాన్ని ధిక్కరించడం, యిలాంటి పరిమితమైన సమస్యలతో కాంగ్రెస్ ఒక ఉద్యమ రూపాన్ని తీసుకున్నది. మధ్యతరగతి ప్రజలనూ ఆకర్షించింది.

మన కామ్రేడ్ శర్మకూడా ఆ జాతీయోద్యమం చేత ఆకర్షించబడ్డాడు. 1931–32లో కార్యరంగంలో దూకాడు. ఉప్పు సత్యాగ్రహంలో పాల్గొన్నాడు. 6 నెలలపాటు రాజమండ్రి జైల్లో శిక్ష అనుభవించాడు. మరొకసారి 6 నెలలపాటు రాయవేలూరు జైల్లో బంధించారు. ఒక సందర్భంలో దారుణమైన లాఠీఛార్జీకి గురయ్యాడు.

ఈ సత్యాగ్రహోద్యమాలు అప్పుడప్పుడూ సాగుతూ వుండటం, బ్రహ్మాండమైన ప్రజోద్యమం రూపాన్ని తీసుకోబోయే సమయానికి ఆపివేయడం, ఆ పోరాటం మీద నీళ్ళు చల్లడం వీటితో చాలామంది యువకుల్లో అసంతృప్తి బయలుదేరసాగింది. వారిలో మన శర్మ కూడా ఒకడు. ఐనా త్వరపడకుండా తాను నమ్మిన ఆశయం కోసం దీక్షతో పనిచేస్తూనే వచ్చాడు.

## ఖద్దరు ప్రచారం

జైలునుండి బయటికి రాగానే చాలామంది కాంగ్రెస్‌వాదులు తమ పని అప్పటికి ముగిసినట్టు భావించేవాళ్ళు. అవసరమైతే మళ్ళీ జైలుకు పోవచ్చునని విశ్రాంతిగా కూర్చొనేవాళ్ళు. కాని శర్మ అలాకాదు. జైలునుంచి విడుదల కావడమే తిరిగి కార్యక్రమం. ఏముందీ? ఖద్దరు ప్రచారం. మోయలేనన్ని ఖద్దరు మూటలు మూపున వేసుకొనేవాడు. గ్రామగ్రామమూ తిరిగేవాడు. గడపగడపా ఎక్కేవాడు. గంటలకొద్దీ బోధపరచేవాడు. ఒక్క నిముషమైన వూరుకొనేవాడుకాడు. కాని ఈ శ్రమకంతా ఫలితమేమిటి? ఈ మార్గాన దేశానికి స్వాతంత్ర్యం వస్తుందా? అన్న సందేహం. కాని మరో మార్గం దగ్గరలో కన్పించదు. ఐనా అలా ఆలోచిస్తూనే తన ఖద్దరు ప్రచారాన్ని మాత్రం విడవకుండా సాగిస్తూండేవాడు. నూతన మార్గాన్ని అన్వేషిస్తూ వుండేవాడు.

అప్పటికే చాలా పూర్వమే రష్యాలో విప్లవం వచ్చింది. ప్రపంచంలో ఆరవ భాగం సామ్రాజ్య వాదుల సంకెళ్ళను త్రెంచుకున్నది. పీడిత ప్రజలు తమ జీవిత విధానాలను తామే దిద్దుకునే సంపూర్ణ స్వాతంత్ర్యాన్ని సాధించారు. కాని రష్యన్ ప్రజలు ఎలా ఆ విజయాన్ని సాధించారు. ఆ మార్గమేమిటి? అన్న విషయాలు మనదేశానికి వెంటనే రాలేదు. చుట్టూ వున్న సామ్రాజ్యవాద దేశాలు ఆ వార్తలను త్రొక్కిపట్టాయి. ఎక్కడైనా ఆ సంబంధాలు బయటపడినా వాటిని నిషేధించాయి. మిగతా ప్రపంచం రష్యా చుట్టూ ఇనుప తెరలు బిగించింది.

కాని కాలం ఆగలేదు. సోవియట్ రష్యా విప్లవపు వెలుగులు ఈ ఇనుప తెరలను చీల్చుకుని పీడిత ప్రజల మధ్యకు వచ్చి పడ్డాయి.

## వర్గ సంఘాల నిర్మాణం

మనదేశంలో కూడా కాంగ్రెస్ ఉద్యమాల యెడ అసంతృప్తి చెందిన యువకుల దేవులాటలో ఆ వెలుగు కన్పించింది. అతివాదులంతా చిన్న చిన్న గ్రూపులుగా ఏర్పడి మార్క్సిస్టు సిద్ధాంత చర్చలు ప్రారంభించారు. ప్రపంచ శ్రామికులారా! ఏకంకండి!! అన్న ఆశయాన్ని ముందుంచుకుని వర్గసంఘాల నిర్మాణానికి పూనుకున్నారు.

కాంగ్రెస్‌లోనే వుంటున్న ఈ అతివాద యువకులంతా ఈ నూతన మార్గాన ప్రజానీకాన్నంతా ఐక్యపరచి సంఘటిత శక్తితో దేశస్వాతంత్ర్యాన్ని సాధించగలమనీ, కాంగ్రెస్‌ను ఈ సరియైనబాటను పట్టించాలనీ ప్రయత్నించారు.

## ఆంధ్రలో కమ్యూనిస్టు పార్టీ

ఈ ప్రయత్నాల ఫలితంగానే ఆంధ్రలో ఏర్పడిన కమ్యూనిస్టు పార్టీతోను మార్క్సిస్టు సాహిత్యంతోనూ కామ్రేడ్ శర్మకు సంబంధాలు యేర్పడ్డాయి. 1935 నుంచీ కమ్యూనిస్టు పార్టీ రాజకీయాలలో ప్రవేశించి కార్యక్రమం సాగిస్తూ వచ్చాడు.

1936 ఎన్నికలలో బ్రిటిష్ సామ్రాజ్య వాదులకూ వారి బడి తొత్తులైన జమీందారీ భూస్వామ్య వర్గాలకు వ్యతిరేకంగా జస్టిస్ పార్టీని ఓడించి కాంగ్రెస్‌ను గెలిపించడంలో ప్రధాన పాత్ర వహించాడు శర్మ.

రెండవ ప్రపంచ యుద్ధ మేఘాలు అలముకొంటున్నాయి. బ్రిటిష్ సామ్రాజ్య వాదులు మనదేశాన్ని కూడా యుద్ధరంగంలోకి లాగుతున్నారు. ఆ సమయంలో సామ్రాజ్యవాద యుద్ధాలకు వ్యతిరేకంగానూ మహాత్మాగాంధీజీ ప్రారంభించిన వ్యష్టి సత్యాగ్రహం ప్రజా ఉద్యమంగా మార్చవలసిన అవసరాన్ని గూర్చి కమ్యూనిస్టు పార్టీ ఇచ్చిన కార్యక్రమాన్ని నెరవేరుస్తూ వచ్చాడు. ఆ రోజుల్లో కమ్యూనిస్టు పార్టీ నిషేధంలో వుంది. తాను పార్టీ రహస్య యంత్రంతో సంబంధాలు పెట్టుకుని బయట కార్యక్రమాన్ని, కార్మిక సంఘాల నిర్మాణాన్ని ముఖ్యంగా వ్యవసాయ కూలీ సంఘాన్ని గ్రామగ్రామాన నిర్మిస్తూ వచ్చాడు.

## వ్యవసాయ కార్మికులలో గుర్తింపు

అనాటినుండి కామ్రేడ్ శర్మ యొక్క పట్టుదల, చొరవ, ఓపిక, సమస్యలను పరిష్కరించే విధానం, కలుపుగోలుతనం అన్నీ ప్రజలముందు ప్రదర్శితమయ్యాయి.

వ్యవసాయ కూలీలోకం ఆయనను తమ ఆప్తబంధువుగా, నిజమైన ప్రజాసేవకుడుగా, తమ ప్రియమైన నాయకుడుగా గుర్తించుతూ వచ్చారు.

నిత్యమూ చిన్న చిరునవ్వు నవ్వుకుంటూ అలా ... ఎండలేదు. వానలేదు. ఒక సంచి బుజాన వేసుకొని, వక్కపొడి నములుకుంటూ ప్రశాంతంగా నడుచుకుంటూ ఎక్కడికో? ఏ ఒక్కరోజూ విరామం అంటూ లేకుండా ఎక్కడో ఒకచోట వ్యవసాయ కూలీల మధ్య తాను వుండాలి. వారి కష్టసుఖాలలో తానూ పాలు పంచుకోవాలి. వారి నుంచి తాను చాలా నేర్చుకోవాలి. వారికి బోధించాలి. ఉద్యమాన్ని ముందుకు తీసుకుపోవాలి. త్వరగా చాలా త్వరగా ఏ బాధలు లేని నూతన సమాజాన్ని చేరాలి. అదీ తహతహ. ఆ ఆవేదనలో ఇల్లుపట్టదు. పిల్లాజల్లా గుర్తుకురారు, అన్ని యిళ్ళూ తనవే, అందరి బిడ్డలూ తన వాళ్ళే. తాను అందరికీ బిడ్డడే. తన జీవితంలోని ప్రతి క్షణమూ, ప్రతి ఆలోచనా, ప్రతి పనీ అంతా ప్రజలకోసమే.

ఎర్రజెండాలు రెపరెపలాడుతూపోయే వూరేగింపులో రెండు పంక్తుల మధ్యా నడుస్తూ పిడికిలి బిగించి ఇంక్విలాబ్ జిందాబాద్ ... అంటూ క్షణేల్ మని నినాదాలిస్తూ కనపడేవాడు.

మరొకచోట మెగా ఫోన్ పుచ్చుకుని చెపుతుండేవాడు.

## ప్రజలకు శర్మ కావాలి

ఒకచోట సాహిత్యం అమ్ముతుండేవాడు. యింకొకచోట తీవ్రంగా చర్చిస్తూండేవాడు. అంతలో వేదిక మీదికెక్కి కంచుకంఠంతో వుపన్యసించేవాడు. ఎక్కడైనా కూలీ రైతుల మధ్య తగాదాలు వస్తే తీర్పరి ఆయనే. రైతులకూ్కడా కామ్రేడ్ శర్మ కావాలి.

బంజరు భూములకు పిటీషన్లు వ్రాయడం దగ్గర్నుంచీ, పెనాల్టీలు వేసినందుకు కలెక్టరుతో పోట్లాడటం వరకూ శర్మ పనే, వ్యవసాయ కూలీలు వెట్టిచాకిరికి, పిచ్చిమానికలకూ, నాము పద్ధతికీ వ్యతిరేకంగా సాగించిన అనేక పోరాటాలకు నాయకత్వం వహించాడు. న్యాయమైన కూలికోసం, పాలేర్ల జీతాలు, సెలవులకోసం చేసిన ఆందోళనలు, సమ్మె పోరాటాలు అనేకం నడిపాడు.

ఆయనకూ ఆయన సభ్యుడైయున్న కమ్యూనిస్టు పార్టీ గమ్యమే; పీడిత ప్రజల విముక్తి, అందరికీ తిండి, గుడ్డ, చేసుకునేందుకు పని, భూమి, అందరికీ అన్ని విధాలా అభివృద్ధికి సమానావకాశాలూ కల నూతన దివ్య సమాజం.

అందుకు మార్గం: కూలి, రైతు, వివిధ పీడిత వర్గాల విశాల ఐక్య సంఘటన.

## ఎర్రజెండా బహూమానం

అందుకే రైతులకవసరమైన కృష్ణ కాల్వల మరమత్తులో సైతం స్వయంగా పాల్గొన్నాడు. అహోరాత్రులూ పాటు పడ్డాడు. పైన భగ్గున చెరిగిపోసే ఎండ, క్రింద కాళ్ళు బొబ్బలెక్కే ఇసుక ముచ్చెమటలు కారుకుంటూ నిలువునా కాలువలో నుంచి దయ్యాల్లాంటి కట్టలమీదకు మట్టి ఎత్తిపోయడం, అలా మొత్తం కాలమంతా వెన్నువంచకుండా పోరాడాడు. కమ్యూనిస్టు పార్టీ పెట్టే ఎర్రజెండా బహూమానాన్ని అందుకున్నాడు.

సనాతన కుటుంబంలో మంత్రతంత్రాల మధ్య పుట్టి పెరిగిన మల్లిఖార్జునశర్మ ఎక్కడా? మట్టిపనిలో బహుమాన మందుకోవడమేమిటి? ఆశ్చర్యమే.

అది...శర్మకాదు, ఆయనలోని విప్లవదీక్ష, కమ్యూనిస్టు పార్టీ ఆయనకిచ్చిన విప్లవోత్సాహం.

అలాగే రైతుల కౌలుదారీ పోరాటాలకూ నాయకత్వం వహించాడు. కుంచవరం గ్రామంలో పెద్ద ఇనాందారుకు వ్యతిరేకంగా కౌలుదార్లను సమీకరించి పోరాటం నడిపాడు.

అందుకే శర్మ పేరు వినడమే కూలీ రైతు ప్రజాసామాన్యం ఉత్సాహోద్రేకాలతో ముందుకు వస్తారు. తమ నాయకుడుగా భక్తి విశ్వాసాలతో ప్రేమించుతారు.

ఇక భూస్వాములలో కామ్రేడ్ శర్మ పేరు గుండెల్లో గాలం. ఆయనంటే అరికాలిమంట. ఆ దోపిడీదార్లకు ప్రధాన శత్రువు క్రింద లెక్క. ఆ కసితోనే తమ బడితొత్తుగా వ్యవహరిస్తున్న కాంగ్రెస్ పరిపాలన కాలం (1950)లో దారుణంగా హత్య చేయించటానికి పాటుపడ్డారు.

## ఫాసిస్టు ప్రమాదం

1942 నాటికి భారతదేశానికి జపాన్ ఫాసిస్టు ప్రమాదం ముంచుకు రాసాగింది. ఆనాడు కమ్యూనిస్టు పార్టీ దేశరక్షణకు పూనుకోవాలన్న నినాదం మీద, అటు కాంగ్రెస్‌వాదులు యిటు ప్రజలూ యిద్దరి మధ్యా, జాతీయ నాయకుల విడుదలకూ, దేశరక్షణ కార్యకలాపాలకూ తీవ్రకృషి సాగించాడు. రైతు కూలీ ఐక్యతకు కృషి చేశాడు. యుద్ధకాలంలో పెరుగుతున్న ధరలకు, బ్లాకు మార్కెట్‌కూ వ్యతిరేకంగా ప్రజలవైపున నిలబడి పోరాడుతూ కమ్యూనిస్టు పార్టీ యిచ్చే ప్రతి కార్యక్రమంలో ముందుకు వచ్చాడు.

1943లో కమ్యూనిస్టు పార్టీ నిధికి పిలుపుయిచ్చింది. కామ్రేడ్ శర్మ మొట్టమొదటిసారిగా తనవంతు ఆస్తిని సర్వస్వాన్నీ అమ్మి పార్టీ నిధికి జమకట్టాడు.

మొదటినుంచీ తన రాజకీయ జీవితంలో ఐదెకరాల సుక్షేత్రాన్ని త్యాగం చేశాడు. తన ప్రాణాలే ప్రజాసేవకోసం అర్పించడానికే సిద్ధంగావున్న కామ్రేడ్ శర్మ వ్యక్తిగత ఆస్తులంటేనే గిట్టని నిజమైన మార్క్సిస్టు శర్మకు ఇదొక లెక్కా?

1946లో వివిధ రాష్ట్రాలలో కాంగ్రెస్ అధికారాన్ని స్వీకరించింది. ప్రజలు తమ నిత్య జీవితావసరాలకోసం సాగించే ప్రతి పోరాటాన్నీ వ్యతిరేకిస్తూ వచ్చింది. భూస్వాములకూ, జమీందార్లకూ, బ్లాకు మార్కెటీర్లకూ అండగా నిలబడి ప్రజలపైన అత్యాచారాలకు పూనుకున్నది.

## స్వాతంత్ర్యం వచ్చింది

1947లో మౌంట్ బాటెన్ అవార్డుతో ఆగస్టు 15న స్వాతంత్ర్యం వచ్చేసింది. ఐనా ప్రజల కనీస అవసరాలు సైతం తీరలేదు. ధరలు చుక్కలంటుతున్నాయి. కూలీ రైతు మధ్యతరగతి ప్రజాసామాన్యం పెరిగే ధరలతో తమ జీవితాలను అందుకోలేని స్థితి ఏర్పడింది. అమితమైన పన్నులు, ఆదాయంలో కోత యిలా ప్రజాసామాన్యం కాంగ్రెస్‌పై పెట్టుకున్న భ్రమలన్నీ మంచుతెరలలాగా విడిపోసాగాయి.

ఈ కాలంలో గత్యంతరంలేని కూలీ రైతులు విప్లవ చైతన్యంలో ముందుకు వస్తున్నారు. అనేకచోట్ల పాలేర్లు, కూలీలు తమ న్యాయమైన కూలీ రేటు కోసం పోరాటాలు ప్రారంభిస్తున్నారు.

భూస్వామ్య దోపిడీవర్గాల రక్షణ కోసం కంకణం కట్టుకున్న కాంగ్రెస్ ముందుగానే ప్రజలపై విరుచుకుపడ్డది. పీడిత ప్రజలకు అగ్రగామియైన కమ్యూనిస్టు నాయకుల మీద అరెస్టు వారెంట్లు జారీ చేసింది. వ్యవసాయ కూలీ నాయకుడైన మన కామ్రేడ్ శర్మను వదిలిపెట్టుతుందా. 1948లో కామ్రేడ్ శర్మ కూడా రహస్య జీవితానికి వెళ్ళిపోయాడు. రహస్యంగానే వుంటూ వ్యవసాయ కూలీ పోరాటాలకు నాయకత్వం వహించాడు. తెనాలి తాలూకాలో పెద్ద ఎత్తున సాగిన అమృతలూరు సమ్మె వగైరాలు ఆయన నాయకత్వాన సాగాయి.

## దారుణ హత్యాకాండ

1950 సెప్టెంబరులో ఒకనాడు ఉదయం దినపత్రికలు వార్తను మోసుకువచ్చాయి. "సుప్రసిద్ధ కమ్యూనిస్టు నాయకుడు ఎస్.పి. మల్లిఖార్జున శర్మ మద్రాసులో పోలీస్ చీఫ్ దగ్గర ఉన్నా"డని.

ఆ తరువాత అక్టోబరులో మళ్ళీ పత్రికలే మోసుకొచ్చాయి శర్మ మరణించాడని.

మద్రాసులో అరెస్టు చేసి 12 రోజుల పాటు జైల్లో వుంచారు. హింసించారు. తిరిగి గుంటూరులో అరెస్టు చేసి 14 రోజులపాటు నానా చిత్రహింసలు పెట్టారు. రహస్యాలు బయటపెట్టించాలని ఆయనపై చేసిన దారుణాలకు అంతులేదు. కాని ఒక్క రహస్యమూ బయటపడలేదు.

ప్రజా శత్రువులైన ఇనాందారీ భూస్వామ్య దోపిడీ వర్గాలు పోయి ప్రభుత్వం ముందర మొరలు పెట్టుకున్నారు, శర్మ బ్రతికి వుంటే మేం బ్రతకలేమని.

## కాంగ్రెస్ పాలనలో

అది కాంగ్రెస్ పాలన. 3 సంవత్సరాలుగా తెలుగునాడునంతా మిలటరీ బలగాలచేత ధ్వంసంచేయిస్తూ, ప్రజాసామాన్యం మీద మూకుమ్మడి దౌర్జన్యాలు సాగిస్తూ అరెస్టులు, లాఠీఛార్జీలు, చిత్రహింసలు, మానభంగాలు, కాల్పులు ఒకటా? అన్ని ఫాసిస్టు చర్యలకూ తలపడి రాక్షసత్వం మూర్తీభవించిన కాంగ్రెస్ దాని మిలటరీ బలగాలు, తమ సహచరులైన భూస్వాముల మొరలు విన్నారు. కామ్రేడ్ శర్మను దారుణంగా హింసించి 1950 అక్టోబరు 9న హత్య చేశారు.

కాన్సెంట్రేషన్ కాంపు (పాములపాటి కృష్ణయ్య చౌదరి) మేడమీది నుంచి దూకాడనీ, అందువల్ల చనిపోయాడనీ అబద్ధాన్ని ప్రచారం చేశారు ఈ "సత్య" "అహింస"ల కాంగ్రెస్ ప్రభుత్వాధినేతలు.

ఆ వీరుని శవాన్నైనా బంధువుల కివ్వాలనీ, కనీసం చూపాలనీ కూడా ఈ రాక్షసులు భావించలేదు.

14 రోజులుగా మిలటరీ బలగాలు ఆయనమీద సాగించిన హింసాకాండకు ఆయన శరీరం ప్రజలముందు ప్రబలసాక్ష్యంగా నిలబడుతుంది.

★ ★ ★

# తరిమెల నాగిరెడ్డి

రాయలసీమ జిల్లాలో ప్రముఖ కమ్యూనిస్టు నాయకుడు తరిమెల నాగిరెడ్డి 11-2-1917 లో అనంతపురం జిల్లా తరిమెల గ్రామంలో ధనికరైతు కుటుంబంలో జన్మించారు. తండ్రి తరిమెల సుబ్బారెడ్డి. ఈయన - ఇల్లూరు సీలం చిన్నప్పరెడ్డి, పప్పూరు రామచార్లతో కలసి తాడిపత్రికి వెళ్ళి గాంధీ ఉపన్యాసంతో ప్రేరేపితులై తమ గ్రామాలలో కల్లుఅంగళ్లు, జూదము మాన్పించినాడు. దురలవాట్లకు వ్యతిరేకంగా బోధించేనాడు.



తరిమెల నాగిరెడ్డి ప్రాథమిక విద్యాభ్యాసం తరిమెల గ్రామంలోనే జరిగింది.

తరువాత ఋషీవాలీ లోను, మద్రాసు లయోలా కాలేజీలోను చదివి బి.ఏ. పాసైనారు. కల్లూరు సుబ్బారావుగారి సలహా మేరకు బెనారస్ హిందూ యూనివర్శిటీలో యల్.యల్.బి.లో చేరినాడు. ఈయన వెంబడి నీలం రాజశేఖరరెడ్డి, తరిమెల వాసి విద్వాన్ విశ్వం బెనారస్‌లో చేరినారు. ముగ్గూరూ ఒకే రూంలో వున్నారు. నెలసరి తనకు యింటినుండి వచ్చే డబ్బులో, సగం ఖర్చులకు వాడుకొని మిగతా డబ్బుతో పుస్తకాలు కొనేవాడు. నిషిద్ధ సాహిత్యం, నాల్గు ప్రతులు దేశానికి వస్తే ఒక ప్రతి నాగిరెడ్డి దగ్గర వుండేదని అంటారు. ఆ కాలేజీలోనే కమ్యూనిస్టుగా మారి చదువు చాలించి అనంతపురం తిరిగి వచ్చినాడు. శలవల్లో వూరికి వచ్చినపుడు వూరిలో స్టడీ సర్కిల్ నడిపేవాడు. అమ్మ, మాలపల్లి నవలలను చదివించేవాడు.

తరిమెల నాగిరెడ్డి – సాధనలో 1937 అగష్టు చివరి రెండు సంచికలలో వ్యాసాలు వ్రాసినాడు. ప్రపంచవ్యాప్తంగా నెలకొని వున్న పరిస్థితి. ప్రపంచవ్యాప్తంగా యువజన సంఘాల కార్యకలాపాల గురించి, దేశంలో యువజన సంఘాలను స్థాపించవలసిన ప్రాముఖ్యం గురించి వివరించినాడు. సెప్టెంబరులో ఏర్పడిన యువజన సంఘానికి ఒక సహాయ కార్యదర్శిగా ఎన్నికైనాడు. యువజన సంఘం నిర్వహించిన హిందూపురం వేసంగి పాఠశాలలో కొన్ని తరగతులు బోధించినాడు. హాజరైన యువకులలో కమ్యూనిస్టు భావజాలాన్ని బాగా చొప్పించడానికి ప్రయత్నించినాడు.

యువజనులకు, విద్యార్థులకు అనేక చోట్ల తరగతులు బోధించినాడు. గదర్‌పార్టీకి సంబంధించిన ప్రతివాద భయంకరచారి, ఉన్నవ లక్ష్మీనారాయణ, కాళిపట్నం కొండయ్య (సైంటిస్టు) వావిలాల గోపాలకృష్ణయ్య మొదలైన వారితో తరిమెలలో – అనంతపురంలో ఉపన్యాసాలు ఏర్పాటు చేసినాడు.

ఐదుకల్లు సదాశివన్ చెప్పినట్లు తరిమెల నాగిరెడ్డి పెద్ద ఆందోళనకారుడు. యుద్ధకాలంలో సింగనామలలో గవర్నమెంటు ఉద్యోగులు నిర్బంధంగా యుద్ధ ఫండు వసూలు చేస్తుంటే తరిమెల నాగిరెడ్డి ఈ దౌర్జన్యాన్ని బయటపెడుతూ పెద్ద ఆందోళన లేవదీసినాడు. ఈ ఆందోళన విషయం గాంధీవరకు పోయింది. 1940 ఆగష్టులో యుద్ధం వల్ల ప్రజలకు కలిగే ఇబ్బందులు, నష్టాల గురించీ యుద్ధాలు లేకుండపోతే ఆ ఖర్చుతో పాఠశాలలు, ఆసుపత్రులు, వగైరా ఎన్నెన్ని సౌకర్యాలు పొందవచ్చునో లెక్కలతో వివరిస్తూ సాధనలో వ్యాసాలు వ్రాసినాడు. 1940 జూన్‌లో నిర్వహించిన సత్యాగ్రహ శిబిరంలో కాంగ్రెసు చరిత్ర గురించి నాగిరెడ్డి బోధించినాడు. కల్లూరు సుబ్బారావు, విద్వాన్ విశ్వంతోపాటు ఉరవకొండ తదితరచోట్ల జాతీయవారం సందర్భంగా సమావేశాల్లో పాల్గొన్నారు.

జిల్లాలో సామ్యవాద సిద్ధాంతాలు ప్రచారం చేయడానికి 'నవ్య సాహిత్యమాల' అన్న సంస్థను స్థాపించి దాదాపు 10 పుస్తకాలు ప్రచురించినాడు. ఇందులో నాగిరెడ్డి రాసిన 'ఆస్ట్రియా' అనే పుస్తకం వుంది. ఇందుకు తోడుగా వున్నది విద్వాన్ విశ్వం – ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు రుద్రదత్త భరద్వాజ రచించిన 'యుద్ధం వల్ల వచ్చే ఆర్థిక ఫలితాలు' అనే కరపత్రం. దీన్ని నవ్య సాహిత్యమాల తరఫున సాధన ప్రెస్‌లో ముద్రించినారు. యుద్ధం పేరు పెట్టుకొని బ్రిటీషు సామ్రాజ్యవాదం ప్రజలను ఎట్లా పీల్చి పిప్పి చేస్తోందో ఈ కరపత్రం బట్టబయలు చేసింది. అందుకు

బ్రిటీషు ప్రభుత్వం తరిమెల నాగిరెడ్డి, విద్వాన్ విశ్వంలకు – అచ్చువేసినందుకు పప్పూరి రామాచారిని వదలిపెట్టి – ఒక సంవత్సరం శిక్ష విధించింది. యుద్ధం మొదలయిన తరువాత అనంతపురం జిల్లాలో ప్రప్రథమంగా జైలుకుపోయిన గౌరవం ఈ ఇద్దరి కమ్యూనిస్టులకే దక్కింది. విడుదల అయిన తరువాత రాష్ట్రం నుండి చంద్ర రాజేశ్వరరావును పిలిపించి – రాజేశ్వరరావును, నాగిరెడ్డిని – తరిమెలలో బండిమీద ఊరేగించి బహిరంగసభ ఏర్పాటు చేసినారు ప్రజలు.

తరిమెల నాగిరెడ్డి నీలం రాజశేఖరరెడ్డిగార్లు బెనారస్ యూనివర్సిటీ విద్యార్థులుగా ఉండగానే కమ్యూనిస్టు పార్టీలో సభ్యులుగా చేరారు. రెండవ ప్రపంచ యుద్ధం ప్రారంభమయ్యాక 1939 ఆఖరులో అనంతపురంజిల్లా కళ్యాణదుర్గం తాలూకా పెట్లూరు గ్రామంలో అయిదు రోజులు జరిగిన రాజకీయ శిక్షణా తరగతులలో నాగిరెడ్డి, సదాశివన్ తదితరులతో కలిసి అధ్యాపకులుగా వ్యవహరించారు. అంతకుముందు 1938 లో హిందూపురంలో జరిగిన రాజకీయ పాఠశాలలో కూడా అధ్యాపకులుగా పనిచేశారు. బ్రిటిష్ ప్రభుత్వ నిర్బంధ యుద్ధ నిధి వసూళ్ళకు నిర్బంధ ప్రొక్యూర్‌మెంట్, సివిల్ రిక్రూట్‌మెంట్‌లకు వ్యతిరేకంగా ప్రచారం చేయడానికి యువజన సంఘం "ఆకాశవాణి" అనే పేరుతో రహస్య సైక్లోస్టయిల్ పత్రిక స్థాపించి నడపటంలో నాగిరెడ్డి చురుకైన పాత్ర నిర్వహించారు. ఈ సందర్భంలో అరెస్టు చేయబడి ఒక ఏడాది కారాగార శిక్షను అనుభవించాడు. 1940 లో వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని అరెస్టయి బళ్ళారి, వేలూరు, తిరుచునాపల్లి జైళ్ళలో మరొక ఏడాది కఠిన కారాగార శిక్షను అనుభవించాడు. 1952 ఎన్నికల్లో ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభకు ఎన్నుకోబడ్డారు. కమ్యూనిస్టు పార్టీ తరఫున శాసనసభ ప్రతిపక్ష నాయకుడిగా సమర్థవంతంగా బాధ్యతలు నిర్వహించాడు. కర్నూలు రాజధానిగా ప్రత్యేక ఆంధ్రరాష్ట్రం ఏర్పడినప్పుడు కూడా శాసనసభ సభ్యుడుగా ఉన్నారు. మళ్ళీ 1962–67 లో ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభ్యులుగా ఎన్నుకోబడ్డాడు.

1964 లో కమ్యూనిస్టు పార్టీ చీలి మార్క్సిస్ట్ పార్టీ ఏర్పడినప్పుడు ఆ పార్టీలో చేరాడు. 1968 లో నక్సలైట్ ఉద్యమం ప్రారంభమైనప్పుడు ఆ పార్టీలో చేరి, శాసన సభ్యత్వానికి రాజీనామా ఇచ్చాడు. అజ్ఞాతవాసంలోకి వెళ్ళిపోయాడు. చివరకు అజ్ఞాతవాసంలోనే 1975 లో మృతిచెందాడు. రాయలసీమలో కమ్యూనిస్టు ఉద్యమ వ్యాప్తికి కామ్రేడ్ సదాశివన్, కామ్రేడ్ రాజశేఖరరెడ్డి, వి.కె. ఆదినారాయణరెడ్డి గార్లతో పాటు కామ్రేడ్ నాగిరెడ్డి విశేష కృషి చేశాడు.

★ ★ ★

# ఎస్.వి.కె. ప్రసాద్

కామ్రేడ్ ఎస్.వి.కె. ప్రసాద్ (శాఖమూరి వెంకటకృష్ణ ప్రసాద్) గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకా (ప్రస్తుతం అచ్చంపేట మండలం) తాడువాయి గ్రామంలో ఒక ధనిక రైతు కుటుంబంలో జన్మించారు. ముక్త్యాల, చల్లపల్లి జమీందారీ కుటుంబాలతో బంధుత్వాలు ఉండేవి. ప్రాథమిక విద్య తాడువాయిలోను, చల్లపల్లిలో బందరులో మిడిల్ స్కూలు విద్యనభ్యసించారు. చల్లపల్లి రాజాగారి కుటుంబంలోని శ్రీ రామకృష్ణ ప్రసాద్ చిన్ననాటినుండి సహాధ్యాయ మిత్రుడుగా ఉండేవారు.



బందరు హిందూ హైస్కూలులో హిందూ కాలేజీలలో విశ్వనాథ సత్యనారాయణ, ముని మాణిక్యం నరసింహారావు, గోపరాజు రామచంద్రరావు (గోరా) మున్నగు విద్యావేత్తలు ఉపాధ్యాయులుగా లెక్చరర్లుగా ఉండేవారు. వారి సాన్నిహిత్యంలో ఎస్.వి.కె. ప్రభావితులయ్యారు. ప్రఖ్యాత జాతీయోద్యమ ప్రముఖులు చెరుకువాడ నరసింహం పంతులుగారు అప్పుడు హిందూ హైస్కూలు టీచరుగా ఉండేవారు. వారి అనర్గళ ఉపన్యాసాలు వినడమేకాక వారు లెక్కల ట్యూషన్ కూడా చెప్పేవారు.

హైస్కూలులో మూడు సంవత్సరాలు వరుసగా ర్యాంకు వచ్చినందుకు హైస్కూలు వార్షికోత్సవ సందర్భంలో వచ్చిన ప్రముఖ విద్యావేత్త ఆ తరువాత రాష్ట్రపతి అయిన సర్వేపల్లి రాధాకృష్ణగారు ఎస్.వి.కె. ప్రసాద్‌కు మనుచరిత్ర గ్రంథం బహూకరించారు. ఆ గ్రంథాన్ని చివరిదాకా భద్రంగా దాచుకొన్నారు.

గాంధీజీ ఆంధ్రదేశ పర్యటన సందర్భంగా బందరు వచ్చి ఆంధ్ర జాతీయ కళాశాలలో ఉపన్యసించినప్పుడు ఆ సభకు ఎస్.వి.కె. వెళ్ళి ఎంతో ప్రభావితులయ్యారు. జవహర్‌లాల్ నెహ్రూ వ్రాసిన "భారతదేశమా? నీ గమ్యం ఏమిటి?" (Wither India) చదివి సోషలిస్టు భావాలవైపు ఆకర్షితులయ్యారు. సాహిత్య గ్రంథాలను కూడా ఎన్నో చదివారు.

1934 లో మద్రాసు ప్రెసిడెన్సీ కాలేజీలో బి.ఎ. ఆనర్స్ చదివారు. 1937 లో విద్యార్థి ఉద్యమంతో ప్రత్యక్ష రాజకీయ జీవితం ప్రారంభమైంది. కమ్యూనిస్టు పార్టీతో సంబంధం ఏర్పడి మార్క్సిస్టు సాహిత్యాన్ని అధ్యయనం చేశారు. చల్లపల్లి జమీందారు కుటుంబీకుడు రామకృష్ణ ప్రసాద్‌తో కలిసి వారి బంగళాలో ఉండేవారు. మార్క్సిస్టు సాహిత్యం బంగళాలో ఉందని బ్రిటిష్ పోలీసులు దాడిచేశారు. ముందు జాగ్రత్తలు తీసుకోవడంవల్ల సాహిత్యం ఏమీ దొరకలేదు. (1940 మార్చి 17 న ఈ సోదా జరిగింది).

1937 లో స్థాపించబడిన మద్రాసు విద్యార్థిసంఘం (MSO) లో చేరి అందులో ప్రముఖ పాత్ర వహించారు. 1938 లో కమ్యూనిస్టు పార్టీ సభ్యుడుగా చేరారు. కమ్యూనిస్టుపార్టీ అగ్రనాయకులు ఎస్.వి. ఘాటే మున్నగువారితో సన్నిహిత పరిచయాలు ఏర్పడ్డాయి. మోహిన్ కుమారమంగళం, వారధి కుమార మంగళం మున్నగువారితో కలిసి అఖిల భారత విద్యార్థి ఫెడరేషన్ ఉద్యమంలో చురుకుగా పాల్గొన్నారు.

1939 లో జరిగిన మంతెనవారిపాలెం రాజకీయ పాఠశాలకు హాజరయ్యారు. ఆ తరువాత ఆంధ్రరాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ పార్టీ విభాగం నాయకుడుగా బాధ్యతలు స్వీకరించారు. రెండవ ప్రపంచ యుద్ధకాలం, బ్రిటిష్ ప్రభుత్వ నిర్బంధకాండ ఫలితంగా రహస్యంగా ఉంటూనే విద్యార్థి రంగంలో పార్టీశాఖలను నిర్మించి, రాజకీయ శిక్షణ యిచ్చారు.

1943 రాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ 7 గురు సభ్యులలో ఒకరుగా ఎన్నుకోబడ్డారు. మిగిలిన సభ్యులు చండ్ర రాజేశ్వరరావు, మద్దుకూరి చంద్రశేఖరరావు, చలసాని వాసుదేవరావు, మాకినేని బసవపున్నయ్య, కె.ఎల్. నరసింహం, కొండేపూడి లక్ష్మీనారాయణగార్లు.

1943 మే నెలలో ఎస్.వి.కె ను తెలంగాణా పార్టీ నిర్మాణ బాధ్యతలు యిచ్చి అక్కడకు పంపారు. ముందు విద్యార్థి నాయకులతోను, కామ్రేడ్స్ ఎసోషియేషన్‌తోను, అటు పిమ్మట ఆంధ్ర మహాసభ ప్రముఖ నాయకులతోను సంబంధాలు నెలకొల్పుకొని పార్టీ నిర్మాణానికి పూనుకున్నారు. రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి, మఖ్దూం మొహియుద్దీన్, దేవులపల్లి వెంకటేశ్వరరావు, పెరవల్లి వెంకటరమణయ్య, చంద్రగుప్త చౌదరి, వి.డి. దేశపాండేలతో కూడిన హైదరాబాద్ స్టేట్ కమిటీ ఏర్పడింది. దీనికి

కన్వీనర్‌గా కామ్రేడ్ ఎస్.వి.కె. నియమించబడ్డారు. 1939 యుద్ధకాలం నుండి ఆంధ్ర ప్రాంతంలో విద్యార్థి ఉద్యమ పార్టీ ఫ్రాక్షన్ బాధ్యత వహించినప్పటినుండి ప్రారంభమైన ఎస్.వి.కె. రహస్య జీవితం తెలంగాణా పార్టీ ఆర్గనైజరుగా పనిచేసిన కాలమంతా కొనసాగుతూనే వచ్చింది. 1951 జులై అరెస్టు అయ్యేవరకు మోహనరావు, రామారావు మొదలగు మారుపేర్లతోనే వ్యవహరించడం జరిగింది. దాదాపు 11 సంవత్సరాల దీర్ఘకాల అజ్ఞాతవాస జీవితం గడిపారు. ఏరియా, జిల్లా సాయుధ దళాలకు నాయకత్వం వహించారు. 1948 నవంబరులో జనగాం ఏరియాలో అరెస్టయి 6 నెలలు తిరగకముందే పోలీసు కస్టడీనుండి తప్పించుకొని, వెంకట్రావు పేరుతో తెలంగాణా పోరాట ప్రాంత కమిటీ సభ్యునిగా 1951 జులైలో అరెస్టు అయ్యేంతవరకు పనిచేశారు.

నల్లగొండ, వరంగల్ జిల్లాల్లో అనేక రాజకీయ పాఠశాలలు నడపటంలో ప్రధాన పాత్ర వహించారు. ఆ తరువాత జరిగిన సాయుధ పోరాటానికి ఈ రాజకీయ శిక్షణా కార్యక్రమం ఎంతగానో తోడ్పడింది.

1944 నుండి ప్రారంభమైన ఫ్యూడల్ వ్యతిరేక పోరాటం - 1947-48 వచ్చేసరికి నైజాం వ్యతిరేక సాయుధ పోరాటంగా మారింది. ఈ చరిత్రాత్మక విప్లవ పోరాటంలో ఈ రాజకీయ పాఠశాలల్లో తర్ఫీదు పొందినవారే కార్యకర్తలుగా, నాయకులుగా ప్రధాన పాత్ర వహించారు.

తెలంగాణా సాయుధ పోరాటం ప్రారంభం కాగానే కామ్రేడ్ ఎస్.వి.కె. ప్రత్యక్షంగా సాయుధ ప్రతిఘటనకు నాయకత్వం వహించడానికి వరంగల్లు ఏరియా కమిటీ కార్యదర్శిగా బాధ్యత తీసుకొన్నారు. గెరిల్లా శిక్షణా తరగతులు నిర్వహించారు. భూమి పంపకం కార్యక్రమాల్లో పాల్గొన్నారు. రజాకార్లతో నైజాం సైనికులతో, తరువాత యూనియన్ సైన్యాలతో జరిగిన అనేక సాయుధ సంఘర్షణలలో ప్రత్యక్షంగా పాల్గొన్నారు. అరెస్టయి పోలీసు కాల్పుల నుండి తప్పించుకున్నారు. సాయుధ పోరాటాలు ఉధృతంగా కొనసాగుతున్న సమయంలోనే 1949 నవంబరులో శ్రీమతి సుగుణతో వివాహం జరిగింది.

1951 లో అరెస్టయి రెండున్నర సంవత్సరాలు జైలు జీవితం గడిపారు. 1952 ఎన్నికల అనంతరం బహిరంగ అవకాశాలు వచ్చిన తరువాత హోటలు, రైల్వే తదితర ట్రేడ్ యూనియన్‌లలో పనిచేశారు. వరంగల్ జిల్లా పార్టీ తృతీయ మహాసభలో జిల్లా కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు. 1956 లో ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత 1957 లో తెలంగాణా ప్రాంత ఎన్నికలలో చెన్నూరు నియోజక వర్గం నుండి ఆంధ్రప్రదేశ్ శాసనసభకు ఎన్నికయ్యారు.

1994 జులై 17 న కామ్రేడ్ ఎస్.వి.కె. ప్రసాద్ కన్ను మూశారు.

★ ★ ★

# మాకినేని బసవపున్నయ్య

మాకినేని బసవపున్నయ్య 1914 డిసెంబర్ 14వ తేదీన గుంటూరు జిల్లాలో జన్మించారు. గుంటూరు ఎ.సి. కాలేజీలో చదువుతూ విద్యార్థి ఉద్యమంలో చేరారు. 1934-35 ప్రాంతాలలో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. డిటెన్షన్ విధానానికి వ్యతిరేకంగా జరిగిన గుంటూరు విద్యార్థుల సమ్మెకు నాయకత్వం వహించారు. రాష్ట్ర విద్యార్థి ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించారు. 1938లో ఆంధ్రరాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహించారు. అఖిలభారత విద్యార్థి ఫెడరేషన్ సహాయ కార్యదర్శిగా కూడా పనిచేశారు.



1940లో గుంటూరు జిల్లా కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శిగా బాధ్యతలను స్వీకరించారు. 1943 లో రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ కార్యవర్గ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. 1948 లో కలకత్తాలో జరిగిన కమ్యూనిస్టు పార్టీ ద్వితీయ మహాసభలో పార్టీ కేంద్ర కమిటీకి ఎన్నుకోబడ్డారు. అప్పటినుండి నాల్గు దశాబ్దాల పాటు కేంద్ర కార్యవర్గంలో పనిచేశారు. తెలంగాణా సాయుధ పోరాటాన్ని నిర్వహించిన కామ్రేడ్ సుందరయ్య, చండ్ర రాజేశ్వరరావు మొదలైన ముఖ్యులలో కామ్రేడ్ బసవపున్నయ్య ఒకరు. అనేక అంతర్జాతీయ కమ్యూనిస్టు మహాసభలలో కామ్రేడ్ బసవపున్నయ్య పాల్గొన్నారు. స్టాలిన్ మావో, హొచిమిన్, లిషావ్‌చీ, చౌఎన్‌లై, డెంగ్ సియావోపెంగ్ మొదలైన అంతర్జాతీయ కమ్యూనిస్టు నాయకులను కలుసుకొని వారితో చర్చించిన భారత కమ్యూనిస్టు ప్రముఖులలో కామ్రేడ్ బసవపున్నయ్య ఒకరు.

1964 లో కమ్యూనిస్టు ఉద్యమం చీలి మార్క్సిస్టు పార్టీ ఏర్పడినప్పుడు ఆ పార్టీని నిర్మించిన అగ్రనాయకులలో ఒకరుగా చివరికంటా గురుతర బాధ్యతలు నిర్వహించారు. మార్క్సిస్టు పార్టీ సిద్ధాంతవేత్తలలో ఒకరుగా పార్టీ సిద్ధాంత పత్రాలను అనేకం తయారుచేసిన వారిలో ఒకరుగా పేరుపొందారు. పార్టీ పత్రిక పీపుల్స్ డెమాక్రసీ సంపాదకులుగా చాలాకాలం పనిచేశారు.

విప్లవోద్యమం కోసం సుందరయ్య, రాజేశ్వరరావు మున్నగువారితో సహా తమ వ్యక్తిగత ఆస్తులను అమ్మి పార్టీకి యిచ్చినవారిలో బసవపున్నయ్యగారొకరు. ఆయన 1992 ఏప్రిల్ 12వ తేదీన ఢిల్లీ పార్టీ కేంద్ర కార్యాలయంలో అకస్మికంగా కన్నుమూశారు.

★ ★ ★

# గుజ్జుల యల్లమందారెడ్డి

1940వ దశకంలో విద్యార్థి ఉద్యమం ద్వారా కామ్రేడ్ యల్లమందారెడ్డి బ్రిటిష్ సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటంలోకి జాతీయోద్యమంలోకి తదుపరి కమ్యూనిస్టు ఉద్యమంలోకి ప్రవేశించారు. సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాన్ని ఫ్యూడల్ వ్యతిరేక పోరాటంగా విస్తరింపచేసి, ఆంధ్ర కమ్యూనిస్టు ఉద్యమం నడిపిన అనేక జమీందారీ భూస్వామ్య వ్యతిరేక పోరాటాలలో పాల్గొన్నారు. శాసనసభలోపల, పార్లమెంటులోపల, బైట ఆయన రైతు, కూలీ సమస్యలపైన తమ దృష్టినంతా కేంద్రీకరించారు. పేద రైతు కుటుంబంలో పుట్టిన కామ్రేడ్ యల్లమందారెడ్డి గ్రామీణ పేద ప్రజల విముక్తి పోరాటాలకే తన రాజకీయ జీవితంలో అధికభాగం కృషి చేశారు. కఠోరమైన అజ్ఞాతవాస జీవితాలు గడిపారు. జాతీయోద్యమ సత్సంప్రదాయాలను, నిష్కళంక



ప్రజాజీవిత ఆదర్శాలను పుణికి పుచ్చుకున్న కామ్రేడ్ యల్లమందారెడ్డి పీడిత ప్రజల విముక్తి పోరాటాల పరిభాషకు ఒక కొత్త పదాన్ని "కూలిదండు" పదాన్ని సృష్టించారు. (దుగ్గిరాల గోపాలకృష్ణయ్యగారి రామదండును తలపించే విధంగా) ఆంధ్ర రాజధాని

హైదరాబాదు నగరాన్ని కుదిపివేసిన మహత్తరమైన "కూలిదండు" ప్రదర్శనాన్ని కోండ్రు సుబ్బారావు, ఆంజనేయ శాస్త్రి తదితరులతో కలిసి నిర్వహించారు. ఆ పేరిటనే వ్యవసాయ కార్మికోద్యమానికి గొప్ప ఆందోళన – ప్రచార సాధనంగా "కూలిదండు" మాసపత్రికను చాలాకాలం యల్లమందారెడ్డి, జె.ఎస్.ఆర్.ఆంజనేయశాస్త్రి ప్రభృతులు కలిసి నిర్వహించారు. భూమికోసం, భుక్తికోసం, వ్యవసాయ కార్మికులు జరిపిన అనేక పోరాటాలకు యల్లమందారెడ్డి నాయకత్వం వహించారు. అఖిల భారత ఖేత్ మజ్దూర్ సంఘ్ నాయకుడుగా యావద్భారతదేశం పర్యటించి, స్వాతంత్ర్యానంతర కాలంలో భారతదేశంలో ఫ్యూడల్, భూస్వామ్య విధానం నిర్మూలనకు, దున్నేవాడికే భూమికోసం అనేక చారిత్రాత్మక పోరాటాలను నడిపారు. సమగ్ర వ్యవసాయ కార్మిక చట్టంకోసం ఎడతెగని కృషి చేశారు. భారత రాజధాని నగరంలో లక్షలాది వ్యవసాయ కార్మికులు పాల్గొన్న ప్రదర్శనలకు నాయకత్వ పాత్ర నిర్వహించారు. పార్టీ రాజకీయ వారపత్రిక "కొత్తబాట"కు సంపాదకుడుగా వ్యవహరించారు. 1964లో కమ్యూనిస్టు ఉద్యమం, వ్యవసాయ కార్మికోద్యమం, ఇతర ప్రజాఉద్యమాలు చీల్చబడినపుడు ఆంధ్రలో తిరిగి వ్యవసాయ కార్మికోద్యమ పునర్నిర్మాణానికి పెదవడ్లపూడిలో రాష్ట్ర వ్యవసాయ కార్మిక మహాసభ జరిపి రాష్ట్రంలో తిరిగి బలమైన వ్యవసాయ కార్మికోద్యమానికి పునాదులు వేశారు. ప్రాథమిక స్థాయిలో (Grass-root level) కమ్యూనిస్టుపార్టీని, కష్టజీవుల సంఘాలను పటిష్టం చేయడంపై ఆయన నిరంతర అధ్యయనం చేశారు. పార్టీని ప్రజాసంఘాలను పునరుజ్జీవింపచేయడానికి గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలను చేపట్టడం వినా వేరుమార్గం లేదని, కమ్యూనిస్టు పార్టీ కేంద్ర కార్యవర్గం ముందు ఒక సమగ్రమైన అధ్యయన పత్రాన్ని, (తీర్మాన రూపంలో) ప్రవేశపెట్టి ఆమోదింపచేయడం ఆయన తన చివరి రోజుల్లో నిర్వహించిన కీలక కర్తవ్యం. వర్గ పోరాటాలను సామాజిక అభివృద్ధి కార్యక్రమాలను ఎలా మేళవించాలో ఆయన స్పష్టం చేశారు. ప్రాథమిక స్థాయిలలో (Reorientation of Party Work, at Grass root level) మనం పార్టీని ప్రజా సంఘాలను పునర్నిర్మించనిదే మన ఉద్యమాలు పురోగమించలేవనీ, ఈ విషయంలో మనం తగినంత కేంద్రీకరణ చేయడంలేదనీ ఆయన నొక్కి చెప్పారు. చెరగని చిరునవ్వుతో "బాగున్నారా! ఎలా పనిచేస్తున్నారు? ఆరోగ్యాలు సరిగా చూసుకుంటున్నారా?" అన్న ఆప్యాయమైన పలకరింపు, అన్ని స్థాయిల్లో సామాన్య కార్యకర్తల వరకు ఆయన కలుపుగోలుతనం యల్లమందారెడ్డి సహజలక్షణాలు.

1997 ఏప్రిల్ 27 వ తేదీన కామ్రేడ్ ఎల్లమందారెడ్డి మృతిచెందారు

★ ★ ★

# నల్లమల గిరిప్రసాద్

నిజాం నిరంకుశ ఫ్యూడల్ వ్యవస్థకు వ్యతిరేకంగా తెలంగాణాలో సాగిన సాయుధ పోరాటంలో ప్రత్యక్షంగా పాల్గొన్న నల్లమల ప్రసాదరావు (గిరి ప్రసాద్) ఖమ్మం జిల్లా మధిర తాలూకా తొండల గోపవరం గ్రామంలో మధ్యతరగతి రైతు కుటుంబంలో 1931 ఏప్రిల్ 6న జన్మించారు. స్వగ్రామంలో హైస్కూలు విద్యనభ్యసించారు. మద్రాసులో కాలేజీలో చదువుతుండగా నైజాం సంస్థానంలో, నిజాం నిరంకుశ పాలనకు వ్యతిరేకంగా 'ఆంధ్ర మహాసభ' సాగిస్తున్న ఉద్యమంతో ప్రభావితులయ్యారు. కాలేజీ చదువులకు స్వస్తి చెప్పి 1947 లో స్వగ్రామం తొండల గోపవరం వచ్చి. ఆంధ్ర మహాసభ కార్యకలాపాలలో పాల్గొంటూ కమ్యూనిస్టు పార్టీ సభ్యునిగా చేరారు. ఆనాడు కమ్యూనిస్టు పార్టీ ఏర్పరచిన గ్రామ రక్షణ దళంలో చేరి భూమికోసం, భుక్తికోసం, వెట్టిచాకిరీ నిర్మూలన కోసం జరిగే ఉద్యమానికి నాయకత్వం వహించారు.



నిజాం రాక్షస రజాకారుమూకలు గ్రామాలపైబడి బీభత్సకాండ జరుపుతుండగా ప్రజలు తిరగబడి సాయుధ పోరాటాన్ని ప్రారంభించిన తరుణంలో వీరు తుపాకి ధరించి దళసభ్యుడిగా అనేక గ్రామాల ప్రజలను కాపాడుతూ వేలాది ఎకరాల భూమిని పేదలకు పంచి గ్రామరాజ్యాలను స్థాపించారు.

యూనియన్ సైన్యాలు నైజాం రాజ్యాన్ని స్వాధీనం చేసుకున్న తరువాత – భారత సైన్యం సాయుధ దళాలపై దాడులు జరిపిన సమయంలో, తన గెరిల్లా దళంతోసహా పాల్వంచ ప్రాంతంలో ప్రవేశించి అచ్చట దళ నాయకుడుగాను, ఏరియా పోరాట కమిటీ సభ్యుడుగానూ ఉంటూ మన్యం ప్రజలలో చైతన్యాన్ని కలిగించారు.

గిరిప్రసాద్ దళాన్ని పట్టుకునేందుకు వందలాదిమంది పోలీసులు, సైన్యం అనేక దాడులు జరిపినప్పటికీ వాటన్నింటినీ ఎదిరిస్తూ, అధిగమిస్తూ తమ దళాన్ని కాపాడుకున్నారు. ఒక స్థావరం వద్ద జరిగిన తీవ్రమైన కాల్పులలో గిరిప్రసాద్ ఛాతీనుండి తుపాకి గుండు దూసుకుపోయినప్పటికీ పట్టుబడకుండా తప్పించుకున్నారు. రక్తం మడుగుల్లో వున్న వీరిని మన్యం ప్రజలు కాపాడి తమ ప్రియతమ నాయకుని రక్షించుకున్నారు. ఆ కాలంలో 'గిరిదళం' వైపు వెళ్ళడానికి పోలీసులు, సైన్యాలు సాహసించలేకపోయాయి. కొత్తగూడెంలో బొగ్గుగని కార్మికుల యూనియన్ స్థాపించిన ఏకైక నాయకుడు కామ్రేడ్ శేషగిరిరావును ప్రభుత్వం కాల్చివేసిన సందర్భంలో ఆ అమరవీరుని పేరులోని 'గిరి' అనే పదాన్ని వీరు స్వీకరించి 'గిరిదళం' అనే పేరుతో ఆనాడు పోరాటాన్ని నిర్వహించారు. వీరు అజ్ఞాతవాసం నుండి బయటకు వచ్చిన తరువాత కూడా గెరిల్లా పోరాట దళంలో వుంచబడిన వీరి 'గిరి' అనే పేరును ప్రజలు విడువకుండా, తమ నాయకునిపైగల ప్రేమాభిమానాలతో "గిరిప్రసాద్‌రావు" అని పిలువసాగారు. అదే విప్లవనామం వీరికి సార్థకమైంది.

ఐదు సంవత్సరాలు అజ్ఞాతవాసంలో గడిపి, సాయుధ పోరాట విరమణ జరిగిన తరువాత 1953 లో బయటకు రాగానే ప్రభుత్వం వీరిని అరెస్టు చేసింది. వీరిపై అనేక కేసులు మోపి సంవత్సరంపాటు జైలులో వుంచింది. ఆ కేసులలో ఏదీ రుజువుకాలేదు.

1953 లో ఖమ్మం జిల్లా కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శిగా ఎన్నికై 1964 లో పార్టీ చీలిక వరకు 11 సంవత్సరాలపాటు జిల్లా కార్యదర్శిగా వుంటూ, జిల్లాలో బలమైన కమ్యూనిస్టు పార్టీని, గణనీయమైన ప్రజా ఉద్యమాన్ని నిర్మించారు. పార్టీ కార్యదర్శిగా ఇటు కమ్యూనిస్టు పార్టీ వర్గాలలోనేగాక అనేక వర్గాల ప్రజల మన్ననలను చూరగొన్నారు.

1962 లో జరిగిన శాసనసభ ఎన్నికల్లో ఖమ్మం నియోజకవర్గం నుండి కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థిగా పోటీచేసి కాంగ్రెస్‌పై అత్యధిక మెజారిటీ ఓట్లతో గెలుపొంది ప్రజల సమస్యలను శాసనసభా వేదికపై అందరి దృష్టికి తెస్తూ మంచి వక్తగా పేరుపొందారు. 1962 లో చైనా–భారత సరిహద్దు సంఘర్షణ సందర్భంలో వీరిని ప్రభుత్వం దేశ రక్షణ చట్టం క్రింద ఒక ఏడాదిపాటు జైలులో నిర్బంధించింది.

'విశాఖ ఉక్కు ఆంధ్రుల హక్కు' అనే నినాదంతో ఆంధ్రదేశంలో ఉవ్వెత్తున లేచిన ఉద్యమానికి అండగా తన శాసనసభ సభ్యత్వానికి రాజీనామా యిచ్చారు. 1964

లో పార్టీ చీలికతో ఖమ్మంలో అత్యంత బలహీనదశలో వున్న భారత్ కమ్యూనిస్టు పార్టీ పునర్ నిర్మాణానికి అహర్నిశలూ కృషి చేశారు. రాష్ట్ర కమ్యూనిస్టు సమితి కార్యదర్శివర్గ సభ్యునిగా, సహాయ కార్యదర్శిగా బాధ్యతలు నిర్వహిస్తూనే; ఖమ్మం జిల్లాలో కమ్యూనిస్టు పార్టీని బలమైన శక్తిగా రూపొందించారు. 1978లో ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు సమితి కార్యదర్శిగా ఎన్నికై 1991 వరకు ఆ బాధ్యత నిర్వర్తించారు.

విశాలాంధ్ర విజ్ఞానసమితి అధ్యక్షులుగా కూడా పనిచేశారు. 1992 నుండి రాజ్యసభ సభ్యులుగా వ్యవహరించారు. పార్లమెంటులో పేదల, ప్రజానుకూల విధానాలపై పార్టీ తరపున బలమైన వాణిగా నిలిచారు. 1995 లో ఆయన రాజ్యసభలో సి.పి.ఐ. పక్ష నాయకుడిగా ఎన్నికయ్యారు. 1992లో సి.పి.ఐ. జాతీయ సమితి కార్యదర్శిగా, 1996 లో ఉప ప్రధాన కార్యదర్శిగా ఎన్నుకోబడ్డారు.

1997 మే 24వ తేదీన కామ్రేడ్ గిరిప్రసాద్ మృతిచెందారు.

★ ★ ★

# తమ్మారెడ్డి సత్యనారాయణ

1920 జులై 9న కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా చినపాలపర్రు గ్రామంలో ఒక పేదరైతు కుటుంబంలో పుట్టిన తమ్మారెడ్డి సత్యనారాయణ, బ్రిటీషు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా జరిగిన స్వాతంత్ర్య సమరంలో భాగంగా సమరశీల విద్యార్థి ఉద్యమాన్ని నిర్మించారు. బ్రిటీషు వలస విద్యావిధానంలోని డిటెన్షన్ వడపోత పద్ధతికి వ్యతిరేకంగా అనేక పోరాటాలు నడిపారు. రాష్ట్ర విద్యార్థి ఫెడరేషన్ నాయకునిగా రాష్ట్రమంతటా విద్యార్థి ఉద్యమాన్ని నిర్మించి, ఎంతోమంది విద్యార్థులను స్వాతంత్ర్యోద్యమంలోకి, ఆ తరువాత విప్లవోద్యమాలలోకి తీసుకొని వచ్చారు. 1938 లోనే కమ్యూనిస్టు భావాలవైపు ఆకర్షించబడి పార్టీలో చేరారు.



1939 రెండవ ప్రపంచయుద్ధ కాలంలో బ్రిటీషు పాలకులకు, పోలీసులకు సింహస్వప్నంగా వున్న రహస్య కమ్యూనిస్టు పత్రిక "స్వతంత్ర భారత్"ను విద్యార్థి యువజనుల్లో వ్యాపింపజేయడంలో, ఆ సందర్భంలో ప్రభుత్వ నిర్బంధ విధానాన్ని పోలీసు కుట్ర కేసులను ఎదుర్కొని పోరాడటంలో మొక్కవోని ధైర్యం చూపారు.

ప్రజాశక్తి, విశాలాంధ్ర మొదలైన కమ్యూనిస్టు పత్రికల నిర్వహణలో, ఆంధ్రదేశంలో ప్రగతిశీల ప్రజాసాహిత్య ప్రచురణలో అగ్రగామి పాత్ర నిర్వహించిన ప్రజాశక్తి, విశాలాంధ్ర ప్రచురణాలయాలను తీర్చిదిద్దడంలో తమ్మారెడ్డి అవిరళ కృషి చేశారు. విద్యార్థి, యువజనోద్యమాలతోబాటు, ప్రజానాట్యమండలి తదితర సాంస్కృతిక సంస్థల నిర్మాణంలో కూడా ప్రముఖపాత్ర నిర్వహించారు. ఫాసిస్టు వ్యతిరేక పోరాటకాలంలో వైజ్ఞానిక ప్రచార దళాలను ఏర్పాటుచేయడంలో, ఆత్మరక్షణ శిక్షణా శిబిరాల నిర్వహణలో కృషి చేశారు.

ఆంధ్రప్రాంతం నుండి తెలంగాణా ప్రాంతానికి రహస్యంగా కమ్యూనిస్టు ఉద్యమాన్ని యితర ప్రజాతంత్ర ఉద్యమాల్ని వ్యాపింపచేయడంలో, ఆ తరువాత నైజాం ఫ్యూడల్ నిరంకుశ పాలనను కూలద్రోయడానికి జరిగిన తెలంగాణా సాయుధ పోరాటాన్ని ఆర్గనైజ్ చేయడంలో తమ్మారెడ్డి అజ్ఞాతంగా కీలక పాత్ర నిర్వహించారు. రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో గెరిల్లా పోరాట శిక్షణ పొందిన అనుభవంతో రజాకార్లకు వ్యతిరేకంగా తెలంగాణాలో సాయుధ పోరాట దళాలను నిర్మించడంలో, ఆయుధ శిక్షణ యివ్వడంలో, పోరాట దళాల వ్యూహరచనలో, లక్షలాది ఎకరాల జాగీర్దార్ల, దేశముఖ్‌ల భూములను స్వాధీనపరచుకొని రైతాంగానికి పంచడంలో సుందరయ్య, చండ్ర రాజేశ్వరరావు మున్నగు కమ్యూనిస్టు అగ్రనాయకులతో రావి నారాయణరెడ్డి, ఆరుట్ల రామచంద్రారెడ్డి మున్నగు ప్రఖ్యాత తెలంగాణా పోరాట యోధులతో కలిసి పనిచేశారు.

1948-52 మధ్యకాలంలో కమ్యూనిస్టు ఉద్యమంపై తీవ్ర నిర్బంధకాండ సాగిన రోజుల్లో తమ్మారెడ్డి అరెస్టులు, జైలు శిక్షలు అనుభవించారు. కడలూరు జైలులో జరిగిన పోలీసు కాల్పులకు ఎదురొడ్డి నిలబడి తీవ్రంగా గాయపడ్డారు.

ప్రత్యేకాంధ్ర రాష్ట్ర నిర్మాణం, ఆ తరువాత విశాలాంధ్ర నిర్మాణం కొరకు కమ్యూనిస్టు ఉద్యమం, యితర ప్రజాతంత్ర ఉద్యమాలు సాగించిన సుదీర్ఘ పోరాటాలలో రాష్ట్ర కమ్యూనిస్టు పార్టీ ముఖ్యులలో ఒకరుగా తమ్మారెడ్డి ప్రముఖ పాత్ర నిర్వహించారు. అలాగే ఆంధ్ర ప్రజల సమైక్యతకు ముప్పు తెచ్చిన ప్రత్యేక తెలంగాణా, ప్రత్యేకాంధ్ర ఏర్పాటు ఉద్యమాలను తిప్పికొట్టడంలో రాష్ట్ర సమైక్యత పరిరక్షణకు జరిగిన వీరోచిత పోరాటాలలో తమ్మారెడ్డి చైతన్యవంతమైన పాత్ర వహించారు.

ఈవిధంగా ఆంధ్ర దేశంలో, ఆంధ్రప్రదేశ్‌లో గత అర్ధ శతాబ్ద కాలంగా స్వేచ్ఛా స్వాతంత్ర్యాల కోసం, ప్రజాతంత్ర విప్లవం కోసం జరిగిన పోరాటాలతో కామ్రేడ్ తమ్మారెడ్డి పేరు ముడిపడి ఉంది. కామ్రేడ్ సత్యనారాయణ విప్లవ యోధుడుగా, పదవులను ఆశించని నిస్వార్థ ప్రజాసేవకునిగా చిరస్మరణీయమైన పాత్ర నిర్వహించారు.

కమ్యూనిస్టు ఉద్యమం సిద్ధాంత, రాజకీయ సమస్యలపై వచ్చిన విభేదాల ఫలితంగా ఒడిదుడుకులకు గురైన ప్రతి సమయంలోను, ఉద్యమ ఐక్యతను నిలబెట్టడానికి

కామ్రేడ్ తమ్మారెడ్డి ఎంతో సహనంతో దీక్షా దక్షతలతో కృషి చేశారు. 1964 లో కమ్యూనిస్టు ఉద్యమం చీలకుండా చేయడానికి ఆయన ఎంతో ప్రయత్నం చేశారు. ఆ తరువాత తిరిగి కమ్యూనిస్టు ఉద్యమాన్ని సమైక్యం చేయడానికి కూడా తన జీవితాంతం ఎంతో ప్రయత్నించారు.

తన యావత్తు జీవితాన్ని తన సోదరీ సోదరులు, తల్లిదండ్రులతో సహా తన కుటుంబాన్నంతనూ దేశభక్తి యుత ఉద్యమాలకు, పీడిత ప్రజల విముక్తి పోరాటాలకు అంకితమొనరించిన స్వాతంత్ర్య యోధునిగా, కమ్యూనిస్టు నాయకునిగా కామ్రేడ్ తమ్మారెడ్డి సత్యనారాయణ తమ జీవితాన్ని ధన్యమొనరించుకున్నారు.

★ ★ ★

# ఎల్లారెడ్డి, బద్దం

- డి. రామలింగం

ఆంధ్రప్రదేశ్ కమ్యూనిస్టు పార్టీ అగ్రనాయకులలో ఒకడు. తెలంగాణాలో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాత. కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యాన తెలంగాణాలో జరిగిన సాయుధ గెరిల్లా పోరాట వీరుడుగా ప్రసిద్ధి చెందెను. స్వగ్రామం కరీంనగరు జిల్లా సిరిసిల్ల తాలూకా గాలిపల్లి. 1930 శాసనోల్లంఘనోద్యమంలో కాకినాడ సత్యాగ్రహ శిబిరానికి వెళ్ళి సత్యాగ్రహం చేసి ఆరు నెలల జైలుశిక్ష అనుభవించెను. హరిజన సేవక సంఘం హైదరాబాదు రాష్ట్ర కమిటీ సభ్యుడుగానూ, కరీంనగరుజిల్లా హరిజన సేవకసంఘానికి అధ్యక్షుడు గానూ పనిచేసెను. కరీంనగరు జిల్లా సిరిసిల్లలో మాడపాటి హనుమంతరావు పంతులుగారి అధ్యక్షతను జరిగిన నాల్గవ నిజాం రాష్ట్ర ఆంధ్ర మహాసభకు ఆహ్వానసంఘ కార్యదర్శిగా పనిచేసెను. అప్పుడు ఒక సేవాదళం నిర్మించెను. 1938లో హైదరాబాదు సంస్థానంలో పౌరసత్వాలకోసం జరిగిన సత్యాగ్రహంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించెను. 1939లో కమ్యూనిస్టు పార్టీలో చేరారు. నిజాం రాష్ట్ర ఆంధ్రమహాసభకు ప్రధానకార్యదర్శిగాను, అధ్యక్షుడుగాను వ్యవహరించెను. తెలంగాణా కమ్యూనిస్టు కమిటీకి కార్యదర్శిగా పనిచేసెను. హైదరాబాదు సంస్థాన ప్రజా ఉద్యమాన్ని అతివాద కమ్యూనిస్టు భావాలవైపుకు మళ్ళించడంలో అతని పాత్ర ప్రధానమైనది. నిజాం నిరంకుశ పరిపాలనను కూలద్రోయడానికి ప్రజలు ఆయుధాలు చేపట్టి ప్రభుత్వ యంత్రాంగాన్ని ధ్వంసం చేయాలని ఇచ్చిన పిలుపుపై 1947 సెప్టెంబరు 11వ తేదీన సంతకాలు చేసిన ముగ్గురు హైదరాబాదు కమ్యూనిస్టు ప్రముఖులలో ఆయన ఒకడు. తక్కిన ఇద్దరు రావి నారాయణరెడ్డి, మఖ్దూం మొహియుద్దీన్. తెలంగాణాలో కమ్యూనిస్టు పార్టీ యంత్రాంగాన్ని పూర్తిగా రహస్య పద్ధతిపై పునర్నిర్మాణం చేసి తీవ్రమైన పోరాటానికి ఆయన ప్రజలను సన్నద్ధం చేసెను. నాలుగేండ్లకు పైగా అజ్ఞాతవాసంలో ఉండి సాయుధ గెరిల్లా పోరాటాన్ని నడిపించెను. రాష్ట్ర కమ్యూనిస్టు సమితి కంట్రోలు కమీషన్ ఛైర్మన్‌గా కొంతకాలం ఉండెను. సాయుధ పోరాట కాలంలో మూడు



సంవత్సరాలు జైలుశిక్ష అనుభవించి, 1951 డిసెంబరులో విడుదల అయ్యెను.

1952 సాధారణ ఎన్నికలలో కరీంనగర్ నియోజక వర్గము నుంచి లోక్‌సభకు ఎన్నుకోబడెను.

1957 సాధారణ ఎన్నికలలో ఆంధ్రప్రదేశ్ శాసనసభకు ఎన్నికయ్యెను.

1964 నుంచి 1970 వరకు రాజ్యసభ సభ్యుడుగా ఉండెను.

1972లో కరీంనగరుజిల్లా ఇందుర్తి నియోజకవర్గం నుంచి ఆంధ్రప్రదేశ్ శాసనసభకు తిరిగి ఎన్నుకోబడెను. అనగా రెండుమార్లు శాసనసభ సభ్యుడు.

శ్రీశ్రీ అధ్యక్షతను హైదరాబాదులో జరిగిన మొదటి విశాలాంధ్ర సదస్సుకు ఆయన ఆహ్వాన సంఘాధ్యక్షుడుగా ఉండి విశాలాంధ్ర నిర్మాణానికి కృషిచేసెను.

1905న జన్మించిన ఎల్లారెడ్డి 1978 డిసెంబరు 27వ తేదీన కాలధర్మం చెందెను.

★ ★ ★

# ఈశ్వరరెడ్డి వై.

స్వాతంత్ర్య సమరయోధులు కమ్యూనిస్టు నాయకులు అయిన వై. ఈశ్వరరెడ్డిగారు కడపజిల్లా పెద్ద పసుపుల గ్రామంలో 1915లో జన్మించారు. వీరి తండ్రి, పినతండ్రిగార్ల సమిష్టి కుటుంబానికి 600 ఎకరాల భూమి, ఆరు మిద్దెలు, 12 కాండ్ల ఎద్దులు ఉండేవి. పినతండ్రి మల్లారెడ్డిగారు 1923లో కాకినాడలో జరిగిన కాంగ్రెస్ మహాసభకు హాజరై గాంధిగారికి ఒక తులం బంగారం విరాళంగా అందజేశారు. ఆయన ఖద్దరు ధరించేవారు. ఆంధ్రపత్రిక మున్నగు పత్రికలను తెప్పించేవారు.



ఈశ్వరరెడ్డిగారు చిన్నతనంనుండి ఈవిధంగా జాతీయోద్యమ ప్రభావం కల కుటుంబంలో దేశభక్తి భావాలు అలవర్చుకున్నారు. 1936లో అనంతపురం కాలేజీలో డిగ్రీ ప్యాస య్యారు. పెద్దపసుపుల గ్రామంలో కాపులు పెడకంటి, మోటాటి అను రెండు తెగలుగా చీలిఉండేవారు. చదువు పూర్తిచేసుకొని గ్రామం తిరిగి వచ్చిన తరువాత ఈ రెండు తెగల యువకులను కలిపి మిత్రమండలిపేర ఒక యువజనసంస్థను ఏర్పాటుచేశారు. ప్రజాసేవా కార్యక్రమాలను నిర్వహించారు. 1937లో శ్రీ ఈశ్వరరెడ్డి, ఆయన మిత్రులు జాతీయ కాంగ్రెస్‌లో చేరారు. 1937 ఎన్నికలలో కాంగ్రెస్ ప్రచారం చేశారు. 1938లో ఈశ్వరరెడ్డి జిల్లా కాంగ్రెస్ కమిటీ సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. ఆ పిమ్మట రమణ మహర్షి బోధనలతో ప్రభావితులై కొంతకాలం రాజకీయాలకు దూరంగా ఉన్నారు. వివేకానందుని బోధనలు కూడా ఆయనను ఉత్తేజపరిచాయి.

ఇదే సమయంలో 1940లో ఏటుకూరి బలరామమూర్తిగారు రాయలసీమ జిల్లాలకు కమ్యూనిస్టుపార్టీ ఆర్గనైజర్‌గా వచ్చారు. శ్రీ బలరామమూర్తిగారు పెద్దపసుపుల గ్రామం వెళ్లి కారల్ మార్క్స్ సిద్ధాంతాలను, సమాజ పరిణామ సిద్ధాంతాలను, సోషలిస్టు భావాలను బోధించారు. దానితో ఈశ్వరరెడ్డిగారు

సోషలిస్టు భావాలతో ప్రభావితులయ్యారు. తిరిగి రాజకీయ రంగంలో క్రియాశీలపాత్ర వహించి, తిరిగి కాంగ్రెస్‌లో చేరారు. 1941లో చెన్నూరులో జాతీయ కాంగ్రెస్ ప్రారంభించిన వ్యక్తి. సత్యాగ్రహోద్యమంలో పాల్గొని జైలుశిక్ష అనుభవించారు. జైలులో ఉండగానే అనాడు కమ్యూనిస్టు పార్టీ చేబట్టిన ఫాసిస్టు వ్యతిరేక ప్రజాయుద్ధ నినాదం సరియైనదని భావించి జైలునుండి విడుదలై వచ్చిన తరువాత "క్విట్ ఇండియా" ఉద్యమానికి దూరంగా ఉన్నారు. కమ్యూనిస్టు పార్టీ ప్రారంభించిన రహస్య పత్రిక "స్వతంత్ర భారత్"ను జిల్లాల్లో పంచే కార్యక్రమం నిర్వహించారు. నాల్గేళ్లు అజ్ఞాతవాస జీవితం గడిపారు.

ఇదే సమయంలో 1942లో కామ్రేడ్ ముక్తేవి మాధవాచారి గారు కడప జిల్లాలో కమ్యూనిస్టు ఉద్యమాన్ని ఆర్గనైజు చేయడానికి వచ్చారు. 1940 జులై నుండి 1942 ఆగస్టు వరకు ఏటుకూరి బలరామమూర్తిగారు, 1943 రెండవ అర్ధభాగంలో ఆరునెలలు మాధవాచారిగారు జిల్లా కమ్యూనిస్టు ఉద్యమాన్ని నిర్మించడంలో పాల్గొన్నారు. 1944లో విజయవాడలో జరిగిన అఖిల భారత రైతు మహాసభకు ఈశ్వరరెడ్డి ఆయన మిత్రులు హాజరయ్యారు. 1943 నుండి జిల్లా రైతు ఉద్యమంలో పాల్గొన్నారు.

1949-52 మధ్య కమ్యూనిస్టు పార్టీపై తీవ్ర నిర్బంధ విధానం సాగినప్పుడు ఈశ్వరరెడ్డి తమ స్వగ్రామంలో అజ్ఞాతవాసంలో ఉండగా ఆయనను ఇతర కామ్రేడ్స్‌ను అరెస్టు చేయడానికి 1949 సెప్టెంబరు 28వ తేదీన పోలీసులు దాడి చేశారు. ఈశ్వరరెడ్డిని విడిపించుకోడానికి ప్రజలు పోలీసులపై దాడిచేసి విడిపించుకొనిపోయారు. పోలీసుల కళ్ళల్లో ప్రజలు కారం కొట్టారు. రాళ్ళతో పోలీసులపై దాడిచేశారు. ఎలాగైతేనేమి ఈశ్వరరెడ్డిని పోలీసుల బారినుండి తప్పించారు. ఈ సందర్భంలో జరిగిన కాల్పుల్లో వెంకట కొండారెడ్డి అనే కామ్రేడ్ నేలకొరిగాడు.

1952లో జరిగిన జనరల్ ఎన్నికలలో కామ్రేడ్ ఈశ్వరరెడ్డి పార్లమెంట్‌కు ఎన్నికయ్యారు. మొత్తం నాల్గుపర్యాయాలు ఈవిధంగా కామ్రేడ్ ఈశ్వరరెడ్డి పార్లమెంటుకు ఎన్నికయ్యారు.

కడప జిల్లా జాతీయోద్యమంలో, కమ్యూనిస్టు ఉద్యమంలో ప్రముఖ పాత్ర వహించిన ఈశ్వరరెడ్డి 1986లో తుది శ్వాస విడిచారు. కడప జిల్లా ప్రజా ఉద్యమ చరిత్రలో ఆయన నిరాడంబర విశిష్ట వ్యక్తిత్వం, ఔన్నత్యం, అంకితభావం చిరస్మరణీయంగా నిలుస్తుంది.

★ ★ ★

# మఖ్దూం మొహియుద్దీన్

\- రాజబహదూర్ గౌడ్



మఖ్దూం ఎవరు? మానవుడా? సంక్లిష్ట రూపాల సముచ్చయమా? కొందరు అతన్ని విప్లవ కవిగా మెచ్చుకొంటారు. అతని రొమాంటిక్ కవిత్వాన్ని మెచ్చి ఆయన్ని మరికొందరు ప్రేమిస్తారు. "ప్రజల బందిఖానా" అని పేరుబడ్డ హైదాబాద్ రాజ్యంలో ఆయన ట్రేడ్ యూనియన్ ఉద్యమ ఆద్యుడు. ఆయన కమ్యూనిస్టు నాయకుడూ, ఆర్గనైజరూ, చిత్తశుద్ధిగల స్నేహితుడు, ప్రేమించే తండ్రి, అనురాగపూరిత ఆచార్యుడు, పసందైన మాటకారి, ప్రతి వారూ ఆయన్ని గురించి తమ "భావనల" ననుసరించి "నిర్వచించుతూ" వుంటారు.

ఖ్వాజా అహమ్మద్ అబ్బాస్ తన ప్రత్యేక శైలిలో ముఖ్దూంను ఇలా వర్ణించారు:

"ఆయన మండుతూన్న అగ్నిజ్వాల. అంతేకాదు, చల్లని మంచు బిందువుల మాల" "ఆయన విప్లవ కాహళి. కాలిగజ్జల రవళీ మృదుగానం కూడా" "ఆయన జ్ఞానం. ఆయన కార్యాచరణ. ఆయన వివేకం" "ఆయన విప్లవ గెరిల్లా చేతిలో తుపాకి, గాయకుడి చేతిలో సితార్" "ఆయన తుపాకి మందు వాసన. అంతేగాదు మల్లెపూల మధుర పరిమళం."

మఖ్దూం అని పిలవబడే "మనిషి" అలాంటివాడు. ఆయన 1908 ఫిబ్రవరి 4న బీద మధ్యతరగతి కుటుంబంలో జన్మించాడు.

కుటుంబ నామంతో సహా మఖ్దూం పూర్తిపేరు అబూసయీద్ మహమద్ మఖ్దూం మొహియుద్దీన్ ఖుద్రీ. మహమ్మద్ ప్రవక్త సన్నిహిత సహచరులలో ఒకడైన ప్రఖ్యాత హజరత్ అబూ సయీద్ ఖుద్రీ మఖ్దూం మూల పురుషుడని కథనం.

మఖ్దూం తండ్రి గౌస్ మొహియుద్దీన్, తెలంగాణాలోని మెదక్ జిల్లాలో ఆందోల్ తాలూకా ఆఫీసులో సూపరింటెండెంట్‌గా పనిచేసేవారు. ఆందోల్‌లోనే మఖ్దూం జన్మించాడు.

"నా బాల్యంలో బాల్యం లేదు" అని చెకోవ్ అన్నాడు. ఇది మఖ్దూంకి కూడా వర్తించుతుంది. యధేచ్ఛగా, స్వేచ్ఛగా అమితోత్సాహంతో గడపవలసింది బాల్యం. కాని ఇవన్నీ మఖ్దూంకి తెలియవు. మఖ్దూం నాలుగేళ్ళ పిన్న వయసులోనే తండ్రి మరణించాడు. ఆయన తల్లి పునర్వివాహం చేసుకొంది. విచారకరమైన విషయం ఏమంటే, మరి కొన్నేళ్ళకుగాని తన తల్లి బ్రతికున్నట్లు మఖ్దూంకి తెలియదు. మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసై యూనివర్శిటీ కాలేజీలో చేరడం కోసం హైదరాబాదు వచ్చిన తర్వాత మాత్రమే ఆయన తల్లిని చూడగలిగాడు.

మఖ్దూంను ఆయన పినతండ్రి బషిరుద్దీన్ మత వాతావరణంలో పెంచాడు.

సంగారెడ్డిలో మెట్రిక్యులేషన్ పాసయినాక, హైదరాబాదులో ఉన్నత విద్యకోసం ఇరవైఏళ్ళ ప్రాయంలో మఖ్దూం హైదరాబాదు వచ్చాడు. "సకల విద్యలకు రారాజు" అని స్తోత్రించే నిజాం ప్రభువు కాలంలో సగటున జిల్లా కొకటి చొప్పున ఆ జిల్లా కార్యాలయం ఉన్నచోట హైస్కూలు ఉండేది.

## సత్యాగ్రహోద్యమ ప్రభావం

ఆనాడు దేశం వెలింగ్టన్ చండశాసనం క్రింద మూలుగుతోంది. కొద్దిమంది ఉత్సాహవంతులైన రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి లాంటివారు, బ్రిటిషిండియాలో సాగుతున్న సత్యాగ్రహ ఉద్యమంలో చేరారు. యువకుడైన అక్బర్ అలీఖాన్ (ఒరిస్సా గవర్నరుగా పనిచేసిన వ్యక్తి) అలీఘర్ యూనివర్శిటీ విద్యార్థిగా సత్యాగ్రహోద్యమంలో చేరాడు.

ఇది హైదరాబాదులోని యువకుల మనస్సులను ప్రభావితం చేసింది.

ఈ రోజుల్లోనే నియాజ్ ఫతేపూర్ "నిగార్" అనే మాసపత్రికలో రాసే రాతలు ముఖ్యంగా ముస్లిం యువకులను కదిలించివేశాయి. హేతువాద దృష్టిని రేకెత్తించాయి. ఆ పత్రిక నిషేధింపబడింది.

ఈ రోజుల్లోనే జవహర్‌లాల్ నెహ్రూ యువకులకు ఆదర్శప్రాయుడయ్యాడు. లౌకిక విధానం, సోషలిజం, ప్రజాతంత్రం గురించి ఆయన ఇచ్చే విప్లవ సందేశాలకు యువకులు ముగ్ధులయేవారు.

ఈ కాలంలోనే ఫాసిజం తలెత్తింది. ఇది అంతర్జాతీయంగా ప్రపంచ ప్రజాతంత్ర శక్తులు జాగృతం అయేస్థితిని కల్గించింది.

## కవిత్వ ప్రారంభం

ఈ పరిస్థితులలో మఖ్దూంలో కవితాత్మ మేల్కొన్నది. 1933–34లో ఆయన గేయ కవిత ప్రారంభించాడు. కాని సామ్రాజ్యవాదానికి, ఫాసిజానికి, దారిద్ర్యానికి కిరాతకత్వానికి, నైతిక పతనానికి వ్యతిరేకంగా నూతనంగా మేధావులలో పెల్లుబుకుతున్న చైతన్య స్రవంతిలోకి ఆకర్షించబడ్డాడు.

ఈకాలంలోనే అభ్యుదయ రచయితల సంఘం జన్మించింది. నూతనంగా తల ఎత్తుతున్న మేధావుల కోర్కెల కొక రూపం కల్గించుతూ, వారికొక నూతన పంథా చూపెడుతూ ఈ సంఘం పనిచేయ ప్రారంభించింది.

మఖ్దూం అప్పటికే "ఆతిష్‌కదా" (అగ్నిగుండం) "తెలంగాణా", "ఇంతెజార్" (నిరీక్షణ) అనే గేయాలు రాశాడు. ఇపుడు కొత్తపుంత తొక్కి సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా నిప్పులు కక్కే గేయం రాశాడు. "రూహే ఫగ్‌ఫూర్" (ఫగ్‌ఫూర్ ఆత్మ) "మృత్యువునీ, వినాశాన్నీ కల్గించేందుకు నాఇంట్లోకి అమాంతం జొరబడింది" అన్నాడు. సామ్రాజ్యవాదాన్ని చైనా నిరంకుశ చక్రవర్తి ఫగ్‌ఫూర్ ఆత్మగా వర్ణించాడు. "ఆజాదీ యే వతన్"లో భారతదేశ భవిష్యత్తునే మార్చేందుకు యువకులు ఉవ్వెత్తున లేవాలని ఉద్బోధించాడు.

"హవేలీ" (దయ్యాల మేడ)లో ఫ్యూడలిజాన్ని దాని అనుయాయి ఐన మతమౌఢ్యాన్ని దుయ్యబట్టాడు. ఫ్యూడలిజానికి చిహ్నంగా "హవేలీ"ని తీసుకున్నాడు.

## మృత్యుగీతి

మానవుణ్ణి హీనుణ్ణి చేసిన ఫ్యూడల్ సామ్రాజ్య వ్యవస్థపైన, "మౌత్‌కాగీత్" (మృత్యుగీత)లో ప్రదర్శించిన వ్యంగ్యం పతాక స్థాయి నందుకొంది. భూకంపాలను, అశనిపాతాలను, విధ్వంసక ఝంఝూనిలాలను, చిచ్చు కొండలనుండి మండే "లావా" (అగ్నిధార)లను వికృతమైన ప్రకృతాన్ని విధ్వంసం చేయడానికి ఆహ్వానించుతాడు. ఈ విషాదకర సమాజ శిథిలాలపై సుందర భవిష్యత్తును నిర్మించేందుకే పీటిని ఆవాహన చేశాడు.

*రా ! ఈ శిథిలాలపైన*
*స్వాతంత్ర్య పతాకమెత్తు*
*రా ! ఈ శిథిలాలపైన రక్త*
*పతాకమ్ము ఎత్తు!*

అని అంటాడు.

## కామ్రేడ్స్ అసోషియేషన్‌కు ఉత్తేజం

1936–38 లో పరిపాలనా యంత్రాంగంలో ప్రజాతంత్రపరమైన మార్పులు తీసుకురావాలని నిరంకుశాధికారానికి వ్యతిరేకంగా పోరాటాన్ని స్టేట్ కాంగ్రెస్ నడిపింది. ఉత్సాహవంతులైన యువకులు కామ్రేడ్స్ అసోసియేషన్ స్థాపించారు. మఖ్దూం వారిని ఉత్తేజపరిచాడు.

1939 సెప్టెంబరులో సామ్రాజ్యవాద యుద్ధం ప్రారంభమైంది. పెట్టుబడిదారీ విధానానికీ, అది సృష్టించిన విధ్వంసక యుద్ధాలకూ వ్యతిరేకంగా మఖ్దూం తన శక్తివంతమైన కలాన్ని ఉపయోగించాడు. "జాల్హై – చలీసా", "సిపాహీ" (సిపాయి) అనేవి ఈ కాలంలోని ప్రముఖ గేయాలు.

దాదాపు ఇదే కాలంలో మఖ్దూం కామ్రేడ్స్ అసోసియేషన్‌కు చెందిన యువకులకు దేశంలోని కమ్యూనిస్టు వర్గాలతో పరిచయం ఏర్పడింది. అదొక రకంగా త్రిముఖ పరిచయం అనవచ్చు. నాగపూర్‌లో మాకు కమ్యూనిస్టు గ్రూప్‌తో పరిచయం కల్గింది. ఆ తర్వాత ఔరంగాబాద్‌లో హబీబ్ ఆయన బృందంతో పరిచయ మేర్పడింది. తుదకు

రావి నారాయణరెడ్డిగారు, ఆంధ్ర మహారాష్ట్రాలలోని కమ్యూనిస్టు న్యూక్లియస్‌తో పరిచయం ఏర్పడింది. ఈ న్యూక్లియస్‌కు ఆంధ్రా యూనిట్‌తో ముఖ్యంగా చంద్ర రాజేశ్వరరావుగారితో సంబంధం వుండేది.

## ఫాసిజంపై క్రోధం

1941 జూన్‌లో సోవియట్ యూనియన్‌పై హిట్లర్ హఠాత్తుగా దాడిచేయడంతో యుద్ధం కొత్త మలుపు తొక్కింది. "అంధేరా" (చీకటి) అనే గేయంలో ఫాసిజంపై క్రోధావేశాన్ని ముఖ్దూం వెళ్ళగక్కాడు. మృత్యువు విధ్వంసకాండగా ఫాసిస్టు క్రూరత్వాన్ని తన చిత్రణలో వర్ణించాడు.

"...మానవతా దేహంపై
మానని ఒక రాచపుండు
కందకాలు ముళ్ళకంచె
అల్లుకొన్న మృత్యువాటి
కంచెలపై వేలాడే
గత జీవుల శరీరాలు
పీనుగులను చీల్చుక తిను
పెనుగద్దల సంరంభం
ఎగిరిపడే తలకాయలు
తెగికూలే కబంధాలు
గాయాల్లో దూరి చల్ల
గాలులు సాగించు హోరు
నీరవ నిశివేళల్లో
దారుణ శోకారవాలు..."

"ఏమున్నది రాత్రివద్ద, అంధకార మొకటి వినా" అని విప్లవ ఆశా విశ్వాసభావంతో ఈ గేయాన్ని ముగించుతాడు. "రాత్రి ఫాలభాగంపై తారల సంతాప సంఘాలు ఉదయార్కుని కిరణాలు ప్రసరించే వరకే"నని అంటాడు.

ఆ తర్వాత ఆయన "స్టాలిన్ కా అవాజ్" (స్టాలిన్ గొంతుక) అనే ప్రసిద్ధ గేయం ప్రచురింపబడింది. ప్రఖ్యాత తజిక్ కవి జంబుల్ జాబర్ రాసిన గేయానికి ఇది స్వేచ్ఛానువాదం. దేశభక్తిని రేకెత్తించుతూ, ఫాసిజంపట్ల తీవ్ర ద్వేషాగ్ని రగుల్చుతూ, కమనీయ పదాల కూర్పుతో ఈ శక్తివంతమైన గేయం చిరకాలం నిలుస్తుంది.

## బెంగాల్ క్షామంపై గేయం

సామ్రాజ్యవాద దోపిడీని, భారత సామాజిక కట్టడ నిర్మూలనాన్ని బెంగాల్ క్షామం ప్రతిబింబించుతుంది.

దానికి ప్రతీకగ బెంగాల్ క్షామం గురించి ముఖ్దూం శక్తివంతమైన కలం రాసిన గేయం నిలుస్తుంది.

"వారు దేవుని స్వజాతి ముస్లిములే కావచ్చు
లేదా యజ్ఞోపవీత ధారులైన బ్రాహ్మణులే కావచ్చు
వారి ఆకలిని కొలిచేందుకు వీల్లేదు
వారి మృత దేహాల్ని లెక్కించేందుకు వలను కాదు."

అని బెంగాల్ క్షామం గురించి రాశాడు.

హైద్రాబాద్‌లోని గవర్నమెంటు సిటీ కాలేజీలో లెక్చరర్ పదవికి మఖ్దూం రాజీనామా ఇచ్చి కమ్యూనిస్టు యావత్కాల కార్యకర్తల విప్లవ దళంలో చేరాడు.

ఈ కాలంలోనే జాతీయ నాయకుల అరెస్టుకు అసమ్మతిగా ఒక బహిరంగ సభలో "లిన్‌లిత్‌గో తన తోక జాడింపుతో, భారతజాతి యుద్ధాన్ని జయప్రదంగా నిర్వర్తించేటట్లు చేయలేడు" అని గర్జించాడు. ఇది "బ్రిటిష్‌వారి విశ్వాసపాత్ర మిత్రుడు నిజాం"కు మింగుడుపడని విషయం. మఖ్దూంపై కేసుపెట్టి శిక్ష విధించి జరిమానా కూడా వేశాడు. జైలులో స్వామీ రామానంద తీర్థ, అచ్యుతరావు దేశపాండే, బిర్దీచాంద్ చౌదరీ, ఆర్.యస్. దివాన్ తదితర స్టేట్ కాంగ్రెస్ నాయకులతోపాటు మఖ్దూం ఉన్నాడు.

దాదాపు ఈకాలంలోనే 1940 దశకంలో మఖ్దూం ట్రేడ్ యూనియన్ రంగంలో ప్రవేశించాడు. వజీర్ సుల్తాన్ టుబాకో (చార్మినార్ సిగరెట్) ఫ్యాక్టరీ కార్మికుల వివాదం పరిష్కరించేందుకు 1941లో ఆయన కార్మికుల ప్రతినిధిగా త్రైపాక్షిక రాజీబోర్డులో పనిచేశాడు. సింగరేణి గనుల కార్మిక యూనియన్, షహాబాద్‌లో సిమెంటు వర్కర్సు యూనియన్, గుల్బర్గాలో కాటన్ టెక్స్‌టైల్స్ వర్కర్స్ యూనియన్ స్థాపించాడు. విద్యుత్ కార్మిక సంఘానికి ఆయన అధ్యక్షుడు. మునిసిపల్ వర్కర్స్ యూనియన్‌ను ఆయన నడుపుతూండేవాడు. హైద్రాబాద్ పట్టణంలోని గుండీల ఫ్యాక్టరీల సమ్మెను ఆయన నడిపాడు. 1940 దశకం ప్రారంభంలో ట్రేడ్ యూనియన్ ఉద్యమం ఉవ్వెత్తున లేచినపుడు యువ కమ్యూనిస్టు ట్రేడ్ యూనియన్ కార్యకర్తలకు మఖ్దూం నాయకత్వం వహించాడు. 1946 ఆగస్టు 16న ప్రముఖ కార్మిక ఉద్యమ నాయకుడు యన్.యం. జోషీచే ప్రారంభించబడిన అఖిల హైద్రాబాద్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసుకు సంస్థాపక సభ్యుని హోదాలో అధ్వర్యం వహించాడు.

1940 దశకంలోని ట్రేడ్ యూనియన్ ఉద్యమ విజృంభణ, దేశంలో యుద్ధానంతరం వచ్చిన విజృంభణలో ఒక భాగం. ఆ తర్వాత తెలంగాణాలో రైతుల విజృంభణ సాగింది.

శ్రీయుతులు రావి నారాయణరెడ్డి, బద్దం యల్లారెడ్డి, దేవులపల్లి వెంకటేశ్వరరావు, చంద్రగుప్త చౌదరి, వి.డి. దేశపాండే మున్నగువారితోపాటు మఖ్దూం ఇప్పుడు పార్టీ రాష్ట్ర కమిటీ నాయకుడు.

1946 అక్టోబరు 17న నిర్బంధ విధాన వ్యతిరేకదినం జరపవలసిందిగా పార్టీ పిలుపు ఇచ్చినపుడు, నిరంకుశ నిర్బంధ విధాన యంత్రాంగం ఉరకలు పరుగులు వేస్తోంది.

దమనకాండ ప్రారంభమైంది. కమ్యూనిస్టుపార్టీ నాయకులు రహస్యంగా పనిచేయ వలసి వచ్చింది. ఆ సమయంలో షహాబాద్ సిమెంటు కార్మికుల మధ్య మఖ్దూం ఉన్నాడు. షోలాపూర్ వెళ్ళిపోవలసిందిగానూ జి.డి. సానేను కలుసుకొని, అక్కడ పార్టీతోపాటు ఉండవలసిందిగానూ పార్టీ ఒక సందేశం పంపింది.

షోలాపూర్ నుండి ఆయన బొంబాయి వెళ్లాడు. అక్కడ ఆయన ప్రఖ్యాత గేయం "తెలంగాణా" రాశారు. అందులో

"అడవుల కొండల అనుంగు బిడ్డలు
పొలాల పొత్తిట పెరిగిన పాపలు
లేచిరి క్రోధోద్ధత భీకరులై
తళ తళ తళ తళ మెరిసెను కొడవలి
ఎగసి ఎగసి నర్తించెను నాగలి
పుట్టుకేటుతో కదలి రాచరిక
అట్టాలికములు మట్టిని కలిసెను
బేర కుబేరుల మేడలు మిద్దెలు
గడ గడ గడ గడ వణకుచు కూలెను
హాలాకూల జారుల పరిపాలన
వ(రెలు వారి బదా బదలయ్యెను"

అని అన్నాడు.

ఆయన కలకత్తాలో జరిగిన రెండవ పార్టీ కాంగ్రెసుకు హాజరయి హైద్రాబాదు వెళ్ళాడు. అక్కడ రహస్యంగా వుంటూ పోరాటం నడిపేందుకు వెళ్లాడు. ప్రధానంగా తెలంగాణా సాయుధపోరాటం. 1948 సెప్టెంబరులో భారత సైన్యాలు జరిపిన "పోలీసు యాక్షన్" అనే అడకత్తెరలో చిక్కుకొని నైజాం ప్రభుత్వం కూలిపోయింది.

పరిస్థితి చాలా తీవ్రంగా మారింది. నిజాం వ్యతిరేక పోరాటం యొక్క ప్రజాతంత్ర లక్ష్యం ఒకరకంగా నెరవేరింది. నూతనంగా తలెత్తుతున్న పరిస్థితులలో కొత్త ఎత్తుగడల విధానాన్ని పార్టీ, ప్రజాతంత్ర ఉద్యమమూ రూపొందించవలసి యుంది.

కాని రణదివే, సుందరయ్యగార్ల నాయకత్వాన పార్టీ నాయకత్వం మరో విధంగా ఆలోచించసాగింది. వారి దృష్టిలో భారత పెట్టుబడిదారీ వర్గం సామ్రాజ్యవాద పక్షాన తిరుగులేకుండా చేరిపోయిందనీ, పోలీసు యాక్షన్ నైజాంతో రాజీపడటానికి చేసిన కేవలం ఒక మోసం అనీ వారు భావించారు.

కొంతకాలం మఖ్దూంకూడా రణదివే భావాలతో పూర్తిగా ఏకీభవించాడు. కాని ఆనాటి పార్టీ పంథా గురించి సందేహాలు వెలిబుచ్చడం ప్రారంభించిన వారిలో మొదటివాడు.

నాయకత్వం పూర్తిగా సెక్టేరియనిజంతోనూ, అహంభావంతోను నిండిపోయింది. తమతో విభేదించినవారిని అనుమానించ సాగింది.

తీవ్రమైన అంతర్ పార్టీ పోరాటం సాగుతున్న అలాంటి పరిస్థితిలో 1951 మేలో మఖ్దూం అరెస్టయ్యాడు.

ఈ నిర్బంధ కాలంలో మఖ్దూం ప్రఖ్యాతమైన "ఖైదు" అనే గేయాన్ని రాశాడు.

"ఏండ్ల తరబడి వివశ
మైయున్న యవ్వనము
నిగళాలలో కలత
నిదురలో మునిగింది
కదిలితే చాలు శృం
ఖలలు ఘల్లని మ్రోగు
కలలలోనె బ్రతుకు
కలకలము వినిపించు
బందిఖానాకు నా
బ్రతుకర్పితమ్మయ్యె
కాని యీ దేశమును
కట కటాలకు ముక్తి
సాధించలేదన్న
బాధయే మిగిలింది"

పోరాడే తన ప్రజలమధ్య వుండాలనే తపన ఈ గీతం నిండా వ్యక్తమవుతుంది. రాచరిక నిరంకుశత్వాన్ని దుర్దమన పాలనను ఎదిరిస్తూన్న లక్షలాది ప్రజల హృదయాలతో సమంగా మఖ్దూం హృదయం ఆ గీతం ద్వారా ప్రతిస్పందించుతూ వుంది. ప్రజలెప్పుడు పెటిల్లని పేలుతారో ఎవరికీ తెలియదు.

మొదటి జనరల్ ఎలక్షన్లలో పోటీ చేస్తున్నందున మఖ్దూంను 1952లో విడిచిపెట్టారు. ఎన్నికలలో హైదరాబాదు పట్టణంలో ఆయన ఓడిపోయాడు. డాక్టర్ జయసూర్య లోక్‌సభ స్థానం ఉంచుకొని, హుజూర్ నగర్‌లోని శాసనసభా స్థానాన్ని వదులుకొన్నాడు. అందువల్ల బై ఎలక్షన్ జరిగింది. అందులో మఖ్దూం గెలుపొందాడు.

వియన్నాలోని ప్రపంచ ట్రేడ్ యూనియన్ సమాఖ్య ప్రధాన కార్యాలయంలో పనిచేయడానికి 1953లో మఖ్దూంను ఎన్నుకొన్నారు. అక్కడినుండి 1954లో తిరిగి వచ్చాడు. కలకత్తా మహాసభలో ఆలిండియా ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు సంయుక్త కార్యదర్శిగా ఎన్నికయ్యాడు. దాని ప్రధాన కార్యాలయం ఢిల్లీలో రోహటక్ రోడ్డులో ఉన్నప్పుడు అక్కడ పనిచేశాడు.

1955 ప్రాంతంలో హైద్రాబాద్ తిరిగి వచ్చాడు. భాషా ప్రయుక్త రాష్ట్రాలు కావాలనీ, హైద్రాబాద్‌ను మూడుగా విభజించి, ఆంధ్ర, మహారాష్ట్ర, కర్నాటక ఐక్య రాష్ట్రాలను ఏర్పరచాలనే ఉద్యమంలోకి దూకాడు.

1956 నవంబర్ 1న ఐక్య తెలుగు రాష్ట్రం ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. 1956లో ఆంధ్రప్రదేశ్ శాసన మండలికి ఎన్నికై 1969 వరకూ ఆ సభలో ప్రతిపక్ష నాయకుడుగా ఉన్నాడు. చైనా, సోవియట్ యూనియన్, తూర్పు యూరప్, ఆఫ్రికా దేశాలలో విస్తృతంగా పర్యటించాడు. ఆనాటి మూడుకోట్ల తెలుగు ప్రజల చిరకాల వాంఛ నెరవేరింది. ఈనాడు నాల్గుకోట్లకు పైగా వుంది ఆంధ్రప్రదేశ్ జనాభా.

1952–55 మధ్య మఖ్దూం ఏమీ రాయలేదు.

ఈ కాలంలోనే ఆయన విరివిగా పర్యటనలు చేశాడు. ప్రపంచ యుద్ధానంతర కాలంలో తలెత్తుతున్న నూతన మానవునితో ఆయనకు పరిచయం కల్గింది. పెద్ద పెద్ద మార్పులు జరుగుతున్నాయి. ప్రజల చైతన్యం వేగంగా మారుతోంది. దానినంతా జీర్ణించుకోడానికి ఆయనకు కొంత వ్యవధి పట్టింది. మఖ్దూం మాటల్లోనే చెప్పాలంటే, కవి క్లిష్టమైన జీవితాన్ని గడుపుతాడు. ఒకప్పుడు తన ప్రజలందరితోపాటు ఉంటాడు. మరోసారి సృజనాత్మక ఏకాంతంలోకి మునిగిపోతాడు. 1952 నుండి 1956 వరకు ఆయన, ప్రపంచమంతటా గల "తన ప్రజలతో" నివసించాడు. వారి గురించి తెలుసుకోడానికి ప్రయత్నించుతూ, వారి కోర్కెలను తెలుసుకుంటూ, వారి ఆకాంక్షలలో, పోరాటాలలో భాగం పంచుకుంటూ నివసించాడు.

సమాజాభివృద్ధితోపాటు నూతన సామాజిక చైతన్యాభివృద్ధితోపాటు మఖ్దూం కవితలో నూతన దశ 1957లో ప్రారంభమైంది.

ఆయన ఇపుడు గజల్స్ రాయడం ప్రారంభించాడు.

ఆయన అద్భుత గేయం "చాంద్ తారోఁకాబన్" (తారా చంద్రుల కారడవి) ని 1957-58 ప్రాంతంలో రాశాడు. ఇది భారత స్వాతంత్ర్య పోరాటంలోని మూడు దశలను వర్ణించుతూంది. మొదటిది స్వాతంత్ర్యానికి పూర్వపు దశ. రెండవది స్వాతంత్ర్యం లభించినప్పుడూ, దాని వెంటనే కల్గిన ఆవేదనా పూరితమైన సంహారకాండ దశ, మూడవది భవిష్యత్తులోకి చూడటం.

"ఇంకా నిశీధ అవశేషాలున్నాయ్.
చీకటి అతుకులున్నాయ్
తెల తెల వారే ప్రత్యూష శ్వేత
కాంతి కూడా వుంది
కామ్రేడ్!
చేయి చేయి కలిపిరండి
గమ్యమ్ము చేర ముందుకు పదండి
ప్రేమ లక్ష్యానికి
ఉరి కంబాల లక్ష్యానికి
పదండి....
మూపుపై శిల్వ మోసుకొంటూ
పదండి...."

మఖ్దూం యావజ్జీవితమూ పోరాటాన్ని, సృజనాత్మక కవితనూ, ప్రతిబింబించే జీవితం. మానవత, కేంద్రీకృత రస దర్శనం ఆయన ఆలోచనలంతటినీ, కార్యాచరణనీ, కమ్యూనిస్టుగా ఆయన విప్లవ కార్యకలాపాలనూ, కవిగా ఆయన సాహిత్య సృజననూ ప్రభావితం చేశాయి.

మఖ్దూంలోని "ఉద్వేగ కేంద్రానికి" (కవితాత్మకు మూలం) సమకాలీన మానవ సంఘర్షణయే. ప్రేమకూ, శ్రమకు కూడా లేమి ఉంటుంది. వియోగం విద్వేషాల బాధకు వ్యతిరేకంగా ప్రేమ పోరాడుతుంది. పెట్టుబడిదారీ వర్గ దురాశతో పోరాడుతుంది శ్రమ. ప్రేమ, శ్రమల విజయం మఖ్దూం ఆకాంక్షల, ప్రయత్నాలకు

కేంద్రీకృత బిందువు. గులేతర్ (తాజారోజా), సుర్ఖ్ సవేరా (అరుణోదయం) మఖ్దూం కవితా సంకలనాలు. మంచి వక్తగా ప్రసిద్ధికెక్కిన మఖ్దూం కొంతకాలం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ సభ్యుడుగా ఉన్నాడు. వీరి కవితలు అనేక జాతీయ, అంతర్జాతీయ భాషల్లోకి అనువాదం పొందాయి.

ఒక రాజు చేతిలో ప్రేమ, శ్రమా ఓడిపోయిన విషాద కథ ఫర్హాద్ కథ.

"ఫర్హాద్ శ్రమ జయించుగాక అతని ప్రేమ జయించుగాక" అంటాడు.

1969 ఆగస్టు 25న మనల్ని విడిచి వెళ్ళిన విప్లవ యోధుడు ప్రఖ్యాత కవి, ప్రముఖ కమ్యూనిస్టు జీవితం అలాంటిది. ఆయన మనల్ని విడిచిపెట్టినా, విస్తారమైన నిధిని మనకు వదిలిపోయాడు.

★ ★ ★